# కవిజీవితము.

అభినవ భారతమను నీసద్గ్రంథమును మతుకుమల్లి మాదయమంత్రి రచియించెను. ఇతఁడు ఆఱువేల నియోగి శాఖా బ్రాహ్మణుఁడు. కృష్ణయజుశ్శాఖీయుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. తండ్రి కృష్ణయ్య, తల్లి అనంతమ్మ, అన్న రంగన్న, భార్య వెంకమ్మ. నివాసగ్రామము మతుకుమల్లి యైనట్లు కృత్యాది పద్యముల వలన గాన్పించుచున్నది.

శా. శ్రీలాలిత్యమునై సుధామయరసస్ఫూర్తిం బుధౌఘంబు సం
ల్లోలాభంగ తరంగ సంఘములచే లోకాశ్రితంబై మహా
వేశంబై భావ్యకమై చెలంగఁగను నద్విద్యం బ్రకాశించు నా
శ్రీలక్ష్మీ సమ విగ్రహాఖ్య మతుకుమల్లి రాజసభ లంకాన.

సీ॥ గురుతరకాశ్యప గోత్రసంజాతుండా
పస్తంబసూత్రుండు పటుకీర్తుండు
నలరెడుకృష్ణ యనంతాంబికాగర్భ
వననిధిజాత శైత్యాంశుండు
సముదగ్రతర చతుష్షష్టివిద్యాతిగం
భీర పారావార పారగుండు
విహితత్రైతైక సాధ్వీజన సన్నుత
స్వాంత వెంగాంబికా వల్లభుండు

గీ. నిజగుణస్థగితాఖిల నృపసుమార
మంత్రిపుంగవ దుర్మంత్ర మండలుండు
హరి రంగప్రధాన సదగ్రజుండు
మహితవిభవుండు మాదయామాత్యఘనుఁడు.

సుబోధార్థమై యీవంశము నిట్లు జిత్రించుచున్నారము.

# మతుకుమల్లి వంశవృక్షము.

కృష్ణయ్య = అనంతమ్మ.




కృష్ణయ్య   మూర్తి   మంత్రయ్య   పర్ణశాలఅనంతయ్య

||

తిమ్మమ్మ

|

కొండయ్య

||

అక్కమ్మ

|

వెంగళామాత్యుడు.   (మాలకొండ

లింగమ్మ   (నృసింహోపాసకుడు)



# అభినవభారతము.

## పెదనృసింహము కుటుంబము.

(వాసిరెడ్డి వెంకటాద్రినాయునివారి సంస్థానకవి)

- చినకనకాద్రిశాస్త్రి.
  - వెంకటనృసింహము
    - 1 మాలె కొండలరాయుడు 2 కోటయ్య
      - సుబ్బారావు. యమ్. ఏ. తిన్నవెల్లి కాలేజి ప్రిన్సిపాల్
      - రామారావు బి. ఏ.
        - మదనమోహనరావు
      - కృష్ణారావు
- నరసింగరాయుడు.
- మాదన్న (తాడిపత్రి)

## చిననృసింహము కుటుంబము.

- కనకాద్రిశాస్త్రి
  - 1 విద్వన్మణి నృసింహశాస్త్రి
  - 2 క్రిష్ణశాస్త్రి
    - రఘూత్తమరామశాస్త్రి (వకీలు)=కొమారుడు కోశయ్యశాస్త్రి యమ్.ఏ. (ఇంగ్లాండు బారెట్‌లా)
    - నరహర్యక్షరాయశాస్త్రి
    - సరస్వతీశాస్త్రి.
- మాధవశాస్త్రి దశావతార స్తవగ్రంథకర్త
  - 1 నృకేసరి
  - 2 లక్ష్మీకాంతశాస్త్రి (నోబులు కాలేజి)
- మంగళాద్రిశాస్త్రి
  - నరహరిరాయుడు
  - నరకంఠీరవరాయుడు
  - నైజాంపట్నము

# మతుకుమల్లి వంశము.

నెల్లూరుజిల్లా చినపమిడి, పెదపమిడి, కొమ్మరేనిమాల గ్రామములలో భల్లేరాయణింగారిసంస్థానములో మతుకుమల్లి వారు దివాను పదవిలో వంశపారంపరిగా నుండెడి వారు. వారిలో మతుకుమల్లి వెంగళప్పగారు సంతానములేక చుండి గ్రామ సమీపారణ్యములలో నుండు మాలకొండ మీద శ్రీమాల్యశైల నృసింహుని గూర్చి ఆరుమాసములు నిరాహార వ్రతముగా తపస్సు చేసినారనియు, అంతట ఆయనకు నృసింహస్వామి ప్రత్యక్షముకాగా విద్యావంతుడైన కుమారుడు కావలెనని కోరెననియు తరువాత కొద్దికాలమునకు మాధన్న అను కుమారుడు కలిగెననియు ఆయనకు చతుష్షష్టి విద్యల మాధనకవి యనిపేరని అభినవ భారతమువల్ల తెలియవచ్చుచున్నది ఈ మాధనకవి కూడ పై సంస్థానములోనే దివానుగా నుండెడివాడట. ఆయనకు కృష్ణయ్య, మార్తయ్య, మంత్రయ్య, చిన్నఅనంతయ్య అను నలుగురు కుమారులు. ఇప్పుడు తెనాలిలో నుండు మతుకుమల్లివారందరును పైన చెప్పబడిన కృష్ణయ్య సంతతివారు. భట్టిపూడిలో నున్న వారివంశవృక్షమువల్ల తక్కినవి తెలియవచ్చును.

పైన చెప్పబడిన కృష్ణయ్యకు కొండయ్య, ఈయనకు వెంగళప్ప, ఈయనకు వెంకట నరసింహం, లక్ష్మీనరసింహము, కనకయ్య, మాదయ్య అను నలువురు పుత్రులు గలరు. ఈ మాదయ్యయే అభినవభారత గ్రంథకర్త. వెంకట నరసింహముసంతతి సత్తెనపల్లి తాలూకా పెదపమిడి గ్రామములో నున్నట్లు తెలియును. లక్ష్మీనరసింహమునకు గోపయ్య. ఈయనకు పురుషసంతతిలేదు. ఆరుగురు కొమార్తెలు మాత్రం

ముండిరి. కనకయ్య, మాదన్న యిద్దఱును తెనాలిగ్రామమునకు వచ్చిరి. ఈయన వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడింగారిసంస్థాన పండితుడు. ఇప్పుడు తెనాలిలో నున్న ముసుకుమల్లి వారి యీనాములన్నియు వెంకటాద్రిగారిచ్చినవే. పచ్చల తాడిపఱ్ఱు గ్రామములోని యీనాములు గోపాలరాయణింగారివలన వీరు సంపాదించినవి. చినరావూరిలోని మాన్యములు మాణిక్యరావుగారివల్ల యియ్యబడినవి.

కనకయ్య నృసింహము, భద్రాచలం దేవాలయములో ప్రవేశించి రామదాసుడాయెను. అచటి రామభక్తుల విగ్రహములలో యీయన విగ్రహముకూడ నున్నట్లు తెలియవచ్చుచున్నది. వెంకట నరసింహము అనే ఆయనకు మాలెకొండలరాయుడు కోటయ్య అను కుమారులు కలిగిరి. ఆయన కడపటి దినములలో సన్యాసాశ్రమమును స్వీకరించెను. మాలెకొండలరాయుడు గారికి సుబ్బారావు, రామారావు, కృష్ణారావు అను పుత్రులు మదనమోహనుడను పౌత్రుడు, పుత్రికలు, పౌత్రిలు గలరు.

అభినవ గ్రంధకర్త యగు మాధవమంత్రికి చిన నృసింహమను కుమారుడును ఆయనకు కనకాద్రిశాస్త్రి, మాధవశాస్త్రి, మంగళాద్రిశాస్త్రి యను ముగ్గురుపుత్రులు గలరు. వారందఱు పండితులు. అందులో మాధవశాస్త్రి రచించిన దశావతారస్తవము మిగుల ప్రౌఢముగా నుండును. (అముద్రితము) శైలి తెలియుటకై యీ క్రిందిపద్యము లుదహరించుచున్నాము.

## దశావతారస్తవములోని పద్యములు.

### శ్రీరామావతార స్తవము.

ధనురారోపణమున్ కునై బరగ సీతాహస్తవిన్యస్త నూ
తన నీలోత్పలదామకంబు దృఢలగ్నంబై రమింగ్రమ్మరం
జనలేకున్న తదీయమంజుల కటాక్షశ్రేణి నా గంఠ సీ
మ నుదారన్మృతు లీనబోల్చు రఘురామ బ్రహ్మముంగొల్చెదన్

### శ్రీ సింహావతార స్తవము

డివికింజూచు నెడన్ గభస్తివిలసత్కాంజల్కమాలోక భ్రాం
భవబింబంబున కర్ణికాకృతిని జెందన్ స్వంప్రసర్యాయి వాం
సవ సామ్రాజ్యరమా కరస్థిత సరోజ భ్రాంతిబుట్టించునా
ది వటు బ్రహ్మపదంబు సంతతము భక్తిన్ ముక్తికై గొల్చెదన్.

### వరహావతార స్తవము.

స్థేమారీణవిషాణపాదిత సముత్క్షిప్తోగ్ర రాత్రించర
గ్రామణ్యంగవిలోక నోద్ధపిత్ర్య పక్షచ్ఛేదన క్రౌర్య సం
గ్రామార్ధాభి నివేశ్యారాపతదుద శ్రీవ్యగ్రమై నాకది
త్యాముహ్యక్షవియైనయాదిమకిటిం బ్రాధంతున శ్రాంతముఁ.

### మత్స్యావతారము.

పరిషిత్తాబ్ధిజలోదరానుగ మహాపక్షాచల ప్రేక్షణా
[illegible]తహ్యాష్య ద్దివిజేంద్ర డిండిమ జయాభ్యావస్త్రుతుటద్దిగ్బిలాం
తరనిర్యత్స్వయశావలీక్షు వనజాంత: కర్ణికాకారభా
స్వరవేద్ధాండు దలంతు దంభశకలిస్వావిఁ శుభావాప్తికై.

కనకాద్రి శాస్త్రిగారికి నృసింహ విద్వన్మణియు, క్రిష్ణ శాస్త్రియను నిరువురు పుత్రులుండిరి. వారిరువు రసమాన పాండిత్య ప్రతిభాశాలురు. విద్వన్మణి నృసింహశాస్త్రి ఛాయా పటమిందు బ్రదర్శింపఁ బడినది. ఈ కవితల్లజుఁడు వేద వేదాంగ సకలశాస్త్ర పారంగతుఁడు. తర్కశాస్త్ర మభిమానశాస్త్రము. వల్లూరు సంస్థానాధీశ్వరులగు శ్రీరాజా నాగన్ననాయుఁడు బహాద్దరు జమీందారుగారి ఆస్థానపండితుడై మిగుల ప్రఖ్యాతి వడసెను. వీరు ఇందుమతీపరిణయము, చెన్నపురీవిలాసము, జలక్రీడలు (దశావతార చరిత్రము) వేంకటాచల మాహాత్మ్యము, పుండరీకనిర్ణయచంద్రిక, శ్రీలక్ష్మీనృసింహత్రిశతీస్తోత్రమ్ మున్నగు గ్రంథములు రచించెను. అవియన్నియు వారి ప్రథమ పుత్రులు శ్రీరఘురామరాయశాస్త్రిగారి పితృభక్తి, ఔదార్యములవలన పునర్ముద్రితము గావింపబడి యున్నవి. కనకాద్రి శాస్త్రులవారు విద్వత్కవులు, వారు రచించిన గ్రంథములంతగా కానవచ్చుట లేదుగాని, ఇందుమతీ పరిణయములో వారు రచించిన పద్యములు మాత్రము శైలి దెలియుటకుదాహరించుచున్నాము.

క. శ్రీమహితదనుజరాజను
తామయమానస భవవిదళనధన్వంతరికిన్
సామజరిపువక్త్రునకున్
సోమసుధాహారక్షీరశుద్ధాంగునకున్.

క. కలితరమాహృదయసర
స్సలిలాయితహార్దరసవిశంకటకేళీ
విలసితమానసహంసున
కలితభకుంతలవ్రతాననాంభోజునకున్.

వలయునను సంకల్ప మంకురించెను. ధర్మశీలురు సిద్ధ సంకల్పులు గదా.

1899 వ సంవత్సరమున బాటసారుల కందుబాటులో నుండునట్టి మంచి ప్రదేశము గూడ వారి పుణ్యావశమున లభ్య మయ్యెను. వంతెన క్రింద గుంటూరునకును రైలునకుబోవు దారిలో ప్రతివారిదృష్టి నరికట్టు విశాల భవనము వీరి ధర్మ సత్రమే. పడవలమీద, రైలునకు, బండ్లమీద బోవువారికెల్లర కీసత్ర మెంతయో యుపయోగకరముగా నున్నది. ఆసత్ర మును నిర్మించినది మొదలు నేటివఱకు దాని యభివృద్ధికై శాస్త్రిగారు నిరంతరదీక్షతో పనిచేయుచున్నారు. ఈ విధ ముగా శాస్త్రిగారి ధర్మకార్య బీజము మొలకెత్తి వృక్షప్రాయ ముగా పెరుగుచున్నది.

శ్రీ శాస్త్రిగారికి పుత్త్రులు, పుత్త్రికలు, మనుమలు గలిగి సంతానము తామర తంపరగా వృద్ధియగుచుండెను. నందననామ సంవత్సర వైశాఖ మాసమున సుగుణభావియు, అతిమేధావియు నగు పుత్త్రుడు గలిగెను. అనేక పుత్త్రికలకు పిమ్మట నీ పుత్త్రుడు గలుగుటచేత నీతని గోశయ్య అని నామ కరణము చేసిరి. అతడు దినదిన ప్రవర్ధమానుడై పితృవాక్య పాలనమున రాముని బోలి, వంశ క్రమాగతమగు సంస్కృత విద్య నభ్యసించుచు ఆంగ్లభాష నభ్యసించి, ఇంగ్లాండు దేశ మునకు బోయి ఎమ్. ఏ. బారిష్టరు పరీక్షలయందేగాక, సం స్కృతమున నచటగల గొప్పబహుమానము నందెను. ప్రపంచ యుద్ధసమయ మగుటచేత, ఇంగ్లాండునందున్నవా రిప్పుడు మన దేశమునకు వచ్చుటకు వీలులేకుండెను, ఈ వ్యవస్థలో మాతృవియోగము సంభవించెను. కాలమొక్కరీతి యుండదు.

గదా ! రోశయ్యశాస్త్రి మాతృమృతికి వగచి, రాకపోకలకు వసతి గలుగగానే దేశమునకు వచ్చెను. ఇంగ్లాండు దేశమున నుండివచ్చినను, వేష భాషలయందును, ఆచార వ్యవహారములయందు నణుమాత్రము నార్యధర్మమును వీడక, ఇంగ్లాండు దేశమున నున్న కాలమున నార్యధర్మమున కీత డాదర్శప్రాయముగా జూడబడుచుండెను.

ఇంగ్లాండునుండి వచ్చిన తరువాత గీతాభాష్యము లోని కఠినస్థలములు కరతలామలకమగు రీతిని మిక్కిలి ప్రతిభతో నన్వయించుచు దండికి ముదము గొల్పుచుండెను. ఆహా! ఇంతలో రోశయ్యశాస్త్రికి తీరని వ్యాధివచ్చెను. అనర్థ వ్యాధుల ఫలితమే ప్రత్యక్షమయ్యెను. వార్ధకమున శాస్త్రిగారికి దుర్భరమగు దుఃఖము.

శాస్త్రిగారు గొప్పపండితులును శాస్త్రజ్ఞులగుటచేత దుఃఖపరవశులైనను ధర్మకార్యాసక్తులై, సంస్కృత పాఠశాల విద్యార్థులకు భోజనవసతి యమర్చుచుండుటను, ఆసత్రముననే శ్రీరంగనాయకాలయమును, శివాలయమును రు 20,000 లు వ్యయపెట్టికట్టించి, వానికిని భూవసతులమర్చి దైవారాధనమును మహావైరాగ్య దీక్షతో నెరవేర్చుచున్నారు.

ధర్మకర్మములు చేయుటలో శాస్త్రులవారి త్యాగమ నన్యము. తత్పూర్వులకంటె నెక్కువగా ధర్మవ్యయ మొనర్చియున్నారు. ఇదియంతయు స్వార్జితము. స్వార్జితమునిట్లు ధర్మనిరతిమై వ్యయించుచు వార్ధకమునుగడుపు శ్రీరఘూత్తమరాయశాస్త్రిగారే యీయభినవభారతమునకు వలయు ముద్రణ వ్యయమంతయు వహించిరి. వీరికీశ్వరుడు నిర్హేతుక జాయమానకటాక్షముతో జ్ఞానప్రసాద మొనరించుగాతమని కోరుచున్నాము.

సీ. ఏ యెడలం గవి వెదకి యెఱుఁగనే
ననితప్పఁబల్కఁగా నర్హ మగునె?
యొంటి పాటన తన్ను నొరులెఱుఁగరటంచు
దనుఁద్రుచ్చి యనెగట్లు దాఁగునతఁడు!
పురుషుని వృత్తము భూతములు ధర్మంబు
వేదముల్ రవిశశి యాదిమతియు
రేబగళ్లును ధరిత్రి యుఁ దొట్టియెఱుఁగును
గావున నమృతసేయఁ గలుగు నెట్లు!
ఆ. వె. మొనసి ధర్మకామమోక్షంబులకు నిహ
పరసుఖంబులకును భార్య మేర
పట్టిఁజూడు మిదు ప్రతిబింబమేటికి
పలుకు దేవ సత్యభాషణంబు.

ఈ పద్యభావమును శకుంతల దుష్యంతునిచేఁ దిర
స్కృతయగునప్పుడు చెప్పినది.

కాళిదాసుని భావమున కెట్లు వన్నె దిద్దఁబడినదో పరి
కింపుడు.

చ. తనయులు పెక్కులేరు మది దద్దయు నీవొకరుండవయ్యు నక్క
ఘనమగు నస్త్రశస్త్రములు గల్గుట సాహసి వాహవంబులన్
నినుమనుపంబు నమ్మఁగను నేరనుగావునఁ బుత్రలాభమై
గొనకొని నేవివాహమొనఁగోరితి నావ్రతు భీష్ము పెంతయున్.

మత్స్యగంధియందు మోహితుఁడైన శంతనుఁడు భీష్ము
నితో బల్కు సందర్భ మెంతయూచితితో వ్రాయఁబడినదో
పరికింపుడు.

ప్రతిభగల యొక్కొకకవి యొక్కొక విషయమును జెప్పి
నప్పుడెల్ల నది సానలుదీరి మెరుగెక్కుచుండుట స్వాభావికము.
పరమాత్మ ప్రతిభాసితుఁడగు వ్రతివ్యక్తియు నించుకించుకగా

దైవసందేశమును వ్యాప్తి చేయుటకై యవతరించును. మూర్తీభావముజెందిన యుత్కృష్ట దైవోపదేశమే కవితాభావము.

శ్లేషయమక చిత్రకవిత్వముల యందుకూడ శ్రీనీకవివార్ధాంశి యనగ్గళముగానున్నది.

నేనిను నెన్నేనన్నను
నానానా నూన నాన ననునేనన్నా
నేనిన్ను నెన్న నన్నా
నీ నిను నెన్ననన్న నెన్న నిన నేనౌనా

అర్థము. నే, నిను, ను, ఎన్నేని, అన్నను, నా, నానా, నూన నాన, నను, నీన, అన్నా, నే, నిన్నును, ఎన్నను, అన్నాను, ఈ, నిను, ఎన్న, అన్నను, ఎన్నను ఇన, నేను, ఔనా ! నిన్ను స్తోత్రముసేయ నెంతవాడననుట.

# అభినవభారత గ్రంథ ముద్రణము

ఈగ్రంథముయొక్క తాళపత్రసంపుటము మిక్కిలి శిథిలమైయున్నది. ప్రస్తుతము తిరునల్వేలిలో హిందూ కాలేజీ ప్రిన్సిపలుగానున్న మతుకుమల్లి సుబ్బారావు, ఎం. ఏ. గారు తాళపత్రినుండి తెచ్చి బ్ర॥ మతుకుమల్లి రఘూత్తమరాయశాస్త్రిగారికొసంగిరి. వారీప్రతిని శ్రీకృష్ణభారత కృతీశ్వరులగు ముక్త్యాల రాజాగారికడకు పంపిరి. అచటనది మఱింతశిథిలమై విశ్వప్రయత్నమున మరల రఘూత్తమరాయశాస్త్రిగారికి లభించినది.

వారు దీనిని నాకడకు ముద్రణమునకుఁ బంపిరి. తెలుగులో సామాన్య పరిచయముగల నేనిపనికి బూనుకొనుట మిక్కిలి సాహసమే, అయినను రఘూత్తమరాయశాస్త్రిగారి యెడల నాకుగల అవ్యాజభక్తి యొకచెంతను, ఆంధ్రవాఙ్మయాలంకారమగు సద్గ్రంథమొకటి ఆంధ్రజనుల కరగతమగునను ఉత్సాహ మొకచెంతను ప్రేరేపగా, సాధ్యమగునంతవఱకు నెట్లో పూనుకొని బహువిధసహాయ్యమున దీనిని యథామాతృకముగానే ముద్రించితిని. తాటాకునుండి కాకితపుపైన వ్రాయుటకే 2 సంవత్సరములు పట్టెను. మఱియొన్ని యనివార్యములగు కార్యములవలన నెలల కాల విలంబమైనది. ఇనన భాషానేనకు కాలదోషము లేదుగదా! క్రిమిదష్టములగు భాగములు యథాశక్తిని పూరించితిని. ఇంతకును మాతృక కవిచే వ్రాయఁబడినదిగాదు. భీష్మపర్వమునకే లభించినది. తక్కినదానికై బహుళప్రయత్నము లొనరించుచున్నారము. ఎవరికడనైన గలదేని పంపినచో కృతజ్ఞతాపూర్వకముగ గైకొని ముద్రింపించెదను.

ఈ గ్రంథమున అచ్చుతప్పులు భాషాసాదృశ్యము లేమిచేఁగలిగిన తప్పులు, మాతృకాలిపి స్పష్టముగ తెలిసికొనజాలక చేసినతప్పు లెన్నోయున్నవి. పునర్ముద్రణ మందట్టి వానిని ముద్రింపించెదము.

ఈ గ్రంథమును, తమతండ్రి విద్వన్మణి నృసింహశాస్త్రిగారి గ్రంథములను కేవల పారమార్థికచింతతో ముద్రింపించిన బ్రహ్మశ్రీ రఘూత్తమరాయశాస్త్రిగారికి పరమాత్ముడఖండజ్ఞానమొసంగి బ్రోచుగాత.

ఏలూరు, 1—10—24

సజ్జన విధేయుడు,
నందిరాజు చలపతిరావు.



శ్రీలక్ష్మీనృసింహాయనమః.

# అభినవభారతము.

శా. శ్రీలాలిత్యములై సుధామయరసస్ఫీతంబులై యొప్పు న
ల్లోలాపాంగతరంగ సంఘములచే లోకాశ్రితవ్రాత మే
వేళన్ భావుకమై చెలంగఁగను దద్విష్ణుం బ్రశంసించెదన్
లీలామానుషవిగ్రహున్ మతుకుమల్లి రాజగోపాలకున్.

మ. అరుణోదంచితపల్లవాభ శయసమ్యగ్వేణునాదాకులున్
బరిఫుల్లాశతపాటలీకుసుమ సంస్పర్ధిస్ఫురాంఘ్రిద్వయాం
బురుహున్ సన్మధురాధర ద్యుతియుతాంభోజాననుం గేశవున్
వరగోపీకుచకుంభకుంకుమ రసవ్యాప్తాంగు నిష్టాత్మదన్.

గీ. లేమికిని లేమిఁజేసిన లీలఁదప్పి
సుద్దులకు సుద్దులొనరించు సిద్దముగను
మత్కృతికవిత్వమునను జమత్కృతిఁదగఁ
గలిమిపొలఁతుక క్రేఁగంటఁగాంచుఁగాత.

సీ. తలవంక నెలవంక బలుజింకఁగలవాఁడు
చలిగట్టు నిలుముట్టు జెలువువాఁడు
సెగకన్ను సిగమున్ను సగమున్నుగలవాఁడు
లలిగబ్బి వెలిగిబ్బ నలరువాఁడు

జడఁబచ్చ మెడమచ్చ కడఁరచ్చఁగలవాఁడు
చెలువారు చదలేరు వెలయువాఁడు
చెవివంటి దొరవంటి దవువంటి చవివాఁడు
తడితోలు పెడ్రవేలు పొడవువాఁడు
సీ. రెండుమూఁడు మొగంబులనుండువాఁడు
కడిదిబెడదల తపసుల కుడుపువాఁడు
శంకరుఁడు కింకరై కవశంకరుఁడు
గాచుఁగావుత మత్కృత కావ్యమెలమి.
కం. తనసర్వ మంగళాహ్వయ
మనయము మత్కవితయందు నన్వర్థంబై
కనుపింపఁ బ్రోచుఁగావుత
ఘనముగ శర్వాణిపరమకల్యాణిదయన్.
సీ. అనయమును నాదునెమ్మనంబనెడు చెరువుఁ
గలుగు తెలిదమ్మిగద్దియఁ గొలువుసేసి
పావనంబుగ మత్కవితావధూటిఁ
గరుణబంగారు బొజ్జయ్యగాచుఁగాత.
కం. అంబను జగదంబను నీ
లాంబుదనిభవేణికిన్ సదంబుజశయ క
య్యంబుజజు కుటుంబినికిని
బింబోష్ఠికి మ్రొక్కిలిడుదు పృథుహర్షమునన్.
కం. తననెమ్మోమున మాత్ర
మ్మున మగతనమానుదనము ముడిగొని తెలియం

దనువొక్కఁడు దలయొక్కఁడు
దనరు గజాననుఁ దలంతుఁ దత్ప్రాప్తిన్.

మ. అలప్రాచేతసువ్యాసభాసకవులం గాళిదాసున్ మహో
జ్జ్వలుఁడౌ దండిని మాఘభారవులఁ దైవారంబుఁ గావించి ప్రాం
జలినై సన్నయతిక్కనాదికవులన్ సమ్యక్స్తుతిన్ నేఁడు కాఁ
గలకీర్తిన్ నుతియించి తత్కరుణచేఁ గల్పింతునే గావ్యమున్.

చ. తెలిసియునేని నేమి మును దెల్లమి గాక యుచేసినా మొదన్
గలదయునేని నోర్పుమదిఁ గాంచఁగమానుటచేని నెమ్మలోఁ
దలఁపక యొప్పుతప్పనక తప్పుల నొప్పులటంచుఁ బల్కఁగా
వలదు కవీంద్రులార! మిము వాక్సన్నుతిఁ జేతు సింపుకై.

గీ. కానిపోనిదిగాఁ గొంతకవితఁ జెప్పి
తెలిసి తెలియని తప్పులన్యులకుఁ గట్టి
తనకుఁబోలెడివారితోఁ దగిలినగడి
కాకవులచెంతఁ బోవంగాఁ, గవులకేల?

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవికుకవినమస్కార
తిరస్కారంబులను గావించి మదీయాన్వవాయంబుఁగొంత వివరిం
తు నదియెట్టిదనిన

సీ. గురుతర కాశ్యపగోత్ర సంజాతుండా
పస్తంబసూత్రుండు పటుయశుండు
నలరెడు కృష్ణయానంతాంబికాగర్భ
వననిధిజాత జైవాత్కృకుండు

సముద్రగోత్ర చతుష్షష్టి విద్యాతిగం
భీర పారావార పారగుండు
విహితప్రజ్ఞైక సాక్షిజనసన్నుత
స్వాంతవెంగాంబికా వల్లభుండు

గీ. నిజగుణశ్లాఘితాఖిల నృపకుమార
మంత్రిపుంగవ మర్త్యమాత్రమండలుండు
హరిరంగప్రధాన సదగ్రజుండు
మహితవిభవుండు మాదయామాత్యఘనుఁడు.

సీ. ధృతినొప్పుచుండిన దేశంబులోఁ బెద
పణిదెము మండూరు భరితెపూడి
నెరివెలిచెర్లయు నేరేడుబల్లెయు
మరి వినుకొండలో మతుకుమల్లి
మార్కాపుసీమలో మలయు నల్వలపాడు
నాదిగా పూర్వసంపాదనములు
గ్రామముల్ తనకును గాణయాచులుగాఁగ
నయమైనవాసి వన్నియలుబొసఁగి

గీ. కృష్ణయార్యుండు మూర్తిమంత్రీశ్వరుఁడును
బర్ణశాలయనం ఖ్యాఁ బరఁగుఘనుల
నలువురుతనూభవుల సమున్నతులనతఁడు
కాంచె సవ్వెంగమాంబికా గర్భజలధి.

కం. అందగ్రజుండు విభవపు
రందరుఁడగు కృష్ణమంత్రి రాజితముగఁ ది

మ్మెంగినను వరించెను గో
బింబుండు కమలయుగంబో లె నెలిసి కోరెన్.

శా. ఇనసంకాశుఁడు సద్గుణాకరుఁడు నాకృష్ణప్రధానుండు నిం
పునఁ దిమ్మాంబికయందుఁ గొండఘనునిం బ్రొద్దంగఁ గాంచెన్ దనూ
య్యనఘాత్ముండగు కొండమంత్రి నెలఁతౌ ప్రఖ్యాతిఁ బ్రీతిఁ గై
కొని తద్గర్భపయోనిధిం గనియెఁ బ్రేమన్ వెంగనామాత్యునిన్.

సీ. ఎవ్వనిదాతృత్వ మెల్లలోకములకు
నెఱిఁ గర్ణాదుల మఱపుఁ గఱపు
నెవ్వని గాంభీర్య మేఁడువారాసుల
కొజ్జయై విజ్ఞులనుజ్జగించు
నెవ్వనిసంపద యింద్రాదిదిక్పాల
వరులభాగ్యములను బరిహసించు
నెవ్వనిధైర్యంబు హేమకూటోన్నతిఁ
దిలకించిపలుమారుఁ దెగడుచుండు

గీ. అతఁడుమంత్రియుగంధరుఁ డమరమంత్రి
నిభుఁడుసజ్జనమాన్యుఁడు నీతిపరుఁడు
సల్లలిత లింగమాసాధ్వి వల్లభుండు
మహితతేజుండు వేంగళామాత్యఘనుఁడు.

మ. అనయంబున్ భువిరామచంద్రనిభుఁడౌ నవ్వేంగళార్యుండు నె
మ్మనిఁదా వేంకటనారసింహుఁడన లక్ష్మీనారసింహుండనన్
గనకామాత్యుఁడనంగ, మాధవుఁడనంగానల్వురన్ మమ్ముఁగాం
చెను లింగాంబికయందు మున్నులవిరించింబోలె వేదమ్ములన్.

సీ. ప్రాగ్రత నిగ్రహానుగ్రహ శక్తులు
గలవాఁడు నైష్ఠిక కర్మకలన
ననయుంబఘటనాఘటనపాటవంబులు
గలవాఁడు పౌష్టికశాలయందు
పృథుతర దుర్మంత్రభేదనైకప్రౌఢిఁ
గలవాఁడు సద్యశోగరిమచేత
దశదిశాతిగ మహత్తరకీర్తివిస్ఫూర్తి
గలవాఁడు నెఱసిఁద్యాగంబువలను
గీ. నతఁడెపో మామకాగ్రజుండు, సువేది
చారువిభవుండు వేంగళనారసింహ
మంత్రివర్యుండు దేవతా మంత్రిసముఁడు
పార్వతీసాధ్వికలరెడు ప్రాణవిభుఁడు.
కం. ఆతని తమ్ముల మతివి
ఖ్యాతిం జెన్నొందుమేము ఘనులమటంచున్
బ్రీతిం జెప్పఁగనేటికి
నాతతగతినన్నలట్ల నగుననుజాళిన్.
కం. నను గాదిలితమ్ముఁడనుచు
ననిశమునెనరుంచి మువ్వురన్నలునుదయం
గనికబ్బమొకటి మాధవ!
చనుఁజెప్పఁగననుడు నేఁప్రసాదంబనుచున్.
గీ. అన్నలయనుజ్ఞ పెద్దలయనుమతియును
దేవతానుగ్రహంబును ధృతినిఁబడసి

అభినవంబుగ భారతంబభినవంపు
గతులనుక్తుల విరచింతుఁ గ్రమముతోడ.

ఉ. భారతముం రచింపఁ గనుభారముగాఁ బ్రాఁ కింక నేచను
త్కారముమీఁద ల్పమగుదర్పణమధ్యముఁ గనఁగాంచఁ గ
న్నారఁగ శైలసాగరవనాళులు గన్పడునట్లు సర్వ మిం
దే రమణీయమై తనరనేర్చున క్షితిసమర్ధ చెప్పెదన్.

కం. రామాయణము లనేకము
లై మహిఁ వర్ధిల్లునట్లనై యిదిపుడుమిన్
వేమరు సమరెడునా కోఁ ఆ
గాములుగా వెన్ని పుణ్యకథలై నఁదగన్.

కం. మునుపటికథయిది మునుపటి
ఘనకవితలయుక్తనిదియుఁ గాదనవల దె
వ్వనికినిఁ బూర్వముదక్కిన
జనునే? కథమిథ్యయని యసహ్యముగా దే?

గీ. కావునను బూర్వపద్ధతిఁగాంచి క్షితి
నభినవంబగు భారతంబభిరచింతు
హరిహరహిరణ్యగర్భుల నాత్మఁదలఁచి
మాలెకొండ నృసింహునమ్మతినిఁ గొలిచి.

## —షష్ఠ్యంతములు—

కం. శ్రీమహితమతుకమల్లీ
హైమప్రాసాదవిలసితావాసునకున్

స్వామికి జగదఖిలాంత
ర్యామికిఁ బరమాత్మునకు సదానందునకున్

కం. ధీరునకు సకలగుణ వి
స్తారునకు సమగ్రకీర్తిసారునకు శుభా
కారునకు యోగివ్రాతసం
చారునకు విరోధినివహ సంహారునకున్.

కం. కరుణాసముద్రునకు ను
స్థిరతరోన్నిద్రునకుఁ బరిహృతతంద్రునకున్
వరదాభయముద్రునకున్
బరమచిదచ్ఛిద్రునకు విభవభద్రునకున్.

కం. బంధురశీలునకును భవ
బంధవిమోచనునకున్ విభగ్నవిమత సం
బంధునకును సాధుజగ
ద్బంధునకును భక్తలోకపరిపాలునకున్.

కం. నిరుపమునకు నిర్మమునకు
నిరఘునకు నిరామయునకు నిర్లేపునకున్
నిరవధికిని నిర్వ్యధికిని
నిరుపద్రవునకును నిరతనిష్కామునకున్.

కం. స్థితివిలయసృష్టికారో
న్నతికిన్ ఘనచంద్రచంద్రనైజద్యుతికిన్
కృతికిన్ మోచావాక్సం
గతికిన్ హరిహరహిరణ్యగర్భాకృతికిన్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన యభినవభారతంబను మహాప్రబంధంబునకుం గథాప్రారంభం బెట్టిదనిన,

కథాప్రారంభము

శా. శ్రీవిస్తారితసౌఖ్యులై మెలఁగఁ జెల్వొందు మహాప్రభుం
బ్రావీణ్యాత్ముని నామహిన్ గనిసి సంభావించి నానాకథల్
భావంబుల్ మునమొందఁ జెప్పితివి సంభ్రాంతిం బ్రశంసించెదన్ విశద
శ్రీవర్ధిల్లఁగఁ జెప్పు భారతము సంక్షేపప్రకారంబునన్.

కం. నావిని సూతజుఁ డతివిన
యావహులై యట్లకాకయని మునులును స
ద్భావయుతులై వాక్య
శ్రీవిలసిల్లంగ నిట్లు చెప్పఁదొడంగెన్.

చ. కలదు మహోన్నతప్రథిత గంధమతంగజకర్ణతాళ సం
చలనజ వాతఘాతహరిచందనముఖ్య సురద్రుమచ్ఛల
త్కలితలతాంతవిభ్రమ దళద్వ్యమధువ్రతగీత సంపదన్
నలువగు హస్తినాపురము నానగరంబు గరంబుదారమై.

ఉ. చారుతరోరుబాహు విలసజ్జయసంపదఁ బెంపుఁగల్గి నీ
హారకరాన్వవాయమణులై తగునాకురురాట్కుమారులా
వారికి రాజధాని జితవాసవపట్టణలక్ష్మి హస్తినా
పేరున నొప్పు నొక్కపురి పృథ్విపయిన్ నగరీమతల్లియై.

చ. సలలితరాజరాజమణి సౌధగవాక్షములందు నిత్యమున్
జెలువుగఁ బోవుచోఁ దనువుఁ జెందిన దీపశిఖైకధూమకో

మలమసీనోజఁ బూర్ణవిధుమండల మధ్యమునందుఁజూచిలోఁ
దలఁతురొగింగురంగమని తత్పురిముగ్ధజనుల్ ప్రియంబునన్.

సీ. లలితతరాంతరాళస్ఫూర్తి విజితమ
హాచక్రవాళాచలాయతంబు
ఘనపుష్పవత్కాంత ఘటితాట్టహసితస
ముత్పన్నరజత శైలోన్నతంబు
గంభీరతోరణగహ్వర పరిభూత
తతరోదసీకుహరదర్పితంబు
పటుహేమమణిమయ స్ఫటికవాటద్వంద్వ
ధిక్కృత విస్తార దిక్తటంబు

గీ. శ్రీ లసద్వ్రజదంతుర శిఖరముఖర
ముఖవిఘట్టిత పుష్కరోన్ముఖతలంబు
ఖేయనిమ్న పయస్తిరస్కృతసమగ్ర
తరసముద్రంబు వరణంబుతత్పురమున.

గీ. తత్పురంబునఁదగుఁగేతుదండకోటి
సక్తశుద్ధాంబరౌఘ విక్షిప్తయగుచు
సరగ నిదియొకవింతయె ప్రతిదినంబు
చారుశుద్ధాంబరౌఘ విస్తారయగుట.

గీ. పంకజాప్తశశాంక బింబములుగగన
మధ్యముననుండు తఱి లసమానరత్న
హర్మ్యకూటప్రదీప్తైక హైమరౌప్య
కుంభములునాఁగఁజూపట్టుఁ గొమరుమిగుల.

మ. పురిఁ బ్రాసాదగవాక్షనిర్గత సకర్పూరాగురుద్రవ్యభా
సురనానావిధ ధూపధూమములహెచ్చుల్ మబ్బుగా నుండఁ గే
వరగాత్రప్రభలుం దటిల్లతలుగా వాయించుమద్దెళ్ళ స
ద్దురుమేఘార్భటిగాఁ దలంచి శిఖులుద్యోగించు నాట్యోన్నతుల్.

చ. సరణినిఁ బోవు సత్తరణిసప్తులు వేసవివేళ నిశా
కరచరణాంతరత్నములఁ గట్టిన యప్పురిగోపురాగ్రకం
దరములనిల్చుచున్ శ్రమయుఁ దాఁ జనఁగాలవిలంబనంబు వా
సరముల దైర్ఘ్యముల్ తగును సత్యముగా వివరించి చూచినన్.

గీ. సరవి నవ్వీటిలలనాస్య చంద్రువలనఁ
గలిగి శశికాంత సౌధనిర్గళదుదప్ర
వాహము మహేంద్ర నగరోత్సవంబు కొఱకుఁ
జెంది మందాకిని యనంగఁ జెందెఁ బేరు.

చ. కలితకళావిశేషగుణగర్హిత సుద్విజరాజులై కుశా
తులితకవుల్ వికంపిత మృదుప్రతిభాతతకుండలుల్ సధీ
విలసనధూతసద్గుణవివేకులునై యనిశంబు వేడ్కఁ జే
నలరుదు రెందవక్రచతురాననులప్పురిబాడబోత్తముల్.

చ. తగసమరంబులోనయిన ధర్మముఁ దప్పని రాము లేపుచేఁ
బగఱకుఁబక్షముల్ దెరపి వారఁగ స్రుక్కనిభూభృతుల్ మహిన్
మిగులఁగ గోత్రబృందముల మేలుసరించని వజ్రులుక్కఁ జన్
జగడములన్ నిరంకుశతఁ జాలుదురప్పురి రాజకుంజరుల్.

కం. వెలకెక్కని నవనిధులును
తులకెక్కనివస్తుసమితితోడగు ధనదుం

డీల మాకెక్కుడీనముడని
పలుకుదురప్పిటి నైర్వృసతులెప్పాటన్.

ఉ. లోకువవొక్కమెద్దు వృషలుండుశిరంబున నేరుఁబూని తాఁ
గైకొనుబిచ్చముల్ ముసలికాఁపొకఁడుంగడ నెళ్లురెండుగాఁ
జేకొని నీటిపాలొకటిసేసియునాదట మొక్కుటన్ వెసన్
రాకతలంగెసంచు హరరాములనెంతురు పాదసంభవుల్.

సీ. దిగ్గజంబులనైన నుగ్గుసూచముసేయఁ
జాలుకొర్వన్నెలె నామజములు
వడిగల్గియుచ్చైశ్శ్రవంబును మెచ్చక
పరఁగుశ్రీవృత్తికి తురగములును
ధనదుపుష్పకము నెంతయు లెక్కసేయని
రంగదుత్తుంగశతాంగములును
బేతాళునేని నిర్భీతిచేఁ గత్తిఖా
బత్తిఖాదిగమోదు భటజనములు

గీ. వెలయుజయలక్ష్మి సర్వస్వవిభవమునకు
రత్నదీప్తసువర్ణ విభ్రాజమాన
పీఠనానాలసద్వస్తు పేటినుజన
వాటియప్పిటిచెలువు నానాటనెనఁగు.

ఉ. కాంతులనోలినిసెతునగార మణిప్రకరంబుచేతరే
లెంతయునుంబగళ్లు రతినేర్పడమాలిననంతనొయ్యనన్
గాంతురభీకులయ్యెఖిలకాలని వేదన మాచరింపఁగా
ర్తాంతికతాడ్యమాన సముదగ్రఘణాంకృతఘంటికార్భటిన్.

గట్టి పఱతెంచు రాజేంద్రులకోటీరంబు లొండొంటికింటియొరసి మెఱుంగులతరంగల దొరంగుచు సురలుమణిగణంబు పిదపిదసగు బోదుకులకదంచి కుట్టిమస్థలుల సొంపుసంపాదింప రమణీయచిర శ్నరత్నప్రభృతి సమస్తవస్తుసంభారి జృంభమాణంబై యంభో ధినై భవంబు సంబోధింప విజితాభియాతియై యమరావతిఁ దిర స్కరింపఁదగి కురుధరాధిపాపరాధసమేధిత క్రోధుండగు హాలా యుధు నిజాయుధహతాత్కర్షణ శిక్షణక్షణంబనముత్క్షిప్త దక్షిణ క్షితిభాగయగుచు తదీయభవనభూషణాయమానంబగు భోగవతి నిచ్ఛంజయించుటకయి భాగీరథీపాథఃపథంబున డిగ్గి కృతప్రస్థాన యగుచాయ్పన నుత్తరప్రాంతగంగాకూల పర్యంతంబును నిప్పటికి నిఁ దగ్గుచూపి యొప్పుపప్పురంబు.

సీ. రహినొప్పు నమ్మహారాజధానికిఁ దొల్లి
యిలకును బ్రధునకుఁ గలిగినట్టి
యలపురూరవుఁడు దానధిపతియై యెల్ల
దీవులఁ బాలించి తేజమెసఁగ
సార్వభౌముఁడునగు గర్వంబుపెంపున
ధనలోభమున విప్రతతులసొమ్ము
లపహరింపఁగ నజుననుమతి సత్యలో
కంబునుండి మర్త్యంబునకును
గీ. దివ్యమునిసంఘములతోడ భవ్యుఁడగు స
నత్కుమారుఁడు సనుదెంచి నరవరుండు

దర్పసంబిడకయ యనాదరతవారిఁ
జూడఁగోపించి సంయమిస్తోమమపుడు.

క. శాపంబిడ్డఁ బురూరవుఁ
డేపతి మహి మాఱినెమ్మి నేఁగితిరంబై
ఘూపట్టు నుర్వశియుఁదా
నాపృథుగంధర్వలోక మందుననుండెన్.

వ. ఆయూర్వశి పురూరవులకు నాయువును, ధీమంతుండును, వసువును, దృఢాయువు, చిరాయువును, జితాయువును, నననార్వురు పుత్రులుదయించిరందు నాయువునకు స్వర్భానుయను దానివలన నహుషవృద్ధశర్మ రజతయానైనసులను నేవురాత్మజులు గలిగిరి. వారిలోన నహుషుఁడు రాజ్యాధిపత్యంబు వహించి క్రతుశతంబుగావించి యింద్రుండయ్యె వెండియు.

ఆ. వె. ప్రేమనహుషనృపతి ప్రియవాసయ ముదాని
వలనఁగాంచె సుతుల వారిఁబోసఁగఁ
జనుయయాతియనఁగ సంయాతియనఁగఁ బ్ర
యాతియనఁగ నొప్పునట్టివారి.

చ. పరఁగుయయాతి రాజ్యపరిపాలనసేయుచు వేడ్కమీఱ న
ధ్వరములుజేసి భార్గవుసుతామహిపైనతగు దేవయానియుం
దిరువురఁగాంచెఁ బుత్రుల సమిద్ధచరిత్రులఁ బుణ్యమూర్తులన్
దురితవిదూరుఁడౌ యదు దుర్వసులన్ మహితప్రకాశులన్.

గీ. మఱియునృపవర్వ రక్షఃకుమారియగుచు
నలరుశర్మిష్ఠయందు ద్రుహ్యానుపూరు

లనెనుకొడుకులఁగాంచె యయాతిప్రీతి
భవ్యగతిఁ జేసె ధారుణీపాలనంబు.

వ. ఇట్లు పుడమిఁబాలించుచు శుక్రశాపసమాగత జరాభారపీడంబడి కొడుకులనందఱఁగలయంగనుగొని విషయాభిలాషంబున నాకుఁదనివి సనకున్నదిగావున మదీయ జరాభారంబుఁగైకొని మీయం దెవ్వండేని తన యౌవనంబు నాకొసంగువాఁడు సామ్రాజ్యంబునకు యోగ్యుండని పలికిన నగ్రజుండైన యదువు మున్నుగాఁగలవారలు మిన్నకున్నఁ బూరుండు తండ్రిముదిమిఁ బరిగ్రహించి నిజతరుణత్వంబతనికిచ్చి దానంజేసి యాపూరుండు సామ్రాజ్యంబు వహించె నిన మునులు యయాతికి శుక్రశాపం బేమిటం గలిగెననుటయు సూతుండు వారల కిట్లనియె.

సీ. వృషపర్వుఁడను దైత్యవిభునకాచార్యుఁడై
భార్గవుండొగి నయోపాయములను
మెలపుచు సురలచే మృతులగుదైత్యుల
ను మృతసంజీవనీ క్రియముచేతఁ
బ్రతికించుచుండుట భావించివేల్పులు
దనుజులనోర్వను దరముగామిఁ
దలఁచిబృహస్పతి తనయుఁగచుంగని
యనిమొనఁ జేరెగి దనుజవితతి

గీ. బ్రతుకు శుక్రునివిద్య నేర్పడఁగ సురలు
బొలిసిబ్రతుకరు తద్విద్యగలుగకుంట
కావునను గావ్యుకడకేఁగి పేవుదాని
నేర్చిమమ్ముందనుగావు నియమశాలి!

క. నీవతనిఁ గొలువ మృతసం
జీవనిదయనిచ్చు నియమశీలుఁడవగుటన్
వేవేగఁ బొమ్మునావుడు
దేవహితార్థంబుగచుఁడు ధృతినటుఁ జనియెన్.

వ. ఇట్లరిగి దైత్యనాథుండగు వృషపర్వపురంబుఁ జేరి శుక్ర నిలయంబున కేఁగి యుచితగతిసందర్శించి యతనికి నమస్కరించి యేను బృహస్పతికుమారుండ, కచుండనువాఁడ, మీకు శుశ్రూషయొనర్ప నేతెంచినాఁడనని విన్నవించిన భార్గవుండును వాని ప్రణయవచన తేజోవిశేష వినయాదిగుణంబులకు సంతసించి వీఁడు బృహస్పతి యట్లనఁబూజార్హుండని తలంచి యతిస్నేహంబున శిష్యునిఁగాఁ గైకొనియుండెనంత.

చ. అలయక వేసటం గొనక యహ్నమహ్నమటంచు నెమ్మదిం
దలఁపక యొక్కభంగిఁ బనిఁ దప్పకమాటల చేష్టలన్ సము
జ్జ్వలమతిసక్కచుండు బహువత్సలతన్ బహువత్సరంబు ల
య్యలఘుచరిత్రుసేవల నయంబున నేర్పున నుండెనెంతయున్.

గీ. అనిశమతనిపుత్రియగు దేవయానికిఁ
గూర్మివచ్చునట్లు గోరినట్టి
సుమఫలాదికముల సొరిదినొసంగుచు
సంతసమున బద్ధసఖ్యుఁడయ్యె.

క. ఈకరణి వారికిర్వుర
కేకస్థితి గారవమున నెసఁగి కచుండున్
బ్రాకటముగ మెలఁగంగని
వ్యాకులమతి శుక్రశిష్యవర్గము సెందెన్.

వ. ఇట్లు శుక్రునకుఁ బ్రియశిష్యుండై యుండునంత నొక్క నాఁడు దానవులు బృహస్పతియందలి యలుకఁ పెంపునంజేసి సహింపక హోమధేనువుల వనంబునంగాయుచున్న కచుని వధించి తరుశాఖనంటఁగట్టి మిన్నకున్నఁ బొద్దుగ్రుంకునంతఁ దద్ధేనుగణం బింటికివచ్చినంగచుండు రామికి వగచు దేవయానికి సంతసంబుగా భార్గవుండు నిజదివ్యదృష్టివలన నదియెల్లనెఱింగి మృతసంజీవనిచే జీవితుంగావించినఁ దొంటిభంగిఁ బ్రమోదంబందుచుండె.

మఱియును.

సీ. ఒకనాఁడు విరులకు నొగిఁగచుండడవినిఁ
దానుండదైత్యులాతనివధించి
తత్కళేబరము దగ్ధముఁజేసి యాబూది
సురతోడఁగలిపి యాశుక్రుఁడాత్రవ
నిచ్చినఁగాని యతండేపారఁదత్పాన
మత్తుఁడయ్యెను దొంటిమాడ్కిఁగచుఁడు
నరుదేరమికి దేవయానిదుఃఖింపంగఁ
గనికూఁతుతోడను గావ్యుఁడనియెఁ

ఆ. వె. దగనుదైత్యులిట్లు తెగటార్చిరాతఁడు
పుణ్యలోకమునకుఁ బోయెనింక
నేలయేడ్చెదీవు జాలిమానుమునాఁగఁ
దలఁకి దేవయాని తండ్రిఁజూచి.

కం. అక్కట! మఱువందగునే?
యక్కచునిం దెలియనట్టులాడెదవతనిఁ

నిక్కముగాఁ డకకుమువను
వెక్కిటికిఁ బలుకవలదు వెగటుసుమ్ము సుందరీ.

వ. అంతఁ గొంతప్రొద్దునకుఁ బ్రసన్నుండై శుక్రుండు యోగదృష్టివలన నిఖిలలోకంబులందును గనుంగొనక సురామిశ్రభస్మయుతుండై తనయుదరంబున నుండుటఁ గని సురాదోషంబును దైత్యుల యపరాధంబును నెఱింగి కుపితుండై యది మొదలుగ నింక బ్రాహ్మణాదినిఖిల జనంబులును, సురాపానంబుఁ జేసిన పాతకంబున బెరయఁగలరని శాపంబిచ్చి యుదరస్థుఁ డగు కచుని సజీవితునిఁగా సంజీవనిచేఁ గావించి యాత్మోదర భేదనంబు చేసి వచ్చినప్పుడు తనకపాయంబు వొరసిన నది బాపుటకు వానికిఁ దద్విద్య నుపదేశించిన వాఁడు నాకావ్యు జఠరంబు వ్రక్కలించి వెడలి మూర్ఛిల్లిన భార్గవునిఁ దదీయ విద్యాప్రభావంబున బ్రతికించె నిట్లతిప్రయత్నంబున మృతసంజీవనిఁ గఱచి పెద్దకాలంబు సనిన పిమ్మట దేవలోకంబునకుఁ బోవువాఁడై శుక్రానుమతుండగుచుఁ బ్రియంబున దేవయానికిఁ జెప్పిన నది తద్వియోగంబు సహింపక యిట్లనియె.

గీ. నీవువర్ణివి నేను గన్నియనుగాన
నన్ను వరియింపుమనిన నన్నాతిఁ జూచి
పలికెనిట్లాడకుము మహాపాపమిదియ
యకట! గురుపుత్రి సోదరియట్లకాదె.

ఉ. నావుడు దేవయాని విని నమ్మిననన్నిటులాడితివ్యోడన్
గావుననీకుఁ దద్దయును గావ్యునిచేఁ బడయంగనైన సం

జీవసిరి త్తయయ్యెఁబనిసేయకయుండునటంచు శాపముక్క
వానిరి సిద్ధదానికిని వారకయాకచుఁ డోజనిట్లనెక్.

కం. నేనును ధర్మస్థితిమది
నూనితిసదిగాన నోరునకుపదేశింపక్
వానికిఁబనిగొనఁజాలును
మానిని! సంజీవనియు సమంచితవృత్తిక్.

వ. నీవు ధర్మంబుఁదప్పిన మాటలాడితివి, కావుననిన్ను బ్రా
హ్మణుండు పరిగ్రహింపకుండునని ప్రతిశాపంబిచ్చి దివంబునకరిగి
బృహస్పతికుమారుండు సురలకు సంజీవనియుపదేశించి సుఖంబుం
డె నంత నిక్కడ.

సీ. పౌలుపారువృషపర్వు పుత్రికశర్మిష్ఠ
యను కన్యకన్యాసహస్రమెలమి
నంటికొల్వఁగ దేవయానితో వనికేఁగి
యచ్చట జలకేళియాడుతఱిని
వాయువశంబున వారల వలువలు
కలసినయంతనా కన్యలెల్ల
కొలనువెల్వడి తమ కోకలు విడివడఁ
గట్టిరి శర్మిష్ఠకావ్యపుత్రి

ఆ. వె. పుట్టమొనరఁదాల్చె భూసురకన్యక
దాని మైలచీరఁ దాల్పరోసి
నీదుమయిలఁబూననేర్తునే నావుడ
య్యసురపుత్రి దేవయానికనియె.

కం. మాతంగ్రికి సంప్రీతముగ
మీతంగ్రిప్రియంబుసెప్పి మెలఁగుదువుల్
నాతోఁ బెద్దతికంబులు
నాతీ! ప్రేలెదవు కట్టు! నాయమకాదే!

వ. అని గర్వంబుఁ దెగడి దేవయాని నొక్క నూతందో బ్బించి శర్మిష్ఠ సఖిజనంబుదాను నిజ నివాసంబునకు కరిగెనంత.

ఆ. వె. దైవగతియయాతి దప్పివిమృగయాని
నోదమేఁగుదెంచి నూఁతనున్న
దేవయానిఁగాంచి భూవిభుండంతయు
దాని చేతనెత్తిఁ తత్క్షణంబ.

కం. గొబ్బునఁ గూపము వెల్వడ
నబ్బిసరుహనేత్రఁ దిగిచి నూతఁ జనవిరన్
బ్రబ్బిన కోపం బెంతయు
నిబ్బరముగఁ బెరుగుచుండ నెలఁతుకవోలిచెన్.

వ. ఇట్లు దేవయాని శర్మిష్ఠచేసిన యెగ్గుంబాసి తన్ను వెదుక నేతెంచు ఘూర్ణికయను పరిచారికంజూచి శర్మిష్ఠజేసిన యవమానంబును శుక్రునకెఱిగింపుము. వృషపర్వపురంబుననుండ నొల్లనని పంచిన నదియట్లచని శుక్రునకుఁ జెప్పిన నతండువచ్చి కూఁతు నలుకఁబాయ పట్టుపఱుపునెడనంతయు వృషపర్వుండు విని యచ్చటికివచ్చి యీదేవయాని కెద్దియిష్టంబదియిత్తు మాకునేమగడ మీరుకారే, సమ్మదబొందుఁడనిన సంతసించి దేవయాని యిట్లనియె.

ఆ. వె. ఇష్టమిచ్చెదేని యిపుడుకన్యాసహ
స్రంబుతోడఁ దనూడిగంబునకును
సంతసంబునాకు శర్మిష్ఠనిమ్మని
పలుకనట్లు దైత్యపతియునిచ్చె.

వ. ఇట్లు శుక్రునకుఁ బ్రియంబుగాఁ గన్యకాసహస్రంబుతోడ శర్మిష్ఠను దాసింగా దేవయానికి వృషపర్వుఁడొసంగిన, తండ్రి వచనంబున శర్మిష్ఠయు దేవయానింగొలుచుచుండునంత నొక్క నాఁడు సఖీజనంబులతోడ శర్మిష్ఠ గొలిచి పఱతేర దేవయాని వనంబునకేఁగి సెలయేటిపొంతఁ గాంతారంబునఁ బుష్పాపచయం బుసేయు సమయంబున

చ. అలరయయాతిప్రీతి మృగయారతినావనిసంచరించి పే
రలయకనొంది సౌరభసమంచిత మారుతమేర్పరింప నా
పొలఁతులగాంచితన్నయన పుష్పములందగఁబూజితుండునై
పొలుపుగదేవయానినొగి భూపుఁడెఱింగియెఱుంగనట్టులన్.

సీ. మీరెవ్వరనపుడా మెలతయిట్లనిపల్కె
వృషపర్వుఁడను దైత్యవిభునిపుత్రి
శర్మిష్ఠయగునిది జగతీశ! నాదాసి
దానివయస్యలీ తరుణులెల్ల
నన్నెఱుంగవె? యల్లనాఁడుకూపంబున
దక్షిణహస్తమెంతయునుబట్టి
తిగిచితివింతలోఁ దెలియమిదగునెట్లు
పాణిపీడనమట్టి భంగిగాదె

గీ. కానన న్నువరించి యీకాంతలమర
కన్యలనుబోని వారలుగౌరవమున
నిన్ను సేవింపఁబనికొని సచ్చవిచ్చ
భోగములఁదేలు మనవుసు భూమివిభుఁడు.

కం. తగుబ్రాహ్మణునకునెంతయు
జగతీశ్వరకన్యఁగొనఁగ క్షత్రియునకు నె
ట్లగు బ్రాహ్మణకన్యంగొన
మగువా! ధర్మంబుసెడదె మర్యాదవిడక.

వ. నేను వర్ణాశ్రమంబులు సంకరంబులు గాకుండునట్లుగా ధరఁబాలింపుచు నీధర్మవిరోధంబునఁ బ్రవర్తిల్లఁదగునెయని దేవయాని యిట్లనియె.

కం. వినుధర్మ విరోధముగా
దని శుక్రుండు వివాహమయ్యెదె? ననునీ
వనవుడుమనుజేంద్రుండ
మ్మునిచెప్పినయట్లనడతు ముదమునఁదన్వీ!

వ. అని పల్కిన నాక్షణంబున దేవయాని శుక్రు నటకు రావించి యీరాజు మున్ను నన్నుఁగరగ్రహణంబుఁజేసెఁగావున నీజన్మంబునకు నీతండు పతియగు దీనికి ధర్మవిరోధంబుగాకుండున ట్లు గరుణింపుమనుటయు భార్గవుండు దుహితృస్నేహంబున నట్ల నప్రసాదించి వివాహంబుగావించి కూఁతు నల్లునిం బూజించి శర్మిష్ఠను గన్యకాసహస్రంబుతోడంజూపి దీనికి శయనవిషయంబుదక్క దక్కిన భోగంబులందెవ్వియుఁ గొదవసేయువలదని యప్పగించి

పిన్కొల్పిన యయాతి వారలఁదోడ్కొని పురంబునకువచ్చి యొక్క హర్మ్యంబున దేవయానినునిచి తదనుమతి నశోకవన సమీప గృహంబున శర్మిష్ఠనునిచి దేవయానియందనుపమ భోగంబు లనుభవింపుచు యదుతుర్వసులను తనయుల నిర్వురఁగనియెఁ దదనంతరంబ.

ఆ. వె. చారుయశోవనమున శర్మిష్ఠ బెంపారి
యాత్మఁదలఁచె దేవయానిపతినిఁ
బడసి సుతులఁబడసెఁ బడఁతులకెల్లను
సహజగుణముదీని సమముగలదె?

కం. కావున నీతనిపై మది
యేవేళంగలదునాకు నీతనికిని నా
పై వలపు గలిగినట్టులు
కేవలముంగానఁబడెనుఁ గృపదై వారఁ

గీ. దేవయానియుతనిఁ దావరించెనుగాదె
యేనునట్లజెందు దెసఁగననుచుఁ
దలఁపనంతనొక్క తఱిదానిభాగ్యము
కతన నృపతి వనముఁగానవచ్చె.

సీ. వచ్చియేకతమున నచ్చటశర్మిష్ఠ
యుండఁగఁగన నదియుర్విపతిని
వినయసంభ్రమముల వినుతించియిట్లను
దేవసన్నేలిన దేవయాని

ఉ. మానవభర్త్రమోలనుగుమారులు ముప్వురుగ్రీడసల్పఁగా
జానుగదేవయాని కని శాబకు లెవ్వరి పుత్రులన్నన
మ్మానినికిన్ యయాతియనుమాఁగిఁబల్కఁగనోడియున్నఁడు
త్మానులమీరలెవ్వరిసుతుల్ తగఁదెల్పుఁడు నాఁగవారలున్

కం. శర్మిష్ఠ యయాతియుఁ దమఁ
కర్మిలి దలిదండ్రులనుచు నర్భకులొనరన్
చేర్మింజూపినరటో
కోర్ములు నిగుడంగ నప్పు శుక్రముని సుతయున్.

ఆ. వె. తండ్రికడకునేఁగి తద్గతిఁజెప్పిన
నలుకవొడమి శుక్రుఁడయ్యయాతి
కపుడుశాపమిచ్చె నతిజరాభరపీడ
నందఁదోడసని యయాతియతని.

కం. ఋతుమతియై ప్రార్థించిన
యతివకు నిష్టంబుఁగూర్ప నగుమానినచో
నుతపుణ్య ! భ్రూణహత్యయు
నతనికగున్ దానఁజేసి యట్లొడఁబడితిన్.

వ. నాకువిషయోపభోగంబులయందుఁదనివిసనకున్నయది యీత
ప్పుసైరింపుమని యనేకభంగులఁ బ్రార్థించినఁ బ్రసన్నుండై శు
క్రుండు నీముదిమినీపుత్రులందొకనికిచ్చి వానియౌవనంబు గొని
భోగంబులనుభవించి పిదపవాని జవ్వనంబువానికొసంగునది, వాఁ
డఖిల సామ్రాజ్యంబున కర్హుండని యానతిచ్చిన యయాతిసంత
సిల్లి దేవయానిందోడ్కొని నిజపురంబునకు వచ్చి కొడుకులంబి

లిచి వేఱువేఱఁ దనయుఁడన జరాభారంబుఁగొని మీఁదటావసంబోఁగు మనుటయుఁబూరుండు దక్కఁదక్కిన నల్వురొడంబడకున్నఁగిలియదువంశ్యులు రాజ్యంబున కనర్హులగునట్లును ద్రుహ్యువంశ్యులుధర్మాధర్మవివేకరహిత కిరాతులకు రాజులగునట్లుగను ద్రుహ్యువంశ్యు లుదక రహితమరుదేశంబులకు రాజలగునట్లును, శాపం బిచ్చి యాత్మీయజరాభారంబుఁ బూరుండంగీకరించినఁ దదీయయౌవనంబుఁగొని కొన్నివత్సరంబులిష్ట భోగంబులనుభవించి యెప్పంటిముదిమిఁ గైకొని పూరునకు రాజ్యంబొసంగి వీతరాగుండై వనంబునకేఁగి నియమంబున ననేకవత్సరంబులు ఘోరతపం బాచరించి కాలంబగుటయు సత్యలోకాదిలోకంబుల సుఖంబులను బహుదివ్యవర్షంబు లనుభవించుచుండ నొక్కనాఁ డింద్రుఁ డతనిం జూచి.

సీ. పూరునకేమని బుద్ధులు గఱపితి
వనవుడింద్రునకిట్టులనియె నృపతి
సద్గోష్ఠి మెలఁగుచు సతతముధర్మంబు
సేయుచు నెఱుకను జెందిధనము
పాత్రులకిచ్చుచుఁ బరులవేడక నాశ
రిత్తసేయకను సద్వృత్తినెసఁగు
మనియువిమున్నుగాఁగను సెప్పితనవుడు
యెంతతపంబొ భూకాంతయిట్టి
గీ. పుణ్యఫలములు బహువర్షములనుఁజెంది
తనుమునాఘోరతపముతో సమరగరుడ

దైత్యదానవగంధర్వ తపములైన
సమముగానేరవని నాశక్రుఁడలిగి

వ. నీవుమహాత్ముల తపంబులవమానించి పలికితివింక నధో
లోకంబునకుఁబొమ్మనినయయాతియిట్లనియె.

క. అనయంబనఘా ! మర్త్యం
బున కేపోఁజాలనిఁక నభోవీధినిఁబెం
పునసమ్యగ్గతి నుండెద
ననుడట్లననాజ్ఞ సేయనాతండంతఁ.

వ. తదీయతేజో విశేషంబున కచ్చెరువడి సద్గుణంబులు జూ
చుచుండ సద్భువనంబుఁ బ్రవేశించిన యయాతిని దౌహిత్రు
లైన యష్టకుండును బ్రవర్ధనుండును వసుమనస్కుండును నౌశీన
రుండైన శిబియును దద్భువన వాసులును నెదుర్కొని పూజించి
యిటకేమి కతంబున వచ్చితనిన మదీయతపంబుపేర్మినెల్లలోక
సుఖంబులనుభవింపుచు నమరావతికి వచ్చియుండు నంతనిందుఁడిం
దు మత్తపః ప్రభావంబనుగుటయు నేనునెల్లరతపంబులకంటె నా
తపంబెక్కుడనిపలికిన రోసి యధోభువనంబున కేఁగంజేసె వెండి
యు నావేఁడుటంజేసి యిందుండనియమించెననుటయు సంతసిం
చి సకల ధర్మాధర్మంబులును సుగతి దుర్గతి స్వరూపంబులు లో
నగునవి యెల్లనడిగిన యష్టకాదులకన్నియునుంజెప్పిన యయాతి
కివారిట్లనిరి.

కం. సర్వజ్ఞ మూర్తి యెఱుకయు
ఖర్వస్థితిగలమ నీకుగావునమాకో

యుక్ష్వీశ ! పుణ్యలోకము
గీర్వాణులు మెచ్చఁగలదె? కేవలమింకన్

ఆ. వె. అనుడు పుణ్యలోక మెనయంగఁగలదని
మేలుసెప్పవారు మేమునీకుఁ
దనరవేడ్క వినుము దౌహిత్రులమునున్మ
టంచునష్టకాదులవుడు దెలిపి.

కం. వినుతమగు పుణ్యలోకముఁ
గనిరంతయయాతి కొంతకాలంబునకున్
బెనుపగు సత్సంగతిఁదా
గనియును జనెనూర్ధ్వలోక గరిమస్థితికిన్

వ. అట్టియయాతి పుత్రుండైన పూరునకు జనమేజయుండు ను వానికిఁబ్రాచీశుండును నతనికి సంయాతియు వానికి సహంయాతియు నతనికి సార్వభౌముండును వానికి జయత్సేనుండను వానికి నరాచీనుండును వానికి మహాభౌముండును వానికినయుతనాయియు నతనికి నక్రోధనుండును వానికిదేవాతిథియు వానికి నరిహుండును వానికి ఋక్షుండును వానికి మతినారుండును, వానికిఁదంసుండును, వానికిగీలినుండును నతనికి దుష్యంతుఁడును బుట్టెనతండు

సీ. శార్దూలసింహాది సత్త్వచయంబుల
లేడిపిల్లలఁబోలె లీలఁబట్టు
నొకపర్వతముమీఁద నొకపర్వతంబెత్తి
వైచునుజూర్ణమై వసుధఁగలయ

యశావశగర్వ మత్యంతఁబువిలసిల్ల
మూరెందులేకయమ్మనుజ నభుఁడు
సర్వసర్వంసహా చక్రమంతయుఁదొంటి
రాజులకంటెను రహిఁగనేలె

గీ. నట్టి దుష్యంతుఁడొక్కనాఁడతిముదమున
నడవిమృగయావినోదార్థ మరిగివివిధ
సత్త్వములనేచిచంపుచు శ్రమముబెరయఁ
జాలదవ్వుగఁ జనిచని మోలనొకట.

చ. అమరనదీసమీపమున నాతతమైతగుకణ్వమౌనియా
శ్రమమొనరంగఁగాంచి పరిచారజనంబుల నిల్పివేడ్కసం
యమికి నమస్కరింప వినయంబుననచ్చటికేఁగి యమ్ముని
ప్రముఖునియుంటఁ గాంచెమదబంభరకుంతల నాశకుంతలన్

కం. అదియును ముదమెదఁ బొదువఁగ
మదన సదృశాకృతియైన మనుజపతికివే
నెదురేగి యుచితపూజలు
మదియలరఁగ నిచ్చునంతమౌనిని కనియెన్

గీ. వెలఁదియేమునేఁట వేఁటకనిటవచ్చి
సాధుచరితుఁ గణ్వసంయమీంద్రుఁ
జూచిపోవబుద్ధి సొరిదిఁదలంచితి
మమ్మహాత్ములెచటి కరిగిరనుచు.

చ. మునికులవర్యుఁడింతకయమున్న ఫలంబులకేఁగెఁగాన కా
యనఘులువేగవచ్చెదరు నంతకుఁగొంతశ్రమంబుఁబాయఁగాఁ

జనునిట విశ్రమింపుచునను చంచలనేత్రనుగాంచి పల్కె నో
వనజదళాక్షి! నీవెవరు వారకయుంటివసింపచుం డలన్.

గీ. అనుడుఁగణ్వమౌని యాత్మజనని తెల్ప
మనుజపతియు నదియుమౌనితనయ
యేలినాదుచిత్త మెట్టులియ్యబ్జాక్షి
యందుఁడవులుఁ నెను సందియముఁ.

కం. దానికిన్నృపుఁడిట్లనునో
మానిని! కణ్వునకున్ స్త్రీ మాడ్కినిసుతనై
తో నాకును దెల్పుము నా
మానవపతితోడ నాసుమధ్యయుఁబల్కెన్.

వ. మహాత్మా! నీవు మదీయజన్మప్రకారంబు వినంగోరితివిగా వున వినుపించెద మున్నొక్కసంయమి మాయయ్య నట్లనియడిగి ననతనికతండు దెలుపుటంజేసి యేనెఱింగితి నది యాకర్ణింపుము.

సీ. మున్నువిశ్వామిత్ర మునిఘోరతపమాచ
రించుచుండఁగ నదిరిత్తఁబుచ్చఁ
బూనికశక్రుండు మేనకయనుదానిఁ
బంచినయప్పుడప్పద్మనయన
యమ్మునికడకేఁగి యంతలనింతలఁ
గ్రుమ్మర నయ్యెంతినమ్మునియును
జూచిగామించి యచ్చోఁగొన్ని వర్షముల్
కామోపభోగముల్ గన్నకతన

గీ. నంతవారల కిరుపుర కబలగలిగెఁ
బిదప మేనక దివికి సంప్రీతిఁబోవ
గాశికుఁడును దపముసత్క్రియముమీఱ
నల్పనొకపుణ్యవనికినిఁ జనియెననఘ!

వ. ఇట్లబ్బాలికనుమాలినియనునొక్క యేటిపుళినంబున నిడి వారలరిగిన మునిసామర్థ్యంబున మృగంబులులోనగుక్రవ్యాదంబు లెవ్వియు నానిసువుచెంతఁజేరవయ్యె. శకుంతతతులచే రక్షింపఁబడుచున్న శిశు నేనయ్యేటికి శిష్యయుతంబుగాఁజని యాబాలందెచ్చి, శకుంత రక్షితగావున శకుంతలయను నామంబిడి పెనిచితి దానంజేసి యిదినాకూఁతురని యమ్మునికతండు జెప్పెనని చెప్పిన విని దుష్యంతుండది రాజపుత్రియగుటయుఁ దనయందత్యనురాగంబుగలుగుటయును మనోజబాణభిన్న మానసుండగుటంజేసి యాతరళాక్షి నుపలక్షించి బ్రాహ్మ్యంబును దైవంబును నార్షంబును బ్రాజాపత్యంబును రాక్షసంబును నాసురంబును గాంధర్వంబును బైశాచంబును ననఁ నెనిమిది వివాహంబులందు రాజులకు గాంధర్వరాక్షస వివాహంబులు ప్రశస్తంబులట్లగుటను గాంధర్వంబుననన్ను వరించి భోగంబు లనుభవించి పురంబున సుఖంబుండుదమనిన లజ్జావనత వదనయై శకుంతల యతనికిట్లనియె.

సీ. ఘనులుకణ్వమునీంద్రులనఘాత్మ! వచ్చెద
రిచ్చెదరిపుడు నన్నెలమిననుడు
దనకుఁదాఁగర్తగాకను కర్తలారులెట్లు
గాంధర్వమునఁ బెండ్లిఁగమ్మునాఁగ

సీదయచేనాకు నెక్కెఁగల్గుపుత్రుని
యువరాజుగాఁజేయు మొః కనిదియు
నావుడట్లగ నరనాథుఁడు త్తరమిచ్చి
గాంధర్వమునదాని గారవించి

గీ. అభిమతసుఖంబులెంతయు ననుభవించి
నిన్నుఁదోడ్కొని రా సుప్రసన్నులగుచు
మలయుకణ్వులపాలి కన్మశ్ప్రధాన
జనులఁనిచెదనని చెప్పి చనియెన్నృపతి.

వ. ఇట్లు దుష్యంతుండు శకుంతలనోడంబఱచి నిజపురంబున కరిగె నంతఁ గణ్వుండువచ్చి శకుంతలవిధంబంతయు దివ్యజ్ఞానంబునఁదెలిసి సంతసిల్లి తల్లీ! నీకనుహూపలక్షణుండగు వరునిఁబడసితివి. నీగర్భార్భకుండు చక్రవర్తియగు నీధర్మచరితంబునకు మెచ్చితినని కూఁతురుగోరునట్లు వరంబులొసంగె నంత శకుంతలకు వక్షత్రయంబునకు భరతుండుపుట్టి కణ్వనిర్వర్తితజాతకర్మాది కలాపుండై పెరుగుచుండె

కం. ఘనశార్దూల మృగాదన
వనగజములఁబట్టి కణ్వవాసము క్రేవన్
దినదినముఁ గట్టునాశ్రమ
మునిజనములు నద్భుతమును మోదమునొందన్.

ఆ. వె. సకలసత్త్వములను సతతముదమియింపఁ
దనరఁజూచి సర్వదమనుఁడనుచుఁ

బలికిరచటిమునులు బాలకునంతఁ గ
ప్వంమగూఁతుఁ గోడ నొడివెనిట్లు.

కం. చెల్లదుసూ! పుట్టింటను
దల్లి! పెద్దయువసింపఁ దరుణుల కెల్లన్
వల్లభునికడనయుండఁగఁ
జెల్లుం బతికడకుఁ బొమ్ముచితగతినింకన్.

చ. అనితన శిష్యవర్గముల నాయమతోడుగనిచ్చి పుత్రినిన్
మనుమని వీడుకొల్పు మునిమండనునాజ్ఞనువచ్చి యామహా
వినుతచరిత్ర రాజుమది విస్మృతిఁబొందెనొ యెట్లెఱుంగఁడై
ననుమునుబల్కినట్టి వచనంబులు బుత్రునిఁజూపివల్కెదన్.

వ. అని నిశ్చయించి శకుంతల దుష్యంతునకిట్లనియె.

చ. నరవర! నాఁడువేఁటకువనంబున కీవరుదెంచివేడ్కచే
వరమొగినాకొసంగితివి వాసవుఁబోలినవాఁడువీఁడయో
పురుషవరేణ్య! నీకొడుకుఁబొల్పుదగన్ యువరాజుఁజేయుమీ
ధరణికి సత్యవాక్యమతిఁదప్పకు నావినియాతఁడిట్లనున్.

ఆ. వె. ఎవ్వరీవు? నిన్ను నెట్లెఱుంగుదు?
ననుచితంబులిట్టు లాడఁదగునె?
ఆడుదానవగుటనంటి వింతియచాలుఁ
బొమ్ముమగుడనుఁ బువుఁబోలదబల!

వ. అని యెఱింగియు నెఱుంగని చందంబునఁ బలుకు దుష్యం తుని వచనంబులకు శకుంతల పురాతన చిత్రంబుబోలె వివర్ణయు ను, నిశ్చేష్టితయునునై యెట్టకేలకు వెచ్చనూర్చి యుమ్మలికమ్మ

గ్రమ్మఱ కోన సత్యములుగాల ధైర్యంబు దక్కఁబట్టి మెండియు నిట్ల
నియె.

సీ. ఏలయెఱుంగవే వెఱ్ఱియెఱుంగవే
ననితప్పఁబల్కఁగా సహ్యమగునె?
యొంటిపాటునఁ దన్ను నొరులెఱుంగరటంచుఁ
దన్ను బ్రముచ్చిలనెట్లు దాఁగువనపు!
పురుషునివృత్తము భూతముల్ ధర్మంబు
వేదముల్ రవిశశి యమాదిమరుతు
రేబగల్లును ధరిత్రియుఁ దొట్టియెఱుఁగును
గావున మృషసేయఁ గలుగునెట్లు?
ఆ. వె. మొనసి ధర్మకామమోక్షంబులకు నిహ
పరసుఖంబులకును భార్యమేర
పట్టిఁజూచుసీదు ప్రతిబింబమేకొక
పలుకుదేవ సత్యభాషణంబు.

వ. అనిన శకుంతలకు దుష్యంతుండిట్లనియె.

కం. ఏనెక్కడ? సుతుఁడెక్కడఁ?
దానెక్కడ? విన్నవారు దలఁత్రిపగ—
మానిని! పల్కకచుచవు
వీనులకును వినఁగరాని విపరీతంబుల్.

చ. గొనికొని యిట్లుపల్కిన శకుంతలయుం గడుదుఃఖితాత్మయై
తనమది నెంచెమున్న తలిదండ్రులుపుట్టిన నాఁడవీడి రి

ష్టునుబతికించెద నాకుఁ బోలఁగ దైవము దక్కనొండుచోఁ
గనశరణంబులేదని వగఁ సుతునెత్తుకపోవ నున్నెడన్.

ఆ. వె. అపుడుదివ్యవాణి యండజుకాశ్చర్య
మొనరఁ జేయుచును సముజ్జ్వలముగ
వీఁడునీసుతుండు వినుము శకుంతల
సత్యమెసఁగబలికె సాధ్వియిదియు.

కం. అనిగగనవాణిబల్కిన
జననాథుఁడుహర్ష మొంది జనములకెల్లన్
మును వనమందునఁదనకును
వనజాక్షికిజన్న తెఱఁగు వారక తెలిపెన్.

వ. ఇట్లెల్లవారికి నెఱింగించి లోకాపవాదభయంబునకింత చేసితినని కొడుకునెత్తికొని శకుంతలను గారవించి యాభరతుని యువరాజుంజేసి పెద్దగాలంబు పరిపాలనంబొనర్చి భరతునకుఁబట్టంబుఁగట్టి తపోవనంబునకు దుష్యంతుండు సనియె. అతీతానాగతులైన రాజులకెల్ల వంశకర్తయైనట్టి యాభరతునకు భూమన్యుండు వుట్టెవానికి సుహోత్రుండుపుట్టెను. వానికి హస్తిపుట్టె. అతనిపేర హస్తిపురంబనంబరఁగె నట్టిహస్తికి నికుంభుండును వానికి నజామీఢుండును, వానికి భార్యాత్రయంబున నూటయిరువది నలుగురు సుతులు గలరందులోన సంవరణుండు ధరిత్రిఁబాలించె నతనికి సూర్యపుత్రియైన తపతివలనఁ గురుండుపుట్టె వానిపేరఁ గురుక్షేత్రమనంబరఁగె నాకురునకుఁబరీక్షితుండును వానికి భీమసేనుండును వానికిఁ బ్రతిశ్రవసుండును వానికిఁ బ్రతీపుండును

నాటికి దేవాపిశంతను బాహ్లీకులను మువ్వురుగలిగిరందు దేవాపిపిన్న పుడు తపోవనంబునకరిగె. శంతనుండు రాజ్యంబు వహించె నత నికి గంగవలన దేవవ్రతుండనెడు భీష్ముండుదయించె వెండియు నా శంతనునకు సత్యవతియందుఁ జిత్రాంగద విచిత్రవీర్యు లిరువురు పుట్టిరందుఁ జిత్రాంగదుండు గంధర్వునిచేఁ దెగటాఱిన యతనిత మ్ముఁడగు విచిత్రవీర్యుని రాజుంజేసి భీష్ముండు కాశీరాజుకూఁతు ల నంబికాంబాలికలను గన్యలఁ బరిణయంబునేసినఁ గొంతకాలం బు కామోపభోగంబులనుభవించుచు రాజయక్ష్మచే మృతినొందు టయు వంశచ్యుతికి సహింపక సత్యవతి వ్యాసుంబ్రార్థించిన దేవ రన్యాయంబున నమ్మహాత్మునకు నంబికయందు ధృతరాష్ట్రుండు ను నంబాలికయందు బాండురాజును నంబికాపరిచారికయందు విదురుండును గలిగిరందు ధృతరాష్ట్రునకు గాంధారివలన దు ర్యోధన, దుశ్శాసన, దుస్సహ, దుశ్శల, జలసంధ, సమ, సహ, వింద, అనువింద, దుర్ధర్ష, సుబాహు, దుష్ప్రధర్షణ, దుర్మ ర్షణ, దుర్ముఖ, దుష్కర్ణ, కర్ణ, వివింశతి, వికర్ణ, శల, సత్వ, సులోచన, చిత్ర, ఉపచిత్ర, చిత్రాక్ష, చారుచిత్ర, శరాసన, దుర్మ ద, దుర్విగాహ, వివిత్సు, వికటానన, ఊర్ణనాభ, సునాభ, నంద, ఉపనందక, చిత్రబాణ, చిత్రవర్మ, సువర్మ, దుర్విమోచన, అయోబాహు, చిత్రాంగ, చిత్రకుండల, భీమవేగ, భీమబల, బలాక, బలవర్ధన, ఉగ్రాయుధ, సుషేణ, కుండధార, మహో దర, చిత్రాయుధ, నిషంగి, పాశి, బృందారక, దృఢవర్మ, దృఢ క్షత్ర, సోమకీర్తి, అనూదర, దృఢసంధ, జరాసంధ, సద, సువాగ్,

ఉగ్రశ్రవ, ఉగ్రసేన, సేనాని, దుష్పరాజయ, అపరాజిత,
కుండశాయి, విశాలాక్ష, దురాధర, దృఢహస్త, సుహస్త,
వాతవేగ, సువర్చ, ఆదిత్యకేతు, బహ్వాశి, నాగదత్త, అగ్ర
యాయి, కవచి, క్రథన, కుండ, ధనుర్ధరఉగ్ర, భీమరథ, వీరబాహు
అలోలుప, అభయ, రౌద్రకర్మ, దృఢరథ, అశ్రయ, అనాధృష్య,
కుండభేది, విరావి, ప్రమథ, ప్రమాథి, దీర్ఘ, రోమ, దీర్ఘబాహుర
వ్యూఢోడ, కనకధ్వజ, కుండాశి, విరజసులను, నూర్గురు కొడుకులును,
దుస్సలయను నొక్క కూఁతురునుఁ గలిగె. పాండునకుఁ గుంతీమా
ద్రులవలనఁ గ్రమంబున ధర్మానిల శక్రాశ్వినుల ప్రసాదంబున ధర్మా
ర్జున నకుల సహదేవులన నేవురుగలిగిరి. వారికి ధర్మపత్నియగు
పాంచాలికిఁ బ్రతివింధ్య, శ్రుతసోమ, శ్రుతకీర్తి, శతానీక, శ్రుతవ
ర్మలననుపపాండవు లేవురుబుట్టిరి. మఱియు ధర్మరాజునకు దేవికయ
నుదానికి యౌధేయుండను, భీమునకు జలంధరయందు సర్వత్రా
తుండును, హిడింబయందు ఘటోత్కచుండును, అర్జునునకు సు
భద్రయం దభిమన్యుండును, నాగకుమారియగు నలూచియందు
నిలావంతుండును, నకులునకు రేణుమతియందు నిరమిత్రుండును,
సహదేవునకు విజయయనుదానియందు సుహోత్రుండును బుట్టె
నిట్లు పాండుపౌత్రులైన పన్నిరువురయందు వంశకరుండైన యభి
మన్యునకు నుత్తరయందుఁ బరీక్షితుండు బుట్టె. వానికి మద్రవతి
యందు జనమేజయుండుగలిగె. వానికి శంఖశతానీకులు గలిగిరం
దు శతానీకునకు నశ్వమేధజిత్తుండుపుట్టె నిట్లు గలిగిన వీరలతో

భారతులనియును కౌరవులనియును బౌరులనియును పేళ్లుచెల్లునని
చెప్పిన విని మునులు సూతునకిట్లనిరి.

ఆ. వె. మనుజుఁడైన శంతనునకు దివ్యాపగ
యైన గంగకెట్టులయ్యెఁదగులు
హార్ష మొప్ప నమ్మహాపురుషుండగు
భీష్ముఁడెట్టు వారిబిడ్డయయ్యె.

సీ. తగఁదెల్పుపాండవధార్తరాష్ట్రులసంభ
వమునవిస్తరముగా వరుసననిన
మునులకుసూతుఁడిట్లనిచెప్పె వినరయ్య
మున్ను నిక్ష్వాకువంశోన్నతుండు
తగుమహాభీషుఁడు ధర్మశీలుఁడు పుణ్య
ఫలమున బ్రహ్మనుగొలుచుచున్న
తఱిగంగ దివ్యసుందరి రూపమొగిఁదాల్చి
యాసభకేతెంచి వాసినుండ

ఆ. వె. వాయువశతదాని వలువ దొలంగిన
సాభిలాషదృష్టి నవనివిభుఁడు
గనిన నెఱిఁగియలిఁగి కమలసంభవుఁడంత
శాపమతనికిచ్చె జగతిఁబుట్ట.

చ. అతఁడుప్రదీపపుత్రకుఁడనయ్యెదనంచు విరించివేఁడి స
మ్మతిఁగొనిమర్త్యలోకమునుమానుగనొందెనుగంగయుఁగ్ సమం
చితుఁడగు వానిపై మనసుఁజేర్చి మర్త్యముఁగానవచ్చుచో
తొలికివశిష్ఠశాపమునఁజెందు వసుప్రతతింగనుంగొనెన్.

గీ. ఏమిగతముమీర లెనమంత్రమనొందెడి
కేఁగదివముమాని యిప్పుడనుడు
వనితతో వశిష్ఠ మునిచ్చుచ్చుశాపంబు
దెలిపిదుఃఖములను బలికిరిట్లు.

సీ. తల్లి! యేమటనొక్కతన్వికి జన్మింప
నోపము ధరణిఁబ్రదీపునకును
జనుమహా భీష్ముఁడు శంతనుఁడై పుట్టు
కలదునీకతని సంగంబుగాన
నేమునీయందుల నెనఁగజనించెద
మనవుఁడు నామదినట్లగలదు
శోకంబుమానుఁడంచును బల్కుటయువారు
మాకుపకారంబు మగువవినుము

గీ. పుట్టినప్పుడుగంగలోఁబూనివైవు
మానియునమజ్ఞఁజేసె నిమ్మాడ్కిననిన
నట్లయేనియొకండు మీయందునాకుఁ
బట్టియె పెద్దకాలంబు బ్రతుకవలయు.

కం. నావినియట్లనతగునో
పావని! మాయందునాల్వపాలోగిఁగొనితా
కేవలుఁడష్టమవసువును
ధీవినుతుండుండు నవనిదీర్ఘాయువుగన్.

వ. అని గంగావసువులన్యోన్య సహాయంబుఁజేసికొనిరంత
నిచ్చటఁ బ్రదీపనృపతిగంగాతటంబునఁ దపంబుననుండుతఱి నొక్క

దివ్యసుందరి యతనియంకంబెక్కఁగని యచ్చెరువడి నీవెవ్వరవు
టయుఁ బ్రదీపునకు నది యిట్లనియె.

ఆ. వె. జహ్నుసుతను నేను జగతీశ! నినుఁ గోరి
వరఁగవచ్చితిపుడు భార్యగాఁగ
నేలుమనుడు నాతఁడే నొండుసతిఁ జెంద
నదియుఁగాక నింకనబల! వినుము.

వ. స్త్రీభాగంబైన దాపలి యంకంబెక్కక పుత్త్రస్నేహో
చితంబగు నాదక్షిణాంకంబెక్కితివి గావున నస్మత్పుత్త్రునకు భార్య
వగు మనుటయు నట్లకాక యని గంగ యంతర్హితయయ్యె నం
తఁగొంతకాలంబునఁ బ్రదీపుండును సునందయందు శంతనుని
గాంచి వానికిఁ బట్టంబుగట్టి గంగకడమున్నొక్క తన్వంగినాకుఁ
గానంబడిన మదీయాత్మజునకు భార్యవుగమ్మనిన నది యొడంబడి
చనియెఁగావున నీవుదాని కులగోత్రంబులడుగక వరించునది యని
చెప్పి తపంబునకరిగెఁ దదనంతరంబ.

ఉ. శంతనుఁడొక్కనాఁడు మృగసంహతిఁగొంప సుపర్వవాహినీ
ప్రాంతమునందుఁ గ్రుమ్మరుచు భామినినొర్తుఁ దదాపగాతటో
పాంతమునందులంగనియుఁ బల్మరుసొక్కి సమగ్రమార దు
ర్దాంతశరవ్యమై తగుచుఁ దద్దయునెమ్మది సంచలింపఁగాఁ.

ఆ. వె. అదియునతనియందు మదిఁదవులంగను
బలికెనిట్లుదన్ను భార్యగాఁగఁ
గొనుమునాదుకోర్కె నొనరించినదియది
యొట్టిదనినవిను సమిద్ధపుణ్య!

కం. గోనకోనియే జేసినఁ గని
కనఘా! మాఱొడ్డి తేని యప్పనుని న్నుఁ గా
మనుజేశ! పాసిపోయెద
నవిసమయము డెల్ప నాతఁ డది మేకొనియెన్.

వ. అంత శంతనుతోడ నాస్రవంతి కాంతారూపంబున నిఖిల కామోపభోగంబు లనుభవించుచు వరుసుండా వెయగు వసువులఁ బుత్రులఁగాఁగని గంగయందు వైచుచుండ శంతనుండు పుత్రమోహంబుగలిగియు మారాడినఁ దన్నుఁబాసి చనునని భయంబున మిన్నకుండె నిట్లేడ్వుర్గ్రమంబున నుదకంబునవైచి యెనిమిదవ సుతుండుద్భవింప వాని నట్లసేయందలంచు నెడ నడ్డంబువచ్చి దానికి శంతనుండిట్లనియె.

ఆ. వె. చెట్టుకాయలట్లఁ బుట్టినబిడ్డల
నెల్లఁజంపితిట్టు లిహముఁబరము
రోయనింక నింతిరో! వీనివిడనన్నుఁ
బాయుబాయకుండు పాపమిదియుఁ.

వ. అని పుత్రమోహంబున శిశువును విడువకున్న గంగయు నీతోడి సంగతి నాకింతియయేను సుపర్వ వాహినిని. వసిష్ఠ శాపంబున వసువులు మర్త్యలోకంబున నొండుచో జన్మింపనేరమని ప్రార్థించుటయు మనుష్య స్త్రీరూపంబున నీవలన వసువులం బుట్టించి స్వర్గంబున కనిచి వారి యిష్టంబుఁజేసితి. ఈయష్టమపుత్రుండు వసువులందొక్కొక్కరి చతుర్థాంశంబుఁ దాల్చినవాఁడు ధర్మమూర్తియును బెద్దకాలంబు మనుష్యలోకంబున నుండునని

చెప్పిన నచ్చెరువడి వారికి వసిష్ఠుండేమి కారణంబున శాపంబిచ్చె నష్టమవసువు పెద్దకాలంబు మర్త్యంబున నుండుటకుఁ గతంబె య్యది యని యడిగిన శంతనునకు గంగ యిట్లనియె.

సీ. ఖ్యుండునామునివరువిపుత్రుఁడు వసి
ష్ఠుఁడనుసుమేరువ్రాందు పాదిరినాశ్ర
మంబొనరించి తపంబర్థిఁ జేయఁగ
నటవసువులువచ్చి యతనిహోమా
ధేనువుసందిని ధేనువుఁగని దాని
యిష్టంబుఁగురియుట కిచ్చమెచ్చి
రందుఁబ్రభావసుండను వానిసతి దన
పతికిట్లువలికె నేర్పడగఁదీని

ఆ. వె. పాలుద్రాగువారు పదివేలయేండ్లును
జరయురుజయుఁగనరు సురలపగిది
గానఁగాశినృపతి గాదిలిసుత జిత
వతియనంగ నాకు మదిపయస్య.

కం. దానికి నిమ్మొదవును స
న్మానంబున నిచ్చిపుచ్చు మఱిదగు ననుచున్
దానికి ననుగుణుఁడై య
చ్చోనాతఁడు తనదు భ్రాతృచోదితుఁడగుచున్.

వ. వసిష్ఠ హోమధేనువుం గొనిపోయిన మునివరుండా వనంబెల్లఁ గ్రుమ్మరి నిజ యోగదృష్టివలన నెఱింగి వసువుల మర్త్యయోనింబుట్ట శపించిన వారు వెఱచి పఱతెంచి మాయజ్ఞా

నంబు సైరింపుమని ప్రార్థించి పెద్దకాలంబు మర్త్యంబున నుండ కుండఁ బ్రసాదింపుఁడనిఁ బెద్దయపరాధంబుఁ బ్రభావసుండొనర్చె వాఁడు పెద్దకాలంబు మనుష్యలోకంబున నుండునదియని కరుణించెనని వసిష్ఠుచేనగు శాపంబుఁదెలిపి దేవవ్రతుండైన యీ కొడుకును బెరుగునంతకు నాయొద్ద నుండనగునని శంతను నొడంబఱచి కుఱ్ఱనిఁ దోడ్కొని గంగ చనువంత నమ్మహీపతి పురంబున సుఖంబుండె నంత నొక్కనాఁడు.

కం. మృగయావినోదముగ నా
జగతీశుఁడు గంగక్రేవఁజరియింపఁదదా
పగయల్పంబగు వేళన్
దగనచ్చెఱువంది కొంతదవ్వునసంగన్.

వ. ముందట బాణసంఘాతంబులచేఁ బ్రవాహంబును సేతువు బంధించుచునేయు కుమారుంజూచివెఱఁగుపడునప్పుడు గంగ వచ్చి వీఁడు నీకొడుకు నిఖిలవిద్యలనభ్యసించె. కొనిపొమ్మనుడు సంతసిల్లి శంతనుండతనిఁదెచ్చి యువరాజుంజేసి రాజ్యంబుపాలించుచుండునంత నొక్కనాఁడు.

ఆ.వె. యమునచెంత వేఁటలాడుచు నొకమంచి
వలపువీవ దానివలననేఁగి
కాంచెమ్రోల దివిజకన్యక నెనఁబోలఁ
జాలు బోఁటినవని పాలకుండు.

కం. డాయఁగజని నీవెవ్వర
వీయమునా నడిని నోడనేకత మిటులన్

ఛాయకనడిపెదు భామిని
నాయాతనిఁజూచి యల్లఁగ సతిపతి కేగ.

సీ. ఏదాశరాజున కెసఁగెడికూఁతురుఁ
దండ్రిపంపునఁనోడ ధర్మమునకు
నడపుదు ననవుడా నరపతి మునుదాని
విలసితాకారంబు వినికని
దాశరాజునుజేరి తన యిష్టమెఱింగింప
సమ్మతినాతఁడా శంతనునకు
నిట్లనునృపవర్య! యీయింతికొమరుని
నీపిమ్మటను భువి నెమ్మినేల

ఆ. వె. రాజుఁజేసితేని యోజనగంధిని
నిచ్చెదనుడు భీష్మునిచ్చఁదలఁచి
శంతనుండువాని సమయంబునకు మాని
తనపురంబుసేరెఁ దాపమొదర.

వ. ఇట్లు ప్రతిహతమనోరథుండై సత్యవతియందు చిత్తంబుఁ జేర్చుటంజేసి కార్శ్యంబునొందు తండ్రికి దేవవ్రతుండిట్లేల నిష్కారణంబువనరెదవనిన శంతనుండిట్లనియె.

చ. తనయులు పెక్కులేరు మరిఁదద్దయునీవొకరుండవయ్యునుఁ
ఘనమగునస్త్రశస్త్రములుగల్గుట సాహసివాహవంబులన్
నినుమనుదంచు నమ్మగనునేరనుగావునఁ బుత్రలాభమై
గొనకొనినేవివాహమొగిఁగోరితి నావుడు భీష్ముడెంతయున్.

వ. రాజుచిత్తంబు సత్యవతియందుఁ గలుగుట యెఱింగి తగు వాదంబులనొదవ దాశరాజు పాలికరిగి సత్యవతిని శంతనునకిమ్మను టయు నతండు సంతసించి యొప్పటిభంగి సమయంబుఁ దెల్పిన దేవవ్రతుం డిట్లనియె.

చ. వినుమిఁక వేయునేల? గురువృత్తికి నేసమయంబుఁ జేసితిన్
ఘనముగ నీతలోదరికిఁ గల్గినబాలుఁడు రాజుభూమికిన్
జనులకుమాకునెల్లరకు సత్యముఁబల్కితి నొండుగల్గునే
మనమున శంకదక్కుమనుమాటకునందఱుపొంగిరెంతయున్.

కం. అనిపల్కిన దేవవ్రతుఁ
గనియిట్లను దాశరాజు కడుఁబ్రియమున నో
యనఘా! భావిభవత్సుతు
లనయమునియట్లు నడపనగుదురె? యనుడున్.

ఆ.వె. ఏనుబ్రహ్మచర్య మూనెదనదినాకు
గలదుభావ్యమనుచుఁ బలికిసత్య
వతినిఁదండ్రికిచ్చు కతమున రాజ్యము
మాని బ్రహ్మచర్య మూనెనతఁడు.

వ. ఇట్లు సమయంబుఁజేసిన దేవవ్రతు సత్యమునకు మెచ్చి వేల్పులతనిమీఁదఁ బుష్పవృష్టిఁగురిసి భీష్ముండని పొగడిరంత దాశరాజు కూఁతునొసంగినఁ దోడితెచ్చి శంతనునకుఁ బరిణయం బుఁజేసె. కొడుకు వ్రతంబునకుమెచ్చి స్వేచ్ఛామరణంబుగా శం తనుండు వరంబిచ్చెనని చెప్పిన సత్యవతికి మత్స్యగంధియనను చెల్లె మిగతంబున గలిగెననుటయు మునులు సూతుంజిట్లనియె

కం. ఉపరిచరవసువు నాఁదగు
నృపవర్యుం డేపఁగు దిశల నిజకీర్తి లతన్
విపులస్థితిఁ బ్రాకఁగ ధా
త్రిపయినతని పురము దగు నధిష్ఠానమనన్.

వ. ఆనగర ప్రాంతంబున శుక్తిమతియను నది యొక్కనాఁడు కోలాహలంబను పర్వతంబు క్రీడింపఁ దనుపద్రవంబు సహింపక యారాజు బాయఁజిమ్ముటయు నంతనయ్యేటివలన వసుపదుండను సుతుండును గిరికయను సుతయును గలిగిన.

గీ. ఉపరిచరవసుండు నొక్కెడ మృగయార్థ
మేఁగియా ధరాధరేంద్రికన్య
నచటఁ గాంచి మోహితాత్ముఁడై వరియించి
యిష్టగతుల నుండె నెసక మెసఁగ.

వ. ఇట్లుండి కొండొకనాఁడు వేఁటవేడుక లవనంబునకరిగి య గిరికం దలంచి మదనావేశంబున రేతస్స్థలన బగుటయు నది పర్ణపుటంబునఁ బెట్టి డేగయాకు కంగట్టి ఋతుమతియగు గిరికకిమ్మని పంచిన శ్యేనంబు పఱతెంచు నెడ వేఱొక్క డేగయామిషంబను బుద్ధినొడచుటయును ద్రోణిస్థిత రేతంబు యమునానదింబడిన మున్ను బ్రహ్మశాపంబున నద్రికయనునచ్చర మీనంబై యానదినుండుటం జేసి తద్రేతంబు గ్రహించి గర్భంబు ధరించె నంత

సీ. జాలరుల్ మత్స్యసంచయముల యమునలోఁ
బట్టుచో నమ్మీను వలను దగుల
దానినిఁ గొని తెచ్చి దాశరాజున కిడ్డ
సూదముఁడు విశసింప సుతుఁడు సుతయుఁ

దద్గర్భముననుండ దాశరాజునువారిఁ
బెనిచెనిజాత్మజ ప్రీతిఁదనర
మీనముశాప మమ్మెయిఁబాసియచ్చర
యగుచుదివంబున కరిగెనిట్లు

ఆ. వె. మత్స్యమునకుఁబుట్టి మరిమత్స్యగంధంబు
గలిగెఁగన్యకట్టి కతనమత్స్య
గంధియంచుఁబేరు గావించియమునను
నావనడపఁజేసె నావిభుండు.

వ. ఇట్లు మత్స్యగంధి తండ్రిపంపున యమున నోడనడపు
చుండునెడఁ బరాశరుండువచ్చి

ఉ. దానివయోవిలాసములఁ దద్దయుమన్మథమత్తచిత్తుఁడై
మౌనివరుండునుందనదు మానసమింతికిఁదెల్పనంత న
మ్మానిని బల్కునో సుగుణమండన! జాలరిదాన జూడనా
మేనును నీచువల్పును నమేయచరిత్రుఁబుమీకునర్హనే?

గీ. ఇదియుఁ గాకపురుషు నెనసిన నాదుక
న్యాత్వహానియగు ననర్హనవుడు
నాదుతండ్రి గినియు నావుడమ్మానిని
మాటకలరిపలికె మౌనివరుఁడు.

వ. మదీయ సమాగమంబున నీకుఁగన్యాత్వంబు దూషితం
బు గానేరదు వసురాజవీర్యంబునఁ జనియించితివి.గాని నీచకులజ
వుగావుఁ భవదీయశరీరంబు మదీయానుగ్రహంబున సుగంధబం
ధురంబును నగునని ప్రసాదించిన నట్లనయగుట గంధవతియును

యోజనగంధియు ననునామంబులు గలిగె. ఇట్లు సత్యవతి నొడంబఱిచి యమ్మహాత్ముండు తపఃప్రభావంబున సంధతమసం బుఁగావించి యమునాద్వీపంబున దానితోడఁ గామసుఖంబునం దేలి కోరిన వరంబిచ్చి చనిన సద్యోగర్భంబున నత్తన్వికి వేదమయుండును, జటాజిన దండకమండలు ధరుండును కృష్ణ వర్ణుండు నగు వ్యాసుండు పుట్టె. ద్వీపంబున జనించు కతంబున ద్వైపాయనుండనందగె. ఇట్లుదయించి తల్లికి మ్రొక్కి మీకు పనిగలుగునప్పుడు నన్నుఁ దలంచిన వచ్చెదనని పోయి తపోవనంబునకుం జనియె నా సత్యవతికి శంతనువలనఁ జిత్రాంగద విచిత్ర వీర్యులు గలిగిరంత.

క. వారలు నిరూఢయౌవను
లై రాజిలుచున్న మున్న నా శంతనుఁడున్
వారక మృతిఁ గన భీష్ముఁడు
ధీరు విచిత్రాంగదుని విధించెన్ బతిగాన్.

మ. అతఁడా భీష్ముని సంపునన్ నిఖిల రాజ్యం బేలుచున్ గర్వితా
మతి నెవ్వారల మెచ్చఁడయ్యెఁ బటు దుర్మానంబుచే దేవతా
తతులం దైత్యులసిద్ధసాధ్యముఖ గంధర్వాదులన్ గ్రొవ్వియు
న్నతి నాక్షేపము చేసి పల్కెనని గంధర్వుండు చంపెన్ వెసన్.

వ. చిత్రాంగదుండట్లు మృతుండగుటయు దేవవ్రతుండు విచిత్ర వీర్యుని రాజ్యాభిషిక్తుం జేసి స్వయంవరంబున సాల్వ ప్రముఖరాజులఁ బరాజితులం గావించి కాశీరాజు కూతుల మువ్వురం దెచ్చి

వివాహంబుసేయ సమకట్టు నవసరంబున నందక్కన్యల కగ్రకన్య గాంగేయున కిట్లనియె.

ఆ. సాల్వపతికిమున్ను జనకుఁడు నన్నిచ్చె
నాకు నతనియందు నరవరేణ్య
కలదు ప్రీతియతఁడు కామించె నన్నును
ధర్మమూర్తి విడియుఁ దలఁపఁదగును.

వ. అని పలికిన భీష్ముండు దానిని సాల్వున కిచ్చిపుచ్చి తక్కిన యంబికాంబాలికల నిర్వుఱ విచిత్రవీర్యునకు వివాహంబుచేసిన.

చ. తనరఁగరాజ్యపాలనము దక్కిదినంబు విచిత్రవీర్యుఁడా
వనితలతోడ నిష్టమగు నైఖరిఁగ్రీడలు సల్పిసల్పియం
తనుబహుకామభోగమునఁ దద్దయుమేను గృశించిచచ్చెనా
తనికి నొనర్చెభీష్ముఁడు నుదారగతిం బరలోకసత్క్రియల్.

వ. ఇట్లు శుచిసపనయించి శోకార్ణవ మగ్నులగు తల్లిని మరదం డ్రను నాశ్వాసించి అరాజకంబగు పుడమి చెడకుండ నేలుచున్న దేవవ్రతునకు సత్యవతి యిట్లనియె.

చ. వనజజుఁడాదిగాఁదెగక వచ్చినశంతను వంశమిట్టులో
యనఘచరిత్రనేటితుది కంతముసేరఁగ నయ్యోఁగావునన్
దనరఁగనీవెఱుంగనిది ధర్మమువులేదు ధరిత్రినేలుచున్
తనయులఁగాంచుమన్వయముదద్దయునుంబ్రబలంగనావుమున్.

ఉ. వారకనిట్లు బల్కఁదగవా జననీమును నీవివాహమిం
పారఁగసేయుఁగా జనకు నర్థముఁబట్టిన సువ్రతంబునే

ఘోరుఁడ వీటఁబుచ్చుమని పొల్పుగచంద్రుఁడు చండభానుఁడున్
తారొగిశైత్య తేజములఁ దక్కఁగనేఁటియు మానవేర్తునే.

ఆ. అఖిలధర్మవేది వంటివి నిక్కంబు
ధర్మమొకటిగలదు దానిబోలు
నేనిసేయుమట్టు లేనిశంతనువంశ
మంబశాశ్వతంబ యగుచు వెలయు.

వ. అది యెట్లంటేని మున్ను భార్గవునిచే నాబాలవృద్ధంబుగా నిఖిలక్షత్రియ చయం బంతంబగుడుఁ దద్వంశప్రవృద్ధికిఁ దత్సతీజనంబు సందు ధర్మవిధంబునఁబూజ్యులగువిప్రులసంతానంబుఁగలిగించిరి. వెండియు భవ్యుండనునుచిపత్నిమమత యనునాని గర్భిణిని బృహస్పతి యభిలషించినఁ దద్గర్భస్థుఁడిది ధర్మవిరుద్ధంబని యాక్రోశింప నలిగి బృహస్పతియు నాకప్రియంబుచేసితివి గావున దీర్ఘతమంబునఁ బెరయుమని శపించిఁ నానినువు దీర్ఘతముండై పుట్టి నిఖిల వేదవేదాంగంబులు గఱచి జాత్యంధుండయ్యును విద్యాబలంబున ప్రద్వేషిణియను దాని వివాహంబై గౌతమాదులగు పుత్త్రులననేకులఁగాంచిన నది లబ్ధపుత్త్రియై పతిని మెచ్చకుండిన దత్కారణంబడిగిన దీర్ఘతమునకు నది యిట్లనియె.

సీ. నిన్నెల్లకాలంబు నేభరించితిగాని
నను నీభరించు టెన్నండు లేదు
గావుననోపనెక్కడి కేనిఁబొమ్మనా
విని దీర్ఘతముఁడల్గి వెలఁదులకును

పటుశాపమిచ్చెను పతిహీనలగుసతుల్
మాంగల్యరహితలై మఱఁగనంతఁ
బ్రద్వేషిణియునల్గి పతిసుపుత్త్రులచేతఁ
గట్టియఁలనుగూడఁ గట్టిగంగ

గీ. మొనసిత్రోయింప దీర్ఘతముండు నీటి
వడినిబహుదేశములుదాటి వచ్చుచుండె
నొక్కచోటను బలియను నుర్వీశ్వరుఁడు
గంగనిరాడ నేతెంచి కాంచెనతని.

వ. ఇట్లుదాత్తానుదాత్త స్వరిత ప్రచయస్వరంబు లేర్పడ వేదంబు చదువుచుఁ బ్రవాహముఖంబునఁ దీరంబునకు వచ్చిన మునిం గని తన్నెఱింగించి నమస్కరించి పూజించి మహాత్మా! మదీయ పుణ్యంబునఁజేసివచ్చితిరి గావున నపుత్త్రకుండనగు నాకు పుత్త్రులం బ్రసాదింపుండని ప్రార్థించి తనభార్య సుధేష్ణయను దానిని సమర్పించిన నాకొమ్మ యాగ్రుడ్డిముదుసలిని రోసి దాది కూతుం బనుచుటయు గక్షీవాదులన నేకాదశ పుత్త్రులంబుట్టించి వీరు భవత్పుత్రులుగారని తెలిపిన వెండియు బలియమ్మునిం బ్రార్థించి సుధేష్ణఁబుజ్జగించి పంచినఁ దదనుగ్రహంబున వంశకరుండగు సుతుండుగలిగె నిట్లు బ్రాహ్మణులవలన వంశకరులగు క్షత్త్రియులనేకులుగలరు. జగత్పావనుండగు బ్రాహ్మణుండు విచిత్రవీర్యుని క్షేత్రంబుల సంతతిఁ గలిగింప నుచితంబని గాంగేయుండు చెప్పెన.

వ. ప్రియములగా సత్యవతి భీష్మునకున్ వ్యాసుజన్మమున్
నయమునఁ దెల్పి నాఁటను మహర్షిని నొందికొనవా
ప్రియకరుఁడమ్మహాత్ముఁడకు వాఁడు భ... నయముఁ బ్రేమతోన్
నయము ననాత్మ సత్యవతి గాంతి యమ్ముని సంస్మరించినన్.
చ. నీలస్వచ్ఛతనుద్యుతుల్ గలయ నెంతేవిమ్మపింగ్లగా
శాలాకాంశుసమానపింగళ జటాభారప్రభల్ జిమ్మయున్
వాలాయంబును దండకుండికలు దై వారంగ ద్వైపాయనుం
డాలీలంబఱ తెంచి తల్లికడ సమ్యక్సత్క్రియంబొల్చినన్.
శా. ఆయంభోజభవోపమానుఁడగు పుత్త్రాగ్రేసరుంజూచి వే
డాయం జేరికరంబు సత్యవతి వేడ్కం బల్కు నెన్ దేవర
న్యాయం బొప్పవిచిత్రవీర్యుని సముద్యత్ క్షేత్రయుగ్మంబునం
దోయయ్య! తగు సంతతింగలుగఁగా నూహింపవే నెమ్మదిన్.
ఆ. భీష్ముఁడొనరతండ్రి ప్రీతికిబ్రహ్మచ
ర్యంబుఁబూనెఁగాన యనఘనీదు
కతనవెలయవలయుఁ గౌరవవంశంబు
వసుధనింకమాని వర్యనిజము.

వ. అని యిట్లు సత్యవతి కృష్ణద్వైపాయనునిఁ బ్రార్థించి యంబికయను దనకోడలి నొడంబఱచి రాత్రియగుటయుఁ దాని తల్పంబునకు నమ్మునీంద్రుండు జనయిత్రి నియోగంబున నరుగునంత.

ఉ. బూచినిఁబోలియున్న మునిపుంగవునయ్యెడఁ జూచి భీతయై
రాచవెలందికన్నులు గరంబుమొగిడ్చి తదీయసేవఁగా

మోచితభోగముల్ నెఱపి యుజ్జ్వలుఁడాయన పుత్త్రిదానమ
స్థాచెలికిచ్చి సత్యవతి కల్గఁ సిట్లను నంచితస్థితిక్.

ఆ. తల్లిదీనికి కొమరుండు బల్లిదుండు
జననమందును మాతృదోషంబువలన
వాఁడుజాత్యంధుఁడన సత్యవతివిషాద
మొందియొక్కింత విన్ననై యుండెనంత.

వ. వెండియు వ్యాసభట్టారకునిఁ బ్రార్థించి యంబాలిక యందొక్కనిఁ బడయుమని నియోగించి పంచిననదియును నమ్ముని యాకారంబునకు వెఱచి వెలవెలం బోవుచుండ నతండు దానికి పుత్త్రిదానంబుచేసి బలపరాక్రమ నిధియును వంశకరుండునునగు కొడుకుపుట్టును, మాతృదోషంబున పాండుదేహుండగునని చెప్పి ద్వైపాయనుండరిగిన తదనంతరంబ యంబికాంబాలికలకుఁ గలిగిన ధృతరాష్ట్ర పాండుకుమారులు భీష్మనిర్వర్తిత జాతకర్మ కలాపులునై ప్రవర్ధమానులగుచు నున్నెడజాత్యంధుండగు ధృతరాష్ట్రునిఁజూచి సత్యవతి విషణ్ణయై వ్యాసుందలంచిన.

ఉ. క్రన్నన వ్యాసునిందలఁపగా నవుడాతఁడువచ్చి తల్లినిక్
నన్ను దలంచు టేమిపని నావిని యంబిక కగ్రపుత్త్రకుం
డెన్న మహాంధుఁడయ్యెఁ దగనింకొకనిక్ బలరూపశౌర్య సం
పన్ను నొసంగుమంచు నొగిఁ బ్రార్థనసేసియునాత్మజంబునక్

వ. ఎప్పంటియట్ల కోడలి నొడంబఱచుటయు నది యతని వికృతాకారంబునకు రోసి తన దాది నలంకృతంజేసి తల్పంబున నుంచిన వ్యాసుండు దాని నిష్టోపభోగంబులం దృప్తుండై పుత్రి

దానంబుచేసి చనియె. నాదాదికి యముండు పుత్త్రుండై పుట్టె
నని చెప్పిన విని సూతునకు మునులిట్లనిరి.

క. ఏమికతంబున శమనుఁడు
   భూమిపయిఁ శూద్రయోనిఁ బుట్టెనొకో నా
   నామునులకు సూతుఁడు గను
   ప్రేమముదనరార నిట్లు వినిపించెఁ దగన్.

సీ. వినరయ్య మాండవ్యుఁడనెడు బ్రహ్మర్షి దా
   మౌనవ్రతంబొగిఁ బూని తపము
   గావింపుచుండ చెంగటినగరంబున
   ముచ్చులు నృపునిల్లు ముచ్చిలించి
   యరుదేర వారల యారెకుల్ వెన్నాడి
   పఱతేరఁజూచి తస్కరులు వెఱచి
   మునివరు నాశ్రమంబున డాఁగిరంత నా
   యారెకులప్పుడ యటకువచ్చి

గీ. సంయమినిదొంగ లేగిన జాడవేఁడ
   నతఁడు మౌనవ్రతమున నొండాడడయ్యె
   వారలచటన చోరులవల నెఱింగి
   ధనముతోఁ బట్టికొనివచ్చి తపసిఁజూచి.

ఆ. తపసివేషధారి తాపికాఁడితఁడు
   దొంగబంట్లకంచుఁ దోడమునిని
   బట్టితెచ్చి భూమిపతి కప్పగించిన
   పుడమివిభుఁడు నలుక బొడమి యపుడు.

వ. తెక్కలికాండ్రఁ బంపించి మాండవ్యుని తనపురప్రాంతం బున శూలంబున నెక్కించె నిట్లుండియుఁ దలఁకక తపంబు సేయు మాండవ్యుపాలి కొకనాటిరాత్రి మహామును లరుదెంచి మహాత్మా ! యిట్టి దుర్దశ నీ కేమికతంబునఁ బ్రాపించెనని యడిగిన వారి కతం డిట్లనియె.

సీ. తెలిసియు నన్ను మీరలు దగ నడిగెద
రైనఁ జెప్పెద విను డనఘులార
తనకుఁదాఁగర్త గాకను పరులగుదు రే
కడు సుఖ దుఃఖముల్ కర్మవశత
నరుఁడొందునని తెల్ప నగరరక్షకులు త
ద్వాక్యముల్ నృపునకు వరుసఁజెప్ప
నృపతి విషణ్ణుఁడై యేతెంచి మునివర
యపరాధమిది సైపుమంచు వేడి

గీ. కొఱ్ఱుదిగిచివైవఁ గూడక మెత్తన
నఱికివైచెఁ గొంతనెఱిపి కంఠ
పార్శ్వమునననిల్పె బ్రహ్మర్షి కదిగోలెఁ
బరగెజగమునందు నరిది పేరు.

వ. ఇట్లు తం డు చాసమాండవ్యుండనఁ బ్రసిద్ధుం డగుచుండి యొక్కనాఁడు శమనుపాలి కరిగి యేమికతంబునఁ దనకిట్టిదారుణ దండంబు సంభవించెనని యడిగిన యముండిట్లనియె.

క. అలఘుగుణనీవు పిన్నవు
డలయకతూనీఁగలను నయుం బేదియు గొ

శూలంబెట్టితి వదిగావునఁ
గలిగెను ధర్మునకు శూద్రగర్భంబునందున్.

క. ఆ వృషుఁ గోపము మీఱఁగఁ
గనుఁగొని యమునాలుఁ గేల్మోడ్చి కృపాంభోధియను నా
డనఘు రొనర్చిన దురితము
ఘనమగు దురితంబుగాదు గావున శంకన్.

వ. చతుర్దశ వర్షంబుల పర్యంతంబు పురుషుఁ డెఱుఁగమిఁ
బున శైశవంబునఁ జేసినపాపంబుఁ బెద్దయుఁ బెరయనేరదిది మర్యా
దయగు నిదియునుగాక నీవు బ్రాహ్మణుఁ జేసి దండంబు దక్కఁ దారుణ
దండంబుఁ జేసితి కావున మర్త్యంబున శూద్రయోనిం బుట్టుమని
శపించి చనియె. దానంజేసి ధర్ముండు వ్యాసువలన విదురుండై
పుట్టె నంత భీష్ముండు ధృతరాష్ట్రునకు సుబలరాజతనూజను వి
వాహంబొనర్చె నిట్లున్నదమ్ములును వైభవంబుల గాంగేయు
శిక్షుంబెరసి సకలసంపత్కరంబగు కరిపురంబున నుండిరంత.

క. అతిశయముగు నవ్వారి కధి
పతి వితతయశుండు విమతభంజనుఁడు గుణా
న్వితుఁడయి యలరారుచు నా
ధృతరాష్ట్రుఁడయ్యె బాహుధృతరాష్ట్రుఁడనన్.

సీ. పెదతండ్రియైనట్టి భీష్ముఁడె తోడుగఁ
దెలివిచేఁ దీర్పుల దిద్దుచుండఁ
బ్రీతిబాహ్లికముఖ జ్ఞాతిరాజేంద్రులు
సామాజికత్వంబు సంఘటింప

లలిఁగృపముఖ్యవిప్రులు ధనుర్వేదాది
కవిలశాస్త్రప్రసంగములు గడప
వెఱపునఁ దమ్ముఁడా విదురుండు నిఖిల నీ
తి ప్రపంచంబెల్ల దెలియఁజెప్ప.

గీ. సారిది తనధర్మపత్నియా సుబలరాజ
తనయయెడఁ బాయకెప్పుడు తగిలికొలువ
నెఱిసి జాత్యంధుఁడయ్యుఁ గొఱంతలేక
పరగెఁ బ్రజ్ఞాదృశుండైన పౌరవుండు.

చ. అతిసికితోడనీడబలెనంటి సహోదరుఁడైన పాండుభూ
పతి తతశౌర్యశాలి తనపాలనచేఁ బ్రజలుల్లసిల్ల ది
క్పతులజయించి రాజులిడుకప్పము లన్నకునిచ్చుచుం యశ
స్సితరుచినించె లోకములు జెందుటకై నిజనామవాచ్యతన్.

మ. పరమాశ్చర్యతపస్సమాధినిధి పిభాత్రిజత్తనుండా పరా
శరజుండున్ జననీనిదేశమున నీషన్మిత్రతాత్మన్ సహో
దరుఁడైనట్టి విచిత్రవీర్యసతి యుద్యన్మూర్తిఁ యంబాలికా
తరుణీరత్నమునందు నెవ్వనిఁ గనెన్ ధాత్రీతలంబేలగన్.

గీ. అట్టియారాజు తా పాండుఁడైనగాని
నిఖిలమనురక్తముగజేసె నిజగుణమున
చిత్రము చరిత్రమరయ జగత్త్రియమున
జనమునందెవ్వఁడే నుతిసల్పమాను.

చ. అతులాంతర్భవదేక కృష్ణమృగచర్మాంకంబులై నిర్మలో
ద్ధతులౌ పాండునృపాలు షోడశమహాదానోల్లసత్కీర్తిఁ వి

స్ఫృతఖండంబులఁగూడఁ జంద్రుఁడయి మించెన్ బ్రహ్మచేతన్ సద
త్పతిలోసితెఁడు బుట్టెనంచు ననువాక్తల్ మిథ్యలౌనాఁడఁగన్

శా. నానాదీనశరణ్యుఁ డుజ్జ్వలగుణేంద్రప్రౌఢి సచ్చంద్రముం
డౌనాపాండువిభుండు వాస్తమున హస్తాగ్రంబునందున్ బరి
శ్రీనాశ్రీని సముద్రకాంచియగు ధాత్రిన్ విష్ణువట్లం జయ
శ్రీనాకుంతి సముద్రకాంచియగు మాద్రికన్యకం బెండ్లియైనన్.

వ. ఇట్లు పరిణయంబై సుఖోపలాలితుండగుచు నొక్కనాఁడు మృగయావినోద కౌతుకోపచీయమానమానసుండై యున్నతశ్వో రుండు శశాంకరుచి సంకాశంబును విశ్వాతిశయంబును రయవిజిత గంధవహంబును నగు గంధర్వంబున నధివసించి పార్శ్వంబుల న నేక వాగురోపకరణానురోధులైన యోధులరుదేర వినయవివేక సంపన్నులైన పృథామాద్రులతోఁ జను ననుపిద్ధపిద్ధగణగణనీయమహి మంబరఁగు హిమవత్ప్రాంత దురంతకాంతార వీథిం బ్రవేశించి యచ్చట నతండు

క. క్షుల్లకనవవనమల్లీ
సల్లలిత లతావితాన సక్తోద్వేల్ల
త్ఫుల్లసుమ సమధిక సుధ
మిల్లుఁడు దృఢబద్ధమధ్యమ్మృదు వసనుండున్

క. తుంగనిషంగా సంగో
త్తుంగిత భుజబలుఁడు సకలదుర్జన హారణా
భంగశరాసనుఁడై సుర
పుంగవ నిభుఁ డఖిలమృగసమూహముఁ గఁడకన్.

వ. కాసిన నారికేళఫలకుఁ బక్షులెత్తుచు

గీ. అమ్మహీపతిచెంతల ననుసరించి
సంచరింపుచు నున్నట్టి సతులదృష్టి
శోభ గెలువంగఁ బఱతెంచు చొప్పుతనరఁ
జేరు నంతంత ముందట జింకతుటుము.

చ. అనయము నిష్కళంకుని మదన్వయకర్తఁ శశింగలంకయుం
క్తునిఁగ నొనర్చె నీహరిణకోటుల నొక్కటిగాన వీనినే
దునుమక పోవసంచుఁ గనుదుస్సహరోషము బూనినట్లనా
జనపతిబాణజాలముల సారె కురంగములన్ దెరల్చియున్.

సీ. అంతంతముందర నతిశయంబుగఁ బడ్డ
బలువెను మెకముల ములువరాహ
కులముఁ బ్రవర్తించు ఘోరకాననసీమ
దెఱఁగుసూచింప నప్పినదల్చి
చొచ్చి పల్వలపంక శోభితమును సర్వ
మృగరవాసహ మానమగుతురంగ
మును వేగడిగ్గి యాజనపతి క్రోధియై
భూదారశబ్దంబు పోత్రిములకుఁ

గీ. దగునె భూదారుఁడెవ్వఁడు తానుదక్ష
కమసమాఖ్యయడం చెదఁగాక యనుచుఁ
బొడవెనుమాడ్కి నప్పుడప్పుడమిఱేఁడు
కిరులఁ దునుమాడె శరపరంపరలతోడ

గని తజ్జ్వక్త్రముమున్ను పంచత యిఁకన్ గాయంబులన్ జేయుదే
నని పంచత్వము నొందఁజేసె విశిఖోగ్రాంచద్దవజ్వాలలన్

వ. ఇట్లు సకల మృగాధినాథయూథంబుల సమయింపుచు

సీ. పేరెండదవిలి చిప్పిలుచిఱుచెమటచే
వదనంబు హిమసిక్తవారిజంబు
సొంపు సంపాదింప సుడిగొన్నవడచేత
తను లతశ్యామమై తనరుచుండ
వేడి నిట్టూర్పులు వెడలవాతెఱయెండి
తగదొట్టి యఁమియంగ దప్పిముదేక
కందోయి గాడ్పులఁ గట్టెఱ్ఱదొరసి మూ
సినవెచ్చ వెచ్చనై మొనయుచుండ

గీ. వేటయుంకువడప్పిన విభునియలఁత
దొలఁగహిమనగ సంభూతధూతనంద
నదుగ్రమాతత కాసారనవమరంద
సౌరభగ్రాహమారుత సమితివిసరె

వ. అంత నిశాకాంత కాంతసంతానావతంసుండగు సప్తాంశు సప్తసంసహో ఖండలుండు శకుంతరవ నిరంతర దిగంత రంబును, నిఖిలమృగకుల శరణ్యంబును, నగు మహారణ్యంబవతరణంబుఁ జేసి విచిత్రతర తనూరుహ చిత్రబిందువులు తారకాకారంబులతోరంబగు మిన్నువిఱిగి మీఁదంబడు వడువుఁదెలుప నెడనెడ నిలిచి మెడ మరలిచి దెసలుచూచుచు పుడమి చలింప గుభగుభదుముకుచు విడుచు, తడబడక కదువడి గమ

వించు నొక్క చక్కని చక్కి చమూరు వెంటనంటి కొంటని తమకంబున తురగఖురపతనోద్ధత ధరణీ పరాగ పరిధూసరితదిఙ్మండలంబుఁ జిమ్మచీకట్లు ముప్పిరిగొని కప్పికొనఁ జరించని మంజులకుంజపుంజంబుల సంగతి సభంగానంగసంగర శృంగార సుఖసనాథం బగు హారిణ మిథునంబు నయనపథంబునంబడిన.

ఉ. పాండుమహాధవుండు రతిఁబాయక యమ్మిథునంబులోన ను
ద్దండతపోభిరక్తిని వినాశ్యవశంబున నంతనొక్క బల్
కాండము చేతఁ గూల్పఁబడి క్రచ్చఱపడ్డ కురంగ దేహము
త్తుండనధీరగాత్రముఁ గొబ్బున నై మునిరూపుఁ జూపుచున్

సీ. కిందముమునియంతఁ గృపమాలి ధృతిఁమాలి
యొడలకన్పగిలెడి యుసురునల్ల
జొడజొడరాలంగఁ జూచి ప్రణయకాల
చండమూర్తాంగుని చందమునను
మండి యోరిదురాత్మ మనునేఁటికేసితి
వడవిమృగముల ననుకరించి
క్రీడింపనీకేమి కీడయ్యె మాచేత
ననవద్యమగువాని నడఁపఁదగునె

గీ. కాన నీసతిరతిసుఖంబానుదెప్ప
డప్పుడీల్గుమటంచు ధరాధిపతికి
జంభభేది మహాశనిచాఱ్పుఁ దనరు
శాపమిడి ప్రాణవాయువు లాపలేక.

సీ. నెత్తుటజొత్తిల్ల నెఱిభూతిమేనెల్ల
నాపాటలద్యుతి నతిశయిల్ల
నిడుపుకెంజడ చుట్టముడివీడి పొడవెట్ట
దురునుగాడ్పులచేత దుమ్మెదట్ట
చలువలెక్కఁగ సొమ్మసిలినరిమ్ములుపమ్మ
కన్నులచీకట్లు కారుక్రమ్మ
మెలుఁగుమందముసేయ బలువుగాఁగ్రిమిడాయ
వివిధరవ బుల విసికిబాయ

గీ. ఆవులించి దిశల్ దృష్టినాక్రమించి
నీరుకన్నులనించి దుర్నీతిడించి
జాగ్రతవహించి జగదీశ్వరుఁ దలంచు
హా! గురుస్వామియంచు దేహంబువదలె.

చ. కురువృషభుండు మానికులకుంజరుపాటును వజ్రతుల్యమా
పరుసపుశాసమున్ భయముఁబొటిలఁజూచియు నాలకించి లో
నురువురిఁ జొక్కి వెక్కసము నూర్పును శోకమునందడింపఁగా
ధరణితలంబునంబడియు ధైర్యమొకించుక చిక్కఁబట్టుచున్.

క. శాపంబును పాపంబును
నాపాలంబడియెనింక నగరంబునకే
రూపుసఁ జనుదని పౌరవ
భూపాలుఁడు తనదుమదిని బొసఁగఁ దలంచెన్.

గీ. శాపసంతప్తుఁడై రాజసత్తముండు
వెలయు చతురంగబలముల వీటికనిచి

తగినసప్తాంగరాజ్యంబు తానుసించి
మౌనిమై నిజసతులతో కానసుండె.

క. అష్టాంగయోగములచే
శిష్టుండై కందమూల సిద్ధాశనుఁడై
యిష్టాలయమడవియు ని
ర్దుష్టాసనమలరె దర్భతో నృపమౌళికిన్.

చ. జనముని నాయకోత్తముల చారుచరిత్రఫలంబు లొక్కటై
తనరె పరస్పరప్రహితదారుణ శాపశరాహతుల్ విము
క్తనిజపురస్థితుల్ పరహితస్థిరచారు లుదారశీలురున్
ఘనసవభూతి భాసురుల ఖండశరద్విజ రాజసంతతుల్.

వ. వెండియు బాండుమహీమండలాఖండలుండు కొండొక
కాలంబు చను నవసరంబున.

గీ. పత్యభావపు భువనము పాటిఁదలఁచి
తగ నపత్యము గాంచ నద్ధరణి విభుఁడు
చతుర మతిమీరఁగాఁబృథా సతినిజూచి
యుచితరీతినిబల్కెఁ దానొక్కనాఁడు.

సీ. సర్వసర్వంసహా చక్రమేలినతన
కక్కటా దుర్గతి యనుభవింప
వలసె నమ్మునిశాప వశమున నెట్లన్న
నిఖిల ఫలంబులు నిజముగతిని
జేర్పనేరవు సుతస్థితి లేని వానికి
విదితమై యున్నది వేదసరణి

ధరఁజేలోపలన పుత్త్రిస్యగతి ర్నాస్తి
యనుచుఁ గావున నిప్డు డబల వినుము
గీ. నీమగాత్రము బుధబోధ నిర్మలంబు
కుముదబాంధవ సంబంధి కురుకులంబు
గానసంతాన హీనతఁ గాంచనేల
పుత్త్రిసంప్రాప్తి నీయందు పొందఁగలదు.
క. బ్రతికిఁ బలెఁబర లోకము
మృతిఁబొందినఁ దనకుసాధ్య మిఁకఁగాదుసుమీ
శ్రుతిసిద్ధము పుత్త్రికులకు
నతిశయముగ బలము విధియు నారయఁగలదే.
ఉ. తాతయటంచుఁ జిప్పిలు వితంపుపదంబులు తొట్రుపాటుగాఁ
జేతులుసాచి యెత్తికొనఁ జిక్కనిచక్కెర వో లపార్థ వా
గ్జాతము పృచ్ఛచేఁబలికి శైశవవేళ నటించునాతనూ
జాతుశిరంబుమూర్కొనుచు సమ్మతిఁజెందుదురెల్లపుణ్యులున్
క. నిరపత్యధనుండగునా
పురుషుని బిత్రుస ప్తకంబుఁ బోనాడలఁతన్
ధర తెరవరిచేఁ దిట్టున
బరువడిఁబడు గొడ్డుమాత్రిని పగిదినిసాధ్వీ.
క. సంతాన విహీనంబగు
సంతానము నట్ల ధనము సరియయ్యెను నే
చింతిల్లెద దాతాయనఁ
గాంతునొకో యొక్కనాఁడు గడుఁగొడుకననగన్.

ఉ. భోగము దానమున్ యశము పుణ్యము నైభవమా శతక్షమా
రాగము చారుచంపక విరాజిత భాగ్యములావిరాగవిం
కేగతిఁ జూచినన్ గలవె యింతి ! ముఖేం [illegible] తీవరో
పాగత శాపతప్తుఁడు సమ్భృతుఁగాంచి హరించు మేములన్.

సీ. ఇట్లు సంకోచత్వ మేపార వగఁజెందు
విభునిముందర యనుపేదకన్య
ననుసిగ్గునెమ్మొగంబున నామతింపంగ
రాజేంద్ర వినుము దుర్వాసమౌని
బ్రహ్మకల్పుఁడు తపఃపటిమకార్శ్యాంగంబు
ప్రత్యూషరవికాంత భాసమాన
మగుకాంతి యాశాంత మాక్రమింప ముదేయు
జనకుని సన్నిధి సలిపెనంత

గీ. చెలఁగి యతని బ్రసన్నునిఁ జేసి తనదు
నందనోద్యానమున నుండఁ బొందు పరచి
జవ్వనంబునఁదనరు నన్నవ్వయనుచుఁ
బిలిచి సేవకు నొనరించెఁ బ్రేమ దొలఁక.

వ. అంత

క. ఘనయత్నముచే నేనా
మునిపతి సమయంబు లెఱిఁగి ముదమున పను తె
ల్లను మానక కనుసన్ననె
వనఖేలాదికము మాని వర్తించునెడన్.

క. వేసవి సీటం దడిపిన
భాసిల్లెడు తీవె భంగి బటుగతితో దు
ర్వాసమునీంద్రుని చెంత వి
కాసముగాఁ దనదు భక్తిఘనలత యొప్పెన్.

క. ఘనతపమునఁ గృశుఁడగు నా
మునికి సరూపంబుగాఁగ మనుకొనుమాడ్కిన్
దినదినమున శేషములై
తనయంగములధికఁ గృశతఁదనరుచునొప్పెన్.

చ. జలములు దర్భలిధ్మములు చారుసుమాదిక మాదిగా మహో
జ్జ్వలుఁడగు తాపసాధిపుని సన్నిధిసమ్మతిమీర నిల్పుచున్
జెలువుగఁ గొల్చుచున్న ననుజిత్తముఁ రంజిల శిష్యభావనం
బెలయఁగఁజేసి కోపమొకడేని వహింపడు నేర్పుదప్పినన్

గీ. ఒనరఁ బరిచర్యసేయఁగా నొక్కనాఁడు
చెంతనుండఁగ నేకాంత సీమయందు
నన్నుఁగనుఁగొని నిష్ఠచేనున్నవాని
యోగనిద్రను బొందుచు వేగననియె.

చ. బాలిక! నీవొనర్చిన సపర్యవిధానము మెచ్చువచ్చె హృ
ల్లాలితపంకజాత మతులస్థితి హర్షము జెందె నీకు నో
గోల! యభీప్సితార్థములు గూర్చ నొకానొకమంత్రరాజమొం
తే లసమానరీతి నుపదేశము చేసెదనంచు నిచ్చినన్.

క. కన్నెతనంబున నుండియు
నెన్నఁడు మునీంద్రుఁడెలమి నిచ్చినమంత్రా

భ్యున్నతి మనమునఁ దలఁపుమ
పన్నగనామోదభరము పాటిలనుండన్.

మ. ఇపుడామంత్రమహాప్రభావముఁ దేవేంద్రాది బృందారకా
ధిప సందోహసమగ్రసుందర మదాంక్షిభూరి గంధర్వ ము
ఖ్యపరార్థ్య ప్రచయంబు లాత్మగుణవిఖ్యాతానురూపప్రభా
వపటిష్ఠాతతపుత్రులై తనయెడన్ బాటిల్లఁగావించెదన్.

చ. అశిథిలబంధదంతనఖరాంక సముత్పలపత్రికాప్రవా
ళ శశపదోపగూహనవిలక్షణ బిందువులాదిగాఁగఁ బు
ష్పశరమహోత్సవంబు వెలిబాటుగఁ దద్వరశక్తిసంతతిన్
విశదతఁ గాంచవచ్చు మునివిశ్రుతమైన యనుగ్రహంబునన్.

వ. అని

క. ఈగతిఁ గరుణాయతమతి
యాగుణనిధియైన కౌరవాధీశునకున్
వేగసుధాధారపృథా
వాగంచిత యైననతఁడువర్ణించె సతిన్

వ. అంత కుంతి కాంతయు ననుమతిఁబౌరవ సంతానోదయచింతనీయంబగు ప్రకృతకార్యంబవలంబించి వార్చిపూతయైమంత్రశక్తిశేమనునారాధించి తత్ప్రభావంబున గర్భావిర్భావదుర్భరయయ్యె నయ్యవసరంబున.

సీ. నునుగబ్బిచనుగుబ్బ మొన లుబ్బినలుపెక్కె
తెలిగన్నుగవ చెన్ను గలయఁబన్నె

అసదుగా నిసుమంత పసతుంపెసలమీాఱ
నిద్దమానూగారు నెలవు దెలిపె
నొడ తెల్లెడల వాడె బడలికల్ పొడసూపె
తేటగా౯జెక్కు-ళ్ళు తెలివిపొసఁగె
చవులూర వేవిళ్లు సవరించె౯గనుపించె
పాలుమాలికలు నుయ్యాలలెక్క-౯
గీ. బలుకుబడి సన్నగిలె సొమ్ముబలువుదో౯చె.
శంఖవలయంబు లంతంత జార౯దొడ౯గె
కూర్కు-సందళ్ళు నినుమడై కొమరుమిగిలె
యతివగర్భంబు బూనిన యట్టి యెడల.

క. ఈరీతిని నారీమణి
నీరెనిమిది నెలలుమోసి నెలనిండిన-చో౯
డారాతారేశ బలము
దారాజిల౯ దనయు౯గాంచె ధర్మాంశభవు౯.
వ. ఇట్లు క్రమంబున.

చ. పృథ పవమానువల్ల రిపుభీముని భీముని వాసవాంశమం
దధికబలై కదుర్జయుని యర్జును౯ గాంచె౯ ననంతరంబ త
ద్విధమునమాద్రియుంగనియె విశ్రుతకీర్తుల చారుమూర్తుల౯
బ్రథితుల నాశ్వినేయకుల పార్థివులన్ గవలన్ గ్రమంబునన్.

క. మందారవృష్టిగురిసెమి
ళిందధ్వని గలయ౯గా నిలింపేందుముఖుల్

పొందుగ నాడికి నాడికి

నందను లుదయింప నంత నానాగతులన్.

సీ. వారల జన్మోత్సవంబుఁ జూచ్చుటకై

వారిచెన్నొందెఁ గాసారములను

గడిమి నెచ్చెలి చక్రగతివాల్చ్య పోలికఁ

దనరె యాగాగ్ని ప్రదక్షిణముగఁ

దతపారిజాతసంతతిసుగంధము పూసి

గంధవాహుండు మందగతిఁ దవల్చె

చిన్నిపాయమున నిచెలిఁ గూర్చెఁ దనరిన

తలఁచిరొయొప్పిన భంగిఁ దరణి వెలఁగె

గీ. పరగపుష్పిణిగాక నే ప్రసవభూతి

నలరెసీకొమ్మ దారట్టు లగుటదలఁచు

కరణివనసీమ లతలు విస్ఫారణమిాచి

ప్రసవసంపద పొంపు పెంపెసఁగఁ దాల్చె.

వ. తదనుగుణగుణగణంబుల నభంగ శుభమయంబగు సమ
యంబున.

క. వారిజబాంధవ పంచక

మారాయనఁగలుగు తేజముల రెను సుతులన్

గారవమునఁ గని కనియెన్

గౌరవపతి నేత్రములకుఁ గలువు దోలంగన్.

ఉ. ఆనరనాథపుత్త్రికలు మహాటవియందు మునీంద్రకాంత లెం

తే నయమొప్పఁ బొల్దనివి తీరనొసంగిన దాఁవుచున్ జగ

త్రాణసుపూర్ణ కీచక విరావము జోలలు నాలకించి క
న్నానినని ద్రజెందుదురహోరాంతములన్ మృదువల్కలంబులన్.

క. చనుగుడువం గలహించెడి
తనయుల పోరుడుపఁ గొంతి తనవక్షోజం
బనిలాత్మజునకునొక్కటి
యొనరఁగ ధర్మజధనంజయుల కొకటిచ్చున్.

గీ. బాల్యమందు నిశాచర పంక్తితోడఁ
బెనఁగ గమకించునటువలె పిడికిలించి
పట్టుమాయతి హస్తముల్ పై నిగుడ్చి
కల్పితానల్ప వల్కల తల్పమునను.

వ. అంతఁ గొంతకాలంబు జనుచుండఁ గుంతీ సంతానంబు
ననుదిన ప్రవర్ధమానంబగుచు మరియును.

క. తలిదండ్రుల చెంతనుఁగర
జలజంబులు నూది జాను చంక్రమణంబుల్
సలుపుచుఁ బితృసంస్పర్శన
మలరుటకై క్రీడనేతు రబ్బాలు రొగిన్.

ఉ. జానుకృతప్రచారములు సారెకు నాశ్రమసీమసల్పున
మ్మానవనాథపుత్త్రి నతిమాంసలుఁ బావని నెత్తి మస్తకం
బానుచు మూరుకొంచుఁదమహస్తములన్ గరమొప్పఁబట్టియున్
మానులుగాళ్ళనిల్పుమని మాటికిఁ బల్కనటించునాతడున్.

చ. తనరిన వేడ్కతో ముసలి తాపసపుంగవు వేణుదండమున్
గొని పవమాన నందనుఁడు గొంకుచుకొంత చరింపఁజూచెడా

ననువగు భావిభవ్యఫలమై యొకరూపుగదా ప్రినారణాం
బనుపమలీలఁ జూపుగతి నందనకేందు కుశాగ్రహాయుఁడై

గీ. వారుమఱియును శైశవ వైభవమున
మునికుమారులతోఁ గూడి వనమునందు
ధూళిదూసరిత్రాంగులై తోఁచిరంత
మదకలభగు కంలభంబు మాడ్కి భంగి.

క. అందందు పాండునృపమణి
నందన పాదారవింద నానారేఖల్
పొందగు పాంసుస్థలములఁ
గ్రందుకొనియెఁ గులిశకేతు కలశస్థితులన్.

చ. చిఱునగవగ్గలింపఁ గనుచిన్నెలసంబున నాలవాలముల్
తెఱలిజలించు జాల్గొని యుదీర్ణకణంబులు పంక్తిగట్టువోఁ
దఱచగుమౌక్తికంబులను దాల్చ్కను విస్ఫుటహారమంచు న
చ్చెఱుతలుపూనఁబూనుమదు చేరిధరింపఁగనేర్చు పెంపునన్.

క. అతిబాల్యంబున నమృతము
గతిఁబల్కెడు నాహ్వయములగల యర్థోక్తుల్
చతురార్థోక్తి యునై విల
సిత పూర్ణాహ్వయమెభీమసేనునకయ్యెన్.

వ. అట్టియెడ నంబాలికా సంభవుండు పంచనందనాగ సంస్థా
దకత్వంబున సొంపగుపురందరు కరణిఁబంచనందనాగతవై భవంబు
న ముదంబు పూనియుండె నక్కడ ధృతరాష్ట్రునకును దుర్యోధ
నాది పుత్త్రశతంబును దుస్సలయను కూతునుంబుట్టెనంతనిక్కడ

క. అనుదిన పోషణములచేఁ
బెనుపొంది విహారగతులఁ బ్రీతినెసఁగు న
త్తనయుల లోపలఁ గుంతికి
ననురాగము మాద్రి సుతులయందధికముగున్

చ. పటుతరమైన దీవియల బాలకు లుయ్యలవేనమర్చి వి
స్ఫుటముగనొండొరుల్ గ్రమముఁబూనిమహానయమొప్పియున్విశం
కటగతి నాడుచున్నెడ నఖర్వపరాక్రముఁడైన భీముఁడో
క్కటఁదగు కేళిసల్పుటకుఁ గైకొనఁ దర్ధ్రుడవల్లికల్ చనుణ్.

వ. మరియును

సీ. వడముఁడి మున్నునేవసగంధగజమును
లంఘించి దంతంబులను వసించె
తన్మహాద్విపమును దక్కుకుమారకుల్
హస్తంబు గరములనాచిపట్టి
యనువొందఁగాఁదమకారోహణమునేతు
రట్లనేక్రీడల ననుకరించి
యీగతిమరియునవేక విధంబుల
శైశవంబొక్కింత జరుపుచుండ
గీ. పంచవర్షంబులయ్యెనబాలురకును
నీతినయములఁదగియునసీతులగుచు
సకల కళలందు నభ్యాస చతురులగుచుఁ
గీర్తి దిశలెల్ల బర్వవిస్ఫూర్తిఁ దనరి.

ఉ. యౌవనసంపదల్ దవిలి యవ్వనసంపదఁ గొల్లఁబుచ్చుచో
నావనమందు గల్గుమును లాత్మలనిట్లని వారినెంచి రా
పూవులవింటిదంట జగముల్ భ్రమగొల్పనిం జాశుగస్థితుల్
తీవిగనై దుమూర్తులు ఘటించిమెలంగెనొయంచు నెప్పుడిక్.

వ. అంత నిఖిలహరిదంతర నిరంతర వలమాన మలయ పవమాన కంపిత చంపక సంపాదిత సౌరభ సంపదనుకంపిత నిలింపపథంబును కేసరకుసుమ కేసర శిఖర భాసుర ధూళివిసర ధూసరిత దిశాపటలంబును, పంచశరవిజయ సహకార చతురంబులగు సహకార పల్లవ తల్లజ చర్వణంబున గర్వాయమాణ కలకంఠ కుల కంఠోక్తి జనిత సందేహపాంథసందోహంబును వనదేవతా తిలకాయమాన కలికావళీకలిత తిలకావళీకలికాఫలితంభావుక నభోభాగంబును, మదనపాలిత భుగంగార సదృశారవింద సందోహ మకరంద బిందు సమాస్వాద మదమిళిందబృందాదభ్ర భ్రమణజనిత నితాంత రవణ కారణ సంభూతమిధునశృంగారరసంబును, దురంతవై భవంబగుచు నగణిత మృగశరణ్యంబగు నరణ్యాంగణంబున వసంత వికాస వాసరంబు గనుపట్టెనప్పుడు.

సీ. అలమావి చిగురుల తలమోవ సవరించెఁ
బెనుతీవియల నన లినుమడించెఁ
గంకేళికినికేళి కనుమొగ్గ లొడగూడె
వీఁకమాత్రికులను గారాకులూడె
కలకంఠ కులకంఠ కలవరంబులుహెచ్చె
మలయమారుతములు మసలఁజొచ్చె

బంధురంబుగగంధఫలులు ముక్కులుదేల్చె
కమలషండము వికాసమునఁబొల్చె
గీ. సకల తరుగుణ మగణిత ముకుళదళవి
భాసమానములగుచు బంభరనినాద
గీతములుబూనె మరుదు సంప్రీతినానె
నుచిత గతిఁ జెందు నవ్వసంతోదయమున.

క. శుకముఖ రుచిరత్వము కిం
శుకము కుల సమగ్ర కలన శుకముఖమునియు
త్సుకమని తెల్పు తెఱంగునఁ
బ్రకటితముగ మోసెమధుప పజ్తులు గడఁకన్.

చ. మలయనగావతీర్ణవలమాన లసత్సవమాన ధూత కే
వలవకుళప్రసూన రసవై భవదత్త మనఃప్రవృత్తిచే
సలలితరావలోలమద షట్పదవంక్తి సుధాసమాసవం
బలరఁగఁగ్రోలెఁ బావన వనాంగణసీమ మనోభిరామమై.
వ. అట్టి యెడ.

ఉ. గంధవహ స్తనంధయ వికాసము లాసమయంబు డక్కమనో
బంధురమైన తాపపరి భావితుఁజేయ వనాంతకాంత పు
ష్పంధయఝంకృతుల్ మదనశాస్త్రముబోధ మొనర్పఁగా ముదీ
బాంధవవంశమండనుఁడు పాండువిభుండు చలించె వెండియున్
క. తనతనువతనుఁడు తనువున
గొనిబాణముఁజొనుపబొండు కుతలపతికి లో

ననురక్తియొదవె వెలివే
టునునాటును తేటపడదెటులవివశుండో.

చ. అనువగు కేళికిన్ సమయ మంచుదలంచిసమంచితస్థితిన్
బెనఁగొనునయ్యశోకరుచిఁ బెంచుకురంటక కుంజసీమకున్
జనపతిమాద్రితోఁజనె వశాహితగంధగజంబుపోవుచా
ద్ననమదనాస్త్రముల్ మసముపుంఖముపుంఖముగాఁడిపారఁగన్

ఉ. మిత్తినొసంగు బ్రాహ్మణ సమిద్ధమహాశని తుల్యశాపమున్
దత్తరపెట్టుమన్మథు కతంబుననొందెను భర్తృతాపమున్
జిత్తము కేళికంతరము జెందని కాలములోనఁజూచిలో
నత్తరుణీలలామ హృదయమ్ము రయమ్మునడిల్లపోవఁగన్.

క. చాటుప్రయోగములవా
చాటుండౌ విభుఁడుపుష్ప శయ్యాస్థలిలోఁ
బాటలగంధిక్షౌమము
పేటెత్తఁగనీవి విడిచెఁ బ్రియమలరారన్.

సీ. గాఢోపగూహన క్రమసము ద్భవఘర్మ
హార్యంబు సిక్త సర్వాంగకంబు
వేల్లితధమ్మిల్ల విగళత్సుమద్విగు
ణీకృత సుమతల్ప నిర్మలంబు
నితరేతరాస్వాద వితతసుధారసా
ధరితాధరోష్ఠ దంతవ్రణంబు
నతులశీత్కారసంయుత కంకణక్వాణ
రాజితతర రతికూజితంబు

గీ. కలిత బిందుప్రవాళ నఖక్షతాది
శోభమానంబు బాహుళ్య సుఖదపార
వశ్యముకుళితనయన సద్వారిజంబు
గాఁగనవిరతసురతంబుఁ గ్రందుకొనిరి.

క. తన కాయువు దీర్ఘంబై
తనరఁగఁగల్గియునుపాండు ధరణీధవుఁడో
య్యనవాయురంతమునుగనుఁ
గొనఁదలఁచిన రీతిరతికిఁ గోమరై చెలఁగెన్.

మ. ఒకదూరీకృత పాశసంగము యమప్రోల్లాసముల్ మానిమి
న్నకజామూరతిలోలుఁడై సుఖములన్ నల్పొందునభ్యావిజా
నికిలాలిత్యలతాగృహంబున సముస్మీలత్ క్రియన్ వేగవే
రొకయూరీకృత పాశసంగము యమప్రోల్లాసముల్ గన్పడెన్

క. తరుణీ పరిరంభణముల
గురుజనులా మోదభరము గొనిరందఱు త
ద్వరవంశజుడేమాద్రీ
పరిరంభణ మొందిపాండు పతిమృతిఁబొందెన్.

క. నిద్రనుబలె నప్పాండుమృతి
ముద్రలువిభు డంగకములు మూసినఁగనిదా
నుద్రవమున విహ్వలయై
మద్రేశ్వర తనయ శోక మగ్నతనొందెన్.

చ. అదివిని యవ్వనాంతమున కాత్మజవర్గము తోడనేగి పెం
పుదరిగి తాదృశుండగు విభుంగని పేరెలుఁగెత్తిశోకమున్

గదురఁ గనేమ్ఛభోజసుత కన్నులనీరిల సిండభూమిదా
ను దయను బాష్పముల్ విడిచెనోయనఁగాఁదగియుండె వెండియున్.

చ. సహగమనంబు మాద్రియట సల్పఁగమానితుఁడైన శంతనుక్రికిన్
విహితముగాఁబరక్రియలు విశ్రుతరీతి నొనర్చిరాత్మజుల్
మహితసమాధి దంపతులు మాటికిఁదారును దివ్యులై కడున్
బహుసురతోత్సవంబులనుఁబాయక సౌఖ్యముఁబొందిరాదివిన్.

వ. అంత నవవైధవ్య బహువిధ వ్యథలఁబడుచున్న పృథన మీపంబున నిర్మర్యాద పితృశోక విదార్యమాణ ధైర్యంబును, సోదరయుతుండును, హృదయవిదిత నిఖిలధర్మంబును నగుచున్న ధర్మజునకు నిచ్చట వివిధశాత్రవోపద్రవంబు గాఁగలదని తలంచి ప్రకాశ్యకాశ్యపాది శతశృంగముని పుంగవులు సదయులై పాండవులఁ గుంతీసహితంబుగా నుత్తుంగమణి సౌధశృంగంబును, కులక్రమాగతంబునునగు కురునగరంబున డించిన,

చ. అందలివృద్ధ కౌరవులు నందఱువచ్చి కుమారులేరి మా
నందనులంచు పాండునృప నందనులన్ గడుఁగౌఁగిలించియా
నందనులన్ స్పృశింపుచు ఘనంబుగనంకములందునుంచివే
జెందెడుశోక బాష్పములచే నిలయెల్లెడవెల్లి గొల్పుచున్.

క. పాండవుల కోమరె పాయము
ఖండితబహురూపకలనఁగాంచక ధృతరా
ష్ట్రిండుగరమ్ముఁగరమ్మున
నిండినవేడుకను బునికె నెనరుతోరంగన్.

సీ. వారల కెయ్యెవివలయు నిష్టంబులు
ప్రత్యహంబును నెడఁబాటుఁజేసి
కడుతనసుతశతకంబు కంటెను పాండు
సుతులయందంబికాసుతునకధిక
సంప్రీతికల్గుట స్వపితృవాత్సల్యంబు
గని మత్సరంబునఁ గర్ణ ముఖ్య
దుర్బోధమాలించి దుర్యోధనుఁడు తన
క్రూరచిత్తంబున వైరవిషమ
గీ. శాఖలను గల్గిఫలమునాశంబుఁగాగ
నమరు నొక్కవిరోధవృక్షమునుఁ బెంప
నదియుఁ బెంపయ్యె ననుదినంబధికమగుచు
దైవికము బీజమగుచును దనరుచుండ.
క. పట్టాభిషేకమగుచుఁ
బట్టగు దుర్యోధనాది పరుషులనుదురుల్
కట్టాక భావకుతుకము
బుట్టంగాఁజేయువాయుపుత్రకుఁడెలమిన్.
క. భువిలోనైదు తెఱంగుల
ప్రవహింపుచు నున్నయట్టి పౌరవరోషం
బవుసింధుతతికిఁ గ్రమమున
బవనజుఁడను సంగభూమి పరగఁగనయ్యెన్.
వ. అంతనొక్కనాఁడుకుమారకులందఱు భాగీరథివారి విహారం
బులఁ దడవు ప్రొద్దుగడపి యుత్తుంగతరంగంబుల వలన నుతూ,

లిత ఫేనకూటంబుల ననుకరించు పటకుటీరంబులయందు పరిగృహీతమనోహరాంబర పటీరహార వారంబుల నలంకృతులై కుశల కుశీలవబాలకకులశీల కౌశలంబగు పేశలవాదిత్రవిచిత్ర నిజస్తోత్రంబుల వివశీకృత మనస్కులై సుఖంబుండునప్పుడు.

చ. ఘనతరనూత్నరత్నచయ కారిత గౌరవ మంచకల్పమై
తనరు సముజ్జ్వలత్కుసుమ తల్పమునం దనిలాత్మజుండు తా
దిన విరతిప్రభంజనము దేవనదీ కమలస్థగంధముల్
దనువునం దాల్చి దీవి నలతన్ సుఖనిద్రను జెందియున్నెడన్.

ఉ. కౌరవరాజనందనుం డగౌరవరీతి నిశీథమందునన్
మారుతిం జంపంబంప నతిమానితులై యహితుండికుల్ రయం
బారంగం జేరియంతట నియంత్రణపేటికకోటులెత్తియా
భూరి భుజంగ సంఘముల ఘోరుసంబై నిగుడించి రుద్ధతిన్.

గీ. తండ్రినలమెడు సుతుల చందాననవుడు
చిలువగమి వాయుసూనుని జేరిపెలుచ
భూరిభయదోగ్రజిహ్వాప్రసారణములు
జేసెబయలాక లింపుచుం జెలువు మిగుల

ఉ. పాపనికాననీస్థిత కృపాఘనపావన ం జం
గావళియుల్ గ్రమంబలర నాయువుగాయను లందురెట్టిగా
వావిరి నాశిషంబుల నవారితరీతుల ముందువెన్కగాం
దాపుకొనంగ నిల్చె నసుధారణదారుణ లీలంగ్రాలంగన్

క. అనిలాత్మజు నంగంబుల
ఘనతర దశనములనుంచు కాకోదరముల్

చనియెను నాలుగుదిశలకు
ననువైతమ మంత్రరోధ మడఁగిన భంగిన్.
సీ. ఆగతి స్వప్రాణుఁడగు నంతనొకనాఁడు
నిద్రారుణాక్షునినిలకుమారు
నకు మూర్ఖులైన వారొకసౌమ్యులనుబలె
గరళాన్నకబళంబు వరుసనిడిన
దానవిహ్వలుఁడైనఁ బూని పావనదీర్ఘ
తరరజ్జువులఁగట్టి తడయకపుడు
సురవాహినీమహత్తర జలంబులలోనఁ
గడువడిఁబడఁద్రోచి గర్వమలర
గీ. వీరుఁడగు భీమునడఁగింపు వెరవుగల్గె
సురనదీతీర నీరమీా సురుచిరంపు
గుణములును సాధనంబులై కొమరుమిగిలె
ననుచుగాంధారి సుతకోటి యతిశయిల్లె.

వ. ఇట్లు బడఁద్రోచిన యనంతరంబ పాతాళ గహ్వరంబు సొచ్చి యచ్చటి వాసుకిచేత సమ్మానితుండగు నా ధృతిమంతుం డగు భీముండు నాత్మగుణగణంబు లుగ్గడింపుచు నాప్తులగు నమాత్యులతోడ చింతంబడి హా! భీమ! హా! వత్స! హా! రిపు భర్త్సన! ఎందుబోయితివో యని బలునెలుఁగు బొగులంబూని విషాదింపుచున్న కుంతికి నవమంబగు వాసరంబు నవమంబుగాఁ జేయుచు ప్రభంజనసూనుండు నమృతత్వంబున వచ్చి నేత్రోత్స వంబులరఁ బొడసూపెనపుడు.

క. వచ్చిన యచ్చిఱుతనికిని
జెచ్చెరగజ బలమునమృత సేవనమును దా
నిచ్చెను గాత్రమునకుఁబృథ
యచ్చెరుపడి భాతృశత్రులలరన్ దలఁకన్.

వ. అంత.

ఉ. ఘనసత్కీర్తిలతావితానముచిరా కాష్ఠాగతస్ఫూర్తి
గనదౌన్నత్య ధనుఃప్రవీణతపరా కాష్ఠాగతస్ఫూర్తిగాఁ
దనయవ్రాతమునేర్చ నంతకు నుపాధ్యాయున్నియోగింపుమం
చును దేవాపగసూనుతోడఁ ధృతరాష్ట్రుండానతిచ్చెఁ గమః.

సీ. తదాజ్ఞఁదైన్నట్టి యాతమునట్లకాకని
రెండవశరజన్ము రీతినెనఁగి
శరజన్ముఁడగు కృపాచార్యుచేత సముద్య
దనవద్యచాపవిద్యల నొసంగి
మున్నదిపురుత్తముగ జేయుతలఁపున
కొలువునుదగు మాన్యకోటితోడ
పరజైత్రగుణులగు పౌత్రులనెంతయు
నుపహారగరిమల నుచితరీతి

గీ. ద్రోణు ధనురాగమప్రాణు దోఃకృపాణు
స్థాణుపదభక్తిపారీణు శరధురీణుఁ
జరణసరణిని నిలిపి విస్ఫురణమెరయఁ
బ్రీతిఁజేసిననతఁడు సంప్రీతుఁడయ్యె.

క. గాంగేయకలశభవుల య
భంగురమగునట్టి సఖ్యపాటవమును వే
గంగనిహస్థాంబుధిని ము
నింగెనపుడు నచటిపౌరనికరములంతన్.

క. ద్రోణునననుగ్రహమున న
మ్మాణవకులు తూర్ణముగను మహనీయములౌ
బాణాసన విద్యలచే
రాణించిరి నైజగుణ విరాజితరీతిన్.

ఉ. అంతటనొక్కనాఁడు కలశాత్మజుడాకురు పుత్త్రిలం దట
ప్రాంతమునందు నిల్చికలభస్థితి నీరములాడతజ్జలా
భ్యంతరవర్తినక్రమటు పాదసరోజముఁబట్టి యాకృపీ
కాంతుశరాగమాంతుబుధకాంతుమహాంతుగ్రసింపఁజొచ్చినన్.

గీ. గురుఁడుతటికంపుటురిఁబడు గుచ్ఛపోల్కి
నలరిశిష్యులపారంబుఁ దెలియవేడి
తునుముడీనక్రమునునాగ ననుపుగామి
మానిరందఱు కవ్వడిఁ దానిజంపె.

వ. ఇట్లు మకరిబారిఁగొని గురుని సంకటంబు వాపిన నతండు సంతసించె నివ్విధంబున బ్రవర్తింపుచు నంత నొక్కనాఁడు.

చ. అరయఁగవారలందఱు శరాసనదక్షిణులైనయంతమీఁ
ద రయమునన్గురుండు గురుదక్షిణగాఁదన కై కడంగి మీ
రరిగియుపార్షతుంబొదివి యాతనినుద్ధుర వృత్తిబల్మి నం
గరమునఁబట్టి తెండనుచు గ్రక్కునమర్మము గాఁగఁబల్కినన్.

క. గురుచోదితులయ్యనవం
తగ మహామహిమికలఁజని రథ ప్రతతులఁద
త్పరముని రోధింపుచు సం
గరగరిమచిరంబుగాఁగఁ గడువడిసలుపన్.

చ. అమితబలుండు పార్షతుఁడు నక్కురుకోటిని పూర్వపక్ష భా
వమునొనరించిభల్లముల వాసవసూనిని విల్లుద్రుంచినన్
సమదభుజాంచలప్రథిత చంచలఖడ్గ లతాసహాయుఁడై
విమతుని పైనరుండడరె విస్మృతులై విబుధుల్ నుతింపఁగన్.

క. సిద్ధాంతంబుగ ద్రుపదుని
బద్ధించి రథంబుమీఁదఁ బన్నగనిడెనా
సద్ధర్ముండ గుపార్థుఁడు
యుద్ధాంగణసీమయందు నున్నతకీర్తిన్.

వ. అంత.

గీ. కవ్వడిని ద్రోలనిడికొని కౌరవాళి
గురునిసన్నిధి భక్తిచే శిరమువంచె
ద్రుపదరాజేంద్రుఁడునునంత విపులమైన
సిగ్గుబొడమిన కతమున శిరమువంచె.

చ. అనవుఁడుసూతునింగని మహామునులిట్లని రోగుణాఢ్యయా
ఘనుఁడగు ద్రోణుఁడిట్టి పగగల్గి నృపోత్తముఁడై వసోమకేం
ద్రునినిటుభంగముల్ బఱచెఁ దొల్తకృపుండు కుమారకోటికిన్
జనుగతినొజ్జయైన ఘటజన్ముఁడుపిమ్మట నెట్లుచొప్పడెన్.

క. మోదమున వారిజన్మము
లాదిగవినుపింపు వినగనయ్యెడిమదిలో
మేదురకుతుకమునావిని
యాదరమున సూతుఁడిట్టు లనుమునితతికిన్.

చ. వినుఁడు ఘనుండుగౌతముఁడువిశ్రుతపుణ్యచరిత్రుఁడమ్మునీం
ద్రునకు శరాళితోడఁ దగఁదొల్లి జనించెను బాలకుండువాఁ
డనుపమచాపవిద్యల సమంచితుఁడై కడకన్ దపంబునన్
దనరఁగలోకముల్ బెగడెదారుణమైన తదీయనిష్ఠకున్.

చ. అనయమునిట్లు గౌతమిమహత్తరఘోరతపంబుచేఁగనున్
బనుపడదానిబాపుటకుఁ బాకనిషూదను శాసనంబునన్
వినుతశుభాంగియైన యొకవేలుపు టచ్చరవచ్చినంగనుం
గొనిమునిమార బాణములకున్ వెస సంచలితాంతరంగుఁడై

వ. ఇట్లా శరద్వంతుండు మదనరాగంబున రేతఃస్ఖలనంబగు డు నమ్ముని శరచాపకృష్ణాజినంబులచ్చోట విడిచి యొంటు వనంబున కేగి తపంబుసేయుచుండె. తదీయరేతంబు శరస్తంభంబున ద్వివిధంబై పడి కుమారియుఁ గుమారుండునై జనించి రంత శంతనుండు మృగయ కయ్యటవి కేగి దైవయోగనంబున సేనాగ్రచరునిచే వారలంజూచి తల్లక్షణంబు లుపలక్షించి యొక్కముని సంతానంబుగా విచారించి యాశిశువులందెచ్చి కృపాయత్తచిత్తుండై పెనుచుచుంటజేసి కృపియనియును గృపుఁడనియును నామంబులయ్యె పదంపడి శరద్వంతుఁడు వచ్చి తదీయ జన్మప్రకారం బెఱింగించి శారద్వంతు నుపవీతుంజేసి వేదంబులును ధనుర్విద్యయుఁ గఱపి.

చనియెనట్టి కృపాచార్యుండు గాంగేయాను మతంబున కురు కుమారులకు ధనుర్విద్యయభ్యసింపఁ జేయుచున్న సమయంబున ద్రోణాచార్యుం డరుగుదెంచిన నతనిచే నస్త్రశస్త్ర శిక్షితులైరి తత్ప్రకారంబు వినుండు.

సీ. ఘనుఁడు భరద్వాజుఁడను మునియభిషేచ
నార్థముగంగకు నరుగనచటఁ
దన్నదివేలుపుతరుణి ఘృతాచి జ
లక్రీడసల్పనా లలనఁజూచి
మోహితుఁడై శుక్ల మోచనంబొనరించి
ద్రోణంబుననుఁబట్ట ద్రోణుఁడనఁగ
నుద్భవించెను బాలుఁడొగి శుక్రునంశంబు
గాంచియుఁబరమేష్ఠి కల్పుఁడగుచు
గీ. మఱియుపృషదుఁడనెడి మానవపతి భర
ద్వాజసఖుఁడతండు తపమొనర్చు
చుండిమేనకయును మానాపచయమొన
రింపుదానిజూచి నృపవరుండు.

వ. మదనావేశంబు నరేతఃస్థలనం బగుటయు పాదంబున నాచ్ఛాదించిన మరుదంశంబున ద్రుపదుండను కొడుకుపుట్టిన పృషదుండును వానింభరద్వాజాశ్రమమునంబెట్టి పాంచాలపతి నిజపురంబున కరిగె నంత ద్రుపదుండును ద్రోణునితోఁ గూడి వేదంబులును ధనుర్వేదంబునుఁ గఱచి తనతండ్రి పిమ్మట పాంచాలదేశంబులకు నభిషిక్తుండయ్యె ద్రోణుండును నగ్నివేశ్యుండను ము

నివలన నాగ్నేయాస్త్రాదిదివ్యబాణంబులు వడసి కృపాచార్యు చెలియలు కృపియను దాని గురు నియోగంబున వివాహంబై యశ్వత్థామయను సుతునింగాంచి ధనార్థియై పరశురాము పాలికింజని తనవచ్చుటచెప్పిన ద్రోణునకు రాముండిట్లనియె.

క. కలధనమెల్లను మునుమును
పలువురి విప్రులకునిచ్చి పదఁపడి వినుమీ
యిలఁగశ్యపునకు నిచ్చితి
కలదిఁక శస్త్రాస్త్రములును గాయమునసఘా.

గీ. వీనిలోననెద్ది వేడుక? దానిన
యిత్తుననిన ద్రోణుఁడిట్లులనియె
ననఘనిఖిలధనము లందుత్తమంబగు
ధనముశస్త్రధనము దానినిమ్ము.

వ. అని యస్త్ర శస్త్రంబులుగోరి యతనిచే సుప్రయోగోప సంహారంబులు సరహస్యంబులుగాఁ బడసి ధనుర్విద్య యభ్యసించి వీడ్కొని ధనార్థియగుటంజేసి చాలసఖుండు గావున ద్రుపదుని పాలికరిగి యేనునీకు సహాధ్యాయనుండనని కలహాపు ప్రణయ పూర్వకంబుగా నెఱింగించిన ద్రుపదుండిట్లనియె.

ఉ. నన్నునునిన్నుజూచి ప్రజనవ్వరె నాచెలి వీవటన్నచో
నెన్నటినఖ్యమీ వెవడ వీగతిఁబల్కఁగ నేనెవండ న
భ్యన్నతులైన రాజులకు నొప్పునెపేదల తోడఁజెల్మికా
దన్న తలంగి పొమ్మిటుల నాడకుధార్ష్ట్యము చాలుఁజాలికఁ.

వ. అదియునుంగాక కార్యార్థంబునంజేసి మిత్రామిత్ర సంబం

ఖంబు లు సంభవించుంగాని, మాయట్టిరాజులకుఁ బేదలతోటి సఖ్యంబువాటిల్ల నేర్చనే కయ్యంబునకును నెయ్యంబునకును సమానంబు వలయుంగాని యసమానంబు లగ్గుగాదు, కొలందికి మాలిన యట్టి మాటలాడక మిన్నక చనుమని యవమానంబుగాఁ బలికిన ద్రుపదుని చేనగు తిరస్కారంబు హృదయ శల్యంబునుం బోలె మనంబు విరియింప ద్రోణుండు పుత్త్రకళత్రాగ్ని హోత్రంబుల తోడన ద్వేఁబాసి హస్తిపురబాహ్యంబునకు వచ్చునంత.

సీ. ధృతరాష్ట్ర పాండునృపతు లపుత్త్రకులోగి
కందుకక్రీడ లింపొందనాడ
గడఁగి తత్కాంచన కందుకం బొక్కింత
చేతప్పి యొకపాడు నూతఁడిబనఁ
దానిఁగైకొనుటకుఁ దగువెర వెఱుఁగక
చిఱుత లాకూపంబు చెంతమఱుఁగ
నదియెల్లఁ గనిద్రోణుఁడాసమయంబున
నచ్చటికేగి యిట్లని యెనగుచు

గీ. భగతవంశ భవులు పటుచాప కుశలురు
బంతి భావిఁబడిన చెంతనిట్లు
మిన్నకున్నఁ దగునె నన్ను గనుండుమీ
కందుకంబు శరముఖమున దెత్తు.

వ. అనిపల్కి యొక్కబాణంబు బంతినంటనేసి తద్బాణ పుంఖంబునొండు శరంబున నాటించి క్రమంబున నట్లన ప్రతిపుంఖంబును శరంబులనాటించి బంతిఁదిగిచి బాలురకిచ్చిన.

క. వారందఱు విస్మయమున
భూరిముదంబొప్ప ద్రోణుఁబూజించి నయం
బారఁగఁదోకొని చని యది
గౌరవమున భీష్ముతోడఁగ్రమమునఁ దెలుపక.

వ. అతండును ద్రోణంబూజించి మహాత్మా! భవదీయ వృత్తాంతబు సవిస్తరంబుగా నానతిండనుడు ద్రోణాచార్యుండును దాను మున్నగ్నివేశ్యుండను మహాముని పాల బ్రహ్మచర్యాశ్రమంబున వేదాధ్యయనంబు సేసి ధనుర్వేదం బభ్యసించుటయును పాంచాలపతియగు పృషతుని తనయుండు ద్రుపదుండను వాఁడు తనతోడ విద్యఁగఱచి బద్ధసఖ్యుండై పురంబున కరుగుచు, నీవు వచ్చునాఁడు మదీయ సామ్రాజ్యంబున కర్హుండవని ప్రార్థించుట యును, పదంపడి గౌతమిం బాణిగ్రహణంబుచేసి, యశ్వత్థామ యను కొమరుంబడసి నిర్ధనుండ నగుటంజేసి రాజు (...... గకుండుటయును ధనికులగువారి కుమారులు పాలు దావింజూచి క్షీరార్థంబు కుమారుండుపోరు వెట్టుటయును పృషతుపౌత్రుండుఁ బాంచాల దేశంబులకు (......) మని తలంచి చాల సఖుండని విచారించి యారాజుపాలికి ధనార్థంబుగాఁ జనుటయును నతండు దన్నుజేసిన యవమానంబును మున్నుగానెఱింగించిన భీష్ముండు కలశభవుగారవించి యయ్యయిపదార్థంబులఁదృప్తుంజేసి మనమల గుధృతరాష్ట్రి పాండురాజకుమారులనప్పగించిన ప్రీతుండై వారల శిష్యులంగాఁజేకొని నిఖిలాస్త్రశస్త్రంబులు గఱపి పూర్వవైరంబు కతంబున నర్జుననిచే ద్రుపదునట్లుపట్టి తెప్పించిన.

చ. సరవి సధిజ్య ధన్వుఁడగు శక్రతనూజునిచేతముందరన్
విరముగనున్నవాని నిజతేజముబోయిన లజ్జగన్నులన్
బురిగొనువానివిద్విషుని భూరిగభీర వచోవిలాసిమై
దరహసితాననాంబురుహతన్ దగవారఁగ నగ్గురుండనున్.

శా. ఓరీరాజకులాగ్రగణ్య మరినీవో కావో ఘోరాటవిన్
నారాచాభ్య సనార్థమై యుచటసన్మాన్యాగ్ని వేశ్యుండె నం
బారాధింపుచు నన్ను మత్కృత పితృత్వోర్థంబు నీకిచ్చి పెం
పారన్ దక్కిన భాగమే ననుభవేహన్ గొందు నంచాడినన్

ఉ. పిమ్మట రా క్షురప్రదర భీషణవిప్రియభాషణంబు చి
త్తమ్మునగరీయసంబగు వెతంబడనక్కట పేదవిప్రు నొ
క్కమ్మడిఁ ద్రోవ్వుఁడంచనిచి యుర్వీతలంబఖిలంబుగొల్లగా
సమ్మతినాక్రమించికొని సారె భుజించెను గారవంబునన్

క. దుప్రపదస్థితి జడస క్తం
బెపుడును నావాల వృద్ధమెల్లరుననిరీ
విపుడు తదాఖ్య వహింపఁగ
నుపగతమై మిత్రతేజ మొరయకపోనే

వ. ఇట్లు వ్యాహత వచనంబుల పౌరవాంతంబున భార్గవసమీ
పంబునుంబోలె ధనురాచార్య ధర్షితుండగు పార్షతుండతనిచేవిసు
వంబడి కృత్యవిదుఁడగుచు గుంభ జంభ రిపుసంభవులకు సంగర
మాధురీణతం గెలువంజాలు సుతద్వయంబును భాగీరథీతీర వనకు
టీరస్థిత మునిరాజకృత యజనానుగ్రహంబునఁ గాంచి సుఖంబుం
డె నంత.

చ. అరయఁ దపోబలంబున సమాహితదృగ్జలజంబు భంగిను
స్థిరుఁడగు ధర్మనందనుని దివ్యసువర్ణ మయాసనంబునన్
గురువిభుఁడాంబి కేయుఁ డవకుంఠిత సంగతినుంచివారిచే
సిరియలరారి యొప్పనభిషిక్తునిఁజేసెఁ బ్రజాళిమెచ్చగఁన్.

సీ. క్ష్మావలయంబ శేషము భరించిన యతం
డఖిల జనంబులు నతిశయిల్ల,
పాలింపుచునునంత ధర్మంబులును యథా
గతిన్నృపుల్ కప్పముల్ ఘనతనిడఁగ
ధనియయ్యెఁ గౌరవోత్కరము హర్షంబును
దక్కి విచారంబుఁ దాల్చియంతఁ
బార్థభుజాదండ బలము ప్రత్యహమును
వర్థమానంబుగా వసుధనొప్ప

గీ. అది యసహ్యంబుగాఁ దండ్రిమదిదెరల్పఁ
దనరి ధృతరాష్ట్రుఁ డవరజ తనయులందు
సమ్మతమునూనె మాత్ర దోషమ్ముచేత
వెలినిఁజీకటె భంగిలోపలనుఁ జెందె.

క. అంతట ధృతరాష్ట్రుఁడు బహు
సంతోషితుఁడగుచు సహజసద్ధర్మంత
య్యంతక సూనునిరావిం
చెంతయు నవహితార్థవాక్యమిట్లని పలికెన్

గీ. వత్స ! యిప్పుడు వారణావతమునందు
తమ్ములును గొల్వనట విహితమ్ముగాఁగ

ప్రజలం జెందెడునాపదల్ పరిహరించి
మించుసుఖమునం బుడమిం బాలించుమనిన.

చ. ఒనరదదాశయంబెఱింగియుండి యుధర్మజుం డట్ల కాకయం
చును జనకాజ్ఞంబూని తనశోభ జెలంగు గుణప్రకృష్టిచే
ననువుగంబేరు పెంపగు నిజాన్వయమెల్లను తాదృశంబుగా
ఘనతరపాలన క్రియలం (గాంచినకీర్తిం) దలంచివేడుకన్

గీ. ధర్మతనయుండు తమ్ములు దానునపుడు
తత్పురముంజేరెం దద్వాక్య తతిందలంచి
కర్మచోదనమున నన్యకాయమునకు
నిందియంబులతో జీవమేగినట్లు

వ. అంత

చ. వినయమునన్ బురోచనుండు విశ్రుతవస్తు మనోభిరామమై
యనువగు లక్కయిల్లుగరమారంగంజూపంగం బార్థివోత్తముల్
ఘనతరనూత్నవస్తుతతి కల్పితమైన జగంబుంబొంది న
ట్లనుపమలీలంజెంది రపుడందఱు డెందము లుల్లసిల్లంగన్.

క. వారాకృత్యము విదురుని
చారునిచే నెఱింగి రదియుం జాతుషమనియున్
గౌరవపతి కల్పితమని
మారణవిధి కగ్నింజొన్పు మతమగుననియున్.

సీ. మఱియుదుర్యోధను మంత్రి పాండవులను
సమయింప గూఢభావములుమీఱ
ననుదినంబును సమయంబుం జూచుచునుండె

ననలంబుఁ దరికొల్పు నాశనంత
నొకనాఁడువారల కొకభృత్యవారాలును
బలె నిషాదికుమారపంక్తితోడ
నామిషఫలములయందు విషంబుంచి
యిచ్చుటకై వచ్చి యింటిక్రేవ

గీ. నెఱిఁబురోచనుఁడును దాను నిద్రఁజెంద
దీర్ఘనిద్రయొసంగ మదిం దలంచు
చందమున భీముఁడతివేగ సరణి నపుడ
గారమారాతిశ్రీఁ గీలికి ధారవోసె.

క. జననీసోదరులను తన
ఘనపర్యంకాయమాన కరశిఖరమునం
దునిచియు విదురిని కింకరు
డొనరించిన వివరసరణి నొయ్యన వెడలెన్.

చ. ఆరాజన్యుల విద్విషత్ప్రకట సర్వాంగంబులున్ వహ్ని వే
శ్వేరం సప్తశిఖాసమున్నతుల సంప్రీతిన్ విభాగించి చె
న్నారం దృప్తివహించిమించి యటనత్యంతంబు నప్పావనిన్
సారెన్ సన్నుతిచేసె నంత నిజశీర్షస్థాల్య కంపస్థితిన్.

చ. పురజనులుం బ్రభాతమున ఘోరునతాపము రోగసంగతిన్
వరుసధరించినట్టుల నివారణ నశ్రువులుంచి శాంతిజెం
దిరి క్రియచేదఁ దగ్నికడ తేర్చు తెఱంగున నచ్చటంగృహాం
తరగత వైభవంబులను దాహిత గేహములెల్ల జూచియున్.

చ. పదపడి యాత్మకింకరుని భాషణపద్ధతులాదరించి యా
సదనమునందు దగ్ధతను సంఘము బాండుకుమారులంచు నె
మ్మదిఁదగనిశ్చయించి కడుమానితులై యటధార్తరాష్ట్రులే
పొదివిరి శోకకై తవమునొంది ప్రమోదజలంబు లొప్పఁగన్.

వ. అంతనచ్చట గంధవహనందనుం డంధతమసధురంధరం బై నిజచరణ జవసముద్గత మారుతోచ్ఛలితవిటపివిటపావస్థితని ద్రాంతనితాంత శకుంత సంతాన పరిభ్రమణ మిళదీషద్ధ్వా ననిధ్యానంబగు నధ్వంబునంజని యొక్క కానన కాసార తీర ప రిసరంబున వారలడించి తదీయ పరిరక్షణ జాగరూకుండై క్షణ మాత్రంబున్న సమయంబున

చ. జతు రురుగేహదాహమున సఖ్యముజెందిన వీతిహోత్రుడ
ప్రతిహతమైన యట్టి వనపద్ధతిఁ గ్రమ్మిన జిమ్మచీకటిన్
హత మొనరించిమారుతికి సధ్వసుఖంబొనఁ గూర్పఁబంచెనో
యతులితకీల నాగఁతటిదాభయొ కంగననిల్చెముందటన్

గీ. వీకసధరోష్ఠముల విభా గైక రేఖ
కలికిముఖ పంకజంబునఁ గలదొ లేదొ
అనెడు మదిలోని సందియంబడపుమాడ్కి
వనితమానము మాని యిట్లనియెనతని

మ. నరభుగ్గ్రామణిజంతు సంచయసమున్మాళకిృయన్ గాలుతో
సరినెన్నందగు నాహిడింబుఁడు భుజాచాతుర్యమున్ మీరఁదా
నరయన్ శాస్త్రియొనర్చు నీవనిమదీయభ్రాత నాపేరు భూ
వర సుత్రామ హిడింబ మాకిచట దుర్వారస్థితుల్ సంస్థితుల్

ఉ. శంకయొకింతలేక విలసత్స్థితి నిచ్చటనున్న నింకనే
వంకనఁబోవవచ్చు గరువంబుననిల్చిన నీకునంచుఁ దా
బింకముతో మదగ్రజుఁడు భీషణభంగి గ్రసింపఁబంచె హృ
త్పంకజ రంగసీమనిటుఁ బంచశరుండు నటించుచుండెడిన్.

క. రుధిరంబానెడు కోరికఁ
బృథుగతినీకడకుఁబంచెఁ బిశితాహారుం
డధరంబానెడు కోరిక
మధురంబగు నీదురూప మహిమందవిలెన్.

గీ. ఇపుడు నీకోకవాక్యము హృద్యలీల
నుచితముగఁ జెప్పెదనువిను మురక రణము
మారణమునుమ్మి యాశీలమహితుచేత
మార రణమున ననుఁబొందు మంచిదగును.

క. కృపచే రయమున గాని
మ్ము పయామవిధాన మిప్పుడొందియు నీతో
విపులాకాశ దిశాదుల
నపరిమితక్రీడతోడ నలరెదఁ బ్రీతిన్.

మ. అటులంబల్కుచునున్నన త్తరిమహాహాద్యద్విస్ఫులింగచ్ఛటా
స్ఫుటదృక్కోటరకోపవహ్ని భువివేచూడన్ భుజాస్ఫోట ది
క్తటవాచాటితుఁడై హిడింబుఁడట శంతన్ వచ్చి చండాలి ని
న్నిటనుండంబనిఁబంచినాఁడనె యటంచెంతేని భర్జించుచున్.

ఉ. మిత్తినిఁబోలె నిన్నిచట మ్రింగెద నెచ్చటికేఁగవచ్చునం
చ త్తరుణీమణింగదియు నాశజనీచర వీరుతోడఁ జే

బెత్తైనవల్కచేత నపమృత్యువుపోలిక మారుతాత్మజుం
డత్తరిఁదాకె బాహుబలమగ్గలమై తమకింపుచుండఁగన్.

చ. గిరిగిరితోఁ మహీరుహముగేవలవృక్షముతోఁ మహోన్నతిన్
గరముగరంబుతోఁ వచన గౌరవమొప్పఁ బరస్పరంబుచు
ద్ధుర రణకేళిసల్పిరట దుర్జయులైన సమీరభూ నిశా
చరు లతిఘోరరూపములఁ జండగతిన్ జయకౌతుకంబునన్.

శా. శుంభద్విక్రియ శాలివాయుసుతుఁడస్తోక స్థితిన్ముష్టిచే
జంభారాతి బలాసురున్ నిశితవజ్రిప్రహతింగూల్చునం
రంభంబొప్ప హిడింబుమస్తకము భేదించుచ్చిరోవక్ భుజా
గంభీరధ్వనిఁబర్వ నేసి శమనుంగాంచంగఁబంచెందగన్

వ. అంత తిమిర కదంబంబునుంబోలె హిడింబుచే నిర్ముక్త
లగుచు నయ్యహర్ముఖ సమయంబున వనంబున వికస్వరశీలంబు
లగు కమలంబుల పోలిక నారాజ నందనులు మేల్కని వీతి
హోత్రముని యాశ్రమంబున వీతిహోత్రభాసురుండగు
వ్యాసుంగని యమ్మహాత్ముని శాసనంబున కతిపయవాసరంబు
లందుండి యనిలనందనునకు హిడింబవలన ఘటోత్కచుండా విర్భ
వించి తండ్రులకు నమస్కరించి తావక కార్యంబుల స్మరణమా
త్రంబున నరుదెంతునని విన్నవించి జననీసహితుండై యధేచ్ఛా
నువర్తనంబులఁ జనియె. వారును గందమూలాద్యశనాయాసం
బులఁ గొండొకకాలంబు గడిపి బకబలాక్రాంతంబగుచు ప్రావృ
ట్సమయంబును బోలెఁ బ్రత్యహవర్ధమాన బలిశోకంబగుచుఁ
బాతాళతలంబునుబోలి సూర్యతనయానుకూల ప్రతిష్ఠితంబగుచు

నంగరాజ్యసీమనుబోలి యేకచక్రాభిధాన ధారణంబగుచు రవిరథ చరణంబునుంబోలి యొప్పు నేకచక్రపురం బవక్రక్రమంబునం బ్రవేశించి యొక గృహమేధిగృహంబున నధివసించి సుఖంబుండు నెడ,

మ. భికిరంబెత్తి కుమారులప్పురిని వేర్వేరన్నముం దెచ్చి యం
బకు నర్పింపఁ దదన్నరాశి సగపాల్భాగించి ధర్మాత్మజా
ది కుమారాళికినిచ్చి తక్కినది కుంతీసాధ్వి దావాయుసూ
తికినిచ్చుం బునరుక్తపోషణముచే దీపింప నయ్యంగముల్.

క. అందలివిప్రులు గుంతీ
నందనులకుఁ గలిగినట్టి నాశమడుగ మే
మిం దేవిందుము తత్సితి
నెందునెఱుఁగమనిరి వారు నెల్లరితోడన్.

మ. కడిమిన్ బ్రాహ్మణులొండొరుల్గదిసి యేకాంతప్రదేశంబులన్
బుడమిం గూలిచె నొక్కయక్షుఁడు హిడింబున్ వేగనంచాడుచు
న్నెడనబ్బాలురు మారుతాత్మజు మొగంబీక్షించి సాకూతమే
ర్పడ మందస్మితముల్ ముఖాబ్జములసంపాదింతురొక్కుమ్మడిన్

సీ. ఒక్కనాఁడంత గృహాపరిస్థలిని సా
యంతనమున నిజకాంతునంక
సీమనుండెడు తమచిన్నిబాలకునిఁ గౌఁ
గిటఁజేర్చి బాష్పముల్ గిరిగొనంగ
ననురాపరాధ రోధానుభయంబున
మందమందముగ నాక్రందనంబుఁ

జేయువిప్రాంగనఁజేరి తద్దురవస్థ
తనదియుఁ బలెవిషాదమునఁ గుంతి

గీ. కరుణదనరార గద్గదకంఠయగుచుఁ
బలికె నేటికివగచెదో బాలతెల్పు
దుర్ఘటంబైనదైనను దొలఁగఁజేసి
మిమ్ము సంతోషితులఁజేతు నమ్మయిపుడు.

మ. అన నేమంటివెతల్లి? మే లిటమదీయంబైన పుణ్యంబునీ
ఘనకారుణ్యముచే ఫలింపనగు నింకం జెప్పెదన్ మావిప
త్తిని దోఁబుట్టినదానిపైఁ జెలిమి నింతీ!యుండున య్యంతమం
డనఁ గాళిందితటాంతికాటవి బకుండంచొక్కఁడుండున్నాఁడిటన్.

చ. పురమునఁగల్గువారి మదిఁబుట్టదు చేటనియొక్కనాటు నెం
దరుగడుఁ బ్రత్యహంబు దమకయ్యెడునొక్కొకవాసరంబునన్
బురుషుని వానికిన్ బలికి భోరున నన్నమురాశితోడ నీ
కరణిని చాలనాళ్ళకొక కాలమువచ్చిన నిత్తురొక్కనిన్.

క. అటువంటి ప్రళయకాల
స్ఫుటకఠినావసరమిపుడు బొందెడుఁ దమకు
త్కటగతి బకబలికని మి
క్కుటమగు నెవ్వగలచేతఁ గుందెదమబలా.

క. ప్రబలుండగు బాలకునిం
గబళించుటగాదు మామకంబగు సుకృతం
బబలా! కబళించుట సు
మ్ము బకుండిందులకు నెందుఁబోవుదు మింకన్.

క. సంతానమూలము౦ బలె
సంతతికొకపుత్రుఁడుండ సంవర్తక కా
లాంతకుగతి రక్కసుఁడగు
వంతుదినఁబెల్లి యాయువస్థకుఁ జెలియా!

క. ఈరాత్రివేగ నిదిగో
ఘోరంబగు సమయమింకఁ గూడెనుఁదమకై
కూరిన యీవెతయెంతని
నీరేజదళాయతాక్షి నీకెఱిఁగింతున్.

వ. అని యిట్లుబలికి సరభసావగాహఁబు మానసకాసార శోక నీరంబుతూ్కలితంబై వెడలుతెఱంగున విశృంఖల నయనజలంబు వెడల నడలు నయ్యింతికిఁగుంతి నిజాత్మజులయందు ద్వితీయుండును సమరంబున కద్వితీయుండును నగు వాని నీకొసిత్తు వాఁడు భవదీయ శోకరిపుప్రాణనాశంబులకు సమర్థుండగు. దుఃఖంబుడుగుమని యూ రార్చిన.

క. మానుగనాదంపతులకుఁ
గానంబను నశ్రుహేతుకంబగు శోక
స్థానంబునఁ దత్క్షణమున
నానందాతిశయమొదవె నాదేశగతిన్.

క. సరగున మరునాఁడెలరు
పరితుష్టింజెందచాల భాస్కరుఁడును బ్రా
గ్ధరణీధర శిఖరంబున
సరభసముగఁబొందుచున్న సమయమునందున్.

గీ. చాలనన్నము దధికలశములు గూడఁ
దద్బలిక్రియకర్హమౌ దానినుంచు
నట్టిశకటంబుఁ బావని యధివసించి
చనియె బకభవనముగల వనమునకును.

శా. కంకాలోచ్చయకల్పితాంతకచమూకాశేయచిత్రప్రభా
సంకాశంబు ప్రదావపావహ్యమహీహోచ్ఛ్వాసోగ్రచక్రావిలో
త్సంకేతంబు సృగాలఘోషయుత రక్షస్థాన మచ్చోట ని
శ్శంకన్ బండినిఁగల్గుతిండిఁగొని యాహామీరి పెల్లార్చినన్.

వ. వాఁడు తన్మహాక్ష్వేళనాకర్ణమానుండై,

చ. బలిపురుషాధిరూఢ ఘనభారముచేఁ గడుమాంద్యగామియై
యలశకటంబుగిన్కయిడ నార్చుచువోడనజోడుముట్టినన్
బలుపిడుగోలిఁబడ్డ నటపైనొకకొర్వినిఁ జూపినట్లు నా
ఖలుఁడుబకుండు బిట్టదరి కందరమందిరసీమవెల్వడెన్.

మ. ఇటనన్నెవ్వఁడుసడ్డలేకరచెఁదానీరీతినంచుందదు
త్కటగాత్రగ్రసనత్వరాచలితదంతవ్రాతలగ్నాస్థి వి
స్ఫుటుఁడై దృగ్జనితారుణస్థితిజగద్భాయిష్ఠహింస్రత్వమా
వటిలంబావనితోడఁదారసిలెదుర్వారోగ్రుఁడై దైత్యుఁడున్.

గీ. నిజభుజాదండయుగళి సత్కౌజములలర
వారలిర్వురు ఘనబల వైఖరులను
గగనచరపంక్తులగ్గింపఁ గడఁగి పెలుచ
నిపుణులై యుద్ధశిల్పంబు నెఱపిరపుడు.

మ. చిరకాలైకవనప్రచార బకవిస్ఫీతరణస్థితిన్ వేగదు
ర్భరరక్షోవనితాశ్రువర్షసదృతుప్రాప్త్యున్నతింగూర్చె నా
ద్ధురయుద్ధాంగణమధ్యభాక్పవనభూదోర్దండచండక్రియల్
ధరణిన్ భీమబకాభిధానములుసార్థత్వంబులై యొప్పఁగన్.

క. దానవనాథునిఁజంపియు
వానికళేబరమునగరి వాకిటరాత్రిన్
బూనినఁదత్స్పృష్ట్యఘముం
బోనిడుననఁదల్లిపాదముల మ్రొక్కిడియెన్.

ఉ. అంతటరాత్రివేగిన సురారిశవంబు నశేషపౌరు ల
త్యంతమహాద్భుతంబుల సమాహితమోదతరంగసంగతిన్
స్వాంతములొక్కటన్ బరవశంబుగఁజూచి కుమారసంస్థితా
భ్యంతరసీమనొంది యిడిరాశిష మక్షతలున్ బకారికిన్.

గీ. ఆకరణినందుఁగల్గు మహాజనంబు
వాయుసూనుని దీవించె వారలంత
బహువిధంబుల గృహమేధి భవనమునను
యుక్తసుఖములనుండంగ నొక్కనాఁడు.

చ. సిరిఁదనరారుతద్భవనసీమకుఁ జెంగటివేదికాస్థలిన్
బొరిఁబొరినిద్రఁజెంది సరిప్రొద్దునమేల్కొనియుండిపాండుభూ
వరసుతులంబ్రసంగమటువచ్చిన మచ్చికబల్కనిట్లు దా
నిరవుగనొక్కఁడా తెరవరించుక వేడుకతోడనయ్యెడన్.

క. అంచితయువ నివహామనః
ప్రాంచన్నవసౌధ రత్నపాంచాలికయా

పాంచాలికకై ముదిఁదము
కించెదునెడనొక్కొకకొఁగించుకుందన్.

క. ఇపుడాప్తులతోడన్ బహు
నృపులుదదుత్సవమునకు ననేకస్థితులన్
ద్రుపదాధీశ్వరుపోత్రిలికి
నపరిమితానందమొప్ప నరిగిరికడఁకన్.

సీ. అడిగినయంత పప్పాజ్యపూర్ణంబుగా
నన్నంబుదప్పళంబావచారు
తగమంచిభక్ష్యముల్ పోగిచినకూరలు
నానపచ్చళ్ళు పాయసము మఱియు
పెఱుగూరుఁగాయలో ప్పెసదక్షిణలతోఁ
ధరణిసురాళి కాదరముమీరఁ
బాన్గతుఁడటహర్షన్ భరితుఁడై తనపుత్రి
యుత్సవంబు ననిట్టు లొనఁగుఁగాన

గీ. రండునిక్కంబుమీరు శీఘ్రింబయచట
విజయసిద్ధిని సుఖమున వెలయఁగనెద
రోమహాజనులార యిందొనరఁబార్థ
తనువిచారింపకనిన సంతసముదనర.

చ. అతులసుధామయంబుగ ధరామరుఁడీగతిఁబల్కుపల్కుప
శ్రుతియునుఁబోలెనాత్మనిడిసుస్థితినేఁగెడుభూమిదేవతా
ప్రతతులఁగూడి పాండుకులపాలురుబాలురు నెమ్మితోఁడబా
ర్ఘతు నగరీవిశిష్టపథసౌఖ్యములెంచుచుఁబోయిరున్నతిన్.

వ. మరియు వారు సంతతప్రయాణంబుల ననేక జనపదంబు లుగడచి లాక్షాగార నిర్గమనప్రకారంబుగ్గడించి పాంచాలపతికిహ ర్షోన్మేషంబుగాఁ గలదని తలంచుచు సాక్షాత్కారంబున వర్ధమా నంబగు భుజప్రతాపానలంబుచందంబున ఫల్గునబాహుదండ మం డితాలాతభ్రమణజాతకాంతులచే నిశియనుకాంతకు సీమంతప థంబునుంబోలు పథంబున సురపథవాహినీ సమీపంబునకరుగ నచ్చట.

చ. కలశమహాఘాదధిఁగమల కర్ణికనున్నరమావధూటి ని
ర్మలశరబింబముల్ ప్రతితరంగములం గనుపట్టునె ఖరిక్
దెలిపెనుకాంతలంగలసి దేవనదింజలకేళిసల్పు చ
బ్బలియులనాగ నా తెరువుపట్టునఁ జిత్రరథుండుకోర్కిధిన్మై.

వ. ఇట్లుగెలువ నుత్సుకుండగు సమయంబున.

క. నరుఁడాగ్నేయాస్త్రము వి
స్ఫురణంబరగింపనదియు భూరిజ్వాలల్
గరముకుదేరఁ గుశీలవ
వరునిశతాంగంబు భస్మమై ఖరిఁదెలిపెక్.

గీ. ఆమరుత్తటినీతటా భ్యంతరముల
జలముశీతముమాని యుష్ణతనుజెందె
గర్వధూర్వహుఁడైన గంధర్వపతికిఁ
దాపహేతుకమగుచు నుత్తలమొనర్చె.

క. కురునందనులకునప్పుడు
సరభసనఖ్యమునవాఁడు సంతుష్టుండై

సురుచిరమగు తెరువునుబలె
పరఁగెనునిజనీతినొసఁగి పంచెను వేడ్కన్.

క. అనుజులతో ధర్మజుఁడట
జనుచుండియు ధౌమ్యుఁ గాంచి దాని
ట్లనుప్రాశీషింపఁగ
యనపదపీడనముఁ జేసి యలరించె పగన్.

సీ. తగినయాతిథ్యవిధానంబుననుబ్రీతుఁ
డై వారువనవసులగు మనమున
ధౌమ్యుఁడల్లనసుధా ధారేయముగు ద్రాప
దీస్వయంవరకథఁ దెలుపుచుండ
సధరిశమములేకయులరు మరెంపుమూ
డనుగులబలెఁ దోఁచె నాపథంబు
మఱియుభూసురసంఘ మధ్యమార్గంబున
నరుగునేగుఁదదక్షిణాత్ములదరె

గీ. శుభముఁడై నాఁబొంపురాట్సుతులుదొలుత
గాంచిరొక్కకులాలు నగారవుచట
ద్రాపదసవోమానమాద్రవ్యముందు
జూడఁబోయె నతెఱఁగొప్ప వేడుకలను.

మ. ఘనసౌందర్యవికస్మోదయు లసంఖ్యానీకనీయుక్తులన్
జనపాలోత్తములాత్మబాహుబల చంచత్స్ఫూర్తులంతంతఁబ
ద్యనిబద్ధస్థితివందిబృందములు సద్యస్కంబులౌ చిహ్నలన్
గొనియాడంజనుదెంచిరా నగరికిం గోర్కుల్ విజృంభింపఁగన్.

మ. యదుసైన్యోద్ధత ధూళిపుంజమునసముద్యద్రోచిస్సోధముం
గదియింపన్ రభసంబుతోడ హలియుం గంసారితోఁగూడి యే
పొదవన్ వచ్చెను నామకృత్యములచేనొప్పె నహాలాహలం
బదియాహారమునాయుధంబునగు జన్యక్షోణిలోఁదాల్పఁగన్.

క. యదుసైన్యోద్ధతధూళులు
చదలునిరోధింపఁగృష్ణ సహితుండగుచున్
ముదమునదుపదునిపీటికి
విదితముగాహలధరుండు వేగమవచ్చెన్.

ఉ. బంధురమందుభిద్ధ్వని విపాటితదిక్తటుఁడున్నతైకసా
గంధికమాలికావలితకంధరుఁ డుజ్జ్వలసైంధవోరుస
ద్గంధగజాదిబృందములుకైవసమైచనుదేరవచ్చె నా
సైంధవుఁడంతనప్పరికిసైన్యసమాహితుఁడై చెలంగుచున్.

ఉ. చిత్రమణిప్రభోజ్జ్వలవిచిత్ర కనచ్ఛకకుండలస్థక
ర్ణత్రయమగ్రిమైయిరుదెఱంగులనై యలరన్ మనోజ్ఞమై
గాత్రములొప్పనాత్మతనుకల్పులు దమ్ములుగొల్వవచ్చెన
న్మిత్రులతో సుయోధనుఁడు మిన్నటమంటుభిగర్జశోషిలన్.

ఉ. పాయనిభక్తితోడనెడఁబాయకవందిజనుల్ నుతింపఁగా
గాయకకోటిబాడనిజకాయమునందు నవీనరత్నగాం
గేయవిభూషణావళులు కేవలకాంతులుబర్వభూమిభృత్
సాయకునట్లు మత్స్యపతిస్యాలురతోనరుదెంచెఁజెచ్చెరన్.

క. పాంచత్కనకాభరణస
మంచితుఁడై హితులుగొల్వ ననుచరహితుఁడై

కాంచీదేశేశ్వరుఁడ
ప్పాంచాలునిపోలికఁజొచ్చె బహునుతులలరన్.

ఉ. కాయజసన్నిభుండు రిపుకాననపావకమూర్తిసంతత
శ్రీయుతకీర్తి శూలిపదచింతనశీలి సమగ్రదానధౌ
రేయగుణుండు తూర్యబధిరీకృతరోదసికుండు పాండ్యభూ
నాయకుఁడేగుదెంచెఁబ్రుతనాయుతుఁడై ద్రుపదేంద్రువీటికిన్.

ఉ. అంగకళింగవంగకరహాటమరాటకలాటఘూర్జరో
త్తుంగకరూశకోసలయదుద్రవిళాంధ్రినరేంద్రులాదిగా
నింగిమృదంగశంఖపృథునిస్సహణధ్వనిచేఁగఁలంగ మా
తంగరథాంగవాజి సముదాయములొప్పఁగవచ్చిరెంతయున్.

చ. పరిభరితప్రసూనచయ భాసురమున్ మణిమంచభాగ సు
స్థిరనరనాయకోత్కరము దీర్ఘమహాగురుధూపధూమధూ
సరితవితానమున్ ధ్వనిత శంఖమృదంగమునైన యాస్వయం
వర తతమంటపంబునకు వచ్చిరి పాండుకుమారులంతటన్.

మ. కలితేందీవరబృందమధ్య నివసత్కల్యాణి చందంబునన్
చెలువొప్పం దనుఁగాంచు రాట్సుతుల సచ్చిత్తంబధిపించుచె
న్నలరన్ ద్రౌపదిచెల్మికత్తియలతో నవ్వేళ మేల్పల్లకిన్
బలుశీవింజనుదెంచె రంగధరణీభాగంబు జేరంగమున్.

గీ. ద్రుపదపుత్రికముఖ శశివిపులకాంతి
కౌముదీశ్రేణి రంగరంగత్తటాక
కలితరాజేంద్ర పద్మ చక్రద్వయముల
చాలదూరస్థితులఁజెంద నోలిఁజేసె.

క. ధరణీసురమధ్యమునన్
వరుసనమాసీనుఁడైన వాసవివామే
తరకర భూషణమదరెను
దరుణింగొన నాత్మబలము దాఁదెల్పుగతిన్.

క. తరుణి జగన్మోహనసుం
దరి నద్భుతమందిచూచి తలయూచుచు నా
నరపతులంతర్గతముల
నరుదారఁగఁ బొగడిరాశశాంకనిభాస్యన్.

చ. కిమిది ముఖేందు నందగొని కాంతనిరంతర కుంతలాంధసం
తమసము భాస్కరుంగెలిచి తజ్జయచిహ్న వహించురీతి నీ
కమలదళాక్షి పాపటనుగాంచఁగ నొప్పెడుచెందిరంబు ని
క్కము బలవంతుతోఁ జెలిమి కల్మిని సాధ్యమసాధ్యమున్నదే.

చ. నెలతుక వేణికిన్ భుజగనేతయుఁ బాత్రుఁడెపోలఁజాలనా
పొలుకువఁజూడనోడు నెనఁబోలుదునేనది నెమ్మినెమ్మిచే
దలఁపఁగఁగార్మొగుల్ మొనలఁదచ్ఛిఖినేపురి విప్పఁజేయఁగాఁ
గలదనతోఁట నాటియనఁగాక జలంబుడుగం జనున్ వెనన్.

సీ. కరభోరుకందోయి సరిఁబూనిసతతంబు
కమలముల్ భ్రాంతిచేఁ దమినిమునిఁగె
సుతనునేత్రవిలాస గతులనోడియువన
శంబరాళితమంత జడనుబడియె
భాసురాంగీక్షణ ప్రతిరాకగతిలేక
తొఁగగమిపగలొప్ప వగలఁదొరఁగె

కలకంఠకంఠి దృక్కులనమించఁగలేక
ఖంజరీటము చెల్లఁ గలయఁదిరిగె
గీ. చూడ రెదారును దమ్ము రజోగుణైక
మతులునాత్మాత శీలదుర్మార్గచారు
లతితమోవ్యాప్తిఁ దగుజడస్థితులు పశు
పాతులగుట్రి మలిఁ స్వభావులెపుడు.
చ. తిలకసుమంబు నాపెఁగయుఁ దీరనిఘోరతపంబు పల్లవా
కలనముజేసి సాటియనఁగంటిమి కామినినాసనంచు ను
త్కలికనుగాంచి యుబ్బియు నధఃస్థితిఁజెంది హృతాత్మగంధతన్
గలిగియు బీజభూతములుగాఁ దుదిముట్టని జన్మకోటికిన్.
గీ. బాలతనభాలమునకైన మాలి విధువు
బహుళముగఁగొంత వలవంతఁ దహతహలను
గ్రాగిసగమయి తలక్రిందుగాఁ బడంగఁ
దలఁపదయచేసి పోల్కగా నిలుపునేమొ?
చ. మొనసిసతీసహాయతను ముజ్జగముల్గెలువంగ మారుఁడే
పునఁగొను కార్ముకద్వయము భ్రూయుగదంభముఁబూనెనిక్కువం
బనఁదగుఁగాని-చో నవి తదాకృతులన్ ధరియించుటెట్లు పెం
పెనయు నతిక్షమాకలితునేని మనంబు హరించుటెట్లగున్.
గీ. ముదితకలరారు శుభపదమూలఫణితి
శ్రీలకును శ్రీలు వినతులు జేయనెనఁగు
కుండలోన్నతులీ శ్రోత్రగురువిభూతి
పరగ శ్రీకారమనుమాట పాతరంబు.

చ. విమతుజయింపఁజాలని వివేకి విదేశమునొందనొండె ని
క్కముశరణొందనొండె నటుగావున నర్ధశశాంకమూర్తి యీ
రమణికపోలపాళికిఁ బరాజితుఁడై పరదేశియై సమ
క్షమమునఁజో వశుండగుచు సారెకుఁదత్ప్రతిబింబ దంభతన్.

సీ. తొలు కుభృదాప్తి సిందూరంబు దవిలి ర
జోగుణభ్రాంతిచే సొగయదేని
పరహస్తమునఁబట్టుఁబడి నిలువెల్ల నీ
రగుచు లత్తుక యడుగంటదేని
రహిఁదక్కి సహజావరణములోపలనిక్కి
కెంపుమందపుఁగాంతి నింపదేని
జీవనంబారుటచే నెండనవసిభూ
కమలమామోదంబుఁ దెమలదేని

గీ. యంతరంగముదూలిన యట్టికతన
తంతువునఁజిక్కి పవడంబు దళమునొరసి
పరఁగనబలాళికెపుడు చేపడదయేని
చెలువకెమ్మోవితోసాటి సేయవచ్చు.

చ. కరములతోడఁ దానుసరిగాంచెదనంచుఁ దలంచిపంకజో
ర్కమటజీవనంబుగను దాఁచినవస్తువులెల్లఁగొల్లఁ గా
నరయఁగదానివేగ సుహృదాళికొసంగిన జూడనొంది త
త్కరలలితావలంబన వికాసముచే నెనరారువ్యర్థమై

చ. వనితరదాళికిన్ సమమువచ్చుటలేమినిఁజేసి చింతచే
ఘనతరకుందకుట్మల నికాయముగానలఁజెందిమూర్ధముల్

తునుకలుగా విరంబడియెఁ దొల్తటి సౌరభ మెల్లఁ దప్పి తా
ననిశము వాడి మల్లి పొడిమై చనెఁ బ్రభుతాపవహ్నులన్

సీ. ద్రిమ్మరునాబోఁ గరమ్ముల చెల్వెంత
తంత్రితోఁ దగుతుంబి ధైర్యమెంత
ముచ్చుముగ్గెనుతిమ్మి మొగడలదశమెంత
వడిసుళ్ళఁ బను బంతివసువదెంత
సరవికిఁ జీఁకుఁ దాచకాశ్రిళిగతియెంత
పండబడ్డసులాద్రిబల్మియెంత
మోము వెల్చెసుకుంభములవివరంబెంత
సొత్తులలోఁ దాళవృత్తమెంత

గీ. అనుచు నాడెమ పలుకెంచి యాదరించి
పట్టి మన్నించి కైకొని ప్రభకుఁ దెచ్చి
వెలయు నటులను జేసె నివే శుభాంగి
గబ్బిసిబ్బెపుగుబ్బలు కావె జగతి.

క. తరమా! లసితభూరికం
ధరకొగినెన సేయ నొకటి దరమునయినఁ దా
దర మొప్పఁ జేసి విభ్రమ
గరిమన్ లోఁగనుచు నూదుకనఁ బోదె యహా.

ఉ. కోమలియాననోష్మశిఖికుండము నాభి పరీమోహార్తన్ జన
స్తోమము రెప్పపాటిడక చూచెను చూచుకులుస్రువంబులో
కాముఁడు హోమము జూకుఁ దుతగంబరిపంధికొనర్చు యంత్రపుం
బామిదిరోమరాజియనఁ బట్టునెయూహఁ దలంచి చూచినన్.

క. శైవాలంబారనియెడఁ
భావనవాదింపనమ్ము బయలై పిరుదున్
దీవియగు తెలియనేర్చిన
కోవిదులకుఁగాకఁ బొగడఁ గొందఱమగునే?

ఉ. ఆరికమారికాతనుశరాసనయష్టియనుష్టిఁ బూని చె
న్నారుచనంగునంగుళసదంతరసీమలమధ్యము ద్రిరే
ఖారమణీయమయ్యె వెనుకం బెనువ్రేలిడనొత్తి కేతకీ
చారుసుమంబువోలె శిఖ లెసంపద బెంపగునిక్కువంబుగన్.

శా. ఆవర్తంబులు వెళ్ళబెట్టి సుహాసయ్యద్రిప్రభూత......
ద్రోవం జేయుఁగ నీచరూపముల సందోహంబధఃపద్ధతిం
బోవంబంచఁగ వారివారివివరంబుల్గాంచి శిక్షింపఁగా
నీవామాంబుజనేత్ర పొక్కిలియదా నీశక్తిచుంబూనెడున్.

గీ. భుజగనాథుండు చలివేణిపోల్కి లేక
తనతనువు వ్యర్థమనియెడు తలఁపుచేత
పాండురుచి డస్సిపుట్టి రోపలనఁజిక్కి
యున్నఁడని వెచ్చనూర్చెక యుక్తిలేక.

క. కౌనతిపేదతనంబున
కౌనయినన్ మదనుసిరుల నౌత్సుక్యశ్రీ
కౌనన నణువగుఁ బిడికిటి
కౌనా? మరుదశనరాట్ఫణాళికిఁ బొగడన్.

చ. కనుగలవింటి జోదఖిలకార్ముక తంత్రము లభ్యసించుచో
నునిచిన లక్ష్యసైకతసమున్నతియా జఘనోక్తిఁ బల్కఁగా

ననువగుటెట్లు నాభిమిషన్ నగ్రతలంబు విముక్తకాండ సం
జనిత బిలప్రదేశమది జాలదెధాత్రి నిదర్శనస్థితిన్.

చ. తిరముగఁద్రిప్పి చక్రములఁ దిన్నెలకుప్పలఁ గూలవైచి ని
ష్కరుణ నగాధిరాజతతికాపులజేసి విచారవేదులం
దరియగఁ దీయకీతరుణి దట్టపుగొప్ప పిఱుఁదు రేఖసుం
దరగతి రాజు మంత్రియును దానయిధాత్రి భరింపఁజొంపగున్

మ. మకరశ్రీలను నీటముంపఁగను సమ్యక్కాహళశ్రేణి నూ
దుకపోవం గమనీయతూణముల కద్దుల్ జేసి రాకుండ వె
న్కకునొత్తన్నవశాలి గర్భముల విన్నాణంబుఁ దానడ్డనే
యక యెంతేనిఁ దృణీకరింపనగు నీయబ్జాక్షి జంఘాకృతుల్.

గీ. కమఠపతిచెల్వ మీఁగాళ్ళక్రమముతోడ
సమముగాలేక కడుసిగ్గు చాలఁబొడమి
తలయచూపదు చూపెనాతత్క్షణమున
సొరిదిదాఁచుచు ధరక్రిందఁ జొరకయున్నె.

క. నెల నెల తల తల తలమనఁ
గలయుల చెలిపద నఖముల గమిముత్యములన్
దలఁపవు దలఁపవు నవకణ
ములవలె నిరసించుఁ బేరుఁబూనఁగ నంతన్.

వ. ఇట్లు బహుప్రకారంబులఁ గొనియాడుసమయంబున సత్వసవేగుండగుచు సాత్వికుండగు ప్రద్యుమ్నునితెఱంగున ధృష్టద్యుమ్నుండరుదెంచి స్వయంవరకుతూహలంబునఁ బరివారసహితుండై వఱతెంచుపన్నగాధిరాజుచందంబున మండన మండితంబు

గు నొక్క కాండసహిత కోదండంబు రాజమండలసమీపం
బుననుండనొసర్చి ధన్యులగు రాజన్యులనుద్దేశించి యిట్లనియె.

ఉ. ఓనరపాలురార! దివినొప్పశరవ్యముఛాయయిందిదే
దానిశరంబుచేఁబడఁగ దక్షతనేయసదక్షిణంబుగా
మానకవానికీధనువుమౌర్వికరంబునఁజెందినట్లు స
మ్మానిత నాసహోదరిని మచ్చికనిచ్చుటనిచ్చెదందగన్.

వ. అనిమరియును.

ఉ. ఈగతిఁబల్కసర్వజగతీశులు పీఠములందుడిగ్గి వే
వేగఁగరద్వయంబులను విశ్రుతచాపముఁబూనితమ్మదా
రాగుటకేప్రయత్నముల నందుదురంతియకానిమౌర్విపై
రాగముగల్గియత్నముల రంజిలుటెల్లనుగల్లయెకడున్.

ఉ. అంతటరాజకంబుగని యద్ధరణీసురసంఘమధ్య మ
త్యంతముదంబునన్ వెడలి యర్జునుఁడార్జవమొప్పబాణమొ
క్కింతశరాసనంబున నుసేతముసేయనృపాళికెల్లఁజి
త్తాంతరమందులజ్జయునృపాత్మజకుంగుతుకంబునూల్కొనెన్.

క. ఆనరువిశిఖముచేతవి
లూనంబగుమూలమున విలోకనమాత్రం
బూనినచక్రభ్రమముల
మానుగలక్ష్యంబుబడియె మహిపై నంతన్.

గీ. నిక్కమిందరియందు వీఁడొక్కరుండ
బాహుపటిమనుఁదగునని పలికిరపుడు

పుష్పవర్షంబుదేవేంద్రు పుత్రుమీఁదఁ
బరఁగెఁబుడమినిసురవరోత్కరమువలన.

విభూతివృత్తము-అందువిక్రమేందిరా
మందహాసముం బలెన్
డెందముల్ ప్రహృష్టినిం
పొందె సజ్జనాళికిన్.

వ. అంత.

క. పాంచాలిపుత్రి చూడ్కులు
కాంచన మాంగల్యమాలికాతిరణంబై
ప్రాంచద్గతిగల యులయలి
సంచయములరీతిఁ బాండుజాతునిఁ బొదివెన్.

మ. పరిఫుల్లోత్పలకాబ్జ గుంభితనభోభాగీరథింబోలి త
ద్ధరతిన్ గుల్కెడు నొక్కసంపెఁగలదండన్ బాండుభూమండలే
శ్వరుగారాబుకుమారుకంఠమునఁ బాంచాలకుమానాథు కూ
తురువై చెన్సురమర్త్యదుందుభులసందోహధ్వనుల్ మీఱగన్.

వ. అంత.

చ. చిరతరమాసమగ్రగుణశేఖరితైకధనుఃప్రకృష్టిచే
స్థిరతరమాసమగ్రగుణశేఖరితైకన్నపాలకన్యకం
గరమరుదారఁగైకొనియఖర్వపరాక్రమశాలిపాండుభూ
వరవరపుత్రుఁడాసభనవారితవృత్తినిఁబోవునత్తఱిన్.

ఉ. అచ్చటికొంతరాజకులమగ్రతరాగ్రహమొప్పవీఁడె బ
ల్యుచ్చితుఁడొక్కవిప్రునకుఁ గూతునొసంగెమముంగణింపకన్

జెచ్చెరవీనిఁద్రుంత మనిసేసి యటంచుఁదలంచి పార్థతుర
హెచ్చుగమూఁగుమూకలసహింపక బ్రాహ్మణకోటియొప్పనన్

గీ. సులభగతిఁజెందు రోషవిస్ఫురణమీఱ
వ్రేలుజన్నిదములు చెవివేగఁజుట్టి
నాది యీదండమిది నాది నాది యనుచు
జాతచాపల్యమున నాద్విజాతి జాతి.

క. రయమునయుద్ధంబునకై
భయదోగ్రస్థితులనడచు పారులను ధనం
జయుఁ డల్లననవ్వుచు మీ
జయకరణము జాలునంచుఁ జలముడిపియటన్.

ఉ. ఆలములోనరుండు విశిఖావళిచే నెదిరించినట్టి భూ
పాలురఁ గాండిశీకతను బొల్పడఁజేసినయంత వారిజం
ఘాలతఁదాల్చునట్లు తురగంబులు దూర్ణతభానుఁగొంచుఁబ్రో
ల్లాలిత పశ్చిమాంబుధి జలంబున కేఁగినరీతి నేఁగఁగన్.

చ. అలర ధనంజయుండపుడు నయ్యైనదత్తకళాకలాపికో
జ్జ్వల దయితాతికాంతి విలసత్స్థితిఁ జేసినమాడ్కి వేడ్కచే
నలరి ధనంజయుండపుడు నయ్యైనదత్తకళాకలాపికో
జ్జ్వలదయితాతికాంతి విలసత్స్థితిఁజేయుచు నేఁగె నయ్యెడన్.

ఉ. ఘనుఁడగు నాధనుర్ధరుఁడు గామినితోఁ బ్రణమిల్లి భాలసం
జనిత లసచ్ఛ్రమాంబువుల జానుగఁ దల్లిపదాంబుజాతమున్
జననిప్రమోదబాష్పములఁజయ్యననింద్రజుమౌళియుంబ్రియం
బున నితరేతరార్ద్రితలఁ బొందెఁగులాలరు విస్మయింపఁగన్.

చ. కువలయదృక్కుచద్వయము కుంభములన్ భువిగెల్చెనంచునా
కవులన దంతిమస్తకము కర్మముగా మదిసంతసించి త
ద్భవనముఁజెందుపార్శ్వతునిఁబట్టిఁ గుచోన్నతిఁగాంచినంతఁజే
లవనిజకుంభమానని కులాలుఁడునిశ్చితుఁడయ్యె లజ్జచేన్.

వ. అంత,

సీ. వినుతోదయప్రౌఢిఁగని విబుధశ్రేణి సం
భావనలుగాంచి సాధుమహిమ
నగ్రగతానూరుఁడై సొంపునాటించె
బలివృత్తితోడ సత్పదములలర
నభమెల్లఁబర్వియున్నత లసన్నారాయ
ణాప్తిచేమించి ద్విజార్తిఁదీర్చి
కౌశికార్జవతిరస్కారంబుగావించి
కమభుజంగావళి బడలుపఱచి

గీ. యాత్మదర్శనమాత్రన నఖిలభువన
జనులఘనతమమును ద్రోలఁజాలి శాంతి
జెంది మెల్లనఁ బశ్చిమశిఖరి శిఖర
సంగతికిఁజేరెనపుడు పతంగమూర్తి.

గీ. అపుడుపరదేశగతుఁడైన యాత్మవిభునిఁ
బంకజాసనపద్మిని భ్రమరకములఁ
దొలఁగద్రోచిమరందాశ్రు వలరఁజూచెఁ
దమినిమునుగంగఁగలదని తత్క్షణమున.

సీ. పాథోధిజఠరదుర్భరబాడబక్షేప
గతినొప్పువిస్ఫులింగమ్మనంగ
కైటభాదినిశాట కోటినీటనడంప
నెమ్మిసేగుసుదర్శనమ్మనంగ
వరుణావరణలసద్వజ్రగోపురకూట
ఘుంభితతపనీయకుంభమనఁగ
హేలానటద్దివ్యబాలికాకరతల
గళితమాశోణపంకజమనంగ
తే. చరమగిరిడిగ్గియక్ష్యగోచరతఁబరఁగి
పదములఁబయోధినూఁదుచుభాసమాన
కరములాలంబనముసేసి గగనతలము
జరఠపద్మాప్తుఁడునుగ్రుంక సాఁగెనపుడు.
గీ. పూర్ణమైపూర్ణకల్పమై పోవఁబోవ
నొక్కత్రుటికాలమునఁదోఁచె నుదధిమీఁద
చండరుచిఁదక్కుమార్తాండ మండలంబ
జాండఖండముగతినుండి యస్తమించె.
చ. కలువలుకన్నువిచ్చెఁగడకంగలతమ్ములు నాత్మనొచ్చెఁ బ
త్తులరొదగూళ్ళఁజొచ్చెవగఁగూరెదమింకనటంచుఁగోకముల్
కళవళమందఁజొచ్చెనెఱిగల్గిచకోరచయంబుమెచ్చె ను
జ్జ్వలతరపద్మరాగముల చాయకుమిన్నులువచ్చెఁజెచ్చెరన్.
మ. ఒకరోలంబసతీలలామ మకరందోద్రేకపంకేజకో
రకగర్భంబునఁదేనెయానఁగనుదద్రాజీవమున్ మున్గచోఁ

జకితంబై వెడలంగలేనిమొడనోజందద్విభుండా ర్తియా
రకపైఁగుఱిమ్మఱఁజొచ్చెఁజీఁకటికిఁజారత్వంబుసూచించుచున్.

క. ఆసమయంబునసంధ్యా
భాసురభూసురకరాబ్జపాథఃకణసం
ఘాసారంబులు నెగసెను
గాసారములమరదీర్ఘికంగదియుగతిన్ .

చ. పలపలనై వెలుంగులను పత్రముఁలూడ్చి చెలంగుసంజకెం
జిలుగుచిగుళ్ళసందులనుజెన్నలరారి సభ స్తమాలముల్
బలువగు తెల్వఁగల్గియలపాకవిరోధి దిగాదిగాఁ గడున్
గొలతలనొప్పుతారకలఁగోరకితంబుననయ్యెనయ్యెడన్.

చ. పరధరణీధరాధిపునిపై దళమెత్తి యినుండుఁబోవుచోఁ
దిరముఁగఁబద్మినీనిలయదేశములన్ లసితప్రతాపులన్
జరిచరులన్ స్వకీయులను బల్వురఁగావలి యుంచుభంగి న
ప్పరిగృహమధ్యభాగములఁ బొల్చెను రత్నమయప్రదీపముల్

గీ. విరహిలోకముపై దాడి వెట్టఁదలఁచి
కుసుమశరుడింద్రదిశవైచు వసన మంది
రంబుశిరమునఁదగుమహా రజితకుంభ
మనఁగ నంభోజరిపుఁడుద యాద్రిఁబొలిచె.

వ. మఱియు సర్వజనంబులు దత్సమయ కృత్యంబులు నిర్వ ర్తించి వ్యవహారంబులు పరిహరించి నిద్రాముద్రననుకరించియుండు సమయంబున.

గీ. అంతనేణాంకుఁడపర దిగంతమునకుఁ
జనియెరాతిరిఁ జరియించు జంతుసమితి
గ్రుక్కఁగాముకులెల్లను జుక్కరనఁగఁ
జుక్కవోడిచెనుబ్రాచి చేర్చుక్కయనఁగ.

చ. ఇగమురులందెరల్పుచు నొకించుకవచ్చిన తమ్మిమొగ్గలం
బగులఁగఁజేసి తేనియలఁ బాఱఁగఁజల్లుచుఁ దేటిగుంపు గ్ర
మ్మఁగనెగజిమ్ముచుం బ్రణయమానవతీప్రతతిన్ హృదంగముల్
విగతమొనర్చుచున్ విసరె వేకువజల్లని కమ్మతెమ్మెరల్.

ఉ. తియ్యనివింటిదంటదొర తియ్యనివేడుకతోడనాటిరేఁ
గయ్యమొనర్చి తమ్మిచెలికాఁడికరాఁగలడంచు నెయ్యపుం
దొయ్యలికిచ్చెఁ గైదువలుతోడ వసంతుఁడురాఁగనేఁగెఁదా
నయ్యెడ శంకదక్కి పథికావళిడెందముకుందువాయఁగన్.

క. కూటపుబడలిక నడరిన
పాటలగంధుల ముఖాబ్జభావంబును వా
చాటసఖీజనములకును
దేటపడం దెలిసెనపుడు తేజములలరన్.

సీ. వలిగట్టుదేవతావళిభర్తృపై నెత్తఁ
గిన్కరప్పించు స్వకీయులనఁగ
పద్మినీవైరిసంప్రాప్తదోషుండని
రవిచూఱఁబట్టుసర్వస్వమనఁగ
దశదిశాంతరలక్ష్మి తనువుగానఁగనీక
కడువేడ్కఁబచరించు కవచమనఁగ

రత్నగర్భరజోవి రాజితమైనింగఁ
గలయనుద్యుక్తమై కదలెననఁగ

గీ. తరచుగఁదరులనలమి యుత్తరముదవిలి
గర్భగేహాంతరంబులఁ గలయఁబర్వి
తరులతాకలితోర్ణాభ తంతుసమితి
గానఁబడముంచె నుసుమంచు గలయఁబలసె.

వ. మఱియు సురుచిరరాంకవ కంథాబంధుర సంధానితభోగి యోగినిరీక్ష్యమాణేంగాలహసంతికాలాతజాతజాతంబును, సకలజన ప్రకంపితాధరపల్లవ పుటఘటిత దురంతరానేకవార సంపతితపటు తరదంతచ్ఛటచ్ఛటారవ సంకలితసీత్కారభాసురంబును, ప్రణయ కలహోపకృష్ట కాముక నికరకంఠాలింగ నాంగీకార పంచశరసమర సముత్సుకిత సుందరీసందోహంబును, కరచరణపరిచలనశయన వల మానకుండలీకృత వృద్ధజనదేహనివహంబును, ప్రకంపితభువనంబు ను, దరిద్రజనాలింగితేంగాలంబును, విధూతకుచేలజాలంబును, ది వాకరకరకౌతుకిత దిగంబరంబునునై హిమంబొక్క ముహూర్తం బున కుమగునంత.

మ. అహమయ్యెఁ నిశిమాసిఁదారలడఁగెఁ హాషణంబు చేనర్కుస
న్నిహితంబౌనిట పూర్వపర్వతమునఁ నిక్కంబనందాద్రుచూ
డహితోద్దామసత్స్వరస్వరితమంటఁ నొత్రిగెఁద్రేధాస్థితిఁ
గృహవాటీనికటస్థలంబులఁద్రివక్రీభూత కంఠధ్వనిఁ.

క. వెలవెలఁబారెనుదిక్కులు
కలువలుకలవలమువిూఱెఁ గమలములొప్పెఁ

గలకలఁబలికెనుబక్షులు
తెలతెలవారెనువెలుంగు దేటఁజెలంగన్.

సీ. సహసాహరిన్మిరీ క్షణసముద్భవలస
చ్చటకాది కవి రణత్సంకులంబు
దధిభాండమంథాన దండభ్రమోద్భిన్న
ఘుమఘుమస్థిరఘోష ఘోషణంబు
ప్రథితరాట్ప్రాంగణ ప్రాంతతూర్యారవ
బధిరీకృతాశాంత పాటవంబు
పరిగళత్స్వాపప్రపంచసంచారిత
కార్యతత్పరలోక కలకలంబు

గీ. శమిత తనుతరనక్షత్ర సముదయంబు
పతితభూపాలరాగాది భాసురంబు
పాటలితదిక్తటప్రాంత బంధురంబు
నగుచునపుడుప్రభాతోదయంబుదనరె.

క. అరుణోదయరుచిసురుచిర
తరభాసురకరకిరద్వితతసూర్యాభ్యఘోవ్
త్కరముకరంబలరారెను
బరువంబగుకెంపుసొంపు పంపులఁబెంపన్.

గీ. ప్రాక్సతీభాలకాశ్మీర పత్రమనఁగ
నుదయగిరిశృంగసంగతి నొప్పెనినుఁడు
చరమగిరికూటపాళిని జరఠకమల
కందఖండారుణద్యుతి నిందుఁడలరె.

శా. యాతాయాతమిళిందబృందమృదుసమ్యగ్ఘాంకృతాలంకృత
స్ఫీతంబై కుముదప్రసూనపటురాజీవస్ఫురత్కోరక
వ్రాతంబేకనిరూఢి మోములరమోడ్పన్ విప్పఁగానొప్పెన
మ్మైత్రాల్మిందగఁగీడుమేళ్ళులకు సామాన్యంబుదెల్పంబలెన్.

క. కుముదాంబుజ షట్పదంబుల
నమలంబుగనొప్పనమ్మహాసవ రసముల్
ప్రమదంబునమధుపద్వయ
సముదయమునపీతకేళి సవరించెఁదగన్.

చ. తరుణతరారుణాంశు కర దంభవిడంబితయష్టిఘట్టనాం
కురితవికాసపద్మనవకోరకకోటరపాటవస్థితిన్
దిరముమిళిందబృందము లుదీర్ణరవంబులమాటిమాటికిన్
బెరసితురాలునన్ వెడలినింగికివేచనుఝాంకృతంబులన్.

క. బాలాతపమపసీరుహ
జాలాగ్రములంజిగుళ్ళజత్తై శాభో
త్తాలాంతరములబం డ్లై
మూలంబులఁదత్పరాగపఙ్కులునై యొప్పెన్.

క. ఇరువురు పెన్నద్దులుగాఁ
బరువడితోఁబోరినంత భాస్కరుఁడలుకన్.
గరములద్రొబ్బినభంగిని
తురముహిమాంశుండు నపర తోయధిఁగ్రుంకెన్.

మ. హరిదంతస్థగిత ప్రభాకలిత రత్నాబద్ధగాంగేయభా
సుర సౌధాంతగవాక్ష రంధ్రనిపతత్సూర్యారుణాంశుస్థితుల్

పరికింపందగె మానినీహృదయ నిర్భగ్నప్రయతోన్నిద్ర తై
క రమాపుత్ర నియోజ్యమాన సదశోకస్ఫీతకాండంబులై.

వ. అంతఁ బాంచాలుండు గులాలగృహంబున నున్న పాండుపులఁ దన నగరికిఁ దెచ్చి వ్యాసవచనంబుల విదితుండు గావున నాయాజ్ఞసేని నయ్యేవురకిచ్చు తలంపున నుండి కొండొకకాలంబున,

క. పాంచాలికిఁ బరిణయమొన
రించఁగ మదినెంచి చెలులఁ బ్రియమున వేర
ప్పించి నరేశ్వరుఁడు నియో
గించెం గై సేయ నపుడు గీతిఁ జెలంగన్.

గీ. ఇటుల నొనరింపఁబంచిన నెసఁగుజనము
తాదృశానందమునఁబొంగి ద్రౌపదికినిఁ
దొడవులిడవేడ్కఁ బెండ్లికూఁతురినిఁ జేయఁ
గడఁగిరంతంత నై పుణ్యగరిమ మెఱసి.

గీ. ద్రౌపదికిఁ బంచవల్లభత్వంబు గలుగు
లిపిఁగనుంగొనురీతిని లేమ యోర్తు
తగినసీమంత శిల్పకై తవముచేతఁ
బాపటలరించె సిందూరపాటవమున.

ఉ. కన్నియనెమ్మొగంబనెడి కల్వలతేఁడతి కాంతకాంతిచేఁ
బెన్నెఱివేరిటంబొదివి పెన్నెఱిబందిఁకిఁబట్టి వంప నా
పన్నత దానిఁబట్టి తమపైఁగల తప్పడుపన్ జొహారుగా
నున్నవిధంబుతోఁచెఁ దిలకోన్నతి గోధితలాధిరూఢమై.

క. మృగమదతిలకంబిడ న
మృగునకు నబ్జోపమాన మహితంబగుచున్
మృగమదతిలకంబిడకయు
మొగమున నబ్జోపమానము సతికలరెన్.

క. నరరాజకన్య ముక్కున
నురువగు హరుమంజిముత్య మొప్పెను వదనాం
బురుహాంతశ్చర దుజ్జ్వల
తరహసిత మరాళిగ్రుడ్డు దాల్చినభంగిన్.

ఆ.వె. కాంతకాంతమౌక్తి కపుకర్ణపత్రముల్
సంతతంబు సంతసంబొసంగు
వదనచంద్రసేవ వదలనిపరివేష
భాలురనఁగ రెండు పార్శ్వములను.

చ. గొడవలికేలమోపి కెనఁగూర్చి మనుష్ణడిపించునెమ్మదిన్
జిడిముడిమాను మన్వి యని చేతులుచెట్టలుబట్టికాళ్ళపైఁ
బడిపడిబడ్డభంగిదెలుపందగెజత్తులు కెంపుటుంగరం
బడుగులయందులత్తుకయు నాసతికాళులలంకరింపఁగన్.

చ. సురుచిరహేమమౌతరుణి శోభకునై తగి కర్ణపత్రమై
ఖరినలరన్ రహస్యమెసఁగన్ జెవిఁ జేరినసీరసించి వే
గరముతదాశయంబు వెలిగాఁగొని లోఁగొనికుండలీకృత
స్ఫురణమునొందఁజేసెనని జోటికమర్చిరి కర్ణపత్రముల్.

క. తెలిము త్తెములీసుందరి
పలుదెరఁగులఁబొందననెడు భావముమదిలోఁ

క్షేపాసహానపురోహిత
కోపమునకుఁ బాత్రమయ్యెఁ గుచశిల్పమటన్
వ. ఆసమయంబున

చ. తనరనలంకరింపనగు దానిఁగనుంగొని భాస్కరుండు దా
ననువగుసంజ లత్తుకలనద్దుతనుప్రభలొప్పలోపునం
జనతిలకాంచితస్థితినిజాలపరాంగనఁ బెండ్లియాడనే
గినగతి నాప్రతీచికడకేచనెఁబద్మినినీటమున్గఁగన్.

క. ఆసమయంబునసంధ్యా
భాసురభూసురకరాబ్జ పాథఃకణసం
ఘాసారంబులనెగసెను
గాసారములవఁరదీర్ఘికంగదియుగతిన్.

చ. పలపలనై వెలుంగులను పత్రములూడ్చివెలుంగు సంజకెం
జిలుగుజిగుళ్ళసందులను జెన్నలరారి నభస్తమాలముల్
బలువగుతెల్విగల్గి తగభాసిలు వజ్రిదిగాదిగాఁగడున్
గొలగొలనొప్పతారకల కోరకితంబుననయ్యెనయ్యెడన్.

గీ. యోగిమానసాబ్జ జేగీయమానను
జ్ఞానతతితమోవి తానములను
మాన్పితేజరిల్లుమాడ్కి నప్పరిగృహ
వాటిదీపకోటి తేటపడియె.

సీ. గరకంఠకంఠ దుర్ఘటకోటరోత్థిత
క్ష్వేళవిక్షేపరుక్పాత్రమనఁగ

విలయాంతనిర్భరా విఖ్యాతదుర్వార
తమతమఃపటలసంతతియనంగ
దంభోళిధరమహాస్త్రనూత్నరత్న ప్ర
తీర్ణపూర్ణశ్యామదీప్తియనఁగ
పటునటత్కూటగోపశ్రేష్ఠగాత్రస
త్కమసేయనిబిడకాళిమయనంగఁ
గీ. బ్రిబలెబ్రహ్మాండభాండకరండగర్భ
మెల్లనిండఁగఁగజ్జలమిడినభంగి
జారచోరవిహారంపు జనులపెంపు
నింపుచలకింపుపరువంపుటిరులగుంపు.
శా. ఆపెంజీకటివెంటనంటఁ దలపంక్తుల్ యుంట వేనెంటనే
చూపెంబోఁబోడరాఁజకోరతతికిన్ జోత్స్నంపుమేల్పంట బ
ల్పాపంబుల్ విడగొంటు నోంటరికిఁదాపంటంటుకంజంటఖం
డాపూర్తిందలపెంట దంటతరచౌనావంటికెంజాయలన్.
క. వెలవెలఁబాఱెనుదిక్కులు
కలువలకలవలముదేరెఁగాముకజనమా
కులగతిమారెనుజాఱెను
బలపలనీహారజలము పాదపవితతిన్.
సీ. మునుమున్నుప్రాక్సతీ ముఖరాగమునఁదేలి
పిమ్మటగోరోచ నమ్ముపోలి
పిదపనాదివరాహ పృథుదంష్ట్రసరిఁగాంచి
వెనుకదిక్కుంభి ఘుంటనుహసించి

తర్వాతసిరిభాల తటరూఢిదనరారి
యంతటహరిచక్ర మనఁగమీరి
యామిఁదకనక కుంభాకృతిదిగనాడి
కడపటఁబుండరీకమును దెగడి

గీ. కళలఁ బెంపెక్కి జక్కవకవలఁ గ్రుక్కి
జడధిమర్యాద విడఁ దెంపి జాలునింపి
పుడమిఁ జీఁకటులెడఁ బాపి పొంపుగొండ
నండవిడియుండె నాశశి మండలంబు.

గీ. శిలలనై ననుసీరుగాఁ జేయఁజాలి
పూసఁగు చ్చఁగ వెలుఁగున బూసఁగ నెసఁగి
పిండిజల్లినభంగి జాబిల్లి నిండు
వెన్నెలలఁగాసెమిన్నంది కన్నువగుల.

చ. కలువలపొందుజక్కవలఁ గ్రమ్మినకుందుతమంపు రోగముం
దులిపెడుమందు వేల్పుల కుటుంబమువిందు సుధాపయోనిధిన్
మొలచినబిందు వంబుజ సమూహముపాలిఁటికందు మింటిపై
నిలిచెనుముందుకాంతి బురణింపఁగసొంపగు చందురుండొగిన్

క. ఆరాత్రిన్ దనవంశపు
వారగుపాండవుల పెండ్లి వైభవములరన్
గోరికనగుననిసాటొ
త్కారముజను దెంచిచూచు గతిశశియొప్పెన్.

వ. అంత.

గీ. సత్పురోహితవినిహిత సంవిధాన
ములనుబెంపగువేదికా స్థలముజేరఁ
జారుమరకతసోపాన సరణిఁబాంపు
సుతులువొందిరలంకార సుభగులగుచు.

సీ. అందుముహూర్త గుణావళియునుబలె
దీపసంతానంబు తేజరిల్ల
వరభూసుర శ్రేణి వదనాంబుజంబులఁ
బటుతరమంత్రముల్ పరిఢవిల్ల
దుర్వారమంగళ తూర్యఘోషంబులఁ
బృథుతరాజాండంబు పిక్కటిల్ల
సరససువాసినీ జనములనేసలు
నిజశిరంబునఁగల్గి నివ్వటిల్ల

గీ. రత్నకోరకితానేక నూత్నభూష
ణావళులచేతనాకల్ప యగుచునున్న
బాలికామణి నాథుల పాలికలును
వరులసన్నిధినిల్పిరి వైభవమున.

చ. లలనమొగంబునంగల విలాసరసంబున బెళ్కుసూపి పెం
పలరెడునేత్రమీనముల నల్లనఁబట్టెడు వెంటవేడ్క ని
చ్చలముగమన్మథుండనెడి జాలరుఁడున్నన జోపియేపునన్
వలవడివై చురీతిఁదల వంచినచోటికి జారెముంగురుల్.

క. ఇరుదెసఁ గుశలోగుశల
స్ఫురణవిచిత్రంబు రత్నశుభకుట్టిమమా

ధరణిఁగనఘ్న ధౌమ్యుని
సరినవలమునతనిబింబ సంస్థితినొప్పెన్.

చ. ఘనతరధర్మములు ప్రజలగాంచుడు దీనికతంబునంచు బ
ల్కినగతిశామ్యదిధ్మకృత కృత్యచటచ్చటనిస్వనోక్తి చే
ననుచుసముజ్జ్వల న్నిజశిఖాగ్రకరంబున వహ్నిపాండు నం
దనులలపార్థితుంబలె నుదారతదారతతాప్తికై తగన్.

ఉ. అంతటజాతుపాలయ సమర్పణతండగుకృష్ణవర్త్మ దే
హాంతవిభాసమానమగు నప్పరితోషముఁ జూడఁగోరి న
శ్లొంతయుఁబాండుపుత్రకు లభీష్టముమీరఁ గ్రమంబునన్ధరా
కాంతకుమారితోజ్జ్వలను గాంచిరిసారెఁ బ్రదక్షిణంబుగన్.

క. స్తనకఠినత్వ బలంబునఁ
బనుపడజయమందిపిదప భంగించుగతిన్
దనపతిపాణిధృతంబగు
కనదంఘ్రియొసంగెఁదరుణి గ్రావాగ్రమునన్.

గీ. పంచవల్లభహస్త విభ్రాజితములు
చెలఁగువిధిలాజలింతిచే శిఖినిఁదొఱఁగె
బాహువంశగళత్తత భాసమాన
మౌక్తికావళియునుబోలె మహితసరణి.

చ. తతవిధిబోధనాత్త సవిధస్థిరరత్నమయప్రదీపికా
స్థిత లసదిందిరాప్రతికృతిం ద్రుపదేశ్వర పుత్రికాకృతిన్
మతిఁగని తద్వివేచనత మాటికిఁదొట్రిలు నప్పరోధనుం
డతిశయమంత్రతంత్రములయందులవిభ్రమమొందడెంతయున్

మ. భుజసందీప్తఘనప్రతాప శిఖినాఁ బొల్పారువై శ్వానరుం
డు జయోదగ్రతసాక్షియై పరఁగఁ బాంచుత్క్ష్మాతలేశాత్మజుల్
నిజసామంతనృపాలధాత్రియుఁబలెన్ నిశ్చింతచేనప్పుడా
త్రిజగన్మోహినిఁ గాంచుఁగై కొనిరి నీతిందత్క్రమంబొప్పఁగన్

గీ. పరఁగఁ బాంచాలరాజునా పాండవులును
వరుసఁబూజకపూజ్య భావముల రెండు
నరయనాథ్యంభవిష్ణుత్వ మయ్యకించ
నత్వమునువ్యత్యయంబుల నయముగనిరి.

సీ. ఋజుమతినిట్లంత రిపులక్ష్యచ్ఛిన్న
లక్షణంబనుశుల్క లలితనిష్క
కలనస్వీకంఠ నిష్కాయితకన్యాభు
జాయితతగుపాండు చంద్రసుతుల
దళితైకనయవి కర్తనతనయోపాయ
మునమున్నసన్మంత్ర ముఖ్యలబ్ధ
పటుపలాయనమున కట ద్వితీయావృత్తి
విచ్ఛిత్తియనుగను విధముదోఁప

గీ. గడఁగిగాంధారిసూనులు కయ్యమునకు
దళముమెరయుంగనిస్సాణ దారుణాట్ట
హాసఘనసింహనాద నిర్హ్రాదములను
తలకపాంచాలపురి బెట్టి దముగఁబొదువ.

వ. ఇట్లు చుట్టుముట్టుసమయంబున నవ్వీటఁగలుగు మేటిపోటరులు
పృథుగతి యుద్ధసన్నద్ధులై వివిధాయుధంబుల నుదయోధను వరూ

థినింగల యోధులతోడ నాయోధనంబొనరించి శకలీకృత సకలా యుధులగుచుఁ బలుమనెడఁ బృథానందనులును రథారూఢులై పు రంబునిర్గమించి బవరంబునకేయకొనిరయ్యెడ.

ఆ.వె. విశిఖపంక్తిచేత వెసశత్రుబలములు
చూర్ణములుగవారి సుదతులకును
నంచితంబులైన నలకావళియునుజూ
ర్ణములుగాఁగ రణమునడపిరంత.

మ. ధృతశంఖంబునునూఁదుచుఙ్ జటులభేరీధ్వానముల్ సేయుచున్
దతకోదండనినాదముల్ నెఱపి యుద్దండక్రియఙ్ సింహనా
ద తతుల్ జేయుచు సిద్ధసాధ్యసురసంతానంబులగ్గింప వి
స్మృతవృత్తిందగియుండె రెండుబలముల్ ధీరాహవక్రీడలఙ్.

ఉ. ఆరణరంగమధ్యగమహారథికాళిగనంగ నెమ్మదిఙ్
గోరెడువీటిసాధ తతకోటిఖవాటితలోదరీసురీ
వారిజపత్రనేత్రలకవారిత సర్వరణక్రియోల్లస
ద్భూరిధృతైకమాల్యముల షొల్పువహించెను భేరికావళుల్

క. వరకరకౌశలసుధను
ర్ధర శరవిసరములరణము దారుణముగనొం
డొరులకునయ్యెఙ్ క్షణమట
నరయుఁగఁగాయముల గాయమంటకవెంటఙ్.

క. వరరథికుని రథికుఁడుకరి
కరినిహారికఙ్ హారిభటుండు ఘనభటునిఁబర

స్వగముంబొదువ్రుచుఁబోరిరి
సురముని విస్మయముతోడఁ జూడరయమునన్.

గీ. ఘనరజోవ్యాప్తి చిమ్మ చీఁకట్లుఁనింపఁ
గౌతుకాబద్ధలాంఛన కలనఁ గలన
నొండొరులుగా స్పృశించుచుఁ బాండుసుతులు
ఖండనముసేతు రరులేయు కైదువులను.

గీ. కర్ణుఁడదరి నిశితకాండ ప్రకాండంబు
బఱపి పగరగముల బడలువఱుపఁ
జూచివేల్పురేని సూనుంఘుగోదండ
గుణనినాదమొప్పఁ గూర్చియార్చి.

చ. వరసమరస్థలిన్ భరతవంశజు కార్ముక కౌశల క్రియల్
గురుతర మొప్పచుండ నరికోటిఁ గనుంగొనితారుబూని రౌ
పరఁగగతాగతాయువును భారపుఘుర్మజలోత్కరంబు స
త్వరమగు కాందిశీకతవిధానముఁ దత్తరపాటునత్తరిన్.

సీ. నిజధనుర్నిర్ముక్త నిశితశరోర్ములు
వర్మముల్ చించియు మర్మములను
దెరలుపఁ గౌరవుల్ ధృతిజెడిభయమునఁ
గ్రమ్మెడు స్వేదాంబు కణగణంబు
ప్రతిపదంబును ధరాభాగంబు దడపఁగ
సమరాంగణోదిత శక్రసుతయ
శశ్చతుర్థి నిజేశ ప్రథితైక క
ళావలోకనముల కజ్జుదిప్పి

గీ. రొక్కరొకరియాస నుజ్జగింపకభువి
యుద్రువధ్రువ శరాసనాది శస్త్ర
ములనుమఱచి హాస్తిపురిఁజొరఁబొఱి రి
తెంపుతోడ గెల్వ దేవుఁడెఱుఁగు.

క. రాజితకీర్తిని విజయ
భ్రాజితులై బుజాగుణములు రాజిల్ల లస
త్తేజోమూర్తులు పాండు
క్ష్మాజానికుమారులలఁత సైన్యముతోడన్.

ఆ. ప్రోలుజొచ్చిద్రుపద భూపాలుపూజల
శౌరితోడఁగాంచి సంతసింపఁ
బార్థుపటిమ బలము భావించిపాంచాల
పుత్రి సమ్మదమును బొందియుండె.

సీ. అంతనీవృత్తాంత మంతయునటనాంబి
కేయుండువినిసంధి కృష్ణువలన
నొనరఁగసోదర యుక్తు నద్ధర్మజు
రావించితగనర్ధ రాజ్యమునకు
నభిషిక్తుఁజేయఁగ నయ్యెడరాజప
దంబుననుండునా ధన్యుఁగాంచు
జనములనేత్రముల్ చల్లనై యలరారె
వందిజనస్తుతుల్ సందడింపఁ

గీ. దండ్రియనుమతిచేతఁ బృథాసుతుండు
సకలసైన్యముగొలువఁగ శౌరిఁగూడి

ధార్తరాష్ట్రులపై(న్న వాదాభమలర)
ఖాండవప్రస్థపురమున నుండెనెలమి

వ. అంత ననంతవిభవ సుభగత్వంబున స్మరణమాత్ర పాత్రి సకలశిల్ప పారదృశ్వుండగు విశ్వకర్మచేత నిర్మాపితప్రతికర్మయగుసు ధర్మకామనీయక సులభవిస్మయావలోకన కౌతుకాగతనిఖిలనిలింప సంపాదితభార భంగురాంగీకారతర రసాతలావలంబమానయగుచాఙ్నన నభోవిమానాయమాన దరదరుణకిరణగణ కందళిత కురువిందమణిమయ మందిర సందోహపాటవ కూటకోటి వియద్వాటి మాటిమాటికిగీటు నూటితేటపడ నేటుపాటింపఁ బ్రాసాద సమాసాదిత ప్రాంచత్పాంచాలికా సంచయంబులు వియచ్చరుల నచ్చెరువు పెచ్చు పిచ్చలింపఁజేయ నిస్తులసమస్తశస్త ప్రశస్తంబగుచునొప్పు శోభాభాసమానంబగునట్టి యింద్రప్రస్థ నామంబునం దగుపురంబున ద్విజాతమిత్రుండగు నజాతశత్రుండు సుఖంబున నుండె నంతఁ గొంతకాలంబున మురాంతకుండు తాదృశ సుషమావిశేషయగు నిజపురి కరదంబెక్కి సరభసంబున నరిగి సురుచిర భోగభాసురుండయ్యె నయ్యెడ.

ఉ. ప్రాణసమానమైన ద్రుపదాత్మజకాత్మచెలంగఁ బాండుభూ
జాని కుమారులుండునెడ సారెకువారలఁగాంచు వేడ్కలోఁ
బూని యిలాతలంబునకు భోరుననారదమౌనివల్లకీ
గానవినోదమోద రసికస్థితి మీఱఁగవచ్చెఁ జెచ్చెరన్.

ఉ. ఆమునిపుంగవాగమన మంతఁగనుంగొని తత్సభాజన
స్తోమకృతోజ్జ్వలన్నుతులతోఁ గలయుందనరారుచున్న వీ

ణామహితారవానుగత నవ్యమధువ్రతమాలికాధ్వనిన్
వేమరుదిఙ్ముఖంబులను వీకమెయిుందగఁ గప్పెఁగుప్పనన్.

చ. సురమునిఁజూచిలేచి యమసూతి వినమ్రతమౌళిమాలికో
త్కరవరధూళినోలి వెసఁదాపసకుంజరుపాదకంజముల్
బరఁగనిజాంతరంగము సపంకమపంకముగాఁ గ్రమంబుచే
నరుదలరారఁజేసి ముదమందె ననిందిత వైభవోన్నతిన్.

గీ. ఉచితపూతాసనంబుననున్న మౌని
చెంతలననంత సంతోషచిత్తులగుచుఁ
గడుఁదదాగమనాద్భుత కారణంబు
నూహసేయుచుఁ గురువిభు లుండిరంత.

ఉ. వందనవాదశీలనిరవద్య యశోదయసారెఁ బాండవా
నందవిధాత్రి యాద్రుపదనందన యమ్ముని యంక సీమపై
నందడిసేయుచున్న విలసత్పరివాది నినాదమంజిమన్
జెందెనొ లజ్జనన్నటులఁ జెంతనెమౌనముతోడనుండఁగన్.

క. జనములకోలాహలముల
ననుపమగతివేత్రహస్తు లడఁగింపగ స
జ్జనపతితోడఁబితామహ
తనయుఁడుస్మితమొప్పనేక తమ్మునఁబల్కెన్,

ఆ. వె. జాతుషాలయమున సమయక వెడలుట
రతినిఁబోలునిట్టి రమణిఁగొనుట
భూరిదుష్కరంబు లీరెండుకృత్యముల్
బడసినారుమంచి పనియకాదె.

ఆ. వె. మహిని స్వప్రకాశ మతులనొప్పెడుమీకు
నన్యశాసనంబు లర్హమగునె ?
పరఁగ వక్తకెన్ని భంగులమానంబ
యూనమగును మూగ వానికగును.

చ. మఖఘనవేదికాస్థలిని మండితుఁడై తగువహ్నియష్టమో
చ్ఛిఖయన నొప్పుచున్నయది చెంగటనీతరుణీలలామమీ
రు ఖసరిదావృతాన్వయులు రూఢిదలంపఁగ నెన్నిభంగులన్
సుశిమె భవత్సమాగమము జూడఁగమీకు నృపాలపాలకా!

ఆ. వె. పరఁగ "జాయయాచ పతి భిక్ష్వ దంపతీ"
యనెడుశబ్దమెందువినముధరణి
అద్భుతంబు మీరలర్థిభావంబును
గాంచినారలటిది గాదెయెందు

గీ. ఒనరనిష్టమైన యొక్కవస్తువునందు
బహుజనంబులాస పడిరయేని
నీతిమంతులైన నిధనావధియునగు
పోరునిక్కమంద్రు వారికధిప.

చ. సొరిదిగమున్ను సుందుఁ డుపసుందుఁడునంచుసగర్భ్యులిద్వరు
ద్ధురతరవిక్రమాఢ్యులొక తోయజవైరి నిభాస్యయైనయ
చ్చరకు నభీకులై కడఁగి సల్పిరియాహవమాతనూజ్జ్వల
చ్ఛరమునకై రి లక్ష్యముభుజాబలఘట్టననొండొరుల్ వెసన్.

క. కావునమీరలునిపుడీ
పావనచారిత్రయైన భామామణికై

యూవిధమందక యుండను
భూవరసుతులార! మునినిఁబూనుఁడు వరుసన్.

వ. అనియిట్లు రహస్యంబునంబల్కు తపస్వివాక్యంబును శుభోదర్కంబులుగా వితర్కించి యక్కౌంతేయులమ్మునిపతికిట్లనిరి.

క. చాతకపంక్తులువర్షం
బేతీరునఁబొందునట్ల నీతరుణిచిమే
మాతీరుననొకదొకరమె
ఖ్యాతిన్ సుఖియింతుమొక్కరై యేటేటన్.

సీ. ఈనియమంబుచే నెనఁగెడుమాలోన
నెవ్వఁడుసతితోడ నింటిలోన
నుండునయ్యెడవేరొకండుద్వ్యజాత్రింబు
నచ్చోఁబ్రవేశింప నాతఁడపుడు
తద్దోషపరిహార తకుఁ దీర్ఘయాత్రగా
నుర్విపత్రిదక్షిణంబొక్కయేడు
గావింపఁగలఁడని భూవరుండనుజన్మ
సహితుఁడై పల్కిన సమ్మదమున

గీ. శమనసూనుండు తన్ని దేశమునుబొందె
ననుచుభ్రాతృతనూభవుఁ డధికముదము
జెందికరధృతమగు విపంచీస్వనంబు
తోడనిజకంఠగీతంబు తోడుపఱిచె.

చ. పిదపసురర్షివిష్ణుపదవీధి నిజేచ్ఛజనంగనంత దాఁ
పదిపతిపంచకంబునకుఁ బాయనిభక్తినినొక్కరీతి స

మ్మదమలరారనుండెను నమ ర్త్యకుజంబుల దానలక్ష్మియుఀ
మదనశరంబులందు లసమస్థితినా జయసిద్ధియుంబలెఀ.
మ త్తకోకిల. అంతనొక్కయెడఀ ధరామరుఁడాత్మగోవ్రజమెల్లదు
ర్దాంతతస్కరకోటిచేత వృథాస్థితింజెఱుపోవ భూ
కాంతుముంగిటనిల్చిపల్కె నకారణంబుగరాజ! మా
చెంతగోగణమెల్లదూడయు జిక్కకుండఁగనక్కటా.
ఉ. దొంగలపాలుగాఁజనియెఁ దొల్తవిధిప్రతికూలమయ్యె నే
వెంగలినై తిఁగావనొకవీరుభజింపక మిమ్మునమ్మి యి
బ్భంగిని మోసపోయితిని పార్థివులెల్లరుదుష్టనిగ్రహం
బుంగ మశిష్టపాలనముబూనరు మేమటదక్కిధాత్రికిఀ.
క. అని నగుదురు రాజుల మీఁ
రనయముమిమ్మేరునగుదురయ్యాకు యొయ్యా!
యనిక ర్ణకఠోరంబులు
జనములువినఁబల్కుచున్న ధ్మామసురునంతఀ.
చ. సిరిదనరార భూవిబుధ శేఖరుగాంచి నిజాసనంబు వే
గిరమునడిగ్గి యంఘ్రులకుఁగ్రిడి ప్రణామముచేసిపల్కె నో
సురుచిరపుణ్య! నీభటునిఁజూడుము నన్ను క్షణంబులోన నా
గురుతరగోవ్రజంబునిటకుంగొని తెచ్చెదనంచుఁ దేర్చుచుఀ.
క. కై దువులకు విప్రునిపని
కై దుముకున నలుకులేక యయ్యమసుతుఁడా
పై దలితోఁబర్యంకము
పై దళమగుసేమనుండఁ బార్థుడటఁజనెఀ.

ఉ. ముందుగఁ దద్గ్రహాంతమున దృష్టికిముష్టికినగ్గమయ్యె పౌ
రందరికంగనాసఖుఁడు రాజును సంగరభీమకార్ముకం
బందెడువిప్రదాన ఫలమయ్యెడనయ్యనఘాత్మునాత్మలోఁ
జెందఁగ గేహమున్విడలె శీఘ్రమ తస్కరపంక్తికడ్డమై.
చ. అరిమురి చోరులంబొదివి యర్జునుఁడార్జితవిక్రముండు దా
నురక విముక్తబాణుఁడయి యొప్పవిముక్తములైన ప్రాణముల్
తెరువునఁబూనితస్కరులు తేజముమానినమాన్చిసారెకుఁ
గిరికొనుబ్రాహ్మణోత్తముని క్లేశముగోవులసట్లదిప్పియున్.
వ. అంత.
ఆ.వె. తీర్థయాత్రసమ్మతికి నమ్రుఁడై యున్న
పార్థుమౌళియందు బాష్పజలము
చేత నియమితాభిషేచనంబొనరించె
దద్వియోగమన్న దాల్పలేక.

వ. తదనంతరంబ ధీరధీరుండగు నరుండు నతికష్ట ప్రకారంబు న యుధిష్ఠిరు నొడంబఱుచి తత్కృతానుమతుండై యుచిత వేష భూషితుండగుచు నచ్చటంగదలి పుణ్యాజనేశ్వర పరిపాలితంబగు నుదీచీదేశంబున సాకూతొచ్ఛ్రవకటాక్షంబన భగీరథరథ పథానుసారిణియగు నమరతరంగిణీ తీరంబున విడిసి తద్విచిత్ర వీచికాచయం బుల సాయంతన నియమంబునకై యఘమర్షణి జపించుచుఁ గ్రుంకునెడ.

చ. వలపరితమ్మిమాని కలువం గలువం గలచోలసత్ప ద
స్థలసము నొంది నీరములకందువ జెందిన యుందిరాసతిం

బలెను భుజంగమాంగన యభంగమనో భవసంగరేచ్ఛలో
నెలకొన నాతనిం దనదునెమ్మదిఁబోల్కి నిజాలయంబునన్

కం. అదిముదమునఁబొదలుచు నె
మ్మదిలోన మనుష్యభుజగ మహిత రతికి స
మ్మదన సముద్దైన యర్జును
గదియఁగ నుత్సాహమొప్పఁగా నలరియఁటన్

చ. భుజగకులాధి రాజసుత భోగకృతోత్సుక ఫూత్కృతస్థితుల్
గజిబిజి సీత్కృతాకృతులుగా గళకాళిమ నాభిగాఁగ భా
వజశరజాతవేదనదవ ప్రకటార్చుల కాకఁ గ్రాగెదా
నిజసు ఫణామణి ప్రతతినిస్తుల పల్లవభూషణంబుగన్

ఉ. కీవిచెలంగ సంతమరుఁడేకదవారికిఁబెండ్లిపెద్ద యిం
కావినఁగాఁబనేమి? యటగాఁగలకృత్యము దీర్పనేర్పరే
కావున వారిఁగూర్చుపనిగా మదిఁబూనిన వాఁడుపట్టితా
చేవిడువండుగా నొకటిసేయకమానఁడు నాయకస్థితిన్

కం. నరుపాణిజ్యాదర్శన
గురుకఠినతచెలియ చన్నుగొండల నలమన్
మరుదశనసతికిఁ బార్థుని
స్థిరమధురాధరముచేద్వి జిహ్వాతమానెన్

సీ. చొక్కిచక్షుశ్శ్రవః కన్యసుఖమువలన
నా రతమునందు ముకుళీకృతాక్షియైన
దనరుచున్నట్టి మణితవై దగ్ధియంతఁ
గానవాంతనిశాకాంతకాంతి యమ్యో

వ. అంత

కం. రతికంపము చేతశిరః
స్థితరత్నము జారు భంగిచెలియ కుమారుం
డత వై భవుఁగనియె సమ
గ్రితను నిలావంతుఁడను విరాజితుఁగడఁకన్

ఉ. ఈగతినొక్క రేయట వసించుచు భావివియోగవారిధిన్
భోగికులాధిరాజసుత ఘూత్కృతనిర్వ్యసనోచ్ఛ్వాసంబులన్
వేగనొనర్పుచాతనినివేశ్మనితెచ్చి మరుత్తరంగిణీ
భాగతటిస్థలిన్ నిలిపి పాయనిచింతనుబోవనిచ్చటన్.

క. అంతటనీవృత్తాంతం
బంతయుఁబార్థుండు నిజ సభావళికెల్లన్
భ్రాంతమునం దెలుపుచు వి
భ్రాంతుండై కొంతవడికిఁ బయనంబగుచున్.

చ. అలరఁగనయ్యులూచి రతియందునొనర్చిన దంశనక్రియన్
బలువగుమోహమర్జునునిఁబై కొనివేతలకెక్కసొక్క యు
బ్బలియుఁడు దానిమాన్పఁగల భావమునంజన నాఁగనేఁగె ను
జ్జ్వల లలితౌషధిస్థలికి వారకనాహిమవంతుపాలికిన్.

క. అటఁజనిముఁందటఁగాంచెన్
గటకలసన్నికటచటులగంధ గజేంద్రో
త్కట బృంహితవాచాటిత
పటుకందరమందిరములఁ బరఁగుహిమాద్రిన్.

వ. కాంచితదీయసముచిత విశేషంబుల కచ్చెరువడుచు వి
వ్వచ్చుండు

సీ. ఇదిగదాపత్నివిహీనుఁడై యందందు
మెలఁగుభిక్షునిగృహ మేధిఁజేసె
ఇదిగదాపృథునరా ధీశ్వరప్రీతిగా
వత్సభావంబున వసుధమొనసె
ఇదిగదాశైలరాజేంద్రాభిధానత
నఖిలౌషధములతా వనఁగవెలసె
ఇదిగదాసకలమహీమండలోద్ధర
ణతనాదిఘోణిమన్ననలఁబడసె

గీ. ఇదిగదాసప్తతంతు సంపదలకొనరు
సంవిధానమువిడి సుర సమితితోడ
నొకహవిర్భాగమునుమున్ను నోగిరముగ
గాంచెనంచునుబొగడిడగ్గఱియెమఱియు.

క. నగమానాటికకల్గున
నగమానిత రత్నహైమ నగమాతోలువ
న్నగమా రుచినిది హిమవ
న్నగమా! నగమానగాకనగమానితముల్.

ఉ. ఏగిరిరత్నశృంగములనేగిరి సిద్ధులు సౌరసైంధవ
శ్రీగనదేవతానగరి శ్రీగనదివ్యులు శతుత్రిఖీతిచే
నీగిరిభూరిహాటముల నీగిరిమర్త్యులు హావ్యకవ్యముల్
వేూగిరమూధినాధునకు నోగిరిమిత్తురు సర్వకాలముల్.

మ. అడెగన్గొంటెవిశారదా యరుణరత్నాంశుప్రభాపూరముల్
బొదువన్ మిన్నులు సంజకెంజిలుఁగుగాఁబోలంచుసిద్ధాంగనల్
మదిలోవేడుకఁబూనుచున్ దొగల సమ్మానంబువీక్షించి య
మ్మదిరాక్షుల్ కుముదస్థితింగనిరి సమ్మందాకమందాక్షులై.

చ. అతుల తపో విహారి త్రిపురారిపయింబయికొంచుఁ గాముఁడా
తతవితనుండునాట నిజతప్వకుదారత శంకరుండు స్వ
స్థితి నతిగారవించి యటఁజేకొనుటాదిగఁ బూర్వవృత్తము
ప్రతిమ నిబద్ధపద్యములఁ బాడిరివింటివె సిద్ధసాధ్యులున్.

వ. అనిమఱియు సరస వచన రచనల నాత్మమిత్రునితోడ న
జాత శత్రుభ్రాత్రృండగ్గిరి నిరర్గళప్రభావంబు లుగ్గడించుచు ఖుర
పుట వినిమయ విన్యాసంబులఁ జంద్రకితంబులగు నవతార పథం
బులును రోమాంథఫేనశకలంబుల తారకిత పరిసర నమేరు తలోప
వేశంబులుంగల నిరుపమానహర వృషభ స్వైరవిహారంబులందనరు
కటకనికటసరోవరాంబు లనఘంబు వాయఁ గృతస్నానుండై య
టవీమదోత్కట గజఘటాపటల గండసంఘర్షణోద్భూత సరళద్రు
మక్షీర పరిమళభరితంబగు నుపత్యకామార్గంబున దురంతంబగు
హిమవంతంబుడిగ్గి చనిచని భూగగనంబుల కలంకారతంబరఁగు
మహేంద్రద్వయ గృహీత పాగ్భాగంబునకై యరిగి యంత

మ. విగళత్కైతకపాంసుపంకిలకృదుర్వీభృచ్ఛిరస్తీర్ణపా
దగతద్వీపవతీజలంబులనుఁ బూతస్నానుఁడై క్రీడి యా
త్మగురుఖ్యాతివహించుటెంచియటగొంతంగొంతసంచారమున్
దగఁగావించెను దన్మహేంద్రనగపాదప్రాంతదేశంబునన్.

వ. మరియును

మ. వరతాళీవనపాళిజర్ఝరలసద్ధ్వానంబనూనంబుగా
వరుసం గర్ణకఠోరతలఁ నెఱప విచ్ఛ్వుండు పాగ్భాగ సా
గరతీరంబున నేఁగెఁ జందన నగాంకప్రాఢినానానదీ
స్థితసంప్రాప్తియుఁగల్గు దక్షిణదిశంజెన్నొందుప్రగ్రాజిచేఁ.

సీ. ఎవ్వనియాజ్ఞచే నెనసివింధ్యముభూమి
గర్భగతార్భకుకరణినుండె
నెవ్వనిజఠరాగ్ని కేడ్తెరవాతాపి
తగినహవ్యంబనఁ దనరుచుండె
నెవ్వనికోప సమీక్షణంబునను భూ
తరుణినగ్నత్వంబుఁ దాల్చియుండె
నెవ్వనిచరితంబు లీరేడుజగముల
నద్భుతస్థితులచే నందియుండె

గీ. అట్టిమైత్రావరుణి ప్రసిద్ధాశ్రమంబు
గాంచి కడువేడ్కభజియించి కదిలియచట
నాప్తవర్గములునుదాను నామహేంద్ర
నందనుండేఁగిచోళ మండలముఁజొచ్చె.

మ. అనువౌదివ్యసరిజ్జలంబులను స్వామ్యంబుంబరీక్షింప భ్రాం
తనదీనీరములాత్మకల్పితఫలాంతః క్షీరదంభంబునఁ
గొనిమిన్నందెడు నారికేళవనినాఁగూర్కొన్నయచ్చోళపా
వనభూమింగనిసంతసించెఁ బతిదుర్వారప్రభావోన్నతిఁ.

ఉ. మానితమైనయాయుదధి మధ్యమునంజలసిక్తయై సదా
నాని తదార్ద్రితంజెరుప నాయట నుత్తరతీరభూమి లం
కానగరంబరాక్షసముగాఁ జనుదెంచివసించుపోలికం
బూనినపాండ్యగుప్తమగు భూరిపురంబుఁ గిరీటిజేరఁగన్.

క. కాంతమునుజ్జ్వలసకల ల
తాంతము శుకపికనికర నితాంతమతను వృ
త్తాంతము విలసత్పథిక
స్వాంతముతాంతంబునా వసంతముబొడమెన్.

ఉ. ప్రాంతదురంతకింశుక సురాగపరాగసమూహ సంతతా
క్రాంతలతాంత నిర్గళదఖర్వమధుస్ప్లుతసర్వవృక్ష సీ
మంతమునై ప్రవాళరుచిమండల మంజుదిశాంబరాంతమై
సంతతముప్పతిల్లఁగ వసంతముఁబొల్చె వసంతవైఖరిన్.

చ. కుసుమితకింశుకప్రచుర కుంజదవానల రాజిపుష్పలి
ట్విసర విశాలధూమము నవీనవిభాకరకాంతకాంత రు
ట్ప్రసరమరీచికల్ పుడమిపాంసువుపుష్పరజోవిహారమై
యసదృశమై నిదాఘసమయంబననొప్పె వసంతవైఖరిన్.

మ. కలకంఠార్భటిగర్జగాదివసమాక్రాంత ద్రుశాఖావళుల్
జలదవ్రాతముగామిళిందవితతుల్ జంబూఫల శ్రేణిగా
ఫలసారంబులు వృష్టిగాఁజట్టులశంపల్ సంపెఁగల్ గాఁగనుః
జ్జ్వలవర్షాగమమైయనంగఁదనరెన్ వాసంతవేళన్ వనిన్.

మ. దళదంభోజకదంబదంభతతకైదారంబుసంఫుల్లలో
ధ్రిజజశ్చంద్రవిరాజమానకదళీవ్రాతంబుమాధ్వీరసో

త్కర నిర్ధూతమహీపరాగమును ఖేదక్షీణజాతీలతా
వరకేకీవ్రజమై వసంతమొగిదై వారెక్ శరత్ప్రాయమై

ఉ. సామివిహారమారుతము చల్వనువెల్వడఁజేయు రాంకవ
స్తోమములైన కెంజిగురు చూతఫలప్రతికల్పితాష్ట ని
స్సీమసముజ్జ్వల వ్రణవిశేషములుక్ స్మరసీత్కృతంబులై
యామనియొప్పెసీతుసమయంబన నత్తరిధారుణీస్థలిక్.

మ. నెలపెక్ వెన్నెలసోకునక్ నిశలక్షోణీజాలవాలైందవో
జ్జ్వలరత్నాళిస్రవింపఁదజ్జలములోజం యంత్రనాళోపరి
స్థలికింబాఱికిమరుద్ధతింజెదరితౌషారస్థితింగ్రమ్మ ని
ర్మలమైనట్టి వసంతమొప్పెసఁగె హేమంతంబు చందంబునక్.

సీ. బలుసోయగముమీరఁ గలకాంతిపెంపార
నిజముఖపద్మంబు నివ్వటిల్లఁ
గలికాస్థితినిసొంపు నెలకొన్నవగనింపు
తిలకోజ్జ్వలద్ద్యుతి తేజరిల్లఁ
గలితాలసనమీర చలితాతులితమార
బలతాస్థితిభ్రమరాళి పరిఢవిల్ల
లలితంబులగు తేనియలఘంబుగఁదుఁబూని
యధరదేశముకొంత యతిశయిల్లఁ

గీ. దగినరంభాదిమహిళాప్త తముగఁదనరి
కాననాంతరమాకాంత దానితాంత
సమ్మదముతోడఁదలచూపఁ జనిపుకోప
శంతవనిలోననరుఁడుండె కాముకరణి.

ఉ. మానుగశీతభూధరముమన్కినిగుంపులుగూడిధాటిమై
యీనిఖిలావనింబఱపెనేర్చి మదించిహిమంబుపద్మినీ
స్థానములంటిదాజరలదార్చెనటంచు నినుండుమూలతా
హానియొనర్పదక్షిణవిహారముమాని యుదీచికింజనెన్.

సీ. లవలీలతాదిపల్లవలీ లతాలిపే
లవలీలతాదరం బవనినలరె
లసమానతరకేవ లసమానసుమభరా
లసమానపవనజా లములువిసరె
ప్రియకరాతతవన ప్రియకరావహితను
ప్రియకరాలంబన ప్రీమలొసఁగె
శుకజాలమహితకిం శుకజాలమతివనాం
శుకజాలమనమతి శుభముదనరె

గీ. కలితకలికాయితానేక తిలకకల్క
సాలసురసాలపున్నాగ చంపకాది
పాదపంబులుజిగురు జొంపములతోడ
మొనసెమాధవసాన్నిధ్య మునఁదనర్చి.

చ. సహానసహకామ్య మంచనెడు నాకులనాకులతన్ వహింపఁగా
తహతహఁబూనినెమ్మదివితాకులనేకులుగావిమూకతన్
మహిమహితంపుకెంజిగురు మాత్రికులపై కలకంఠసంగతిన్
గుహుకుహునాదముల్ నెరసెగోకిలలోకులసాంప్రదాయముల్

మ. చలవంజెన్నగు వాసమంటివడి నిశ్శంకంగడందొ్రచితా
వులుపైపై చనుకుట్మలంబులొగి కొ్రొవ్వల్ మీరఁజూపట్టుచో

పొలుపారంగవిమర్దనస్థితులచే బూనిట్లుశ్యామాతతిన్
గలయంబెన్గుచు దక్షిణానిలుఁడు దాఁగాంచెంబెనంగింపగన్
శా. లీలంబంచశరుండు కేళి వనపాళిన్ హాళిగం గేళివా
ర్త్రైలంగాని లబరాబరుల్ పవనుఁ డక్షిణస్థితింజేయ నా
సాలాగ్రంబుల కెక్కినిక్కి మహిళల్ సత్పూనముల్ జల్లదా
జాలంబొసుమనోరథంబుపయి నోజన్ వచ్చెనచ్చోటికిన్.
సీ. తోరమ్ములనుసుకు మారమ్ములనుకొమ్మ
లీరమ్ములనఁజాల నిరవుకొనియె
నాకొమ్మలనుజాలఁ బైకమ్ములనుదేలఁ
బల్లవాతులతతిపై నిఁగ్రమ్మె
నాపల్లవాతతి కాపల్లవముమూన
బరఁగుతావులపువ్వు బరపులమరె
నాతావులనురజ శ్రీతావలంబుగా
విమలానిలుఁడువితానములఁబన్నె
గీ. తానములఁబాడువనదేవ తావితాన
జానుదఘ్నముబుగఁబూనె తేనెసోన
వానసూనినకాలువల్ పనము వెడలి
కడలిభంగిని వెల్లువగాఁదనర్చె
కం. పవనాకర్షణ గరిమల
నవిరళకలగీతనాద మలరఁగవనిలో
నవచికురాళి స్థితులను
నవరించెంబద్మినీ నిచయముముదమునన్

సీ. పటు పాటలాధర పదమునఁ గంకేళి
పద్మినీముఖసీధు పడసి పొగడ
శ్యామోపగూహ నాశ్రియమాణకురవక
మదన రంభాస్థితి కదరఁ దిలక
మలకరశాఖల నలమ మాకందంబు
కలకంఠిగీతాప్తి వనన మొనసి
బాలానిలస్ఫూర్తిఁ బటిమను నిర్గుండి
కొమ్మసమ్ముఖమున నెమ్మిఁ గనక
గీ. మురువుగా గాంతనగతతి వరలుపొన్న
కలితమహిళా ప్రతతియుక్తిఁ గర్ణికార
మరయమాధవ వతఁనగిరిమలతలు
సరసగంధ విభూతి క్రొవ్విరులఁ గనియె
చ. కనఁదిలకంబు గల్లుమియుఁ గావ కుళంబునఁ గన్ నమేరు విం
పెనయఁగఁ జంపకంబు గరమిచ్చి నమామిడి పల్కఁ గోఁగు కా
లునిపి నవంజులంబు మొగమూర్చిన వావిలి గీతిచేఁ బ్రియా
ళుసు నలమంగురంటకములుఁ విరులిచ్చె వనాంతలక్ష్మికిన్
మ. సరసీజాహిత మండలోదయము నిస్సారంబుగాఁ గన్పడన్
గరమారంగని పాదుగట్టి నెలరాకట్టుత్కటస్రావముఁ
పరఁగం దజ్జలముబ్బి యంత్రగతిచేఁ పై కెక్కి జల్లించి వే
మరునాతాపహతిఁ బొంది చిందితనరెన్ మంచైన కాంతంబునన్
శా. సారాకారతఁ జిల్కనాదనరు నాసాంబ్రాణి మేల్కత్తళా
నారోహించుచుఁ దమ్మలమ్మలదొనల్ హాళిన్ నిజాగ్రప్తిదై

వాగంగెంజిగురాకువాలలర శేవంబువ్వమై జోడుతో
నారావంబునఁబంచఁవింటి దొర వెంటాడన్ వియోగావళిఁ

వ. ఆసమయమయిన

కం. భాసిత చిత్రాంగదయను
నాసతి మధుమాసవాసరాగ్రసరస
త్కేసర కేసగగర జో
భాసురధూసర వనాంతపదవిఁ వచ్చెఁ

సీ. పాదాంబు జాతముంపఁగనోడి గతిగనఁ
గాదంబు జాతమ్ము గ్రిమ్ముకొనఁగ
చెలికిముచ్చటఁ జెప్పనలికి తద్భణితికై
కలికిచిల్కలగుంపు కయివసముగ
చిరునఁగవొప్పఁ జూచిన మోము ముడిగొను
వనకుందములు పలువగలుజెంద
జగజంపుపెన్నెరి సవరింపుతేటులు
బ్రిమసిగుంపులుగూడి పర్వులిడఁగ

గీ. బాలికలతోడఁబాండ్యభూపాలపుత్రి
వనముఁజొచ్చి విహారైక వైభముల
గ్రీడనలరఁగ నప్పడాక్రీడిగాంచి
మొనసిపైకొన్న సమ్మోహమూర్ఛఁజెందె

చం. తెలిసినరుండుపల్కు వనదేవతయో! మరుమాయయోమదిన్
దెలియఁగఁజాదులేక నరదేవకుమారియొ? యట్టులైననా

చెలువకు భూమినీసాబఁగు జెందుటలేదునిజంబుగానిదే
పొలఁతుకనిక్క మేనితగుబో చతురాస్యుని కౌశలంబికన్

కం. ఈకన్నులు నీచన్నులు
నీకురులీకురువులలరు నీకౌనును భూ
లోకాంగనలకు లేదే?
నాకాంగనలకును లేదునాకుంజూడన్

ఉ. కంబుగళంబు నిర్జితపికంబు గళధ్వని చారుచక్రి వా
కంబు కుచద్వయంబు గనకంబు కుచద్యుతిమత్త బర్హి లో
కంబు కచంబుమేల్చకచకంబు గచస్థితిపుల్ల పుండరీ
కంబుమొగంబు ఫాలఫలకంబు హిమాంశునిలో సగంబగున్

క. పాలా! నుడువులు కడుజాం
పాలా? ముంగురులు సొగసుపాలా! నడవు
ప్పాలా? యడుగులు తగున
ప్పాలో? కెమ్మోవితేట బాలామణికిన్.

క. లవమా! సతికౌనతిపే
లవమా? తనుకాంతి సరఘులవమా? నుడిప
ల్లవమా? పాణిద్వయమున
లవమారు నకిచ్చు నిచ్చులసితాంబకమా?

సీ. వాలుగాయారు పర్వాలుగాఁజనుసౌరు
వాలుగాఁజక్క నివాలుగనులు
రాయిరాకాంతి పెన్రాయిరాకుచము తు
రాయిరాయిదివల రాయనికిని

బింబమా ? మోవిరాబింబమా మోముమా
బింబమా దీనివిడంబమునకు
సారమాపిరుదు నిస్సారమా కానుప
సారమావగల ప్రసారములకు

గీ. చుక్కలా గోళ్లు చేతనుజుక్కలయ్యె
చేతులపరంజి కమ్మల చేతులయగు
నాతియభిముఖమైన పున్నమదనర్చు
కలికి మగిడిన యమవసగాఁగనేర్చు

ఉ. నాక మెఱుంగు మధ్యము పినాకమెఱుంగును భ్రూవిలాసమా
లోక మెఱుంగుడాలు నలిలోక మెఱుంగును గొప్పమేలున
స్తోకమెఱుంగు నొకటియశోక మెఱుంగునుమోవితీరుబ
ల్కోకమెఱుంగుఁ జన్నుఁగవకోక మెఱుంగును జెన్నుబాపురే.

ఉ. భంబులు గోరులా ప్రకరభంబులు పెందొడలర్హ్మభూరి కుం
భంబులు చన్నులంబుజ శుభంబులు కన్నులు హీరవార రం
భంబురదాళి కౌనలనభంబునకౌనును గొనుదర్పణా
భంబు కపోలపాళిసులభంబు విరాళివయారి చూచినఁ

గీ. తెరవకనుదోయి నెత్తమ్మి తీరుతీరు
యువతికలరెకు చనుఁగవ యొప్పనొప్పు
నతివ కొనరుపిఱుందుల యరవుసరవు
మెలతనిద్దంపుమై దీఁగె మించుమించు

చ. మిసమిసలారుడిగ్గియకు మిక్కిలిపొక్కిలి కాంతకాంతి తుం
పెసపసటూరు గంధపలివేసమునాసయు ఘాంధకోటికై

ప్రిసవశరాత్త లేఖతోలువర్ణము కర్ణములీశుభాంగికిఁ
వెనవసుశాలిగర్భముల విక్కులుపిక్కలు నిక్కమింతికిన్

కం. ఏచినగతి నిండారం
బూచినతంగేడుచెలియ భువిలోపల నే
చూచిన యదిగాదెవ్వరు
నీచక్కఁదనంబు చెప్ప రెందులనైనఁ

మ. కనుగొంటే సఖి!గుజ్జుమావిగమి మూగంజుట్టి నిండారఁబూ
చిన పెన్మల్లియదీ వెటుయ్యలల రాజీవాక్షిక్రీడింపన
య్యన వొప్పారెడు జూడముజ్జగములఁ స్వాకారరేఖావిభూ
తిని నిట్టట్టును జేయనేర్చనను రీతింబ్రీతిలీలాగతిఁ

సీ. కౌఁగిలించినఁజాలు గాయునిగోరంట
హస్తమిచ్చినఁజాలుననుచు మావి
యాడిపాడినఁజాలు ననిపేరింకణపుశాఖి
చనవీయఁజాలని చంపకంబు
ఘనతఁబల్కినఁజాలు ననికర్ణికారంబు
నవ్వినసుతనుజాలు ననుచుఁబొన్న
అలరమోమూర్చఁజాలని సిందువారంబు
కనినఁజాలును గదాయనుచుఁదిలక

గీ. మడుగుమోపిన జాలంచునయ్యశోక
ముమియఁజాలును గాయంచునొక్కపొగడ
యిట్లుతరులెల్లఁ జెలికెదురెదురుచూడ
నితరమదినాస లేదనుటేమిగలదు.

చ. విలసిత చంద్రకాంతమణి వేదికపై నెలమావికేళి వ నె
చ్చెలికిఁ బ్రియోత్తరంబులిటుఁజెప్పెడు కవ్వడిఁగాంచియప్పడా
లలనమరుండుగా మదిఁదలంచుచు నంతిపురంబుఁజేరఁ దో
య్యలులునుదానువే చనియెనన్నువకానసియాడఁగ్రన్ననన్

కం. ఆగతిసతిజన నరుఁడను
రాగమునన్ధారుణీ సురశ్రేష్ఠునిఁదా
వేగమునఁబంచెఁబరిణయ
మేగతినైన నొనరింపు మీవనిపల్కన్

చ. అనవుడు నట్లకాకయని యచ్చటుఁబాసి మహాసురుండు వే
చని ఘనపాండ్య భూవిభుని సన్నుతిఁగైకొనివచ్చుకార్యమున్
జనపతితోడఁ జెప్పనతిసమ్మతుఁడై తనకూతునిచ్చెఁబా
ర్థున కనురాగమొప్ప వినుతుల్విబుధాళి యొనర్పనయ్యెడన్

కం. నరుఁడా తరుణీమణితో
సురుచిరభోగముల నచటసుఖియై కొన్నా
ళ్లి రవుగ నుండఁగనంతటఁ
బరఁగఁగనాచెలువ గర్భభారముఁదాల్చెన్

వ. అంత

చ. ఒకశుభవాసరంబున సముజ్జ్వలమానస సీమయందుఁ బా
యకవసిల్లుంచుచుండు తనప్రాణసఖుండను పోలికన్గుమా
రకు గురు విక్రమాది గుణరాజితమూర్తిని భభ్రువాహన
ప్రకటితనామధేయుఁగనె బాలిక సంతసమొప్పనెంతయున్

వ. మఱియు నీప్రకారంబున నర్జునుండచ్చటఁ గొన్ని దినంబు లుండి ప్రయాణోన్ముఖుండగు నెడఁబఱ్ఱావలంబి బాష్పసలిల యగుచుఁ బ్రత్యాహారోత్తరంబులు వల్కపేర్యసిని గాఢాలింగనంబునవిజవల్కలోత్తరీయమర్మరరవసహాయంబగుసీత్కారంబుచేతఁ బులకితకపోలతలంబు ముద్దుగొని యమ్ముద్దియ నతిప్రయత్నంబున నొడంబఱచి తదనుమతిం బురంబు వెడలి రక్షోహరణుండగు నిఖిలకుకులమహాక్షితి విభునియోధులచే నుత్పాటితంబులగు దుర్ధరమహేంద్రపాదమూల శిలాతలంబులఁగనుపట్టి వానరఁకరకఠోర నఖరరేఖా విశేషంబుల గులిశ భయోచ్ఛలితశైలంబుల ననావటంబగు నికటపటంబుల స్ఫుటీకృతంబగు నటవిఁగడచి యవనీతనయాపరాధి యగు రావణామర విరోధిమస్తంబు నిర్మూలంబు చేయఁజూఁచు పృథివీకరంబన నొప్పు సేతువు నఁగృత సీమంతంబగుదక్షిణోదన్వందంబు జేరె నాసమయంబున

కం. నరుఁడా కుర్యమునన్ రఘు
వరనిర్మితసేతువున నివారితవృత్తిన్
బరికించి కాంచియవ్విభుఁ
బరమతపోనిష్ఠఁజాలభావించెమదిన్

చ. అరుదుగ నబ్ధిలోనగ చరావళిపాతితశైలఘట్టనన్
బరఁగద్రృగంధరాక్షస కబంధవిఘట్టన చేత ఖంజులై
వరుసను వీచివేదికల వ్రాలుపయోమను జాళిచేర భా
స్కరకులు కీర్తిఁయొప్పిదముగా మదిమెచ్చుచుఁదీరపద్ధతిన్

మ. చనిగోకర్ణముచేరి యందుగిరిజాజానిన్ విలోకించి నె
మ్మనమారన్ భజయించిమ్రొక్కి సుమముల్ మౌళి ప్రదేశంబునన్
జననాథాగ్రణి బాహుపంకజము నోజన్ జూచి పూజించిమీ
దనుగావించుధనుః ప్రతాడనములందప్పొర్పు మన్నట్లుగన్
కం. పాపాప హారణమునకై
భూపతియుఁ ప్రభావతీర్థ పుణ్యస్నాం
బేపారఁజేసె సేతువు
జూపారఁగ జాగరూక సుస్థితినడపెన్
వ. అంత
క. కాలాంబుద జాలావృత
లాలిత భాస్వద్వియత్తలము లులితసరి
త్కూలము వర్షాకాలము
జాలంబొడసూపె కేకిసమితి నటింపన్.
చ. అరుదగు నాఘనోదయ భయస్థితిచేబలె నంతఁ గర్ణ గ
హ్వరమను క్రౌంచ భూధరమునందగు వాకిలిఁజొచ్చిశౌరి సో
దరి నవ సుందర స్తవముదార మరాళము పోలికంబు రం
దర సుతమానసంబునకుఁ దారెను భూరిమనో భిరామమై
వ. అప్పుడు.
సీ. నవలాలితంబులైన వలాహకంబుల
నవలాయులికపంక్తులవు నటించు
సబలాకలిత విలాసబలాకలకదంబ
మబలాకలై కరో మాళియించుఁ

దులకెక్కఁదగు తటిత్తుల వెక్కు సొగసుకాం
తుల చెక్కు చెలిడాలుఁ దొడరునంచు
సితకాంతిబృంద భాసిత కాంతకుంద సం
హతి కాంతకాదంత వితతియంచు

గీ. స్ఫుటనట త్కేకి లోక విస్ఫుట నినాద
పాటవము పాటలాధర పాటతేట
సాటిసేయఁగ నొకమెట్టు పాటిమాత్ర
మగును నెక్కువ తక్కువ యంచువించు.

వ. అని యీక్రమంబున

గీ. శ్రుతి పదంబున తావుగా నతిశయిల్లు
నాసుభద్రా సమక్షము నంద యుండ
సహచరద్విజులను జూచి సవ్యసాచి
నేర్పుమీఱఁగ నందందు నిలిపి నిలిపి.

క. నరుఁడరుగుచుఁ గనియెఁ బయః
పరిపూరిత కుంభయుగము పద్ధతి నెదురన్
బరఁగ సుభద్రాకుచములు
గరగతమగున నెడు శుభము గానం బడఁగన్.

సీ. అతుల శంపోన్మేషణాలోక నోద్భవ
చక్రాంగకోద్వేల సంభ్రమములు
స్ఫీతకై తశరజోజాతాహతాగత
విలుఠన్మిళిందాంధ విభ్రమములు

చటులగర్జాయుతా చ్ఛాదనాబోధసాం
ద్రీభూతపటుతర దిఙ్ముఖములు
సోత్కంఠ నీలకంఠౌఘకంఠోదిత
వరషడ్జసుస్వర వైభవములు

గీ. పాంథజనతాతి సంధాన పాటవాప
మృత్యుదములు భుజంగంబుజ నృత్యదములు.
బరఁగెనురుతర సస్యశుభప్రదములు.
విరహిణీదుర్దినములు ప్రావృడ్దినములు.

ఉ. భూరితరాత్మఘోషముల భూరుహశాఖలనాత్మఘోషముల్
వారకగుప్తిఁబూంచి పికవర్ధనతం దగితద్యుతుల్ కుహూ
కారనినాదముల్బలుకఁగాంచిచిరంతనజీవితాప్తిదై
వారఁగఁదన్నుఁజొచ్చెఁబికవర్ధననామము సార్థకంబుగన్.

మ. గరిమంబెన్నగఁనైంద్రి చాపమునసత్కాండంబులంజూచి శీ
ఘ్రరతింగాకముజెందె నాత్మసుఖమారామోచ్ఛరణ్యాప్తినా
గరిమంజెన్నగునైంద్రిచాపముల సత్కాండంబులంజూచి శీ
ఘ్రరతింగాకముజెందెనాత్మసుఖ మారామోచ్ఛరణ్యస్థితిన్

క. కేకికలకలములెసఁగెన్
గోకిలకలరవములంచ గుంపులగూడెన్
లోకము:లో నేరికిఁజను
గాకాలముజూచిపల్కఁగాఁ బ్రియమారన్

మ. లలితాభ్రావళినాగలోహమయ నాళంబెత్తెశంపాలతో
జ్జ్వలవహ్నిందరికొల్పిసీసగుళికాజాలంబునానొప్ప ని

స్తులవర్షోపలపంక్తి చేసమయయోధుండానిదాఘుంబ నే
బలునై రిం దెగటార్చె భూరితరశబ్దంబొక్కటంగ్రిక్కఁగన్

మ. పలుమారల్లెసజిత్రికాంతిమణి చాపస్ఫూర్తులేపారఁగ
జ్జిలుచున్ భూరిశతోత్కరంబున నడంచెంబింఛముల్ గూలఁగా
గలఁకన్ వాహినులెల్లఁ బాఱ నపుడాఘుర్మాభియాతిన్ వడిన్
బొలుపొప్పన్ ఘనశాలయోధుఁడతివిస్ఫూర్తిన్ విడంబించుచున్

• కుసుమితకదంబవనముల
విసరము పుష్పాంజలియిడు విధమునఁగడుఁబెం
పెసఁగె శిలీంధ్రము లొక్కట
వసుమతి భేదించి యురుము వలనన్ బొడమెన్.

మ. తొలుదొల్తన్ విపినామ్రపక్వఫలసందోహాద్గళత్సారవృ
ష్టులచేఁబాఱు ప్రవాహముల్ బొదలజుట్టున్ దొట్టికప్రింపుతి
ప్పలపై కెక్కియు జాజిపూటుదుటు తెప్పల్ దెచ్చి గొజ్జంగిగా
సిలఁగాఁబేర్చుచు ముంచిరొంపులుగఁ జేసెన్ గట్టజవ్వాదులన్

గీ. నీలములరీతిఁ దేటుల పోలికలను
వెలయుఁబరిణత ఫలముల విట్టువీఁగి
పుడమి నెడలేక పోల్చుజంబూవనాళి
మంగళము బోరగించిన భంగిఁ బోఁచె.

క. పసిమిన్ మిసమిస లారెడు
కసవులజొంపములఁ మెసవి కడుముప్పొద్దిం
పెసఁగఁగ మందలనై చికి
విసరము చన్నవసిపితికి వెలయఁగ నూళ్ళన్.

చ. జడిఁగొనివానమొత్త వనసంగతిగొల్లలు దొడ్లక్రేవలన్
దిడుగులక్రింద నీఁగి నలుదిక్కులుమాటికిఁజూచి యొండురం
బడిబడిఁ జీఱుచున్ మృగవిబాధలకై రొదసేయుచున్ నిశల్
గడపిరి నిద్రచే బలుపుగానొకనాఁ డొకయేడుపోలికన్.

ఉ. చాతకభాగ్యరేఖ జలజాతవినిర్గతభూతి కేతకీ
జాతతపఃఫలంబు శిఖిజాతిశుభాస్పదసీమ పుంశ్చలీ
స్ఫీతమనఃకవాటసువిభేదనకుంచిక రాజహంసికా
ఘాతుకరాశి వర్షమయకాలము గాలముపాంథకోటికిన్.

ఉ. ఆగతిఁ గాననాంతసకలార్జునసంహతులెల్ల నున్మిష
ద్రాగముగల్గియొప్పి యలరం దదభిఖ్యను గాంచినట్టియా
శ్రీగలయొక్కయర్జునుని చిత్తలసత్థితి యందనంద వ
ల్గాగమమొప్పఁ గార్శ్యసముదగ్రతఁ దాల్చె విచిత్రమైగతన్.

క. గగనమున సకలదిక్కులఁ
దగి యలరెడు నాతటిల్లతల కాంతలకున్
సొగసొప్పసుభద్రాంగము
జిగికి నభేదంబు నరుఁడు చిందించెమదిన్.

ఉ. ఆతరిమానసంబున సమంచితమాయదుకన్యకాప్తిచే
నాతతవృత్తితోఁ బరిణయంబువహించుచు మన్మథాగ్నిలోఁ
బ్రీతిని లాజహోమమొనరింపనొకోయనఁ దత్సగర్భ్య న
బ్జాతవిలోచనుం దలఁచెభావమునందు సురేంద్రసూతియున్.

క. తనుమాత్రమైన నిప్పుడు
వను విశ్వంభరునిఁ దాల్ప నరునకు వశమే

యనుగతిఁ బురాణపురుషుఁడు
మనమునఁదగి యతనిదృష్టి ముందలనిలిచెన్.

వ. అంత,

గీ. స్వస్వచేష్టాకథలను దత్సమయమునను
బుతుగుణజ్ఞలు దారునెఱింగి యచటఁ
వీక్షణంబుల సంతోషవివశులగుచు
నిద్ర రేకాంతయుక్తిచే నెసఁగరైరి.

వ. మఱియును,

చ. మధురరసాయనుండయిన మాధవుభావమునం దదాజ్ఞ చే
పృథకొమరుండు నయ్యెడనుభిక్షుకవేషముఁ బూనిదైవతో
త్కృథరగుహాంతరాప్తి నతిగూఢగతిం జనియుండె గూరివ
న్మథకృతమైన సాధ్వసమునంబలె నీశునిఁ గెల్వఁగల్గియుర్

ఉ. ఉన్నతుఁడైనసత్కృవియు నోపఁడుగా యదుకన్యసుందర
తోన్నతి సన్నుతింప నిఁక నొండొక కృత్యముచేత నర్జునుం
డెన్నఁ దదీయశోభఁగనునిచ్చను రైవతకాద్రిచెంగటన్
గన్నియమీఁదియాస వడిగానెదురే కనుచుండె భిక్షువై.

క. సంసారముడిపి భువిలోఁ
గంసారిని మదిఁదలంచి గాసన్న్యాసుల్
గంసారిని మదిఁదలఁచుచు
సంసారముఁ గోరె నరుఁడు సన్న్యాసియునై.

ఉ. ఆసమయంబునందుల శ్రియఃపతి ద్వారకకేగి తత్పురీ
వాసులతోడ రైవతకవైభవమారయు నజ్జనావళిన్

భాసురలీల నిష్టములుచాటిలునంచును దెల్పివారితో
భూసురకోటితోఁ దనదుబోటులతో జనుదెంచెఁ జెచ్చెరన్

వ. మఱియుఁ దరుణతరణికిరణస్ఫురణతేజో భరుణుండగు కపటయతికులాభరణుండు రై వతకధరణీభరణంబు శరణంబుగా నుండునెడ నత్తాపసునకొనర్చు నమస్కారంబు శ్రేయస్కరంబని పురోధోజనబోధితక్రమంబున గుతూహాలియగు హాలి వందనం బాచరించి పురందరనందను నాత్మీయమందిరంబునకుఁ దడ్గిరి మ హోత్సవానంతరంబునఁ దెచ్చుసమయంబున.

సీ. విరహాగ్ని హృదయంబువెడలి దేహముగ్రమ్మ
జాడఁ గాషాయ వస్త్రమ్ములలరఁ
జిత్తమునిండుగాఁ జిక్కుస్నేహంబువు
లనఁ గుండికాజలం బతిశయింప
మృదుసంపదకు నోడి పదసేవఁగనెనన
శ్రీఖండపాదుకాస్థితి జెలంగ
జెవితోడ ముచ్చటఁ జేయుదిన్నాళ్ళకు
ననిమెన్న జపసరం బచ్చుపడఁగ.

గీ. మరుఁడు నరుఁ డనుమిషమున నురగపాండు
యదుకుమారికలకు మూడునెసగఁబరఁగు
కాండములుదాల్చు గతిని త్రిదండియగుచు
వచ్చె వైష్ణవసన్న్యాసి వాలకమున.

ఉ. శౌరియు నాతపోధనునిసన్నిధికిం జనుదెంచి భక్తిచేఁ
గోరిక వందనంబుసముకొల్పి తదీయకరంబునందు దై

వారెడుకుండికం దనదువామకరంబునఁ బూనివేడ్క నా
ద్వారవతీపురంబున కుదారతఁ దోడ్కొనివచ్చె మెచ్చుగన్.

గీ. స్వామి! వేంచేయుఁ డిదెయిదే సరణి యిటుల
ననుచు భక్తివినమ్రుఁడై యతి నియతినిఁ
గన్యకాంతఃపురోద్యానగరిమ నునిచి
యలసుభద్రను శుశ్రూషకనువుపఱిచె.

చ. సరణిని మూరణత్రయము శంబరవైరి బలారిసూను పైఁ
బరఁగ నిగుడ్చి తక్కటిది బాణయుగంబడరింప లోభవి
స్ఫురణమునన్ మురారిహితబోధితయై పరిచర్యసేయు న
త్తరుణిదృగంచితాశుగవిధానమునన్ మొనచూపె నత్తఱిన్.

క. రతిపతి ధనుర్భ్రమముచేఁ
దతసుభ్రూవిలసితైకతనుచారుతచేఁ
బ్రతిదినముం దపమునుబలె
నతనిశరీరంబు చాలనలమటపడియెన్.

క. మానసనినిట్టూరుపు లవి
గానంబడకుండ నాసికాస్పృశుఁ డగుచున్
బ్రాణాయామమిషంబుం
బూనెన్ నిక్కపుత్రిదండిఁ బోలి యతండున్.

ఉ. స్ఫూర్తినిఁ బద్మలోచనుని సోదరియోష్ఠముఁ గ్రోల మన్మథా
ర్తినిఁ జంచలంబగురదాంశుకమల్లన మూసె నంతఁగ
న్కృత్తియతీశ్వరుండు నవగూఢముగాఁ బ్రణవప్రపంచవి
స్ఫూర్తిని నిక్కమేజపము బోలునటంచుఁ దలంచిచూడఁగన్

వ. మఱియు నీక్రమంబున నమ్మొద్దియ కవ్విభ్యారుచు నొక్కనాఁడు.

సీ. కొమ్మ! యీగోరట గ్రమ్మినచికురాళి
చక్కనౌస్నిగ్ధత చాలఁగలిగి
యలసుమనఃప్రాప్తిదెలుప దీపున్నాగ
మబలనీయౌవన మందయున్న
లలనాపయోధరంబులు గ్రమ్మఁదమకించు
రాజహంసస్ఫూర్తి రమణమయ్యె
నించుకనందిచ్చి యీలతకూనయొ
ప్పిననినకరము సొంపెనయకున్నె

గీ. అనుచునర్మోక్తిరచనల ననుకరించి
కేలివనవిభవంబులు లీలఁదెల్పు
మాడ్కిమదిలోన నుప్పొంగు మమతలెల్లఁ
దేటపడనీకవల్కుచు బోటితోడ.

ఆ. వె. కొంతసేపు నిష్ఠఁ గొనియుండి క్రమ్మఱ
మనసుమెత్తఁదనము దొనకనతఁడు
వేగ యోగదృష్టివిధి నేమొ చూచిన
రీతి మాటలాడు బ్రీతిఁ బల్కె.

సీ. శుకసమాజములు సంస్తుతులొనరింపమ
రుత్సంతతులు జేరి యుత్సహింప
విధుఁడగ్రతలముస వెసఁ బ్రసన్నత బూని
కరములెత్తఁగ హంసగణముగొలువ

నీలకంఠస్వామి నృత్తముల్ నెఱపంగ
విప్రయోగులును సద్విసుతులీయ
నలర నిరాకారుఁడగు నావిభుండప్పు
డంతరంగంబున భావహించి

ఆ. యాత్మదృష్టికగ్గమై తదేకత నొందె
మానసంబు తనకుఁదానఁజేసి
తనువునుబులకించి వనితరోమాళికి
మాఱినుపడును చాలమఱపుఁ బూని.

వ. ఆతత్త్వం బెట్లంటేని

క. నీవను నేనను భేదము
భావింపఁగలేదు తెలిసిపలికినఁదనలో
నీవలరు దెవుడునీలోఁ
దావుగనేనుందునమ్మ తనుదెలియంగన్.

వ. అని యీప్రకారంబున నొక్క కాలంబునఁ బలుకుచుఁ బతిక్షణం బిక్షుచాపక్షురస దృక్షరనికరంబువలన నతని యతిత్వం బించుకశంకించి సుభద్ర ధవిత్రంబుచే వీచుచుఁ దత్త్వంబుఁ దెలియంగోరు మనంబున సవినయంబుగా మెల్లన నిట్లనియె.

గీ. దేవ నానెమ్మదిని భవదీయమైన
రాకచేఁ బ్రీతిచంద్రిక రమ్యయయ్యెఁ
గొంతమానప్రసన్నత్వ మింతబూనఁ
గల్పశాఖాశిఖాయతి గాంచెనిపుడు.

క. యదువులు బుణ్యాత్మకులే
కద ! యతివర! నీదు పాదకమలరంజంబుఁ
ముదమునఁ దలపై నిడుకొని
మదిలో మీామీాఁదిభక్తిమజువక యుండెఁ

ఉ. దేవ! సమస్తముం దెలియుదేకద! చూడఁగ దివ్యదృష్టిచేఁ
గావున నొక్కయిష్టమడుగఁ వలసెఁ మిము మామకీనమా
భావిశుభంబు, దానిఁ గృపఁబాయక నానతిసేయుఁగాఁదగున్
బావనులెందు సంయములు ప్రాజ్ఞతచే నని బాలపల్కినన్.

గీ. అపుడు గన్నులుమూసి మాయాతపస్వి
యోగమున నేమొచూచినలాగు బల్కెఁ
గొమ్మ ! పలుమాటలేల? నీగుణమువలన
విజయసంప్రాప్తి గలదని వెలదులందు?

చ. చరణనఖాంచలంబుఁ దను సారెకుఁదావకభాలసీమయం
దిరవుగఁ సద్విశేషకము నై నరుఁడంచుఁదలంప నాతఁడ
మ్మరునకు నగ్గమై వెతల మాటికినొందుచు నిప్పుడుండి యో
తరుణి! తనంతనేయెదుటఁ దాఁగనుపట్టును నీదుదృష్టికిన్.

మ. అనివక్రోక్తుల సూటి తేటపడఁగా నాడం గురంగాక్షి యా
తనివాక్యంబుల సందియంబు నను వందన్ మున్నుతావిన్న తి
న్ననివారందరిచిన్నె లన్నియును గానంగా నితండే నరుం
డనునిక్కం బనుమానికంబు హృదయంబన్నెట్టినుం చిట్లనున్.

ఉ. స్వామి ! భవత్కృపామహిమ చాలమదీయముఁజేసినారు మీా
రేమిపుడానతిచ్చితి రిదింతయు నిక్కమయానటంచు ల

జ్ఞామహితాయతాక్షి యతిసన్న మెఱింగి శిరంబువంచి తా
నేమియుఁ బల్కకున్న నపుడేచినమోహముచేఁ గిరీటియున్.

క. కొమ్మా! యెవ్వనిఁ గొలిచెద
వమ్మనుజుఁడు నీకు దాసుఁడై యిదె చెంతన్
గ్రుమ్మరుచున్నాఁడిటఁ జే
కొమ్మా! యిఁకనైన ముద్దుగుమ్మా! యనుచున్.

క. నిబ్బరమాగుబ్బగఁ దన
సుబ్బాకుఁడు తెలియ నంటఁ జూచుచు నపుడా
బిబ్బోకవతిం జెక్కిలి
తబ్బిబ్బుతపోధనుండు దాఁజుంబించెన్.

క. అలవంచనముని జేకొని
తిలకించి మనోజుఁ డుప్పతిలఁ గాంచినచోఁ
గిలికించితవతి కల్లన
పులకాంచిత మయ్యెఁ దనువిపులకంచితమై

ఉ. కొంచక నించువిఁల్తు డిదిగో సమయంబని యెంచి మించి
య చ్చంచలనేత్రి నిందర్జుని సారెకుసాయకపంక్తిముంచె న
భ్యంచితవృత్తిచేత నపు డట్లనిమంచితనంబు లేదు లె
మ్మంచు జగంబువల్కునది యంతయు నిక్కవమై తనర్పఁగన్

వ. అప్పుడు

క. తమకంబేటికి మీకై
తమపంకజలోచనుండు తను నిపు డిచ్చెన్

దమకంబున నున్నాఁడని
తమకక చెలి యతనిచేయి తా విడివడయన్

క. విచికిలమువలెనె యది కీ
వి చికిలిచూపుల మెఱుంగువీచిక లలరన్
గచభారముచేఁ దూలి లి
కుచఫలకుచ యంతిపురము గొంకుచుఁ జేరెన్

ఉ. కాంత తనంత నంత నిజకాంతుఁడు కందునివంతఁగొంత యే
కాంతవనాంతసీమ బడఁగా నట నంతిపురంబుఁజేరె భూ
కాంతుఁడు చెంత నింతి వినఁగాదనఁగాజనఁగాననాయెని
ట్లంతయు నంచుఁబల్కుచును నల్కుచు మల్కుచు కల్కిఁ
బల్కుచున్

వ. అంత

సీ. అపరూపమయ్యె నయ్యతివయన్నువ కౌను
బంగారమయ్యెఁ దన్వంగిమేను
యబ్బురమయ్యె నయ్యాలివేణి ఘనవేణి
కప్పురమయ్యె నక్కాంతపలుకు
నిక్షేపమయ్యె నన్నెలఁతుకనెమ్మోము
సూడిదయయ్యె నాసుదతితోడవు
నల్లబూసాయెఁబో నలినాక్షినూగారు
మేరువయ్యెను గొమ్మ మేటిపిఱుఁదు

గీ. మిగులఁ బ్రియమయ్యె రాజకామినియొయార
మరిదియయ్యెను దరుణీవిహారభూతి

యనియనియతి యతియు క్షణం బఖిలదిశలు
గాంచుఁ దనుతాపమంతంతఁ గాంచునపుడు.

క. చెలిచూపులకో చలవీ
పులకో వలరాచవేలుపుల తూపులకో
పులకోయలయలితోఁడో
పులకోపులకోదయము విపులమగుఁ బతికిన్.

క. కేకుల కేకలకో మరు
కూకలకో గాడ్పుసెకలకో చిలుకలకో
కోకిల కోకలకాకలి
కో కోకులకో తలంకు గోమలికొలకో.

చ. సరసిజ పానపాత్ర విలస న్నవసీధు రసంబు దాఁవి సు
స్థిరముగ మే నెఱుంగనిగతిం గడు ఝుంకృతులొప్ప రాజకుం
జర మతిభీతిఁజెందగను జాలములానుచు నీలకాంతిచే
నరుదుగఁ గ్రమ్మెనవ్వనమునంద మిళిందపుళిందబృందముల్.

ఉ. కేవల శస్త్రభూతధృతకింశుకకుట్మలసీరభూతమై
వావిరి ఘర్మవర్షము లవారితమైకడుమీఱి యుండఁగా
నావనితాకపోలతల మన్న యొకానొకక్షేత్రసంగతిఁ
భావజకర్షకుండు వెడఁబమ్మె వగల్ పులకచ్ఛలంబునన్.

చ. మదనున కింతదొడ్డతనమా? తనమామనియెంచ కెంతయున్
బొదవెను బాణపంక్తులను బుంఖము పుంఖమునాట నాటనే
గదఁగనెనిందునందనుచుఁ గాయనికాయనసవ్యసాచియై
బొదవినవై నఁ గాలగతి బోగతిఁబోయినరీతి నుండగన్.

క. కసిమసఁగు ససమశరవిశి
ఖసముదయంబులను సమముగా సతి పతియుం
గసటువడునెడల నలసా
రసహితుఁడు సదపరసాగరమునం గ్రుంకెన్.

శా. ఆరాత్రిన్ హరి సీరికన్మొఱఁగి కృత్యారాతియుం దాను నా
నారీరత్నము నాలసద్గుణుఁడనన్ నల్వొందుపౌరందరిన్
గారాబంబున వారినిర్వురఁ శుభైకంబౌముహూర్తంబు బెం
పారన్ శోభనమొప్పఁజేసి యటనింపారంగ నవ్వేళలన్.

గీ. ఉదయవేళఁ గింశుకోజ్జ్వలప్రసవంబు
నాఁగ నంత వ్యాఘ్రనఖముఁబోలి
యగిసెపువ్వుభంగి నలచందురుఁడు మింట
నంటియుండెఁ బిదప నలఁతిరుచుల.

గీ. చంద్రుఁడు దయించె నిఁక ప్రొద్దుచాలలేదు
కనుమఱుంగుననే మీరు గదలవలయు
నంచు శౌరిసునాసీరు లరదముునను
దంపతుల నుంచి దీవించి పంపునపుడు.

క. హరికడవారలును బురం
దరుకడవారలును సమ్మదమునందఁగ నా
తరుణీమణి సహితుండై
గరిమన్ నరుఁ డంత ద్వారకా పురివెడలెన్.

సీ. అత్తరియాదవు లప్పాకశాసని
దౌర్జన్య మరసి దుస్తరమహోగ్ర

కోపులై వెన్నాడి కూడముట్టి యభంగ
చతురంగబలముతో శక్రసుతుని
బొదవి బాణములేయ బెదరక యతఁ డప్పు
డరుదారఁగ సుభద్ర యరుదమునకు
సారథ్యపాటవచతురిమ నలరార
నిఖిలవీరులు బరాఙ్ముఖులుగాఁగ

గీ. సాయకావలిచేముంచె శౌరి సీరి
కినుక మునుకొనిమానిచెఁ గ్రీడియచట
గదలి విజయాఖ్య సార్థత గాఁగ రాచ
తెరవతో గూడి తనపురి తెఱవుఁ బట్టె.

చ. కలహము వేగ శాంతిఁబడఁగా యదుజాడ్వయశఃపతాకమై
యలఁతుల కెల్లమూలమయి నట్టివ్యళీకయతిత్వ మాత్మలోఁ
బలుమరునెంచి నవ్వెడు సుభద్రరదద్యుతి కాప్తమిత్రమై
యలఘుయశోండు పాండవకులాభరణం బట వీటికిం జనెన్.

వ. అంత.

చ. సకలజనాభినంద్యమగు చక్కని యొక్కముహూర్తరామణీ
యకమునఁ గౌరవాన్వయశుభాయతమానుదయాప్తికై కుమా
రకు నభిమన్యునాఖ్యు నతిరాజితవీరు సుభద్రగాంచె దా
నకుటిలవీరమాత కడుపారఁగవీరునిఁ గన్నపోలికన్.

చ. అనయము దాఁ బతివ్రతలయందుల నెన్నిక కగ్రగణ్య గా
వున నిజకాంతు లట్టులనెభోరున నాహుతపంచకంబునుం

గనియె నమానుషైకబలగర్వపరాక్రమశాలులన్ కన
ద్ఘనగుణచారుధాముఁలను ద్రౌపదిసమ్మదమార నత్తరిన్.

వ. అంత.

క. ఆకోమరుల యుదయోత్సవ మా
కర్ణించియు వసంతమనురాజసుతుల్
శ్రీకినిసామంతతతుల్
శ్రీకాంతతబోడమెహర్షసిద్ధాంతంబై.

చ. తనతనయుండు భీముఁడు నుదారకుమారకుఁగాంచు టెంచి భూ
జనములనంటఁగాఁ బురిటిజాతినటంచును సంకుచస్థితిన్
గనెననఁగామహాలి నలగాలి పటీరనగాలిపాలికా
ఘననగమానమాని తిరుగందిరుగన్ ధరమానె సారెకున్.

గీ. కరుణమాలినయీగ్రీష్మకాల మిపుడు
మధుని మామకజీవాతు మాన్చెదూర
గతునిఁగా ననిరోషించుకరణి ధరణిఁ
గోకిలస్వాగతంబునులేక చనియె.

సీ. బడబాగ్నిశిఖఁ ద్రెళ్ళిపడి వార్ధి వెల్వడి
పుడమి కెల్లను సెకబొడముకరణి
కఠినోగ్రగళవినిర్గళ దనర్గళగర
ళముబిచ్చు జగములో నుమియుకరణి
విలయభాస్కరకరావిర్భూతమై పోల్చు
నుడుకు లోకంబుల కుఱుకుకరణి

చటులభాలాక్షదృగ్జ్వానలవిస్ఫూర్తి
కడిమి బ్రహ్మాండంబు కరిఁగుమ్మరణి
గీ. దళితనదవారిజంతుసంతాపకారి
యతులతరభూరి విలయకాలానుసారి
యూష్మగుణహారి హంసలోకోపకారి
శమితహిమవారి గ్రీష్మర్తుసమయ మలరె.
క. దగదొట్టి నీరుకానక
నగములపై పిట్టలవియ నఖిలమృగంబుల్
పగలెల్లఁ బొదలువెడలక
బెగడుచు రేలెల్ల నెల్లబీళ్ళనుదిరుఁగన్
ఉ. చల్లనినీరు గంజి వడజావ కళుత్థపుకట్టు చల్లపై
పుల్లనితేట పొంటిపొడిపోసినమజ్జిగ పుల్లనీరు కో
కొల్లని యిత్తు రెండ దగగొన్నజనాళికిఁ బిల్చిపిల్చి సం
పల్లవితంబులైన చలిపందిరిచాలున సేదదీరఁగన్
గీ. అలర నశ్వత్థదళ మసియాడకుండ
నుమ్మగొని యున్న వెచ్చని తెమ్మెరలును
భాగ్యవంతులగృహరాశిభాసమాన
తాలవృంతాదు లుద్భవస్థలములయ్యె
గీ. ఘనశిరీషద్రుమంబులు గన్నులార
యుమ్మ నొక్కుమ్మడిన మొగ్గగ్రమ్మి పిదప
బహుళసంఫుల్లకింజల్క పాటవమున
దీపరించె గోళికాతతస్థితులఁ దనరె

గీ. కురుకుమారీతనూలతాస్ఫురితమార్ద
వమున కుపమానమగు శిరీషములచాలు
చారుసుమనస్థితిని నాఁడు సమితఁ దనరెఁ
దపముగను వారి కోరిక తక్కువగునె?

క. కురుకేళివనుల మల్లియ
విరులన్ మధుపాళిపాళి వెలసెను ఋతురా
జురుమధుగంధద్రవ్య
స్థిరతకునై లక్కముద్రఁ జేసెననంగన్.

మ. శుచిభూతంబులునయ్యునెవ్విమహిమించున్ బాటలాప్తిన్ రుచి
ప్రచురంబుల్ క్షణపీతముల్ సురభిళస్ఫారంబు లానవ్యసూ
నచయుంబుల్ బహుచిత్రమాట కిది వింతా? దృష్టికిం దత్తప
ర్తుచర త్తిగ్మములోకజాడ్యములఁ దోఁదోఁదున్మితూటాడఁగన్.

చ. ఘనముగఁ బూచె సంపెఁగలు గౌరవకాంతలనాటకాకృతుల్
గనననురీతి నెంత నవకాంచనచారుసమాఖ్యఁ గాంచినన్
దనరు తపస్సు నుత్కలిక దప్పకమించిననైన కల్గునే?
నెనయ రజోగుణాత్ములకు నెయ్యెడ నిశ్చలితేప్సితార్థముల్.

శా. సీమంతోచ్చపలాతికాంతము శిరశ్శ్రీమచ్ఛిరీషైకసు
త్రామేష్వాసము గల్గుకైశ్యఘనమున్ దైవారుకాంతాళియం
దామీఁదంగనుపట్టకున్నె? మహనీయస్వేద వర్షాగమ
శ్రీమాన్యంబులు దుర్దినంబులటఁ దచ్ఛ్రీభాలదేశంబునన్.

మ. అతివర్షాగమమొప్పుచో నిది మదీయపాంతకాంతార సం
గత భూమింగత భూమిగా దృఢగతిం గావించునం చాత్మనెం

చి తటాంతోరుమహీరుహంబు లిటరోషించిట్లుతద్ధూరసం
గతిగాఁ దోఁచినరీతి నేళ్ళనడుమన్ గన్పట్టెఁ జాళ్లెంతయున్

చ. తపన సజాగ్రదుగ్రతర తప్తసమస్త దిశావిశాలమై
న పగటిప్రోవుతో సమమునాఁ దగి రాత్రిల నీశ్వరస్థితిన్
విపులతమాని వేగునన వేగనవేగును నిచ్చనచ్చ న
త్తపనునఁ గప్పియొప్పడరుతద్ధృతయాబుతుముద్రియొప్పఁగన్

క. పరితిదేశంబుల నురుకుచు
నతిజడిమ కురంగచయ మహాస్కరభిల్లా
హతిచేఁ దూలుచు వైళమ
క్షితిపులధారాగృహములఁ జెందెన్ భీతిన్.

ఉ. కొందలమంద దేహమునకుం బరుదేహము కూర్చెఁదాపముం
జెందెడినాతపర్తున సుచిత్తులునయ్యు విలాసులొండొరుల్
కొందఱువాక్యకౌశలతఁ గొందఱు మానితమానసస్థితిన్
గొందఱు దృష్టిచేత నుపగూహనముం గొని రున్నతోన్నతిన్

క. చనుఁగరువలికిని మెరువలి
కినిఁ దపన కరావలికినిఁ గేవలమును నా
ఘనభువనము వనమున్ జీ
వనమున్ మతి ధృతిని గతిని వరుసన్ వీడెన్.

వ. మఱియు సీకరణింబురణించు నురుతర తరణి కిరణాం బర వింద బంధు నందనయగు కళిందకన్యక కెటింగించు తెరంగున వరు గుదెంచు సంగతి నంగనాసంగతులై విరంతరోపాంతులౌ వసంత శాంతుల ననుకరించు నిందరినందనోపేందుర్రిలు దత్సమయంబున

హంసపాదదురవగాహవనజాత సనాథపాథః పరిపూర్ణంబగు రోధో విహారంబునఁబోల్పఁదగు నా సరిత్తీరంబు జేరంజను దెంచునవసరంబు

చ. అలరఁదరంగ వేగమనునట్టి మిషంబున సూర్యపుత్త్రిని
ర్మలు జలదాభదేహు మురమర్దనుపాదముసోఁకె దాని ని
ర్మలగతిఁబూనఁ దత్పురుషమాన్యుని పాదముసోఁకు నంతనే
దలఁప జగత్పవిత్త్రియగు తత్తటినీమణి చెల్మిఁగోరుచున్

చ. తరుణతరాంబుదప్రభలఁ దార్కొనువర్కసుతామరాళి వారియం
దురు గతినంభ సాంభ్రమల యొప్పులనల్పతమీరె సారెకున్
సరభస సీరి సీరకృతజాత వినూతన దుర్వ్రణాతతో
ద్ధురవరఘాతశంకలకుఁ దోఁపఁగిరీటికిఁ గొల్లమేటికిన్.

గీ. శౌరి తరుణుల ముఖపద్మ చయము రయము
దనర జలదుర్గపంకజ తతినిఁగెలువఁ
దీరమున నొప్పెఁ దిలకావదేశమునకు
ఫలకముల నగ్రమునఁబూని బహులసరణి.

క. వారల విలాస గమనము
లారసి రాయంచపిండు లాహాయని ల
జ్జారసవశ పరవశముల
దూరెను నిజగతివిలాస దుర్లలితములన్.

వ. అప్పు డమ్మంద గమనాబృందంబులు ముకుంద పురందర నందన సంయుతంబులై మందగతిం గాళిందీనదిం బ్రవేశించునెడ వారలపిఱుందు లీర్ష్యంబులఁబోలెఁ బొందుపడు నిజావకాశ భాసుర పయోబింధు సందోహంబుల నలఘు పులినంబులఁ గఱిగింప

గొందఱి నాభికుహరంబు లసూయావశంబునుంబోలె జలభూష ణంబునఁ బ్రవర్తికావర్తనర్తనంబులు నిర్వర్తింపంజేయు గొందఱి కుచకుంభ యుగళంబు లతిరోపంబునుంబోలె సంభూత సంక్షోభంబుల కోకనదకోశదళవిదళనంబొనర్పఁ గ్రీడించు సమయంబున.

చ. అల గిరిరాజ పుత్రి సముదగ్రతపర్తునఁ దండ్రియిచ్చునా
జ్వల వసుజాతతాప మనివారితసంచలితోర్మిబాహులన్
జెలుల కుచోరుకుంభతతిచేఁగొనె సర్వమునట్లకాదెని
శ్చలత నపత్యభాగ్యముల సంపద నన్యులఁబొందనేర్చునే?

క. వారిజలోచనుని సునా
సీరసుతున్ నేర్పుమీరఁ జేరఁగనీక నే
తీరనిచెలుల మొగములు వి
చారముచేఁ జక్కఁబంకజంబులుగ్రింకెన్.

గీ. సాయముననాయమస్వన సన్నిధులను
గామినీ స్తనములు నిజ కాంతిచోర
తామరసముల బిసశూల తతులవై వి
హార్షమునఁబోలె వారి మధ్యమునఁ బొదలె.

క. తరుణులు జిమ్మెడుతోయము
లురునఖరప్రభలతో మహోన్నతి సఖియా
సురదీర్ఘికకై మెగసెడు
కరణిన్ హరిముంచివేగ గగనముఁ గ్రమ్మెన్.

చ. ప్రియమునఁ బొందియుంత నొక ప్రేయసికారసికావతంసుఁడా
నయగుణహారి శౌరి నలినంబులఁ గట్టిన దండ కొప్పునన్

రయమునఁగట్టినంగని భరంబగుశ్రద్ధత నశ్రులొప్ప ని
ర్దయనగునవ్వు మోముసు వతంసముగానిడెఁదత్సపత్నియున్.

సీ. పృథువిధుంతుదవేణి విధుముఖమృదుపాణి
పుష్కరాంతరమునఁ బొదవిక్రమ్మె
మకరజంఘిక కరీంద్ర కరోరుయుగసమాన
గతి జలంబులయందుఁ గడఁగిమూన్చెఁ
గీరభాషిణి ప్రఫీకృత చారుబింబోష్ఠి
నొడిసేవనంబున జడనుబడఁగ
హంసగామిని పయోజాననవిస్ఫూర్తి
నడుగుగాఁగొనెఁ గమలాలయమున

గీ. నోలమోలయనుచుమధ్య యొకమృగాక్షి
నుదధిలంఘింపనది గ్రుంకి యోసరించి
యిట్లు బాలికలెల్ల నయ్యేటినీట
సమ్మదంబున జలకేళి సలుపునపుడు.

ఉ. గ్రుంకియుఁబట్టునప్పుడుపగూహన మంతఁబొనర్పఁ బందెమా
పంకజలోచనుండునొడ బాటుగఁజేసి సుదృక్కులందనుల్
గొంకకతజ్జలంబులను గొబ్బుననంటి ప్రియంబుమీఱుని
శ్శంకలనాస్వయం గ్రహణ సౌఖ్యముఁగాంచు నుదంచితస్థితిన్

గీ. దనుజవైరి బుద్బుదములచేఁదనజాడఁ
దరుణులెఱుఁగ ఫూత్కృతములతోడ
నీటమునిఁగి యొక్క నెలఁతను వంచించి
కడఁగి సవతియూరుఁ గౌఁగిలించె.

గీ. మండలాకారమునఁ గృష్ణపాండుసుతులఁ
బుండరీకాక్షులన్నిటి పొంతనాడఁ
గుండలంబుల ధరియించికొన్న భంగి
నుండెనయ్యేటి ప్రాంతముల్ రెండుమొరసి.

వ. ఇట్లు కొంతతడవు గ్రీడించి

సీ. జలమేళనవు సిగ్గువలన సంకోచించు
గతిగాత్రములు గుచోన్నతులవంగఁ
దద్దేహ సౌందర్యతతులెన్ను ననమరు
చ్చలిత పటాంచలస్వనములమరఁ
దనుకాంతి లతలకెంతయుఁ గోరకములన
రుక్మభూషణ రుగ్ద్విరుక్తులలర
జలదేవతలు కృష్ణచరణద్వయంబులు
విడువకేతెంచిన విధముదనర

గీ. నొప్పనప్పడతులతోడ నప్పలందు
వెడలి జేజేలయోఁడయని కొడుకులచ్చి
యొడయఁడావంక నిరువంకయడవిలోనఁ
దిరుగుచోవారలకు నగ్రదేశమునను.

క. కృశితోష్ణ కిరణరుచి ప్రతి
దిశలఁ రాజిల్ల నొకవిదేశకుఁడుమహా
విశదైక దీప్తికాశిని
భృశగతిఁ బొడసూపెనెదురఁ బ్రాహ్మణాకారా

మ. అతియత్నంబునఁజూచిచూచియుఁజిరంబౌదృష్టిశక్తిన్ యథా
స్థితిసన్మధ్యమునందు నొక్కరుని విస్పీతపరిభ్రాచ్ఛతురినిం
దతమాజ్వాలదృగాభవిస్మయములొందన్ గాంచి చిత్తంబులా
దతచాంచల్యములయ్యె నాహరికి గోత్రిక్షోదిసత్పూతికిన్.

చ. హరితరణీ గణంబు నుదయఃకృతమైన తిరోతికంపమున్
సొరగనుభీరుభావమున సూచనచే బలెనంత నద్ధరా
మరజరఠుండు వచ్చునెడ మార్గముచెంతల రెండుభంగులన్
గరమరుదారు శీఘ్రగతిగా నటయోసరి నిల్చిరత్తరిన్.

ఉ. అంతట నమ్మహాత్ముని పదాబ్జయుగ్మమూల ముకుందపార్థు ల
త్యంతముదంబు లొప్పఁగ నిజాత్మ లకల్మషవృత్తిమీరఁగా
నెంతయునన్నుతుల్ దగ ననేకవిధంబులఁజేసి భూరజ
స్సంతతిఘర్మతోయముల సంగతి గాత్రములంటమ్రొక్కినన్.

చ. తలఁపఁ బరిస్ఫురంబుదగు దానసయుక్త ఫలప్రదేచ్ఛచే
నలరుస్వజన్మతారయు నిశాధిపవాసరమున్ యదృచ్ఛచేఁ
గలసినరీతినున్నయది కౌరవనాథులఁజేరి సంభ్రమం
బలవడదీవనల్ నెఱపె నాకపటద్విజ వృద్ధుఁడంతటన్.

వ. ఇట్లు దీవించి మరియు వారలకిట్లనియె.

ఉ. వీరవరేణ్యులార ! మిమువేగని వేగనె భీతిచేతఁ బెం
పారఁగఁ గుక్షిచెందుగతి యాకలియాకుల వృత్తినన్నుఁదా
సారెకుఁజేయుచున్నయది జానుగవేఁడెదఁ గూడుచాల నా
హారము గొందునీయతిథి యాదటనేమిటఁ దృప్తుఁడౌతగన్.

చ. తనరగ నీప్రకారమున దక్షిణహస్తము సాఁచిబల్కునా

ఘనుని వచఃప్రయుక్తి కతిగాఢగతిం దగనట్టులౌనటం
చనుమతిఁజేసి రాహరియు నర్జునుఁడుర్ భువిలోమహాత్ములర్
గనుఁగొని వేఁడునట్టి పనికర్కశమేనియుఁ గాక తక్కనే? .

వ. అంత స్వాంతంబున దురంతంబగు చింతితార్థంబెంతయు భగవంతుండగు శిఖావంతుండు సంతసంబున దంతపటి యవని కాంతర్నటత్స్మితులగు నరకాంతక కౌంతేయుల కెఱింగింతునని చింతించి నిశాచర మరుద్భుజంగ సంఘాత మేదురీకృత దుర్హ్మిత తాండవంబగు ఖాండవ జగత్కాంతేగళుత్వంబును దత్పరిరక్షణద త్తుండగు బుబుక్షునకుఁదక్షకునందుఁ బక్షపాతంబును విచక్షణం బుగాఁదెలిపి మీకటాక్షబలంబున క్షోదంబొనర్తునని స్వాపేక్షిత లక్షణంబుదెలియ దుర్నిరీక్షంబులగు సాధనంబు లొసఁగిన.

క. నరుఁడలరుచవునువై శ్వా
నరుచే గాండివము కవదొనలు రథమును బాం
డురరథ్యముల నటద్గిరి
చరకేతనముర్ మురారి సంజ్ఞం గొనియెర్.

చ. నలువుగ వేరువేర ఖగనాయకసాయకవాతమూల సో
జ్జ్వల గతులర్ రయమ్మున నవమ్మగు వమ్మగఁజేసి కీర్తికూ
నల బలె నున్నగుఱ్ఱములు నాలుగుబూన్చిన తేరు ధీరుఁడా
బలరిపుసూతి ప్రీతిమతి బమ్మగ సమ్మతి నెక్కె గ్రక్కునర్.

గీ. దశముఖ పురంబునను మున్ను దాను గన్న
దహనుఁ దత్క్షమమటుజూడఁ దలఁచి మరలి

వచ్చి సాత్యాత్రపవేశించువలను మీఁ
నతని రథకేతనస్థ మారుతియుఁ దనరె.

క. కలనఁ దత్కర లాఘవ
కలనం గలయంగఁ జేరగల విజయశ్రీ
కలనం దితజంఘాద్వయ
కలనం దూణీరయుగళి కడు రాజిల్లెన్.

క. అతులానలహర్ష సమ
న్వితటాంకృతి కంపితాటవీకుండగుచున్
దత గాండివ దండమున
ట్లతి కుటిలముఁజేసెఁ గేల నటతద్గుణమున్.

చ. తనరెడు వేడ్క నంత వినతావనితాసుతవాతజాతచే
తనుల యనుజ్ఞచేత ఘన తాప హితాపిహితాత్మ సంభ్రమం
బనవుగ నుత్స్రవాళకరమాకరమాహారినీలకాంతికా
వనము సితంబుఁజేయు బడబప్రభవాగ్ని యుపక్రమించినన్.

పంచచామరము.

శరస్థితిం బురావృతాస్థిఁజాలజ్ఞప్తినామహా
త్తరారుణాతిహేతిదీప్తి తద్వనమ్ము గ్రమ్ముచున్
బరిస్ఫురద్భుజంగకోటి పాటవాటన క్రియల్
కరంబరన్ మరుత్సఖుండు గాల్పఁ జొచ్చె నంతటన్.

క. అపుడారాజభుజంగుం
డుప గూహామునేసి పల్లవోష్ఠము గొనఁగా

నుపకంఠంబున వసియుం
దపరిమితాకుల కపోతికారవమయ్యెన్.

వ. మఱియుఁ బ్రవర్ధమానుండగుచు బృహద్భానుండు.

సీ. తతతమాలోచ్చండ తరుషండమండల
వర్ణాయమాన ధూమార్ణవంబు
నిబిరీసకింశుకస్తబకాయితోజ్జ్వల
జ్వాలికాకందళ సముదయంబు
తిలకకదంబవిస్తుల ఫలబీజాయ
మానస్ఫులింగైక మండలంబు
హరిచందనస్కంధ పరిలుఠద్గురురుచి
ద్విగుణీకృతప్రభా విస్తృతంబు

గీ. పటుకులాయవసత్పక్షి పక్షతాడ
నాదిపునరుక్తభూత చ్ఛటారవంబు
లొనరవనమెల్లెడలఁ గ్రమ్మె యొకముహూర్త
మాత్రన పురత్రయమునట్ల మాడ్చుచుండ.

క. వెచ్చగు చిచ్చుభయంబుల్
వచ్చిన నుచ్చలితయగు వనశ్రీ కిరయుం
బచ్చపడ విడినకొప్పన
విచ్చలవిడి ధూమరాజి విన్నునఁ బన్నెన్.

గీ. తెగలుమిగులనెగసి జగజొంపు పొగగముల్
సుళ్ళుసుళ్ళుమిఁటఁ జూడఁదనరె

భావియైన బాణపంజరంబునకును
సూత్రపట్టినట్టి చొప్పుఁగాఁగ.

ఉ. మింటసిలింపకోటికిని మెచ్చుగ నచ్చుగఁ గెల్పుఁజాలు ము
క్కంటినినైన నట్టివిలుకాఁడు కిరీటి భుజాబలంబు మీ
రంటినవేడ్కతోఁ జదువుఁడంచు వచించినరీతి నప్పుడ
మ్మంటతృణాదికంబును దెమల్పనల్పము లొచబాత్కృతుల్.

చ. ఇరుదెసలంటి యగ్గిసెకవేపఁగఁ బాఁపదొరల్ విసంబులన్
దురము జరంగవేని యతిదుర్బలకాయము లొప్పఁ గానలోఁ
బరఁగఁగఁ బ్రాణవాయువులఁ బాపి కనుంగొననొప్పె వజ్రివి
స్ఫురణహతక్షితిప్రహిత శోణితసంయుత భూధరంబులై.

ఉ. అందలి గంధబంధుర గజావళు లర్చులచేత మూలముల్
గందఁగఁగాలు దంతముసలంబులతోడనయొప్పె హస్తినీ
బృందముమీఁదిప్రేమ గనుపింపఁగ సృక్వగతార్ధచర్వణం
బందిన సల్లకీకిసలయంబులు బూనుగతిక్ క్షణంబునన్.

గీ. చెంతఁదరికొన్న కార్చిచ్చు సికలసెకల
వాడుచూపు గపిత్థద్రుమావారములును
ఫలములసితంబులై పాక భావమొనరి
స్ఫోటకపుబుద్బుదంబుల బొల్చెదనరె.

చ. అరయఁగనస్మదీయములు నౌషధవృక్షములెల్ల రేలుని
ర్భరమగు చీఁకటిన్ రుచులభాసిలునంచుఁ దలంచి కొన్నియా
తరువులు దజ్జయేచ్ఛఁబలెఁ దార్కొనఁబ్రజ్వలితంబులై పగల్
త్వరఁదగఁ దారతమ్యములు దారుయథార్థతఁ దెల్పుపొల్పునన్

గీ. క్రొవ్వియును దైత్యదానవ కోటిమేటి
పార్థుచేతను మడిసినప్పటికినైనఁ
బ్రతిభటత్వమెచూపె నట్లతనికపుడు
దోనలవెడలెను శరసంఖ్యఁగనఁ గడంగ.

గీ. అలఘుకీలాభరాప్తిఁ గుండలితమూర్తిఁ
బ్రకటత్వేళ ఘృతసారసేక మృదివ్వి
యుగుసమస్తభుజంగ సంహతినిఁగీలి
చక్కిలపుఁబ్రోవుగతిఁగొనె సమ్మదమున.

సీ. ఆగుబ్బుగాఁ బొగలంత రిక్షుంబంట
మంటలుపొగవెంట నంటివెడల
వెడలెనుతెప్పల విసరముల్ దెసలంద
మిణుఁగురుల్ తెప్పలమీఁదఁబొదురఁ
బటువిస్ఫులింగ విస్ఫుట చటధ్వనిబన్న
బన్నిన సెక లెల్లబయలనురక
నురకజంతు సమాజమొకపెట్టు నవయఁగ
మగ్గినపొదరింప్లు మరలరవల

గీ. వలను మీఱెడుకరువలి వలనమరియు
మండుచుండెను గుల్మముల్ మహినిఁబడిన
తరువులును భస్మమైన లతావితాన
ములునుగాఁ జేసెనచ్చిచ్చు ముసరివిసరి.

వ. మఱియు వైశ్వానర కీలాకలాపంబు లతి ప్రవృద్ధంబు లగుచుఁ బర్వెపటీరాది విటపికోటర పుటంబులఁ బ్రవేశింపఁబెటలి

పర్యటన పాటవంబెడలి వెలింబడు చిక్రీడంబులును, దచ్చిక్రీడ కళేబరంబుల వింతఫలంబులని జాతిచాపల్యంబున మాటిమాటికి నంట గమకించు మర్కటంబులు తదుత్కటాక్రాంతంబులగుచు వెడలఁదడవు లేక పుడమింబడి తన్నికొనుచున్నఁ గని దిగువంజని మఱియు వానరంబులును, నంతకంటె రయంబున మూలంబులు గాలి నిష్కహంబుల వలనఁ బాణింధమంబుల వెడలు నొడవున ధూమజాతంబు వియత్తలంబుఁ గప్పిపోనీక శకుంతాది జంతు సంతానంబును బొదువ నదయుండై దవానలుండు వన విదళనంబు సేయు సమయంబున సహస్రాక్షుండు తక్షకరక్షణ దక్షుండగుచు వీక్షించియాక్షణంబునవళక్షేభంబు నధివసించి ప్రకటిత శతకోటి సాధనంబు నిజభుజంబున సంఘటించి నిలింపులు తెంపు మిగిలి గుంపులుఁగొని నడువఁదద్వన జాతంబులయిన ధూమ జాతంబులు బ్రహ్మాండభాండప్రతిరోధంబునమరలినఁకరణిఁగనుపట్టు వజ్రనిర్ఘోషసముత్పాదిత కాలమేఘ సంఘంబులతోడ నభస్థలి నాక్రమించి విబుధయోధులతోడ వెన్నాడి నిలువంబడు తదనంతరంబ జలధి నడిమి బాడబహవ్యవాహుండును దమచేఁగబళింపంబడెనని తెల్లంబుసేయు వడువున వడివడి నెడనెడఁ గడలఁ గొనం బొడసూపు మెఱుంగుల గంగులలర గర్జితవ్యాజంబున గర్జనంబులుసేయుచుఁ బర్జన్యునాదిగా నిర్జింతుమని తలంపున ధారావర్షంబుల వనంబుశ్యామాయమానంబుగాఁ జేయునవసరంబున శో ణాయమానవయనుండై పాండుతనయుండు తత్ప్రతిచికీర్షచే శరనికురుంబంబున నంబరంబున ఛత్రంబుఁ గావించి మించి యన

లుని మరలఁబురికొల్ప నతండును ననల్ప ప్రకారంబున దీపించెనంత

సీ. అసమయంబున భాసిల్లుసెకలచే
మగుడిదివంబున కెగయుచున్న
ఘనధారలో యనఁగాకోదరాంగనా
సహితంబుగా మదిఁజాలికొల్పు
నెనరునఁ దనకుమారుని నశ్వసేనునిఁ
గొని మింటికల్లన వనమువలనఁ
జనెడు తక్షకకుటుంబిని నతిరయమున
వివ్వచ్ఛుఁడొక వాఁడివిశిఖమునను,

ఆ. వె. దాని నాల్క వోలె జానుగాఁ గంఠము
రెండు వయ్యేలేర్పరించె మించి
వెడలు సర్పకోటి బడవై చెఁదద్వహ్ని
పాలు గాఁగ భుజగ బాలువదలి.

గీ. బాణపంజరంబు బన్నుట కతనఁబ
ర్జన్య శరచయంబు సరవిఁ బడక
మానెఁ దక్షకాహి మానవతీకళే
బరము మానదయ్యె వహ్నిఁ బడక.

ఉ. అంతట నాత్మమాతృమరణాగతశోక తమోనిమగ్ను న
త్యంత భయాన్వితుఁ శిఖిశిఖాపహృతవాలు భుజంగబాలునిం
జెంతకుఁ దీసి లాలనముఁ జేసి దయం బిపియందు నాశచీ
కాంతుఁడుదా ధనంజయుని కై వడికై వడిన్నుగ్రకోపుఁడై

చ. వన ఘన వహ్నిఁగన్న శిఖి వైఖరి లేఖ మహౌఘ భర్తకున్
ననలుగజారుకోపకలసంగల కన్నులఁగెంపు దేరఁగా
ననిమిష సేనలంగలసి యర్జునుఁతో బవరం బొనర్చెఁ దా
గొనకొని దావ తక్షకులకుం గడు నగ్నియుఁ గాననగ్నిగన్.

చ. సుర వర నాయకోత్తములు శోభ జెలంగ నిషంగనీడ భా
సురతర పత్రిజాతములఁ జోద్యముగా వెలికేఁగు నట్టులన్
వరుస నిగుడ్చ ఖాండవముపైఁ గల మిన్నున నిండి దిక్కులన్
గర మరుదార ఘోర మతిగాఢనిరూఢముగాఁగ నత్తరిన్.

గీ. పిడుగులను బోని శరములఁ బెలుచనేసి
కలకఁ బుట్టింప నప్పుడా కవ్వడియును
జనకుఁడడరించు బాణముల్ దునియఁ దనువు
వేఁడఁ బుట్టఁగఁ బుట్టియు వేల్పుఱేఁడు.

క. కాలునుజెయ్యాడక నట
నాలమున నిలింప విభుఁడు నతి భీతుండై
వాలమ్ములు వెన్నాడఁగఁ
దోలించెం దన రథంబు దూరము గాఁగన్.

చ. కలనజయంతు నొక్కని నఖర్వ పరాక్రమమున్ సహింపఁగా
నలవియుఁగాక వేరొక జయంత సుతుం గన నేఁగు కైతవం
బలవడ దేవతా నగరి కాబలవైరి జనంగఁ బొంగి కృ
ష్ణులు నిజ శంఖనాదములు జూపిరి రోదసి నిండి వెల్వడన్.

వ. అయ్యవసరంబున.

మ. తన నామంబవిలోమమై పొసఁగ నేతన్నామముంగాంచు నాం
తనికింబోలెఁ దవాగ్నికిన్ వెలిచు నాదై తేయవర్యున్ మయు
డను వానిన్ దనుజారి యట్ల నరనాథాగ్రేసరుండా నరుం
డో నరన్ మన్ననఁజేసి కాచెనొకనిన్ బ్రోత్సాహియైయచ్చటన్.

గీ. వనము సకలంబు నాహుతిఁ గొనిన యగ్ని
కశనమై పొల్చు చిలువ దా నక్షణంబ
కర్ణ తూణీరమున దైవ గతిని విశిఖ
మగుచు నిలిచెఁ గిరీటి పై పఁగఁ దలంచి.

ఉ. సన్నుపునవ్వుమోము పయి జంకఁగొనందగు నాత్మతుండమున్
గ్రన్నన దువ్వికొంచు యదు కౌరవ నాథుల కాదరంబునన్
విన్నప మొప్పఁజేయుచుఁ ద్రివిష్టప మార్గము పట్టి కేలి దా
తిన్నఁగ మీర మాంద్యగతి తేజరిలం గడు నేఁగె నయ్యెడన్.

క. అంతట నట మానులచే
సంతోష రసాభిషేక సంగతిఁ గని భూ
కాంతులు విజయులునై చని
కుంతీ సుత ముఖ్యుఁ గాంచి కుశలత నుండన్.

శా. లోకాధీశ్వర! లోకపాలనుత! నిర్లోకస్థ! లోకోదరా!
సాకారత్వనిరూఢ! భూతనిచయై కాకార! మాయామహా
తీన్వికార ప్రకృతి ప్రభేద మహదాదిస్ఫారవిద్యామయా!
యేకానేక విహార! సర్వగుణ రాహిత్య క్రియా వర్జితా!

క. జగదవన నవన ఫలదా
త్రిగుణాత్మక! వేదవిదిత! దీప్యత్తేజా!

అగణితవైభవ! నిశ్చల!
గగనసమానైకనిర్వికారవ్యాప్తా!

భుజంగప్రయాతము.

అగాధస్వరూపా! మహత్త్వాద్యనేకా!
జగజ్జంతు సంతాన జన్మ క్రియాకా!
నిగూఢ క్రమా ధూత నిత్యాప్తశోకా!
యగమ్యః ప్రభావా! దయా క్రాంతలోకా!

గద్యము.

ఇది శ్రీమద్రాజగోపాల కరుణా కటాక్ష వీక్షణానులబ్ధ
కవితా విశేష మతుకుమల్లి వెంగళయామాత్య
పుత్రి వినయ విధేయ మాదయ నామ
ధేయ ప్రణీతంబైన యభినవ
భారతంబునందాదిపర్వం
బు సర్వంబు నే
కాశ్వాసము.

# అభినవభారతము.

## ద్వితీయాశ్వాసము.

## సభా పర్వము.

క. శ్రీమన్నీరద నారద
హేమ నిభ పరిథిత పృథు మహిత తేజ! రమా
హైమవతీ వాగ్యువతీ
కాముక హరిహర హిరణ్యగర్భైకాత్మా! 1

ఆ. వె. అవధరింపు మట్లు హరియు నప్పాండునం
దనులఁ గలసి కొన్ని దినములుండి
విభవ మెసఁగ వారి వీడ్కొని మెల్లన
సిరులు నిజ పురంబుఁ జేరె నంత. 2

చ. నలువగు శిల్ప కల్పన ననల్ప చమత్క్రియ లుజ్జ్వల ప్రభల్
చెలువుగఁ గాంచి దేవ సభ జీవముఁ దానుగతాగతంబుగాఁ
బలుమరుఁ దాల్చునట్టి సభఁ బాండు సుతాగ్రణికాదరంబు చె
న్నలర మయుండొనర్చి తగనర్పణ మొంతయుఁ జేసి వేచనెన్.

ఉ. ఆసమయంబునన్ నత వరాగ్రణి పాలికి నారదుండు సం
భాసిత వల్లకీ నినద పాటవ మొప్పఁగ నేఁగు దెంచిత
న్నాసన మర్ఘ్యమాదియగు నట్టి సపర్య లొనంగి ప్రీతుఁగాఁ
జేసిన ధర్మసూతిఁ గని చిత్తము రంజిల నొయ్య నిట్లనున్. 4

సీ. కుశలమే పౌరవ కుల మహార్ణవ చంద్ర!
దిక్పాల సభల కాధిక్య రుచులు
గల సభఁ గంటిమి తెలిపెద నొక్కటి
పాండుఁడు యమ సభ నుండి పంపె
రాజసూయ మహాధ్వరము సేసికదఁహరి
శ్చంద్రుఁడు శక్రుని సభను మెలఁగుఁ
గావున నదిసేయఁగా నేను నట్లన
వసియింతు నీకు నీ వార్త వేడ్కఁ

గీ. దెలుపు మన వచ్చితిని భవదీయ జనకు
తలఁపు నిండఁగ నాయిష్టి సలుపుమయ్య
సూరెలను గల నీయనుజులును శౌర్య
ధైర్యశాలురు సమకూరు ధర్మతనయ. 5

క. ఏసభను రాజసూయము
జేసినఁ గడు లెస్స దాని సేయుము భూభృ
ద్వాసవ! నీవని యనుమతిఁ
జేసి మునీంద్రుండు సనియె శ్రీఘ్రమ యంతన్ 6

వ. తదనంతరంబ దూతచేత నాహూతుండగుచుఁ బురుహూతానుజాతుండు దురంతర హయమేధ మహాంతంబగు సప్త తంతుం బ్రవర్తింపఁ జింతింపుచుఁ గౌంతేయాగ్రజు నుపాంతంబున నేకాంతం బొక్కింత తడవు నడపి యతనిచేత నామంత్రితుండై యుత్సాహ ప్రభావంబులచేత ముహూర్త మంత్రింబులకరణిఁ బురణించుధర్మజ ప్రేహితులైన గంధవహా సుధాంధోధిప నంద

నులగు భీమార్జునులతోడ సంధియమాన గమనుండై చనిచని నదీ తటాకంబులచే ద్విమాతృక యగుచు నాత్మ పరిపాల నృపాలదేహంబునుం బోలి వివిధ ధన ధాన్యంబుల సమాకీర్ణంబులై యొప్పి దుర్ధర్షంబులగు మగధ దేశంబులఁ బ్రవేశించి.

సీ. తగ విశృంఖల హర్షిత స
శృంఖలా ర్తిత మహీ భృత్కులుండు
పటుతరాదర జరాఘటిత దేహుండయ్యు
విగత జరా ప్తిదోర్విక్రియుండు
సముదగ్ర నిస్తులాశావిజైతృండయ్యు
బహు పరార్ధాశావిభాసురుండు
వైభవాన్విత కన ద్ద్వైమాతురుండయ్యు
పరిధన మహారథ పృథు బలుండు

గీ. మాగధుండయ్యుఁ గృపవంద్య మానపాద
పంకజాతుండు వ్యాపార పరిహరుండు
గంధ బంధుర పరిపంథి కమల బృంద
సింధురోద్రేకుఁడా జరాసంధ విభుఁడు

క. ఆయోధవరునిఁ బొడఁగని
యాయోధనఁ మర్థి వేఁడ నమ్మువ్వురితోఁ
బాయని హాస్యముగినుకయు
గా యుక్తిం బలికెఁ దనమగంటిమి మెఱయన్

చ. ఎఱుఁగుదు నిన్ను మున్ను పదునెన్మిదిమారులునోడినట్టి యా
విరుదవు నీ పటుండు కడు బెట్టిదమౌర్వ్యఁడుపార్థుఁ డల్పుఁడౌ

చిఱుతఁడు వీని నేగరుణఁజేసితివంచును బల్కి నాకు డ
గ్గఱ గనునద్దిభీముఁడనఁగాఁదగదై ననునొక్కఁడందగున్. 10

ఉ. డింభకుఁడయ్యు వీఁడట హిడింబకుటుంబినిఁ గట్టి శోకసం
రంభముఁ బూనఁ జేసెను దిరంబుగ నాటనుగోలె సర్వ వి
శ్వంభరఁ గల్గు వీరజన సంహతి విశ్రుత కర్ణ పత్రికో
జ్జృంభిత మౌక్తికాయిత సమృద్ధ భుజస్తవుఁడై చెలంగెడిన్

సీ. అని కృష్ణ ఫల్గును లంతరంగంబులఁ
బొంగ నాతఁడుమరుత్పుత్రుఁ గోరె
నెట్టన గలనికిఁ గట్టాయితంబుగాఁ
జనుదెంచి మార్కొని పెనఁగఁ జొచ్చె
నతుల గదాపాణులై వారలిర్వురు
గజకచ్ఛపంబుల కరణి మెఱసి
పోరుచోఁ బవమాన పుత్రుఁడు మాగధు
లోఁగొని రెండుగా వేగవాని

ఆ. వె. తనువు చీల్చి ధరణితలమున వైచిన
రెండుగలసితొంటి రీతి నమరి
కడఁగి పోరనట్లు గావింపఁగలయుచుఁ
బోరుచుండె రిత్తఁబోకనంత. 12

క. ఈతెఱఁగున నావీరులు
చాతుర్యము మీఱ ఘోర సమరము సలుపన్
వాతాత్మజుఁడట స్రుక్కుట
చేతోగతినెంచి శౌరి చెప్పెన్ సన్నన్. 13

లయగ్రాహి.

పంచదశవాసరము లించుకయు గాసిలక
మించినసరిపోరుటకు నెంచి మది నంతన్
వంచనను శౌరి యొనరించు తృణసంజ్ఞఁ గను
గొంచు బలురోషమును బెంచి పరిపంథిన్
జించి తనుఖండములు గొంచకయు రెండు విధ
ళించి యటునిట్టుఁ బడనుంచి కడువేగన్
బంచతను బొంద నృపసంచయము లుబ్బఁగబ
లాంచితుఁడు భీముఁడొనరించి విజయించెన్. 14

ఉ. చిత్రముమీఱఁగా మగధ సింహునిఁ ద్రుంచి యనంతరంబునా
స్తోత్రులు దీప్తతేజములతోఁ జనుదెంచి యటన్ బరేతరా
ట్పుత్రునిఁ జేరి రింక నగుభూరి మఖంబున హవ్యకాంక్ష న
గ్నిత్రయమేఁగుదెంచు కరణిన్ గరమొప్పగ మువ్వురత్తఱిన్.

చ. అమరఁగ వారి వీడ్కొని మురాంతకుఁ డాత్మపురంబు జెందఁగా
శమన సుతానుజుల్ నలుదెసల్ భుజసంపద మీఱనల్వురున్
గ్రమమునఁ గెల్చి భూరి మణి కాంచనముల్ మొదలైన వస్తుజా
లము లరఁగ నంజని ధర్మజు ముందరనుంచిరంతయున్.

ఉ. పాయని యాదరంబున నృపా! యివే కొమ్మని సర్వమేదినీ
నాయకులిచ్చుపాయనధనమ్ములఁ దత్పుర భూమిగాంచె నుఁ
ద్దేయము మీఱఁగా వసుమతీయనువాచక వాచ్యమట్ల న
త్యాయతమైప్రసంగికడు ఖ్యాతినెసంగె వసుంధరాఖ్యయున్.

ఉ. ఆనక దుందుభి ధ్వనులు నాకసమెల్లను బీటవాఱ న
య్యానక దుందుభి క్షితివరాత్మజుఁడచ్యుతుఁడేఁగుదెంచె నా
లోనఁ బ్రతీచిఁ గెల్చి నకులుండు సముజ్జ్వల కాంచనంబులన్
గానుకఁ గొంచు ధర్మజునిఁ గాంచె నుదంచితవృత్తి నత్తఱిన్.

క. కమలాక్షుని సమ్మతిఁ గొని
శమనాత్మజుఁ డధిక మోద సహితుండగుచున్
గ్రమ పాద పారగర్త్వి
క్సముదయములతోడఁ గ్రతువు సలుపం బూనెన్. 19

గీ. ప్రాగ్ర్య వంశుండు దానయ్యుఁ బరమభక్తి
చెలఁగఁ బ్రాగ్వంశమునఁ బ్రవేశించి యపుడు
తలను వలఁబూనినట్టి యాధర్మపత్ని
తోడఁ గుఱువీరుఁడట దీక్షతోడ నుండె. 20

ఉ. వారక రుచ్యమై తగు నవప్రథితైకహావిం గొనంగఁ దాఁ
గోరి కృశానుఁడున్ దనదు కుక్షి నజీర్ణత నున్న తోంటిలా
తూరచితోద్యదాలయ లసద్ఘన భిత్తిక ఖండమండలిన్
సారెకుఁ గ్రక్కెఁ బిక్కటిలు శ్యామలకోమలధూమ దంభతన్

మ. స్ఫుటతేజోయుతమా ప్రవర్గ్యమున సంభూతోన్నతుల్ మీఱిన
ప్పటి చక్రీకృతధూమచక్రము నభోభాగంబునం బొల్చె ను
త్కటహావ్యంబు గొనంగఁ బావకుఁడమర్త్య శ్రేణి నచ్చోటికా
డటరప్పింపఁగఁ బంపు కుండలిత సత్త్రాళీదళప్రక్రియన్. 22

చ. గొదకొనిఖాండవాశనము గొన్న కతంబున నాత్మదేహమున్
గదలుపలేని వైఖరినిఁ గన్పడు పావకు నెత్తి జ్వాలలన్

విదితముగాఁగ నుత్తరపు వేదిక యందుల నుంచ నంతనా
మృదుగతియొప్పె యూపము సమీపమునన్ సవనప్రదీపమై.

గీ. కమల బంధుని బింబ సంగంబుఁ గన్న
కుముద బాంధవు కరణినిఁ గ్రమముతోడఁ
బావకోత్తములగు హవిర్భాగములను
దృప్తినలరారి రట దేవ చయము. 24

గీ. సకలవర్ణంబులు నజాత శత్రువలన
సార్థములనొప్పె యజ్ఞ సమర్థనమున
నొక్కఁడురుకార మాత్రము దక్క నదియు
సార్థమయ్యెను దాన యాత్మార్థముగను. 25

సీ. లాట మరాట కర్ణాట ఘోటక పతు
లోకవంక నకళంక యుక్తిమెరయ
చోళ కేరళ మళయాళ నేపాళాది
వరులొక్క యెడఁ జెక్కవలపునెరయ
నంగ వంగ కళింగ జాంగలనాయకు
లొకచెంత సంతతోత్సుకత సొలయ
సింధు పుళిందాంధ్ర గాంధార నృపవర్యు
లొకకేవఁ గడుఠేవ నొనరివెలయ

గీ. కోసల కరూశ సౌవీర కురు మత్స్య
యవన కేకయ ఘూర్జర ద్రవిళ చేది
గౌళ కోంకణ మగధ త్రిగర్త పాండ్య
మండలేశ్వరు లంతట నిండియుండ 26

సీ. ధరణీశ కోటీర తట రత్న రింఛోళి
బాలాతప చ్ఛాయ గేలుకొలుప
నలరు జవ్వనమునఁ జెలువుదై వారెడు
రమణులు వింజామరములు వేయఁ
గెలనఁ బాణిసరోజములు మోడ్చిభక్తిచే
సినివరప్రముఖులు జేరికొల్వ
సముదగ్ర శాస్త్ర ప్రసంగోచితంబులఁ
బోరిఁ బోరి మునివరుల్ ప్రొద్దుఁగడుపఁ
గీ. దనర నాత్మీయ దేశ ప్రధానవరులు
కార్య పరతంత్రులై యవకాశమరయ
నిండు పేరోలగంబున నుండశౌరి
మణిమయంబైన యాస్థాన మంటపమున 27

వ. తత్సమయంబున నానా జనపద మేదినీ వల్లభ మకుట తట మణి కిరణ పల్లవ సల్లలితంబగు యజ్ఞవాటంబున గాంగేయ ధర్మజుల చేత నియుక్తుండగుచుఁ బృథాతనూజులచేత లాక్షా భవనవన సవనంబుల పృథ క్పృథగ్విధంబు నారాధితుండగు కతంబునఁ బ్రత్యేకంబు తనచేనాతిథ్యంబునకై యారాధింప నిమంత్రితుండగు వైశ్వానరుండను కరణిఁ బురణించుచుఁ బ్రకాశమాన హిరణ్మయ పాత్ర మండిత పాణితలుండగుచు మాద్రీపుత్రుండగు నాసహదేవుండు.

సీ. నతజాత పోషణా తత భారమునఁబోలె
నిభృతావయవముల నెగడువాని

శంపావృతానీర చారు మేఘము వోలె
రమణీయ పీతాంబురంబు వాని
నతుల ముక్తాహార గత నీలమణి వోలె
మునిమండలంబునఁ దనరువాని
చెలువార పంకజ స్థిత మరాళమువోలె
గనక పీఠాగ్ర భాగంబువాని
గీ. ప్రథమపురుషుని జనలోక పక్షయుగ వి
తతి పర స్ఫుర న్మైముఖ్య కృతవదాన్య
రూప కోమలుఁడగు వాని రుక్మిణీశుఁ
జేరి ప్రథమార్ఘ్యమిచ్చి పూజించెనంత 29
వ. ఆసమయంబున, 30
మ. పటు రోషంబునఁ గంపితాధరుఁడుద్వృత్తపక్ష్మితీంద్రాలికిన్
జటులోద్వేల భయంకరుండు నగు నాచైద్యుం బ్రవేశించి వి
స్ఫుట చేదీ భువిమాని వహ్నియనఁగాఁ బోల్పార చేదీశుఁడు
త్కటుఁడై పల్కెనుగర్ణ కర్కశసముద్యద్వాక్యముల్ కృష్ణునిన్
గీ. అపుడు సభలోన వాఁడాడు నట్టిపరుష
వచనముల కచ్యుతుఁడు విన్నబాటు లేక
యుండెఁ దనచెవులను నీలకుండలముల
కరణి నశ్లీల వాక్యముల్ గానఁ బడఁగ.
సీ. ధీరులు బహు తపశ్చారులు సాహసం
హారులు ఋషివరుల్ వారలుండ
వ్రతులు సమస్త సమ్మతులు పాండవ పురో

హితులు ధౌమ్యాదులు చతురులుండ
శాంతులు చాపవేదాంతులు పుణ్యాని
తాంతులు కురు గురులంతి యుండ
శీలురు సత్కులోద్వేలురు రిపుజన
కాలురు సర్వభూపాలురుండ

గీ. కులము శీలంబు శౌర్యంబు గుణము బలము
మెఱయు తేజంబు కీర్తుల మేటినగుచు
నేను గూర్చుండ నీగొల్లఁ డెట్లుపూజ
గాంచెనా కన్నుగానక గర్వమెసఁగ. 32

చ. నలువురగఁ బెద్దమానిసితనానకు విక్కఁడు నెవ్వరేమియుం
బలుకక యిచ్చగించి తనపాటున కోర్చుటచేతఁగాదె ! దా
కలిమి బలంబు గల్గినను గల్గెనుగాని మదించి యగ్రపూ
జలు గొనుటెట్లు మీఁకలిది జానుగఁ జూచిసహించుటెట్లగున్

క. కులమును శీలఁ మెఱుంగము
బలువురలోఁ దిరుగునొక్క పచ్చనిపటముఁ
వలెవాటు వైచికొని యీ
తుఱువయు నొకపెద్దయుంచుఁ దోఁచెనెమీకుఁ. 33

ఆ. వె. జార చోరఁ విద్య కాఁదయఁ దలకట్టు
కులములేక తిరుగు గుండగొయ్య
మేలుమేలు వీని మీరెల్ల నొకపెద్ద
తనము సేయ దీని దలఁతునేను. 34

క. అని బహు భంగులఁ గృష్ణునిఁ
గనుఁగొని తుచ్ఛములు చేటుగానక సభలోఁ
గొనకొని దూరెడు శిశుపా
లుని పారుష్యంబు లాత్మలో హరియెన్నెన్. 35

క. మును వాని తల్లి వేఁడుట
కును మఱి సైరించె శౌరి కుచ్ఛితుఁడగు వాఁ
డును వెక్కసములు పలికెను
దనకును నూరపుడునిండఁ దత్సమయమునన్. 36

చ. పదరుచునున్న యట్టి శిశుపాలునిపై హరి చక్రమంప న
య్యది యరుదెంచి యావిమతు నందలి దుర్వచనంబులింకలో
బొదలునొ? లేవొ? సందియము బుట్టెడు నంచుఁ దలంచి కొంచకన్
వెదకెడు భంగి కంఠ మనువేలగతిం దెగవ్రైచె ధారచేన్. 37

వ. ఇట్లు ద్దురాత్ము తలఁ దఱిఁగిన తదనంతరంబ సప్తతంతు
సమాప్తియందవభృథ స్నానం బాచరించి యుధిష్ఠిరుండు మున్ను
పాయనంబు లొసంగు సమస్త వస్తు నికాయంబులకు ద్విగుణంబు
లగునట్లు నానా వనీ నాయకులకిచ్చి పుచ్చిన మచ్చికలలర విచ్చ
లవిడిఁ జని రంతఁ బురాణ పురుషుండగు బురుషోత్తముండు ధర్మ
జుచే వీడ్కొని చైద్య నిధన కారణంబున సుదర్శనపుర నిజపురజ
నంబులకు ఖేదమోదనవోదకగణంబులు రాణింపం జేయుచు నా
త్మనగరంబునకేఁగె నయ్యవసరంబున. 38

చ. వెలయ బలాన్వితంబుగను వీడ్కొనివచ్చి సుయోధనుండు లో
పల నొకలేని కింకఁ గడుఁ బాయక హస్తిపురంబుఁ జేరి తా
నలువుగ దుర్విచార రచనా పరమావధివాఁగ నొప్ప సౌ
బలుఁ గని యొక్కవాక్యమిటు బల్కె మదింగల యుల్కు
దోల్కఁగన్.

క. ఒఱపుఁగల పైఁడి యని పలు
తెఱఁగులఁ బాంచాలి నంత్రు తెల్లమునా క
త్తెఱవను మది నూహించిన
తఱి రాత్రింబగలు వగల వరికొనుచుండున్. 40

చ. సిరుల సభావలోకనము సేయుచు నేనొక రత్నధారుణిన్
జరణము ద్రొట్రిలంగఁ గడుఁ జారినఁ గోరికలారఁ జూచి య
త్తరుణి హసించెనందులకుఁదాళుటకంటెను ప్రాణవాయువుల్
గరము దొఱంగుటొప్పగును గౌరవ రీతిఁ దలంప మాతులా.

గీ. పుడమి వడఁకఁగ నిప్పడదడముతోడ
గలసి బవరములోఁ బాండవులకుఁ జావు
నొసఁగి యాద్రౌపదిని నెందు నోర్వరాక
మరగనీ నాదు పగదాని నెఱపఁ దగును. 41

క. అని పలికి వెతయు లజ్జయు
నను నేరులు గలయు లోతునందు మునుఁగు నా
తని దరిఁజేర్పఁగఁ గైతవ
ఘనుఁడగు గాంధార విభుఁడు గని యిట్లనియెన్. 42

చ. సమరములోఁ గిరీటికిని శక్రుఁడు లోనగు సర్వదేవతా
సముదయ మోడి భీతిఁగొని పారెనుఁ బారుటచేతఁ గాని నా
మమునన కాదు వేగమున మానగు వారి మరుత్తులన్న నా
మమునువె! వత్స! వాని నటు మార్కొని యాజి జయించు
టెట్లగున్. 43

ఉ. భీము మహోగ్ర కోపధృతి భీము గదాకలితాంకబాహుదు
ర్ధాముని౯ గాంచనొందులను దథ్యము నేరికి శక్యమయ్యె సం
గ్రామములో హిడింబుఁడు జరాతనయుండు బకుండుగూలి రే
కామరిమొండునొంచుననఁ గాఁదగు గ్రుద్దులచేతఁ జెచ్చెరన్.

గీ. అట్టి భీమార్జునులు గొల్వ ననఘుఁడైన
ధర్మసూతికి ద్రోహంబు దలపుటెట్లు
చేరి రణమున నేమివిశేషమగును
భూరి బలమున మావంటి వారికెల్ల. 45

సీ. అట్టులైనను నీకు నా పాండుసుతులకుఁ
బరగెడువిభవముల్ పన్నిదంబు
లొడ్డుజూదంబున నోడి చెదవిత్తంబు
మహిలోన నన్యసామాన్యమైన
యతులవిద్యాతులదక్షత వాటిల్ల
ధర్మసూనుని మహాధ్వరమ్ములోనఁ
గడఁగివరాజయ ఘంటాపథంబున
జరియింపఁ జేసెదఁ జలమువీఱ

గీ. నట్లు విత్తమెడల నప్పుడు దారిద్ర్య
మావహిల్ల దాన నఖిలబంధు
జనము విడుచునంత వనటచే సిగ్గుచేఁ
బొలయుటొండె నడఁగిపోవుటొండె. 46

క. అంతట నీవు సుఖంబుల
సంతసపడి నిన్ను చెలులు సహజన్ములు దా
మంతయు గొలువ సకలమహీ
నెంతయు నిష్కంటకముగ నేలుము తండ్రీ! 47

క. పెద దొర దీనికి నొడఁబడ
మదిఁ గుదిరిచి తేని యత్నమంబున నిపుడీ
కొదదలఁగుఁ బాండవులసం
పద జూదము వలన నీదు పాలుగనిత్తుఁ. 48

వ. అని పలికి ధృతరాష్ట్రు పాలికయ్యల్లునిఁ గొనిచని తదీయ
కాయకార్శ్య వైవర్ణ్యంబులు విన్నవించిన నతండులికిపడి కొడుకుఁ
దిగిచి యొడలు తడవి చూచి యిట్లనియె. 49

ఉ. కూన! సమస్త భాగ్యములకుఁ మనగేహము యాకరంబునం
తాన సమృద్ధి తోడఁ దగు తానక మర్త్యమనావతింబలేఁ
గానఁగనయ్యె నీనగరు కౌరవలక్ష్మియు నీవశంబు నెం
దేని కొఱంతలే దుఱక నిట్లుకృశించితి వేల చెప్పుమా! 50

ఆ. వె. అనుచు సుతుఁడు దండ్రి కల్లన వినతుఁడై
పలికె నేమి చెప్పఁ గలదు వినుము

హృదయ శల్యమట్టులేప్రొద్దు నొక్కటి
యుండు దాన నిట్టు లున్నవాఁడ. 51

వ. అవి యెయ్యవియంటేని

ఉ. సాంద్ర యశుండు ధర్మజుని సత్రమహావిభవంబుఁ గంటి న
య్యైంద్రుని వంటి సంపదల కెక్కుడుసూ వెతలంప మున్ హరి
శ్చంద్రుని రాజసూయమున జాత రిపు క్రితు సాటిగాదుని
స్తంద్ర పరాక్రమాఢ్యులగు తమ్ముల ప్రాపునశౌరిప్రోపునన్.

సీ. ఉత్తర కురుభూమి లోకయుగంబుననేని
పరివృచ్ఛినృపకోటి పసిఁడిగొననె
యట్టి దుర్గమ విషయాదులకవ్వాడి
బొక్కసంబులు దెచ్చెఁ బోటువెట్టి
మరియుఁ గేరళ చోళ మాళవాది సకలదే
శంబుల నృపులు వశంబుఁజెంది
కప్పము లిచ్చిరి కాంచన రత్నాది
వివిధ వస్తు చయంబు వేయునేల

గీ. యింక ద్రుపదుఁడు కృష్ణుఁడు నిద్ధసఖ్య
పరులు గావుతమానిరి పన్నెసంగ
నిట్లు దాయాది వారలయేపు సూచి
ప్రాణము భరింప వచ్చునే పార్థివేంద్ర!

చ. అలఘు నవీన రత్న నిచయ ప్రముఖంబుగ పర్వసంపదల్
జలనిధి వేష్టితాఖిల రసాతల రాజకుమార కోటి ని
శ్చలభయభక్తిఁ గానుకలొసంగి ముదంబునఁగాంచు నంతతో
జ్జ్వలతర కీర్తి నిస్తులిత శారద చందను ధర్మనందనున్. 54

చ. అని బహుభంగిఁ బాండుతనయాగ్రణి సంపద దానవైభవం
బును యశమున్ బ్రతాపమును బొక్కుచుఁ దండ్రికిఁ దెల్పు
నాసుయో
ధనునిఁ గుఱించి రాజు వినఁ దద్దయు సౌబలుఁడిట్లు వల్కెనో
జనవర! ధర్మసూతి ఘనసంపద నీకొనఁగూర్తు నెట్లనన్ 55

ఆ. వె. జూదమునకు ధర్మజుఁడు బ్రియుండందుల
నేర్పు లొజ్జ కాన నెత్తమాడి
సిరికిఁ బన్నిదంబుసేసి పరాజితుఁ
గాఁగ లక్ష్మినీకుఁ గట్టిపెదను. 56

ఉ. నావిని కౌరవుండును మనంబునఁ బొంగుచుఁ దండ్రి పాదరా
జీవములందు వ్రాలి యిదిచేకొనఁ బోలునటన్నఁ బుత్రితో
భూవిభుఁడిట్లు వల్కె సుత! పొల్పగు సంపద నీకునాపృథా
దేవి కుమారు కంటె గణుతింపఁగ నేనుమఱుంగు లెక్కుడై 57

గీ. నెత్తమాడిన భేదంబు నివ్వటిల్లు
శాంతులకు నేనిఁ గ్రోధంబు సంఘటిల్లుఁ
గాన దుర్వ్యవసాయంబు మాను పుత్రి!
నల్పు మంతెకు నెక్కుడు సవనమీాపు 58

సీ. అనవుడు వినవయ్య యదియేల యెవ్వరి
కెఱిగింపఁ దత్సభాహిత విభూతి
నేగాంచు తఱి ద్వార మెఱుఁగక పటికంపు
కుడ్యమే ద్వారమొకో యటంచుఁ

జారఁజూడఁ దద్భిత్తి సోఁకె నానిటలంబు
దాని కీడుప్రిపదజ దాను నగియెఁ
దోయంబులేని కందువవస్త్రమెత్తియు
సరసిని మిన్నక చనుట కతన.

ఆ. వె. వాసిఁ బొసఁగు నాదు వస్త్రంబు దడిసిన
నగె వృకోదరుండు నన్నుఁ జూచి
దానిఁ జేసి యెపుడు దందహ్యమాన మా
నసుఁడ నగుచు దినదినంబునుందు. 59

వ. అనిపల్కి మదీయ పరిభవంబు వాయఁ బాండవేయుల నట్ల చేయవలయునని నిర్బంధంబున నతని చిత్తంబు మెత్తపఱిచి విదురుండు పాండవపక్షపాతి యతని కెఱిఁగింపఁ బోలదని నిర్దేశించి నిజనివాసంబునకుఁ బోవునంత నేకాంతంబున నాంబికేయుండు విదురునకుఁ దద్విధంబుఁ జెప్పినఁ గటకటంబడి కలియాసన్నంబయ్యెఁ బౌరవ ప్రజా సంక్షయకారణంబిదియె యనుచు గురు కృప గాంగేయులతోఁ గలసి సంతాపంబునొందెఁ దదనంతరంబ యాంబికేయుండు నంత రత్నకాంచనంబుల శిల్పకారులచే నపూర్వరమణీయంబగు నొక సభ నిర్మింప నియోగించిన వారట్లన కతిపయ దినంబులకు రచించి యమ్మహారాజు వలనఁ బ్రీతులై పీడ్కొని చనిన సమయంబున. 60

గీ. అంత నేకాంత గోష్ఠి వారప్పుడొక్క
తలఁపు దుర్మార్గవృత్తినిఁ దలఁచి నూత్న
రత్న మయ మంటపోత్సవ రచితకైత
వమున ధృతరాష్ట్రి నసుమతిఁ గ్రమములోడ. 61

క. ధర్మజు రప్పించిన నతి
ధార్మికుఁ డతఁ డేగుదెంచి తమ్ములుఁ దానున్
బేర్మిఁ దగు బంధునీతిని
నర్మిలి ధృతరాష్ట్రవిభు పదాబ్జంబులకున్. 62

క. ద్వాదశ వర్షము లడవిఁ
గాఁదగు నాయాన భావికార్యణ మనఁగా
నాదరమున ధృతరాష్ట్రుని
పాదములకు మ్రొక్కి నతఁడు పంద్రెండు దగన్. 63

చ. అపుడునవీనమానవభృదాంబు కణంబుల డంబుఁగేరుచున్
విపులతరైక జాలక సువిశ్రుత మౌక్తిక యుక్త కైశ్యమున్
ద్రుపద తనూజ యంత పదతోయజ మల్లన సోఁక మ్రొక్కఁ
దానవరిమితప్రమోదహృదయంబు నయంబున హెచ్చరింపఁగన్

గీ. తత నిజేంగిత గూఢుఁ డాధరణి విభుఁడు
నలర నారోగ్య దీవెన లలర నిచ్చి
పొగడి మఖ లాభ లాలనఁ బొదలు తమ్ము
లమరు ధర్మజు నంతఃపురమున కనిచె. 65

వ. ఇట్లు ధర్మజుండు సోదరులుం దానును బాంచాలితోడఁ
గరినగరంబున సుఖయై యుండు నవసరంబున. 66

ఉ. కొఱలుమదీయ కాయముఁ బగుల్పను వీరభటాంత హేతులై
వఱలునుగౌరవావళికివైరము నెల్లియటంచు నాత్మలో
మఱుగొనుచున్న ఖేదమున మంద మరీచులు బూనిపోవు న
త్తెఱఁగునఁబద్మబంధుఁడుఁబ్రతీచిదిశన్ మునిఁగెన్ రయంబునన్

గీ. యామినీ కామినీ మణి యరవుసేయ
విప్పు జగజంపు పెన్నెరి చొప్పు దనరి
కప్పెఁ జీఁకటి దిక్కులఁ గప్పుదేర
గుప్పుగుప్పునఁ దారక లుప్పతిల్ల. 68

వ. మఱియును. 69

క. పరికింపఁ దగిన జనులా
దరము మెయిఁ గురునృపాలు దర్శనమునఁ దా
రరిగిరి తమతమ నెళవుల
కరయఁ నరనాథు నాజ్ఞ నధిక వినీతిఁ. 70

ఉ. ఇంద్రుని దిక్కునందుఁ జనియించె నుదంచిత వృత్తిమించి చి
త్తేంద్రియ గోచరంబులు దృగింద్రియ పంక్తికి గ్రాహకంబులై
సాంద్ర తరంబులై యుదయశైలము డిగ్గి సమస్త దిక్కులన్
జంద్రుని చంద్రికాతతులు సారసజాండము నిండెనెంతయున్.

గీ. అటఁ బటకుటీరమునఁ బాండవాగ్రజన్ముఁ
జేర నాబాలవృద్ధు లశేషమిత్రు
లేఁగి సంభావనలు గాంచి రించుకేని
తడయ నెడలేదు వడివడి వెడలె రాత్రి. 72

క. ధర్మజుఁడంతం బ్రీతి న
హార్మ్యకకృత్యములు దీర్చి యనుజులతోడన్
నిర్మల చాపాస్త్రాదుల
నర్మిలి తగునృపులతోడ నరిగెన్ సభకున్. 73

సీ. అట్టులఁ గురురాజు నాస్థానమునఁ జొచ్చి
యుచిత గౌరవమునఁ నొంది దేహ
మునకు మూఁడవ గుణముచు బోలు నిద్రనీ
లాసనంబునఁ గౌరవాధినాధు
సరస నాసీనుఁడై చారుసభాశిల్ప
కల్పనా కుశలతఁ గాంచుచున్నఁ
గురు కుల విస్తారకుఁడునైన యాధర్మ
తనయుని చెంగట నొనరనున్న

గీ. శకునియాతని స్వస్థాన వికలు సేయు
నపుడు సన్నిధిఁ జేయునాత్మాభిధాన
మధ్య వర్ణ విహీన నామమునఁ దనరు
గ్రహము బోలెఁ బ్రసంగంబు గాఁగఁబలికె. 74

క. వినుమా! ధర్మజ! జూదముఁ
గొనకొని యాడుదము దానఁ గుశలుఁడవని నిన్
జనములు వలికెదరెంతయుఁ
గనవలతుం దీని నీవు గాదనకీవునున్. 75

క. అని మెత్తనిమాటలఁ గై
కొనఁ బల్కిన ధర్మజుండగుంగాకని తా
నును సమ్మతించె నెత్తముఁ
బనుపడ నొడ్డిరి ప్రమోద భారం బెసఁగన్. 76

శా. అంతం దన్మణి మంటపమ్మునఁ దదాజ్ఞాధీనుఁడై చేరి యా
కౌంతేయాగ్రజుఁడప్డు దైవగతిఁ జీకాకైన నీతిన్ నిజ

స్వాంతంబెల్లను గప్పిరొప్పఁ గడు దుర్వార క్రియన్ మీఱితా
నెంతేయాడి యనేక పల్లిపురముల్ దృష్టంబుగా నోడుచున్.

క. మఱియును నొక్కటి పందెముఁ
బరపిన సౌబలుని యక్షపటిమకు సరిగా
నెరి సర్వయత్నములచే
వరలఁడు ధర్మజుఁడునెట్లువారింగెలుచున్ 78

వ. అయ్యవసరంబున విదురుండు శోక దందహ్యమానమానసుండై ధృతరాష్ట్రు నుద్దేశించి నీకొడుకు పడుచుఁదనంబున మీఱఁదెలుంగక వెంగలియై యిట్లు కపటద్యూతంబునఁ బరమధర్మపరుండగు పాండవాగ్రజునిఁ బరాజితుంజేయఁజొచ్చె. దీన మహోత్పాతంబు సంధిల్లగలదు. వీని జననసమయంబున ననేక దుర్నిమిత్తంబులయ్యె నవినెత్తం బనుకారణంబునఁ గౌరవకులక్షయంబునకు దొడఁగొనెఁ గావున నింకనైన నిదియుడుపుము. కాకంబులం బట్టి మరాళంబులఁబోలె నీచులగు నీసుతులఁబట్టి కౌంతేయులఁ బరిభవింపఁ దగదని బహువిధంబుల గఱపిన సుయోధనుండదరి విదురునిఁ గినిసె. అంత ధర్మనందనుండు నోడుటకతనఁ బెచ్చుపెరుగు మత్సరంబున దురోదరంబాడుచు సకల ధనంబులోడుచు మఱియు.

చ. ఒకట విభూషణవ్రజము నొక్కఁట బెక్కగు రత్నసంచయం
బొకటను హేమకోశములనొక్కఁటఁ దమ్ములదానుద్రౌపదిన్
సకలమునొడ్డఁబందెములసౌబలు డోయ్యనఁగెల్చియంతటన్
వికవికనవ్వె ధర్మజుఁడు వీఱిడివట్టిన రీతి నుండఁగన్. 80

వ. అప్పుడు దుర్ణయధనుండగు సుయోధనుండు జయంబునం బొంగి ప్రాతిగామియను వాని నొక్కని నుద్దేశించి పాండవులు మన దాసులై రింక నీవు చని ద్రుపదజ నిటకుఁదెమ్మని పొమ్మని పంచిన. 81

ఆ. వె. ఖిన్నుఁడగుచు వాఁడు కృష్ణ పాలికిఁ జని
నెత్తమున విభుండు నిన్ను నోడి
యటకుఁ దెమ్మటన్న నమ్మ! నేవచ్చితి
రమ్మనుండు ద్రుపదరాజతనయ. 82

ఉ. అన్న మదీయ నాథుఁ డిపుడాటను మున్నుగ నన్నునోడెనో
మున్నుగఁదాన యోడి రిపు భూపతికిన్ మరినన్ను నోడెనో
క్రన్నన దీని సందియముఁ గాంచితివేని యెఱుంగఁ దెల్పుమీ
యన్న నతండు నేనెఱుఁగ నచ్చట నారసి వత్తుఁ గ్రమ్మరన్.

సీ. అనవుడు ద్రౌపద యట్లన వీడ్కొల్పు
రయమునవాఁడును రచ్చకరిగి
యమ తనూభవు నది యడిగిన నతఁడును
బహు దుఃఖమున నేమి బల్కకుండె
నప్పుడు రారాజు నాగ్రహంబున నోరి
తెమ్మిందుఁ దనసందియమ్ము తెలియు
మీఁకనఁ బ్రాతిగామియుఁ జనితద్గతిఁ
దెలిపిన నద్దేవి ధృతిఁగలంగి

గీ. పొగులుచును నేకవస్త్రయుఁ బుష్పవతియుఁ
గాన శోకము లజ్జయుఁ గ్రమ్ముకొనఁగ

వచ్చి గాంధారి కొలువున్న వలన నిలువ
నుదిరి క్రొవ్వున నప్పుడు సుయోధనుండు. 84

వ. ప్రాతిగామి భీమునకు వెఱచునని తలంచి కర్ణ సౌబల
సైంధవులకు హర్షోత్కర్షంబుగా దుశ్శాసను నుద్దేశించి 85

చ. అదియు యనేక వల్లభులకైన కులాంగన నీటుకత్తె ద్రౌ
పది యను చేటి నీయెడ సభాస్థలిఁ జేరఁగ వేగఁదెమ్ము నీ
వదయుత నన్న యన్నపలుకాదటఁ జేయఁగ దుస్ససేన్నఁడే
పొదవఁగ గేవలంబవనినొందినయంతకుఁబోల్కి మిట్టినన్.

ఉ. గుఱుకొనిచూచి భీతిఁగొని కోమలిద్రౌపది యానతాంగయై
పఱవఁగఁ దత్సతిం జికుర పాశముపట్టి సభాంతరంబునం
దఱుముచు నీడ్చె రాజవనితల్ నిజపాణు లురంబుఁ జేర్పఁగన్
వెఱపున భీష్మఁడాదిగ వివేకులు ముక్కున వ్రేలుగూర్పఁగన్

సీ. గణిత భూషా మౌక్తిక శ్రీశి బలవదా
కర్షభయోద్భవ ఘర్మమొందఁ
గరపీడచేఁ గనుకార్ష్ణ్యధార దొరంగు
వగిది పెన్నెఱి జారి పైనిఁగప్ప
నిర్భర కువలయ గర్భక మాలరర
న ప్రివాహమున నస్రిములు వెడల
లలితపాతివ్రిత్యలక్ష్మి నిరాస సు
స్ఫటికావృతంబనఁబటము మెఱయ
పాంచాలి వసనాప హరణమునకుఁ
దొడరె దుర్బుద్ధి మీఱ నాదుస్ససేనుఁ

డంతఁ గుంతీ తనూజు లత్యంత కుపితు
లయ్యు నేమియు నవఁ జాలరై రివారి. 88

మ. ఖలుచే నిట్లు పరాభవంబు విధిమైఁగన్పట్టుచో సభ్యులక్
బలులక్ మానుల నాత్మవల్లభుల నప్పాటక్ విశక్తి స్థితిం
గలరంచుక్ దలపోసి ద్రౌపది మహాగాఢార్తయై నీవిచేఁ
దలఁకం బట్టుచుఁ గృష్ణ! కేశవ! హరే! త్రాయస్వమాంచచవక్
వ. అంత. 90

ఉ. వ్రీలిన సిగ్గు సంకుచిత వస్త్రయునై విలపించు చున్న న
బ్బాల నితంబ బింబమునఁ బల్మరు నుప్పతిలంగఁజొచ్చె నా
వేళ దుకూలపాళి యదువీరుని చారు కృపా సముద్ర క
ల్లోల విశాల సంచయములో యననొప్పి సభాంతరంబునక్

గీ. వలువ లొలువంగ నొలువఁగఁ గలిత రూవ
ములన వస్త్రాంతరములు నుగ్మలికి మేన
నావరింపఁగఁ జొచ్చె జనావళులకు
మనము లాశ్చర్య జలనిధి మగ్నములుగ. 92

గీ. కాంచఁ గనుపింపకుండిన కతన నైన
వర్ధితానేకవస్త్ర సమృద్ధి నైనఁ
దలఁప నీరెంటిలోన నెద్దాననైన
నంబరప్రాయమే యయ్యె నబల నడుము 93

ఉ. అంకిలితోడఁ బల్మొగములైన జనాళి రదాళి కెట్లు న
గ్నం కరణంబొనర్పఁ గడఁ గాంచఁగఁ జాలఁడొ దాని నట్లన
గ్నంకరణంబొనర్పఁ గడఁ గాంచక తక్కి శ్రమంబు నాత్మలోఁ

గొంకును దొట్రుపాటొదవఁ గూర్రత గౌరవుఁడుండెవిన్నవై

సీ. అపుడు వికర్ణుఁ డిట్లనియె సభ్యులఁ గని
పాంచాలి యడిగిన ప్రశ్ననిర్ణ
యింపమి పాపంబు హిత మహితంబులు
పక్షపాతంబులు పలుక నఘము
మీఱిది తెలియమి మిన్నకుండిరింక
వినుఁడు నాకనుదోఁచు విధము వరుస
దాసి యెట్లయ్యె నీధార్తరాష్ట్రునకది
ధర్మజుండెట్టు లీతరుణి నోడె
ఆ. వె. తాన యోడ లగ్గ తారేగురకుసతి
సొమ్ముగాని యొకని సొమ్ముగాదు
కాన దుష్టబుద్ధి కౌరవేంద్రుండిట్టి
కర్జమునకుఁ దెగువఁ గడఁగఁ జనదు. 95

వ. ఇదియునుంగాక జూదంబు వేఁటయు లోనగు నీదుర్వ్య సనంబులం దగిలిన పురుషుండెట్టి బుద్ధిమంతుఁడైన ననార్యుండు గావున వానిఁ బనుప నుచితంబగు పట్టునఁ జేయఁ బోలదు. తక్కిన తప్పతుల యనుమతిలేమి నెట్లు దీనినోడుట గల్గెనని పలు కు నవసరంబున నెలుంగు రాల్పడ నేడ్చుచుఁ బాంచాల రాజనం దన కురు వృద్ధాది జనంబులఁగలయం గనుఁగొని యేనీ నీచునకు దాసినే? దీని నిశ్చయించి చెప్పుఁడనుటయు సుయోధను వలని భయంబున నెఱుఁగమి నెవ్వరు మారు పల్కరై రపుడు కర్ణుండు వికర్ణునుద్దేశించి. 96

ఉ. పిన్నవు నీతిమార్గములు పెక్కు లెఱుంగుదె కొల్వులోన నీ
యున్న జనంబుకింపెుఁ దగనోపుటగెల్చుట నీవెఱుంగుదే
మిన్నక యుంపు లోకమున మేధయె యోర్తు కినేకవల్లభుల్
చన్నె? తలంపఁగా నిది విచారమె చిత్తములోనఁ జూపుమా
క. పతి పంచక మేటికి యొక
పతిఁ గైకొన లెస్స యనుచుఁ బల్కెడు రాధా
సుత దుశ్శాసన వచనము
లతిమోదంబొసఁగఁ గౌరవాధిపుఁడంతన్ 98
గీ. అచటి జనమెల్ల నక్కటా యనుచు వగవఁ
గర్ణ సౌబలులకు హర్షకలన బొదలఁ
జెనఁటియై నట్టి యాసుయోధనుఁడు ద్రుపద
జాత నాత్మాంక తల మెక్క సన్నఁజేసె 99
వ. అంత నిజకాంతా పరిభవ సముద్భవ కలుష రోష
భీషణుండగుచుఁ బృథదశ్వసుతుండు పరిషద్గణంబు వినఁ బరుష
భాషణంబున దుస్ససేను నుద్దేశించి యిట్లనియె. 100
ఉ. తోయజనేత్రి పక్షమునఁ దొట్రిలువెచ్చనియిట్టియస్త్రముల్
పాయని చూడ్కి చేతఁ జవిపట్టితి నట్టి సమిద్ధరిత్రిలో
రోయక కొప్పువట్టి రిపు రొమ్మునవెచ్చనియస్త్రముల్ చవుల్
జేయుదు నీమదీయ ఘన జిహ్వకు భూరి భుజాబలంబునన్.
చ. మఱియుఁ గొలంకునం బలె సమగ్ర నవీనఁ కబంధరూపులై
యొఱలు రణాంగణంబున సముజ్జ్వల పంకజసంక్తిఁబోలుచున్
వఱలు రిపుల్ బెడంగ హిమవత్సమయస్థితినేఁ గడంగివే
జఱచెద ధార్తరాష్ట్రితత శబ్దమెసంగ మహా గదాప్తిచేన్

వ. అప్పు డర్జునుండు కృత ప్రతిజ్ఞచే నిట్లనియె 103

ఉ. కోడిగ మిట్లుసేయుచును గొల్వున గ్రామ్య దురుక్తియేపుమై
నాడి సుయోధనుండలర హస్తము చప్పట వ్రేసి సారెకున్
వేడుక నొందు కర్ణు నతివిక్రము మొప్పఁగ సర్వ కౌరవుల్
జూడ రణోర్వి గాండివము శోభిలఁ గూల్చెదనెందుసాధ్వినన్

గీ. దొనలు వెల్వడ వేవేగఁ దొడరు నట్టి
శర మహాపాదగ్ర వర్ష విస్తారములన
ధార్త రాష్ట్రాళి నల జడిదార్చి పేర్చి
యంతఁ బర్జన్య సుతుఁడన నలరు వాఁడ 105

క. పాంచాలి సుయోధనుఁ గను
గొంచుక్ శపియించె నిట్లు కూరాత్మ! యిఁకం
గొంచక రణ భువిలోసం
గొంచమ యూరువులువిరిగి కూలెద వంచున్ 106

వ. తదనంతరంబ వీర వాదంబున భీమార్జునులు గరా స్ఫాల
నంబుఁజేసి యింక మీఁద సుఖంబుండుమని పలుకునెడ నాజ్ఞసేని
శాపంబును వారల శపథంబులు నాకర్ణించి గాంధారీ ధృతరా
ష్ట్రులు భయంపడి కోడలినిఁ గొడుకులను సముచిత సల్లాపంబుల
నాదరించి యింద్రప్రస్థపురంబును రాజ్యంబును యుధిష్ఠిరునకు
మగుడనిచ్చి పుచ్చిన వారలు నిజనగరంబున కరిగిన సుఖంబుండు
నంత నొక్కనాఁడు 107

గీ. కౌరవులు నాత్మ కృత దుర్విచారములను
వెండియును బాండుసుతుని రావించి తొంటి

క్రమముచేఁ బూజలిడ విధి కతన నతఁడు
నయ్యమిత్రి సభాస్థలి నలసు నంత. 108

క. పిమ్మటఁ బ్రసంగ సంగతి
నమ్మనుజ విభుండు ద్వాదశాబ్దములటవిన్
గ్రిమ్మర నొకయేఁడజ్ఞా
తమ్మును గానొడ్డి ద్యూత తత్పరుఁడయ్యెన్. 109

ఉ. నీతి విదగ్రగణ్యుఁడయి నేర్పుల నొప్పిన నైనఁగాని దా
భూతము సోఁకునట్లు యమపుత్రకుఁ డంత ననార్య కాంక్షితం
బౌటఁ గోరఁడే? వన విహారము దత్ప్రథమైకవర్ణని
ర్ధూత విహారమా ననుట దోఁచక సౌబలుతో రయంబునన్.

చ. శకునియు వంచనం దన వశంబుగ నొప్పుచు నున్న యట్టిపా
చకల నిజాగ్రహ స్తమటు సాఁపుచు వ్రేయుచు నొడ్డు పన్నిదం
బొకటనె గెల్చె ధర్మజుఁడు నోడెను దైవము దప్పఁజూడ దా
న కలుషవృత్తి చేత విజయాప్తుఁడు నైనను గెల్వ నేర్చునే.

గీ. శత్రుచేఁ గోలుపడిన యీజగతి నింక
నొక్క నిమిషము నుండ నయుక్తమనుచు
సతియుఁ దమ్ములు గొల్వఁగా సత్యసంధుఁ
డైన యారాజు లేచె నాస్థానమునను. 113

చ. మఱిగొను నెవ్వగం బొగిలిమాటికిఁగుందెడుకుంతినిం దయన్
జెలఁక ప్రియంబుతో విదురు చేతికి నిచ్చి యుధిష్ఠిరుండు న
త్తఱి జనెఁ బాదచారియయి తమ్ములు ద్రౌపదికొల్వఁగానకే
డ్తెఱఁ గడుదీనతం జన్నుల దృష్టులు, తోడనె కూడి చేరఁగన్

గీ. పౌరులును జానపదులును బ్రాహ్మణులును
వితత శోకార్తి నమ్మహా విభుని వెంటఁ
గూడఁ బఱతేరఁ దగువారితోడఁ బుణ్య
మూర్తి ధర్మజుఁడొగి వనమునకుఁ జనియె. 115

మత్తేభ కందగీత గర్భ సీసము.

సీ. విదళితా ఘౌఘకవిస్తుతప్రవిలస
త్కారుణ్యభాస్వద్రవీ రిపుఘ్న
వివిలయోత్పత్తిద ! విశ్వభావన ! సము
ద్విశ్వోరుహేతు స్తవీశ్వసనగ
కుశల సద్యోగి లఘుస్థిరప్రబలదృ
గ్జాలైకవేద్యప్ర గూలఘుతర
సఫలచిద్రూప ! యజాత్రయీమయసురా
పా ! ధీరమాహృద్వశా ! ధరణిప

గీ. త్రిజగదాత్మక ! నతసురకుజసగుణాగ
మునినిచయసేవ్య ! సంగవిమోహ ! యభవ !
సునిగమాగమ చయనుత జనమృగవశు
ముఖనిఖిలరూప మేదురమోదజనక. 116

ఇందలిమత్తేభము.

మ. దళితాఘౌఘ ! కవిస్తుత ! ప్రవిలసత్కారుణ్య భాస్వద్రవీ!
విలయోత్పత్తిద! విశ్వభావన సముద్విశ్వోరుహేతు స్తవీ!
శ ! లసద్యోగి లఘుస్థిరప్రబల దృగ్జాలైకవేద్యప్రగూ
ఫల!చిద్రూప!యజా!త్రయీమయసురాపా!ధీరమాహృద్వశా

ఇందలికందము.

క. దళితాఘౌఘ ! కవిస్తుత !
విలసత్కారుణ్యభాస ! విలయోత్పత్తి
శ ! లసద్యోగిలఘుస్థిర
బలదృగ్జాలైకవేద్య ! ఫలచిద్రూపా ! 118

ఇందలిగీతము.

గీ. విదళితాఘౌఘ ! భాసద్రవీ ! రిపుఘ్న !
వివిలయోత్పత్తి హేతు స్తపీ శ్వసనగ !
కుశల సద్యోగివేద్య ! ప్రగూలఘుతర !
సఫలచిద్రూప ! మాహృద్వశా ! ధరణిప. 119

సీసములోఁ జిన్నచరణములో కందము.

క. జగదాత్మక ! నతసురకుజ !
సగుణగముని నిచయసేవ్య ! సంగవి మోహా !
నిగమాగమచయనుత జన
మృగపశుముఖ నిఖిలరూప మేదురమోదా ! 120

భుజంగప్రయాతము.

అలోలోదరా ! పాలితానేకధన్యా !
సలీలాత్తసంసార సంసారశూన్యా !
విలాసక్రియాధ్వస్త విద్వత్ప్రదైన్యా !
బలారాద్యాది సల్లోకపాలాతిమాన్యా! 121

## అభినవభారతము.

### గద్యము.

ఇది శ్రీమదాదిజగోపాల కరుణా కటాక్ష వీక్షణానులబ్ధ
కవితా విశేష మతుకుమల్లి వెంగళయామాత్య
పుత్త్ర వినయ విధేయ మాదయ నామ
ధేయ ప్రణీతంబైన యభినవ
భారతంబునందాదిపర్వం
బునద్వితీయాశ్వాసము.

# అభినవ భారతము.

-:o:-

## తృతీయాశ్వాసము.

## ఆరణ్య పర్వము.

క. శ్రీరామరసానలకరు
ణాతులితేక్షణ! గుణత్రయాత్మక! సుజన
వ్రాతస్తుత! శాశ్వతవి
ఖ్యాతా! హరిహరహిరణ్యగర్భైకాత్మా!

ఆ. వె. అవధరింపుమట్లు లమ్మహాపురుషులు
శాత్రవులకు నిఖిల జగతినోడి
శోకమూలములను జనుగతి దినములు
జరుపనేఁగ రాష్ట్ర జనులుదారు. 2

ఉ. కౌరవవీర్ధనుర్ధరు లఖండితవిక్రములైన శాంతిచే
వీరిడి లేనివారికడ పెక్కువెకంబుల పిండునొండెడన్
జారకచేరిమర్మరిత పాండుకుమారక వల్కలాంశుకం
బారసివేడ్కమూర్కొనుచు నాతనితోఁ జనుఁగొంతదవ్వగన్.

చ. పఱుగఁబరాగపూర్ణ యగుపద్ధతినుద్ధతి మానిభార్యతో
నఃపరుఁడేఁగుచున్నెడ గనత్సువమా కలశోపమానత
చ్చరణమనోజ్ఞరేఖద గనారెకుఁ గోరికఁ బాద్యమిచ్చెనా
దరత వనాంతదేవ వనితాజనతా నిహితైకకుంభమై. 4

వ. ఇట్లు క్రమంబున నానానదీనద విపినంబులు గడచి

చనిచని సాయంతన సమయంబున ముందట. 5

సీ. జహ్నుసంయమి కర్ణశష్కులీపథశిక్షు
వరలుచాడ్పునమహావర్తములును
సంశ్రితజనదత్త సంసారచక్రము ల్
పైఁదేల్చెననఁబొల్చు పద్మములను
కొడుకుగాంగేయునిఁ గుశలమారయునట్లు
కోకహంసకుటుంబ కూజితములఁ
దముజూడఁదమ్మి మొగములమీఁది భ్రమరికల్
దోలఁగించుగతినాడు తుమ్మెదలను

గీ. అమర నమరనదింజూచి ప్రమదమెసఁగ
నిలిచితత్తటిసీ తటనికటచటుల
విటపివిస్ఫుటితాటవీ వటముక్రేవ
పుడమివల్లభులారాత్రి బుచ్చిరంత. 6

ఉ. ఆమరునాఁడుపాండుతనయాగ్రణి నిత్యములైనకృత్యముల్
నేమముతోనొనర్చి యతినిర్మలతం దన తోడయాత్రగా
బేమనువచ్చువిప్రజన బృందములం గనుగొంచునాఁకటఁ
వేమరుడస్సిరంచుమది విన్నఁదనంబునఁ గుందికుందియుఁ. 7

గీ. ధౌమ్యునసుమతిఁ బద్మబాంధవునివలన
నక్షయవరంబు పతి సతియందునునిచె
వరుసనను యాత్రికులకెల్ల వలయునెడల
శాకమిడిన సదన్నమై సరసనొప్పు. 8

వ. అంత ధౌమ్యాది బ్రాహ్మణ సహితుండై కామ్య
కవనంబుఁ బ్రవేశించి యర్ధరాత్రంబున నడచుచున్న రాక్షసవేళ

యగుటం జేసి వారి యగ్రభాగంబున నుగ్రాకారుండై యొంటి
కంబెం బొడవై యొక్క నిశాచరుండు మార్గనిరోధంబు వాటిం
చిన వానింజూచి ధర్మజుండు నీవెవ్వండవని యడిగిన వాఁడిట్లనియె.

సీ. వినుమేను బకుఁడను ఘనదైత్యు తమ్ముఁడఁ
గిమ్మీరుఁడనువాఁడ సమ్మదమున
నివ్మహాటవినుందు నిందుల కన్యులు
వెరతురు చేరకపరతురవుడు
మీరెవ్వరీరాత్రి మీరివచ్చితిరిట్టు
లనుడు ధర్మజుఁడను నసురతోడ
వాఁడెనరుండల్లవారె కవల్ భీముఁ
డీతఁడేనును ధర్మసూతి జుమ్మి
గీ. వరలు ధర్మపరత వనవాసమున కేము
వచ్చినార మవనివల్లభులము
పాండుసుతుల మవసిఁ బ్రత్యర్థిచేఁగోలు
పడిన కతన వనుచుఁ బలికెఁ దెలియ. 10

ఉ. నావుడు నట్టహాసమున నాసుకృతంబిది యాఁడబోవఁగా
వావిరిఁదీర్ఘమే యెదురువచ్చిన చాష్పన వచ్చె భీముఁడున్
జావకపోదు వీఁడు బకుచావు హిడింబుని చావునెంతయున్
నేవిని నాఁడుగోలెఁ గడునెమ్మదిశోకమువాయదెన్నఁడున్. 11

క. అన్నకుఁ జెలికానికి నే
నిన్నాళ్ళున్ మామకాస్త్రమిచ్చితినిటులై
మిన్నక తర్పణవిధికై
చెన్నుగ భీమాస్త్రములను జేయుదుననుచున్. 12

క. కదిసిన భీముఁడు గదఁగొనెఁ
గదిరెను కోపములతో సగర్వ్యులువేగన్
ముదమున దమ తమ కైదువు
లుదుటనగొని నడువవారి నుడిపి రయమున్. 13

శా. కిమ్మీరుండు సమీరనందనునిఁ దాఁకెన్ మేరుశైలక్రియన్
జిమ్మంజీకటిలో దదస్త్రకవణ స్ఫీతస్ఫురింగచ్ఛటల్
గ్రుమ్మంగ్రుమ్మరుచున్ భుజాబలములంగా కొంచుడీకొంచు వే
లెమ్మంచున్ విమమంచుఁబై కొనుచునోలిన్ వ్రాలివారిర్వురున్

గీ॥ మెరసివేవేగఁగిమ్మీరు మెదడువెడల
నడచి మారుత పుత్రుఁడు పుడమివైచి
వానిఘనకాయమల్లన వైచెవాలి
దుందుభింద్రుంచివైచిన చందమొప్ప. 15

వ. ఇట్లు కిమ్మీరుంజంపి కామ్యకంబున సుఖంబున్నంత
పాండవుల విధం బెఱింగి కృష్ణపాంచాలాది రాజలోకంబు జను
దెంచి యుచితప్రకారంబుల సంభావితులై యున్నసంత బాంచాలి
తనపరిభవంబు కృష్ణున కెఱింగించిన దుఃఖంప నతండద్దేవినాశ్వాసిం
చియుఁవ్విధంబున నపరాధులగు సుయోధనాదులా యోధనంబున
నిధనము నొందుదురని. ల్కి వెండియుఁగోపంబె త్తికౌరవులనిష్పడసవా
యింతునని చిడిముడిపడియెడు హరింగనుంగొని శాంతివచనంబుల
గిరీటిమెట్టకేలకు బ్రిసన్నుగావించె ననంతరంబ కంసశత్రుం డజా
తశత్రునకిట్లనియె. 16

కం. వనితయుఁబానముమృగయయు
వనరఁగద్యూతంబులనెడి వ్యసనంబులకున్

జనదగదచ్చుటనే లే
మినిఁగల్గెంగాదె యిట్లు మీకయ్యెడలన్ 17

గీ॥ ద్రోణభీష్మ కృపాదులతోడఁజేసి
కొంచమధృతరాష్ట్రునకుఁ జెప్పిక్రూరమైన
కలహమగుజూదమాడిన కారణమున
నంచుపథ్యంబుహితము గావించిమాంతు 18

వ. ఏటికింతసెప్ప విధినేతనిట్టిదిహానంగ నేను దశమాసం
బులు సాగరతీరంబున సాల్వుతోడ యుద్ధమ్ముచేసి వానింజంపి మ
రలితి, దీనంజేసి కాలవిలంబనంబగు కారణంబున నీవిట్టిదుర్వ్యస
నంబునం దగిలితివనిన విని యుధిష్ఠిరుండది యెట్లనియడిగిన నతనికి
సౌంభకవధ్రికారంబు దెలియ సవిస్తరంబుగా హరియిట్లనియె. 19

సీ. నేనునీయజ్ఞంబులోనఁ జైద్యాధముఁ
జంపినయావార్త చారువలన
వినివానితమ్ముఁడుఁ విపులబలాఢ్యుండుఁ
సాల్వుఁడుబలముతో సమరమునకు
గామయూపిణి సౌంబకంబను తనపురి
తోడనేచని రిపుమర్ది రీతి
వర సాలయంత్రగోపురపరిఘావృత
మగుచున్నద్వారకానగరిముట్టి

గీ. యదియభేద్యము గావుననందుబాహ్య
నందనోద్యానసాగరనదవిశాల
చైత్యదేవాయతనసత్రిశాలలాది
మారగొనుచు నిరోధించె ముట్టిముట్టి. 20

గీ. భూప దీననైన ఫుట్టదే వాసన
కాననున్న మాని పోనె తనదు
శీతభీరుతయును జెలువొప్పఁబోనఁ బ్ర
సిద్ధమగుట నింత చింతయేల ? 31

క. కావునఁ జింతఁ దొఱంగుము
భూవర ! విను మెల్లసిరులఁ బొందెదవిలపై
దేవనదీ తనయాదులు
కేవలులే ? వారిఁగెలువఁ గృతమతివగుమీ ? 32

క. తలపోయ నెన్ని విధములఁ
గలహము నిజమగును దుదినిఁగావున నీకుం
దెలియఁగ నొక యుపదేశం
బలవడఁజేయుదును దాన నగుఁ దగుసిద్ధుల్. 33

వ. అని యొక్క యోగవిద్యనొసంగి తత్క్రమంబును భావిఫలంబును నెరిగించి సత్యవతీనందనుడు ధర్మనందను వీడ్కొనిచనియె నంతనజాత శత్రుం డమ్మహావిద్యఁ బార్థునకుపదేశించి పాశుపతాస్త్రాది దివ్యబాణ లాభంబుఁగైకొని రమ్మని గాఢాలింగనంబుఁజేసి పంచిన నతండును బూర్వోత్తరాభిముఖుండై చనిచని యింద్రకీల శైలంబెక్కి పోవునెడ ముందటఁ దేజోమయుండై యొక్క వృద్ధబ్రాహ్మణుండు వృక్షమూలంబున నున్నఁ జూచి వాని సమీపంబునకుంజన నమ్మదుసలి విప్రుఁడిట్లనియె. 34

సీ. బాణబాణాసన పాణివై యీమహా
ముని వరాశ్రమముల ననయమిట్లు

నెఱి ప్రవర్తించెదు నీవెవ్వఁడవు కైదు
వులువైచి కుస్తిన్నరు పలయుసట్లు
ననుడు పార్థుండవి మనమున విఘ్న వా
క్యములుగా వలచి నేమను ననున్న
యతని ధైర్యంబున కలరివాసవుఁడను
వధ్యవేఁడుము నుపర్వత్వమిత్తు
గీ. ననిన నరుఁడు దివ్య ఘనబాణములఘోర
హరునిదయను గల్గునట్లుయనుచు
హితముజెప్పి శక్రుఁడేగె సద్భక్త్యుఁడై
నరుఁడుజనియె శీతనగముదరియ. 35.

ఉ. ఏచలికొండపై సతతమిష్ట విహారములాంద్రితోడుతన్
వేచరియించుయక్షతతి వేగహిమాతతశీతభీతిచే
నేది నఖాంశుచోమ్మ కలితేంమను ఖీ ఓ పులస్త్యనాదినే
వాచరణంబుమానరు సమాహితమానిత మానసస్థితిన్. 36

ఉ. ఏవలికొండయియ్యలకు నెంతయుఁగ్రొపగుచున్ నిపీతర
త్నావళికాంతిపూరము లహర్నిశమున్ సెలయేళ్ళచొప్పునన్
జేవురుకై తవనంబుననుజేసి తటంబులఁ గ్రక్కుత్రప్పిచే
శ్రీవిలసిల్లియొప్పుడు దరీముఖవైఖరులన్ రయంబునన్. 37

గీ. అలసమీర కిశోరమేయదిఁజెంది
కామినీముఖపంకజ ఘర్మమూర్ధ్వ
నాసియప్పుడదాను నియ్యవనిలోన
దద్విరేఫసమాఖ్య సంతతముఁజెందె. 38

క. అట్టిమహాహాన్నతమగువలి
గట్టుప్రియుంబాఁజేరి కవ్వడితపమున్

బట్టసమకట్టుమదిచే
గట్టిమురంగాంచె నొక్క గహనముగడఁకన్. 39

చ. తలఁపగ ముజ్జగంబులకుఁ దల్లియుఁదండ్రియునై శివాఖ్యవ
ర్తిలఁగలయాదిదంపతుల దేహములందగ రెండునొక్కఁడై
యలవడఁబుణ్యహేతువు మహామునులట్లన కోరిశంకరున్
దలఁచి తపంబులం దనరు తద్వనమల్లన చేరియచ్చటన్. 40

క. దర్భతనకేలఁగ్రాలన్
దుర్భరమగుతపముసేయఁ దొడరెం జింతా
విర్భావము హరవద సం
దర్భమునం దనర శాంతి తత్పరమతియై. 41

గీ. పరగచేనెల్ల భూమిగోల్పడినకతన
తనపదంబిచ్చునిడశంకఁ దాల్చినట్టి
నమ్మహానిష్ఠచే నరుఁడగ్రపాద
మాత్రమటయూది నిలిచెధరిత్రిమీఁద. 42

క. ఉగ్రశరాన్వితతపసు స
మగ్రతనెన్నుదురుఁగాఁగ నటఁగనుఁగొంచున్
స్వాగ్రతలంబునఁనెల్లెడ
జాగ్రతనగ్నులువెలుంగ సతతమతండున్. 43

కం. ఫలపర్ణజలాశనముల
నలవడియొకఁడొకటిమాని యధికతపమునన్
వెలసియు విషయాసక్తులు
బొలసినతనయతుగుణముఁ బూనెఁగరాప్తన్. 44

చ. తత పవనావరోధమునఁ దత్తపమప్పుడొనర్పు మస్తకో
ద్గతనవధూమపంక్తి దశదిక్కులమిక్కిలి విస్ఫులింగస
ంహతులను జాలసీనుచు నజాండకటాహము నిండఁబర్వియు
న్నతినలరించె నాతనిధనంజయు నామము విస్ఫుటంబుగన్ 45

కం. జగముల కాపద లొదవెను
పొగలెగసెను జదలదేవపుంజములెల్లన్
వగలమిగులంగ జిజిబిజి
యగుచుండెను దపంబనలంతమీరన్. 46

వ. తత్సమయంబున. 47

మ. కలకంఠుండు కృపావిశాలుఁడు త్రిలోకస్వామిభూతేశుఁడ
త్తఱిసర్వంబునెఱింగియున్ మునులచేతన్ వించుశర్వాణికిన్
నెఱిచిత్తంబిగురొత్త నిష్టవరముల్ నీతాత్ముఁడై తీర్పఁగా
నెఱుకయ్యెన్ నగజాసమేతముగఁ దానెంతేవిమోదంబునన్.

నిరోష్ఠ్యసీసము.

సీ. ఘనజాటాంతరనటద్గగనసరిజ్జల
జచ్ఛదాచ్ఛాదనాచ్ఛాద్యకలన
గణరాట్కనద్గండ కలితదానక్షీర
లలితలలాటైక తిలకరేఖ
స్కంధగంధాంధ శిఖండిచండశిఖండ
ఘటితకర్ణాంతరాఖండరచన
నందికేశాది గణశ్రేష్ఠనిత్యని
జాగారగతకింకరైకజనత

గీ. ఓవసిం దనసతి దా కిరాతస్థితిదగ
శరశరాసనసంధాన శయనియతిని
యధిగతాఘోటరతినంత నంశకారి
నెఱిఁజరించెఁ గిరీటిసన్నిహితసరణి 49

చ. కరఁమరుదారుచర్మ శబర కై తన వేషమునందనర్చు నా
పరమపురాణపూరుషుని బాసి తమ స్తకసీమయందు శే
ఖరముగ నెప్పుడొప్పు శశిఖండ విభూషణ మావివర్ణ సం
హారణము నయ్యె నప్పుడరి భూషణమై చెలగెన్ లసత్త్రిశిఖ.

వ. ఇట్లు దత్సమయోచిత వేషంబుల నమరి రజిత శిఖరి శిఖరావతీర్ణులైనవారి పిరుందన హాఠాత్కృతంబగు తత్కృత్యంబునకు నందియుంబందుచుఁ దదను సరణోచిత వేషరచనాకుల సకలప్రమథ పరివారంబులు జనుదెంచుచుండ. 51

సీ. కుటిలసంచలిత లాంగూలంబులార్చుచు
బలుమారునిలుపంకఁ బఱచిపఱచి
దూరసంచారంబుతో నలసియు న్నాల్క
నెరిసాచి వెడనోరుదెఱచి తెఱచి
కడుఁరోజ సెలవులఁ గారెడుచొంగచే
వనపద్ధతులుశుద్ధి నొనరబఱచి
వనగుల్మములను మూర్కొనిప్రక్కలదరంగ
ననువుగాఁబసివట్టి యఱచియఱచి

గీ. మెలుకువనువచ్చు శ్రుతిసారమేయసమితి
గమిచిపార్శ్వంబులను వడిఁ గలిగి నడువ
నెయ్యమునదారుబెంచి మన్నించు లేడి
మడమఁదొక్కుచుఁ జనుదేర మఱియునప్పుడు 52

వ. అదియుహిమకిరణ పరివ్యాప్తపాండురిత తృణస్థలంబులు ద్వేగపాదవిన్యాస ప్రకాశవశత విధ్వస్త పాలేయ ప్రదేశంబులగు చుఁదెరువులుగొని నిలింపదంపతీ పరంపరల కనురాగసంపదసొంపు సంపాదింప భావిచరణకమల నిహిత యత్రప్రతిష్ఠలంబును వనదేవతాభ్యర్చ్యమాన సురతరు కుసుమాస్తరణ రచనా సంచయంబు గుచు మెరయఁదద్వన వనేచరనికరంబులఁ బూర్వశిబగవిసరంబు లస్మదీయ పథంబాక్రమించి మత్తాయత్తచిత్తంబులఁ దత్తరంబొడువ నెదిరి నివారింపఁ బరతెంచికాచి తదీయతేజోవిశేష ప్రతిహతో త్సాహులై యచ్చెరువడిచూచుచుండ జటాలతావితానమూల ముకుళితమంజుల తరాంజలి పుంజంబులలర, దృఢజనితవిమాన వేగనిరోధకులై యభివర్షితహర్షాశ్రుపాశంబులతోడ జయజయశబ్దంబులుసేయుచు మహర్షిప్రముఖ నిఖిల వియచ్చరులు మ్రొక్క హిమవత్కటకపథంబున నాజగదాదిదంపతులు సునాసీరుకుమారు నాశ్రమంబు మెల్లమెల్లన బ్రవేశించిరంత. 53

చ. ఆచరణై కలాలితజటాతత సంతతిచే ననింద్యని
ష్ఠాచరణాతికార్శ్యగ నిజాంగలసద్ఘనసాంద్రకాంతిచే
నాచలితానిలాశినత హస్తలతందగనింగి కెత్తియు
న్నేలచినవాతనింగని నగేంద్రజ దా తనయార్ధ్రచిత్తయై. 54

వ. ఆసమయంబున సాయుజ్యాపేక్షియై మూకాసురుండను నసుర వరుండు నీశ్వరప్రేరణంబున 55

సీ. ఖురకోటిశతకోటి కోటిపాటితసము
ద్యద్ధరాచక్రంబు తల్లడిల్ల
ఘోణపుటోత్క్షిప్తఘోరఘుర్ఘురధ్వానసం

చలదజాండశ్రేణి జడనుబడఁగ
రోషకషాయితోన్మేష భయాద్భుత
గ్రహతారకాపంక్తి గతులుదప్ప
నతిగర్వకృతరోమహర్షణత్రుటదనో
కహ నివహము చాపకట్టువడఁగ
గీ. సమిదరాళ కరాళ విషాణ శాణ
కషణ జనితస్ఫులింగ సంఘముఁలురాల
కుటిలపనకిటిఘాటి నొక్కటి కిరిటి
పటుతరాశ్రిమ గహన గర్భంబుసొచ్చె. 56
ఉ. రౌద్రవపుఃప్రకాశమలరన్ బరతేరఁగఁదానిఁగాంచి యు
న్నిద్రతనార్తిమైమృగముని ప్రతతుల్ దనుజేరరా మహో
పద్రవమొప్ప పక్షులుఁ నభస్థలి ఘోషిలఁబాండుసూనుఁడుఁ
దద్రివమెల్ల మాన్పి నియతస్థితిఁ గాండివమందెఁజెచ్చెరన్. 57

ఉ. పందిని భూమిపాలమునిఁ బైకొనివేగమ చంప నాత్మ నిం
పందినిజాశుగాసన గుణారవమొప్పఁ డొనర్చునంతలో
నందినితాంతశీఘ్రిమ సహాయులతోఁగని విల్లు కేలఁ దా
నంది నిరాకరించి శబరాధిపుఁడుఁ బరువెత్తివచ్చియుఁ. 58

ఉ. వేఁయకు వేఁయకేశరము వెంటను నే పరువెత్తితోలితే
నీయెడవచ్చెనిట్లు కనవే? నను నాదివరాహమంచుఁ దాఁ
గూయుకిరాతవాక్యమునకుఁ నిజబాణ నిశాతకోటి క
ట్లాయెడఁజేసెఁ తృమఁలునర్జునుఁడుఁ హృదయంబునుంగిటిఁ.

క. తనవచనము గణుతింపక
ఘనశరమునఁ బంపినేయఁ గని శబరుండుఁ

సుకేశిత శరముక్కటిఁగొని
కనుఁగొని కిటినేసె నతనికంటెఁ వడితోన్. 60

చ. అరుముచు రాజమాళుటుగయంబున నొక్కటఁబూనిఘోరతన్
బరపిన బాణయుగ్మమటఁ బంది శరీరమునందు నాయువ
త్తరి సరిగా వెసంగొనియెఁ దద్దయుఁ బైతృకమైన ద్రవ్యముల్
నెరిఁగొనునట్టి సోదరుల నేర్పునఁ జొప్పడి యద్భుతంబుగన్. 61

క. అంతం గుపితుండయ్యును
గౌంతేయుండాకిరాతుఁ గనుఁగొనుచుఁ దప
శ్శాంతతచేఁ బలికెను దన
స్వాంతంబున మృదులపరుష సంగతిమీరన్. 62

చ. సొరిది మదాశ్రమంబు వడిఁజొచ్చినపందిని నేను మున్ను ను
స్థిరమతి లక్ష్యమిప్పుడొగిఁజేసిన దీనిని జంపితింక నీ
శరమటఁజేతు శాపమునఁ గాని శరాసనయష్టినేని దు
స్తరత దపో భుజోష్మల నిషాద నిషాదవిషాదమొందఁగన్. 63

వ. అని యిట్లతని యంతర్దర్ప రస ధారారచన ననుక
రించు వచనం బాకర్ణించి పంచవదనుం డించుక దరహాసాంచి
తుండై యిట్లనియె. 64

గీ. మేనిచే వాక్యసరణిచే మృదులమనుమ
తెలిసె నీబుద్ధి మృగహింస దివిరియడవి
యందు శతసః స్వధర్మ యంచఖలబుధులు
తలచుఁజమవుదు రెఱకుకో తాపసునకో ? 65

వ. అదికారణంబున స్వకులాచారంబు వలనన ప్రమాదం

డనయుఁడనైక యమిత్రకారుండవైన నీవాహాహా పురిషికా
త్వంబు బ్రకటించెదవది యంతదవ్వని వెండియు 66

చ. అలరఁగజంతుహింస విధియందదృష్టంబుగఁ గాళఁకట్టుటల్
సొలవకనీతపంబు పరిశుద్ధమెయంచును మాకుఁదేటగాఁ
దెలిసెనటుండనిమ్మ నియుఁ దెల్లమకాభుజ శౌర్యమింక నీ
వలపడమామకాశుగ సహాయతచేనిటుఁ బందిఁజంపుటల్. 67

ఉ. కావున వేఁడుకొమ్మిటుల గాజులుబల్కుటమానుమాకునై
నీవిపుడెంతవాఁడవుగణింపఁగ గంటకినించుకేనియుం
గావిఁదొరంగియొప్పన జగంబుననంతకుఁడై నభీతిచేఁ
బోవకపోఁడునాపలని పోరునకోర్వవశంబె యేరికిన్. 68

వ. అనియిట్లు శంకరుండు సంకోచింపక పలుకఁ గురు
రాజశశాంకకుండు శశాంకమౌళి కిట్లనియె. 69

చ. నెఱినిటుకొంపివి పల్కెదువనేచర! నీచ! రహింపదీయులం
దఱుమదిసంతసింపఁగ వృథావచనంబులు బంటువోలె ని
త్తఱినిసనంశయంబు సవిధస్థకిరాతికి నొప్పకుండఁగం
బుఱికభపత్కపోలమున కుజ్జ్వలమిత్రముగా నొనర్చెదల్. 70

చ. అనుమునిరాజువాక్యమున నాగణమున్ చెవిచూడినట్లుగా
విని పటుకోపమొత్తి కడువేగమయాతనిఁ జంపఁజూచినల్
గనితగుమాన్పిశైల సుతగాంచఁగ దానుశిలీముఖంబుచే
తనుగొనిమందహాస కలితంబుగ మామలరంగనిచ్చినన్. 71

గీ. బల్లిదులుభిల్లమల్ల భూవల్లభుల
పోరిరెక్కటివల్లముల్ భూనభోంత

రాళ మెడఁ జేమిచే దేశఁ తాలిదృష్టి
యపుడు వదముఁ జూడఁ గోరభయంకరముగ. 72

శా. కర్ణాలంబి జపాకుసూత్ర తతసంఘర్షంబుచేసారె వ్యా
కీర్ణీభూతగరుచ్ఛటాగ్రతతుఁ డై కృత్యంబరున్ముంచెఁ దాఁ
దూర్ణప్రౌఢతదీయలింగమునకై తోడ్తో లతల్ భక్తిసం
పూర్ణుండయ్యుఁ బ్రసూనపుంజములచేఁ బూజించుచందంబుగన్.

క. నరునికరణిఁ బురహరుఁ డను
శరములు నిగుడించె శైలజయుఁ గను శోకన్
నరుతో భయమునకై మదిఁ బలు
మరు జపియించెం బ్రియాతమార్గణశాంతుల్. 74

గీ. అభవుఁడాభవుఁడతి కృపాయత్తుఁ డపుడు
నిభృతమార్గపనమాకృష్టి నిరతుఁ డయ్యె
రహిని సంబంధమున నపరాధసమితి
కరణిఁ దనశరమున నిజాంగమున నడంచె. 75

చ. పగగ నుదారుడైన నరుఁ జూసి వెసం జనుదెంచి మార్గణో
త్కరములు నులుబ్ధుఁ జెందుచుఁ బ్రకాశముమాయఁగ నుండెనట్లనే
ర్పరిగ నుదారుఁడైన నరుఁ జూసి వెసం జనుదెంచె మార్గణో
త్కరములు లుబ్ధుఁ జెందుచు బ్రకాశముమాయఁగ నుండెనట్లనిన్

చ. దొనలవి రిత్తలైనఁ గని తోడన రోసము వెంచుచున్ శరా
సనమున శైలరాజసుత సన్నిధినాహరుమస్తకంబు గొ
బ్బునఁ గడుఁ బ్రేసెఁ బార్థుఁడను భూస్థలినించుక క్రుంగ యంతనా
తనిశశిఖండమండ నహితప్రథితాతతరేఖలోయనన్. 77

క. చాపహతిఁ దలను శర్వా
ణీ పతికిని ఫణిఫణామణిశ్రేణులపై
నాపాదమగుచుఁ దొరఁగెను
దీపితశోణితకణోప దీప్రధితగతిన్. 78

చ. మొనసి కిరీటి వ్రేటును బ్రమోదపయోనిధియైన యాజగ
జ్జనకుని నెమ్మదిం దనరెఁ జారుశిరస్థ సుపర్వవాహినీ
ఘనతటభూమియందులఁ దగం గజవస్త్రము శైశవంబుచే
నొనరుచు వస్త్రసత్క్రియల నొందెడు హంసకణంబు చాడ్పునన్

ఉ. గాండివదండమంత మును ఖాండవదాహమువేళ సాయమై
యుండియు దక్షకాంగన వధోద్యమసాధన భూతరీతిఁ దా
నుండుట చూవిరోధియని యుగ్రజటాటవియందునున్న త
త్కుండలులెల్ల గ్రమ్మిం గెననఁ గొబ్బున మాయమునయ్యె నయ్యెడన్

వ. అంతఁ దద్దైవవిపర్యయంబునకుఁ దద్దయుం దాను
జేయునది లేక చింతాపరతంత్రుండయ్యు నవార్య శౌర్య ధైర్య
చాతుర్యదోర్వీర్యంబున నుత్సాహంబు కరుకు మిగుల నిలిచి
యోరీ మందాత్మా! పులింద! యర్జును నిర్జించి యర్జునలలిత
ర్త్యపార్జునుండ నగుదునని తలంచెదవో యనితర్జింపుచు నాజగ
జెట్టి నెట్టనా ముక్కంటిం బట్టి సమకట్టి 81

గీ. శబరు మృదుతర వామవక్షంబు చెదర
బెడిదమగుముష్టి బిట్టు కవ్వడియుఁ బొడువ
నా కిరాతికి మణిహారయష్టులైన
తెల్లగురిపెందపూస పేరెల్ల పెరిగె. 82

క. ఉపవాసకార్శ్యుఁడగు నా
తపసియుఁ బెన్నురముఁ బొడువ దన్మార్గవృద్ధై
త్రిపురాంతకుఁ డదిమానుపు
నెపమునవడిఁ బట్టుకొనుచు నృపతిన్ మోదెన్. 83

చ. ఇటులుగడంగి యిర్వురితరేతరముష్టి విఘట్టనోద్ధత
స్ఫుటసుమనఃపరాగమృదు భూతివిసర్గత దేహులై జటా
పటలిపరస్పరాత్త నిజపాణులునై పెరకేలకంఠముల్
పటుగతిఁజుట్టిపట్టి గిరిపై ధరపై నొరపై యొరంగినన్ 84

వ. తత్సమయంబునసహసాసంఘటిత గుహాద్వార కుహర నిరుద్ధ సిద్ధమిథున విరుద్ధ హాహాకార నిబిడీసబంధుర ధ్వానంబుల ననుచ్చలితనికటతట పటీరవిటపిపటలవీచీ సముత్పాటిపాటవ సమాకృష్టమానమునిజన పర్ణశాలా సహస్రంబును బతనవేగపరిభిద్యమానసురతరంగిణీ సహస్రకల్యకుల్యా ప్రసారంబులను దత్పురఃప్రవర్తితకుండలిమండలంబులను నగ్గట్టుత్రేఁ డధికభారభరితుండయ్యెనయ్యెడ. 85

క. హరుచే గ్రిందై నరుఁడు
ద్ధురగతిఁ బెగడకదొలంగఁ ద్రోచియునటుఁదా
హరునిం గ్రిందుగఁ జేసెను
సరభసముగ బాహుదర్పచాతుర్యమునన్ 86

క. నీయల్లుఁడుఁనాచేతను
బాయనియీడదశను బాలుపడె నిపుడని తా
నాయద్రికి నేకాంతము
నేయుతెఱంగున నరుండు శివుపై నుండెన్ 87

చ. పొలుపరవింటిపెట్టి ననుబుట్టినగాయము సిండజాలక
త్వలఘుసుపర్వవాహిని కణాప్తినిఁబోలిన శంకనెమ్మదిం
దలపక తత్కిరీటి భుజదర్పము శంకరుఁడాజియందుఁ దాఁ
జెలువుగఁగాంచి విస్మయముచేఁ దలయూచెను సారెసారెకున్

వ. ఇవ్విధంబున శశిఖండమండితుఁడటఁ గొండొక దడవు ప్రాకృత చేతన స్వాభావికంబునం బోరిపోరి యనంతరంబ మెల్లన తదాకార విసర్జితుండై పాండుసుతు నగ్రభాగంబున ఘంటాఘణ ఘణాత్కార సహచారి కంఠ గర్జితంబునఁ గణాణంబులకుఁ బరికల్పిత మోక్షంబగు మహోక్షంబు నధివసించి బాహుమూల పరిసారణ దాక్షాయణీ పాణిపంకజ నఖాంకుర ధోరణీవిలసనంబున ద్విగుణీకృత హారమణి రమణీయవక్షుండగుచు మృదుల శార్దూల చర్మనిర్మిత పల్యయనోపరిభాగంబునఁ దిర్యగ్గతైక చరణపల్లవ సంవాహనపరుండైన శిలాదకుమారుండటను వృషభేంద్రాఖర్వ గర్వ నిర్వాపణంబునకై స్యూతితముఖజాతరూపసూత్రశృంఖలయుగళంబు బట్టి మాటిమాటికి నూపురంబు గరాస్ఫాలనంబుసేయుచు భృంగిరిటియును నిరుగడల సముకట్ట జటాభసిత కుశ చీర ధారులగుచు మునిపుంగవుల తెఱంగున వేదపురుషులు నల్వురును శతరుద్రియభిరుదప్రబంధంబు లుగ్గడింప నంబరాలంబి తుంబురునారద ప్రభృతి గీర్వాణ వైణికులు భక్తజనపరిపాలన ప్రకరణంబులు వీణా గుణ క్వణనంబులఁ బలికింపఁ బారిషదగణకరాంజలికముల కానన రాజహంసాయమానుండగుచు మఱియును, 89

సీ. కర్ణాంతతాపింఛ కలికామిషంబున
సాక్షాత్కటాక్ష వర్షంబు దనర

నాబద్ధ భుజగ ఫణాళి మణుల్ మేన
బాణ వ్రణంబుల పగిది మెరయ
చాపపీడిత శిరశ్శశి దేర్చవచ్చిన
చుక్కలనం దల సుమము లలర
నవతంస శశిగళ దమృతస్రవమునూడ్కి
హృదయ సూచిత హాస మినుమడింప

గీ. నున్న యాశంకరునిఁ గాంచి యుత్సహించి
పక్ష్మతటరూఢ నిబిరీస పటు నిమేష
తరు సముత్పాట నైక విధాన యుక్తిఁ
బరఁగు హర్షాశ్రులురులంగఁ బార్థుఁడపుడు. 90

క. పులకలు బొడమఁగ సవినయ
మలవడఁ గేల్మోడ్చి చెంత కల్లనఁ జని సా
గిలి యా దేవు పదాబ్జం
బులకుఁ బేమారు మ్రొక్కి పొగడెఁ భక్తిన్. 91

మత్తేభకందగర్భ సీసము.

సీ. కుసుమబాణాంతక ! కుండలీశ్వరనుతా
స్తోకై కభాస్వ ద్యశోనితాంత !
పరివిమలాపాండుర భాసురాంగక ! మహా
విద్వేషి భూభృత్ప్రపీ ! ప్రసిద్ధ !
ప్రశమితద్వేశ ! సుపర్వసేవిత ! రమే
శస్తోత్ర చారిత్ర ! సారశుభద !
సుగమఁశీభూతి సుసోమశేఖర ! జగ
దఘాపరితైక పరిథాపరిపూర్ణ ! 92

గీ. త్రిభువనస్థిత నతహిత ! దివిజవినుత!
పటు వృషభవాహ ! శర్వ ! కపాలి ! శూలి !
అభవ ! దుర్మద ! పురహర ! హర ! సువరద !
దయ నిపుడు బ్రోవఁ జూడుము నయము నూని. 93

మ. సుమబాణాంతక! కుండలీశ్వరనుతా స్తోత్రైకభాస్వద్యశో
విమలా పాండురభాసురాంగక! మహావిద్వేషిభూభృత్పవీ!
శమితక్ష్వేళ! సుపర్వసేవిత! రమేశస్తోత్రచారిత్ర! సా
రమణీభూతసుసోమశేఖర! జగద్రక్షావ్రతైకప్రథా! 94

క. భువనస్థిత నతహిత! దివి
జవినుత! పటు వృషభవాహ! శర్వ! కపాలీ!
భవదుర్మద పురహర! హరి!
సువరద! దయనిపుడు బ్రోవఁ జూడుమనయము గా. 95

ఏకాక్షరకందము.

క. నే నిను నెన్నే నన్న ను
నా నానా నూన నాన నను వే నన్నా
నే నిన్ను నెన్న నన్నా
నీ నిను నెన్నన్ను నెన్న నిన నే నౌనా! 96

అర్థము:— నే, నిను, ను, ఎన్నేని, అన్నను, నా, నా నా, నూన, నాన, నను, నేను, అన్నా, నే, నిన్నును, ఎన్నను, అన్నాను, ఈ నిను, ఎన్న అన్నను, ఎన్నను, ఇన, నేను, ఔనా.

తా. నిన్ను స్తోత్రముసేయ నెంతవాఁడ ననుట.

చ. పరుషవచస్స్థితిన్ నిశితబాణతతిన్ దృఢముష్టిసంహతిన్
గురుతరచాపయష్టిహతి ఘోరరణంబున నాల్గురీతులన్
సొరదని మూఢబుద్ధిఁ జెఱుజూపితి నాయపరాధమోర్చియీ
శ్వర!ననుఁ బ్రోవవే?కరుణాస్వామి!మహేశ?దయాపయోనిధీ! 97

ఉ. మానుగ నిట్లు విన్నపము మాటికిఁ జేయుచునున్న నంత నం
తాన నవీనమానను వితాన సమాన శయంబుతోడ పం
చాననుఁ డల్లనల్లన రణాతతబాణ కృతక్షతస్థితిన్
బూనిన తాపమెల్ల ననఁ బున్కుచు గౌరవసింపుతోననున్

చ. కురువర! నీదు యుద్ధమునకుం గడుమెచ్చితిజుమ్మి నెమ్మితో
బరఁగెడుభక్తికిన్ ఘనతపస్స్థిరశక్తికి సూనరాజిచే
గరము నెనర్చునర్చనల గౌరవయుక్తినిఁబోలె మాటిచే
నరయఁగ నేపరిహృష్టమతినైతి నభీష్టవరంబుఁగోరుమీ! 99

క. అనుచు సుధామధురిమ ధా
రను దగు వాక్యమున దెల్పి రయమున నంతన్
మును దనచే మాయంబై
చనిన ధనుర్బాణములను జయ్యన నిచ్చెన్. 100

క. మఱియును విజయు మనోరథ
మెఱిఁగియుఁ దను వేఁడుకొనిన నీశానుం డ
త్తఱిఁ బాశుపత మొసఁగెన్
గుఱుకొను నా వింటిదెబ్బకును గానుకనన్.

గీ. పాశుపత లాభగత దురాపప్రదీప్తి
మహిత హర్షాశ్రితరళ పక్ష్మప్రశప్తి

వెలయు నరుక్రేవ నాశ్చర్యవృత్తిఁ దేలి
సనియెఁ దనవారితోడ నా చంద్రమౌళి. 102

ఉ. అంతసమీపతాపస సమాహితమైతగు దీవెనన్ లస
త్స్వాంతము సంతసించు నెడ వచ్చె రథంబు మనోరథంబునన్
జెంతకు శక్రశాసనము చేత నమాతలియుక్తమై యటన్
గుంతికుమారుఁ డెక్కెఁ జని గొబ్బున నిర్జరరాజధానికిన్. 103

గీ. ఇట్లు త్రిదివంబుఁ జెంది సురేంద్రుఁ గాంచి
తనదు నామము ఫల్గునుఁడనుచు నగ్గ
డింపుమను మ్రొక్క ముదసంతసింపఁ జాప
కలితభుజుఁ డమ్మహాత్ముని కౌఁగిలించుకొను. 104

గీ. రెప్పలిడు తజ్జయంతుని రీతినున్న
యతని శక్రుండు పాణిచే నవుడు దడవి
ప్రీతిస్వారాజ్య గౌరవ ఖ్యాతిగలుగు
తనమహార్ధాసనంబున నునిచె నంత.

చ. అవుడు నిలింపవర్య సభ నందిన యాకురుసార్వభౌముపై
కపటకిరాతముక్త విశిఖక్షత సాంద్రితనుండునైననం
దపరిమితంబుగాఁ బడియె నారయ నిర్జర రాజకన్యకా
చపలితదృష్టిజాలములు శాతమహోతత హేతులో యనన్.

చ. కొలువున వేల్పుతేఁడు నవికుంఠితుఁ డాకరకంఠుతోడి యా
కలహము పుత్రుచే వినియు గాఢనిరూఢ మనఃప్రమోదియై
పులకలు గాత్రమెల్లెడలఁ బూనినయంతన వేయునైన క
న్ను [illegible]

క. జనకాజ్ఞ చేజయంతుఁ,
డనిమిషపతిశోడ మంగళారవమొప్పన్
ఘనమదకరిపయిఁగవ్వడి
నునిచియుదత్పురవిహార మొందంజేసెన్. 108

గీ. పురినిఁగ్రుమ్మరియంత నప్పుడమిపతి శ,
చీపదంబుల కెరఁగ నాశీర్వదించి
రమ్యమందారకుసుమ పరాగవాసను
భూతిచేమోమునను గాపుబొట్టువెట్టె. 109

క. పలుమరుజయంతశేంకర
దెలిపుడి రేఖావిభూతిఁ దెగడునతని న
త్యలఘుజ్యాకిణమగుబా
హులనరుఁడను పేర పేరులూహింతురొగిన్. 110

గీ. ఇంద్రుచేదివ్యశస్త్రాస్త్ర మెఱిఁగిదివిని
గోకిలాద్భుతకంఠ రవైక రచన
బరిచితామృతదేవతా పరివృతుండు
గాయకునివల్ల సంగీత కలన నేర్చె. 111

వ. ఇట్లర్జునుండు దివంబున నస్త్రశస్త్ర నృత్తగీత వాద్య
విద్యా ప్రవీణుండగుచున్న యంత నొక్కనాఁడు. 112

ఉ. ఆనరుఁజూచి యూర్వశి యనంగశరాభి హతాంతరంగయై
వానినిఁజేరి వెండియును వైభవభగ్నమనోరథంబుచే
నూనినకోపమెత్తియును నోరిపృథాతనయా! వృథావిధిన్
బూనుము షండరూపమని బోటిశపించెను గ్రీడినయ్యెడన్.

గీ. దానినెఱిఁగివజ్రి వానికీననియెను
వత్సచిత్రసేను వలనఁగన్న
విద్యతోడనీకు వినుమిట్టిశాపంబు
నొక్కయెడఁబ్రియంబు నొసంగ ననుచు. 114

వ. అంత నొక్కనాఁ డస్త్రశిక్షాసమాప్తి యాగుటంజేసి సురవిసర సమక్షంబున విశక్షక్షయంబుసేయ నపేక్షించు సహస్రాక్షుండు నిజహస్తకంబువేనఁదిగిచి కిరీటంబు నరున కొసంగె నాటంగోలెఁ గిరీటియని ఫల్గునుండు ప్రసిద్ధుండయ్యె. వెండియుఁ బాండవమధ్యముండా ఖండలునకు గురుదక్షిణగా నతనిపంపున గాలకేయాదుల నిధనంబున కుద్యోగించి మాతలికలిత హయంబులను నందనోద్యాన పవమాన సంధీయమాన కేతనంబునందగు స్యందనంబధివసించి బృందారక నగరంబు నిర్గమించి వియత్తలమార్గంబువట్టి దూరంబు చని చని మ్రుందట ఘోరదైత్య దానవ వీర వార కోలాహల నీచీకృత వీచీరవంబగు పాథోధిమధ్యంబున రసాతల కుహరముఖంబు నిరోధించి రణోత్సాహియై గాండీవంబు మ్రోయించిన 115

సీ. అపుడపూర్వధ్వని నగుగుణధ్వనికర్ణ
దాహకంబుగవిని దైత్యవరులు
మునువేల్పుమూకలు మోదుటచేనిది
యదియకాతలపోసి ముదముమీఱ
గలనికనేకకోటులు గడంగిననంతఁ
గుంతీసుతుండును గూర్రబాణ
పటలిచేనొంప దుర్భరగుహావిక్షిప్త
దేహులుపాఱ విశీర్ణఘనులు

గీ. నై నివాతకవచులయ్యును వీతక
వచులునగుచుదనుజ వారములును
గాయములనుఘోర కలహభూమి యుడించి
పోయిరాకృతాంతుపురముఁజేర. 116

చ. పొలయక నా నివాతకవచుల్ నరుచేత విధూతజీవులై
పొలయుట దారెఱింగియును బూనల సత్పరివేషరీతి నా
నలరెడు వప్రవర్మమగునట్టి హిరణ్యపురంబు గాలకే
యులునిజబంధుసంక్షయమునోర్వక నుల్లుచుఁబార్థుముట్టియున్

చ. పరువడి రాక్షసుల్ బఱపు బాణ గదా కరవాల శూలతో
మర ముసలాదిశస్త్రములుమాపి రయంబుభయంబుదోఁపఁగా
నరుదగుకాలకేయ నివహంబుల నెంతయుఁగాలగేహసం
చరులనొనర్పఁ బాశుపత సాయకమాది సమంత్రకంబుగన్.

క. పాండుకుమారుఁడు రక్షో
మండలిపై వైవ నదియు మండుచుఁ జని యా
భండనమునఁగల రిపులను
దండధరునిఁజేరఁబంచెఁ దత్క్షణమాత్రన్. 119

ఉ. క్రుంకని తారకాగణము కుందని చందురుచాయ, గాలి చే
నంకిలిమానియొప్పు శరదభ్ర సమాజము పోల్కి నొప్పె స
ర్వంకషమైనకీర్తియు దివంబునఁ గవ్వడికిన్ రణోర్వి ని
శ్శంకను యాతుధానతతిఁజంపె సహిష్ణుఁడుగాగ నత్తఱిన్.

గీ. అరులనిర్జించి మగిడిన యక్కిరీటిఁ
గాంచి యింద్రుఁడు దేవతా గణముతోడ

సంతసించుచు హర్షాశ్రు సంగతిని ని
జాంగ మెల్లెడఁ బూనె నార్ద్రాభియుక్తి. 121

చ. చెలువుగ దేవతానుతులచేఁ బ్రియసత్ఫల కావమగ్నదోః
కలితశరాసనై కకిణ గౌరవుఁ డర్జునుఁ డుండి ప్రీతి నం
దుల నిజమార పంచశరదుండను యచ్చరలెల్ల నాత్మలన్
దలఁప సుఖాప్తి పంచశరదంబులు నిష్టవిహార లీలలన్. 122

వ. అంత నర్జును దివ్యాస్త్రలాభంబు బారాశర్యువలన ధృతరాష్ట్రుండు విని విషణ్ణుండై తనకొడుకు కొలగామికిఁగుందు చుండె నటఁ బాండునందనులు పురందరనందనుం డు రాక మసలుటకు డెందంబులఁ గొందలపడుచున్న సమయంబున వారికడకుఁ బృహదశ్వుండు చనుదెంచిన నతనిని విధివత్సపర్యల సంతుష్టుం జేసి తమ పడు బన్నంబు లుగ్గడించుచు దుఃఖితుండగు ధర్మజు నుద్దేశించి బృహదశ్వుం డిట్లనియె. 123

చ. నరవర! మీరలిట్లువిపినమ్మునఁ దమ్ములుభార్యబ్రాహ్మణో
త్కరమునుభృత్యులున్ హితులుదద్దయుగొల్వనరణ్యవాసముం
బరమముదంబునన్ సలుప భారమంటచునుబల్కెదేల? దు
స్తరముగమున్న నైషధుఁడు దానుజరించుటకంటెభారమే!

వ. అనిన నదియెట్లనియడిగిన ధర్మజునకు బృహదశ్వుం డిట్లనియె. 125

సీ. వినవయ్య! రాజేంద్ర! వీరసేనసుతుండు
నిషధాధిపతిమహా నీయమూర్తి
నలుఁడనువాఁడు నానామహీతలమెల్ల
భావించునాసార్వభౌముఁడొక్క

నాఁకుఁగీర్తిసార్థంబు నలువొప్పునారామ
సరణిఁజరింప దత్నమయమునను
విధివశంబునహంస విహగసమాజంబు
బట తెంచియున్నయనభాగమునను

గీ. వార్తలెనప్పుడు చూచియవ్వసుమతీశు
డర్థిఁగికురించిపట్టెను హంసనొకటి
యదిభయంబునఁ బొగులుచునతనితోడ
బలికెనిట్లని మనుజభావలనుదెలియ 126

ఉ. రాజకులేశనీదుకుచిరంబగు రేఖకుసాటిసేయఁగా
నీజగతిందలంపమది కేతుణ నోర్తును గూర్తునన్నని
ర్వ్యాజము తోడఁబట్టతగవా వినుమన్ననలుండ నానరాం
భోజముఖింతకాంతులనుబొందగ సందియమందియిట్లనున్

క. హంసా! నీమదిలోపల
హింసించెదనని తలంచి హితమతి నన్నుం
శంసించెద హా! నిజమో
హింసకుఁడను గాను జెపరనేటికినీకున్. 128

వ. అనిన రాయంచ నమ్మానినీ పంచశరున కిట్లనియె.

చ. విను మృపలేల పల్కుదు నవీనమనోజ! విదర్భసీమ భీ
మునకుఁగుమారియైబరఁగు మద్దియుదాదమయంతి నాఁగనొ
ప్పును సరిలేదు తత్తరుణి పోల్ప వెలందులు నీదుచెల్వ న
వ్వనితకెఱుంగఁజెప్పి కడువైళముకూర్తునటన్ననావృషున్. 130

గీ. రాజహంస విడిచి రాజహంసుండంతఁ
బ్రియముఁజేయునదియుఁ బింఛుఁగలసి
చని విదర్భఁజేరి చయ్యన వైదర్భి
మెలఁగు వనినివ్రాలె మెఱుఁగుకరణి 131

క. ఆరాయంచల వేడుక
నారాజ తనూజ నిజవయస్యలుఁ దానిం
గోరికలెసయఁగఁ బట్టెను
సారెకు వెనువెంటఁ దవిలి సరగున నంతన్. 132

వ. నలుచేత విముక్తకంబగు హంసయే దమయంతిచే పడి యారాజేంద్రచంద్రునిఁ గీర్తించి యాతని వరునిగా వరింపుమని నిర్దేశించిన నదియును మదీయాకార రేఖా విశేషంబులు నమ్మహాత్మున కెఱింగించి శుభంబందుమని యనిచె నంత వైదర్భి నలునియందుఁ జిత్తంబుఁజేర్చి విరహానల ధూమాయమాన మానసయగుట తత్ప్రియసఖీ జనంబులవలన నెఱింగినవాఁడు గావున భీముండు జలధి వలయిత వసుంధరా చక్రంబునంగల రాజబృందారకుల నిజమతా స్వయంవరంబునకుఁ రప్పించె నాసమయంబున

సీ. సామజ సైంధవ స్యందన భట రాజ
పదహతిభూస్థలి గదలిపడఁగ
మహనీయ కాంచన మణిమయ భూషణాం
బరధారులై నవ మదనులట్ల
పరివారసహిత సంపదలొప్ప నానా మ
హీపకుమారకు లేపుమీరి
చనుదెంచిరినలుండు సపరివారుండునై
చనుచున్నయట్టి తత్సమయమందు

గీ. నారదాదులచే సురనాథుఁ డెరిఁగి
పావకవరుణ పరేత రాజ
యుతముగావచ్చి యానలునుపథమున
నిలిపి నలుచెంతకేతెంచి పలికెనిట్లు. 134

క. నరనాయక ! యొకపనికై
కరమర్థిని నిన్ను దూతగా వేఁడఁగ మే
మరుదెంచినార మనవుడు
నరగునఁ గావింతుననియెఁ జనవరుఁడంతన్. 135

ఉ. ఆవసుధేశుపల్కునకు హర్షమునొంది సురేంద్రుఁడిట్లనున్
భూవర ! వీరువహ్నిరవిపుత్రులుసూ వరుణుండువాఁడనే
దేవవిభుండనిందు నొకదేవవరున్ వరియింపఁజేయుసం
భావననామృగాక్షినని పల్కనలుండును వానికిట్లనున్ 136

గీ. ఏనునచటికిందు కేఁగుదు నిట్లాడఁ
జనునె ? మీరు ననిన శక్రుఁడనియె
మున్నుఁ జేయుదనుచు మిన్నక పల్కితి
వింక దప్పనగునె ? బొంకుకాదె ?

ఉ. కావున నింక దేవహితకార్యముబూను మదీయశక్తినిన్
బోవుము బీతిమై తదవరోధ నిరోధ విరోధ మొందవో
భూవర ! యేఁగుమన్న నృపపుంగవుఁ డంగన కేళి పద్మవుం
దావునఁజేరి కాంచెమరుదంతిని నా దమయంతి నెంతయున్.

క. కని మనసిజ సునిశిత శర
జనితానలకీలజాల చాంచల్య మనః

కనకము దోనకను జనపతి.
తనమతి సతి రూపవిభవ తతి నుతి గొనియెఁ. 139

ఉ. ఆనరరాజకన్య నిషధాధిపతిం గని తద్విలాస రే
ఖానవకాంతి సంతతులఁ గన్నులఁ దావివుచు వానికిట్లనుఁ.
మానవకోటికిం జొరగ మామకగేహము దుర్గమబంగుఁ
గాన నొకఁడ వెట్లు బరగం జనుదెంచితివయ్య చెప్పమా?

క. సురపతివో? కాకను గి
న్నరపతివో? భుజగపతివో? నామదిఁగల యా
వరరూపశాలి నిషధన
గర పతివో తెలియఁ బలుకు కారుణ్యనిధీ! 141

చ. అనుటయు నాతఁడిట్టులను నంబుజనేత్రి నలుండ నేను పా
వనులగు దేవతాపతుల పంపునఁదెంపున వచ్చి నాఁడఁ జు
మ్ము నర నరుఁ వరింప సుఖమున్నదె? ఖేచర నాధులందు నొ
క్కని పతిగా వరించి సుభగస్థితి నందుమనేక భోగముల్. 142

వ. అదియునుగాక జరామరణ రహితంబుగా దేవత్వంబు సంఘటిల్లు నిహంబుననొనర్చు పుణ్యఫలంబులు తదీయాపేక్షంజేసియు కాదేయని బహుప్రకారంబుల నక్కోమలి నియ్యకొల్పిన నది యొడంబడకయిట్లనియె. 143

ఉ. నినుఁగామించిన నన్నుఁగైకొనక దుర్నీతిన్ మరున్నాధు నొ
క్కనిఁజేకొమ్మని పెక్కుఁబాడియగునే? కాదేని ప్రాణంబు నీ
మనమారన్ విడువంగ నోపుదుసుమీ మారాడకిచ్చోట నిం
కనునుండేటికి చింతనిన్ను బతిగాగైకొందుఁ దత్సన్నిధిన్ 144

క. పరుషము లెగ్గలుఁ బలికిన
దరుణికి నెదురుండ నెఱిఁగి ధరణీపతి యా
సురలకుఁ బవ్విధ మంతయుఁ
బఱఁగఁగ విన్నపము సేయఁ బదపడి వారున్ 145

క. నలుఁగతి నలువురు సురలును
నలువొప్పఁగ నేఁగుదెంచి నలుఁ గోఁకూడన్
గలనస్వయంవర మంటప
లలితస్థలినున్న యంతలలనామణియున్ 146

చ. వివిధగతిన్ సుకోత్తములవేఁడి పరిసన్నులఁ జేసి నైషధుం
దవిలివరింపనంత వరదానము లిచ్చియు దేవతల్ తదు
త్సవము బ్రియంబు సంగని యథాస్థితికిం జనుచో శనైశ్చరుం
డవనికి నేఁగుదెంచుచును నంతయు వారలచే నెఱింగియున్. 147

వ. అంతట దమయంతి నలునకు రాజ్యభ్రష్టత్వంబును బరస్పరవియోగంబును గావింతునని కృతనిశ్చయుండై రంధ్రాన్వేషణము సేయుచుండె. నలుండును వైదర్భిం గైకొని సేనాసమేతుండై నిజనగరంబుఁ బ్రవేశించి కొండొకకాలము రాజ్యముసేయుచు నశ్వమేధాదిక్రతువులం బ్రవర్తించుచు సుఖంబు లనుభవించుచు నొక్కనాఁడు కృతమూత్రవిసర్గుండై జలంబులచేత బాదంబులు గడిగికొనమఱచిన నదియవకాశంబుగా నెఱింగి కలి యతనియందుల బ్రవేశించె నప్పుడు. 148

క. శనిపరవశమునఁ బుష్కలుఁ
డనువాఁడు తదీయబంధుఁ డరుదెంచి నలుం

గనినెత్తము నొడ్డుదమున
మనుజేంద్రుఁడు సమ్మతించె మందాత్ముఁడై 149

గీ. పుష్కలునితోడ జూదముఁబూనునాది
గాక హితమంత్రి గురుపురోగములతోడ
గాంతదమయంతి నలుఁడాను కైతవంబు
మానజాలక చింతచే మరగియుంత. 150

సీ. పతియాజ్ఞఁబడసియప్పుడతి వార్ష్ణేయుండు
ననుసారథినిఁగూర్చి తనయపత్య
మగునింద్రసేనునిఁదగ నింద్రసేననా
కొడుకుగూఁతునుజాలఁ గూర్మిమీర
బంచెవిదర్భాధిపతికడకును నంత
టనునైషధుఁడు నెత్తముననుసకల
వస్తువాహనములు వసుధయునోడిజా
యాసహితంబుగా నడవినరుగు

గీ. చున్నవారల ముందరఁజెన్నుమీర
బసిఁడిపులుఁగుల గమియున్నఁబతియువాని
మీఁదనిజవస్త్రమునువైవ మింటికెగసి
చనియెఁబక్షులు చేలమునంగ్రహించి. 151

క. వానికి నివ్వెఱఁగందుచు
మానవపతిభార్యతోడ మానినిక్షుధచేఁ
గాననసరణింజనిచని
మానవపతిఁజూచి పలికెఁ మదిఁ గరుణమునన్. 152

క. అతిదుర్గమమార్గంబుల
నతివా ? నడువంగఁ జాలవనిచెదరిన్నుఁ
హితమతినేఁగఁగఁ దెలిపిది
తతపుణ్యుండా విదర్భధరణిపునెడకున్ 153

వ. అనిన దమయంతి యిట్లనియె. 154

ఆ. వె. ఈవువచ్చువాఁడు నేఁగుదుఁ గాకున్నఁ
బ్రాణనాథ ! నిన్నుఁబాసియుచట
నుండనోపగాఁన నొక్కింతదుర్గమం
బగునెఁన్నుఁ బెరసియరుగుదనకు. 155

వ. అని యొడంబఱచి నీడయుంబోలె నతనివెంట నంటి చని ముందరనున్న తరుమండమధ్యమున నొక్క రమ్యప్రదేశంబు నొంది వారిరువురు విశ్రమించి రంత దమయంతి నిజకాంతచక్రవాతికంబున నొడలు బుడమివై చి నిదురించుతరి శనిపేరితంబున నలుండు దదీయోత్తరీయంబు చించికొని యచ్చోటఁదానిడించి చని యగ్రభాగంబునఁ గార్చిచ్చునందగిలి కర్కోటకుండను గుండలీంద్రుండు దన్ను వేఁడిన నప్పాముం దిగిచి నీరుకందువంబెట్టఁ దత్క్షణంబున నతని దర్శించి పూర్వాకారవికలుంగావించి పుట్టంబొసంగి మదీయనామంబుగ్గడించిన భవదీయాకారంబున నలవడెదని హితంబుపదేశించి ఫణిపతిచనియె వెండియు నలుండు నచ్చటంగదలి తన కురుచతనంబునకు నచ్చెరువడుచు నయోధ్యాధీశుండగు ఋతుపర్ణునొద్ద హయరక్షకుండను బానిసీకుండనునయి యుండె మఱియునిచ్చట. 156

చ. మిగుల భరంబుగానలసిమేనతి కర్కశ భూమిపై చియా
మగువయుఁగన్ను గూర్కి వడిమై తెలివొందుచు లేచి నాథునిం
దగనట కానక వెదకెఁ దద్వినవాటిని మాటిమాటికిక
బెగులుచు శోకవిహ్వలతఁ బొందినచిత్తముతో రయంబునక.

క. హా నల! హా! నల! యని విర
హానల భవదుఃఖ మొంది యాజలు వెడలం
గానర గోనలఁ జీరుచు
వేనలి దూగాడ జాడ వెదకుంగొదకుక. 158

వ. ఇట్లు జనుచున్న సమయంబున. 159

ఆ. వె. చెలువ నొక్క చిలువ పలవింపఁ బలలార్థి
యగుచుఁబట్టి దాని యార్తరవము
విధివశంబుచేత విని లుబ్ధకుఁడు వచ్చి
పాముఁ జంపి భామ బాముఁ బాపె. 160

వ. అంత.

ఉ. చెంగట నొప్పుచున్న సరసిం జలమాడఁగఁజేసి సత్ఫలా
లిం గడు నిచ్చి పుచ్చిగను లేమరునాత్మ మెఱుంగఁజెప్ప న
య్యంగన రోషరూషిత దృగంతములంగని శాపదగ్ధుఁ జే
యం గుతలంబునందుమృతుఁడై యొరగెన్ రయమారవాడటన్

గీ. అంత నచ్చోటుబాసి మృగాక్షినాథు
నరసికొంచును జనఁ జననతి సార
బాది మునిగణములఁ గాంచి యాత్మచరిత
మంతచెతెఁగింప సాధ్వీమతల్లిజూచి. 163

క. మునులిట్లనుచుఁ బలికి రో
వనజాయతనేత్రి! యింక వలవదు వనటం
బనుపడ మనుజేంద్రుని రయ
మునఁజేరెదవీవు నమ్ముము సుచిత్రమునన్ 164

క. అని దివ్యమునులు పలికిన
వనితయొకింతేసి యూసనరిలగ వారిం
గనిమొక్కుచు వీడ్కొనిచని
చనిముందటఁగాంచె నొక్కపాంథుంబ్రీతిన్. 165

మ. కనిచేరంజన సార్థవాహులు భయాకంపాత్ములై యాయకం
తనువారందనరూపుచెప్పి యపుడా తన్వంగి తద్గోవళీ
ఘనసంఘంబులతోనయేగగ తటాకప్రాంతసీమన్ బిడా
రునుగావించిరి రాత్రియైనసటవారున్ నిల్వఘోరాటవిన్ 166

వ. అట్టిసమయంబున నర్ధరాత్రంబున వన్యవేదండమండ
లంబునీరు ద్రావనేతెంచి యచ్చనుప గదిసి చెరువుంజొచ్చిన భ
యంబునఁ గొందరు తరుచయంబులఁ గొందరు గిరిశిఖరంబులం
బల్లంబుల బయళ్ళంగలయఁ బరిభ్రమించియు వెఱచియునఱచిఁ
జేష్టలకు మఱచియుఁ బఱచియు బ్రాణంబులవిడిచియు నిట్లనేక
ప్రకారంబుల్గఁ గల్పాంత సమయంబునుంబోలె బడలువడిరంతఁ
బ్రభాతంబగుటయు చెదరిచనువంగలసి యుబసగమనమున దుఃఖా
కులచిత్తయగుచు చేదిపతియగు సుబాహు పురంబుఁజేరి రాజ
మార్గంబునం బోవుచున్న సమయంబున. 167

సీ. కడుమాసిజీర్ణమై కట్టినపుట్టంబు
శరదంతసమయాభ్రి సరణిఁదెలుప

నిడుఁదవేనలిగుంపు నెఱిదూఁగఁదగుపూన్కి
పాశ్రిపృష్ఠ్వ యోఁద సంపదదలనీన
నడిపోనికిస్నిట నొప్పెడువదనంబు
హిమసిక్తపంకజ శ్రీమముదనర
ధూళిధూసర తనుద్యుతిడస్నికుసుమిత
పటురజోవ్యాప్త చంపకముఁదెగడ

గీ. బుడమినడుగులు దడఁబాటుబొడమనిడుచు
మూర్తిగైకొన్న నురుమాయమొనయఁబోలు
ననుచుజనులాడనేకద నరుగుదెంచు
కాంతఁగనిరాజమాత యొకర్తునిచి. 168

క. తన నగరికి రప్పించిన
జనుదెంచెనుభీనుతనయు జంముులుతనునో
లినినీవెవ్వరటంచును
వెనుకొనిపటితేర రాజవేశ్మముఁజేరెన్. 169

వ. అంత రాజమాత తెలంగెట్టిదియనుడు నాపె నొక్క రాజనందననగుదును. మఱియువిభుండు శత్రువులచేజూదంబున సిరియోడి విపినంబున కేతెంచిన యమ్మహానుభావువెంట నేనును నీడయుంబోలెఁ జనుదెంచితి నతండు విధివశంబున నిదురించుచున్న నన్ను గహనంబునడించి యరుగుటయు నతనినరయుచు వచ్చితిననిన రాజమాత దానికిట్లనియె. 170

క. నాయింట నంతుసీపతి
రోయంబంచెదను భూసురుల నడుదియుం

జేయుదు సైరంధ్రిత్వము
బాయుదు నొక కానిపనులఁ బంచినయెడలన్ 171

క. నాయిష్టము వచ్చినపనిఁ
జేయుదు నాత్మోప భోగసిద్ధి దనరఁగా
నోయమ! ప్రియమగు నేనియుఁ
నీయెడ ననువు మటవేర యీక్షింపకుమీ! 172

వ. అనిన నీకుఁ బ్రియంబగునట్లుండుమని తన పుత్రియగు సునంద నప్పగించెఁ దదనంతరంబ పుణ్యచరితంబులు సలుపుచు దమయంతి యా రాజమాత గృహంబున నుండెనంత 173

సీ. పరఁగ విదర్భాధిపతి కూఁతు నల్లుని
నరయఁగ బ్రాహ్మణవరుల ననుప
వారలనేకులు వసుధఁ గ్రిమ్మరుచుఁ బ
ట్టణములు జనపద గణము లరయు
తరి యొక్క బ్రాహ్మణోత్తముఁడు సుబాహుని
పురముఁ జేరిన విప్రవరులుఁ గొంద
అంతఃపురంబున కరుగ వారలతోడ
జనిరాజసదనంబు నొనరఁ జొచ్చి
గీ. యందు సైరంధ్రియగుచును నతిశయిల్లు
మలినపరిధాన ధూళిసంకలితదేహ
కలితనిబిడాశ్రుకణముఖ కమలస్రస్త
కేశయగుచున్న సతిఁగని క్రేవనతఁడు 174

క. ఇమ్మగువ చూడ నాసలు
కొమ్మయుఁ బలె నున్నదిపుడు గుం దెలియఁగనం

చమ్మహితాత్ముఁడు డాయఁగ
సమ్మతిజనియుఁడుఁగనదియు సకలముజెప్పెన్ 175

ఉ. అత్తరిభూమిభృజ్జననికాయముదత్సతిరూపమేర్పడన్
జిత్తముసమ్మతింపఁగను జెప్పినచో నదివానిదెల్పియో
పుత్త్రడిబొమ్మనిన్నెరుగఁ బోలకయుంటిని పట్టియుంచు వే
యెత్తికవుంగలించి కడునెంతయు గారవమొప్పఁజూచినర్, 176

క. అందుల కొన్నిదినంబులు
నిందీవరనేత్రియుండి యొసఁగఁగనొకనా
డందరుబరపఁగ భీముని
నందనయాత్మీయ జనకనగరముజేరెన్. 177

వ. ఇట్లు విదర్భనగరంబుఁ బ్రవేశించి పుణ్యచరిత్రంబులు పలు
వుచు నాత్మేశ్వరునిఁ దలంచుచు నొక్కనాఁడు జననీజనకానుమ
తంబున వీరసేనాత్మజురోయు భూసురులరప్పించి సాభిప్రాయవా
క్యంబులుపదేశించి సకలదేశంబులు జాటుండు మీ యుత్తరంబు
లకుమారుబల్కునతండు నలునిగానెతింగి తోడ్కొనిరండు రాని
నాఁడతని దెలిసిరండని వీడ్కొలిపినవారలరిగి యట్లన నానాదేశం
బులనరసి నలునింగానక మగిడిరందుఁ బర్ణాదుండను బ్రాహ్మణుం
డుఁజనుదెంచి వైదర్భికిట్లనియె, 178

శా. కొమ్మా! యేనుసమస్తదేశములలోఁ గ్రూరాత్ముఁడై యాత్మదా
రమ్మాసాధ్విని గానవాంతమున సంసారంబేవి వే డించిచే
లమ్ముంజించి పరిత్యజించి చనమేలా పౌరుషంబా యటం
చుమ్మల్లాడుచుఁజాటుచుండనుచుగంచున్ విందురోయుంగ నున్

క. సాకేతనగరపతికడ
నేకాకియు బాహుకుండిట్లని పలికెన్
లోకములోఁ బురుషుల నిటు
గాకొనరించుటయె సతికి ఘనమగు పేర్మిల్ 180

క. పతిసతినిఁ గొదువలెన్నిన
సతినై రణఁగొనుటయందు సహజముసతియే
పతినీగతి నడిబెట్టిన
సతిసతియేయనదుగాగ ననునిప్పాటన్. 181

ఆ. వె. ఇట్లుబలుకువాని నీక్షించిచూచితిఁ
గుఱుచవాఁడు బాహుకుండనంగ
వెలయువాఁడు నలునిమెలుఁగింతయేకాని
కాఁడువాఁడునలుఁడు కమలనయన. 182

వ. అని చెప్పి యతండరిగిననంతరంబ దమయంతి బాహుకుండు నలుఁడుగానోపు నేమిగతంబున గుజ్జయ్యెనోయని తలంచి వానివచ్చుట కుపాయంబుఁజింతించి యొక్కని రావించి నీవయోధ్యానగరంబునకరిగి వైదర్భి పునస్స్వయంవరం బెల్లియని ఋతుపర్ణమోళిఁ బల్కుమని తండ్రియనుమతింబంచిన వాఁడట్లనిచని పలికె నయ్యవసరంబున. 183

చ. అదివిని బాహుకుండు మదినచ్చెరువందుచు నిట్టికార్యముల్
పొదలుటయేల కల్గుననబోఁడి సురాదులనిచ్చమెచ్చకన్
గదననుఁడావరించె వినఁగాఁదగునై నను నమ్మవచ్చునే
ముదితలచిత్తవృత్తి సురముఖ్యులకైన నటంచునున్నెడన్.

క. ఋతుపర్ణుండచటికిఁజను
కుతుకంబునవేగ బాహుకునిస్యందనముఁ
జతనమ్ముసేసి తెమ్మన
నతఁడట్లయొనర్చి యరదమచటికిఁదెచ్చెఁ. 185

ఉ. తెచ్చినఁజూచిబాహుక! యదిత్వరితంబుగనేఁగ నేర్చునే?
చెచ్చెరసీహయంబులు గృశించినచాడ్పున నున్నవియ్యెడన్
హెచ్చగువారువంబుల నహీనజవంబులు గల్గువానిఁగా
మచ్చికఁబూన్పునావు డనుమానవనాధుని తోడనత్తరిన్. 186

క. ఈగుఱ్ఱంబులుమారుత
వేగంబుననరుగుననినవిని విభుఁడుమనో
రాగంబునతేరెక్కెను
బాగుగబాహుకుఁడుహరులఁ బరువిడిఁదోలన్. 187

వ. ఇట్లు చనుచున్న సమయంబున ఋతుపర్ణు నుత్తరీయంబు నేలంబడిన దానిం గైకొనుటకు రథంబు నిలుపుమనుడు యోజనశతం బరుగుదెంచితిమి మగిడింపవశంబుగాదని చెప్పిన బాహుకుని సారథ్యంబునకు విస్మయంబందుచు నీయశ్వహృదయంబు నాకుపదేశింపుము నీకు నక్షహృదయంబును బర్ణంబుల సంఖ్యయుం దెలియుటయుం జెప్పెదునని యగ్రభాగంబున నొక్క కలిదుమ్మంబుఁగాంచి యీవృక్షంబున కిన్నిశాఖలుసిన్నిదళంబులు నని చెప్పిన నలుండరదంబుడిగ్గి తద్వృక్షంబుఁ బడద్రొబ్బి శాఖాపర్ణంబులుగణుతించి ఋతుపర్ణుండు చెప్పిన యన్నియైన వెరగుపడి నతనివలన నావిద్యలంగ్రహింప నక్షహృదయ పాఠంబునం జేసి యంతర్గతుండైన శనివెడల వేఁడిన మన్నించి తాడియందు వసిం

పుమని యనుజ్ఞసేసె. దిమొదలుగాఁ దాఁడిస్పర్శ్వాహ్నంబుగా దయ్యెఁ దదనంతరంబ వారలచ్చోటుఁబాసి రయంబున విదర్భనగరంబుఁ బ్రవేశించి రాజమార్గంబున బఱతెంచునెడఁ దద్రథరవం బాకర్ణించి వైదర్భియు నలుని రథంబుగా నోపునని సందియం బందుచుండె. భీమరాజు ఋతుపర్ణు నెదుర్కొని పూజించియు చితప్రదేశంబున విడియించెనంత 188

క. బాహుకుఁడు నొక్కఁ గేవన్
వాహంబులఁ గట్టియంతఁ బాపికొను మఁదా
నూహించెను రాజులస
న్నాహము గనఁబడదు పట్టణంబుననుచున్. 189

వ. అంత. 190

క. దమయంతియుఁ గేశినియును
గమలేక్షణననిచి వానిక్రమమెల్లను వే
గమ తెలిసి వానినలుఁగా
నమరఁగ భావించి సుతులనచటికిఁ బనిచెన్ 191

ఉ. వారినిఁ గౌఁగిలించి మదివంతను బాహుకుఁడశ్రువుల్ రయం
బారఁదొరంగఁ జేయఁగని యత్తరిఁ గేశిని బల్కె వానితో
నూరక యేడ్వనేల ? యిటులొక్క నిమిత్తములేక నావుడున్
ధీరులు నాదుబిడ్డల గతింగని నొచ్చెద నింతి ! కేశినీ ! 192

ఆ. వె. అనుచుఁదప్పఁ బల్కనదియంత వైదర్భి
కెఱుఁగఁజెప్పనతని మొసఁగుచిన్నె

నిషధపతియుకాఁగ నిశ్చయింపుమవాని
తోడఁదేరఁబుచేదోయజాక్షి. 193

వ. ఇట్లురావించి యతనికిట్లనియె. 194

మ. తగునే?యొంటి మహాటవింగరుణ డిందంబాదులే కెంతయుం
దిగనాడన్ భవదీయపాదతలముల్ దిక్కంచునున్నట్టి న
న్నగువన్ మానవనాథ ! పౌరుషమె నిన్నర్హింపనా పూర్వజ
న్మగతంబట్టులనుండఁ బోలునని వేమారింతదుఃఖించినన్

చ. కులసతిఁజూచి పెల్లడరు ఘోరవిషాదము మానసంబు లో
పలదరికొన్నడగ్గుతిక పల్కనఁబల్కఁగ నోడిమెల్లనన్
దెలివివహించి నైషధుఁడు తేకువనాసతిఁజూచి పల్కెనో
నెలఁతుకనీకుఁబాడియగునేకద క్రిమ్మరఁబెండ్లియాడఁగన్.

గీ. నన్నుదూరుదు వింతియు మిన్నకేని
నిన్ను నీవెట్లు నడిఁబెట్ట నేర్తువబల
పరులదోషముభావింపఁ బయలువడెడు
నాత్మదోషానపస్మృతి యనుటనిజము 197

చ. అనుటయుగాంతయిట్లనియెయక్కట యేనొకయన్యుఁగోరఁగా
ననుచితవృత్తియానునిషధాధిప!నీవిటకేఁగుదేర ని
ట్లొనరిచితిన్ స్వయంవరమునోజను నీచరణంబులాన యా
యినశశిపంచభూతములు నిందరుసాక్షిగ నమ్ముమెమ్మదిన్ 198

క. అని చెలిబలికినయంతన
వినబడియెను బంచభూతవితతి సుభాషల్

మనుజేశ ! నిజము నిజమా
వసితనుఁ గైకొనుము శీలవతియనివేగన్ 199

ఉ. అంతనలుండు నెమ్మది మహాహిఁ దలచిన నాత్మరూపముం
సంతసమొప్పనొప్పెదనజాయనుఁ గైకొని యుత్తమాము ల
త్యంతసుఖంబుఁ జెందిమది హర్షము దోఁడుతనుండె భీముచే
నెంతయుఁ బ్రీతుఁడై పురికినేఁగె నొగిన్ ఋతుపర్ణుఁడయ్యెడన్

వ. తదనంతరంబ నలుండు సపరివారుఁడై పుష్కలుచాలికింబని ద్యూతంబును రణంబును నెద్దివలతుదానిఁ గోరుము దమయంతినిఁ బణంబుసేసియొడ్డుదుననిన వాఁడుమన్న జూదంబున గెల్చినవాఁడుగావున రాజ్యంబొడ్డి నెత్తంబాడినవానిం బరాజితుంజేసి పంపఁ దూర్ణయగు ధరిత్రిఁ గెలిచికొని దమయంతీ సహితుఁడై సుఖంబు లనుభవించుచుఁ బ్రజాపాలనంబుసేసె నలదమయంతీ ఋతుపర్ణ కర్కోటకులఁ బేర్కొన్న కలినాశంబగునని చెప్పి నీవును దత్ప్రకారం బనుభవించెద వతిప్యాదయంబు గైకొనుమని యుపదేశించి బృహదశ్వుండరిగిన నంతఁ గౌంతేయుల పాలికి నారదుండువచ్చి పూజితుండై ధర్మజునభిమతంబుగాఁ దీర్థమాహాత్మ్యం బెఱిఁగించి యిందుఁ బంపున రోమశుండు రాగలఁ డమ్మునితోడ ధౌమ్యసహాయుండవై తీర్థసేవసేయుమని యానతిచ్చి నారదుండు చనియె వెండియు రోమశుం డజాతశత్రుని కడకేఁగుదెంచి ఫల్గునువృత్తాంతంబు చెప్పిన సంతసిల్లి యర్జును వచ్చునంతకుఁ దీర్థసేవ సేయుదమని సానుజుఁడయి ధౌమ్యరోమశప్రభృతులతోడం జని తీర్థంబులాడుచు నయ్యైమహాత్వంబులు రోమశువలన నెఱుంగుచు దానములచే భూసురులఁ దృప్తులంజేయుచుఁ బోవుచు నగస్త్యాశ్రమంబుఁ బ్రవేశించి రోమశునకు ధర్మజుఁడిట్లనియె, 201

క. వాతాపినిఁ గుంభభవుం
డేతెఱఁగునఁ జావెనది మునీశ్వరనాకుఁ
బ్రీతియగు వినవలతునన
నాతనికమ్మౌనివర్యుఁడనియెన్ నెమ్మిన్ 202

క. వినుకురునాయక ! కుంభజుఁ
డనయము ప్రథమాశ్రమంబునందుఁ దపంబుల్
ఘనముగఁ జేయుచు భవియం
దునుగ్రుమ్మరు చుండునెడ నెదురనొకచోటన్. 203

క. తరుశాఖను దలక్రిందుగఁ
బరగెడు వారలకుఁ గుంభభవుఁడిదియేలా
కరము భరంబుగ నుండను
వరుసం దెలియంగఁ జెప్పవలయున్ మాకున్. 204

వ. అనియడిగిన వారలయ్యా మేము నీపితరులము నీవ
పత్యంబుఁ బడయకుంట నంతకు నిట్లుండి సంతానపరుండవై నను
గతించనుదుమని చెప్పినవిని యగస్త్యుండు పశ్చాత్తప్తచిత్తుండై విదర్భ
రాజుపాలికింజని యతని పుత్రియైన లోపాముద్రం బరిణయంబై
నిజాశ్రమంబునకేతెంచి దానింగవయనమకట్టిన నదియిట్లనియె.

సీ. మునివర్య ! భూవణమ్ముల నన్నుఁగై చేసి
కలసినయుత్తమ కార్యమనుడు
నతఁడు ధనార్థియై యపుడు శ్రుతశ్రవు
పాలికిఁజని వానిపసిఁడి యడుగ
జాలము ధనము లేశము వేద వాస్తుని
నడుగుదమని యిర్వురరిగి యచట

నల్పమై తోఁచిన నమ్మునివ్వరుని గూడి
మణిమతిపురికి నెమ్మనినిఁ బోయి

సీ॥ యిల్వలుని దుర్నయ స్థితియెఱిఁగి యెఱుక
లేనిగతినుండి వాఁడిచ్చుమానితంపు
పూజఁగొనియతిథియుఁగాన భోజనంబు
సేయుదునటంచునుండె నిశ్చింతుఁడగుచు. 206

వ. ఇంత నిల్వలుండు దనతమ్ముండగు వాతాపిని విశసించి యగ
స్త్యునకుం బెట్టిన నతం డాక్షణంబ వానిఁ జీర్ణంబుగాఁగొనియె. నిల్వలుం
డును సహోదరుండును దొంటికరణి ముని యుదరంబు ఛేదించి
వెడలక మృతుండయ్యెనని తలంచి గర్భాదానంబు నొసంగిన దా
నికిఁ గుమారుం డుదయించెనని చెప్పిన విని సంతుష్టహృదయుండై
యుధిష్ఠిరుండు వెండియు మైత్రావరుణి మహత్త్వంబు వినవలతు
దెలుపుమనిన రోమశుండిట్లనియె. 207

క. అతిబలులు దనుజవర్యులు
కృతయుగమునఁ గలరు గాలకేయులనఁగ వా
రతిశయగతి వృత్రసమా !
హితులై సురవరులఁ దోలిహింసించు నెడన్. 208

క. సురలరిగి బ్రహ్మఁగని తమ
పరిభవమెఱిఁగింపఁ దివిభర్తలకు ననం
తర కార్య మెఱుఁగఁ జెప్పినఁ
బరమేష్ఠిని వీడుకొని సువర్వులు నెమ్మిన్. 209

చ. అనువగుచుఁ సరస్వతీతటాంతమునం దపమాచరించు నా
ఘనుని దధీచిఁగాంచి నిజకార్యముఁ జెప్పిన సంతసించుచుఁ
దనువు దొఱంగియిచ్చెముని తద్దయు నెమ్ములుద్రచ్చి వాని నె
ల్లనుఁగొని రాయుధంబులుగ లావు జెలంగఁగ వేల్పులమ్మెయిన్

సీ. త్వష్ట్రియు వజ్రాయుధము దేవపతికిచ్చె
దానిచే వృత్రునితనువుఁ దునిమెఁ
గాలకేయు లసురగణములు నవిరేఁగి
తునుమఁగఁ జొచ్చిన దనుజులోడి
పఱచి పయోధిలోపలడాఁగి రెట్టె నఁ
గడఁకచే లోకముల్ గలఁపుచున్న
సరసిజాక్షోపదేశమున గీర్వాణులు
కుంభసంభవుఁగని కోర్కెలర

గీ. మ్రొక్కి దనుజులచేగల్గు మోసమెల్ల
జెప్పి ముని వింధ్యగర్వంబుఁ దప్పనడచి
మనుష్య లోకము రక్షించి మసలినట్టి
నిప్పడియ్యాపదను బాపి యెనయవయ్య! 21

వ. అని వేల్పులు ప్రార్థించిన నగస్త్యుండును సముద్ర
జలంబు నశేషంబుగాఁ బానంబుసేసె. సురలును కాలకేయులు
గోచరులగుటఁ జేసి రణమునఁ బరిమార్చి వోడంగిన హతశేషు
లగుదైత్యులు పాతాళంబుదూరిరని చెప్పిన ధర్మజుం డిట్లనియె.

శి. జలరహితంబగు జలనిధి
జలపూర్ణం బెట్లుబయ్యె సాగరమునగాఁ

గలుగుట యెట్లగు నాకుం
దెలుపుమనుడు మౌని యా యుధిష్ఠిరుతోడన్. 213

ఆ. వె కుంభజుండు దాన కూపారమొప్పటి
కరణి నింకఁజాల కరుగుటయును
వినఁగఁబూర్ణమగుట విదితంబుగా బ్రహ్మ
చేతఁదెలిసి సురలు ప్రీతిఁజనిరి 214

చ. సగరుఁడనంగనొప్పు నృపసత్తముఁ డొక్కఁడపత్యహీనుఁడై
యొగిఁదుహినాద్రిపై యువతి యుగ్మముతోడఁదపంబుజేయఁగా
భృగుముని వచ్చి యాతని కభీష్టముగా కులకర్త నొక్కనిన్
మగువ యొకర్తుకొర్తుకు కుమారుల షష్టిసహస్రసంఖ్యగన్.

వ. ఇట్లు ప్రభవింతురని వరంబిచ్చి చనునంత. 216

క. అయ్యెడ సగరుఁడు నగరికి
నొయ్యన నేతెంచె సతులు నొసరగఁ బతిచేఁ
జయ్యన గర్భక్రమములు
నెయ్యంబునఁబూని నెలలు నిండినయంతన్. 217

వ. అగ్రమహిషి యగు వైదర్భియందున సమంజసుం డను సుతుండుబుట్టెఁ గనిష్ఠపత్నియందుఁ దుంబఫలం బొక్కటి యుదయించిన దాని నాకాశవాణి యుపదేశంబునఁ దైల ఘటం బులంబెట్టి రక్షింప నరువదివేవురు జనించి రంత నా సమంజసుండు దుష్టవర్తనుండైన వాని నడవికివడచి తత్పుత్రుండగు నంశుమం తుఁగైకొని సగరుండు నశ్వమేధంబు సేయునెడ మఘవుం డమ్మ ఖాశ్వంబుఁగొని చనిన దానిం గానక సగరాత్మజులు ధరాచక్రిద

శనంబుజేసి పాతాళంబున కపిలు సమీపంబున యజ్ఞ హయంబుఁ
గాంచి ముప్పిరిగొని తొంగొంటి రండు రండని ఘోషించిన మునిరోషించి
యయ్యఱువదివేవురం దగ్ధులంజేసిన. 218

క. అసమంజస తనయుని సొం
పెసగంగా నంశుమంతు నీక్షించి తగన్
వసుదేవుఁడనిచె వత్సా!
వెసఁగుఱ్ఱముఁ దెమ్ము రమ్ము వేగమ యనినన్. 219

చ. జనకులు మున్నుజన్న పెనుజాడను వేడుక నంశుమంతుఁడున్
జని చని తత్కృతప్రథిత చాపధరాతల ఘాతమయ్యెడన్
గని యనువంద నందగిరి కాంచె సముంచిత యజ్ఞవాజి చెం
తను గపిలాగ్రహోగ్ర శిఖిదగ్ధ పితృవ్రజ భస్మరాసులన్.

క. కనిదుఃఖింపఁగ గరుడఁడు
చనుదెంచి మహాత్మ నీదు జనకులనెల్లన్
ఘనమగు సద్గతిఁ జేర్పఁగ
నినఘా! స్వర్గంగవలయు నని చెప్పటయున్. 221

చ. గరుడనిచేతఁదెల్పబడి క్రిందుదలంగియునధ్వరక్రమం
బరసితదర్థమేగి మఘవాశ్వము దాతకుఁదెచ్చియిచ్చినన్
సరభసవృత్తినధ్వరము సల్పి కృతార్థతఁజెంది ధాత్రియుం
గరమరుదారనేలి దివి గానఁజనెన్ సగరావనీశుఁడున్. 222

గీ. అంతఁదనబితామహునియట్ల జగతి
నేలి పుత్రునిదిలీపు నా వృథివినునిచి

దివికిఁ జన నా దిలీపుఁడు దివ్యతటినిఁ
దెత్తుఁ గని పూని యాస్థచేఁ దివురు నంత. 223

చ. అతనికిఁ బుత్త్రుఁడై యెసఁగునట్టి భగీరథుఁ డుందపంబుఁ బో
ద్ధితగతి నాచరించినను దివ్యతరంగిణి మెచ్చి ధాత్రికిన్
విదితముగా గడిగ్గి కడు వేడుకతో సగరాత్మజాళి భ
స్మితతుల మీఁదుగాఁ జనిన స్వర్గముఁ జెందిరి వారలందఱున్. 224

వ. సగరుండు దాన పుత్త్రశోకంబుడిగి సుఖంబున నుండె సగరు
నకుఁ బుత్త్రుండనం బరఁగి సాగరుండయ్యె నని, యగస్త్యమహా త్మ్యం
బును గంగావతరణంబును భగీరథచరితంబును జెప్పిన ధర్మజుం డనుజ
సహితుండై యరిగి నంద యను నపరనంద యను మహానదులఁ గృతస్నా
నుండై చనుచు రోమశువలనఁ బుణ్యవనములును బుణ్యక్షేత్రంబు
లును బుణ్యాశ్రమంబులును నెఱుంగుచు దేవఋషులు యజ్ఞంబు
సేసిన పుణ్యతీర్థంబుల స్నానంబుచేసి విశ్వామిత్రుని యాశ్రమం
బుఁ గాంచి ఋష్యశృంగ హ్రదంబు దర్శించి ఋష్యశృంగచరితంబు
వినఁ గోరిన ధర్మజునకు రోమశుం డిట్లనియె. 225

సీ. వినుతొల్లి కశ్యప తనయుఁడైన విభాం
డకుండను మునియు నఖండమైన
తపము సేయుచు నొక్క తటినిసరోవరమున
జలములనాడు తత్సమయమునను
దవరనూర్వశి వచ్చినను దానిఁ గని ముని
వీర్యంబు నీటిలో విడుచు నంత
నవ్వుడు తజ్జలముల నందున్న మను బిడి
శుక్రమిశ్రజలంబు సొరిది ద్రావ

గీ. గర్భమైపుత్త్రిఁ డుదయించఁ గాశ్యపియును
దచ్ఛిశువుఁగాంచుచునువేడ్క దనరఁబెంచ
శమియుతపమూనితఁడ్రి యాశ్రమమునందు
నన్యమెఱుఁగకయుండెతా నటఁదపస్వి 226

వ. అంత. 227

క. అంగక్షితిపతి బ్రాహ్మణ
పుంగవునకుఁగీడుబల్క పుట్టెనుదానన్
సంగతిఁమాన్పగమేదిని
నింగలవరఋష్యశృంగు నింగొని తేరన్. 228

చ. పలుపురవారకాంతలను బంచినఁదత్సుతులేఁగుదెంచియు
జ్జ్వలుఁడగునమ్ముని ప్రవరువాసముచెంగట మాధురీధురీ
కలనఁజెలంగు కంఠములఁగానముచే మనముంగరంచ సొం
పలరెడువారిఁగాంచి మునులంచు సముంచితపూజలిచ్చియున్.

ఉ. ఎచ్చటితాపసోత్తములో యేమునిసెప్పెను యిట్టివేదమున్
మచ్చికనాకుఁజెప్పఁడవి మంచివిమీరుధరించు వల్కముల్
తెచ్చితిరెచ్చటో మిగుల దేజరిలున్ భసితంబువాసనన్
బెచ్చుగుబెట్లు మీతులసిపేరుల మద్వపుఁగాంతుబొప్పెడిన్.

క. శిరమునఁబుట్టెను కొమ్ములు
నురమున మీకిట్లు బుట్టు టూహింపంగన్
పరమేశ్వరుగరుణగదా
గరమున మీకేలవాని కప్పెదరటులన్. 231

ఆ॥ వె॥ అనుచుముగ్ధభావ లాతపోధన
పుత్త్రికునకువా రపూవములనో

సంగవానిసమలి పొంగితుతండనె
మధురమైనవిప్పి మహాసగలవె. 232

ఉ. వృంతవిహీనముల్ మధురవీచి రసోచితముల్ సలంప న
త్యంతమనోజ్ఞముల్ ఫలములందు నొకందును బీజముండదే
వంతనుగన్గొనిట్టివియపారరుచిం జెలువొందునొర నా
కెంతయుఁబ్రీతిదంబులన నించుకభీతిలియేగిరందఱున్. 233

వ. వారు దన్నుమెఱఁగిచనిన ఋష్యశృంగుండును దదీయ
వియోగంబున నున్మత్తుండుబోలె వనంబున గ్రుమ్మఱుచు, నగ్ని
హోత్రంబువేల్వక మఱచి విపరీతబుద్ధియైయున్న నంత విభాండ
కుండు వన్యఫలమూలంబులుగొని యాశ్రమంబునకువచ్చి పుత్త్రు
విధంబెఱింగి యిదియేమి యిట్లున్నవాఁడవనిన నతండిట్లనియె. 234

సీ. బ్రహ్మచారులు తపఃపరిపూర్ణులొకకొంద
ఱిచ్చటికివచ్చి యింతతడవు
నింతగా వేదంబువినిపించిఫలములు
నొసఁగియేగినఁదద్వియోగమునకు
మదిచింతఁదలకొనినదియనుడాత్మజు
బోధించి జనకుండు బుద్ధిగఱప
మదిఋష్యశృంగు డుమ్మలికము మానెనా
మఱునాఁడు నెప్పంటిమాడ్కిచెలులు

గీ. వచ్చినను జూచి మునిపుత్త్రుఁ డిచ్చమెచ్చ
వారివలలకులోఁబడి వచ్చినంత
నంగదేశమునకు వృష్టు లలరఁగలిగె
నృపతి దనకూఁతు నతనికి నెమ్మినిచ్చె 235

వ. అంత విభాండకసుతుండు కొడుకుంగానక రోయుచు నంగదేశంబున కేతెంచి రోమపాదునొద్ద దీప్తాగ్నియుంబోని తేజంబున బ్రకాశించు సుతునింగాంచి ప్రీతుండై కొడుకుం గోడలినిఁ దన యాశ్రమంబునకుఁ గొనిపోయి సుఖంబుండె నని చెప్పిన వినుచు సాగరతీరంబునఁ జేరి కళింగదేశంబున వైతరణిస్నానం బాచరించి తత్ప్రభావంబుఁ దెలియుచు మునీంద్రా! భవత్ప్రసాదంబున నిన్నదీస్నానంబున సకలలోకంబులుగాపంబడియెనని రోమశు నగ్గింపుచు నగ్రదేశంబున స్వాయంభువుండను విశ్వకర్మయాగంబుజేసి పుడమిఁ గశ్యపునకు దక్షిణగా నొసంగిన నద్దేవి కోపించి రసాతలంబున కేఁగినఁ గశ్యపుడు చింతించి యుగ్రతపంబు సేసిన వసుమతి ప్రసన్నచిత్తయై వేదిరూపంబునఁ బొడసూపిన వేది యిదియని రోమశు వలనఁ దెలిసి సంతసిల్లుచు మహేంద్రగిరికరిగి యచ్చటిమునులఁ బరశురాము నెప్విధంబునఁ గాంతుమని యభ్యర్థించిన జమదగ్ని శిష్యుండైన యకృతవ్రణుండు ధర్మజున కిట్లనియె. 236

క. రాముఁడు మీరిట వచ్చుట
దామును విజ్ఞానదృష్టిఁ దద్దయుఁ దెలిసెన్
సోమాన్వయ! నీవెల్లియ
యామహితునిఁ జూడఁగలవు హర్షముతోడన్ 237

గీ. అనుచుఁ బల్కిన నారాత్రి యచట నిలిచి,
పరశురామచరిత్ర మేర్పడ వినంగఁ
గౌతుకముఁ జెందు పాండవాగ్రజునితోడ,
నింపుమైన నకృతవ్రణుం డిట్టులనియె. 238

సీ. అనఘ! కన్యాకుబ్జమున గాధి కూ
తురై తగు సత్యవతిఁ గోరి భృగుసుతుండు
రుచికుఁ డర్థింప నుచితస్థితిని గాధి
పలికె శుభ్రాశ్వముల్ కలితకర్ణ
మొక్కటే నల్లనై యొప్పుగుఱ్ఱంబులు
నొప్ప సహస్రంబు నోలి యొసఁగి
కొమ్మన్నఁ బరిణయము కుతుకంబు చేమాని
వరుణుండ్రిలను గాంచి హరులఁ దెచ్చి

ఆ. వె. గాధికిచ్చి కన్యఁ గైకొని పెండిలి
యాడి యచట శుభము లతిశయిల్ల
ననుభవించుచున్న తనయునిఁ గోడలి
జూడవచ్చి భృగుఁడు స్నుషనుఁ జూచి. 240

వ. అక్కన్నియవలనఁ బ్రీతుండై యిట్లనియె. 241

ఉ. కోమలి! నీగుణావళులకుం గడు మెచ్చితి నిష్టమిచ్చెదన్
మామకశక్తిచే ననిన మామకు నిట్లను దేవపుత్రికన్
ధీమహితాత్మునాకొకని తేజముఁ గాదన తల్లికొక్కనిం
బేర్మి నొసంగుమన్నఁ గడుఁ బ్రీతిగ నిట్లను మీరు శుద్ధితోన్.

ఆ. వె. నీవు మేడితరువు నీతల్లి యశ్వత్థ
తరువుఁ గౌఁగిలింపఁ దగునటంచుఁ
దపసి బల్కె వారలవుడు విపర్యయ
స్థితులఁ గౌఁగిలింప నతఁడు దెలిసి. 243

క. సతి నీకును బ్రాహ్మణకుల
సతతశ్రేష్ఠుండు బుట్టె క్షత్రాచార

స్థితిఁగనుసీజననికిన్నృపుఁ
డతులుఁడుఁగల్గియుచు బ్రాహ్మణాచారుఁడఁగున్. 244

వ. అనిన సత్యవతి నమస్కరించి దేవా! క్షత్రాచారంబు పుత్రునందుఁ గాక పౌత్రునికిఁగాఁ బ్రసాదింపుమని ప్రార్థించిన భృగుండట్ల కానిమ్మని చనియెనంత సత్యవతియు గొండొక కాలంబునకు జమదగ్నియను కొడుకుం గనియె. నాజమదగ్ని ప్రసేనజిత్తుకూఁతు రేణుకయనుదానిఁ బాణిపీడనంబుగాఁగొని రుమణ్వత్సుషేణ విశ్వావసు రాములను వారి నల్వురసుతులం గాంచి వనంబునఁ దపంబు సేయుచుండ నొక్కనాఁడు వన్యఫలంబులకుఁ గొడుకులరిగిన రేణుకయు వారి పిఱుందనచని సభార్యుండై జలవిహారంబుసేయు చిత్రరథుండను రాజుఁజూచి రేణుక మోహితాత్మికయై వానిం బొందిననది జమదగ్నియెఱింగి దానిఁ జంపుటకుఁ దనయులఁగ్రమంబున నియోగించి వారొడఁబడమికి నలిగి ముప్వురకు శాపంబిచ్చి వెండియుఁ బరశురామునిఁ జూచి యిట్లనియె. 245

క. ఇదిదుశ్చారిణిరామా!
మదినొండు విచారమెడలి మత్ప్రియముగ నీ
వదయతఁ జంపుము నావుడు
తదాత్మజుఁడు పరశుధారఁదల్లినిఁ దునిమెన్. 246

చ. తనయునిసాహసంబునకుఁ దద్దయుహర్ష దయాద్భుతంబులున్
మనమునముప్పిరింగొనఁ గుమార! వరంబులు గోరుమిత్తుఁ దా
ననవుడుఁ తల్లిజీవితము నాత్మసహోదర శాపమోచనం
బునుదగవేఁడరామునకుఁ బొందుగనట్ల యొసంగిమౌనియున్.

క. మఱియును దీర్ఘాయువున్నతి
బురకరణాంగణ జయంబులొందఁ బవిత్రిన్
నరికిన దురితము వాయును
దరచు వరంబులును బొందఁగా నెవ్వఁడున్ గతిఁ గుఱ్ఱా. 248

వ. అంతఁ గొంతకాలంబునకు. 249

సీ. వేఁటవేడుకఁ గార్తవీర్యుండు జనుదెంచి
జమదగ్ని యాశ్రమ స్థలముఁ జెంది
యతనిచేఁ బూజితుండయ్యును నిజరాజ్య
మదమున మునివర్యు మొదవుఁ బట్టి
కొనిపోవ నంతయుఁ గుశసమిత్ఫలములు
గొనివచ్చినట్టి రామునకు గురుఁడు
జెప్పిన యామాటచేఁ గోపవేగముల్
బెరఁగొన రాముఁడు పేర్చి యరిగి

ఆ. వె. కార్తవీర్యుఁ గిట్టి కలనఁ దన్ను బాహు
గరసహస్రమును విఖండనంబుఁ
జేసి పరశుధారచే నసువులు గొని
యావుఁ దెచ్చి తండ్రి కప్పగించె. 251

వ. అంత 252

చ. తలకక నొక్కనాఁడు జమదగ్నిని రాముఁడు లేమిఁ గాంచి దు
ష్టులు కృతవీర్యసూను తనుజుల్ వడిఁ బట్టి వధించి రార్తుఁడై
పలుమఱు రామ రామ యని బమ్మెరపోవఁ గృపావిహీనులన్
దలఁపఁగ నీదు మచ్చరము తద్దయు నొందు విచారమొందులన్.

క. అంతటవన్యఫలంబులు
గాంతారమువలనఁగొంచుఁ గమరయమున రా
నంతయుఁ జెప్పెనురేణుక
వంతంబడి కొమకతోడ వందుర నతఁడున్. 253

గీ. రాముఁడప్పుడుక్షత్రి విరాముఁడగుచు
మనుజపతులనుముయ్యేడు మారులడచి
యవనినక్షత్రముఁగజేసి యస్త్రములను
సమ్మదమ్మునఁబితృతర్పణమ్మొనర్చె. 254

ఆ. వె. జన్నమొనరఁజేసి సకలావనియుఁగశ్య
పునకుదక్షిణయును బూనియిచ్చి
యిమ్మహేంద్రశిఖరి నెసఁగఁదపోవృత్తి
చే వసించెనంచుఁ జెప్పె మౌని 255

వ. ధర్మజుం డను నకృతవ్రణుచే నంతయునెఱింగి పురోహితాది సకలజనంబులతోడ రాముందర్శించి పూజించి యతని మన్ననఁబడసి వీడ్కొని దక్షిణాభిముఖుండై చనుచు దక్షిణగంగ యన నెసంగు గోదావరియందు స్నాతుండై దానంబులాచరించి ద్రావిళదేశంబున నగస్త్యతీర్థంబాడి సముద్రతీర్థంబునఁ బ్రభాసతీర్థంబునకుఁ జని నియమవ్రతుండగుచు నచ్చటికిఁ దనవచ్చుటెఱింగివచ్చిన రామ కృష్ణ సాత్యకిప్రముఖ యదువీరుల నుచిత సల్లాపంబులఁ దనివిదీర్చి వారి వీడ్కొని పోవుచు రోమశువలన దత్తత్స్థలప్రభావంబులు దెలియుచు వైడూర్యపర్వతంబుఁజూచి యచ్చట సంయాతి యజ్ఞస్థలంబందు నతని తనయ సౌకన్యకను చ్యవనుండు వివాహమై నిలింప పతిపెంపుగణింపక నశ్వినులకు

హోమంబిచ్చెననిన నోమశునకు నదియెట్లని ధర్మజుండడిగిన మునీం
ద్రుం డిట్లనియె. 256

సీ. ఈసరసికిఁ జెంత విమ్మగాఁ జ్యవనుండు
దపమొనర్పంగఁ దత్తనువు గ్రిమ్మి
బుట్టఁ బెట్టినలతల్ జుట్టిగుల్మంబుపైఁ
బరఁగిసతరిసతుల్ బలసికొలువ
సంయాతియావన స్థలమున విహరింప
నతనికూఁతురుసుకన్యకయునంగఁ
జెలఁగుబి త్తరితన చెల్మికత్తియలతోఁ
జనుదెంచి వల్మీక సంగతమున

గీ. మెరయుమిణుఁగురులను రెంటి మొలతఁబట్టి
తమకపడఁ గనుమూసె నత్తాపసుండు
బాలయాపుట్టఁ ద్రివ్వించి జయలుబరప
నలిగి చ్యవనుండు సంయాతిబలమునకును. 257

క. మలమూత్రిబంధనముగాఁ
దలపించినరాజునవుడు దలకుచునుండన్
లలనయు జనకున కెఱుఁగం
బలికెను దాఁ జేసినట్టి పనికోయనుచున్. 258

క. చెప్పినచ్యవనునిఁగని పతి
తప్పిదిసైరింపుమనుచు తాపసుఁడను దా
నప్పాఁలతి నాకునిచ్చిన
నెప్పటిసుఖమబ్బుననిననిచ్చె నతండున్. 259

గీ. ఇట్లుకన్నియనిచ్చి భూమీశ్వరుండు
బలనిరోధంబుమాన్చి సబ్బాలచ్యవనుఁ
జేరిపతిభక్తిచేఁగను చెలఁగునంత
నొకనాఁడశ్వినులువచ్చి యువిదకనిరి. 260

క. వనితా! ముదుసలి మగనినిఁ
గొని నీకును సుఖము నిన్నుఁగొని యాయనకున్
గనుపింపదును వె మోదము
వినవే వృద్ధునకుఁ దరుణి విషమనుపలుకుల్. 261

క. కావునఁ జ్యవనుని విడువుము
దేవసదృశునైనఁగోరు తెత్తుముభువిలో
భావింపు నీదు జవ్వన
మీవిధమున రిత్తవోవ నేలాయనినన్. 262

క. అపలుకుల కది కోపో
ద్దీపితయై పతికిఁజెప్ప ధృతమతి నాతం
డాపగిది నియ్యకొనుమని
రూపించిన సతియువరుని రోయుచునుండున్. 263

వ. సుకన్యకా వాక్యంబు లాదరించి వేల్పు వెజ్జు లమ్ము
దుసొచ్చిన భార్గవుండు వారితోడం వారింగ్రింకి యిట్లమ్మ
వ్వరు వెడలి తేజోమూర్తులై యొప్పి తమయందొక్కని వరింపు
మనిన నక్కోమలి చ్యవనునివరించె, నంత నశ్వినులు దత్పతివ్ర
తానుగుణంబునకు మెచ్చిరి. మునివరుండును వారివలనఁ దరుణుం
డయ్యె గావునఁ బ్రీతుండై సంయాతి జన్నంబున నశ్వినులకు
సోమంబిచ్చిన సురపతియును వేల్పు వెజ్జులు సోమార్హులు గారని

కలుషించి భార్గవుం జంప వజ్రం బెత్తిన నతండును వజ్రకలిత భుజాస్తంభనంబుఁ జేసి కృత్తిఁ నుత్పాదింప నది శతుఁ గబళింపఁ బూనిన వేల్పులేఁడు చ్యవనుఁ బ్రార్థించి తద్భయంబునఁ బాసి చనిరి. నదిగోలె నశ్వినులు సోమార్హులై దినంబునకుఁ జనిరి. భార్గవ తపః ప్రకారంబునంజేసి యిది యార్చికపర్వతంబనం బరగెనని చెప్పి యాకొలన జలంబులాడి చనుచు యమునాతీరం బుదర్శించి రోమశుండు వెండియు నిట్లనియె. 264

సీ. అనపత్యుఁడై యువనాశ్వుఁడు భృగునిచే
వెలిమి బెట్టింప గ వేగపూర్ణ
కలశ మాగుండంబువలన వచ్చిన నీరు
తనపత్నికొసఁగక ఘనపిపాస
చేఁ దావ గర్భంబుఁ జెంది నూరేండ్లుగాఁ
గ్రక్కునఁ బార్శ్వంబు వ్రక్కలించి
యర్భకుఁడుదయింప నవుడిందుఁడే తెంచి
మాంధాతయనెడు నామంబొసంగి

గీ॥ సంస్మరించినయంతన సకలవిద్య
లభ్యసించినగతిఁ బొందె నతనికెలమి
ధాత్రి పెంపొందె నట్టి మాంధాతృయజ్ఞ
భూమి యిదియూవె కురుసార్వభౌమ! కనుము. 265

క. ఇదియుఁ గురుక్షేత్రము న
మ్మిదియు సరస్వతియు దీని యిక్కను మఘవిం
పొదవఁగ సోమకుఁడను న
మ్మదముసఁగావించి యొక కుమారునిఁ గనియెన్. 266

చ. మఱియొకనాఁడు డోలికనుమానుగ నిద్రితుఁడైన పట్టి యు
చ్చిఱుతనిఁ జీమగుట్టినను జెచ్చెర వేదననొంది వేగ వాఁ
డఱచినఁ దత్సవిత్రులు ముదగ్రత నెక్కటి రోదనంబులం
బఱచిన నంతసోమకుఁడు బాలునిపోరుసుపంగఁ జేసియున్.

క. జనపతిఋత్విజునకు నను
ననఘా! వినుమొక్కకొమరుఁ డయ్యెను భార్యల్
తనకు శతంబును గలిగియు
తనయులు పెక్కండ్రు లేమి తగునే చూడన్. 268

మ. అనుడా ఋత్విజుఁ డిట్లు బల్కె నృప! నీ యగ్రాత్మజున్ జంతువుం
గొని వేగంబశు చేయు మధ్వరము చేకూడుం ద్వదీయేప్సితం
బొనఁగూడం గలదన్న సోమకుఁడు నట్లొందంగఁ గావించె ద
జ్జననుల్ బెల్లుగనేడ్చుచున్ బొరలనోజన్ ఋత్విగాజ్ఞాస్థితిన్.

గీ. అంతఁ దదాత్మజ పత్నులయ్యధ్వరాప్తి
గర్భములుగాంచి తత్సిరమైనఁ గాంచిరెలమి
సుతశతంబును జంతుండు సూనుఁడగుచు
నగ్రమహిషికిఁ గలె సమగ్రమహిమ 270

వ. వారందఱు నక్కుమారుని యందుఁ దొంటిచందంబున వాత్సల్యంబునఁ దవిలిరంతఁ గాలావసానంబునఁ జేసి ఋత్విజుండు ప్రాణంబులుబుచ్చి నరకంబునం బడియె నదంపడి సోమకుండు పరలోకగతుండై ధర్మశాసనంబునఁ బుణ్యలోకంబున కేఁగునెడ ఋత్విజుండు వానిం గని నీకు యజ్ఞంబు సేయించిన కతంబున నిరయంబు గలిగెనంచు నుద్ధరింపుమనవుడు నట్లు కాకయుని శమనుం బ్రసన్నుఁ జేసి విప్రునిఁ బుణ్యలోకంబునకుఁ గొనిపోయెనని చెప్పి

యిది ప్రజాపతిసత్త్రస్థానంబు నహుషాంబరీష సార్వభౌమయ యాతిముఖ్యులగు మహాభాగుల యాగాయతనంబు లివియని చూపుచు రామహ్రదంబును నరనారాయణస్థానంబునసిద నిది యమునాతీర్థంబిందు స్నాతులగువారికి సకలలోకంబులు గానం బడునన, పాండవులా తీర్థంబాడి రజాతశత్రుండిందు ప్రొద్దున్న కిరీటింగంటినని రోమశునగ్గించె: వెండియు రోమశుండు సకలతీర్థ యజ్ఞస్థలంబులెఱింగించుచు ధర్మజున కిట్లనియె. , 271

సీ. శిబియనురాజేంద్ర శేఖరుగుణముల
నరయంగనింద్రాగ్ను లరుగుదెంచి
శ్యేనమైయింద్రుఁ డెచ్చెరనొరసిన నగ్ని
తగఁగపోతస్థితిఁ దప్పసఱచి
శిబి వెన్కఁజొచ్చె తచ్ఛ్యేనంబు రాజుతోఁ
బల్కె నోనృపనాదు భక్ష్యమైన
దీనినిచ్చుటలగ్గుగాని యొండు తెఱంగు
జూచిననాఁకలి సోకియొడలు

ఆ. వె. దొరఁగునంతఁ దనసుతుల్ సతియునుజెడు
నేకజీవమున ననేకజీవ
హింసఁజెందునిప్పు నిదియా ర్తరక్షణం
బగునెనియనుడు డేగకనియెరాజు. 271

క. నేను కపోతమువిడువను
గానిమదీయామిషైక ఖండమొసఁగెదన్
వేనీకుఁగొమ్మునావుడు
దానికిసరితూఁచియిమ్ము తనకనిపల్కెన్ 273

ఉ. వారికిపక్షిమాట నృపవర్యుఁడు గై కొనియాత్మదేహమిం
పారఁగఁగోసి తక్కెడనఁ నంతయు గానడ గువ్వయెత్తుగా
నేరకయున్న బోదులనుసిల్చెనుదాను వియచ్చరౌఘమూ
హారవముల్ ఘటింపనమరాధిపపహ్నులు దొంగలింపఁగన్.

గీ. అపుడుశిబికిఁబ్రసన్నులై యామహాత్ము
లతనిచరితంబు గల్గెనంతపట్టు
స్వర్గమునసుండుదురని యిచ్చెఁజనిరివేడ్క-
నాఘనుని యాజ్ఞపదమిది యనఘచరిత. 275

వ. అని చెప్పుచునష్టావక్రాశ్రమంబుదరియుంజని రోమ
శుండిట్లనియె. 276

కం. వినుతొల్లి యేకపాదుం
డనఘుఁడు మునివరుఁడు జాతయనుభార్యను గై
కొని యూవనమున దపమును
ఘనముగఁజేయంగఁ గొంతకాలంబునకున్.

ఆ. వె. వానిభార్య గర్భవతియైన నొకనాఁడు
గర్భవాసియైన యర్భకుండు
చదివింపఁ
దగునె ? నిద్రచేతఁ దప్పఁజమువ. 278

ఉ. నావినియేకపాదముని నాథుఁడుఁదబ్బిశువున్ శపించెదా
వావిరినీవునీశ్రుతికి వక్రముఁ బల్కితిఁగానయష్టవ
క్రావహదేహమందుమని యమ్మని భార్యనిబోధనేగ సం
భావనగ విదేహపతి పాలికిరోయికిఁదత్పిసూతికిన్. 279

ఆ. వె. అట్టులేకపాదుం డరిగివిదేహ భూ
పాలుపాలవరుణపట్టియైన
వందితో వివాద పరతనోటమిం జెంది
రజ్జువెళ్లినిలిచె లజ్జవచట. 280

వ. అంత నచ్చట నష్టావక్రుం డుదయించి మాతులుం
డగు నుద్దాలకునొద్ద నతనితనయుండైన శ్వేతకేతువుం గలసి
వేదవేదాంగవిద్యలు గఱచుచు నొక్కనాండు నుద్దాలకు నూరు
వెక్కియున్నం జూచి శ్వేతకేతుండు మాయయ్యయంకంబు డిగ్గు
మని కోపంబునందోసిన నేడ్చుచు దల్లివలనం దనతండ్రితెఱం
గెఱింగి శ్వేతకేతుసమేతుండై జనకరాజుకడకేగి యాప్రశ్నలకు
సహజంబులగు నుత్తరములిచ్చి మెప్పుతోడనే వందినింబడసి
తండ్రిందోడ్కొని యాశ్రమంబునకు వచ్చెనని చెప్పి మరియు. 281

క. రాజేంద్ర! యిందాల భర
ద్వాజుండు రైభ్యుండును నెను వాలుతపముల్
తేజమునంజేయుచునుసుతి
నూజులంగాంచిరి జగద్వినుతులగువారిన్. 282

అందు రైభ్యునకు శ్రుతాధ్యయనవిశిష్టు
లై నయర్థావసుండనంబరావ
సుండనంతనయులు సొబగారవిద్వజ్జ
నైకపూజ్యుల గుటవ్యాకులతను
జూపోపకనుగుంది సారిదిభరద్వాజ
సుతుండు నవక్రీతుండతిమహోగ్ర
తపమునానాశాస్త్రతతిం జెందునాస్థచే
జేయంగనచటికి జిష్ణుండేలమి

ఆ. వె. వచ్చివానిఁజూచి వరమిత్తునను గుము
నుసుగుముఁ దకతపము నుడుగు మనుచు
చదువకయును నాకు సర్వ వేదంబులు
వలయు ననియె నయ్యవక్రితుండు. 283

క. అన విని యింద్రుండిట్లను
ననఘా! గురుసేవలేక యబ్బునె విద్యల్
పనిలేనిపనికిఁ బూనితి
వనయమ్ము దపమేల చదువు మనిచనన త్రుడుఁ. 284

ఉ. మానక నిట్టలంబగు సమాధి నవక్రితుఁడగ్నిపంచక
స్థానమునందు నిల్చి తగ సల్పఁగ గ్రమ్మర వజ్రి వృద్ధుఁడై
వానిసమీపజాహ్నవిని వైళమ యొక్కొక ముష్టిమాత్రముం
గా నిసుకం దదోగతిఁగట్టఁగఁజూచి యవక్రితుండనుఁ. 285

గీ. జరఠుఁడవుగంగయిదినీకుఁ జనునే కట్ట
యెఱుకమాలితివనవాని కింద్రుఁడనియె
నేనునినుఁబోటివాఁడనై యెఱుకమాలి
మించిసేతువునకు విచారించినాఁడ. 286

క. అనివానిమనము బెట్టిం
పనుజాలక కోర్కినిచ్చి మఘవుండును జ
య్యనఁజనియె నవక్రితుఁడును
తనయాశ్రమవాటికరిగెఁ దద్దయు నెమ్మిఁ. 287

చ. వరమున సర్వశాస్త్రములు వచ్చుటజేసి యవక్రితుండు ను
ద్ధురగతిమానివుంగవులతోడ వివాదమొనర్చి గెల్చుచుఁ

గరమునుదంబు పెంపుఁగనొకానొక నాఁడు లరైభ్యయాశ్రమాం
తరమటుఁజొచ్చి కృష్ణయనుదాని పరావసుభార్యఁజూచియున్.

క. మదనానలవిహ్వలుఁడై
మదిమునఁదనహృదయ మాను మధ్యమ తెలుపన్
బొదలియది శాపభయమున
మదినప్పటికిచ్చగించు మమతంబో లేక్. 289

ఉ. మానినివానికన్మొఱఁగి మామకుఁదద్విధ మెల్లఁజెప్పినన్
బూనినరోష మొప్పజటఁ బుచ్చిరయంబున రైభ్యుడెంతయున్
దానవినొక్కతెన్ మఱియుదానవు నొక్కనివేసృజించినన్
దానవిరైభ్యుకోడలి విధంబునవచ్చెను వానిపాలికిన్. 290

వ. ఇట్లువచ్చి యవక్రీతుచేతి కుండికం గొని భగ్నంబుఁ జేసినఁ దద్గతంబున నష్టతపోబలుండయ్యె వెండియుశూలహస్తుండై దానవుండతనిఁ జంపసమకట్టిన వఱచియవక్రీతుండెందుల దరిగానక నిజజనకు హోమగుండంబు ప్రవేశించిన నసురయు బోనీక వెలికిఁదిగిచి శూలంబున గండడంగించి రైభ్యుపాలికరిగి యతని యనుమతిని దానవిన్ భార్యగాఁ గొని యథేచ్ఛంజనియె నంత భరద్వాజుండు వనంబునుండివచ్చి తనకగ్నిహోత్రంబులు ప్రసన్నములుగాక చెదరుటయు కొమరుచందంబు గృహారక్షకుండైన శూద్రువలనఁదెలిసి బహువిధంబులఁ బ్రలాపించి పుత్రశోకంబు సహింపనేరక కొమరుమేనితోడన చితిఁబ్రవేశించి మృతుండయ్యె నయ్యెడ. 291

సీ. అంతబృహద్యుమ్నుఁడనురాజు సత్రయా
గముఁజేయు రైభ్యునికొమరులైన

యనఘుల నర్వావసుఁ బరావసునుఁ ఋ
త్విజులుగాఁగొని యజ్ఞవిధియొనర్పు
చుండ నెడ బరావసుండొకనాఁడు ని
జాశ్రమంబునకేఁగ నడవివేగు
బోకఁ బోవుచున్న వేకువ రైభ్యుండు
నెదురువచ్చినఁగని బెదరుమనము

గీ. తోడ మృగమని తండ్రినిఁ దునిమి తెలియ
జూచి శోకించి తమ్మునిఁ జూడవచ్చి
తద్వధం బెఱిగించి యధ్వరముఁ జేకొండ
వీవుగడపఁగలేవని యిట్లుపలికె 292

క. నాపాపముఁగొని వ్రతములు
జేపట్టుము క్రతువునేను చేయింపంగా
నోపుదు ననవుడు నట్లన
పాపముఁగొని యతఁడు పుణ్యపరతంబరగెన్. 293

వ. ఇట్టులన్న యదియగు బ్రహ్మహత్యా పాతకంబు వహించి యనేక తపోనుష్ఠానంబు లొనరించి యర్వావసుండుఁ దత్పాపవిముక్తుండై తండ్రికిఁ బరలోకవిధులొనర్చి పవిత్రుండై మగిడి పరావసుపాలికేతెంచిన వానింజూచి వీఁడు బ్రహ్మహంత జన్నంబునఁ గుమ్మరనర్హుండుగాఁడని రాజునకు వెడఁద్రొబ్బించిన యర్వావసుండిట్లనియె. 294

ఆ. వె. అటఁ బరావసుని సమగ్రపాపంబేను
బూనితోలఁగఁజేయఁ బోతిఁగాని

యేను బ్రహ్మాంతఁ గానసిపల్కిన
వానిమాటకమరవరులు మెచ్చి. 295

క. వరములు వేఁడుము నావుడు
పరఁగభరద్వాజ రైభ్యభారద్వాజుల్
కర మొప్పచు బ్రదుకనుసో
దరునకు నీసడియుఁగలుగఁ దగవేఁడుటయున్. 296

క. వారట్లానఁగిన మృతులగు
వారటుచనుదెంచిరా నవక్రీతుఁడుసొం
పారఁగ నమరులఁ గని యా
గౌరవగుణమమరనేమి గతమనిపల్కెన్ 297

క. నావినివారలు బలికిరి
నీవుతపశ్శక్తిఁ జేసినేర్చితిగానన్
నీవిద్యబోదసి రైభ్యుని
చేవినిహతినొందనీకు సిద్ధించెఁజుమీ.

వ. అనిచెప్పి నిలింపులుచనిరి రైభ్యభరద్వాజులు సుత
సమేతులై నిజాశ్రమంబుల కరిగి సుఖంబుండిరనిచెప్పి యచ్చటికిఁ
గైలాసనగంబు షట్సతయోజనంబుల దూరంబుగలదందుఁ గుబే
రుండుండునని రోమశుండు బలికిన ధర్మజుండనంతసించి దుర్గమ
మార్గంబుల నరదంబులు రానోపవని యింద్రసేనాది భృత్యుల
తోడ నిషాదతియగు సుబాహుపురంబున రథంబులునిలిపి పాంచా
లీ సహితంబుఁగా బాండవులు ధౌమ్య రోమశుల ముందరనిడికొని
గంధమాద నాభిముఖులై చనుచుండ నతిఘోరంబగు సమీరంబు
తో వృష్టిగురిసిన ముహూర్త మాత్రంబతి దుస్తరంబగు నవస్థజెం

ది యనంతరంబ వివిధ స్థలంబుల నడుగిడనేరక కాలిడియంబడియె డు ద్రౌపదింజూచి యుధిష్ఠిరాను మతంబున ననిలతనయుండు ఘటోత్కచుఁదలంచినవాఁడు సపరివారుండై చనుదెంచి బ్రహ్మాంబగు బదరికావనంబుఁజేరి రాక్షస స్కంధావతీర్ణులై యందు 299

సీ. అతులతత్త్వజ్ఞ మహర్షి సంసేవ్యమా
నాంతికుల్ తన్మునిస్వాంతచరులు
నై నర నారాయణాఖ్యులఁ బెంపొందు
వారిఁగఁజెంచి దుర్వారభక్తి
ననిశమేకక్షమ నంతరంగముచేత
సంస్పృశించుచు బాహ్య సరణిఁదగిన
యష్టాంగములచేత నవుడు రెండవదియై
యలరెడు క్షమసోఁకననఘుఁడైన

ఆ. వే. ధర్మసూతిసాగి తగ మ్రొక్కె రోమాంచ
కలితమైన మేనఁగలుగ మొరయ
నచటనాఱుదినము లధివసించిరిమౌని
గణమువలనఁబుణ్యకథలువినుచు. 300

క. నరనారాయణదర్శన
పరులై బదరీవనంబు భావించియుఁద
త్తరుసరణి విశ్రమించియు
నరవరులధ్వ శ్రమంబునం బాసిరొగిన్. 301

ఆ. వె. పావనంబగు నావనభాగమునని
వాసమొనరిఁచియవుడు వివాదదుఃఖ

మెడలనయ్యెడ నొక్కనాఁడేకతంబ
ద్రౌపదీభీము లొక్కచోఁ దనరునంత 302

సీ. వరవధూవక్త్రలతవ్యాజలలితాగ్ర
తలగంధవహమృదు దాపితంబు
గహనపర్యటన సంగతఖేదభరనుత్తి
శాలినై సర్గిగ సౌష్ఠవంబు
వితతభ్రమాను ఝాంకృతమిళిఁదామపి
సిద్ధదృఙ్మానసనేచనంబు
వనవాటికాసుమ వ్రజసౌరభాతీత
తరపరిమళసముద్భాసితంబు 303

గీ. నైనసౌగంధి కాబ్జంబు నమరగాంచి
నబ్బురంబునఁ గొనిద్రుపదాత్మజాత
జాతకుతుకప్రహర్షసమేతధూత
చేతమునవాతసుతు నంటిచేరిపలికె 304

క. ఈగతిఁబువ్వులుదనకు స
దాగతినుతుఁడరసితే సదాగతియగునం
చాగతిఁబల్కిన నతిగతి
నాగతిగాఁబనియెమారు తాత్మజుఁడంతః 305

వ. ఇట్లు వాయువశంబునంబడిన కనకసౌగంధికంబునందభిలషించు ద్రౌపదిమనోరథం బీడేర్ప భీముండు పుష్పంబువచ్చినచాయనుత్తరాభిముఖుండై సరభసంబుగా గిరిసరిదరణ్యంబులుగడచి గంధమాదన శిఖరిలంఘించి చనుచున్న సమయంబున. 306

శా. లంకాపట్టణదాహకత్వమునఁ గీలాజాలసంతాప సా
తంకుండై తెలివిన్ వహించి నిజనిద్రాముద్రతన్మార్తికిన్
సంకేతించెను గుంభకర్ణుఁడను నోజన్ నేత్రముల్ మూసి ని
శ్శంకన్ స్వాపమునం జెలంగు కపిరాజశ్రేష్ఠుఁగాంచెన్ వనిన్.

వ. భీమసేనుండు మేఘగంభీరగర్జానాదంబుగా నక్కోతి
కిట్లనియె. 308

చ. తెరువరికట్టి నిద్రఁగనేదే? యవినీతమతీ! యెవండవి
త్తెఱఁగునఁ నేగనన్నన వె ? తీరిదియే! యిఁక సైపలెమ్ము హా
మ్మురకహిడింబసంహరు భుజోగ్రగదన్ వెసనెత్తమూఢ ని
న్నురవరజేయువిప్పుడుమహాశత్రిమానరవంబు వేగ్రిల్మిడిన్. 309

గీ. ఇట్లుభీముండుబలుకు సహితములకును
గదిచితనతోకమాత్రంబుఁ గదలఁజేసి
యతులకోపారుణాక్షుఁడౌ నతనితోడ
ననియెస్వాపారుణాక్షుఁడౌ హరివిభుండు. 310

సీ. ముసలివాఁడనుగాన ముసలెదనిద్రితు
రుండనై యిచ్చటనుండి నేను
జాడ్యంబుచేలేవఁ జాలనంగంబులు
బలువుదప్పుటనర్ఘ్యపాద్యమునఁగ
బాసితిజాతిస్వభావ రీతినివన
పద్ధతినడ్డమై పండినాఁడఁ
గావునసేమంబు గలెడునీకు న
న్నొండనకేగుమయోయిశూర

గీ. నీవునాతోఁగతుఁడవి నట్టిరోఁత నెపము
నీడ్చిపుచ్చిరయంబున నేఁగియిష్ట
సిద్ధిగాంచుమటంచును జిహ్నవిన్న
పంబుగాఁజెప్పఁబవమాను పట్టియంత. 311

చ. పరిసరశోభితక్కటి నిబద్ధలసద్ద్రుఢవల్కలుండునై
కరములవాలమింతుకయుఁగాని కదల్పఁగనేరఁడయ్యె నా
హరివరపుచ్ఛ సుస్థితమహత్త్వముచే నిజమానసాంబుజం
బురిగొనియాడగానిలిచియొయ్యన బాండవసింహుఁడయ్యెడన్.

క. వినయము సిగ్గును విస్మయ
మునుముప్పిరి బెనఁగఁగీశమున్యానిఁగనినీ
వనఘా ! వెసవానవలో
కనివాసులలోన సువాళికండవుగావే. 313

క. వినికపి కుంజరుఁడంతం
జనకు ప్రభంజనునకేను సంజాతుండన్
జనకసుతేశమనోరం
జనకరలేఖార్థ వాహచాతుర్యుండన్. 314

వ. అనిచెప్పిన వృకోదరుండుసంతృప్త చిత్తుండై సబ
హుమానంబుగా నతని పలుకాలకించి 315

ఉ. మిక్కిలిదోంగలింపుచు సమీరకుమారుఁడు వానికిట్లనున్
నిక్కవమాంజనేయుఁడవు నీవగుదేనికడుంగు మప్పుడ
య్యక్కజమైనతోయనిధి నల్పపరక్రియదాటఁజాలఁగా
వెక్కసమౌ భవత్తనువు వేగముఁజూపఁగనామ దృష్టికిన్ 316

క. నావిని విలాసవిక్రియ
నావనచరుఁడోలమున నిజాంగముఁ బెంపన్
భూవరు తెరువును మఱిదే
వావళి తెరువును నిరోధమయ్యెం బెలుచన్. 317

వ. ఇట్లుమేనుబెంచిన 318

శా. మైనాకంబను సందియంబున గరుల్ మట్టానసట్లొప్పనా
మైనాకంబదరంటి యున్నఁగనివేమారున్ భయభ్రాంతుడై
మైనాకింపముబుట్టికన్ను మకుళింపంగీశుబోధంబుని
మ్మైనాకేశసుతాగ్రజుండు ముదితుండై హస్తముల్ మోడ్చెఁదాన్

గీ. అంతనందందసంతన మతిశయిల్లఁ
బెరుగునవయవముల బెంపుపిచ్చటిల్లఁ
భ్రాతృవృద్ధివిడంబంబు పవనపుత్రుఁ
డల్లనల్లన శాంతిగా ననవృపఱచి 320

వ. సవినయంబుగా నతనికిట్లనివిన్నవించె. 321

క. చిరకాలప్రార్థనచే
సరణింగనుపడిన నీదుసందర్శనమో
హరివర ! యిపుడీవిస్మయ
శరనిధిఁగడువంగ నాకు శక్యంబగునే! 322

క. రామునకునను జుకంటెన్
బ్రేమమునీయందటంచు బెట్టితిమతిలో
యామినిచరహారణోత్సవ
మామహితునికంటె నీకునధికముకతనన్ 323

ఉ. నై రణనేయుమయ్యవిసనై సంగరాని మదీయవాక్య దు
ర్వారతరాపరాధమని వాయుజుఁడాతని పాదపద్మముల్
వారకనేరినఁ హరియు వై శమతమ్ముని గ్రుచ్చియెత్తి చె
న్నారశిరంబు మూర్కొని ప్రహర్షమునంబలికెన్ నయస్థితిన్

క. తమ్ముఁడ నీవతిబలుఁడవు
సుమ్మీనీకెద్ది కడిఁదిజూడఁగనదినా
కిమ్మెయిఁజెప్పుము జేసెద
నెమ్మనమున నీదుకోర్కి నిండారఁగన్.  325

వ. అనిపలికినఁ గనకకహ్లార సంగ్రహంబున సాహసకృ
త్యంబుదలంప లగ్గగుతెఱంగున సంగ్రహింపుమని వెండియు యు
గప్రవర్తనంబులు నీతియు నతండడిగిన ప్రశ్నలకు నుత్తరంబు
లిచ్చి వీడ్కొని యంతర్హితుండయ్యెనంత భీముండును దద్వ
యోగంబున కొంకింతతడవు చింతించి యంతనంత నుత్సాహ
వంతుండై కడలెఁ దత్సమయంబున  326

క. మునుఁగన్నవానరేశ్వరు
ననువున నాగంధమాద నాచలశృంగం
బనిలతనూజుఁడు జనిచని
కనుఁగొనె దృక్పథవిలాసకరమగు దానిన్.  327

ఉ. ఆతతశృంగ పార్శ్వమున నయ్యలకానగరేశకాంత కాం
తాతిలకాల కాంతకలిత ప్రసవాగతవాతవాసనా
స్ఫీతమునై యుదీచికి విచిత్రమణీరమణీయ దర్పణీ
భూతమునై తనర్చు నొక పుష్పసరోవరమొప్ప జూచియున్

క. యక్షాధిప యశముంబలె
లక్షితదేహముల యంచలకులముఁదన్నున్
వీక్షించి వెఱచి పరవఁగ
కక్షమునం గద యమర్చి కౌరవ్యుఁడాతన్. 329

క. డిగ్గియకు డిగ్గి కమలము
లగ్గలమునఁ దెంపబూను నవసరముననే
డగ్గరి మధురోక్తిన్ స
మ్యగ్గతి దగ రక్షియక్షులని రాతనికిన్ 330

క. ఓయయ్యా యిదియలకా
నాయకుని సరోవరంబు నాధుననుజ్ఞన్
గోయఁగ నిత్తుము దక్కిన
నీయెడఁబొందమ్మి వెలయ నీయమునీకున్. 331

వ. అనిన భీమసేనుండు వారలకిట్లనియె.

చ. అడవినిఁ గొండకాలువను నద్భుతవృత్తిని బుట్టినట్టి యీ
మడుగునకొక్క యేలికయె మానుగ దీనినిఁ బెట్టి పెంచెనే
యడిగికొనం గుబేరునిఁ దదాజ్ఞకు నాకిది మేలుమేలు నే
నడుగుదునే పరాక్రమసమగ్రుడ క్షత్రియ వంశజుండనై 332

గీ. క్షత్రియులు బాహుబలమునఁ గడిఁది రిపుల
నోడిచి విత్తములార్జించి యడుగువారి
కిడుట గుడుచుట నుచితమౌనింతెకాక
బేలనే? నే గుబేరు గిబేరు నడుగ? 333

క. మీఁరిటువచ్చిన నాచే
గారియఁబడుటింతె కాక గడవంగలరే
పారుఁడు పారుఁడనుచుఁ దా
మీఁరియుఁబుయిలోట దక్కి మిన్నక పోగన్ 334

సీ. అశోకసంఫుల్లపల్లవశాఖలం గొనెసు
సాహసంబున కయ్యత్తుసమితిఁ జేర్చి
యార్చి కోర్యాతిరేకంబున శిరములు
బెట్టి మాఁట్టిముల గదాకలితకట్టిగట్టి 335

వ. ఇట్లు సాహసంబున సమర్థుండ వీరవ్రతక్షవకీ
యంబగు నాయువు మాఱుసెయ్యఁడ నామోఘంబునకుఁ గడంగి
నాఁడవని నిరంతరంబుగా సంతతుఁ గలవానిరోధింపుము ప్రబవర్ధ
మాన రోషకషాయితాయతలోచన ప్రతిబింబంబులు దత్సరసికిఁ
బునస్సౌగంధికాంతిర్వైశ్నత్వసంపదసంపాదింప నపరయుక్తవరులకు
సమీరకుమారుండు రయంబున నెవర్చి సింహనాదంబొనర్చి చికకాల
ఘోషితంబై నగదాదండంబునకుఁ బారణయొనర్చె నాసమయంబున

క. కొందఱు చరుమాఁడెను మఱిఁ
గొందఱు మర్మములు జించెఁ గొందఱుఁ దుంచెన్
జిందరవందరగా నొక
కొందఱఁ గావించె బరపఁ గొందఱ జేసెన్. 337

వ. ఇట్లు మణిమంతుండు లోనగు యక్షులం జంపిన 338

చ. నెరినటు సోకుతండముల నెత్తురు టేరులు గట్టునెల్లెడలన్
దెరిపియుగాని కాలువలు నిండి రయంబున డిగ్గఁ బారుచో

వెఱగునవేల్పుముద్దియలు విన్ననసంజియు జేగురంచున
త్రచెంగరిపారిజాతములు దద్ద్రుమజాతుర నిండు వేడ్కలన్

గీ. అంతనక్కొండకందనుండు నంబుజములఁ
గొని తదీయేచ్ఛమరలించి కుంతికొడుకు
కొంతనడియందుఁ గ్రీడించి సంతసమ్ము
బూనియొకసానుసీమ నాసీనుఁడయ్యె 340

వ. తత్సమయంబునఁ గుబేరుండు రణపరాఙ్ముఖాత్మీయ భృత్యగణంబువలనఁ దద్వృత్తాంతంబెఱింగి భీమభీమపరాక్రమంబున కభినుతుండై పాంచాలి కిష్టంబగుంగాకని మిన్నకుండె నిచ్చటద్రౌపదిచే మారుతిజనుటెఱింగి రాక్షసస్కంధంబు లధివసించి యుధిష్ఠిరాదులచ్చటకేతెంచి వృకోదరుంగాంచి యతనివలన సంతుష్టులై యట్టిసాహసంబు లగ్గుగాదని ధర్మజుండు దమ్మునకు హితోపదేశంబుఁజేసి పదంపడి పృషదశ్వసుతుండు పార్థతికివై దూర్యనాళకనక నాళీకంబులొసంగిన 341

గీ. ధార్తరాష్ట్రకులిత మలితతివిభాను
రంబుమరినోర్మి చయమేదురంబునైన
కొలఁకుఁబోని యొయారంపు కొప్పునందు
దాల్చెద్రౌపదివేడ్కఁ బొందమ్మివిరులు 342

వ. వెండియు బాండవులు కుబేరోద్యానంబున రోమశ సహితులై విహరించుచుఁ నద్వనపాలకా దేశంబున నచ్చటనుండనొల్లక నొండెడ నివసించిరాక్షసబలంబుతోడ ఘటోత్కచుం బోవంబంచిరంత జటాసురుండను దనుజుండు భూసురవేష భాసురుండై వారలసేవింపుచునుండ నొక్కనాఁడు. 343

నన్నయభట్టు పద్యము.

గీ. మృగవిరోధిబలుఁడు మృగయావినోదార్థ
మడవి కనిలతనయుఁడరిగినట్టి
యవసరమున నజ్జటాసురుఁడాసురా
కారవికృతరూపకంబుఁ దాల్చి. 344

వ. పర్ణశాలఁబ్రవేశించి ద్రౌపదీనకులసహితంబుగా యుధి
ష్ఠిరుఁదదాయుధంబులఁగూడ నెత్తికొని యపదిశాభిముఖుండై
పఱచు నెడ. 345

చ. చటులఘటోత్కచాంసనివసన్విలసద్ధృతిచేగతాగత
స్ఫుటపటిమాతిశాయి యనుపుత్త్రకుఁడచ్చటనారథమారిమై
కుటిలజటోత్కటాంసములఁ గుర్కురుచుంబదమూనలేనిచో
నటపెపదత్రినాదములు నత్తరినేడ్చెననంగ ఘోషిలెన్ 346

చ. పివినయుఁజెందఁబూని నవివేకికినట్టికడింది కొల్వమం
టపమున ధర్మసూతికి జటాసు నిరోధముబుట్టదయ్యె నా
విపుల విజృంభమాణవన వీధిప్రసాధిత శాత్రవుండు నా
నపుడల ధర్మసూతికి జటాసు నిరోధము బుట్టెనెట్టనన్ 347

గీ. వానిమెడఁబట్టికై వ్రేలివచ్చెధర్మ
పుత్రుచేరక్కసునికతి బాసుగుపడియె
నయుభయంబులుజూపుచు నకులుతమ్ముఁ
డిలనుబఱచుచు ననిలజుఁ బిలుచునెడను. 348

సీ. కిముదప్పగాఁవీరెఁ గాననసీమయుం
దిపుడేలకొనిపోవ నిచటనిలిపి

చంపుమనియమునఁ జనుబుద్ధి చేఁబలె
ధర్మాత్మజానురోధంబువలన
నిదురఁ గొంచునావల నిడెనశక్యుండయ్యు
జంఘాజవంబరి జటుఁ డజేయుఁడై
దశదిశవీక్షించుతరి ద్రోపదకడ్డమై
యుపలజుఁడడఁపొర ననుఁయుతసి

గీ. తోడఁబవనంబునేయుఁగఁ దోపదసభస
దప్రహ్లాదయుండగుచు సంపతిలమువలన
గరవ. కనిముస ధరణికిధరణిపాల
తనయులనుడ. చిదణ్ప పొంగిననెనెర్చె. 34౯

క. జట్టిజటునింగరువలి
పట్టియనొకకొంతప్రొద్దు బాహుబలమునన్
నెట్టనఁబెనఁగియురాతం
గొట్టెందచ్ఛిరముపగులఁ గుంభినివైచెన్. 350

గీ. పరవరలుగాఁగఁ దలవస్రియొరఁగినట్టి
రక్కసునిపాటు దొడ్డభారమునఁబుడమి
గలివనరుసంగతిని నిజాంగములనెల్లఁ
గుంచెననుమాడ్కి నొకపెద్దగుంటయయ్యె 351

క. ఆదనుజునిచావున
మేదినినిమ్ముంటకొప్పి మెరసెంగలయన్
మోదాన్నత్యముచేస
త్యాదరమునద్రుపదసుతయు నపుడలరారెన్ 352

వ. మఱియుఁ బాండవులు నరనారాయణాశ్రమంబునఁ గొన్ని దినంబులుండి యర్జునుఁ డేఁగి యేనేఁడ్లయ్యెనని తద్దర్శనోత్సుకులై గంధమాదన తీర్థాచారంబులాచరించుచు వృషపర్వు నాశ్రమంబుఁ జేరి యాతనిచేఁ బూజితులై బ్రాహ్మణులనెల్ల నందు నిలిపి ధౌమ్యలోమశప్రభృతి కతిపయజనంబులతోడ వృషపర్వోపదిష్ట మార్గంబునం జని శ్వేతగిరిని మాల్యవన్నగంబును జూచుచుఁ దదరణ్యంబున విహరించుచు నొక్కనాఁడు శ్వేతకి యను పుణ్యతరంగిణివలనఁ బంచవర్ణకాంచన కమలంబులు దమ పురోభాగంబున బడినఁ గని విస్మయంబంది రంత నేకాంతంబున శశికాంతశిలోపాంతంబుననున్న వృకోదరునిఁ గాంచి యాజ్ఞసేని యిట్లనియె. 353

క. మునుపటి సౌగంధికముల
పెనుపొంగులకంటె నింత ప్రియమొప్పనె? యీ
వనజములనఘా! నాకుఁ
గొని తెచ్చెదవనుచు నచ్చికొనియెద నెదలోఁ. 354

క. అని యువ్విళ్లూరిన సతిఁ
గని తెచ్చెద ననుచు నని జగత్ప్రాణసుతుం
డొనరఁగఁ దద్గిరి శిఖర
మ్మున వైశ్రవణుని నివాస భువిఁ గని పెలుచన్. 355

సీ. బ్రహ్మాండభాండముల్ పగుల శంఖంబొత్తి
యక్షసంఘము దాని కాగ్రహమున
బఱతెంచి పవనజుపై వివిధాయుధ
సమితినేయుచు నార్వఁ జదలు చెదరె

వెండియుఁ బాండవవీరుండు కోదండ
పాండిత్యపటిమ నేర్పుఱుపఁదలఁచి
కాండసాహిత్తులచే ఖండించెఁ బరిపంథి
చయమును సమరైక జయముఁబూని
ఆ. వె. వరలె శోణితప్రవాహముల్ పీనుగ
పెంటలయ్యె భీమ భీమసమర
మపుడు చూచి బెగడె యక్షబృందము మణి
మంతు మరువుఁజేరు వంతఁగూడి. 356

వ. ఇట్లు దన వెనుకఁజొచ్చిన సేననోడకుండని మణిమం తుండు కౌంతేయునకోహటించక శరాసారంబులం బరగించిన నమీరకుమారుండును నరిమి యరి శరంబులు విరియ నిజ శిలీము ఖంబులేయ వాఁడు వెండియు గదవైవఁ దునియలుజేసె. శూలం బువైచిన నిర్మూలంబుఁజేసె నంత యక్షుండు నంతరిక్షంబున కెగయఁ బోనీక గదా ఘాతంబున మృత్యుగతుంజేసె. నిట్లతఁడు బడిన వాత శేష బలంబు వెఱచి పఱచె నిట భీముండు చనుట కృష్ణచే నజాతశత్రుం డెఱింగి ధౌమ్యాదులతోడ గిరి శిఖరం బెక్కి కుబేరనగర సవిధ సమిద్ధరణిఁ జరించు తమ్ముని డాయువచ్చు నెడ నలకేశ్వరుండును దనవారిచేతఁ దద్వృత్తాంతంబువిని యచ్చె రువడిఁ యచ్చటికి వచ్చిన నతనికి ధర్మజుండెదురుచని మ్రొక్కినఁ బ్రీతుండై యిట్లనియె. 357

చ. అనఘ! భవత్సహోదరుఁడహంకృతిమత్ప్రియమిత్రుఁబాత్రునిన్
ఘనుమణిమంతునిం దునుమఁగన్నకతంబున లజ్జనొంద్ర నీ
కనువలదొక్కశాపగతి గూడెసమిద్ధత గుహ్యకాళికిన్
వినుమిదివిస్తరింతు మునువేల్పులు సత్రముసేయునయ్యెడన్.

సీ. అచటికి నేను నీయుక్తబలంబులోఁ
బుష్పకం బెక్కి నభోవిహార
మునఁ జనునెడ ముని ముఖ్యుఁ డగస్త్యుఁడు
యమునా తటంబున విమల తపము
నెఱపఁగ మణిమంతుఁ డెఱుఁగక నతనిపై
నుమియఁ గోపించి యిట్లు రక్ష శాప
మిచ్చె నీయక్షులు జచ్చిరి తద్గతం
బున భీముచేఁ జింతఁబూనవలవ

గీ. దైన దేశము కాలము నార్జవంబు
దలఁపకిటువంటి చెయ్దముల్ సలుపనగునె ?
యనుచు నుచితముగఁ బలికి నాయనుచరాళి
యరయనిలువుఁడుపార్ష్ణి సేనాశ్రమమున. 359

క. మహనీయుఁ డర్జునుండును
విహితగతిఁ వచ్చు ననుచు వినిపించి మహా
మహుఁడా కుబేరుఁ డున్న న
గ్గహనమునఁ వారు కొంతకాలము జరుపన్. 360

ఉ. పాండవసింహుఁ డుజ్జ్వల విభ్రానఘతేజుఁడు ఫల్గునుండు మా
ర్తాండనిజైకదివ్యరథరాజము నెక్కియు మాతలిప్రియు
క్తుండయి వచ్చి ధర్మజునకుం దగ మారుత సూతికిన్ సమో
దుండయి మ్రొక్కి యక్కవను దోడనె తమ్ములఁ జేర్చె నెమ్మితోన్.

వ. మఱియు సముచిత సమభివాదనంబులలో నగు నన్యా
ప్రకారంబుల నందఱిం దనిపి మాతలిఁ బీడ్కొలిపి పరమానందభరి

తుండగు ధర్మజునకుఁ దనపోయివచ్చుట సవిస్తరంబుగా నెఱింగించి తదనుమతంబున దివ్యాస్త్రప్రయోగోపసంహారంబులు సూపు నెడ నారదుండువారించిచనియె నంతనింద్రుండువచ్చి విహితగతి నాదరించి క్రమ్మఱ రోమశుండును ధర్మానుశాసనంబుఁజేసి దివంబు న కేఁగె నంతఁ గౌంతేయులుఁ దొంటిక్రమంబున ఘటోత్కచ సేనాసమన్వితులై వృషపర్వునివాసంబుఁజూచుచు బదరీవనం బతిక్రమించి సుబాహుపురంబుఁజేరి నిజపరిజనంబులఁగూడికొని రక్కసులఁబోవంబంచి రథంబునెక్కి హిమవత్పర్వతంబునకువచ్చి సుఖంబుననున్న నొక్కనాఁడు. 362

సీ. మృగయావినోదార్థముగ భీముఁడడవికిఁ
జనిక్రమ్మఱంగఁదత్సమయమందు
ఘనహిమవన్నగ వనపన్నగమువాని
పట్టిమేనునఁ దోకజుట్టియున్న
జడుపున నప్పట్టుసడలించుకొనలేక
నెట్టనచింతచేనిలుచునంత
నిటధర్మజుఁడుతమ్ముఁడేఁగుటయునుదన
కగుదుర్నిమిత్తంబులరసివాని

గీ. పోవుజాడనుబఱతెంచి భూరిసైంహి
కేయసంగ్రస్తవిధుబింబ మోయనంగ
నున్నమారుతసుతుఁగాంచివిన్నఁబోయి
చేరఁజనిధర్మజుఁడువల్కఁజిలువయేని. 363

ఉ. ఏనుయుధిష్ఠిరుండ వినుమీతఁడుమత్సహజన్ముఁడిప్పుడే
కాననసీమవీనిఁదినక విడుమాకలి దీరనీకు నెం

తేనిమ్మృగాలి మాంసములునిచ్చెద నావుడుఁగట్టుబిల్వమూ
మానవభర్తకిట్లనియె మందపుఁబెల్లు జెలంగనియ్యెడన్. 364

వ. మదీయప్రశ్నంబులకుఁ దగునుత్తరంబిచ్చితేని యితని విడుతువినుము. 365

క. మనుజేశ! యేగుణంబులఁ
దనరిన బ్రాహ్మణుడనంగఁ దగునాతనికిన్
గనఁదగినవస్తువెయ్యది
వినిపింపుము నావుడవని విభుఁడిట్లనియెన్. 366

గీ. సత్యశౌచదయాశీల శాంతిదాన
సంతపంబులుగలవాఁడు జనునుబ్రాహ్మ
ణుండు సుఖదుఃఖమోహాత నుండకునికి
నతనికగువేద్యవస్తు వంద్రజ్ఞులబుధులు. 367

క వినుమీగుణములు శూద్రున
కునుగల్గినయేసి వాఁడునున్ బ్రాహ్మణుఁడెం
దునుజూడ నహింసమొలఁగు
ననిపల్కు దురార్యముఖ్యులహీనులనాధా! 368

క అనిచెప్పిమరియు నప్పా
మొనరించిన ప్రశ్నలకు నదుత్తరములు ని
చ్చినమెచ్చి భీమువిడిచియు
ఘనదివ్యుండగుచునతనిఁ గనియిట్లనియెన్. 369

క. ధరణీశ! నహుషుఁడను భూ
వరుఁడనునేవి ప్రశాపవశమున నిల్లై

కరమిప్పుడు నీచేతం
బరిమున్ కుడనె తినని దివంబునకరిగెన్. 370

ఉ. అచ్చెరువందిధర్మసుతుండయ్యెడ భీమునిఁదోడికొంచుఁదా
నచ్చినిజాశ్రమస్థలిని వాసవుభార్తిని దమ్ములిష్టులున్
మచ్చికగొల్వనుండు నెడ మానితమైఘనమై లసత్ప్రస్థితిన్
వచ్చెను బ్రావృడాగమ సువాసరముల్ పథికాసుఖంబులై. 371

క. తరణిఖరకిరణవిదళి
ద్ధరణీతరుణీ మణిప్రతాపముఁ బాపన్
సురపతి దయ నావానలు
గరమ త్తరిఁగురిసెనిరులు గనియుఘనార్తిన్. 372

వ. తదనంతరంబు. 373

సీ. సంఫుల్లకహ్లార షండపరిభ్రమ
చ్చటులమిళిందౌఘ ఝాంకృతంబు
వివమచ్ఛదాచ్ఛాద వితథకర్పూరమి
శద్గంథవహాసము ల్లాసితంబు
విశదప్రభాసమన్విత శరమంజరీ
స్థగితనదీద్వీప తటతలంబు
ముకురాయమాణ సముజ్జ్వలద్గగనవా
టీనటచ్చంద్ర పాండిమకరంబు

గీ. నిర్మలాంబుపరిపూరిత నిఖిలకమల
జాగ్రదుఁరుతరదీర్ఘికా చక్రవాక
చారుకాదంబ కూజితాంచద్విడంబ
మగుచునొప్పారెనిలశరదాగమంబు. 374

క. కురువరులు నట్టిఋతువున
మరుభూమింగడపిమగుడి మసలక ధరణీ
సురయుతులై కామ్యకవని
కరగిసుఖావాప్తినుండ నటనొకయెడలన్. 375

ఉ. సురమూర్తికృష్ణుడు శుభస్థితి నప్పుడువచ్చెసత్యభా
వాసహితంబుగా గరుడమండిత కేతుశతాంగసంస్థితుం
డై సముదగ్రతంజనుఘనాభ్యుదయ ప్రథితప్రపంచమ
ట్లానమయంబునన్ మగుడెనంచు శిఖండులు తాండవింపగన్

క. చనుదెంచిన హరికెదురుగ
ననుజన్ములు ధౌమ్యుఁడాదియగు విప్రులతోఁ
జనిధర్మజుఁ డుచితస్థితిఁ
గొనితెచ్చిసుఖాప్తినుంచి కుశలమువేఁడన్ 377

గీ. వారినేమంబువేర్వేర శౌరియడిగె
కుశలమనియొండొరులుబల్కఁ గురుకులావ
తంసుఁడగు ధర్మసుతుమోముదమ్మియందుఁ
జూడ్కి నిగుడించి పార్థునిఁజూచిపలికె 378

క. మీపుణ్యమేమిజెప్పుదు
నీవుణ్యుండీశ ముఖదిగీశులచేఁ దా
నాపగిది దివ్యశరసం
దీపితుఁడై వచ్చె నిట్టిధీరుఁడుగలఁడే. 379

క. పరిపంథులనిర్జింపం
గరముఃభరంబేమి యింకఁగలదని పరుసన్

హరియురాఁడఁ బల్కనెడర్
పరమార్కండేయమౌని వచ్చెందాన్. 380

గీ. శౌరిధర్మజముఖ్యులో వారలెల్ల
నెదురుజనియతనికిఁ బూజలిచ్చివేడ్క
నర్ఘ్యపీఠాదికములిడ నలరిమౌని
సేమమనిచెప్పి యందఱసేమమడిగె. 381

వ. అంత దేవకీనందనుండు పాండునందన హితార్థం
బుగాఁ బురాతనపుణ్యకథాశ్రవణంబొనరింపుడని మార్కండేయు
నడిగిన తత్క్షణంబ నాగదుండే తెంచి వారిచేఁ బూజితుండై కృష్ణుం
డడిగినట్లసేయుమని మునివరునుద్దేశించి చనియె. 382

సీ. హైహయసంభవుండగు కుమారుడుఁవేట
నెపమునఁజని యొక్కవిపినమునను
దనకుందరను దూరమునఁ గృష్ణమృగచర్మ
ధారియైయుండెడు తపసిఁజూచి
మెకమనియేసెనెమ్మినిడాసె మృతుఁడైన
మునిగాంచిపగచి యంతనుబురంబు
నకుఁజని తనవారలకు నదిచెప్పిన
హైహయుల్ మునిశవంబచటఁబూచి.

గీ. చింతచేఁగుందుచును దమచెంతనున్న
దార్క్ష్యనాశ్రమమున కేగి తన్మునీంద్రుఁ
డిచ్చునుచితాతిథిక్రియల్ పుచ్చికొనక
నక్కుమారునిఁజూపి ఋట్లనిరి తెలియ. 383

గీ. వమ్ముఁజేసితి మీతనివలన నేను
పాతకులమయ్యెయనుచు నేర్పఱపమాని
నవ్వితనక్రేపనొకముని నాథుఁజూపి
యాతఁడగునేమి వీనిచేహింసితుండు. 384

క. అనిపల్కినఁ గనియద్భుత
మునుఁబొందెడు వారికనియె మునిమావనసీ
మనుజరయురుజయు చావును
వినుడెట్టును లేవటంచు వినిపించితగన్. 385

వ. ఇది మదీయపరిభావంబు మీకు పాపభయంబుతే
దరుగుండనిన హైహయులరిగిరని చెప్పి వెండియు క్షత్రప్రభా
వంబుదెలియ మార్కండేయుం డిట్లనియె. 386

చ. వినుధరణీశ! యత్రియనువిప్రుఁడుగానఁ దపంబు నేయఁ గా
ననగమకింపవాని సతిసమ్మతిఁబల్కెను గానువీనముల్
తనయులకిచ్చిపోవు టుచితంబన నిర్ధనుఁడైన యాతఁ డ
ట్లనుమతినెంచిపోయెఁ బ్రకటస్థితివైన్య నృపాలుపాలికిన్. 387

క. చనియింద్రుండవు చంద్రుఁడ
వనియతనినుతింప గౌతమాఖ్యుఁడు వి
గనితగునే యనుచితనుతు
లనినన్ వారికి వివాదమయ్యెంబెలుచన్. 388

గీ. అపుడుసభ్యులు వారలయధికవాద
మేర్పడసనత్కుమారుఁడు దీర్పవాఁడ
టన్నఁజని యంతయునుదెల్ప నామహాత్ముఁ
డనియెగౌతముఁజూచి యాజనమువినఁగ. 389

ఉ. నిక్కము బల్కెనత్రి ధరణీస్థలిసర్వజనాళినెల్లఁ దాఁ
జక్కఁగఁ బ్రోచురాజు గడుసన్నుతికిందగు నాతఁడాద్యునం
దొక్కనిజాంశమయ్యె వినుమున్నతిబ్రాహ్మణులయ్యు ధర్మమున్
వెక్కసమైననోడి మునువేగమనస్వాంశములిచ్చి రెంతయున్.

గీ. బ్రాహ్మణక్షత్రియులకేక భావమునుముఁ
దెలిపి వారి వివాదంబుఁ దీర్చనంత
వైన్యుఁ డెఱిగి ముదంబున వసువునద్రి
కొసఁగి మన్నించి వుచ్చె మహోజ్జ్వలముగ. 391

క. అంతట నత్రిమునీంద్రుఁడు
సంతతికా ద్రవ్యమిచ్చి చనియె వహార
ణ్యాంతంబున కని చెప్పెను
కౌంతేయునితోడ మౌని శరమురుదారా. 392

వ. మఱియు మృకండుసుతుండు పాండుతనయునకు సరస్వతిగీతయు నెఱిఁగించి వైవస్వతుచరిత్రం బిట్లని చెప్పె. 393

సీ. వైవస్వతుఁడు దపోవ్రతమునల్పుచు జలా
శయమున జలమాడు సమయమందు
నతనితో నొకమీన మనియె నయ్యా యేనుఁ
గడు నల్పమీనంబుగానఁ బెలుచ
బలవత్తరంబులౌ జలచరంబులవల
ననుభయంబు గలుగు నన్ను నెత్తి
కొనిపోయి రక్షింపుమనవుడట్లనిదాని
నొకనూతిలోపల నుంచి యరయు

ఆ. వె. చున్నభావిచాప యొడలికినమ్మితే
కుంకునట్లు బెరగ వెండియొక్క
మనువునందు విడువఁదడయక నదినిండ
మీనఁ దెచ్చి జలధిలోన బెట్టె. 394

వ. అప్పుడ మ్మీనంబతనినుద్దేశించి నాకునుపకారంబుఁ జేసితివి నీకుఁ బ్రత్యుపకారంబొనరించెద నింక ప్రళయసమయంబు నకుఁ దడవులేదుగావున నీవొక్క నావఁగావించి సకలధాన్యవస్తు సమృద్ధంబుఁ జేసి మునిసహితుండవై యందుండిన నేను మహా శృంగశోభితంబైన రూపంబున మెలునిచ్చెదననిచనియె వైవస్వ తుండట్లనఁ బేరోడయమర్చికొని యేకార్ణవంబగు మహార్ణంబున నధివసించి యమ్మీనుఁదలంచిన నదివచ్చి శృంగంబునరజ్జువుద విలిచికొని యనేకసహస్రవర్షంబులాయోడ యీడ్చుచుఁగడపి తత్ప్రళయంబుకడనదగిరి శృంగంబున దీర్ఘరజ్జువుబంధించ నియో గించె నాటంగోలె నాశిఖరిశిఖరంబులు నౌబంధనంబనంబరఁగె మను సహితులైన మహర్షులకు మత్స్యరూపధరుండైన నారాయ ణుండు నిజస్వరూపం బెఱింగించి యంతర్హితుండయ్యె వైవస్వ తుండు నధికతపంబుఁజేసి చరాచరభూతంబుల సృజించెనని చెప్పి కల్పాంత ప్రకారంబును యుగధర్మ కీర్తనంబును నెఱింగించిమరి యు బ్రాహ్మణప్రభావశ్రవణ కుతూహలుండగు ధర్మజునకు ముని
పురాతనేతిహాసంబిట్లని చెప్పందొడంగె. 395

క. తగసాకేతాధీశ్వరుఁ
డగురాజుపరీక్షితుండు హర్షముతోడన్
మృగయార్థమరిగియడవిని
మగువనొకతె నొకట నొంటిమసలఁగఁగాంచెన్ 396

ఉ. అప్పనజాక్షిఁగాంచివిభుఁడంగజవేదననొందిడాసి నీ
వెవ్వరిదానవే? తరుణియేకతమిచ్చటఁ జరించెదేల నా
జవ్వనివానిఁజూచిమరుశాతశరంబుల నొచ్చిపల్కెనే
నెవ్వరిదానఁగాఁదగుమనేర్పడఁగ న్ననురాజపుంగవా! 397

క. అనిసాభిప్రాయంబుగ
జనపతితోఁ బల్కెనతఁడు సమ్మతినాతిన్
వనితవుగాని యమన్న
ట్లనియె న్నృపచంద్రునితోడ నదియుచితముగా. 398

వ. జలవిహారంబునకు నిన్నునిర్బంధింపకుండు వేని వరించె దననినఁ బరీక్షితుండు నియ్యకొనిఁ దానింభార్యఁగా ని యిష్టోపభోగంబు లనుభవింపుచు నొక్కనాఁడు శరత్సమయంబున వనితాసహితుండై జలవిహారంబున కరిగి యక్కోమలినిఁ దీరం బుననుంచి తక్కటిసఖులతోడ సలిలకేళిసల్పుచు దానింజూచి యిట్లనియె. 399

గీ. చెమటవోవమేనుఁ గమలాక్షిగడిగి కో
వలదెయనుచుఁబలుక వెలఁదినగుచు
కొలనఁజొచ్చిమునిగి గొబ్బునమాయంబు
గాఁగనృపతిదానిఁ గానఁడయ్యె. 400

వ. అంతనయ్యింతిఁగానక మడుఁగుజలంబు వెడలఁ జల్లించియుఁ ద్రవ్వించియు నెండులనిండుమురి చొప్పదెలియక నం దుండు మాండూకంబులు మిగిలెనమతలంపున నేందేనిఁ గలకప్పల జంప భృత్యులనియోగించిన భేకనాయకుండు మునివేషధారియై రాజుపాలికేతెంచి యిట్లనియె. 401

ఉ. నీకిదియర్హమే యొకఁడునేరములేకనృపాల యీగతిన్
భేకము లన్ వధింప జనబృందములారడి బెట్టనావుడున్
నాకులకాంతభ్రమింగ నివి నై జముఁజంపక మాననన్నదుః
ఖాకులచిత్తుఁడై నృపతికాతఁడు గ్రమ్మఱఁబల్కెనిట్టులన్ 402

క. వినుమేనాయువుపేరం
దనరినమండూకపతినిఁ దంళాక్షీ సుశో
భనయనునాసుతుబహునృపు
లనయముదానికినిబేలలై రి నరేంద్రా! 403

సీ. అనిదానిరప్పించి జనపతికోపించి
కూతునుద్దేశించి కోపగించి
సిలుగులఁబెట్టి తీవలబహునృపులను
కావుననీసుతుల్ కపటవర్త
నాత్మకులయ్యెదరంచు శాపంబిచ్చి
మండూకవధమాన్చి మానిజనియె
నంతఁబరీక్షితుండత్తన్విఁజేకొని
శలదలవలులనఁ జనెడుసుతులఁ

గీ. గాంచి శలునకుఁ బట్టంబుగట్టివనికి
జనినశలుఁడోజరాజ్యంబు ఘనతతోడఁ
జేయుచునువేటవేడుకఁ జేసియడవి
మృకములనుజంపుచును నొకమృగమునేయ. 404

వ. అది శరంబెత్తుకొని పఱచినదాని నంటనరదంబుగడపనేరని సారథినదలించినవాఁడు శలునిఁజూచి యివి వామదేవునశ్వంబులే మెకంబునంట రథంబీడ్వననిపల్క వానివలన మునితురంగంబుల

జవం బెఱింగి శలుండు వామదేవుపాలికేతెంచి యతనిఁ బ్రార్థించి గుఱ్ఱంబులఁ గొని చని మృగంబుఁ జంపి నిజపురంబుఁ బ్రవేశించి హయంబుల మునికొసంగక తనవశంబుఁ జేసికొని యున్నంత. 405

క. రాజతనూజుఁడు చిఱుతఁడు
వాజుల దెండయ్యనని తపస్వియు శిష్యుల్
యోజించి యచటి కనిచిన
నాజగతీరమణుఁ డీయఁడయ్యెఁ హయులన్. 406

గీ. వామదేవుఁడు శిష్యునివలన నదియు
నెఱిఁగి శలుఁగాంచి హయముల నిమ్మనవుడు
రాజయోగ్యములైన గుఱ్ఱము లవియవ
గొబ్బననుజనుమన మాని గొడ్డగొడవ. 407

క. మునివరునిఁ జంపఁ గింకర
జనముం బొరికొల్పఁజూచి సంయమి యలుకన్
దన తనువున రక్కసులం
గని శలుఁ జంపించి చనియెఁ గరముయధేచ్ఛన్. 408

చ. శలుఁడపుడట్లుదున్గినఁ బ్రజాతతి బొవ్వను వానితమ్ముఁడౌ
దలుఁడనువాఁడు సేయునెడఁ దాపసుడట్లనవచ్చి ధర్మువుం
దలఁపవు నీవు సత్కృతివి తద్దయు మాతురగాళి నిమ్మనన్
దలుఁడునురోషమొప్ప యిదెతాపసపొమ్ము బగుల్తునేఁడనన్.

వ. వామదేవుండు నగుచు శలువతనూజుమరణంబు భేదిం చనిరియె సంతలోన నంతఃపురంబున శస్త్రనిహతుండైన యర్భకుంజూచి హాహారవంబులు సేయు జనంబులంగని తద్దురా

త్ముంజంపుమనని శరంబదివోసి ధనుర్జ్యాణ స్తంభిత భుజుండై యుచ్చైశ్రవుడి వామదేవునిఁ గీర్తించి తత్ప్రసాదంబునఁ బుత్త్రునిఁ బ్రాణంబులు వడసి తనకుఁ బొరసిన కీడునంబాసి యతని గుఱ్ఱంబుల నిచ్చి సుఖంబున నుండె ముని నిజాశ్రమంబునకు జనియె నని చెప్పిన. 410

క. నరపతి మునిపతికల్లన
   శరములు మూఁకళించి యనఘ! కలఁడే తలఁపఁగా
   ధరనీకంటెను వృద్ధుం
   డరయఁగ ననవతఁడు నృపతికనియెఁ బ్రీతిన్. 411

సీ. అనఘ! యింద్రద్యుమ్నుఁడను రాజు ధాత్రిపై
   ధృతిఁబుణ్యములుజేసి దివికి నరిగి
   యందు ననేక సౌఖ్యములందుచును గొన్ని
   వేలువత్సరములు వెడలునంత
   నరిహొమ్మ్ముభువిని నీసన్న లేదనిసురల్
   బలికిననరపతి యిలకువచ్చి
   నాయన్నకడనిల్చి యోయయ్య! సుకృతినిం
   ద్రద్యుమ్ను నెఱుఁగుదే దన్ననుండు
ఆ. వె. నేనునెఱుఁగనిననఁ దానునంద్రోడ్కొని
   శీతనగముఁ దఱియ జేరియుందు
   ముసలియైన ఘూకమును వేఁడనదియుఁదా
   నెఱుఁగననియుమరియు నిట్టులలికె. 412

వ. నాకంటె వృద్ధుండు నాళికజంఘుండను బకశ్రేష్ఠుం డెఱింగెనేని వింతగా దక్షిణరుగుడవిన నారాజు నాతోఁ

గౌశికంబును మోచికొని చని పేరుచెప్పి యడుగ్గొంగనడుగ నది పెద్దపొద్దనుమానంబుజేసి యేనెఱుంగనేర నిమ్మహావునఁ జిరకాలజీవియగు కమఠంబుగలదట యెఱుంగనోపునని పేర్కొని పిలిచినఁ గూర్మంబువెడలె దానిట్లనయుడిగి. 413

క. చయ్యనఁ గన్నిరొలుకఁగ
నయ్యా నిన్నెఱుఁగనే మహాపుణ్యుఁడవీ
వయ్యా కంటినిభాగ్యము
లొయ్యనఁజేకూడెననుచు నొగిఁగీర్తించెన్. 414

గీ. అపుడు దేవదూతలారాజు రమ్మని
దివ్యరథముఁ జేరఁ దెచ్చుటయును
న్నపతిమమ్మతొంటి నెలవులనుంచిదాఁ
జనియెనాకమునకు సమ్మదమున. 415

క. ఎందాక పుణ్యపాపము
లిందుఁగ విన*మను నరున కెసఁగఁగఁదానుం
బొందుననాకము నరకము
సందియమొకయింతలేదు జగతీనాథా! 416

వ. అనిచెప్పిన విని యిక్ష్వాకు వంశోద్భవుండగు కువలయాశ్వునకుఁ ధుంధుమారుండను పేరెట్లుజెల్లెఁ జెప్పుమనిన యుధిష్ఠిరునకు మార్కండేయుం డిట్లనియె 417

చ. నరవరదుండునామమున నల్వగురక్కసుఁ డొక్కఁడుక్కునన్
బరగునులోకమొక్కట నుపద్రవమెప్పుడు జేయుచున్న శ్రీ

హారిదన దేజమా కువలయాశ్వునకిచ్చిన నాతఁడుద్ధతిఁ
ధరణినిఁజొచ్చి నిద్రగనుదైత్యుని సైన్యముతోడమట్టియుఁ.

క. భువిఁబ్రక్కలించి దనుజుని
బవరములోఁద్రుంచె నధికబాహుబలమునఁ
రవికులునకపుడు పెంపున
నవిరళముగ ధుంధుమారుఁడని పేరొప్పెఁ. 419

క. అనవినిధర్మజుఁడిట్లను
మునివర! పతిభక్తిగలుగు ముద్దియచందం
బునుదలిదండ్రులయెడలఁ
వినయముగలసుతుని తెఱఁగు వినిపింపుదయఁ. 420

క. సుతుఁడెట్టివాఁడు సదమల
సతియెట్టిది వారికెట్టి సద్గతినాకా
నతియీఁదగు ననవుడు న
మ్మతిమీఱఁ దపస్వియమ కుమారునకనియెఁ. 421

వ. పున్నమనర కాత్రియదీతి పుత్రియనువిధంబునఁ బుత్రశబ్దార్థంబును పతిరేవవ్రతంయస్సాసా పతివ్రతాయను నర్థంబున సతితెఱంగునుం దెలిసియున్నవాఁడవైన నీయడిగిన ప్రశ్నలకు సమాధానంబుగా నొక్క యితిహాసంబుగలదు సావధానముగా నాకర్ణింపుము తొల్లికౌశికుండను విప్రుండు శిష్టగ్రామంబుచెంతన మహీజంబుక్రింద ననవరతం బధ్యయనంబు గుణింపుచున్నతరి నతనిపై కొక్కెరవిష్టించిన క్రోధంబునదానింజూచు తక్షణంబయదిపడిచచ్చిన నచ్చెరువంది పశ్చాత్తాపంబునవగచి

యనంతరంబ మధ్యాహ్నసమయంబైన నెప్పటివగిది భిక్షంబున కొక్కశిష్టవాసద్వారంబుననిల్చి భిక్షాందేహియనునవసరంబున.

క. ఆయింటిగృహస్థుండట
పోయివగయునాకలియునుబొరసిన శ్రాంతుం
డై యసురసురై వచ్చిన
నాయమపతి యెదురుకొనియె నవ్వుచుప్రీతిన్ 423

గీ. ఆపతివ్రతయర్ఘ్యపాద్యాదివిధుల
ఘనతఁబూజించి మృష్టాన్న మొనరఁబెట్టి
విభుఁడుశయనింపఁ బిదపనావిప్రుఁదలఁచి
మధుకరముఁదెచ్చెనపుడు బ్రాహ్మణుఁడుగనలి. 424

క. తడువయ్యె నీదువాకిటఁ
బడియుండితి నన్నుఁజూచిపడఁతీ! భిక్షం
బిడకను గడిపితివెడగాఁ
గడుఁగ్రొవ్వన విప్రమహిమఁ గానవొ చెపుమా! 425

క. నావినితూయమునిను భూ
దేవోత్తమ! మత్ప్రియుండు దృషితుండగుచుం
దావచ్చిన నిలిచితిఁ ద
త్సేవనునాతప్పు సైపుచిత్తములోనన్. 426

వ. అయినను స్త్రీబాల వృద్ధజనంబున కెఱుకఁదఱుచు నెరయదుగాన మీముబోటిమహాత్ములు కరుణ సేసిసైరించుట చితంబకాదెయని యనేక ప్రకారంబులఁ బ్రార్థించిన నతండు రోషంబునఁ దగ్గకున్నంజూచినగుచు బక్షినివీక్షించినఁ జచ్చెనను

తలంపున నిపుడట్లనవిచారించెదో మత్పతివ్రతాత్వ సామర్థ్యం బున నట్టిది గానేరదు శుద్ధహృదయుఁడైన విఁతియకాని ధర్మ సూక్ష్మంబులై యర్థంబులెఱుఁగవు కావున మిథిలానగరంబునకుఁ బోయి ధర్మవ్యాధుండను బోయనడిగిన నతండునీవలయు ప్రశ్నం బులుదెలుపునని విస్మయంబునఁ గౌశికుండమ్మగువకు నమ స్కరించి కిరాతుపాలికరిగి వానియంగడి మాంసఖండంబులవలన హేయంబగుటంజేసి డాయరోసి యంతసంతనుండెనంత.

చ. తనదుపవిత్రయోజనంబొక విధంబునవెప్పటియట్లతీర్చి యా
యనకడకేఁగుదెంచి వినయంబునబోయ నమస్కరించి యో
యనఘ!పతివ్రతాతిలకమంపెనొ నిన్నిటఁకన్న విస్మయం
బునద్విజుడెంచె రెండవది పొమ్మదియాచ్చెరుపాటురీతికిన్.

క. వెండియుధర్మవ్యాధుఁడు
గొండొకనెయ్యమునఁ గౌశికుని పరిశ్నలకుఁ
బొండొరోడేమియనక రా
రండనితెచ్చెఁ గృహాంతరంబున కెలమిన్. 429

సీ. అందులమహనీయమగు హంసతూలికా
తల్పాంతమున వృద్ధతములునైన
తలిదండ్రులనుజేరి దండప్రణామంబు
లొనరించికుశలమే యనుచువారు
పుత్రునివంటి సుపుత్రునిఁగన్న మా
కెందును గొఱతలు జెందవనిన
జలములనార్చి భోజనమిడి పాదముల్
బిసికి వృద్ధులుప్రీతిఁ బొసఁగవత్స!

గీ. పొమ్ము భుజయుంపుమాకలిఁ బొందితనుచు
మేనఁబునుకుచు వీడ్కొల్పఁ దానునవుడు
తగినవిధమునఁగుడిచి సంతసముతోడ
గౌశికునిఁజూచి యిట్లనుగౌరవమున. 430

క. వినుగురుసేవయు నరులకు
ఘనమగుపుణ్యంబు వారిగాదని నీవి
ట్లనుపమగతిగనియెదవో

431

వ. ఇంతనైన గృహంబునకరిగి తలిదండ్రులదైవంబుగాఁ దలంచిభక్తినలుపునది శాంతిపీఁడక పరులకుఁగీడుదలఁపక యుండుటయుత్తమ తపోధర్మంబు నీవింతనొప్పియు మృగహింస కొడంబడి తనవలదు, స్వధర్మంబు దూషితంబుగాదైనను పరులుదెచ్చి నమాంసంబు విలువకుగొని యమ్మితల్లాభద్రవ్యంబున నతిథి గురు దర్పణంబులో నగుకృత్యంబులొనరించి యనుభవింతునని చెప్పి వెండియు బ్రాహ్మణుండడిగిన ధర్మసూక్ష్మంబు లెఱింగించిన నతండు సంతుష్టాంతరంగుఁడై కిరాతునివీడ్కొని చని తదుపదేశ క్రమంబునఁ బ్రవర్తిల్లెఁ గావున భర్తృశుశ్రూషయు సతులకు నుత్తమగతి గురుజనసేవయు పురుషులకుఁ బరమార్థంబనిన విని సంతసించి మరియు వహ్నులప్రకారంబు వినఁగోరిన ధర్మజునకు మార్కండేయుం డిట్లనియె. 432

సీ. జ్వలనుండుమును నిలింపులతోడినలుకచేఁ
దడవుకాలము కానదపముసేయు
చుండినెట్టన నిట్టులూహించెహవ్యముల్
దాల్పకనావచ్చు తలఁపుచేత

లోకముల్ వ్యవహార లోపములై నిల్వ
నాడు వేరొక్కని నలువనాదు
పతము ననిడుతప్ప పనిసేతకనికిమ్మ
రనునిజస్థానంబు గొనఁజనంగ
గీ. నంతకయు మున్న కమలజునాజ్ఞ చేసి
యాంగిరసుడగ్ని యై పనియందుఁజాలి
యున్నగనిభీతిననలుఁడు నోజమగుడ
నప్పుడాంగిరసుండు దానతనిఁబలికె 433

చ. అనఘ! భవత్పదంబునకు నాఢ్యుఁడవై చనుదెమ్ము నాపుమన్
నినుఁబరమేష్ఠి తాఁపుకొననిల్పిన వాడికఁబోలదన్నని
ట్లనువినుమేచు నగ్రతనయ స్థితినుండెద నంచు నాతనిన్
మొనసగుబాటుసేయఁ గడుమోదమునొందుత నట్లగ కొనెన్

గీ. అంతనాంగిరసుండగ్ని కగ్రతనయుఁ
డగుచు సారూప్యమునుబొంది జగతిఁబ్రబలె
నతనికొనర బృహజ్జ్యోతియాదిగాఁగఁ
బుత్రపౌత్రులు పన్నులై పొసఁగిరెసఁగ 435

క. అనవినిధర్మజుఁ డిట్లను
ననఘా! గుహుఁడగ్నికిని మహాదేవునకున్
మునిపత్నులకును నేగతి
తనయుండనఁబరగెఁ జెప్పు తద్విధమనుఁడున్. 436

వ. తొల్లి సుర లసురలకు నోటువడి తొలంగి చని సుర
పతి యొక్కరుండొక్క శైలంబున నేకతంబ సురలకు సేనాపతి
యెవ్వండగునోయని కార్యతత్పరుండగుచున్న సమయంబున

రక్కసుపఱసిచేరం దఱగించి రక్షింపరే యన్నలార యనుమానినీ దీనాలాపంబు లాకర్ణించి యద్దిక్కునడచి ముందర నబలనెత్తి కొని గగనంబునం జనుచు నిశాచరుంగని పోనీక ఘోరసమరంబు జేసి యమ్ముదితను విడిపించిన నదియు నన్వయగోత్రనామంబుఁ నెఱింగించునప్పుడు చెలియలింగా వానినెఱింగి నీకిష్టంబగువరంబుఁ గోరుమన్న జగదేకవీరుండగు పతింగోరిన తన్మహా ర్తంబు రౌద్రనామకంబుగాఁదలంచి యజపాలికరిగి దీనికిఁ బతి యెవ్వండగు నని నురచమూపతియగు బలియుండు సత్వరంబుగా భర్తయగు ననుడు సంతసిల్లి వ్రజిచనియె నంత వసిష్ఠప్రముఖసప్తర్షులమా వాస్యాహోమంబు సేయుచున్న వహ్నిహవ్యంబు దేవతల కొసంగుచుఁ దత్పరిసరవర్తినులగు మునిపత్నులయం దభిలాషం బొంది మదనశరపీడితుండయ్యును హోమసమాప్తియైనఁ బదం పడి నిర్జనంబైన కాననంబుఁ బ్రవేశించి తనమనోరథంబు దుర్ల బంబనివగచి దేహత్యాగంబునకు సమకట్టు సమయంబున. 437

క. తనవల్లభు మమతఁ మదిఁ
గనిస్వాహాదేవివారిగతి వేర్వేరఁ
జనుదెంచియనలుఁ బొందుచు
ఘనరేతస్కంద మొనరఁగావించెదగఁ. 438

క. పతిప్రీతుఁజేసె మానుల
సతులతెఱంగొప్పనారు చందముల నరుం
ధతి రూపలవడదయ్యెను
జతురత నలరారునట్టి స్వాహాసతికిఁ. 439

గీ. అంతనారుదినంబులఁ కవయువంబు
లఁ రవణ్ముఖుఁడుదయించి యానగమున

నున్నహారువిల్లు మోయుంపు చున్నలోక
మెల్లనలజడి బడిమరి యిట్టులనిరి. 440

క. జ్వలనునకార్యోరుముని
త్నులుగన్న కుమారువలనిదో యీపాపం
బిలకను నడిబోరసిమ నుల్
లలనలఁజేపట్టిరెరి లఘుతరమగుటన్ 441

గీ. ఒనరవారు కుమారుని యోగమునను
గగనమునఁగృత్తికాఖ్యల నెగడిరంత
నాకుమారుని పాలికి హారుఁడువచ్చి
తనకుమారునిగాఁజేసి కొనియెబ్రీతి 442

వ. అంతషణ్ముఖుండు సురపతియొద్దనున్న దేవసేనం బాణిగ్రహ
ణంబుసేసి దేవసేనాపతిత్వంబు వహించి మహిషాసురాది దానవు
లనమోఘశక్తిచేఁద్రుంచి లోకంబుల కిష్టంబుసేయుచుండెనని మా
ర్కండేయుండుజెప్పిన పాండవులు సంతసిల్లిరి టిష్టకథావిధావినోదం
బులఁబొద్దుగడపునెడనేకాంతంబునసత్యభామదౌపతికిట్లనియె443

క. మగలేగురకునొకగతిన్
మగువానీయందుఁబ్రియము మందో మంత్రం
బగునో చెప్పుముసేసీ
పగిదినిఁగావింతు హరిఁనిబాంచాలసుతా 444

చ. అనవినిరోషరూషిత దృగంచలయై యవహిత్థనూనియా
వనితముకుంద సుందరిని వారక పక్కలతాంగిమేలునీ
వనయమునిట్టులాడదగవా నగవా ఘగువా మనంబులో
న్ననొకవిధంబు వానినిఁగనందగదే వినుమైనఁజెప్పెదన్ 445

క. అత్తకునూఱటసేయుదు
హత్తుకపనులందునేనయైయుండుదుఁద
చ్చిత్తమురామెలఁగుదురా
జోత్తములగు పనులభక్తి నొగిమెప్పింతున్ 446

క. భక్తింబతి సతికెప్పుడను
రక్తుండగుఁగాక తాను రహిఁ జెడఁగనియా
సక్తుఁడుగాఁడనివగచిన
యుక్తంబగుటెట్లు వమ్మలూహింపంగన్ 447

ఆ. వె. కత్తిమీఁదిసాము గానుండఁదగుఁగాని
చనువొసంగనొకటి యనఁగఁదగునె?
పురుషుఁడెట్టిపోక పోయినసైరించి
సతులకొక్కవిధము సలుపవలయు. 448

క. ఏనీపతిభక్తియు తగ
గానొండేమియునెఱుంగఁ గష్టవువనితల్
బూనక యడిగినగతి న
న్నోనళినదళాక్షియడుగు టుచితమెయనుడున్. 449

ఆ. వె. సత్యభామద్రుపదజాతఁ గౌఁగిటఁజేర్చి
మెలతతప్పుబయటు మెరయవలదు
సైపుమనిన నగుచు నడిబుచ్చియొండొక
గోష్ఠినడిపిరపుడు కోర్కులలర. 450

వ. అంత సత్యభామాసహితుండై కృష్ణుండు పాండవుల వీడ్కొని ద్వారవతికిఁజనియె మార్కండేయుండు నిజాశ్రము

బున కరిగెఁ దదనంతరంబ పాండవులు కార్మికంబు విడిచి ద్వైత వనంబుఁ బ్రవేశించిన నచ్చటికి కరినగరంబునుండి యొక్క బ్రాహ్మణుండు వచ్చి వారలను సముచిత సల్లాపంబుల నూఱడఁబల్కి చని ధృతరాష్ట్రునకు ధర్మజాదుల దురవస్థఁ దేటపఱచిన నతండు దుఃఖితుండయ్యె నయ్యెడ సుయోధనుండు శకునిప్రభృతి దుష్టచతుష్టయంబుతోడ మంత్రాలోచనంబుఁ జేసి పశురక్షణంబునకై మృగయావ్యాజంబున నాంబికేయు నొడంబఱచి. 451

మ. తనసామ్రాజ్యవిభూతిఁ జూపి కడుసంతాపంబుఁ గావింతు గా
ననుకార్శ్యోన్నతులైన పాండుసుతులకన్నల్పొప్పనేడంచు దు
ర్జనుఁడాకౌరవభర్త సైన్యములతోఁ జక్కన్ విడంబించి త
ద్ధ్వనిముట్టన్ గడఘోషయాత్రకును బల్దంభంబు పొంపారఁగన్

క. కరినికరకర్ణమారుత
పరిచలితసమస్తసైన్య పాదరజంబా
కురుపతియంతన్నానము
శరణిందధ్ధరణిచల నగతిఁగనుపట్టెన్. 453

సీ. అప్పుడుకీలాయలెదురుగా నరుగుదెంచి
మ్రొక్కివినయంబుసెప్పిన పెక్కుతోడవు
లొసఁగికతిపయజనములు మునురుగవియ
మందచేరువకరిగె నమందగతిని. 454

క. గోపాలురు నాపశువుల
రూపములుం బేళ్ళుదెలియ రూపించినచో
భూపాలుఁడు ముద మొందుచు
చూపరులొగి మెచ్చనిచ్చె శుద్ధాంబరముల్. 455

చ. హిత సహితంబుగా నట నభీష్టగతిం బరమాన్నగోరస
ప్లుతిబతి దేలి యోలిం గడుపుం బొడవుంగఁ జేయుఁడంచు నా
నతియతియున్నతింగరుణ నల్వగ గొల్లల కెల్లనిచ్చి దు
ర్మతము మనంబులోపలను మల్లడిగాం మగిడెన్ ముదంబునన్.

గీ. భావియగు రజ్జుబంధన పదముఁ దెల్పు
సరణిసంగదములు కేలఁ జక్కఁబెట్టి
కౌరవుఁడు సైన్యమునెల్ల గములుగట్టి
నేర్పరించెను సవరణ లెసక మెసఁగ. 457

మ. కడునభ్రంకష మైనయొక్క వటవృక్షప్రాంత దేశంబు నం
దుడుగాడ్వంశ్యుఁడు గీతిరీతిరసికార్యుల్ గొల్వఁ గొల్వుండియున్
వడిస్వర్గాయకనాయకుం గడిమి నాహ్వానంబుఁ గావించు పెం
పడరన్ వైణికచారుగాన కలనం భావింపుచుండెం దగన్.

వ. అప్పుడు తత్సమీపంబునం గల సరోవరతీరంబున ధర్మ
తనయుండు మునిసహాయుండై సద్యస్కంధంబను జన్నంబు నే
యుచున్న నక్కొలంకు కెలంకునఁ గ్రీడాగృహంబులు నిరహ్వాం
వఁ బరిజనులు సుయోధను పనుపునఁ బనిఁబూని యట్లు సేయు నెడ
గంధర్వులు కొందఱేగుదెంచి వారి వారించుట యతం డెఱింగి
బలిమిన దినేయ సమకట్టు సమయంబున ధార్తరాష్ట్ర దార్త్యచేష్టిత
రాత్యంబు నిరీక్షించి సుధాంధఃపతి యనుమతి నతిక్రోధాంధుం
డగుచు విధృత కృపాణ బాణచాప కలాప భర్మ వర్మ విచిత్రమి
త్రసేనుండగు చిత్రసేనుండు తడయక నడవిఁ డిగ్గి వెగ్గలంబగు
బుతుతరక్షుచమూరుతవితతిం బోలె లక్షితవిపక్షచమూరుతతిం బె
లుచ నడల్చి క్ష్వేళానాదంబున లోలామోదంబుగాఁ జేసిన. 459

గీ. సురగిమూకవిఱుఁగు జూపఁగోపగుచేత
నగిమదేభచారుఁడగుచుఁగర్ణుఁ
డరిమిజమునివెన్ను జరచినగతికేల
నప్పళించి రిపులకష్టపడియె. 460

మ. తననామావయవస్థలిఁ భటులకుద్దండక్రియన్ నాట్యమిం
పుసఁగావించు గుణార్భటీయుత ధనుర్ముక్తాశుగవ్రాతముల్
ఘనగంధర్వచమూసమూహ సకలాంగశ్రేణియందెల్లవే
జొనిపెం గుత్తుకబంటి నెత్తురులుగా సూతాత్మజుండాజిలోన్.

క. సందడికయ్యంబుననొక
కొందఱుదలపడిరిచనిరి కొందరసూయం
గొందరునూరక బెగ్గిలి
చిందరలై రందునోరిచిరి గొందఱొగిఁ 462

మ. కరిమమేపారఁగనంబరంబున శిరఃకంపంబుచేఁగర్ణదే
శములఁ వ్రాలివతంసవల్లిరి శరాంచత్పతువాతాహతిఁ
గమనీయంబుగఁదొంటి చందమున వేగంబొప్పఁగాఁగప్పఁగా
సమరోల్లాసి మునీంద్రుఁడాడె సురలెంచంగుంచెసారించుచున్

గీ. అఖిలమునకుఁ బ్రవీణైకహస్తములను
గర్ణసుధ నించుగంధర్వ గణమయుక్త
మమరనపుడు ప్రవీణైకహస్తములను
గర్ణవధకై శరాసార కలనఁజూపె. 464

వ. అంత విశ్వాతిశయంబగు విశ్వావసుకుమారు శరపరం
పరలకు నిలువనోపక సత్వరంబునకుఁ దద్బాణగణంబుతోడఁ బన్ని

దంబుజరచి యుద్ధయశోగేయుండై రాధేయుండు బారిన నాయోధ
నంబొనర్చు సుయోధనుని డాసి గర్వించి పెంపున గంధర్వులాకృ
మించి ప్రగ్గంబుల బెడకేలుబంధించి కరుబృందంబాక్రందింప నిర్జర
పథంబుపట్టి తర్జించుచు రభసవర్జితంబుగా నరిగిరవుడు 465

క. పెడకేలుగట్టి మార్మొడ
నిడిపతిఁగొనిదివము తెఱవు హితతతిఁబట్టఁ
గడగుడువర్గమువగ న
య్యెడ విని ముఖమెత్తెనంపరడరిన లజ్జఁ. 466

చ. అతనిసతీమణుల్ విగళితాశ్రువు లందెరు వెల్లఁబంకిల
స్థితినొనరింపుచుంగతులచేఁ బదముల్ తడఁబాటుఁబూన్గను
ద్ధతినెదమోదికొంచుఁజని ధర్మజుకాళ్ళనువ్రాలిసిగ్గు నం
గొతుకుచుముందరంబిలిచి కొంతశిరంబులువంచి దీనతఁ. 467

వ. డగ్గుత్తిక నిట్లనిరి.

క. దేవా ! మీపదపద్మము
సేవింపఁగనిపుడు సకలసేనలుబంధుల్
వావిరిగొలువగ భవదీ
యావరజుడువచ్చునెడ మహారణ్యమునఁ. 469

గీ. లేశమైననెపంబేమిలేదు పాప
కర్ములైరొక్క దేవతాగాయకుండు
పట్టిబంధించియక్కట భటులుదాను
నున్నతినిమింటఁగొని చనుచున్నవాఁడు. 470

ఉ. కావున నీదుపాదములు గాంచిన యట్టి వధూజనాళికిన్
భూవిదితంబుగాఁగ గళ భూమిని మంగళసూత్రి బంధ నా
భావముమాన్చియీబొరయు బాముఁదొలంగనొసంగుమిప్పుడో
భూవర! యర్థిలోకసురభూ రుహా! దీనదయాపరాత్మకా! 471

క. అనిసంగరుణారసమెదఁ
దొనకన్ యమసూనుఁడపుడు తోఁబుట్టువులం
గనుఁగొన నన్నకు మారుత
తనయుండిట్లనియె హర్షతరళుండగుచున్. 472

క. సర్వము జక్కనయయ్యెన్
గర్వితువిడిపింపుపనికిఁ గడగందగునే?
యుర్విం గాఁగల పని గం
ధర్వులుదీర్చెదరనంగఁ దథ్యముగాఁగన్. 473

క. నావినియజాత శత్రుఁడు
పావనితోఁ బల్కునిట్లు పాడియె పగరం
గావరెశరణముఁజొచ్చిన
నీవెడమాటాడ ధర్మమెఱుఁగవె? చెపుమా. 474

వ. అనియిట్లు. 475

చ. శమమునఁ బల్కుధర్మజుని శక్రజుఁడిట్లను నీకునేమి పా
పమబగవానిబిడ్డలను బట్టకయుండుట చాలునన్న యా
క్రమముఁదలంపు ధర్మమునఁగాదె దురంతర ఘోరదుఃఖముల్
మమునెడబాయకుంటదయమానుముహూర్తముమాత్రమిమ్మొయున్

వ. అనిన యుధిష్ఠిరుం డిట్లనియె, 447

ఆ. వె. నాకుదీక్షకతన బోకతక్కుటవచ్చె
నై నవా ర్తరక్షణార్థమునకుఁ
బోదుఁగాక మీరుఁ బోలిన తెఱఁగున
నలుపుఁడంచు నతఁడుసంభ్రమింప. 478

వ. మఱియు నయ్యెడ నాడు గుయ్యన నెయ్యంబునఁ కయ్యంబున కియ్యకొను నయ్యన్న నొయ్యన దియ్యనిమాటల వారించి యతని నిర్బంధంబున సుయోధను దుర్బంధంబువిడిపింపం దలంచి భీమార్జున నకులసహదేవులు నలువురు నతిసత్వరంబున రివులవెన్నాడి నడచి కోపకుటిలీకృత భ్రూదండంబులకరణి కోదండంబులెక్కిడి సింహసింజనీనాదంబులఁ దక్షణంబంతరిక్షంబంతయు వికరస్వగుణంబులు గావించిరప్పుడు. 479

చ. కడిమిరినల్లకీధరులు గాయకనాయకులైన మీరలె!
క్కడికురువంశసంభవు లఖర్వధనుర్ధరులైన రాజులె
క్కడఁదగుమీరు నీకరణిఁ గారణకర్కశ చాపలత్వముల్
ముడిఁగొనుటెట్లహో! యిదిస్వప్నమూలకమో! పరమూలకంబొకో.

చ. ఘనతపృషాంక మాళికినిగాయము సాయములేకజేసె న
జ్జనుఁడొగినివ్వనాంతమునఁజక్కవసించిన వార్తమీచెవిన్
వినఁబడలేదొకో వినిన వీతభయస్థితినిట్టి సాహసం
బునకుఁగడంగి వచ్చుటయహో కడువీఱిఁడిసేఁత జూడగన్ 481

చ. ఇతఁడుమదీయుఁడన్న యగునిప్పుడు గట్టితికేల డించుఁడి
గతివిడరేని నాదయినగాండివదండము నేనుబట్టినన్
శతమఖుఁడొయ్యనం దనభుజప్రథి మానయశంబు దానమీ
బ్రతుకరజూచి వీణియను బట్టిరయంబునఁబాడ జేయుదున్.

చ. నరుఁడిటులాఁతు వీరవచనంబుల నవ్వసుపర్వ గాయకుల్ 482
బరగెడు వీణలంసముఁ బైఁదగఁబెట్టి శరాసనంబులుం
గరములఁబట్టి టాంకృతులుగాఁగ నొనర్చి యెదిర్చినన్ యుధి
ష్ఠిరునను జన్మలాహవము నేతకు మార్కొని రొక్కపెట్టునన్

క. వారికివీరికినగునా
భారపుబవరంబునేఁత భావించి గను
ర్వారంగగనాంగణ సం
చార సభాసదుల దేహసంఘుం బెల్లన్ 484

మ. క్రమమొప్పారఁ గభీర గాండివ గుణాకర్ష చ్యుతస్ఫీత బా
ణములంబౌహులు దేహముల్ దలలుగండప్రాంతముల్ గాడగ
ర్వమువోనిచ్చి భయంబునంది వినివారల్ వేగ గంధర్వభా
వమునిక్కంబుగఁ దద్భుద్భృగ్గమనముల్ వర్ధిల్ల సంధిల్లియుణ్.

క. బంధుర నరసాయకముల
గంధర్వులు గగనతలము గలయంబెలుచణ్
గంధర్వంబులక్రియఁగదు
సంధిల్లఁగఁబరువులెత్తు సమయములోనణ్ . 486

గీ. పాఱఁజూచినవారి నేర్పారఁజూచి
ఫల్గునుఁడుబూన్చెఁ బృథుశరపంజరంబు
దానిలోవారు వలలోనఁ దవిలినట్టి
పులుఁగులనుబోలె వెలికేఁగ నలువుచెడిరి. 487

గీ. వీణలన్నియునరుబాణ విహతిఁజేసి
పడియెభువియందు గంధర్వబలమువలన

దివినినారదహస్త సందీప్తయగుచు
నొక్కవీణయనాయువు నుల్లసిల్లె. 488

ఉ. గాయకపాండుసూనులకుఁగయ్యములో శరబారయుక్తియిం
తాయనిస్పష్టమెతసరెఁ దద్దయనెట్లనివారి బాణముల్
పాయకలక్ష్యమాత్రముగఁ బాటిలెఁగమ్మర లక్ష్యభేదముల్.
జేయుచువీరికాండములుశీఘ్రమయంతనుజేయనూల్కొనెన్.

వ. అట్టి సమయంబున ఫల్గును దాదృగ్విక్రమంబభినం
దించి చిత్రసేనుండు డాయనేతెంచి మైత్రినెఱపి పురందరు నిదేశం
బుఁజెప్పి వీఁడుతనవిభవంబు మీకుఁ దేటపఱచి చూపోపమిఁబు
ట్టించి దుఃఖంబుల నొందింపఁదలంచి యిట్టి వచ్చుటగావున విడు
చుటకర్జంబు గాదనినఁ బ్రణయపూర్వకంబుగా విజయుండతని
నొడంబఱచిన నొసంగి చనియెనంతఁ బౌరుషవిహీనంబగు నీబా
హుయుగళంబు బురస్కరింప యోగ్యంబుగాదను బుద్ధిని బంధన
మిషంబున వెనుకనిడికొనిన చాపునందన నిజభుజాదండంబు లమ
రిన సుయోధనుందెచ్చి భీమార్జును లజాతశత్రుముందటంబెట్టిన

ఉ. అత్తఱినొక్కకుంజ నిలయంబునఁబార్థతిఁజెంది వేడ్కపే
ర్చెత్తనుయోధనుంగనుచు నెక్కుడుహాస ముఖాదివిక్రియల్
మొత్తములై సమీపమున మూగినమాకుల కెల్ల నూసనం
పత్తినొనర్చెనచ్చెరువుపాటును నచ్చటవారలొందఁగన్. 491

వ. అప్పుడుగాంధారేయుఁ గాంచి ధర్మజుండిట్లనియె. 492

సీ. విశ్రుతంబై ధరవెలయునీమనవంశ
ముననీదుపుట్టువు దనరిమరియు

త్రిభువనవిజయులౌ ధీరవరేణ్యులు
మొనసి పెక్కండ్రు తమ్ములనుగొలువ
నాధిపత్యంబున నలరినీచుంచేత
భంగపాటిపుడిట్లు బడితివయ్య
నృపులకుంబరులచే నెరసినపరిభవం
బదియకీర్తికి రాజయుతులకుం

గీ. ననుచుధర్మతనూభవు డాడిభీము
చేతందద్బంధనమువిడంజేసిపురికిం
బొమ్మునీవిట్టికానన భూములకును
వత్తురేసాహసము మానవలదెయింకను 493

క. అనిబుద్ధి గఱపిచనుమన
జనవిభుడను మానమవుడు జారి ధరిత్రిన్
మునుకొని వడిగన్ వెదకుచు
జనుతెఱంగున మోముకంచి చనెగొందఱతోన్. 494

గీ. అట్లుచెదరినసేనలు నంతనంతం
గూర్చుకొని కొంతదవ్వుగాంగురువిభుండు
జని సమంబగు నొక్కవిశాలభూమి
యందువస్త్రనివేశముల్ పొందుపఱచి. 495

క. ఒకయభ్యంతరగృహమున
శకలీకృతచిత్తుండగుచు శయనించినచో
నెకిమీనింగాంచెంగర్ణుడు
ప్రకటోచితవృత్తి యుక్తిపరుడండై యంతన్. 496

గీ. అపుడు సూతజు రాకకు సధిపుఁడతని
మోముఁగనఁ బోడిలజ్జ చేమునిఁగియున్న
రాజుఁగని యాతఁడస్మత్పరాభవంబు
కతనని టుండెనో యని కర్ణుఁడనియె. 497

చ. మనుజవరేణ్య! నీదగు సమానుష పౌరుష మెల్ల వారికిన్
జనునె టునా బలంబునను జాలినకయ్యముఁ జేసి శత్రులన్
దునిమిరథంబుఁ బోవఁగని తోడనె పార్థుని తోఁడో లంగితిన్
గనవిన లేదు మేము భువి గార్యములిట్టివి కౌరవేశ్వరా. 498

క. మనుజు లశనముఁ గొనున
ద్దనుజుల నశనులను గూల్చుఁ దగునా రిపులన్
మనుజేశ! గెలిచితేమని
కొనియాడుదు నిన్ను నీదు గుణసత్త్వంబున్. 499

గీ. అని సునేకగతుల నగ్గింపమరియును
విభుసు సిగ్గుముసుకు వెగటుగదుర
వీఁడునా విధంబు విన లేమకన లేదు
చెప్పడిప్పడనుచుఁ జెప్పెనిట్లు. 500

ఉ. ఏటికి బెద్దఁగా బొగడనివ్వడు కర్ణ తలంచిచూడఁగా
నేటికి మిమ్ముఁ జూడనొక నిర్ణయమింతియు కాక శాత్రవున్
ధాటిని ముట్టి మమ్ముఁ జెరఁదద్దయుఁ బట్టిన పాండుపుత్రు ల
ప్పాటు దొలంగఁ బెట్టిరొక పాటి దె యీ పెనుబన్న మెన్నఁగా

క. వినునా బ్రతు కెక్కడ నా
ఘనులగు గంధర్వ పతులకల నెక్కడ న

ర్జునుఁడను దైవముకడఁద్రో
చెనుమాదురవస్థయనుచుఁజెప్పియు మఱియున్ 502

గీ. కడమయనవేల పెడకేలుగట్టినన్ను
రిపులుగొని పోవఁబాండవులవురు దాకె
బలిమి విడిపించుటయు నాదుగెలుపు సుమ్ము
సారిదినేమని చెప్పుదు సూతతనయ. 503

క. మనదుర్మంత్రింబెలను
వినిపించిరి పాండవులకు వెసగంధర్వుల్
వినుమప్పటి నాలజ్జకుఁ
బనిలేదిఁకనింతయనుచుఁ బలుకగుకర్ణా! 504

క. పగవారికి దుర్మంత్రిం
బగపడియెననదియునుగాక నట్టులవారే
మగుడఁగ మముపిడిపించిరి
తగునే? బ్రతుకంగఁజావఁ దలఁపఁకకర్ణా! 505

వ. కావునఁ బ్రాయోపవేశంబునఁ బ్రాణంబులు విడుచుట యవశ్యకర్తవ్యంబగు నీదుశ్శాసనుం బురస్కరించుకొని కరినగరికరిగి యతనికిఁ బట్టంబుగట్టినది మిత్రజనరక్షణంబును శత్రుజన శిక్షణంబును జేయుననదియని పలికినను సుయోధనుపాదంబులపైఁ బడి దుస్ససేనుం డేడ్చుచున్న నాయన్నయుఁ గన్నీరువెడలనుండె. వారల నిరువురంగని దుఃఖావేశంబున డగ్గుత్తికవెట్టి యెలుంగువేరొక్క తెరంగునఁ గన్నడఁ గర్ణుండు నదలింపుచు సుయోధనుంజేర్కొని యేలయేడ్చెదరు. శోకమగ్నులకు సిరియుతేజంబును గీర్తియుందరిగిపోవు నిప్పుడు పాండవులచేత విడిపింపం బడిలిననని

దుఃఖంచెదవుగాని లగ్గెఱుంగనేరవ దెట్లంటేని యెవ్వనిదేశంబున జనులు నిర్విచారులై సుఖింతురు వారలనికి భటులుగావున నీ రాజ్యంబున నిశ్చింతంబుగా సుఖించు కౌంతేయులు నీకింకరులట్ల కాదే? యిదియునుంగాక జూదంబునాడు నీకు దాసులైన కతంబున ప్రభునకొక్క సంకటంబు బొరసినతరి తమతమచేతలబోయి నట్లు చేయుటకర్జంబు. కార్యంబునందు వివేకంబుచాలకనామాట విననైతేని నిన్నే మనసేర్తును. మేమందరము నీబోటివారము. నీవు పోయినత్రోవం బోవుదమని శకునియు నిట్టిదచందంబై యున్నది కాదేని యుపకారపరులగు పాండుసుతులకుఁ బ్రత్యుపకారంబుగాఁ బుడమిపాలించునదియని బోధించిన ధార్తరాష్ట్రుండు మరణంబందు నిశ్చయంబు మరల్పనేరక కర్ణసౌబలశకునులం జూచి మీరేలనన్నుఁ గాసిపెట్టెదరు ధర్మైశ్వర్య ధనభోగంబులందు నాకభిలాషంబులేదు. ప్రాయోపవేశంబున సురలోకంబున కరుగుదునను సమయంబున సూర్యాస్తమయ కాలంబయ్యె నంత నొక్క విజనప్రదేశంబునకుఁజని సంధ్యావందనాది క్రియలు నిర్వర్తించి దర్భపఱచికొని యాసీనుండై బాహ్యేంద్రియ వ్యాపారంబుఁ గ్రమంబునఁ దలంగించి నిశ్చలుండై నివాతస్థల నిహితదీప కలికయుంబోలె వెలింగెనప్పుడు. 506

క. బ్రతుకనసముత్సుకమగునర
తతియేప్రాయంబుగాంతుఁ దలఁపునుఘనుఁడై
యతఁడా త్రిదశప్రాయము
మదిఁగోరుచు బ్రతుకువిడ సమాధివసించెఁ. 507

ఉ. ఆసమయంబునం గురుకులాధిపునిష్ఠకు నారసాతలా
వాసులునైనదానవులు సందురికత్రునిచేతవేల్మి సం

భాసితరీతిఁ బెట్టఁగను పట్టితదగ్నిని కృత్తిఁ బుట్టినన్
వేసని తెమ్మనీవిటకు వీరవరుండగు ధార్తరాష్ట్రునిన్. 508

వ. అతండును గాసిల్లినాఁడు ననవుండదిగ్గి కొని యట్లన
తెచ్చి యిచ్చె నంత 509

ఆ. వె. గ్రుచ్చి కౌగిలించుకొని కుశలము వేఁడి
యుచితపీఠ మొసఁగి యొగిసివారు
అతనిఁజూచి యిట్టులనిరి హితోపదే
శంబుగా మనంబు శాంతిఁబొంద. 510

సీ. తగునయ్య నీకిట్టి తలఁపుఁబూనగశౌర్య
మెడలిన పురుషుండు చెడకయున్నె
పాండవుల్ దేవాంశభవులు నీవస్మదీ
యాంశసంభూతుండ వవనియందుఁ
బరమేశుఁగూర్చి తపముఁజేసి మేమెల్ల
నినుబడసితిమయ్య నిజము వినుము
నిజపక్షనాశంబు నెఱపకుపగతుర
గెలిచెదు భీష్మాదిబలకలితులు

గీ. రహినిలింపాంశ భవులయ్యు రాక్షసస్వ
భావములుబూనుకతన నీపాలనుండ
గలరువారలజేయులు కలదుశుభము
నమ్మునిక్కంబు మామాటనరవరేణ్య! 511

క. నరుఁ[illegible]ర్జయుండని
కరమేటికిఁదలపనందుఁ గర్ణుడనంగా

సురవైరియసూయాతఁడు
బరిమార్చంగలనెట్టి బలములనైనన్. 512

క. అని యాదరమునఁ జెప్పియు
నని యాదరమపుడుమాన్పి యసురలు నృపతిం
గొని తెచ్చి తొంటిచాడ్పున
నునిచి చనం బిదప నతఁడు నొగిఁగనువిచ్చెన్- 513

క. అదిమొదలు వృత్తమంతయు
మది భావిశుభంబుగాఁగ మానవపతి స
మ్మదమున నితరునితోఁడన్
విదితముజేయంగ నూనె విశదంబారన్. 514

ఆ. వె. అంతవేగుబోక నచటికిఁ గర్ణుండు
యేగుదెంచి కౌరవాధినాథుఁ
గాంచికూర్మి ప్రియము గౌరవంబును మీర
ననిమె నతనిపయి మహాశఁజేసి. 515

క. వెరపింపఁబోయితానే
వెరచినగతినిక్క మనుచు వెసజనములుని
త్తఱినగనారడియగునోరు
లెరుఁగకమునుగుట్టుఁతోడ నేగుటపొనఁగున్ 516

క. చచ్చినపిమ్మటకార్యము
లచ్చుగఁజేకూరఁగలవె యకటా! కార్యం
బిచ్చందలఁపుమువెట్టిం
జొచ్చినకార్యములుచెడను సుమ్మునరేంద్రా 517

గీ. పార్థుఁడనుపెద్దపులి వంటిభయమునిన్ను
బొరసియున్నదిచూడు సంగరములోనఁ
దెలుపఁగలముగ్రి దివా
తప్పబల్కము నీదుపాదంబులాన. 518

వ. మరియు నప్పుడు కర్ణుం డిట్లనియె. 519

క. నాపరువున కర్జునుఁడొక
యోపినవీరుండె తెలిసియుండియు నకటా!
యీపగిది నమ్మఁజాలవు
బావురె? యీదుర్భ్రమంబు బడనేమిటికిఁ. 520

క. నీవీవిపినములోపల
జావనుమేమెల్లవారు ననదిమేలే
చావునకు రెండె నీతో
గావలసిన యట్లుగాక కౌరవనాధా! 521

క. లేలెమ్ముమసల నిప్పుడు
మేలారారావునీకు మేలాయిఁక నీ
వీలాగుండిన మాబ్రతు
కేలాయని గ్రుచ్చి కర్ణుఁడెత్తెన్ నృపతిన్. 522

క. పరువున మురిపెముఁగనుఁగొను
కరణిన్ ధృతరాష్ట్రసుతుఁడు కర్ణునిచేతన్
బరిశోధింపఁగబడియును
గరమరుదుగ రిపులగెలువ లగనని తలఁచెన్. 523

గీ. తనవ్రతంబున స్వప్నలబ్ధము దదేవ
రిపులు సాహాయ్యకము బాధురీతిఁదెలుపు.
కతనకర్ణుని శపథంబు కతనఁబొందు
తనయులనుగెల్తునని నచ్చికొనియునపుడు. 524

క. సూర్యోదయ సమయంబునఁ
దూర్యధ్వని చెలఁగదంతి తురగాదులుచా
తుర్యగతినడవ నడిచెన్.
దుర్యోధనుఁడిభపురంబు క్రోవం బోవన్. 52.

క. వనభూమిని దినకృత్యము
పెనుపుగఁనొనరించి బలముపృథుగతిఁగొలువన్.
జననాయకుఁడుప్రవేశిం
చెనువారణ నగరికపుడు సిరులేపారన్. 526

వ. అంతఁబేరోలగంబున నున్న సుయోధమనితో రాధేయుండు నగుచు నిట్లనియె. 527

క. ఇచ్చకమునీకు నెరయన్
రచ్చల నితఁడెపుడు బలుకురజ్జులునేవి
వచ్చునిగెలిచెదననియది
యచ్చుగఁగనుగొంటె నిన్ననాజిందెలియన్. 528

గీ. సాటిపోటింతియేయొక చోటనితఁడు
జేరిమొన చూపమనము చూచితిమెయుందు
నిచటఁగనుగొనఁబడియెను ఖచరవరుల.
తోటియని కోడి యేసందుదూరెనొకో! 529

క. ఈ దుర్బుద్ధినిలుకు లు
పాధేయములనితలంచి పాటినిబుధులం
గాదనిపోయినఫలమిది
కాదే భువినిమ్ము పిలిచి కౌంతేయులకున్. 530

క. మామాటచొరదునీచెలి
మోమెత్తవిదేమిపుణ్యనామా! కర్ణుండు నీ
కేమాటసెప్పనదియొక
నేమముగామానలేవు నృప! మదిలోనన్. 531

గీ. అనుచుఁబలికినభీష్ము ననాదరంబుఁ
జేసికొలువుననుండక చాసిపోయి
కర్ణ! నాచెలులొనరించు కార్యగతిని
రాజసూయాధ్వరముసేయ రాజుదలఁచి. 5[illegible]

వ. పురోహితుల రప్పించి తత్క్రతువిషయంబునఁ జాలిన ఋత్విజులఁగూర్చికొని జన్నంబు సేయింపుమనిన వారు విచారించి నీకుఁ బాండవు లసాధ్యులు వారలంగెలిచికాని రాజసూయంబు సేయరాదు గావున నిప్పటికి నిన్ను వేరొక్కయజ్ఞంబు సేయింతు మనిన నట్ల నియ్యకొని. 533

చ. ననునొకనాటికైన సురనాయకగాయకకోటిచేతిబం
ధనములఁగూర్పఁబోకుమని నవ్యసుధోపమహవ్యమిచ్చిపే
తునిగనొనర్పనోయనఁ గ్రతుకిరియనర్పముఁదీర్చియాసుర
ధనుఁడఖిలావ్రమితిసహితంబుగ నెమ్మదినుండె సత్తతిన్. 53

వ. అట ధర్మతనయుం డాకరాతిరి నిద్రించునెడ ద్వైత

వనంబునంగల మృగంబు లతని కలలోనవచ్చి దుఃఖింపుచు సకల మృగనాశంబయ్యె బీజమాత్రంబవశేషించితిమి మీరొండెడకుం బోయి మమ్ము రక్షించునది యని ప్రార్థించిన మేల్కని తద్విధంబు తమ్ములకెఱింగించి. 535

ఉ. వారకనవ్వనిన్ విడిచివైళమ ధర్మజుఁడొంటెనంతఁ గి
మ్మీరవినాశనప్రమదమేదురితాఖిలతాపసౌఘవే
దారవఘోషితప్రతిదిగంతము పక్షిమృగాదికాంతముం
హారితరైకకార్ముకవనాంతము దమ్ములుదానునెంతయుం.

వ. ఇట్లు ప్రవేశించి తృణబిందునాశ్రమంబున వసియించి యున్నంత నచ్చటికి ద్వైపాయనుం డేతెంచిన నతనికి నర్ఘ్యపాద్యాదివిధులం బూజించి తమ బడు బన్నంబులుజెప్పుచు దుఃఖించు ధర్మజునకు వ్యాసుం డిట్లనియె. 538

సీ. శాంతిచే రాజేంద్ర! సకలసుఖంబులు
ప్రాపించునరునకుఁ బరమునిహము
శాంతియుమరి యహింసాపరుండగునేని
పురుషునకెందు దుష్కరముగలదె?
దానంబుతపములు దలఁపదానముదుర్ల
భంబుప్రాణమునైన బాయునరుఁడు
స్వార్జితంబౌరులకు సమకూర్పఁజాలఁడు
కావునఁద్యాగంబు కతననుండు

గీ. సమతగలుగుట చెల్లదుజగతియందు
సమతగలిగినయతనికి సములులేరు

తెలిసి సమబుద్ధిఁ జేసివర్తింపుమయ్య
బుధులునడవళ్లు వినిధర్మపుత్ర ! యనుచు 538

వ. మున్నుముద్గలుండను నొక్కవిప్రుండు కురుక్షేత్రంబుననుండి దారాత్మజహితుండై యుంఛవృత్తి నొక్కొక గింజయయేరి ప్రతి పదాదిగాఁ బదునాల్గుదినంబులకు వ్రీహిద్రోణంబుఁజేసి పదియేనవ పర్వంబున నాధాన్యంబున నతిథితర్పణంబుఁజేసి తద్భుక్తశేషంబు భార్యాపుత్రాదులతోడ నుపయోగించి యిట్లు కాలంబుజరుపు సమయంబున. 539

గీ. అతనిపాలికి దుర్వాసుఁడరుగుదేర
విహితగతిఁబూజఁజేసి యీవిప్రుడన్న
మిడినదృప్తిని భుజియించియొడలనిల్ప
భుక్తశేషాన్నమలదుక పోవుచుండు. 540

క. ఈకరణినారుపర్వము
లాకట్టుకవచ్చి నట్టులన్నముఁగొనుచుం
బోకడ వగవకముద్గలు
డేకస్థితినడపె నశనహీనవ్రతముఁ. 541

వ. అంత ముద్గలునిశాంతి దానంబులకు మెచ్చికొనియాడిదుర్వాసుం డరిగిన నంత దివ్యవిమానంబుగొని దేవదూత యావిప్రుక డకువచ్చి నాకంబునకు వేంచేయుమనుడు వానివలన నందుల సుఖ దుఃఖంబులు గలుగుటయు నస్థిరంబగుటయు నెఱింగి స్వర్గ సుఖంబురోసి పోనొల్లక బ్రహ్మజ్ఞానపరుండై పరమసిద్ధినొందె గావున శాంతి దానంబులు దుస్తరంబులు ధర్మపుత్రా! నీవుధర్మ పరుండవు శాంతిగైకొనుము పదుమూఁడవ యేటికడపట రాజ్యం

బు నిన్ను జెందఁగలదని చెప్పి వారలవీడ్కొని కృష్ణద్వైపాయ
నుండు చనిన యంత. 542

క. మృదుకందమూలముల నె
మ్మది చేఁదృణబిందు నాశ్రమంబునఁగడ స
మ్మద విహితాతిథ్యతిథిన్
సదయుండా ధర్మసూతి సలుపుచునుండెన్. 543

చ. మునుసభయందుపట్టుపటముల్ బహుళంబుగఁగాంచినట్టియా
వనజదళాక్షియిప్పుడిదె వచ్చెనటంచుసకౌతుకాత్ములై
మునిసతులేగుదెంచిప్రియముల్ దగవల్కజటాసమేతయై
చనుద్రుపదాత్మజాత నుటజస్థలిఁజూతురువిస్మయంబునన్ 544

ఉ. ఏకరపద్మనాస్పృశతనెప్పుడు నల్పఘటంబునిండన
స్తోకతనుండుపాయసముతో నతిథివ్రజ తృప్తిఁజేయుదా
నాకరపంకజంబునఁబ్రియంబున ద్రౌపదికందమూలముల్
కై కొనుఁడంచుఁబెట్టమునికాంతలు సిగ్గునబొందిరెంతయున్

గీ. అంతనొకనాఁడు వనమృగయార్థమధిపు!
లేగుచును ధౌమ్యునిన్ సోమకేంద్రపుత్రి
నుటజముననుంచి చనదైవయోగమునను
సైంధవుఁడు వచ్చియప్పుడా సాధ్విఁజూచి. 546

క. ఆలలన లపనశశిరుచి
వేలాలంఘనము సేయఁబెగడొందుచునా
వేళందరళిత మదనుం
డై లోలత సింధుమండలాధిపుఁడుండెన్. 547

గీ. విషమ బాణుండు నానొక్కవేటకాఁడు
పార్థతీరూపమను నురిఁబన్ని సింధు
రాజమానస మృగకంధరనుదగిల్చి
తిగిచి బిగియింపఁజిట్టాడెఁదెలివి చెదరి. 548

క. ఇటులుఁరియాడెకు మనమునఁ
గుటిలుండా సింధువిభుఁడు కోమలివిధమున్.
పటుగతినెఱుఁగుట కై తన
భటుఁబంచిన వాఁడు తెలిసి పరఁగన్ వచ్చెన్. 549

వ. వచ్చినవాఁడు తద్వృత్తాంతంబతనికింజెప్పిన విని సంతసిలివర్ణ
శాలచెంత నరదంబుడిగి చనుదెంచిన జయద్రథుండని మున్ను దూ
తచేత నెఱింగినది గావున యాజ్ఞసేనియెదురసని పూజించి తెచ్చి
యుచితాసనంబిడి బంధుత్వంబు తేటపడ ధర్మజుండు తమ్ములతో
డమృగయకరిగె. మాంసంబుఁగొని యింతకువత్తు రవంతవట్టు నధ్వ
శ్రమంబు వ్రాయవిశ్రమించి యమ్మహాత్మునిచేత నాతిథ్యంబుఁగొ
నిపోవునది యనుడు నతండిట్లనియె, 550

క. కాయజుని మనికిపట్టుగ
నీయుటజంబింత యొప్పునేయని మదిలోఁ
బాయని తమినితఁడించుకఁ
దోయజముఖతోడఁజిలుకుదోఁపంబలికెన్. 551

క. ఆయమ యావెడచూటకు
నాయధముండెంత దలఁచెనిపుడొక పగిదిన్
జేయనగుఁగాననిట,గొం
తేయులు చనుదెంచు నంతధృతి మెయిననుచున్, 552

క. అనినిశ్చయించి భర్తలు
చనుదెంచెదనంతవట్టు సడిబుచ్చఁగఁజూ!
చినవాని తమకమెక్కుడు
గనిబెగడుచు నుచితభంగిగానిట్లనియెన్, 553

గీ. దోషముగణింప వకటయాదుస్సలకును!
పతివినాపతులేవ్వరు బావలగుదు
రేనునీతోడఁబుట్టిన దానగాన
యిట్టిదుర్మార్గ వృత్తిలోఁబుట్టఁదగునె. 554

క. అనివావిదెలియునాసతి
గొనకొని యాకీలుములుపఁ గుటిలాత్ముం డి
ట్లనువినవే? జీవములకు
పనిగలదే వావులెన్నఁ బంకజనయనా! 555

క. కులమును వరుసయుదేహము
వలనంగదయాత్మసుఖము వరలినజాలుం
జలజాక్షి పాపమనెదవో?
తలక్రిందో మీఁదో యెడలుదప్పిన పిదపన్. 556

గీ. అనుచుబలిమిఁబట్ట నాత్మలోఁదలఁచిన
వానియింగితంబు వనజగంధి
తెలిసితలఁగిపోవ వలనువిచారించు
తఱినివాఁడుబట్టి తెఱవఁదెచ్చె. 557

సీ. అప్పుడువలఁజిక్కి యాక్రోశమొనరించు
హరిణశాబముబోలి యశ్రులురల

నిందించుచుండంగ నెలఁతనుముందర
నిడికొనిబల సమన్వితుఁడునగుచుఁ
దగసూత్రకరతోత్ర దండతాడనవేగ
తంత్రిపారీణ రథ్యములఁదనరి
దారిపదీకటిపయోధరభారనమ్రీక్ర
తాతతపూర్వ భాగాప్తినెసఁగ

గీ. పార్థదర్శనశంక నప్పాటఁగ్రుంగి
పఱచుగతిజను నరదంబుపై నిమేష
పతనమాత్రవిలంఘిత బహుళశరాయ
వాతనీవధుఁడయ్యె జయుప్రధుండు. 55

వ. అంతఁగౌంతేయులాశ్రి మోపాంతంబున కేఁ
నిశమితప్రమదా వార్త్యంబుగాఁ దిలకించి దావార్రిందాత్రియి
వలన దద్ప్రమాదంబెఱింగి రోషంబున విద్రుమలతాకిసలయం
బుల తెఱంగున లోచనంబులు కావిగొన శరాసనంబులెక్కిడి రథం
బులతోడ వెన్నాడి చని వాని పిఱుందఁగుయ్యిడుచుంబోవు ధౌ
మ్యుంగని నమస్కరించి మీరింక విగతభేదంబున నిలువుండని
వారించి కూడ ముట్టి సింహనాదంబులు జేసినవాఁడును నిజబలం
బులతోడ మగిడెనట్టి సమయంబున నతిఘోరంబగు కదనంబునేసి
సౌవీరకుమార గోపికాశ్వ త్రిక రబలంబులులోనగు ననేకబలం
బులందుంచి తెరల్చి యతిభై రవరూపంబులఁ బఁచాగ్నులఁబోలి
పొదవినంసౌవీరుండు దారిపదిని డించి పఱచెనప్పుడు 559

క. బెండుపడి పఱచుదళముల
భండనమునఁజంప నేమిపనియిఁకమీరుఁ

బొండనియున్న౯ మరలిచి
చండగతి౯ భీమసరులు సైంధవువెనుక౯. 560

క. చనిదూరాపాతములై
చనుబాణము లేసినరుఁడు సైంధవుహరుల౯
దునిమినవాఁడు నిజస్యం
దనమటడీగిపాఱె గుండెతల్లడమంద౯. 561

ఆ. వె. పెదవులెండఁగాల్లు బెండుపడ౯ మేను
దేలిపోవఁజెమట లోలిఁగ్రమ్మ
నూర్పులెక్కుడగుచు నోదవఁబాఱెడువానిఁ
జూచినగిను రేంద్రసుతుఁడదల్చి. 562

ఆ. వె. కర్ణపూరకుసుమ ఘనతరసౌరభా
ఘ్రాణలోలమార్గ కాకరుండు
సైనవరునివలని యతిభీతినప్పుడు
తెటిపిజూచిగుల్మ మురకఁజొచ్చె. 563

క. కవ్వడియార్చుచు వెనుకొని
నవ్వ౯ మునుమున్న వాయు నందనుఁడునుదా
దవ్వననివేగబాదివె౯
గ్రొవ్వఁపాదరింటభీతుఁ గుడిచెడునతని౯. 564

వ. ఇట్లు ముట్టి.

గీ. ధరఁబడినదుష్టచారిత్ర పరవిరోధి
కొప్పువట్టినికుంజంబు దప్పినీడ్చి

కరచరణనిహతులమేను కందువార
బొడిచెమారుతివాని దుర్బుద్ధివెడల. 566

మ. విలసిల్లందలరేవురేవులుగ వేవేగఁ సురోకీ భీముఁడా
ఖలుఁబింబంచశిఖల్ పొసంగ గొరిగెంగన్పట్టెనంతఁ హాళా
హాళినంతర్గతమన్మథానల సముద్యత్పంచకెంగాలధూ
మలతల్ నాఁదగిభూరిఘర్మ కణికామాన్యంబులొదచ్చెఖల్.

క. అక్కవ్వడి నగిడగ్గరి
యక్కటమనమరిదికా మహాత్మక! యిదినేఁ
డెక్కడఁబోనఁగుట యైనను
జక్కఁదనంబొప్పెనింత సాలుంజూడఁ. 568

క. మెడబలిమితనముమనయగ
పడుమాతినతలఁగెనింకఁ బాండవులకునే
ర్పడదాసుఁడవనెడుజుమీ
తడయకనీబారియిపుడు దప్పినపిదపఁ. 569

వ. అనిన భీముండిట్లనియె. 570

క. కౌంతేయులదాసుఁడనన
వింతయె! సౌవీరనాథ! వినుమిప్పుడు నీ
కెంతయునపకృతిఁజేసితి
మింతియహితమనుచుఁదెలియు మెట్టులననిఁ. 571

గీ. ఇట్టిమాగుర్తులెన్ని నాళ్ళీవుదలను!
బూనితిరిగిన నొకకీడు బుట్టఁబోదు

తెగువగొనిచంప వచ్చిన పగతుఁడైన
మొగముఁజూచిన మాత్రన నగకయున్నె? 572

వ. అనికుంతీపాండు సుతమధ్యము లతని నపహసింపుచుఁదెచ్చి
యగ్రజుముందటంబెట్టి భీమసేనుండిట్లనియె, 573

క. పాండవదాసుండయ్యె వి
నుండువినుండెల్ల వారనుడు వాఁడనియెన్
బాండవదాసుడ నై తిన్
జుండీ! యనితాడనముల నుడివడు కతనన్, 574

చ. ఉరుకుచ భారముందగిలియుం దలవంపఁగఁబూనిముందరం
దిరముగ భీమఫల్గునులుదెచ్చి యొసంగిన నిల్చినట్టియా
యరిఁదిలకించి ధర్మజుఁడుహాసము మోమున నామతింపఁగా
నరగుననిట్లు బల్కె నడినన్న దయుందగు వాఁడుగావునన్. 575

క. నీచేసిన దుర్గుణతకు
వేచంపఁగజెల్లుమాకు వినుదుస్సల మ
మ్మోచెను బ్రతిబంధకమై
నీచా యిటువంటి పనులు నెఱపకు మెచటన్. 576

క. అనివిడిచి పుచ్చిననువాఁ
డనయము దనమదినిఁగల్గు నట్టినెఱపు సి
గ్గును రోషము శోకము రయ
మున వెలిబడురీతి శిఖలు మొనయంజనియెన్. 577

చ. చనియతఁడార్తిమై తుహినశైలమునం దపమాచరించి శం
భునిదయచేతఁబాండు విభుపుత్రుల బార్థుఁడుదక్క నాజిలో

ఘనభుజశక్తిఁజేసికడఁకంగను రోధమునేయఁగా వరం
బనయముగాంచి యాత్మపురికయ్యెడనేఁగె సముజ్జ్వలస్థితిన్,

గీ. పాండుతనయులు నటువంటి బాముపలనఁ!
దొలగుద్రౌపది దోషుతనలరిరెలమి!
హిమసమయముక్త పద్మినిగ్రమముదీర!
నినకరాంకురములు బొంది తనరినట్లు. 579

వ. అంతఁగామ్యక వనంబున భూసుర సహస్రంబులతోడ సుఖం బున్న కౌంతేయులపాలికి మార్కండేయుండు వచ్చిన విధ్యుక్తంబు గాఁబూజించి పాండవాగ్రజుండు తమవనవాసాయాసంబును ద్రౌపదింజేరఁగొని చనిన సైంధవునినోర్చి తెచ్చిన కష్టంబును స్పష్టం గాఁజెప్పివగచిమున్ను నాయట్టిరాజును ద్రౌపదింబోలు సాధ్వియు నిట్టి యడుమలంబడిరే! దైవంబుమాతలన యిట్టి యవస్థలంబెట్టె గాక నన నతనికి మునియిట్లనియె, 580

క. నరవర! వినమే రాముని
చరితమువై దేహివిధము జగమునమీకే
యరుదాయనుడతనికిభూ
వరుఁడా తెరఁగెట్లువినఁగ వలతువటన్నన్. 581

వ. మార్కండేయుండు తద్వృత్తాంతంబు జెప్పఁదలంచి సావధానుండవై వినుమని యిట్లనియె.. 582

క. విశద యశస్థగితాఖిల
దిశుఁడసదృశుఁడుజ్జ్వలైక ధృతినిజతేజః
పరిశమిత వినత పరాక్రము
దశరథుఁడనఁగునవని దశరథుఁడేలమిన్. 583

క. అతఁడనపత్యత యతిపతి
తతి తతముదమొదవఁదెచ్చి తత్సమ్మతిచేఁ
గృతమతియైసుతసతికిఁ
గ్రతుపతిగతిఁజేసెఁబుత్రకామేష్టియనన్. 584

వ. అంత 585

క. సతతము దశముఖగతసుఖ
శతమఖముఖ నిఖిలలేఖ చయభయహరణ
స్థితికుదయించెనుశ్రీపతి
చతురంశములన్ నృపాలసతులకుఁ బేర్మిన్. 586

క. రాముఁడనభరతుఁడనఁగా
సౌమిత్రియుననఁగమరియు శత్రుఘ్నుఁడనన్
నామములం గౌసల్యకు
కోమలికైకకుసుమిత్రకుం గ్రమమొప్పన్. 587

ఉ. ఆనరపాలబాలకసమంచిత సంభవవేళదుందుభి
ధ్వానములన్ నిలింప వనితాజనతాకరపంకజాత సం
తానవితానసూనములఁదార్కొను సోనలుజెందనాగ స
మ్మానితగంధయుక్తపవమాన లసద్వలమానముల్ మహా
దానవరాజిచిత్త విముదంబులు వేల్పుముదంబులుందగన్. 588

చ. అనిశముఁ బెంపుచూపు తనయాతనయాతిశయంబుసత్కళా
ఘనకుశలత్వసంపదయుఖర్వ సుపర్వమహార్హ్యధైర్యముల్
సునిశితధర్మకర్మపరిశుద్ధ సమృద్ధతనెంచిమించి వే
డ్కనుగనుచున్ సుఖోన్నతులుగాఁబెనుచున్ నృపుఁడుండున త్తరిన్

క. కౌశికసుతుఁడు వినుతమునిజన
కౌశికుఁడు తపఃప్ర శాకకౌశికిత లస
త్కౌశలరిపుఁడపు డచటికి
దాశరథులఁగోరివచ్చె దశరథు కడకున్. 590

క. జనపతి మునిపతియాగతి
గని ఘనతరయాగ నియతిగా స్వపురోధో
జనుననుమతి ననిచెనుయతి
పనికై తనకైన రామభద్రున్ భద్రున్. 591

ఉ. రాముఁడు భీమదానవ విరాముఁడు పాలితమౌనియోగిస
త్రాముఁ డుదారచారుతరధాముఁడు రాజలలాముఁడుల్లస
త్కాముఁడు పూతనాముఁడుసుధామయ భూరిగుణాభిరాముఁడు
ద్దాముఁడు లక్ష్మణాప్తి దగ తాపసుతోఁ వనికిన్ వెసంజనెన్.

చ. చనియటఁగాంచెఁజంచల విశాల బలాల కరాళశూలహ
స్తనుఘనశృంగ సంగత పతంగపిశంగ నిశైక కేళినిన్
సనగజనక్రచక్ర సదవక్ర పరాక్ర మవక్రితక్రమున్,
జనగ నఖేటకన్ విబుధ శౌర్యవిపాటకమైన తాటకన్. 593

గీ. దానిగని రామభూజాని మానినియని
పూనియమ్మెయినెమ్మి నమ్మౌనియేఁయ
మానిమానియనుజ్ఞఁ దెంపానియశని
బోనిశరమొండు రక్కసిమేనికేసె. 594

ఆ. వె. కృతకపేటి విజనకృతి చారువనవాటి
హారమయకరోటి యానిశాటి

వేగనేఁగెజయమ్ముని వీటికి శతకోటి
సమరఘు ప్రవీర శరమునాటి. 595.

ఉ. అంతననంత చాప నిగమాంత దురంతశరప్రయోగని
శ్చాంత సుమంత్రతంత్ర వరసంతతి నెంతయు నందికాప్తినే
కాంతతనున్న రాజకుల కాంతునకున్ మునికాంతుఁడో జన
భ్యాంతరమింతయేని యిడకంతయు నిచ్చె వనాంత సంగతిన్.

క. అటఁగడలి రామలక్ష్మణ
జటిలుఁరుగని రెదుటనికట చటులవనాటీ
పటుఁధాటీ పరిపాటీ
పటకోటీ విచలవిహగ వరవన వాటన్. 597

క. పావనమావన మావన
మావనమున నవనమవన మనగతిజేయన్
భావిని నీవననావిని
భూవరు పురుభూప్రమోద బుద్ధిజెలంగన్. 598.

వ. మఱియు రఘువరులిరువురు గిరిగరితంబరగిరుపరిసరమొ రసి వెరవెఱిఁగి యరయుకన్గిరపక కరవాల శరశరాసన గరిమం దరగక బెరుగు గరువఁపువిరివిసలరు నత్తరి హఠాత్కృత వివిధాయుధ సమ్మర్ధ విబుధ విరోధి విరోధినీ విడంబనసంభవా డంబరితాంబర విజృంభ దంభోధరప్రకరోరుతర గర్జాస్ఫూర్జదుపప్రియుక్త ప్రవర్ష మాణ బాణ పాషాణ శోణిత ఘోరధారాపరికల్పిత నిరాఘాట కూటచ్ఛటాపాటవ నిశాటుండగు సుబాహు నమోఘశిఖిశి ఖావళిని విహితగతినమర్చి పేర్చి యెదుర్చు నీచుమారీచు నోర్చి

నిశాచరుల దిశాచరులఁగాఁదోలి క్రాలి యిక్ష్వాకువంశమ హా
త్ముండగురామభూవరుండు సవనరక్షాదక్షుండయ్యె నయ్యెడ 599

చ. ఘనభసితాప్తి శోభియిహకార్యవిరోధి నిసర్గమార్గసం
జనితసమాధి యింద్రియవిచారనిరోధి సుబోధగాధిసం
దనుఁడటగారవించె సముదారదయైకపయోధిరామ స
జ్జనుఁమనుజాధినాథుదన జన్నమటంగడసన్నపిమ్మటన్. 600

క. మిత్రుఁడుపరమపవిత్రుఁడు
పాత్రుఁడుసుస్తోత్రుఁడగుచుఁ బరగెడు విశ్వా
మిత్రునితోడం జనకుని
సత్రముఁజూడంగవారు సనఁజననడుమన్. 601

క. చరణరజఃపరినిర్గత
వరగురుతర శాపశల్యవాసితమాల్యన్
నిరుపమకల్యసహాల్యన్
సురుచిరసాఫల్య గనిరిశుభసౌశీల్యన్. 60

ఉ. వారిజచారునేత్రయని వారితభూరితరైకమాధురీ
సారసదుక్తియుక్తనుతిసారెకు రాజకుమారులన్ మునిం
గౌరవమొప్పఁజేసెనధికంబుగ వారలునందువాసి పెం
పారువిదేహభూపునెడనాదటమన్ననఁగాంచిమించియున్ 603

ఉ. బాలకుఁడయ్యురామనరపాలకుఁడగ్గురుసన్నసర్వభూ
పాలకులోలిమెచ్చఁగసభాస్థలినద్భుతవిక్రమక్రియన్
శూలధనుఃపరిభంగమను శుల్కముచేగొనెనంతఁజంచరీ
కాలకరాజబాలికసుహాస సమాహిత సూనమాలికన్ 604

క. సీతాయుతుఁడై దా సా
కేతనగరికరుగ నడుమఁ గిల్బిషమతియై
యేతెంచి పరశురాముఁడు
నాతతగతిఁ బల్కె దశరథాత్మజుతోడన్. 605

ఉ. శూలికపాలమాలిపరిశుద్ధ లసన్నవచంద్రమౌళి దై
త్యాళితమిస్రహేళికలుషా హితకాననకీలిశత్రుని
ర్మూలిమదీయుఁడౌ గురుఁడు మూఢమతింగుణమింత లేక నా
శీలతఁదచ్ఛరాసనము భిన్నముజేసితివీవునావుడున్. 606

క. కర్మముధర్మము రెంటను
గర్మాశ్రయులీరుగానఁగడు బహుగుణముల్
ధర్మాశ్రయములన్నృపులము
ధర్మమునకునొక్కగుణము దగునేమగునో! 607

క. అనునుల్లసమునఁబెల్లుగఁ
దనయుల్లమునలుక వెల్లి దఱచుగ నిదిగో
కొనువిల్లనివిల్లిచ్చిన
గొనెనల్లనవింటబలము గూడన్నృపుఁడున్. 608

ఉ. రామునిభంగపెట్టి రఘురాముఁడు భూరిగుణాభిరాముఁడై
ధామముఁజెంది యాదశరథక్షితినాయకునాజ్ఞచే మహా
కామియునై యనంతరము కైకవరంబుకతంబునం గడున్
భూమినిడించి తమ్ముఁడును భూసుత గొల్వఁగనేఁగెఁ గానకున్.

ఉ. రామవియోగమోర్వక విరాముఁడుపంక్తిరథుండునయ్యెను
శ్రామనిభుండునయ్యె భరతప్రభుఁడప్రభుఁడై క్రియావిధిన్

నేమముతోడఁ దండ్రికిని నిశ్చలతర్పనముల్ సొంపుతోఁ
రామునిపార్శ్వభాగమునభి రాముఁడుగానిలిచెచ్చెరం జనెన్. 610

క. మునిజనసుయజ్ఞవాటము
ఘనఘనపథలీఢసాంద్రకాంచనకూటం
బనుదినచరస్నిశాటం
బునుగాంచెంజిత్రకూటముంజనియంతన్. 611

వ. అందుఁ గందమూలంబుల విందులొనర్చు మునిబృందంబులు డెందంబుల యందమందానందంబుఁ బొందువఱచుచు సుందరీ సుమిత్రానందనయుతుండై పర్ణశాలాంతః స్ఫటికోపల తలాసీనుండై యున్న యన్నఁగ్రన్నన శుభరతుండగు భరతుండు మాధురీ ధురీణ వాగ్ధోరణుల పూజ్యసామ్రాజ్యమునకు మరల్ప నేరక తత్పాదుకలంగొని మగిడి సాకేతపురంబున కరిగి యచ్చట నుండనొల్లక నందిగ్రామంబున జటావల్కలధరుండై శత్రుఘ్న సహితంబుగానుండి పాదుకాముఖంబున నిఖిల ప్రజాపాలనంబు సేయుచుండె నంత నిచ్చట సీతాలక్ష్మణసమేతుండై రఘువరుండు చిత్రకూటనగంబు నిర్గమించి. 612

సీ. కలితతాపింఛమండల దర్శనాభ్రభ
మీకృతహృష్ట నటత్కేకికులము
కరికర్ణచలన సంగతమరుద్ధూతాబ్జ
సారచంద్రికితకాసారజలము
బుక్కుతరక్షుహర్యక్షాది మృగరవ
క్షుభితభూయిష్ఠనికుంజ బిలము
శబరాజగరనిశాచర ఖేచరాంగనా
కృతసముత్తుంగ సంగీతకలము

గీ. తాలఖర్జూరమందార నారికేళ
సరళకేసరజంబూర సాలవటవ
టీరవార కుటీరసంచారమాని
పుణ్యసుఫలము దండకారణ్యతలము. 613

సీ. భుజగభుగానరుగ్భూరి దృగ్వగతిభా
క్స్వనభుగ్రిత్న రుక్పాటవంబు
మలయసద్గిరి సరిజ్జలజహృచ్ఛయచర
ద్గంధవత్తతమరుద్గౌరవంబు
ఫలగళద్రసరిద్భహుపతత్కులలస
ద్విమలవాక్సకల దిగ్విభ్రమంబు
నలికనత్పతురుట్కలితనిర్ఘతకురు
ట్పారనిటఖగ విరాట్సంకులంబు

గీ. పరిసరసరత్పటీర కోటరకుటీర
మర్కటకుటుంబి సంసేవ్యమానమాని
పరకుమారపరద్వేద వైభవంబు
పావనంబగు నాదండకావనంబు. 614

క. కనిచనిమునిమనికినిఁడన
కునికినిఁగని తనివిసనవ్రనొనరఫలాదుల్
తనయనుజునిచేఁగొనుచును
దినదినమబలాప్తి రామదేవుఁడుండెన్. 615

క. జనపతిదునిమె విరాధున్
మునిజనయజనాపరాధు మూర్ఖనిబోధున్

ఘనబలనిరుద్ధసాధుఁ
దినదినహృతసీధు సకలదివిజ విరోధుఁ. 616

క. మరియును రఘువరుఁ డవ్వని
తెరువునఁ గనిఁ మ్రొక్కి రతుల దివ్యశుభాంగుఁ
నెరిభవపాశవిభంగుఁ
గురుకొనుమోక్షైకసంగు గురుశరభంగుఁ. 617

చ. ధృతిశుభలక్షణుండగు సుతీక్ష్ణుని గుంభజసోదరుం దపో
గతయతినాథశస్తుని నగస్త్యునిఁ గాంచి సమగ్రహర్షుఁడై
యతనిదయాప్తిగైకొనె శరాసనబాణకృపాణముల్ కృపా
ప్రతతిసమున్నిఁకుఁగ్రిరిపుభంగవినిద్రుఁడు రామభద్రుఁడుఁ.

క. స్థానముగై కొనియుజన
స్థానమున వితానమభయదానముఁ గోరన్
మానవనాథుండోసఁగుచు
సానుజుఁడై సీతయులర నంతఁ మరియుఁ. 619

క. కొంచక కనుఁగొని యనుజన
వంచయసంకటనురాక్షసపరికటము న
భ్యంచితతటినీతటముఁ
పంచాననసంపుటమ్ము పంచవటమ్ముఁ. 620

వ. అందనుజనిర్మితపర్ణశాలాధివాసుండై రాముండు

క. అనువుగనాసాకర్ణము
లనఘుఁడు దెగఁగోసె మన్మథాయత్తమనో

జనితశిఖన్ విహతముఖన్
ఘనమదిరాసారగత సుఖన్ శూర్పణఖన్. 622

ఉ. దానవివారివారిపయిదానవి యింతలనంతఁ జేసి తో
డ్తోనబరాదిదానవులతో వినుతోదయుఁడై నజానకీ
జానికెదిర్చి పేర్చిన నిశాత శరాహతిదైత్యజాతిదు
ష్కాననదావపావక వికాసకుఁడయ్యెన శేషుఁడయ్యెడన్. 623

క. మృతుఁడయ్యెనుబరిసరసం
స్థితహితబలదూషణత్రిశిరుఁడతులితదు
ష్కృతదితిసుతశేఖరుఁడున్
గ్రతుభుగ్భికరుఁడుబాహుఖరుఁడున్ ఖరుఁడున్. 624

క. ముక్కుఁడిరక్కసియక్కసి
నెక్కటిమిక్కుటమురావణేశునితోఁదా
నక్కథయునుజక్కనిసతి
చిక్కనుదక్కనునటంచుఁజెప్పినవాఁడున్. 625

చ. చెలియలిమాటమూటగనుజేటననాటనెయానిశాటుఁడే
పలరుచునొక్కరక్కసు సహాయునిఁగాఁగొనుచున్న నాయకుల్
మెలఁగువనంబుఁజొచ్చియటమిన్నకమున్నొకచిన్నిపొన్నడా
ల్గలమెకమయ్యెఁబంక్తిగళకాలవిచోదితుఁడై నదైత్యుఁడున్.

గీ. నీచమారీచుఁడతిరత్న రోచులలర
నేచిమృగరీతినేడ్తెరఁ జూచిచూచి
రాజబింబాస్యదానికై రామచంద్రు
ననుపనతఁడేఁగెమెకమును నాసఁజేసి. 627

కవిరాజవిరాజితము.

కపటకురంగము కాంతతరాంగము కాననరంగ ముఖంబునఁ దా
నవుడతిచంగము నంతికసంగము నాదృతశృంగము నై చన నా
నృపమణి సింగము నెమ్మి నిషంగము నేర్చి పిశంగము దృప్తమహా
చపలపతంగము జూడ నభంగము సాయకమంగము జంపవిడన్.

క. సంగరరంగమునన్ రఘు
పుంగవునవిభంగశరముపోటొగినాటన్
స్వాంగమువిడిచెఁగురంగము
సంగతి హా! లక్ష్మణా! పరిసంగతియగుచున్. 629

గీ. అన్నెలఁతయన్న లక్ష్మణ యున్నఁజనునె?
నిన్ను మీయన్న జీరె బొమ్మన్న మిన్న
కున్న నెన్నియొనొకకొన్ని చిన్నియన్న
విన్ననై యున్న నన్నట్టి సన్నబట్టి. 630

ఆ. వె. ఇంటనొంటి వాలుగంటి యుంటందంట
జంటతలల సోఁకుఁడంటిమింటి
కంటిగెంటు చుంటనొంటి యొల్లనువింటఁ
గొంటుపుల్గు వెంటనంటిపోరె 631

ఉ. ఆలములో జటాయుషుడు నంతగతాయుష్కుడై నఁబూనిలం
కాలముఁజేయ్య శోకవనికా జనకాత్మజఁజేర్చిదానవీ
జాలము నోలికావళిగఁజాలనమర్చి దురంతసంతత
శ్రీలఁ దన్ నిజాంగనలచే సుఖలీలలఁగ్రాలెనిచ్చటన్. 632

క. తన కెదురుగుదురు వేఁడుఱు
గొనిసోదరుఁడెదురఁజెదరకొను మేదురమా,
మనముంగుదురుగ రఘుపతి
జనదురునీ దురక రాకసాహసమునిసన్. 633

క. అన్నకుజనకజ మిన్నక
పన్నినదుర్వచన రచనపద్ధతిఁదెలియన్
విన్నపమొనరించినసతఁ
డన్నా! లగ్గగునె? రాకడన్నా! యనుచున్ 634

క. వారిరువురు నతిచింతా
భారమ్మ రయమ్ముఁబూనిభావించిరిని
స్తారితహీలన్ సీతా
సారసదృగ్వి గతపర్ణసాలన్ బ్రోలన్. 635

వ. అంత 636

సీ. ఈ యారములదారినా యిందువదన న
న్నలయించె సొలయించి కలయునొకో!
యీయున్న సురపొన్న నాయన్నులేకున్నఁ
దనుతాపమిఁక నెప్పుఁదరిగడొకో!
ఈమేటిమృగ కోటి దామాటియాజము
మెసఁగునాఁకటికని మెసఁగెనొకో!
తానొంటి నీయింటిలోనుంటఁగలకంఠి
ననురమాయనుగొని యరిగెనొకో!

గీ. యనుచుఁగనుచును రఘువరుఁడడవినడవి
నడలి హాలక్ష్మణా యనునట్లుమగుడఁ

బలుకఁ గలుకును మున్ననవ్వులుకు కదన
వెతను బహుళించు దనుదాన వెగటుఁ గాంచు. 637

గీ. అరుణసుతుని జటాయువు నంతఁ గాంచ
ననురగతిఁ జెప్పియుపుడు వాఁడసువు వెడల
నగ్నితమ తండ్రికిని బలెనతని కిచ్చి
వెనుకఁ జొచ్చిరి దక్షిణవిపినభూమి. 638

క. కరమాకరణిన్ ధరణీ
తరుణీ పరిణేతలరయు తతి స్వీకృతులై
పొరిగొనిరి దురితసంధుఁ
బరిభుక్షితపాంథు దైత్యబంధుఁ గబంధుఁ. 639

గీ. రావణుని సేఁతయు సవిస్తరముగఁ జేసి
తనదుగతి సెప్పి దివికి వాఁడనయ మేఁగ
నతని చే సీతకథ మనుజాధినాథు
లెఱిఁగి వైరి నెఱింగియు నెమటనొకట 640

క. స్ఫుటమతిఁ గనిరి నృపాలురు
పటుతరనిబిరీసగగనపద్ధతిహార్షో
త్కటవినటద్ధృక్ఛబరిఁ
ఘటితజటావటలనిటలక బరిన్ శబరి 641

క. రాజుల రాజిలపూజల
నాజలరుహపాణి తృప్తినందించియు వే
రాజుల దేజిలు వానర
రాజులనన్ముఖ్య నఖ్యరతిబురికొలిపెన్. 642

వ. అంత.

ఉ. సారససారసౌరభవశంవద మత్తమిళిందబృందసం
చారము చారుహంసబకచక్రవిహారము మత్స్యకచ్ఛపా
గారముఁబుణ్యతీరము సుగంధిసమీరము పంపనాఁగఁగా
సారముఁజేరివారలు తృషన్నివసించియు విశ్రమించియుక్. 643

క. భాస్కరకులీనులప్పుడ
హాస్కరసుతచోదితాని లాత్మజుచేశ్రీ
యస్కరఫణితులనెఱిఁగియ
శస్కరులై యతనితోడఁజను దెంచితగన్. 644

సీ. శశికాంతపట్టి కాస్థలపాతుకప్రవా
హముఁవినుమడిజడి నలముకొనఁగ
దచ్ఛీకరోద్వేల తమహిమంబేడాకు
టసటుఁకప్పురంబరువుకొలుప
విషమచ్ఛ దచ్ఛదావిర్భూతమారుతం
బంతంతఁదద్ధూళినామతింప
సొబగారునారజశ్శోభిత శిఖరముల్
నునుమంచుమలల చొప్పనుకరింప

గీ. భూరిగైరికగైరికపూరసాను
తలములద్ధంపు నిద్ధంపుతటములందుఁ
బ్రతిఫలించుచుసంజలం బ్రతిఘటింప
ననవుదైవారు ఋశ్యమూకాచలంబు. 645

క. వారుంజను వారుంజని
వీరుంజను మునివనట్ల వినిహానుమరయుం
బారంజని తెచ్చెమహా
దారుణమున్ గ్రిపుహర్ష తరళగ్రివుణ. 646

క. నరవానరచరులున్ వా
నరనాథుండై నవాలినాశము నేయున్
గరమునఖిత్వముమై శ్వా
నరసాక్షిగమునవొనర్చినలువొప్పారన్ 647

వ. అంత దురంత కపి చమూసమూహ సమాకాంత ప్రాకార గోపురాట్టాలక టంకాయత నముట్టంకిత శంకు పాషాణాద్యరుంతుద సాధన సంకాశిత శిఖర రేఖా విరాజితంబును విరాజమాన భర్మ పాంచాలికానమంచిత రత్న స్తంభ శుంభత్సౌధవీధి విభాసురంబును ఘంటాపథ మణిమంటప నిఖలవ్యాపార పారగ వానర వ్యవహారిక కోలాహల బధిరీభూతదిఙ్ముఖంబును, ప్రసారిత వివిధవస్తునివుల విఫణిమార్గనిసర్గ నివాసలోక యూతాయాతనముత్తుణ్ణక్షోణిపరాగ సంధుక్షమాణధ్వాంత విదళన శిలజాలనమాగత వాతూలజాలంబును, మణిదర్పణభిత్తికా ధగధగాయమాన ప్రభాపుంజమంజులంబును విచిత్ర గారుత్మత విటంక పారావత గంభీరనాదంబును ప్రాసాదమధ్యప్రతాడిత మృదంగ నముత్తుంగ ఘుమఘుమధ్వానాకర్ణనకృత తాండవ శిఖండిమండలంబును, కాసార కమల కైరవ కహ్లార షండ ఝంకృతభ్రమర భ్రమదసంభ్రమోత్కంధరా సుందర మరాళాది జల విహంగమ సంఘంబును, మందార చందన మాకందప్రముఖ తరు వినరశోభిత నందనోద్యానంబును నగుచు నిలింపనగరిసొంపు సంపాదింపుచు

పెంపుమిగిలి యొరులకుఁ దేరిచూడ నలవిగాక సమగ్ర సంపత్సంధానకరంబగు కిష్కింధానగరంబు సమీపంబునకు రామలక్ష్మణ సహితుండై మంత్రిచతుష్టయంబుతో రవితనయుం డేఁగుదెంచి వారల నచ్చటనిలిపి యొక్కటి తత్పుర తోరణప్రాంతంబుఁ జేరి సింహనాదంబు జేసిన విని సహింపక వాలియుమగఁటిమిఁ దేలి వాలి తారానివారితుండయ్యును మగుడనేరక సుగ్రీవుతో బవరంబు సేయునెడ. 648

క. వాలియనివాలియనితన
వాలమ్మునరఘువరుండువాలన్నేలన్
గూలిచెరణకర్కశగుణ
శీలిన్ వాలిన్ భుజైకజితవిమతాలిన్. 649

శా. ఆరీతింబతి యన్యలోకగతి డాయంజూచిబల్వింతలం
గూరం దార సనూనయించివిధిమైగోత్రద్విషద్భ్యాతికిం
బారన్ వహ్ని యొసంగిపొంగిశుచినేపారంగసుగ్రీవుఁడే
తేరన్ వానరరాజ్యమాతనికిఁబ్రీతిన్ రాముఁడిచ్చెందగన్. 650

క. తారాతనయునిదయచే
తారాతారాపవదనధవుఁడై యతఁడా
తారాతనయునిఁగఁ బెం
పారంగాయౌవరాజ్యమందొగి నిలిపెన్. 651

క. జనపతులకోసరమొక్కుచు
ఘనసమయముబుచ్చుటకునుగాపిడ్కొని యున్
తనదురమున్ రాజ్యరమన్
గొనిముదమున్ మదమునలమికొనసందుండెన్. 652

క. అంతటనివసించిరి కపి
కాంతునినిర్దేశమున సుఖస్థితి నృపులా
సంతతమునిసంతానదు
రంతంబగుమాల్యవంత మనుగిరిచెంతన్. 653

సీ. ఇరులార ! రేబగలెఱుఁగనీక మొగుళ్ళు
తండంబులొండొండఁ దార్కొనంగ
నాగిఁదళుక్కునఁదీగె దిగిచినగతిమెరుం
గులుకన్నులకునుద్దు కనుపువింప
శంపలనంటి గర్జలతోడఁబిడుగులు
పెళ్ళునజంతువుల్ బెదరనురుల
బలుచనగొప్ప చినుకులజలజలమును
మునురాలి యింతంతయునురువెట్ట

గీ. నేళ్ళుకాలఁకులుకాలువల్ బీళ్ళునీళ్ళ
వరదబురదలమిక్కిలి వరలఁబొరల
మిఱుపల్లములొక్కటైఁ మీఱ వాన
పాములనువ్రేలఁగట్టిన భంగిఁగురిసె. 654

క. కసరుకొని మునుర్వివసరణ
వసుధేశుఁడనిముషమేం కు వలెసలిపెనుదా
నసమాశుగవశుడై వెస
నసురసురనుకొంచు జనకజా ! యనుకొంచున్. 655

క. జడలుడిగె రాముసకు నల
జడులినుమడినెగడెఁ గడిఁదిశరదాగమ ము

య్యెడఁబొడసూపెం బాపెం
బుడమింగిడిమింబొసఁగు బురదక్ వరదక్. 656

సీ. గోవుజాబిల్లిచేఁ గురియువెన్నెలలంటి
జాలెత్తినెలరాల చరులఁబడఁగ
నేడాకుటనటుల నాఁడునాటికిదళం
బుగబూదెగొనుచుఁ గప్పురముదొరగ
నిద్దంపునైల్యము నెరివిన్నుకడుబన్ని
తికిలికై దువసాంపు కికురుపరుప
నత్తమ్మిమడువుల నెలకొనికొదమతు
మ్మెదలుసంగీత సంపదలఁబెనుప
గీ. వంకలనునీటిపోఁడిమి వదలికదలి
నడలువడపెల్లురెల్లువు వ్వోడమిపుడమి
ముసుగుచీరధరించిన మాడ్కిఁజూడ్కి
సంతసముదేర్చెఁదచ్ఛర త్సమయమహిమ 657

వ. అట్టిసమయంబున రఘుపతి సౌమిత్రింజూచి. 658

ఉ. ఇత్తఱి బిత్తరిన్ వెదుక నిమ్ముగుతమ్ముఁడధారుణీసుతం
దెమ్మనువానమాననని తెల్పిప్రియంబుననిల్పినట్టివాఁ
డత్తెఱఁగెల్లకల్లవినుమ క్కటమర్కటనాధుఁడెంతయున్
మత్తుఁడుభ క్తిఁదానెఱుక మాలెను రాకడమాలెచూచితే! 659

గీ. జాతికోఁతిరీతిఁజాపల్య గతియింక
నీతిగల్గనట్టునేర్చు నసుజ
కానవానిఁగానగానేఁగి నామాట
గాఁగఁదెల్పుమనుచుఁ గనలిపల్కె. 660

చ. అరుదుగ సీత దెత్తునని యక్కఱ జదితివ యంతమాత్రి ను
స్థిరమతి రాజ్యసంపదలఁ జేసినునీవు నెఱుంగలేవు భూ
వరుల నెఱుంగుదే? యకట వాలినిఁ గూల్చినయంపముల్కడా
నిరుదెస మొక్కవోయినదొ? యింక నినుం వధియింప జాలదో.

క. అనియునికిగినిసి మనమును
గని కనికరమున నుమరలఁ గరగిన ననుజుం
గని జనవిభుఁడను పెనువుఁ
దనదున యప్రౌఢమూర్ఛ దళముకొనంగన్. 662

క. సుగ్రీవుడు మన కార్య స
మగ్రతఁ బాటించియున్న నన ఘాత్మ! మదీ
యాగ్రజునికడకు రమ్మని
యాగ్రహము మానినెమ్మి నతనిం జెందెన్. 663

క. అనిపనిచినపనివినిచని
ఘనుఁడా సౌమిత్రి గనియెఁ గట్టెదురుగ ను
ద్ఘనసరిఘాగ్రిక బంధన్
వనచర ముఖ్యాఘసింధ వరకిష్కింధన్. 664

క. బీరమ్ము మాజారమ్మును
దారమ్ముగ భూవరేంద్రు తమ్ముఁడు సనఁగా
దూరమ్మునఁ గనిపరిహరి
వారమ్ములు రిత్తజారి వడితిరిగి రొగిన్. 665

చ. మునుమున వాలి కూలె సురముఖ్యశిలీముఖ ఘాతఘాత నిం
కనుజనుఁ డెంచె నిట్టులము గానితఁడేమిగతమ్మొ మమ్ముఁదా

ననయము నేలిరో యనుచు నంతలనంతలఁ బౌరివానరుల్
జనపతిఁ జూచిలోగుజ గుజల్ బోమములెల్లలయంభ్రమింపఁగన్

క. నగచరులసంభ్రమంబులు
జగధీశుఁడుసరకుగొనకచని మొగసాలన్
దగువారిందగువారన్
నగళ్ళలో కనిచి రవితనయు రావించెన్. 667

క. తారాంగదులును హనును
త్తారాదులుగొలువఁగొలువు ధామమునకుఁ బెం
పారం జని కపిపతి నృప
వీరుని సేవించికాంచె వినయముమించన్. 668

వ. అప్పుడు లక్ష్మణుం డతనికిట్లనియె. 669

క. కార్యాకార్యము లెఱుఁగర
నార్యులుదమకార్యసరణి యనువగునెడ నో
సూర్యసుత! వినుమునిను రఘు
వర్యుఁడుగడుబల్కుబల్క వార్యప్రౌఢిన్. 670

చ. అరుదుగసీతఁ దెత్తునని యక్కడదీఱినయంతమాత్రసు
స్థిరమతి రాజ్యసంపదలచే నినునీవు నెఱుంగలేవుభూ
వరులనెఱుంగుదే? యకటవాలిని గూల్చినయంపముల్కడా
నిరుదెసమొక్కవోయినదొయింక నినున్ వధియింపఁజాలదో

చ. అనవినిపల్కుములెల్కచెవినానఁగ నానగచారిభూరికం
పనముఁనఁబొందిమందత నృపాలక బాలకుతో డనిట్లనున్

వననిధివేష్టితావని నవారితవానరవీరులం దినం
బును గమిఁగూర్చఁబోఁగడచి పోయెనొ కాలము మేలెఱుంగనో

క. హరిదళములచేనరిపురి
పరిపరిగతినడిమినెఱినిఁబరివృచ్ఛిమహీ
వరుతరుణివెరవు తెఱఁగునఁ
గరమరుదుగఁదెచ్చి మెచ్చఁగనియెదఁజుమ్మా 673

క. అనుడినుఁడుశాంతిసమ్మద
వినయంబు నయంబు వెల్లివిరియఁబలికెనో
యినతనయ వినుతనయుఁడవు
వినుతనయనుగుఱుచమాట విస్మృతిఁగొనుమా 674

క. మిత్రసుతుఁడంతనవుడు సు
మిత్రసుతుంబంచిమున్న మిన్నకబలముల్
ధాత్రిచలింపన్నడవఁగ
మిత్రకులుంజేరి భక్తిమీరన్ మ్రొక్కెన్. 675

గీ. ఇనసుతుండినకులజుల పనుపువడసి
ధృతినిఁబ్రాక్ప్రశ్చిమోత్తర దేశములను
బలియులబలిముఖుల ననేకులనుబనిచి
హనుమదాదుల దక్షిణంబునకుఁబనిచె. 676

క. వెసమసలక వసదృశసా
హసులనసమమతికుశలులు నగుకీశులును
ద్దెసలరసి సీతఁగానక
వసుధేశునకిర్వరవవివశుఁడై యంతన్. 677

క. దక్షిణదిశజనిమరలిన
ఋక్షేశాంగదసుషేణులెసఁగఁగ మొదలౌ
వృక్షచరుల యాగమనా
పేక్షం బ్రాణములు నిలిపెఁబృథ్వీపతి యుఁగ. 678

వ. అంత. 679

చ. పురిగిరికాన కోపవనభూముల గీములు సందుగొందులున్
సరసుల వాగులన్నదుల సాలములందరులందరిశ్రీ ను
ద్ధురతరకామ రూపములతో నిజమూర్తులతో డ వానరుల్
ధరణిజరోయుచున్ వెదుక తావులుడాయుచునంతఁబాయుచున్

చ. వెతలనుడాయు చుండగలు వెక్కసమై తమదామెరోయుచుం
గతలను బాయుచుందొరలగానక కూయుచుఁగన్నుమూయుచున్
ధృతిఁగడఁజేయుచుం బెడ విదేహసులాకట భూమిఁ బ్రేయుచున్
మతులను మాయుచున్ మరలమానక కానలసీతరోయుచున్

క. కాంచిరి తరుచరువెదుటన్
సంచరదురు ఖేటకీట చయసంకులమున్
ప్రాంచత్తిమిరపటలమున్
వంచిత సకలానిలమును వసుధాబిలమున్. 682

క. నిబ్బరముగ నబ్బురమగు
నబ్బొరియం దఱియ నరయునందుల జడలా
ల్గబ్బెత నుబ్బెతనదుగతి
నబ్బలులుడఁగన్ సస్వయంప్రభాఖ్య సమాఖ్యన్. 683

క. మణిమయకాంచన ఘృణిగణ
చణమగుతత్పట్టణమున సలిలఫలామల్
ప్రణుతినిమపడఁతిపణితిం
గణుతింపుచు మెసలి వెసముఖస్థిరంతన్. 684

గీ. బిలము వెడలి రాచ వెలఁదిఁగానక కపుల్
ధరణిధరణికిరణ నరణిఁ గ్రాగి
చరణతలముఁబట్టి యరుణత నురుపుర
చొక్కి స్రుక్కి చిక్కి నొక్కచోట. 685

చ. గమిఁగొని ప్రాణముల్ విడువఁగాఁ దగునీతను గానగాదు స
ర్వము బరికించినారనిన రాముని పాలికిఁబోవుకంటె మేన్
సమసినజీవి తేచ్ఛనిటఁజావక నచ్చటికేఁగఁజంపు రా
యమగనుమన్న సూర్యసుతుఁడన్నకు రోయనివాఁడె కాఁడొకో!

క. కైకా మాకై కాలో
కైకా ర్తశరణ్యనడవి యిటుబంపితినీ
గైకోలాడునె యాయన
కై కార్యముఁగూర్పదూరుకై కానితగెన్. 687

క. అయినజటాయువు రాముని
కయియసువులుడించి యెరులకందని పదమున్
గయికొనియె మనలకట్టిద
భయమేటికి నంచు నెంచి పలికెమనెడలన్. 688

క. గురులరిగిరి నొరుగుట స
త్తటినెటిసంపాతిబీతి దరుచరులమదా

నెఱుఁగుచు గరగరనిగురుచు
నెరయెరకల గాలిధూళి నెరయఁగ వచ్చెన్, 689

వ. అప్పుడు. 690

చ. బలుపగుస్వేదముల్ గఁగురుపారినమేనులు రిచ్చవడ్డ చూ
పులుదగనెందు వాతెఱ లపూర్వపునూర్పులు డిల్లపాటునం
దలఁకెడుమోములున్ రసముదప్పిన కుత్తుక లొప్ప ప్రాణముల్
గలిగినయట్టి పీనుగులుగాఁ గపులుండిరి దానిఁజూచియున్.

క. జడుపున జడులగుకీశుల
కడకుం గడకుం బతత్త్రి గడుపనివారిన్
వడినడిగి యడిగి నెచ్చటి
పుడమింబడె నాయనూరు పుత్రుండనుచున్. 692

ఉ. వాఁడు మదీయసోదరుఁ డవారితసత్త్వులమైన యేము నా
వేఁడివెలుంగునంటఁగడు వేడినసంజననాదు పక్షమున్
పోఁడిమివేఁడిచే గమరిపోయిననిగ్గిరిపై నొఱంగితిన్
వాఁడెట బోవుచో నెఱుఁగవచ్చెఁగరుల్ దగ మీకతంబునన్. 693

క. అనితనగతి కపితతికిని
వినిపించియు ననుజరీతి వినిపగచియు నా
జనకజ చొప్పెర్పఱచియుఁ
జనియెన్ సంపాతిభ్రాంతి చదలంబోదలన్. 694

సీ. అంతవనచరులోక కొంతసంతసమున
సీతవృత్తాంత మెఱుఁగుటచేతనింక

నొక్కతతిఁ జేరితిమి లెండు నిక్కమనుచుఁ
దక్షిణంబున నరయుచుఁ దక్షిణంబ. 695

సీ. జఠరలుఠద్ధులీశకుల గూఢాంఘ్రిపా
ఠీనాదిజంతు సంతానభవద
నీచీకృతైకవీచీచయాఘటన నో
ల్లలదంబుకణ సముజ్జ్వలపిధాన
గగనదర్శనహిమాగమ సంశయోద్వేల
తరపరిరంభణాస్థాప్రపంచ
గతశంఖవలయసంగత పుళిందాంగనా
శ్వాసపాటవశీల సవిధవివిధ

గీ. శబరయువజన నయభయచతురవాక్య
హాయకరచారుతరముఖరాయమాణ
తీరవదనప్రహాస సామ్యోరుఫేన
కలితగంభీరనాదాబ్ధి కనిరి కపులు. 696

క. వడిదగు కరువలికై వడి
నడిసన్నన్ నడినిజన్న జడధిన్ జడధిన్
గడువగ గడువగఁ గడకడఁ
దడబడియెఁ గపీంద్రచంద్రతతియప్పాటన్. 697

చ. గరుఁడనిరూఢిఁ దాఁ బ్రళయకాల మహానిలవేగమొప్పఁగే
సరిసుతుఁడుం బ్లవంగతతిసన్నుతి మిన్నతిలీలగ్రాలఁగా
నిరుపమవృత్తిదాటితటినీగృహ మేధినగాధినాత్త ని
ర్జరపరిపాలనైకఘటజన్మవిరోధి పయోధినుద్ధతిన్. 698

క. కడలింగనుగొనిరాత్రిన్
వడిలంకాపురముసొచ్చి వాయుజుఁడును న
ల్గడలందడయకతడవెను
గడిమివెతంబడియుసుతను గానఁడలోనన్. 699

సీ. సందులుగొందులు చంద్రశాలలుగొల్వు
కూటంబులును రచ్చకొట్టములును
వాడలుమేడలు క్రీడాళివాసముల్
గజతురంగశతాంగ ఘనగృహములు
చప్పరంబులుచిత్రశాలలుపానీయ
శాలలుసత్రిదే వాలయములు
వంటయిండ్లాయుధా వాసముల్శుద్ధాంత
తలములుధానధన్య నిలయములును

గీ. వీథులంగల్గుమరుగులు విజనములును
రాజమందిరములునాదిగా జనమున
వలయురూపముచేత నవ్వాతసూతి
రామనృపుసతియటగానరామిదిరిగె. 700

చ. నెఱినిఁబ్రధానులొక్కయెడనిల్పి విచారమురాచకార్యముల్
నెఱపఁగనాలకించునొకనిన్ మరియొక్కఁడుమంత్రిషేమియో
గఱఁపఁగదాలసీతకథగాఁ జెలియెల్గుకనందలంగి మే
పిఱసనులేఖకావళిలిపింబరికించునుదత్ప్రపంచమున్. 701

చ. అనువుగఁజారుఁడొక్కఁడొకఁ డచ్చటిముచ్చటవింటివాయనన్
మునుపటవేమియేమియను ముంద్దఱనిల్చినవాఁడదెవ్వరో

యనఁగనుపింపకం జను గృహంబులనొక్కఁడుగోష్ఠిసల్పఁగా
జనకజవార్తలోయనుచు సారెకునూకొనుకానిచోఁజనున్.

క. కూపతటాకసమీపము
లాపావనిజేరినిలిచియుటఁ దరుణులుడా
రోపియునోపములొండొరు
లేపునఁదమరాడికొనిన నిలనుతదెలియున్. 703

క. ఈరీతింబరికింపుచు
నారాతిరిరావణుని గృహంబుంగని క
న్గారికేఁదనసతిదానుం
గారవమునఁ నున్న వానిఁ గనిమదిబొగడెన్. 704

క. రామునితో వైరము పర
రామలతో గొడవనేఁత రావణునకుఁ దా
లేమింగలిగిన సీతని
తో మరిసరిగలరె సురపతులలోనె నన్. 705

వ. అని కొనియాడి యచ్చటం గలయంజూచి యమ్మం
దిరంబువెడల మరున్నందనుండు జనకజంగానక చింతాక్రాంతుం
డై దైవవశంబున నశోకవనంబుఁ బ్రవేశించి వెదకునవసరంబున.

సీ. వర్షాగమాగత వారిదంబులమాడ్కి
ముడివీడుపెన్నెరుల్ ముసురుకొనఁగఁ
దత్సమయోచిత తతహిమాంశునిలీల
మాటిమాటికిమోముమురువుదెరలఁ

దగమంచుదోఁగుకెందమ్మల గతికావి
గొనుకన్ను గవనీరు గ్రుమ్మరింపఁ
జిరువువిల్కాఁడు కైదువతుప్ప సడలించి
చమురుంచుక్రియ మేనఁజెమటబెరయ

గీ. వికృతదైతేయకామినీ వితతినడుమ
సింహసంహతిలోలేడి శిశువుకరణి
దగియశోకవనంబునఁదనరిశోక
వనమునమునుంగుసతిఁగాంచె వాయుసుతుండు. 707

గీ. ఆమెసీతయనుచుఁదామీఁరిసామీఁరి
కడునశోక శాఖనడఁగియుండి
రామరామరామ రామగాయిటువంటి
బొమ్మగాము వంటి బ్రహ్మనేసె.

క. కిరమీఁపగిడిఁగ మదిన
తరుచరవరుఁడడలునెడలఁదగవచ్చెను సం
గరపీడితశతముఖుఁడుం
బరిపూజితపంచముఖుఁడు పంక్తిముఖుండున్. 709

గీ. వానిఁగనమాని జనకభూజానిపుత్రి
మోముఁవంచినఁజూచి యామూర్ఖుఁడనియెఁ
బంచశరసంచ శరదుష్టపంచభిద్య
మానమానసుఁడై మానమానమాని. 710

ఉ. కాముఁడుదాస్వకీయ విశిఖంబులనీదగు రూపమేపునఁ
మోమునుమోవికేలురదముల్ దగుచూపులునొక్కటూపుగా

నీమహిఁ జేసెనన్ను జగదేకమహారణవీరుగెల్వ నో
కామినికార్యసిద్ధినటిగాక తలంగుటకై తలంపవే? 711

గీ. అనినవినియట్టులనయగును రాముఁ
ఘోరనారాచములనిన్ను గూల్చునాఁడు
కాఁడియనుబడుచున్న తత్కార్యసిద్ధి
కామునకుమానియగుజుండురామునకును. 712

వ. అనివెండియువాఁడాను దుర్వచనంబుల కన్నింటికన్ని
యుఁగర్ణకఠోరంబులుపలికిన. 713

క. ఆచంద్రహాసప్రహా
ప్రోచితమగుచంద్రహాస మొరవెడికినవే
చూచితదీయాంగనకడఁ
ద్రోచి నివారించు నెడల ద్రుమచరుఁడంతన్ 714

క. తెగువన్ మగువంజంపఁగఁ
దగుఁదగదనిమిన్నుకునికేఁదగదిఁక బగరం
దెగఁజూతునినియుమరిదన
యగపడుటకు మానెమారు తాత్మజుఁడాత్మన్. 715

గీ. సీతనొడఁబడునట్టులఁ జేయుఁడనుచు
నందుఁగాఁపున్నవారలఁ బొందుపఱచి
రావణుండేఁగె నంతనారక్కసులును
భీషణాలాపముల నతిబెగడుపఱప. 716

క. అలరఁగ నొకదానవి రాఁ
గలకలఁగని కలకలముల గనుమేల్కొనిమా

ఖలదానవలలనలదాఁ
గలయం దెలియంగఁ బల్కెఁ గలలోఁ దెఱఁగుల్. 717

క. రాముఁడు సౌమిత్రియుతుం
డై మనరావణునిఁ దునిమి యవనిజతోఁడన్
సేమమునం జనువాఁడీ
కామినిఁ బిలిపింపడాయెఁ గాదనిమాన్పెన్. 718

చ. అదినమయంబుగాఁ గొని సయంబునరామనరేంద్రుచంద మ
మ్మదితవిసంగఁ బల్కి కపిముఖ్యుఁడు మిన్నకయున్నఁ గన్నన
ఖదిదెసలొప్పఁ జూచి యొకపట్టునఁ దత్తరుశాఖయందు ని
మ్మదినలరారుకీశుఁ గని మానవనాథకుమారి యిట్లనున్. 719

క. పరగన్ రావణమాయా
చరుఁడవో? వనచరుఁడవో దశరథాత్మజు నా
చరితము దురితముదొలఁగన్
గరిమం బలికితివి యెందుఁ గంటివి చెపుమా! 720

వ. అని యడిగిన మగువకుఁ దద్వృత్తాంతంబంతయు నెఱింగించి వానరేంద్రుండు నరేంద్రుం డిచ్చిన ముద్రికయొసంగిన. 721

క. శ్రీలునుఁ డాలును దగఁ గపి
బాలునిచే నానవాలు పలుమఱుఁ బ్రియమున్
మేలుఁగఁ గోసల ధరణీ
పాలుని జవరాలు కేలు భాసిల నందెన్. 722

క. గుణభద్రుండగు రాముని
మణిముద్రిక నావరించి మరలక నారీ
మణియొసఁగెం దనదు శిరో
మణి కుశలముతోడ సంతమారుతి మగుడెన్. 723

ఉ, పావని యావనిం గదిసి బంధురసింధుర విక్రమక్రియన్
మావులు క్రోవులున్ మొదలు మ్రాఁకులు చేకొలఁదిం దెరల్చి యా
కావలిదానవావలిని గర్వము సర్వము నొంచి తుంచినన్
జావకతక్కు రక్కసులు శంకనులంకను జేరి భోరునన్. 724

క. దనుజేంద్రున కై పదములు
మనుజేంద్రుని దూత దిశకు మస్తకములుగా
వనపాలురు బడియుందరు
దనువుల పాిణములు చనువిధంబున నున్నన్. 725

క. వారలవారలఁ గని యే
కారణమో రణమొ తెలియఁగాఁడగు ననుచున్
దారావణుఁడందఱనొక
తీరున భయముడిపి యడుగ ధృతి చెడి వారున్. 726

క. వచ్చెన్ వచ్చెన టందురు
గ్రిచ్చుకొని పరిహాస్తుఁడనఁగఁగా విని మరలన్
వచ్చెన్ వచ్చెన టందురు
నచ్చటి వారమఁగ వచ్చె నందురు భీతిన్ 727

గీ. ఇట్లు భయమునఁ జెంది యొకించు కేని
తెలిసి తెలియక రావణుఁ బల్కి రపుడు.

దేవ! సెలవిచ్చెదను మేము తేటపడఁగ
విన్నవింపుముపిమ్మటివిధమునీవు. 728

గీ. కన్నవిన్నవిధంబులు గావుమన యు
శోకవనియొక్క కోత్రిఁతి చీకాకుపడఁగఁ
జెరికివనపాలురనుజంపి కరుకుమిగిలి
తోరణముఁబూన్చి దైత్యులతోరణమున. 729

ఆ. వె. వండ్లుగొఱికికొనుచు బల్మితేనియతలల్
నులిమితాత్రిపుతరుల వలనఁజెనఁకు
మని హితోక్తి దూరమునసుండి పలికినఁ
గపివరుండునేము గరపినట్లు. 730

ఆ. వె. వండ్లుగొఱుకుకొనుచు బల్మిదైత్యులతలల్
నులిమితా వితరుల వలనుఁజెనకు
మఱియుఁజేరిజేరిమముడాయుమెలకువఁ
గాంచిపఱచిరాక గాదెయిటకు. 731

క. అనవిని కినుకను దనుజుఁడు
గొనకొనియాత్రోఁతిబట్టికొని తెమ్మని పం
చెనురణబాణాభినయున్
వినుతనయుని నక్షతనయువిబుధావనయున్. 732

క. చతురంగబలముతోన
ప్రితిమంబరతేరగాంచి పావనితుత్రించెన్
ధృతిఁగోపారుణితాక్షున్
దతపక్షువిదక్షు నక్షదక్షునిపక్షున్. 733

చ. తనయునిపాటుతేటపడ దద్దయుశోకసమాకులుండునై
దనుజవిభుండుమండిబెకిదంబగు నీతుకిదంబుచేహరిం
గొనుమనియిందజిత్తునవికుంఠితవృత్తినిఁబంపవాఁడు న
ట్లనచనుదెంచిచేసి జగడంబురయంబున వాయుసూనుఁడున్.

క. కలనన్ రావణసుతుఁడ
గ్గలముగ బ్రహ్మాస్త్రమేసి కట్టఁబట్టె సము
జ్జ్వల గుణవంతున్ శాంతున్
ఖలదనుజకృతాంతుదాంతు ఘనహనుమంతున్. 735

వ. ఇట్లు నిట్టలంబగునంప కట్టియంబెట్టించి యజ్జగజెట్టిం బట్టి గట్టు వారక్కసుండు తంజీముందటం బెట్టినవాఁడును దట్టించి యెట్టివనచరుండ విట్టి గట్టితెగువంబెట్టమంగవగు జెట్టులన విని పుడమిపుట్టు నునికిపట్టు నరసిరమ్మనిన రఘుపతి యనుమతి వడసి యెట్టకేలకు కార్యసిద్ధుండనై నావచ్చు టెఱుంగుటకు నీపట్టిం దున్మి నిన్నుంగని బుద్ధిగఱుప వచ్చితినని మరియును. 736

ఆ. వె. కాదుకూడదనక కైదప్పఁజేసితి
వనుచురాము శరణమందితేనిఁ
బోరిచుఁదక్కనేనిఁ బోరిపుచ్చునవిపల్క
దైత్యవిభుఁడుచాపఁ దలఁచెఁగపిని. 737

వ. అప్పుడు. 738

గీ. సరభసస్థితినావిభీషణుఁడుమాన్చి
దూత ఫీనివధింపంగ దోసమిపుడు
వాలమునఁజేలములుజుట్టి వహ్నిఁబెట్టి
వీటిచుట్టునుద్రిప్పి వేవిడువుడనిన. 739

క. నూనియనుమంచివలువలు
వానరువాలమ్ముఁగలియ వలసినభంగిన్
బూనిచినగ్గుచుందుదివై
శ్వానరుఁడరికొల్పివాడ వాడలఁద్రిప్పన్. 740

క. ఘనముఁగనార్చుచునగుచున్
దనచుట్టుంబట్టివచ్చు దైత్యులవాలా
గ్నినిచూడివేఁడిదోరయుం
దనుజేంద్రాగారములకుఁ దరుచరుఁడెగిరెన్. 741

క. ద్వారములయందుమారుతి
తోరంబుగవహ్నిఁగొలిపి తోలుతోలురాజా
గారంబుల కిటికియు సము
దారుండై కాల్చెబురము ధామములెల్లన్. 742

క. పౌర్వాగ్నికడలి వెడలి య
ఖర్వస్థితిలంకఁగాల్పఁగాఁ జొచ్చెనన్
దుర్వారుండై యతఁడు ను
పర్వులుఁగీర్తింపఁ గిలిపాల్పుగఁజేసెన్. 743

వ. అప్పుడు 744

సీ. భుగభుగమనిపాగ తెగలుతెప్పలఁతోడ
మూఁగినసెకదొట్టి మునుగువారు
వస్తువుల్ వెలివెడ వైచివైచియునంత
వశముగాదని పర్వువారువారు

ననలంబుఁజల్లార్చి యాఁజని చోఁదము
వారిఁజీరుచువిధి దూఱువారు
నిదితప్పఁద్రోచిన నెల్లికోల్చెదమని
యిలవేల్పులకు మీఁదులెత్తువారు

గీ. పరులతమవారిగామది నరసియుండ్ల
దడవలందీయఁగొనివారు తలఁగిచన్న
దిగులుచేవీథివీథులఁ దిరుగువారు
వానరమువచ్చెననిరిచ్చ వడెడువారు. 745

క. ఎలుఁగెత్తి సారెఁదమవా
రలఁబిల్చియుఁబిల్చికాన రానియెడఁ గ మి
క్కిలిదుఃఖావేశంబుల
గలిబిలిపడువారు వెదకి కనియెడువారల్. 746

చ. తగఁబరువెత్తివీథులను దల్లులదండ్రులనన్నదమ్ములం
బెగడుచు వేరువేరనటు బిల్వ నదోయనజూచిచూచి వా
రనుటకుఁగానిచోవగల నందుచుఁబోవుచు వారువీరనన్
దగఁగొని బల్మిదకుక్కుదురు తత్పురిసక్కపివీరు ఖాటికిన్. 747

వ. అంత 748

సీ. లంకఁగాలిచితనదు వాలంబునార్చి
జానకినివీడుకొనివడి జలధిదాటి
యంగదాదులకచటివృత్తాంతమెల్లఁ
దెలుపఁబవనజుఁగీరించి రెల్లవారు. 749

క. సతిఁగనివేడ్కలదరుచరు
లతిగతిఁబఱతెంచికాంచి రగస్థలి నా
తతసుమనఃపృథువనమును
దితయువజననిధువనమును ధృతిమధువనముఁ౯. 750

చ. గమిచిబలీముఖుల్ దధిముఖ ప్రముఖంబుగఁదోఁటకావులం
గుమిగొనిగుప్పగుప్పనను గ్రుద్దివని౯ వెడలంగదొబ్బి తా
రమరఁగఁబండుతేనియలు నాదిగఁజేకొనికోఁతికొల్లని
కక్కముగనొనర్చి యాయులయకల్ కడుఁబాయఁజరించున త్తఱిన్

క. జనపాలురునినసుతుఁడును
వనపాలురకపుడుకపుల వలనందగు నా
పెనుబన్నమువినివై దే
హినిగనిరనివారునిశ్చ యించిరలోన౯. 752

క. రామ! కనుఁగొంటి సీత౯
నేమంబున లంకనునుచుఁ జెప్పియొసంగె౯
సామీరి తచ్ఛిరోమణి
నామృదుఘృణితులనుతుల నగుదగుసరణి౯. 753

క. పరిసనివచ్చుటతోయ్యాలి
కరమడియాలమును వినియుఁగనియు౯ నృపుఁడు
ద్ధురజృంభణపరిరంభణ
గరిమ౯ హరివరునిఁదృప్తుఁగానొనరించె౯. 75

క. అలనృపుసెలవున సులువున
నలినాప తనూజుఁడోజనడిపించె సము

జ్వాలకోలాహలహేలా
కులదోలాయితకులతలము గురుహరిబలముల్. 755

క. అతికుపిత కపితతిని౯బతి
కతిపయదినములను వలనుగావడివిడిసెన్
హితసూచీకృతవీచీ
తతసాచీరతసముద్రతటనికటమునన్. 756

గీ. ఆపయోధిసమాధిచేనడుగనుడుగ
రాఘవుఁడమోఘ విశిఖై కలాఘవుండు
నై తదనుమతిగొని నలుండనుగపిందుఁ
బంచి సేతువుబంధింపఁబటురయమున. 757

వ. అంతనతండును. 758

క. వశులై కపులగములు దశ
దిశలదుఁవం దెచ్చియొసఁగ ధృతిమెఁబూన్చెన్
దశకంఠ కంఠలుంఠన
కుశలగు హేతున్నగేంద్ర గురుతరసేతున్. 759

క. మేటివనాటులు కడలిం
దాటియు నాలంకఁజుట్టిదళగొనిరి తరి
పాటీజన కోటి హృ
చ్ఛేటీపాటన సమర్థపృథుతరధాటిన్. 760

ఉ. క్రిన్ననయన్న మైనదశకంఠుని కోటలకుంతితస్థితిన్
మన్ననమీర జానకిని మానవనాథున కప్పగించు మా

యన్న విభీషణుంగదిసి యాగ్రహవృత్తిని వాఁడువాడిమై
దన్నెను దమ్ముఁడంచు మఱేదద్దయుఁ గూరిమిలేమిఁ దత్తఱిన్.

క. భీషణుఁడు దనుజవంశ వి
భూషణుఁడనిశాశ్రిత్రై క పోషణుఁడు లస
ద్భాషణుఁడా ప్తయుతముగ వి
భీషణుఁడరుదెంచిరాము పృథ్వీపుఁగొల్చెన్. 762

క. అత్తఱిశుక చారులుగా
ద త్తరుచరబలముదెలియఁ దగపంచినవా
రత్తెఱఁగుఁ గాంచిరావణుఁ
డు త్తరగోపురమునందు నుండఁగఁగఁడఁకన్. 763

క. చనుదెంచిన దనుజేంద్రుఁడు
మనుజేంద్రుని బలముదెలియ మక్కువశుకునిం
గనిత త్తరతులడిగిన
సునిశితగతి వాఁడు కేలు జూపుచుఁబల్కెన్. 764

సీ. మురిమురిచీఁకట్లు నెఱసినగతినున్న
దారజూడు జాంబవంతుండతండు
నరుణోదయచ్ఛాయ నలరుచునుతిమిని
న్నత్తితిచూచు వాఁడంగదుండు
కట్టెఱనగుచూడ్కి గదురబాణాసంబులు
దీటెడువాఁడు జ్యోతిర్ముఖుండు
తతహేమశోభ యున్నతి లంకమీఁదబం
డ్లవుడుగఱచిన వాఁడునర్కజుండు

గీ. చూడుమా! దైత్యనాథ! యచ్చోటివారె
మైందుఁడును ద్వివిధుఁడు ననమహిహిమాల
యామరాలయ తుల్యకాయములయములు
సమరతులదైత్యబలనికాయములయములు. 765

చ. సునిశితవృత్తి జానకినిఁ జూచియశోకవన ప్రదేశముం
గనిమనయక్షుపైనె దిరిక్రమ్మఱలంక దశాస్య నాఁడునీ
వనయముజూడవీఁడును వెఱయాహనుమంతుఁడు రామకార్యముం
బెనుపుగఁ జేయుఁశౌర్యమునఁ బెద్దసురాసురకోటిలోపలన్ 766

మ. అనినందానవ చక్రవర్తికుపితుండై మండిభావించెదా
వనముంగాలిచి యక్షునిందునిమి దుర్వారస్థితిన్ నాఁడునే
ననువై చూడఁగ లంకగాల్చెనని యుల్లర్థోక్త్యనర్థోక్తిగా
వినఁబల్కన్ శుకుఁడంచుసారణుని రావించెన్ వివక్షింపఁగన్.

వ. మఱియు సారణుండు గజ గవాక్ష గంధమాదన పనస కేసరి నల నీల కుముద దంభ తార సుషేణ ప్రముఖ బలిముఖ ధైర్య శౌర్య గాంభీర్యౌదార్యంబులు వేరవేర నెఱపి వానరబల పారావారంబు దరితెలియ దుస్తరంబని కఱపి రామ లక్ష్మణ విభీషణులం దెలిపి యగ్గలికనుగ్గడించిన వెగ్గలంబగుకోపంబున రావణుం డనివారణుండై శుకసారణుల మార్గణంబున కసిఘాణుండైన గని ముకుళితహస్తుండై ప్రహస్తుండు ప్రస్తుతించి వారించె నంత నిచ్చట రఘువరుండు దశగ్రీవుండు దన వైభవంబు తేటపఱపఁ బఱతెంచియున్నవాఁడని విభీషణుచేనెఱింగి యొక్కయమోఘ శిలీముఖంబున నతని ఛత్రచామర మకుటాదులు డుల్లనేసిన రాఘవు శరలాఘవంబున కచ్చెరువడుచు నిజనివాసంబున కరిగెనంత.

క. అంగననిమ్మనిన్నపుఁడో క
భంగించనుజనకురాయ భారంబిడె స
య్యంగదుఁగనకాంగదు రణ
రంగదురుతరాలి చిత్తరంగదురావున్. 769

క. పతిబంచిన గతిసేయుఁగ
నతఁడా రావణునిఁజేరి యనునిట్టుల దు
ర్మతివై యతివై కృతివై
యతివై సతిదెచ్చి కటవి నటనేమటినన్. 770

క. మానము ప్రాణముగావల
తేని మహీతనయనిచ్చి మెచ్చుటకేనిం
బూనిచను విభీషణునకు
నేనీలంకాపురంబునిచ్చితిఁ జుమ్మీ. 771

చ. అనియవనీశుఁ బల్కుఁదెలియన్ విడబల్కుచునున్ననాతనిం
దనుజవరేణ్యు సన్నగొనిదానవు లుద్ధతిఁ బట్టనెట్ట నం
గొని వినువీధిపై కెగసి గొబ్బునఁగుంభిని వారివైచి తాఁ
జనితనపోయివచ్చుట వెసన్నృపవీరున కేర్పఱించినన్. 772

వ. అంత 773

క. తరుచర బలమునునక్తం
చరబలమును యుద్ధమునకు సన్నద్ధంబై
పరగుచు లంకాపురి పరి
సరమునమార్కొనియె నధిక సంరంభమునన్ 774

క. విశదగతిఁ జోరఁజొచ్చిరి
నిశిచరులుబలాశి చరులు నేల వడంకం
దిశలానకము గడంకన్
నిశితాశుగసగ నిహితులు నిగుడఁబెడంకన్ 775

క. అత్తఱి నసురయు ప్లవగుల
మొత్తంబులకుఱికి యుఱికి మొనమిగులఁ గపుల్
కత్తళములు బిత్తళములు
తుత్తునియలు గాఁగ రిపుల దూటాడిరొగిన్. 776

ఆ. వె. కపులతాఁకునఁకను జవలుపెద్దైత్యులు
కోటఁ జొచ్చిరంతఁ గూడముట్టి
కోటలగ్గపట్టి కూటమ్ములనుగల
కైదువులనునడుమ కపులువైవ. 777

క. పలుమరు పురిఁబడు నాయుధ
ములఁ దలఁకెడువారిఁగని యమోఘాస్త్రసము
జ్జ్వలులగు దనుజులురావణు
సెలవున దోలిరిప్లవఁగ సేనలనెల్లన్. 778

క. తరుచరులువిరిగినన్ నృప
వరులనికింగడఁగఁజూచి వానరవీరుల్
తరుగిరులుబూనిమగుడన్
బరిమెయి యక్కోటఁజుట్టి పటుగతిగవియన్. 779

వ. అప్పుడ కొత్తడంబులంగల దనుజులమొత్తంబులుచొర
నీక పరిఘ పట్టిస శూలకరవాల దోమర శరాది వివిధసాధనంబుల

నొంచిన వనాటులును తరు గిరి పాషాణాదులు ప్రయోగించిరయ్యె రువాగునకు బాహా బాహి మహాహవంబయ్యె. రావణుండు క్రమ్మఱ ధూత్రన జంభఖర నరాంతక దేవాంతకులు లోనగు ననేక నిశాచరులఁబంచిన వారు సైన్యసమేతులై చనుదెంచి మాయా బలంబున వానరంబుల నొప్పింపందొడంగిన విభీషణుండమ్మాయల మాయమ్ముఁజేసి మరియు ఘోరయుద్ధంబుఁజేసి దనుజులు మడ యుటయు రావణుండెఱింగి బవరంబునకు మంత్రి సహితంబుగా బురంబు వెడలెనంత. 780

క. అపుడు నిశాటవనాటులు
విపరీతపరాక్రమములు వెలయఁగ గడమిఁ
నిపుణతలేర్పడఁ బోరిరి
విపులాతలధూళిహేళి వెలివడకుండఁగ. 781

వ. మఱియు మహోదర మహాపార్శ్వ కుంభ నికుంభ ధూమ్రాక్ష విరూపాక్ష రావణప్రముఖ రక్షోవీరులు గజగవయ హనుమ జ్జాంబవన్నలన్నీల పనసాంగద సుషేణమైంధ ద్వివిధాది వనచరులను రామ లక్ష్మణులను దలపడ శరంబులఁ బరపియుఁ గుండంబులఁ బొడిచియుఁ గరవాలమ్ముల నఱకియు ముసలమ్ముల మోదియు సూరెల గ్రుమ్మియు శూలమ్ములఁ జిమ్మియుఁ గదల వ్రేసియుఁ బరిఘ పట్టిసంబులు లోనగు కైదువుల నొప్పించిన మర్కటులును తరులదాచియు గిరులవైచియు గండశైలంబుల రువ్వియు వ్రిచ్చియుఁ గఱచియుఁ బొడిచియు నడచియుఁ బం చియు నొంచియుఁ బోరియుఁ జీరియు నిట్లనేక ప్రకారంబుల సమ యించునెడ నొరగెడు శరులును విరిగెడు నెమ్ములును దుల్లెడు

తురంగంబులును వల్గాడు శతాంగంబులును దొరలెడు తలలును పొరలెడు మొండెంబులును మొగ్గిన సిడంబులును మగ్గు భటులును తుముర గునాయుధంబులును గలిగిక్షతజజలంబులును మేదోమాంసపంకంబును ఛత్రశతపత్రంబులును రత్నసైకతంబులును కేశశైవాలంబులు చామరహంసంబులును వేదండఖండగండశైలంబులును సైంధవ కబంధ గ్రాహంబులును భుజగమహాజగరంబులును ప్రదరకమఠంబులును శవరాజీవప్రముఖ జలచరంబులును గలిగియపూర్వతరంగిణీ తెరంగునం బొసంగి డాకినీ కోలాహలశాకినీ సంకుల బేతాళప్రహాస భూతవికాస ప్రేతవిలాస పిశాచప్రహర్షకరంబై మహాభైరవంబగు సమరాంగణంబున రావణుండు రఘువరుశరపరంపరల నిలుపోపశంకించిలంకాపురంబుసొచ్చినంగని తక్కిన రక్కసులుక్కుచెడి వెఱచిపఱచినం బ్రహస్తుండు కోల్తలంజేసి కీశులం గసిమసంగుచున్న విభీషణుండతనికెదిరి యతిభీషణంబగు బవరంబున గీటణగించెనంత. 782

క. తతవానరసేనా సం
స్తుతులెనఁగంబూని వాయుసూనుఁడు దుంచెన్
ధృతిరోషారుణితాక్షుం
బ్రతివీరుబ్దమైకద్రేక్షుఁ బటుధూమ్రాక్షున్. 783

క. శస్తపరాక్రముతైన ప్ర
హస్తాదుల చావు విని దశాస్యుఁడు పగచే
హాస్తముల నశ్రితతి వి
ధ్వస్తముఁ జేయుచును బంచెఁ దమ్ముని లేవన్. 784

క. వారకను గుంభకర్ణుని
ఘోరంబగు నిదుర మేలుకొలిపిరి దనుజుల్

భేరీరవ ఘోరాహిత
నారీగర్భార్భక ప్రణాశముగాఁగన్. 785

గీ. అప్పుడా దనుజుఁడు దన యన్నకడకు
వచ్చి పనియేమి యనుడు రావణుఁడు సీత
దెచ్చుటయు రాముఁడేతెంచి దేవ రిపులఁ
దెగువఁ బెక్కండ్రఁ జంపుటఁ దెలియఁజెప్పి. 786

క. కరమీదగు రణ రత్నా
కరమీఁదఁగఁ గుంభకర్ణ కరమీదగు దు
ష్కరమీ దిగులారునె నీ
కరమీద ననంగ ననుచుఁ గరమేదియునన్. 787

క. వరపరికర బద్ధుండై
సరగున నాయుద్ధమునకు సన్నద్ధుండై
పురివెడలెను మరికడలను
తరుచరులనిఁ జొఱకనుఱక డాఁగం వేగన్. 788

చ. తరిమిడి కుంభకర్ణుననిఁదాఁకి యహస్కరసూతి యాహవం
బురక నొనర్చి మూర్ఛమెయినొందినఁ దన్గొని వాఁడులంకకై
పఱచిన నేదదేరిరవిపట్టి విరోధిఁ శిరోధిఁబట్టి వే
కఱచియు ముక్కునుంజెవులు కైకొనివచ్చెవనాటులార్వగన్.

క. అత్తరిఁ దత్తరమెత్తినఁ
జిత్తమునన్ మగిడి బెగడు సేయుచు దనుజుం
డొత్తికొని వచ్చునెడ కు
ద్వృత్తిన్ సౌమిత్రిదాఁకె వీఁకన్ వానిన్. 790

క. ఆయిద్దఱు పెన్నుద్దులు
నై యుద్ధముచేసి దశరథాత్మజుఁడంతన్
బాయక బ్రహ్మాస్త్రమునం
గాయముడుల్లంగఁ గుంభకర్ణునిఁ గూల్చెన్. 791

గీ. అపుడు హతశేషులై తేయులవని యద్రువఁ
బఱచి సురవైరికదియు నేర్పఱప నతఁడు
లంక నెనిమిదివాకిళ్ళ గొంకుగదురఁ
గాపులొనరించె బహుళదుఃఖమున మునిఁగి. 792

క. కాతరుఁడై బహుతర శో
కాతురుఁడై యున్నతండ్రి కాదరమునఁద
త్కాతరయుడిపి యసిలతి
కాతురుఁడై యింద్రజిత్తుకడు నిట్లనియెన్. 793

ఆ. వె. వగలుబొగలనేల మగఁటిమిఁ బాటించి
తెగువ నగచరములు తెగలనొగుల
బవరములనుభూమి పదులనేఁపడగించి
మగిడివత్తుననుచు నగరు వెడలె. 794

చ. పిడుగునఁబోనియట్టి తనపేరువనాటుల కెల్లతేటగా
నుడుగక భేరులొక్కట సముద్ధతవృత్తిని విస్తరించుచున్
పుడమిబడాబడంబగిలి భూరిఫణీంద్రులు చీకులై నడల్
తడబడనాకసంబవయఁదాఁకె రణస్థలిమేఘనాథుఁడున్. 795

క. మెరుగులు జెదరం జేటల
చెఱఁగిన తెఱఁగున ప్లవంగసేనలపై నే

ద్దైఱశర నికరముల సురలు
బఱపుచు నెఱపిరినిజైకబాహాబలములన్. 796

క. మరియు వనాటులు నొండొరు
లరిమురిఁబురికొల్పికొంచు నసురులఁబైపై
బరపిరితరులుం గిరులుం
బిరుసనకన్ గరకుమిగుల బీరములొప్పన్. 797

క. వనచరుల సరకుసేయక
దనుజుఁడుపోరునకు రాముతమ్మునిఁబిలువన్
ఘనుఁడితఁడు వానిఁదలఁపడి
సునిసితవిశిఖములఁ బెంపుసూపెం బెలుచన్. 798

ఆ. వె. అంగదుండు వానికగ్గమైసిలిచిన
ఘోరకాండములను గుప్పెరిపుడు
సాలవృక్షమొక్కటి సారించికీశుఁడు
విసరిమోదిదనుజు విరథుఁజేసె. 799

క. కచ్చెర నదృశ్యుఁడై వాఁ
డచ్చుగ వినువీధికెగసి యచ్చెరువారన్
చెచ్చెరఁజిచ్చుల పిడుగులు
బుచ్చియు కపివరుల నాచముట్టగఁ ద్రుంచెన్. 800

క. వాలంప కట్టియలచేఁ
గాలుంజేయాడకుండఁగా నృపవరులం
గీలించి నాగబాణము
నోలింబరగించిముంచె నురుకబలంబున్. 801

క. నాగాయితసత్త్వులునై
నాగాయితపాశము లను నలిచెడినృపతుల్
సేగిలిరివిభీషణుఁడెడ
నాగాయితరప్లవంగ నాథులతోడన్. 802

చ. అపుడువిభీషణుండువరు ణార్పితతోయమరమోజఁదెచ్చి యా
నృపులకొసంగవార్చి శుచి నిర్మలతంగనుచూత్రివిద్విష
త్కపటముఁబాసెదానవుఁడు గ్రమ్మరనొక్కమహోగ్రహోమముల్
రిపువిషయంబునేయఁజను రీతినెఱింగిసుమిత్రపుత్రుండుల్. 803

ఆ. వె. మరివిభీషణాను మతమునఁబోసీశ
నింద్రజిత్తుఁబట్టి యేపుమిగుల
గురుతరప్రకాశకుండలమండిత
శిరముదెంచె దనుజసేనబెదర. 804

క. హరివీరులచేఁగీడ్పడి
తరుగిరివృక్షులనుదోఁగిఁ తలముల్లైడలం
బురిసొచ్చెన్హతశేషా
సురసంఘముపంక్తిముఖుఁడు సుడివడిచెదఁగన్. 805

క, అదియెల్ల యెఱిఁగిమూర్ఛను
బొదలిముహూర్తమునఁ దెలివిఁబొంది కుమారుల్
మదిఁదలఁచి మరఁగిపోయని
పదినోళ్లుందెఱచి యఱచెఁ బరిపరిగతులన్. 806

సీ. గరుడగంధర్వకిన్నరఖచరపతుల
నొడిచిమోపుత్రి నరుచేతఁబడితివకట

మాయదైవము నిన్నిట్లు మాయముగను
సేయునేతరు నేనేర్చిసేతుననుచు. 807

చ. కడువడికోపముల్ నిగుడఁ గైదువగైకొని ధారుణీసుతన్
దడయక చంపఁబూనుటెడఁ దద్దయువృద్ధనిశాచరుండొకం
డెడపక నడ్డమై పలుకునిట్లుచితంబ దశాస్యనైరులం
బొడుచుటగెల్పుటొప్పిదము భోటికినారసిపోటు మానఁగన్ 808

క. అని మరలిచినన్ మరలుచు
ననికిం జతురంగబలము లాయత్తముగాఁ
జనుదెండని యుద్ధండత
మునుకొని రణ కౌతుకంబు ముడివడనంతన్. 809

ఉ. హాటకఘంటికాశత సహస్రసమేత మనేకచక్రిక
స్ఫాటితభూమిచక్రమును బంధురఘోటకపేటికా నిరా
ఘాటముకాలకేతుపరికల్పిత కౌశలసూతకృత్యమున్
పాటవభానురంబునయి పాటిలుతేరుదశాస్యుఁడెక్కెఁదాన్ 810

వ. ఇవ్విధంబున సమరసన్నద్ధుండై పురంబు వెడలె నప్పుడు వనాటులును వచ్చి నిశాటబలంబున కెదిర్చి సింహనాదంబులు సేయుచు మార్కొనియె నయ్యిరువాగునకుఁ బెద్దపొద్దు నంకుల సమరంబయ్యె. 811

క. తెగడుచు నెగడుచు నప్పుడు
తగమాయాకుశలుఁడైన దశలపనుఁడుదా
నొగి రామలక్ష్మణులఁ దన
దగుతనువున బహుళతరముగ నట గల్పించెన్. 812

క. అదిమాయగా నెఱుంగుచు
నదిమాపఁగఁదలఁచి రాముఁడస్త్రమహిమచే
చదురొప్ప వానిదునిమెన్
ముదమున మదిలోనవేల్పు మూఁక నుతింపన్. 813

ఆ. వె. మఱియుశూలశక్తి మహితగదాకుంత
దివ్యబాణతతుల భవ్యగతుల
యమితశౌర్యమలర నన్యోన్యజయకాంక్ష
సమరిమమరు లెన్న సల్పునెడను. 814

చ. పటుతరసూర్యమండల నిభంబు శుభంబు నభంబుసిగ్గ యు
త్కటనుమనోరథంబు సురథంబు విధంబున సొంపుమీఱియు
ద్భటజవవాజికంబు రఘువల్లభుపాలికివచ్చెమాతలి
స్ఫుటతర సారథిత్వమునఁబూని సురేశ్వరుఁడంపఁబెంపునన్. 815

క. నరపతి మాతలి ప్రార్థన
గరిమన్ సింగంపుకొదమ రథినినెక్కెన్
గరుడోరగ ముఖదివిజని
కరకల్పితవందనంబుగా స్యందనమున్. 816

క. అత్తరి రావణు డలుకన్
దత్తరపాటింతలేక తమ్ముని నతనిం
గత్తుల యలుగుల వైచుచుఁ
దత్తనువులు గాడనేసె ధర గంపింపన్. 817

క. దనుజుండేసిన శరములు
తునియలుగాఁజేసితలలుదునియ నరేంద్రుం

డనయుంబశనులబోలెడి
ఘనతరబాణములు వైచె కౌశలమొప్పన్. 818

శా. తద్దాక్షిణ్యమశేషబాణతతి నాద్వంద్వంబుగాత్రంబులన్
సాందీభూతముగాగ శోణితములో జంబెల్చ జాలెత్తని
స్తంద్రస్ఫూర్తి శరంబుపోరిరి జయాశాలోలుపస్వాంతులై
నిందాక్షిదుల్ భయమొందిరాత్మలనుదారెట్లో యటంచుంగడున్

క. శరమీరేడుదినంబులు
పరువడిపోరిరి జయాగ్రభంగుల భూభృ
చ్చరులు తమశ్చరులున్ దు
ర్భరసంగరసీమ భీమబలశౌర్యమునన్. 820

మ. అవుడింపార నమంత్రకంబుగను బ్రహ్మాస్త్రంబరిం బోసియా
నృవుడున్ మార్వ నవార్భటిన్ వనధిఘూర్ణిల్లన్ దశగ్రీవుపై
కుపితుండై పరపెందిశావళులు సంక్షోభింపగా నత్తఱిన్
విపులన్యందనసంయుతంబుగరణోర్విం గూల్చె దూర్ణంబుగన్. 821

క. పాడిరిగంధర్వులు కడు
వాడిరి రంభాదులోలి నమరులుగుంపుల్
గూడిరి భయమున మానులు
వేడిరినతులొచు పుష్పవృష్టియుఁగురిసెన్. 822

క. అరులదుర్ంచి జయోన్నతిఁ
బఱగుచు రఘువరుఁడు లంకపట్టముగట్టెం
జెరగతిగవిభీషణునిం
బరిమృదుభాషణుని నార్తభరశోషణునిన్ 823

ఆ. వె. పేర్మిమెంపుమీఱ రామభద్రుఁడొసంగ
రహినిదనుజరాజ్యరమను గొన్న
నరసివిగతలజ్జయై విభీషణుఁగోరి
లంకమాఱుమనువ లంకరించె. 824

క. మెల్లన నశోకవనిలో
నల్లలితయశుండు రామచంద్రుఁడు గాంచెన్
ఫుల్లకనద్ధల్లకసమ
సల్లాలితపాదపంకజాతన్ సీతన్. 825

అప్పుడు 826

చ. చెఱఁదనయాలిఁ బెట్టెనని చెందక డెందమునకిందగాని యో
తెఱవ విరోధియాత్మవసతిన్ బహుకాలము నిల్చినట్టియా
కొఱకుఱవేడ్క చేకొనని గోరుమటంచును రాఘవుండనం
గొఱవిని చూడినట్లు వినిశోకలరాజవధూటిమూర్ఛిలెన్. 827

గీ. మూర్ఛదేరి యపుడు భూపుత్రినాధుండు
వినగసకలజనులు వినుతిసేయ
నెరయ నెఱుగు నాదు నిష్కళంకత్వంబు
ననుచు విభుఁడువహ్నిఁ బెనుపుజేసె. 828

క. అనలుఁడు దనలో సతి బడ
గనికడుచల్లనయి మంచిగందముపోల్కిన్
కొనితెచ్చి సమర్పించెను
జనపాలకుఁడైన రామచంద్రున కింతిన్. 829

చ. పదిగెడు పంచభూతములు బల్కెనిజాకృతులొప్పసంగ ని
ష్కృతిణి గరంబు మోదమునగౌరవమొప్ప నృపాలుగాంచియో
నరవర యీతలోదరిని నాయమెఱుంగక పల్కఁ బాడియే
పరమపతివ్రతామణిని భావ్యమె యిట్లు పరీక్షసేయగన్.

క. జనకజఁ గైకొని పుష్పక
మున ననుజయుతముగఁగపిశముఖ్యులు గొలువన్
జనపతి సాకేతపురీ
జనములకుత్సవము బొదలఁజనుదెంచి తగన్. 831

గీ. అపుడు సూర్యసుతాదులు హర్ష మొంద
పేరుపేరున బిలుచుచు వేరు వేర
గారవించుచు బహుమాన గౌరవములు
విస్తరిల్లంగ నందర వీడుకొలిపె. 832

ఉ. మఱియుసహోదరుల్ విబుధులాత్మజసంబులు సంతసింపగన్
నెఱతన మొప్ప రాజ్యమును నిత్యము సత్యము దప్పకుండ నం
దఱు గడుమెచ్చ పెక్కుశరదంబులు పెంపునఁజేసి భోగముల్
గఱుకొనరామభూవరుఁడుకుంభినిపై వెలసెన్ యశస్విమై.833

క. ఈకథవిన్నం జదివిన
శ్రీకరముగ శుభములిష్టసిద్ధులు నోలిం
జేకూడును జనములకును
పాకటగుణధర్మరాజ! భాస్కరతేజా! 834

వ. ఇదిరఘురామ చరితంబు నీవునట్ల భవ దాయాసంబు
ని స్తరించి సుఖంబు లనుభవించెదవనిన విని మార్కండేయునితో
పాండవేయుం డిట్లనియె. 835

క. మునివర భక్తిం గష్టము
లనుపమగతి నంది సుఖములందిన సాధ్వీన్
వినవలతు చెప్పవే యన
జనపతికి మృకండసుతుఁడు సఁగున ననియెన్. ౮౩౬

మ. వినుమ ద్రేశుఁడనంగ నశ్వపతి సావిత్రీ ప్రసాదంబునన్
దనయం గాంచె నొకండు నొక్కయెడ నాత్తవ్రతముల్గోల్వన్
మ్మనమారం గొలువున్న నచ్చటికి శ్రీమన్మూర్తియై నారదుం
డొనరన్ వచ్చినఁ బూజలిచ్చి నృపుఁడిష్టోల్లాసముల్ మీరఁగన్. ౮౩౭

గీ. మరియు తనదు నెచ్చెలులతో మద్రనృపతి
పాలికాత్మజ యేతెంచి పరమభక్తి
మ్రొక్కి నిలిచిన మౌని యాముగ్ధఁ జూచి
మద్రనరపతి కనియె సమ్మదముతోడ. ౮౩౮

వ. దీనిం దగువరునకుఁ గూర్పకిట్లేల యుంచితివని నారదుం డడుగగా మద్రేశ్వరుండు గూతుం దొడలపై నిడికొని యవ్వా! నీవెవ్వనిఁ గోరితని యడిగిన నది లజ్జచే నించుక తలవంచి చెప్పకుండిన, భూపతి తాను గూతుచెలిమికత్తియలచే నెఱింగినంతవట్టు సత్యవంతుం గోరెనని చెప్పగా నారదుఁ డీక్షించి యిది కోరిన వరుం డెట్టివాఁడు నిఖిలలోకములలో నీ వెఱుంగనివారు లేరని భూపతి యడిగిన మునియిట్లను నక్కన్నియ కోరువరుండు వయోరూపలావణ్యతేజోవిశేషంబుల దగినవాఁడు. చిత్రాశ్వుఁడనియు, సత్యంబు బలుకుటం జేసి సత్యవంతుఁడనియుఁ బలుకఁబడుచుండు నిప్పుడు శత్రులచే రాజ్యంబునుఁ దొలంగి వనంబున బిత్రుసహితంబుగా నున్నవాఁడిది మొదలు యొక్క యేఁడాది యాయుష్యంబనిన విని

కూఁతునుద్దేశించి యిట్టివరుఁడేల ననుడు నదిమనోవాక్కాయంబులకు మతంబు ప్రధానంబు మతంబున వరించినవాని విడువజాల ననవుడు నా దేశ్వరుఁ డియ్యకొని శుభముహూర్తంబునం జని ద్యుమత్సేనుం బూజించి యతనిచేఁ బూజితుండై వానితనయుండైన సత్యవంతునకు సావిత్రినిచ్చి పరిణయంబొనర్చిన వారువనంబునకేతెంచిరంత సావిత్రియు శ్వశుర భర్తృ శుశ్రూష సేయుచు నారదువచనంబాదిగా లెక్కించి పతి యాయువు నాలుగుదినంబులు కడమయై యేడునిండిన నాడశన వ్రతంబు గైకొని యున్నంత.

క. అడవికిఁ తనపతిజనునెడఁ
గడుశ్వశురుల పనువువడసి కాననసరణిన్
వడయక చనియెం బెనిమిటి
విడువకతత్కరముఁబట్టి వేగముతోడన్. 840

సీ. ఇట్లులాదంపతులు జని యిష్టగతుల
గహనతలమెల్లఁజూచుచు విహితలీల
నొక్కచోసత్యవంతుఁడాయువిదనునిచి
కట్టియలు గొడ్డటను వ్రేయఁగాఁదొడంగె. 841

ఆ. వె. ఒడలు వడఁకి రొమ్ము వడపుట్టి నట్లై
యతనికొక్కతీరునైన యంతఁ
పరశు వవనివైచి పడఁతియంకముదల
యాంపిఁజేసి పవ్వళింపనప్పుడు. 842

చ. ఘనతరనీలకోమల వికాసశరీరుఁడు పాశహస్తుఁ డే
పునఁనొకఁడేఁగుదెంచి నృపపుత్రికు ప్రాణముఁ బోజఁదీసి తాఁ

గొనిచనుచున్న జూచి సతి గొబ్బున నాతనితోడ నొయ్య నా
వెనుకొనిపోవ నాయముఁడు వేగఁగృశాంతుఁడు బల్కెఁగ్రన్ననన్

క. మానిని యేనంతకుఁడను
గానంబడనేరికిలను గడునీవు మహా
మానితసాధ్వివి గావున
గానంబడినాఁడనుమ్ము కంజాతముఖీ. 844

సీ. చెలియ నీపతికాయువు చెల్లెనితని
పుణ్యఫలమున దూతనుబుచ్చకేన
వచ్చికొనిపోవుచున్నాఁడ వలదు వలదు
రాకయనవిని యిట్లను రాజవదన. 845

క. సతి పతివోయెడు తెరవున
మతిబాయక చనుటయొప్పు మార్గములను
స్తుత ధర్మమార్గ మొక్కఁడు
తతముగఁదలపోయ నెట్లు ధర్మఁడనయ్యా. 846

వ. సజ్జనసంగతి లెస్సయని మిముబోటి మహాత్ములు చెప్పుదురకాదె. నీయట్టిసకలధర్మనిధితోడి సంభాషణంబు పరమలాభంబిదియునుగాక భర్తృశుశ్రూష యవశ్య కర్తవ్యంబనిన దాని వాక్యంబులకు మెచ్చికొమయుండు సత్యవంతు ప్రాణంబు దక్క తక్కవరంబు వేఁడుమనుడు సావిత్రి నమస్కరించి సాల్వపతియైన ద్యుమత్సేనుండంధుండై యున్నవాఁడతనికి నేత్రంబులు ప్రసాదింపు మనిన నట్లకాకయనుసంగతి నీవింకఁ గ్రమ్మరు మని చనుచున్న మఱియుఁ దక వెఱుఁదవచ్చుచు ధర్మ్మ ననేకవిధంబులఁ బొగడి యతిసూక్ష్మంబులగు ప్రశ్నలు ప్రసంగించుచు సంతుష్టుంజేసి నిజజనకు పుత్ర

లాభంబును ద్యుమత్సేనునకు రాజ్యంబును బతికిఁ బ్రాణంబులును బడసి మగిడి యెప్పటిగతివచ్చి ప్రియుని శిరంబుపై నిడుకొని యున్నంత. సత్యవంతుండు లబ్ధజీవితుండై నిద్రించిన తెఱంగున లేచి ప్రియాంగనం జూచి యిట్లనియె. 847

క. కలగంటి దరుణి యొక్కఁడు
బలియుఁడు ననుడాసి కేలుబంధించి వెసన్
బలితపుశాసంగొనిచనెఁ
గలగాదిది నిక్కమట్ల గనఁబడునాకున్. 848

క. అన సముచిత సల్లాపము
లను దనపతి నూలుకొలిపి లలనామణి వే
చన వలెననుడట్లనయా
యన తండ్రిం దలఁచి సంభ్రమాయత్తమదిన్. 849

సీ. కన్నులంగానఁడు సన్నుబాయఁడు నేన
కన్నులై వర్తించు గాననింత
దడవయ్యె దుర్బుద్ధి గడు నిద్రపోయితి
నబల సంబోధింప వైతి వేల
ననియుఁ ధర్మభారంబుగొని సతీయుతుఁడునై
చనునప్పుడా వృద్ధజనవరుఁడు
గొడుకురామికి నాత్మగుందుచు నున్నంత
బఱతేరగాంచిసంభ్రమముతోడ
గీ. దనయ! యీప్రొద్దుగ్రుంకినఁదనుక నేల
మసలితివి నావుడున్ సాల్వమనుజపతికి
నచ్చుపడఁజెప్పి తాఁబోయి వచ్చుటెల్ల
నచ్చెరువుబొందెఁ గన్నులు వచ్చుటకును. 850

వ. అప్పుడు సావిత్రి నారదువచనం బాదిగా దద్వృత్తాం
బంతయు మామకెఱింగించిన హర్షించె నతండు పూర్వసామ్రా
జ్యంబు గైకొని కొడుకునుం గోడలిని గారవించె నశ్వపతియు
నదివిని సంతసించెఁగావునఁగృష్ణయు సావిత్రిఁబోలిన పరమసాధ్వి
యనిచెప్పి మార్కండేయుండు వారల వీడ్కొని నిజాశ్రమంబున
కరిగెఁబాండవులు నిష్టగతుల విహరించిరంత. 851

సీ. మునికుంతిభోజుని తనయ పృథాకన్య
జనకుని గృహమున దనరునపుడు
ఘనుఁడు దుర్వాసుఁడు చనుదేరఁగుంతిభో
జుఁడు పూజలిడి మనస్తోషమెనయ
మునిమనయింట నెమ్మనమున నేన్నాళ్లు
వసియించునన్నాళ్లు వలయునట్లు
శుశ్రూషసేయుము సురుచిరభక్తినా
కూతు నొప్పఁగబల్కెఁగుంతితనదు

గీ. తండ్రియనుమతిగొని భక్తితప్పకుండ
నమ్మహాత్ముని సేవించెనమ్మదమున
మాటజవదాటకాయన మదికివచ్చు
నట్లుపరిచర్య జేసిన నతఁడుమెచ్చి. 852

క. కన్నియ! నీభక్తికిఁ బ్రి
సన్నుఁడనైతిని వరంబు జానుగఁగొనుమం
చున్నవ్యమంత్రమొక్కటి
క్రిన్నననుపదేశమిచ్చి కరుణంబలికెన్. 853

ఉ. కోమలియెట్టిదేవతనుగోరుదు వాత్మమదీయ మంత్రముక్
నేమముతో జరించునది నీకుమనోరథసిద్ధి జేయునం
చామునిచెప్పినన్న మదిరాక్షినొకానొకనాడుస్నాతయై
కోమలబాలభాస్కరుని గూర్చి జపించినదక్షణంబునన్. 854

గీ. సూర్యుడేగుదెంచి సుందరి ! తనయుని
గోరితీవుగాన గూడుమన్న
ననుచువెఱచిమ్రొక్కి యనఘాత్మ ! కన్నియన్
గర్భ్యామిట్టినేతగాదు నాకు। 855

క. ఈమంత్రసార మెఱుగుట
కై మదిగోరితినిదప్ప హాస్కర దయచే
నీమది నైపుము నావిని
కామిని కప్పద్మసఖుడు కనునిట్లనియెన్. 856

క. తరుణి! యిదిరిత్తవోవునె?
కరమేటికి వగవనీదు కన్నియతనముక్
బరగగ నేవరమొసగితి
స్మరకేళిం దేలుమనుచు సతినోడబఱచెన్. 857

వ. అంత నమ్మహాత్మ్ముని సమాగమంబున గర్భంబుదాల్చినెలలు నిండునాడు నిశీథుండు గొడుకుం గని మందసంబున నిడి దాదికూతురు దానును గొనిచని నదియందువైచి దుఃఖంబు నంబొందియుండె నక్షయుడానును దక్క నన్యులెఱుంగకుండ రహస్యప్రకారంబున గడపె నమ్మంజూష ప్రవాహరయంబున గంగం బడి నానాదేశంబులుగడచి పోవునెడనతిరథుండను ధృతరాష్ట్రసఖుండైన సూతుండు జలకేళితత్పరుండై యుండి వచ్చుమందసం

గని దిగిచియందు వసువర్మ కుండలమండితుండగు బాలునాలో
కించి ప్రహర్షంబునం దెచ్చి యనపత్యుండు గావునఁ దనసతియగు
రాధకిచ్చిననది సంతసించి పెనిచె నీవృత్తాంతం బంతయుఁ గుంతి
విని సంతోషించె నక్కుమారునకుఁ గర్ణ వసువర్మ రాధేయాది
నామంబులు బొసంగె. సూతుండా సుతుం ద్రోణునొద్ద నస్త్రవి
ద్యాభ్యాసంబుఁ జేయనమకూర్చె. వాఁడు దుర్యోధనునకుఁ బరమ
మిత్రుండై యర్జును నోర్తునని ప్రగల్భవచనంబులాడుచుండు. 858

గీ. అట్టికర్ణుని ధర్మజుఁ డాత్మఁదలఁచి
సమరమున నెట్లు గెల్తునో సహజ కవచ
కుండలుండని చింతచేఁ గుందుచుండ
విపినవాసము వెడలెడు వేళనంత. 859

క. పాండవ హితార్థమై యా
ఖండలుఁడుం గర్ణువలనఁ గవచంబును ద
త్కుండలములు గొనిచనిమది
నొండువిచారంబుమాని యుండెంగడఁకన్. 860

ఉ. అంతటనొక్కనాఁడు జ్వలితాంచిత వర్ణతనుండు పద్మినీ
కాంతుఁడు శబ్దమంగములకై వడిఁ గర్ణముఖాప్తిదానుసా
యుంతనవేళఁ జెందియుఁ దదర్పితవందన మాదరించి య
త్యంతముదంబుచే నతనికాదట దీవనలిచ్చి యిట్లనున్. 861

ఉ. ఏనుదివాకరుండనుజుమీ! మదనుగ్రహసంపదం గుమా
రా! నినుఁగాంచెఁగుంతి యితరప్రథితం బిదిగాదుగావునన్
సూనునిసేమమెల్లపుడు జూడఁగనొప్పును దండ్రి కెందునో
ధీనిధి నీకునొక్కయుపదేశముఁ జేయుదునిష్టసిద్ధికిన్. 862

క. నావిని విలాసవిక్రియ
నావనచరుఁడోలమున నిజాంగముఁ బెంపన్
భూవరు తెరువును మతిదే
వావళి తెరువును నిరోధమయ్యెం బెలుచన్. 317

వ. ఇట్లు మేను బెంచిన 318

శా. మైనాకంబను సందియంబున గరుల్ మట్టాసనట్లొప్పనా
మైనాకంబదరంటి యున్నఁ గనివేమారున్ భయభ్రాంతుఁడై
మైనాకింపము బుట్టి కన్ను మకుళింపం గీశుబోధంబుని
మైనాకేశసుతాగ్రజుండు ముదితుండై హస్తముల్ మోడ్చెఁదాన్

గీ. అంతనందందసంతన మతిశయిల్లఁ
బెరుగునవయవముల బెంపుపిచ్చటిల్లఁ
భ్రాంతివృద్ధివిడఁబంబు పవనపుత్రుఁ
డల్లనల్లన శాంతిగా ననవృపఱచి 320

వ. సవినయంబుగా నతనికిట్లని విన్నవించె. 321

క. చిరకాలప్రార్థనచే
సరణింగనుపడిన నీదుసందర్శనమో
హరివర ! యిపుడీవిస్మయ
శరనిధిఁగడువంగ నాకు శక్యంబగునే! 322

క. రాముఁనకునను జూకంటెన్
బ్రేమమునీయందటంచు బెట్టితిమతిలో
యామినిచరహరణోత్సవ
మామహితునికంటె నీకునధికముకతనన్ 323

కేమినమకూర్పదది ప్రీతిలోమవర్ణ
యుగ నిజాఖ్యాపదార్థంబు దగుటకతన. 868

క. యశమేయగు మనుజులకున్
విశదంబగుజన్మఫలము వినుయత్నమునన్
వశముగఁగోరందగు యా
దృశులకునె నం దలంప దినదినమొందున్. 869

క. వినుమితరగుణగణముచే
తనుభాసిలువాఁడునీచతం దుర్వశుఁడై
చనుఁగానిజగముచేఁబెం
పునఁబొందఁడుజుమ్మునాదుబుద్ధింజూడన్. 870

గీ. వితరణోపనిషత్తుల వెలయలేక
నాపదలెతెల్పఁగలరర్థి కవనిపతులు
కరముసంస్పర్శతనుబాయు కారణమున
పీనుగయు లుబ్ధుఁడును సమానముగును. 871

చ. అమరెనుయాచకుంగనిన యప్పుడనవ్వననోమ్ముద్దానతో
యమునఁగరంబుకీర్తిని దిగంతరముం దెల్పుపైఁజెల్లఁగ శాం
తమతినొనర్చునాఁడుకద దాతయగున్ భువివానిమాన్పఁగా
తుముఁడగువాఁడెటంగలఁడె సారసబాంధవ!సప్తసైంధవా!

గీ. అడిగివాంఛనుబొందక వరుగునర్థి
తోడనేదాతప్రాణముల్ వీడిపోవుఁ
గాననిచ్చుప్రాణముల్ గలుగనాకు
శకుప్రిపూజనురాఁగల చావులెన్న. 873

సీ. ఎవ్వనియింటికి నెసఁగజెంగటిరచ్చ
రాయిచింతామణి రత్నమయ్యె
ఎవ్వనితోఁటకు నెలుఁగుగాఁగఁ బెట్టు
పాదపావళులు కల్పకములయ్యె
నెవ్వనిహోమాగ్ని కిష్టగవ్యంబిడు
పసి కామధేనువు పరగినయ్యె
నెవ్వనిపెరఁటిలో నివ్వటిల్లెడునడ
బావినీరమృతమేర్పడగనయ్యె

గీ. అట్టిమఘవుఁడుయాచకుఁ డగుచువచ్చె
నేనియాతనిమదిగల యీగినిచ్చి
ముజ్జగంబులదాత్మ సమూహసభకు
మీఁదుఁజేయుదునాకీర్తి మేరయిదియె. 874

వ. అంత. 875

గీ. వెరగుపాటనుమున్నీటి వీచిఁమునిఁగి
పాటలస్మితుఁడై పద్మబంధుడిట్లు
బలుకుకర్ణునిఁగనివంద్య భాషణుండు
నై గుణజ్ఞుఁడుగావున ననియెనిట్లు. 876

గీ. వత్స! నీమాటకుమమయ్యె వరులునైన
స్థూలలక్షణమీనాదు నాలుకను ద్వ
దిష్టమతమిదికర్ణి్మర నియ్యకొలుపఁ
బూనితిసిద్ధె వఘటనము మానునెట్లు? 877

ఉ. ఈపనిదైవికంబెవరునేమియుఁ జేయుదురైన బుద్ధినా
పో పనిలెన్నగానవినుపూర్వము పూర్వనుపర్వగర్వని

ర్వాక్షణధూర్వహంబగుచు వజ్రికిఁగల్గువిఘాతవజ్రధా
రాపటుశక్తితత్ప్రథుతరంబగు శక్తినిఁబోనిశక్తియున్. 878

వ. అట్టి దివ్యశక్తిం గొనుమనిన నతం డట్లంగీకరించె నత్క్షణంబ కర్ణ సమక్షంబున మరీచమాలి చరమ శిఖరి శిఖర పరిశీల్యమాన విహారం బాచరించె రాధేయుండు వాసవాగమనంబున కెదురుజూచుచు నిష్టగతి నున్నంత. 879

గీ. కతిపయదినంబులేఁగిన కాలమునను
వేయుగన్నులవేల్పు రాధేయుకడకు
విప్రుఁడై వచ్చిబహుమతి వినుతిఁజేసి
దేహిభిక్షా మటంచుఁదా ధృతినిఁబలికె. 880

చ. పరగసిగూఢబాడబుని భాస్కరనందనుఁడిట్లుబల్కు భూ
సురవరరాజవారణవసుప్రకరంబును గన్యకాజనో
త్కరపురభూములాదియనఁగాఁ గలకోరికవేఁడునావుడున్
గరమరయన్ సకుండలముగాఁ గవచంబపుడర్థి వేఁడినన్. 881

క. ఇనతనయుఁడతనితతనుతి
గొనియాడిమదీయకవచ కుండలయుగమున్
బనిగలదేవిప్రునకీ
వనఘా! మఘవుఁడవు తెలియ నయ్యెన్ నాకున్. 882

క. ఇవినాటంగలిగినచో
బవరంబున గెలుతునరుని బాహుబలముచే
నివిదలఁ
ప్రవిమలగుణ! యొక్క విన్నపము వినుమింకన్. 883

గీ. అర్థివై నోరు దెఱచి సన్నడిగితీవు
కుండలంబులు కవచంబు గొమ్ము నీదు
శక్తి నాకిచ్చునది యన శక్రుఁడట్ల
దయనొసంగియునొకయేటు నియతిఁ జేసె. 884

వ. అప్పుడు కర్ణుండును నాకుఁ గలవగతుం డొక కిరీటియ
కాదె యొక్కయేటునం గీటడంగింతు నంతియచాలునని సమ్మ
దంబునొందె నంత. 885

చ. కదు నివిబూనునాకు నుపకారము వైరియటంచు నెమ్మదిం
గడిదియుమర్షభారమను కైవడి శస్త్రమునం దెమల్చి తాఁ
దడయక కర్ణవేష్టనము దంశనముల్ రవిసూతి పీతి పెం
పడరఁగ నాఖిడౌజునకు నర్పణఁ జేసి సురల్ నుతింపఁగన్.

చ. సురతరులవ్విధంబు వినుచుం గనుసిగ్గునఁ జెంది తారువి
స్తర నిజదానసంచిత యశఃకణికాతతి దుల్పె నాఁగని
ర్జరకర ముక్తసూన నికరంబు తదంగమునంగ నీమలుం
గరముసుగంధ బంధురముగాఁ దొరఁగెన్ బరగెన్ జయధ్వనుల్

గీ. అప్పుడు కర్ణావయవములు నతిశయిల్ల
వెండియునుఁ గ్రగ్గ పదముదా వితదయాచ
కాత్మ కాంచనమయ భూషణావహంబు
గాఁగఁ దనరారెఁ గమనీయగరిమతోడ. 888

చ. కులిశధరుండు నీగతి సకుండలమౌ కవచంబు కర్ణుచే
నలలితరీతినంది ఘనశక్తిని వానికొసంగి యంత ను

జ్జ్వలమతితోడ వీడ్కొనియు సర్వనుపర్వులలోను ధర్మజా
నెలమిఁగఁజెందెఁదచ్చరితమెన్నుచు నెల్లరుమౌళు లంతయుఁ

గీ. విసఁగ విస్మయమగు కర్ణవితరణంబు
దెలసి ముల్లోకములవారు కలితరోమ
హర్షులై రప్పుడవిని యటవినున్న
పాండునందనులును హర్షభరితులై రి. 890

ఉ. పోడిమితోడఁ బాండునృపపుత్త్రులు కామ్యకసీమ డించియా
బాడబకోటితో సరిగఁ బార్థ తివేడ్కనుగోరి తీర్థముల్
గూడుచు తొంటిద్వైతవని గ్రిమ్మరుచట్టియరణ్యవాసముల్
పీడెను వేళయందునొక విప్రుడువచ్చిన సంభ్రమంబుగన్. 891

వ. ఆశ్రమద్వారంబున నిలిచి యోమహాత్ములారా! మదీ
యహోమమథనంబగు నరణి యొక్కహరిణంబు శృంగంబునం దవి
లిచికొని చనుచున్న యదియుని భాష్పాకులలోచనుండు నగుచు
ద్విజన్ము దుఃఖంబు నివారించి యయ్యరణికై హరిణంబు వెంట
చక్రీకృత చాపులగుచు రథసంబునవచ్చి యుధిష్ఠిరాదులు, యేటు
పోటులకుఁ దప్పుచు పార్శ్వలతాతాడనానుషక్త నవదళజాలంబు
దుముకులిడు వేగంబునఁ బుట్టునట్టంబు కరువలివలన బహిర్జ్వలిత
గర్భగ నిర్భరవహ్నిశిఖాకాండకాండంబులబోలి కొమ్ముల నెమ్మెలనెఱప
గొన్ని యడుగులకు లోఁబడునట్లుండుచుఁ గొన్ని యడుగులకు
దూరస్థంబగుచుఁ బట్టీక చిత్రగతి నాకృష్ణసారంబతిదూరంబు గాఁ
గృష్ణవారులంగొని పోయి మాయంబై నదానిఁ గానక నమ్మోడ
ముఖపఖప్రదేశంబులకు వెచ్చనిచ్చ్వేహలిధూళియు గళిందగలిత
నయానవనంబునఁబ్రక్కతారంబునం బోలె నీరుకందున నెఱుఁగక

డస్సి యుండునందు విచారించుచు నిలిచి యరయు తమ్ములతోడ ధర్మతనయుఁడొక్కచక్కనిపిశాలసాలమూలతలంబునందుమధ్యాహ్నసమయంబున తచ్ఛాయామండలంబుమాడ్కి మెల్లమెల్లన బ్రవేశించి విశ్రమించెనంత. 892

సీ. నకులునిఁగని ధర్మనందనుఁడిట్లను
వన్ననీతోఁ బుట్టులందరిట్లు
బడలిరి దప్పిచే మడువివుచారించి
యీవునీరాని మాకందజకును
దమ్మివుట్టికలతోఁ దెమ్మనావుడునట్లు
వెసతరువెక్కి నల్దెసలుజూచి
చనిరమ్యమగుచున్న సరసిఁజేరిజలంబు
లానహస్తము సాచు నంతనతని

గీ. కనియెనొ నశరీర భూతమోయనఘనాదు
ప్రశ్న దెలియఁగఁ జెప్పినప్పటికిదాగ్రవు
ముత్తరముమాలిద్రావినఁ జత్తువనుడు
నడ్డసేయకతృష్ణచే సలిలమాని. 893

క. ఆయుదకము విషమ్మై మా
ద్రేయుఁడుమూర్ఛిల్లిపడియెఁ దీరమునందున్
వాయుజుఁడాదిగనీగతి
డాయుచుఁబడిరోలిఁ దత్తటస్థలివధునన్. 894

క. నలువురుదమ్ములు నొక్కొక
కల్లఁతంజని జలముదేగ నటమునలుటకున్

గలదొక హేతువు పగతురఁ
గలసెనొకో మాయదై వగతి యని నృపుఁడున్. 895

వ. జలములు దేరనేఁగి జలజాతసుగంధ సమీరణోచ్చ యా
నలలితదిగ్గతుల్ పవననందన ముఖ్యులు రాక తక్కటం
దలఁకుచు వారిఁజూడఁగొనిఁ తాను సుధర్మజుఁడేఁగి కాంచెను
జ్జ్వలతరమై యనూపమగువాపి బురస్సరణిన్ రయంబునన్.

గీ. ఆకొలంకుతటస్థలి నజ్జ పాన
పాత్రహస్తులఁ బంక్తిగాఁ బడినవీర
వరులఁగని బావ్పములురాల ధరణియందు
గొబ్బునను దుఃఖమున జముకొడుకువడియె. 897

వ. మఱియుఁ గొండొక వడియగునంత. 898

గీ. అధికవత్సలుఁడైన యవ్వనివిభుండు
కాంచిమతిచెడి మేనుమాన్గాఁగనవుడు
తమ్ములనుజెందినట్టి తద్దశనుదాను
బంచికొనుచుచు నుండెను పగిదిఁదోఁచె. 899

మ. వనజామోదవహంబు నాత్తమధుపవ్రాతంబు నానావిలో
భనదక్షంబు పరిశ్రమానయగు శుంభడ్డింభచారంబు స
త్కనదక్షీణవనావనీ సరసికాకల్లోల మల్లానిలం
బనవై యామహనీయమూర్తిపయి నవ్వ

వ. అంత క్షణమాత్రంబున కొక్కింత దేరి నిర్మమవ్యం
బులు నితర జంతుసంతాన శూన్యంబులు నగు దేవలంతటం
గలయంజూచి మెల్లమెల్లన చేరంజేరి శోకచంచలంబగు కరాంచ

లంబుచేఁ బర్యాయంబుగాఁ సోదరులం బునుకుచు వనపక్షిమృగ
పాన సౌకర్యంబు గాక దురవతారంబైన కాసారంబును దత్పాన
సౌకర్యార్థంబుగా నిండఁ బ్రమాడ్కి బాష్పధారలు వర్షింపుచు
ధర్మనందనుం డిట్లని విలపింపం దొడంగె నప్పుడు. 901

ఆ. వె. వీరులార! శత్రువీరులకై మన
నలువుప్రతినలెల సమసియకట
యిప్పుడిట్టి యిడుముఁగప్పిన దెసచెడి
సోలినారలెందు సోతునేను. 902

క. మీకుం గూర్చినవాఁడఁగ
దాకానఁగు రత్సహాయుతక వచ్చియు న
న్నేకాఁడించి యిటుమీ
పోకఁడగునయ్య రాజపుంగవులారా! 903

చ. పఱచెఁబగదైవమెంత దయమాలెఁదలంపఁ గడిందిచెద్దిమీ
తఱినకటా! ద్విమాతృజులు దద్దయవీరొకనాఁడు తల్లిమా
మెఱుఁగరు కందమూలములు నెప్పుడుభక్షణఁ జేసిచేసియే
త్తెఱఁగునఁబాయక వనినిద్రిమ్మరి యీదశనొందనోర్తునే.

గీ. సవతిబిడ్డలటంచును సన్నబోక
నరకటను బెట్టిపెంచె నాయమ్మ యిట్టి
కన్నెఱువనికూనలు గహనమునకు
రాకదీఱమివచ్చి యీపోకఁగనిరి. 905

క. అనిమాద్రేయులకై కడు
వనటంబడి పొగిలిపొగిలి వాసవతనయుం

గనియాపృథివీపతి తన
మనమరవరలైన శోకమగ్నుండగుచున్. 906

గీ. పోటుపడకేను మారుతలబోటుకట్ట
నెవ్వఁడనిమోదెఁ దమ్ముఁడా! యిట్టినిన్ను
బోటులేకుండనాయువుఁ బోయిచావఁ
జేసెనెంతటివాఁడో! చెడుగుబ్రహ్మ. 907

చ. అన్న! కఠోరశాత్రవమహాహవ జీవనబాహుశౌర్య సం
పన్న! మరుత్సుతా! యిటవిపద్దశ నొంది తరింపవేమి? హా!
పన్నగ నేకచక్రపురిబ్రాహ్మణ కోటివగన్ హరించిన
ట్లున్నతిదుస్ససేనునకునోజను మిత్తిగఁ గాకదక్కితే? 908

క. ఏనుంబ్రాణమువిడువం
బూనుదుఁ ద్రౌపదియునఁ చటఁ బొలిసెడు నయ్యో!
మానుగఁ గుంతీమాద్రుల
కానుపు కడగండ్లకడలి గారెండింటన్. 909

మ. రిపుఁగూటస్థహిమాంశుకుక్షిగతసారంగంబుపై నప్రియా
వహమైజాతివిరోధమెంచిమముతద్వంశప్రణాశార్థమై
గహనప్రాంతకురంగమిట్లునరుచేగాండీవమున్ నడ్డగా
నహాహా! నేయకవచ్చెనెందుఁజనెనో యాశ్చర్యలీలాగతిన్.910

క. నలువురుతమ్ములు నీగతి
సలిలములకునడవిసావు జచ్చిరిమరినే
నిలిచితిదైవము రాతం
దలముగఁదాఁ జేసినాఁడొ? తలపోయంగన్. 911

ఉ. హా! పరినిర్జితోగ్రమగధాధిప భూవిభుజా! దురాగ్రహా!
హా! పటుమృత్యుభేదన! జటాంతర కల్పితచాపనిగ్రహా!
హా! పరమోరుసుందరచితాంచిత పంచశరై కవిగ్రహా!
హా! పృథివీగృణోపమపృథా నిశసౌహృదభాగనుగ్రహా! 912

క. అనిజనపతియివ్విధమున
ఘనశోకముఁజెందియుదిమొకద హేతువునా
యనుజన్ములమరణంబున
కనితానాకొలనిజలము లానంగదిసెన్. 913

గీ. నలువుగానంతలోగగన స్థుఁడగు న
దృశ్యపురుషుండొకం డతిధీరవాక్య
మభ్రగంభీర రవముతో నవుడువలికె
జనవిభుండోగివిస్మయి జలధిదేల. 914

చ. నరవర! యస్మదీయ వచనంబు రకుం బ్రతిఁబల్కికాని యే
నురవరుఁడేవినీరుగొనఁజూడకు సుమ్ము మదీయవాక్యముల్
సరవి నుపేక్షఁజేసిపరుసన్ మఱి వృత్తిఁదోయమానఁగా
ధరఁబడిదీర్ఘనిద్రఁగొనితారిటు లుండిరిమామమిందఱన్. 915

వ. కావున నాయిచ్చుప్రశ్నలకు నుత్తరంబొసంగి వనదేవతానుమతంబులును చంద్రికరంబులుంబోలెఁదరంగామలంబులును మధురతరంబులంబోలె సమర్థంబులునగు నీయుదకంబులు పానంబు సేయుదుగాక యనుచు నయదృశ్య స్వరూపునకు యుధిష్ఠిరుం డిట్లనియె. 916

క. దేవతలకు మనుజులు సం
భావనతోఁబ్రశ్నఁదెలియఁ బలికెదువారా

కావునగను వినుతోఁచిన
తోఁప్రక నానేర్చువిధంబుతో వివరింతుఁగ. 917

వ. అప్పుడదృశ్య భూతంబిట్లనియె. 918

సీ. ఆదిత్యునకుఁ గద్దె యాధారమెయ్యది
కొలుచువారెవ్వరు కువలయేశ!
మనుజుఁడేమిట బుద్ధిమంతుఁడౌను సహా
యుండునేమిట మహాత్ముండు నగును
వెండియు జీవన్మృతుం డెట్టివాఁడగు
ననవిని యక్షున కనియె నృపతి
బ్రహ్మంబయునుగు సుపర్వులు గొలుతురు
సత్యమాధార మాదిత్యునకును
గీ. మహితబుధసేవచే బుద్ధిమంతుఁడగును
తపముచేత మహాత్ముఁడౌ ధైర్యమునను
దతసహాయుండు దేవమాన్యతిథిపూజ
వరలకుండని నరుఁడు జీవన్మృతుండు. 919

క. అనవిని యక్షుండిట్లను
మనునిద్రించుచును గన్ను మొగుడనియదియా
పునఁ దనరి మనసులేనిది
జనియించియుఁ జేతనముఁ జనదెయ్యదియో. 920

గీ. అనవుడాధర్మజుండిటులనియె మీను
నిద్రఁగొనికన్ను మూయదు నెరినిమీను
ప్రతిమకును రూపుగలిగియు మతియు లేదు
పుట్టిచేతన మెఱుఁగదు భువిని గ్రుడ్డు. 921

వ. అనినయక్షుండిట్టులనియె. 922

క. ధారుణికంటెనువ్రేఁగు స
మీరముకంటెను జవంబుమింటికి నధికం
బౌరయఁబొడవును మరియును
భూరికిమిక్కుటము తెలుచుభువి నెవ్వియగున్. 923

వ. అనిన ధర్మజుండు. 924

గీ. ధాత్రికంటెను భరమగుఁ దల్లియనఘ!
మారుతముకంటె జవమల మనసు సూవె?
తలఁపమింటికిమిక్కిలి తండ్రిపొడవు
చింతయగుఁబూరికంటెను జిక్కదనము 925

క. అనిచెప్పినమరియు యక్షుం
డొనరించినప్రశ్నలెల్ల నొగివివరింపన్
ఘనవాత్సల్యముచేనం
తను ధర్మతనూజుమ్రోలఁ దద్దయువేడ్కన్. 926

గీ. కటిఘటితవల్కలుఁడు స్మితకలితుండమల
యజ్ఞసూత్రుండు జటిలుఁడై యమ్మహాత్ముఁ
డతులకుశబర్హిభూషణం బమరస్ఫురన
కెదుటనిలిచి ప్రసన్నుఁడై యిట్లుపలికె. 927

మ. మనుజాధీశ్వర! నీమహాధృతియు సామర్థ్యంబు నామానసం
బునకున్ వచ్చెనభీష్టమిప్పుడు వరంబుంగోరుమా! యిత్తునా
వినిరాజేంద్రుఁడు భూమిదేవునరణిన్ వేడంజముండద్భుతం
బుగ నొక్కింతఁదలంచి యిట్లనియె నాభూపాలుఁడో యమ్మరన్

క. సోదరుల ప్రాణమడుగక
భూదేవునియగణివేడు బుద్ధికినఘా!
సాదరమయ్యెను నామది
నీదుతలంపొందువేడు నృపనీకిత్తున్. 929

మ. అనుడాధర్మజుఁడిట్లువల్కె వినవయ్యా! కుంతిపుత్రత్రయం
బున కేనొక్కఁడ జీవయుక్తుఁడగదా! పొల్పారఁగామాద్రినం
దనయుగ్మంబున నొక్కరుండు బ్రతుకన్ ధర్మంబు మైజేయునా
వినిరెట్టించిన విస్మయంబున ముదావిద్భూతచేతస్కుఁడై. 930

సీ. చారురాకాశశిశత నిజాకార తే
జోవిశేషంబునఁ జూడనెసఁగి
ముకుళితకరకంజములతోడఁ దనమోల
నున్నపుత్రునిసత్ప్రియోన్నతముగ
నాయముఁడిట్లనునయ్య సన్నెఱుఁగుము
శమనుండనూశత్రు జనములవలనఁ
బ్రాపించువివిధ విపద్దశఁగానలో
పలఁజెందు భవదీయభావమరయ

గీ. నిప్పుడేతెంచి బహుమాయలేనొనర్చి
కాంచితినినీదుశీలంబు కలితసత్య
సంపదయును త్తరము లిచ్చుసరసఫణితి
బరఁగసంతసమందితిఁ బాండుతనయ! 931

ఉ. కావుననాయనుగ్రహము గల్గియుటంగడు నిద్రఁజెందుచున్
వావిరిమేలుకాంచు గతివై శమతమ్ములు లేతురంచుభూ

దేవుని హాహాముసాధ్యముఁ దేకువనిచ్చి త్రయోదశాబ్దముం
బోవునుమిమ్మునేరెఱుఁగఁ బోలరటంచు వరంబొసంగియున్.

వ. అమ్మహాత్ముం డంతర్ధానంబునొందె ననంతరంబున
ధర్మతనయుండు ధర్మశాసనంబున సంప్రాప్తిఖులగు తమ్ములతోఁ గలసి యజ్ఞాతవాసంబు సులభంబుగా నీడేరుటకు వరంబుఁ బడసినవాఁడు గావున హర్షంబునం బొంచుచు నాశ్రమంబున కేతెంచి యరణివిప్రునకొసంగి తద్దుఃఖంబునుబోలె నిజవనవాసాయాసంబునిస్తరించి భూసురసహితంబుగాఁ బేరోలగంబుననుఖం బుండెనంత. 933

గీతకందగర్భచంపకము.

చ. సురుచిర! శోభనా! వితత! సుందర! శాశ్వత! విశ్వగేయ! దా
మ్కరభవహా! నిరంజన! లసద్హృదయస్థిత! శాంత. సౌమ్య! దు
ర్ధర! వర! సర్వగా! సగుణ! తత్పర! నిర్గుణ! సత్యపాల! భా
సురచరితా! మహాపురుష! సుపవిత్ర! చిన్మయ! భూతపోషణా!

ఇందలి కందము.

క. చిరశోభనా! వితత సుం
దర! శాశ్వత! విశ్వగేయ! దామ్కరభవహా!
వర! సర్వగా! సగుణ! త
త్పర! నిర్గుణ! సత్యపాల! భాసురచరితా! 935

ఇందలిగీతము.

గీ. వితతసుందర! శాశ్వత! విశ్వగేయ!
జనలసద్హృదయస్థిత! శాంత! సౌమ్య!
సగుణ! తత్పర! నిర్గుణ! సత్యపాల!
పురుష! సుపవిత్ర! చిన్మయ! భూతపోష! 936

భుజంగప్రయాతము.

అనాథప్రజాపన్నమహారణ్యదావా!
మనోవాగగమ్యా! సమస్తాదిదేవా!
ఘనోదార! యోగీశగర్భస్వరూపా!
అనేకస్వరూపక్రియాహావభావా! 937

గద్యము.

శ్రీమద్రాజగోపాల కరుణాకటాక్ష వీక్షణానులబ్ధ
కవితావిశేష మతుకుమల్లి వెంగళయామాత్య పుత్ర
వినయవిధేయ మాదయనామధేయ
ప్రణీతంబైన యభినవ
భారతంబునం దరణ్యపర్వంబుసర్వంబును
తృతీయాశ్వాసము.
సంపూర్ణము.
మంగళం మహత్.

# అభినవభారతము

## చతుర్థాశ్వాసము.

## విరాటపర్వము.

క. శ్రీపరమకారుణిక ! స
త్యాపాదనగరుడ వృషభ హంసతురంగా
వ్యాపాదహరణ జన ర
క్షాపరహరిహరహిరణ్యగర్భైకాత్మా

ఆ. వె. అవధరింపు మట్టులా పాండు భూజాని
తనయపంచకంబు తెగినగతిని
విపినవాస మొక్క విధమున కష్టంబు
వెడలబుచ్చి మరియు విహితముగను. 2

క. అడవిం గ్రుమ్మరవలసిన
కడుకష్టపుటేండ్లు వెళ్ళఁ గడపి మొగంబుల్
వెడవెడ వికసింపఁగ న
వ్వడమిపతుల్ గూఢ చర్యబుద్ధిఁ జెలంగన్. 3

క. ధరణీ సురవరులంగని
కరములు ముకుళించి యశ్రుకణములు రాలన్
ధరణీశ్వరుఁ డిట్లనియెను
గరము విషాదంబు మదినిఁ గడలుకొనంగన్.

సీ. కూరలు గాయలు కుడుచుచు మాతోడ
నడవినిమారలు నిడుము[illegible]

బడితిరజ్ఞాత సంవత్సరంబే తెంచె
నొదిగి యొక్కటనేము నుండువలయుఁ
బరులకుమాజాడ బయలైన క్రమ్మర
కడిదినివ్వనగతి నడవవలయు
తెల్లమేగద యిది తెలుపనేటికిమమ్ము
నాశీర్వదింపుఁడీ యబ్దమొండు

గీ. విఘ్నమున జెందకుండఁగ వెడలుటకును
ననుచువారల కతిహర్షమావహిల్ల
వినయమునఁజెప్పి వగచు భూవిభునిఁజూచి
ధౌమ్యుఁడల్లననియె సంస్తవముతోడ. 5

క. ఏటికివగవను గృపమియు
బోటులకిది వింతయగునె పురుహూతుఁడుదా
నోటువడి నిషధనగమున
మాటునఁదగి మగుడ నింద్రునిహిను గొనండే 6

గీ. కావుననుగ్రమ్మరను రాజ్యగరిమఁజెందు
నీధరిత్రీ సురోత్తమునెల్లనపుడు
తావకీయశుభంబుగాఁ దగినవిధుల
జపతపంబులనందంద జరుపఁగలరు. 7

వ. అనియె నంత భూసురులును నట్టకాకయని వీడ్కొని వలయునెడల కరిగి రిట్లు బాహ్యపరిజనంబు వీడ్కొని ధౌమ్య సహితంబుగా సరదంబులెక్కి కొంతదవ్వేతించి యచ్చట నిలిచి యింద్రసేనాది సారథుల రథంబులుగొని ద్వారకకేఁగ నియోగించి పాంచాలి పరిచారికలను వంటవారలను దుపదునీటికింబోవ

క. అనిపలికి యాయుధంబులు
  గని వగచుచు నొక్క కట్టఁగాఁగట్టి వెసన్
  గొని చేరువఁగల జమ్మికిఁ
  జని ధర్మజుఁడోజ సాంద్రశాఖల సంధిన్. 19

క. గట్టిగ గాలికి వానకు
  నిట్టటువడకుండఁ గట్టి యెసగఁగ శవముం
  బెట్టి పరుఁడెఱుఁగ రామికి
  గుట్టుగ నొనరించి వేఁడికొని మ్రొక్కి తగన్. 20

వ. ఆమ్రాకుడిగ్గి క్రమ్మరఁ గై దువుకట్ట నీక్షించి యిత రజగదగోచరంబుగానైన నన్యులు డాయ వెఱుతురు. జనులు స్మశానంబు భయదం బది యునుంగాక పీనుఁగునుం జూచినఁ జొత్తురె. దీని దుర్గంధంబున నేరికిం జేర నలవికాదని యా యన్న దమ్ములు సంతసిల్లి కృతస్నానులగుచు ధర్ముండలఁచి తత్ప్రసాదంబునఁ దమ కనుగుణంబులగు తొడవులతోడ వేషంబుల నలవడి రంత. 21

క. జ్వలదగ్ని కల్పులగు న
  బ్బలియులు శస్త్రములు జమ్మిపై నిడి గూఢో
  జ్జ్వలవేషంబుల విరటుని
  కలిత ధ్వజమైన పురికి గమనోన్ముఖులై. 22

వ. కదలిరంత. 23

ఉ. మున్ను కిరీటియిట్లు యతిముఖ్యుఁడునయ్యె సపత్నినొర్తు నా
  కున్నలువొప్పఁ దేల్చనిది గూఢదు వీరికి వన్నమాడ్కిఁ దా

విన్నదనంబుఁజెందు గతివేఁడుఱు చిత్తములోఁగలంగుచున్
గ్రన్ననఁజూచెధర్మజునిఁగామిని ద్రౌపదినందియంబునన్ 24

వ. అంత దైవయోగంబున వెలుపలికూటంబున విర
టుండు కొలువుండునెడ నాపాండవులు క్రమంబున, 25

మ. వరకాషాయములోలిఁగట్టి తగుపావాల్యఖ్యులంబెట్టి సుం
దరయాకుండికసామ్యలీలఁ గుడిచేతంబట్టి స్ఫారెం జప
స్ఫురితోష్ఠంబుచలింప నూతయగుచున్ ఘారిత్రిదండంబునుం
గరమొక్కంటనుగ్రాలధర్మజుఁడువేడ్కన్ దాసభన్ డాసినన్.

గీ. విరటుఁ డాతనిఁగని లేచి విస్మయమునఁ
దత్పదాంభోజ పాంసువుల్ తనదుఫాల
తలమునఁనొనర్చి యాసనం బలరనిచ్చి
కేలుమోడ్చితదాగతి హేలినడిగె. 27

వ. అప్పు డక్కపట యతి యిట్లనియె.

మ. ద్విజరాజాన్వయసంభవుండ నిఖిలోర్వీరాజకోటీర ర
త్నజరాజన్నవకాంతిధౌతపదపద్మభ్రాజితుండన్ సదా
సుజనప్రీతుఁడ నిర్గతాధిని కళాపూర్ణాత్మధర్మత త్త్వజ్ఞుఁడన్
నిజ మాధర్మతనూజుపాల నతఁడే నేనై వసింతుంజుమీ. 28

కం. నీతిం బ్రీతిం జూదము
గీతిని నీమదికివచ్చు రీతుల నేప్రా
ద్దేతెఱఁగున నైనను నన 29
నాతతగతిఁ జేయఁ గంకుఁడందురునన్నున్.

గీ. మదికివచ్చిన దినములఁ గుదురువాఁడ
వలసినట్లుండు నీయాజ్ఞ వలనఁదగుల
ననుచు విరటుఁడు నీయిష్టమైనయట్ల
నిలుము నీయున్కి శుభములు గలుగుననియె. 30

వ. ఇత్తెఱంగున నజాతశత్రుండు తావుకొనునంతరంబ
వృకోదరుండు. 31

క. వెడవెడ మాసినచీరం
గటుఁజుట్టిన దిండుకట్టు ఖడ్గముచంకన్
బెడిదపుఁగోలలు సురెమొల
మెడపై నొరపైనయొక్క మృగచర్మంబున్. 32

చ. అనువగుచట్టువంబొకటి హస్తమునం జెలువార వంటవాఁ
డననొరపైనవాలకము నచ్చుననొత్తినరీతి భీముఁడా
జనకుని నెచ్చెలిందగిన చద్దులులంగడఁ బూజచేసి తా
నొనర నభీష్టముల్ గుడువనోయనవచ్చెవిరాటుపాలికిన్. 33

గీ. అపుడు కులశైల సన్నిభుండైన యతని
రాక కతనిఁ జలించుటగాక పురము
వడఁకెఁ గీచకు భుజమును వడఁకె రాజు
నుత్తమాంగంబుఁ గంపంబు నొందెఁ బెలుచ. 34

క. అచ్చెరుపాటున విరటుఁడు
నచ్చటివారరయుచుండ నల్లంతకువే
వచ్చితగమొక్కి మారుతి
మచ్చిక వొరయంగ ననియె మత్స్యాధిపుతోన్. 35

ఉ. నాలవజాతివాఁడ యమనందను పాలను గూడుగూరలేఁ
బోలఁగ వండుదుం జవులుపుట్టగ నేవలలాహ్వయుండ న
న్నేలుము పాకయత్నముల కెందును నాసరిరారు ధారుణీ
పాలక! యింతవాఁడననఁ బట్టదు పిమ్మటఁ దెల్లమయ్యెడిన్ 36

క. ఉప్పును బులుసును బెట్టిన
చప్పని యదియైన మంచి చవిపుట్టదె యా
చొప్పటులుండఁగనాచేఁ
జిప్పిలు నోగి నారు రుచులఁ జేసిన కూరల్. 37

గీ. తూచి వరబట్టినట్టులఁ తొడరిరసము
లుంచనేర్తును కడిక్రొత్త లొదవరుచులు
నిలుపనేర్తును పొగుపుల మెలఁపనేర్తు
చద్ది నిలవండనేర్తెన్ని పద్దులైన. 38

సీ. చిరిమూడుగాఁ బాకమెరిగి శలాకను
కణగుపై మాంసంబు కాల్చునెలవు
నెసురికనీదిచేఁ గసుగందకుండను
బచనంబు సేసెడి పాకశుద్ధి
యుత్తప్త మాష్మంబు నొనఁగూర్చి రుచిబుట్ట
వండిస్వాదుగఁ జేయువంటనేర్పు
పలుదోయముల కూరపరిమళంబూరెల్ల
ఘుమ్మనఁ దాలింపు గ్రిమ్మదెరవు,

గీ. నంజనములనులోనగు నాల్గుతెరగు
లైన యాహారముల సేఁతయేననేర్తు

వసుధనొజ్జను వంటల వారికెల్ల
కట్టియలపని కోరుపాలుబెట్టనయ్య. 39

గీ. తారుగుడువఁ జనుచుఁ గూరగాయలరుచి
యడుగనేల ? తెలియబడునుగాదె
పిదప నీదుమదికి విదితమైయగునింత
నన్ను నేనపొగడ నవ్వుకాదె. 40

మ. పులి సింగంబు మదంపుటేనుఁగునుఁగార్పోతేద్దియైనన్ జవం
బలరన్ మార్కొనునేనివోరినినునారా!యంచు మెచ్చింతుమ
ల్లులతోఁబోరుదునీకుఁబ్రొద్దుజరుపన్ లోలుండనై యుండఁగాఁ
గలవాఁడన్ భుజశౌర్యసంపదల నొక్కండుద్దియేభీముడన్.

క. డాయుట బోదువుటబుడమిన్
ద్రేయుటసరిసేయుటయును వెరవెఱఁగికడున్
దీయుటలెఱుఁగుదు మరియున్
బాయక వెలయింతుహ స్తపదగతులెల్లన్. 42

వ. అనిన విరటుం డిట్లనియె. 43

గీ. వసుధ నీయంతమానిసి వంటవాఁడ
వైనలగ్గగునే ! నీకు వలయురథము
కై దువులునిత్తు నసుబోలె గౌరవమునఁ
గొలువు నావుడు మారుతి బలుమొగమున. 44

క. అక్కఅపట్టిన నిలుపుము
దక్కినపని కియ్యకొనను ధరణీశ్వర ! వే

రొక్కయెడ కేగుమనినం
దక్కకచనువాఁడ నీదు తలఁపెట్టిదియో? 45

క. నావిని మత్స్యమహీంద్రుఁడు
నీవిధమున కంటెఁగాక నెరకూరిమిచే
గావలసినట్లు నాయెడ
నీ వసియింపుము యథేచ్ఛ నెమ్మది ననఘా. 46

వ. అని పలికి.

గీ. బానసీలకునెల్లను ప్రభునిఁజేయ
స్వాదుకర్మరతుండగు వాయుసుతుఁడు
నతనిఁ గొల్చెను నరుఁడంత నన్న లరుగు
తెరువుదప్పించి వేరొక్క తెరువుతోడ.

గీ. ఆకుగట్టు మెడన హైమపట్టిక మేనఁ
గంచుకంబు నిడుదకరయుగమున
సంకుగాజులొప్పెసంగెడు తలచీర
యింపు నింపు చెందిరంపుఁజుక్క. 48

చ. వెలయగ స్త్రీత్వయోగమునవేమఱు పేరవరేణ్య గర్వ్యమై
యలవడుపుం స్త్వయోగమువంతిపురంబునమన్కివిఘ్నముం
గలుగునవశ్యభావ్యమగుఁగాదె వహింప నపుంసకస్థితిఁ
మెలఁగనటంచుఁబార్థుఁడదిమేకొనివచ్చెవిరాటుపాలికిఁ. 49

క. నరపతిదానింగని యది
పురుషాకృతిగాదు తరుణి బోలదు రెంటఁ

గరమొప్ప మాయగైకొనె
హరియో యను సందియంబు నందెదులోనన్. 49

ఉ. దారకచేరి క్రీడి యనవద్యమతిందనుఁజూచు మత్స్య భూ
భారకునిట్లు పల్కెఁ నృప ! పాటకు నాటకు చిన్నపాపలన్
నేరుపనేర్తు నచ్చుపడనిల్పుము గావలతేని కానిచో
వీరవరేణ్య ! వేరొకనివీటికిఁ బో సెలవిమ్ము నావుడున్.

ఆ. వె. ఆటపాటలేల ? నాయుధంబులఁబూని
కొలిచి నీవు నాదు కలిమికెల్ల
ప్రాపుగావసింపు మేపట్లనావిని
నగుచు ననియె మత్స్యనాథుతోడ. 51

ఉ. ఆక్కట యాడుజన్మమననైనదిగాదిది పుంస్త్వమంచునున్
నిక్కము చెప్పరాదు విధినిర్మితమిట్టిదయైన నేను నేఁ
డెక్కడ నాయుధంబులు వహింతును లోకమువారునవ్వ నీ
మక్కువఁబేర్మితోఁబలుకుమాత్రమచాలునురాజశేఖరా!52

క. నే నరజన్మంబెత్తియుఁ
బూనంగావలసె నిట్టిపుట్టువు దైవా
ధీనముకడఁ ద్రోవగ నో
భూనాయక ! మానవులకుఁ బోలునె ? చెపుమా ! 53

గీ. భరతముననుబృహన్నలపాటిలేరు
హస్తవైఖరి నృత్తగీతాది విధుల
మించునంచును నన్ను నేమెచ్చఁజేతుఁ
కార్యముండిన నిలుపు మవార్యచరిత !

వ. కౌంతేయులపాల నింతియపనులం బ్రవర్తింతుననిన నట్లుగాక యని తన కూఁతు నుత్తరయనుకన్నియను రావించి యతని కప్పగించె నంత. 55

గీ. వసతిఁ గైకొని కన్యానివాసభూమి
నతఁడు తతతాళ పాణియై యాటగఱప
మలయపవనసీమముఖరిత మధుకరాళి
కలితపవమానుఁడో యను కరణినుండె. 56

చ. ఇతఁడుమదీయకేతువువహించెడి చిహ్నము పేరుబూనినాఁ
డతనిహితుండు పంచశరుఁ డంచితమైదనరారు వేడ్కచేఁ
దతగతి మాత్స్యపాలికిని దాఁజనుదెంచిన పోల్కవచ్చెన
ర్వాతముఁడునై నయానకులుఁడయ్యెడఁజూపరులెల్లమెచ్చఁగన్

వ. యాదృచ్ఛికంబున సమ్మహీపతి తురంగంబులఁ జూచునెడ దానును గొల్వునొచ్చి తల్లక్షణంబు వీక్షించుచు న్నంత. 58

గీ. వెఱఁగుపాటున మత్స్యభూవిభుఁడు నకులుఁ
గాంచి తద్రూపమున కధికప్రియంబు
నెసఁగఁజేరఁగఁ బిలిచి నీ వెవ్వరనిన
పరిభునిఁగనిమ్రొక్కి యిట్లని పల్కెనతఁడు. 59

క. అనఘా ! హయశిక్షకుఁడను
డను దామగ్రంథియండ్రు దానకులుఁడ నా
ఘనుఁడు యుధిష్ఠిరుఁడును మును
దనవారువములకు నిలుపఁ దగనందుంటిన్. 60

క. ధ్రువలును నొప్పని సుభ్రుకు
దినమున నిశియందుఁ బుట్టుతెఱఁగును ఫలముల్
వివరింపనేర్తు గుజ్జపు
వివిధంబుల నెలవులెఱిఁగి వెలసినవాఁడన్. 61

సీ. మకురుగుజ్జంబులు కికురింపకుండను
బదిలంబుగా నొక్కపాటవంబు
మంచిగోడిగలకు మావులు నొన గూర్చి
చెడనీక నిలుపఁగఁ జేయు తెఱఁగు!
నదనైన కోదమల నలవర్చునేర్పుఁ
బసిబిడ్డకైనను వశముసేత
యానినతఱినాయు మెఱిఁగి శరీరంబు
పటువియ్యలేఁటుకు ప్రౌఢిమంబు

గీ. కసరివై చెడువానినిఁ గాకలుడప
కళ్ళెమిడకున్న మెలకువ గలిగినడుప
నడుగులోపల మరలెడి యట్టితీరు
దిద్దనేర్తును వెలకెక్క ముద్దులైన. 62

క. నడవేయను బరువెత్తను
వడినుళ్ళంబెట్టి నడకవలసి నపిరియాతో
నడుగిడ ధారాప్లుతగతు
లడరం గుజ్జముల జేయనగునాచేతన్. 63

వ. అన్నిన విరటుండిట్లనియె. 64

గీ. ఇంతసాదివి నీవు నాయింటనుండఁ
జాలు వారువములు పనియేలనీకు
గనుపు గడిమాడసేయను గూడు గూర
గట్టుపిడికిఁట నిమిడెడు బట్టలోలి. 65

క. నావిని నకులుండిట్లను
భూవల్లభ ! భరిత గుణువఁబోలిన పనిచే
సేవించెద సాకిన నొక
తోఁవం జనుమన్న నొంటు దొరపొడ గందున్. 66

గీ. అనిన మత్స్యేంద్రుఁడవుడు కళాంకుడై న
యా శశాంకాన్వయుని నొయ్యనట్లు దగను
మందురాపతిగాఁజేసినం దురాప
మహిమఁ జెలువారనుండె సమ్మతి నతండు. 67

సీ. నునుసేల గట్టియు ననువుగాఁజేపట్టి
యుండాళ్ళ మొలకట్టు నొరవగట్టి
పలువులుగొన్ని దాపలి సందిటనుబెట్టి
వెన్కదామెనచుట్ట వ్రేలవైచి
కంబళి తలచీరగాఁజేసి యామీఁద
ద్రిండుగా వల్లియ తిరుగఁజుట్టి
వెడవెడ నిలదప్పటడుగులు బెట్టుచు
బెగడుపాటున చూడ్కి బీతుదెలుప

గీ. రచ్చగలమానిసులు దనరాకఁజూచి
నగవు నచ్చెరువును మీఁదమొగముఎత్త

వచ్చి సహదేవుఁడవనీశు వలనుజేరి
యీతెఁడి విధంబుగాఁగ సేవించి పలికె. 68

క. కీలారివాఁడఁ దంత్రీ
పాలుండని యంఁడుదినన్నుఁ బశువులగావన్
జాలుదు ధర్మతనూజుఁడు
పాలించెందమ్మనట్లు పశుతతిగావన్. 69

గీ. నిలుపుమీ సామినన్ను నే నేర్చినట్లు
గాతు నేవేళ నావటి గాలివీవ
కుండ మెకములు గికములు నొదవకుండఁ
బదిలముగ నుందురేయును బగలు వరుస. 70

సీ. సంజరేపున రెండుజాముల ప్రొద్దేని
పోవుముందరనిల్చి మోవగలను
దూరదేశంబైన పూరినీరుండిన
పాయకనేమందనేయగలను
కన్నిచ్చవచ్చిన కసవుజొంపంబుల
మంపైనబీళ్ల మళ్లింపఁగలను
వేసవి వచ్చిన వెరవుదోనలమూకు
గలిగిన పొలముల గలుపఁగలను

గీ. ప్రోది చెడకుండ నారసి ప్రోవఁగలను
నెట్టిబాపైన నొకభంగి బట్టఁగలను
గొల్ల వెంబడిలేకున్న నెల్ల వెంటఁ
బోయిదొడ్డికిమగుడిరాజేయగలను. 71

చ. పాడుపుగనెయ్యెడం దొరగుపోవకయుండ మెకంబుపడ్డచో
బెదరకయుండఁ జన్నవసిపిండఁగ సింటనుబాడియెప్పుడున్
గొదవయుఁగాక దేవరకుఁ గూరిమిచిత్తము వచ్చునట్టుగా
గదుపులఁబెంపుసేయఁగలఁగాపరులెల్లరునన్నుమెచ్చఁగన్. 72

క. వినుమురిదాయియుఁ బెట్టక
యును బిదికిన తన్నకుండ నొల్లనియెడలం
గొనఁజేతుఁ దరిపికుఱ్ఱనె
గొనబగులేగలను నలమికొనుచెంతయుగున్. 73

సీ. గొడ్డుటావులనైన కోడెపంచితమిడి
కట్టఁగాఁజేయుదుఁ గడురయమున
పాల్గి యేకోటను బోయెడు చూలైన
నీచకపోకుండ నాఁచనేర్తు
మార్జేపుదేనియు మకురువంజయునేని
యెగజేపుదేనియు నీయఁజేతు
గన్నిరికియుగోవ కల్లనిపోటరి
యగునేని సాదుగా నలవరింతు

గీ. నుంగిడియు కింకలోనుగా నొనరఁదెవులు
దవులువానికి నాపేరు దలఁచినంతఁ
గుదురు తప్పదు పసికినే గూర్చువాఁడ
మందు మంత్రము లాకు నాయందుగలదు. 74

గీ. వినుము నే బొంకుచెప్పను జనవరేణ్య!
వెజ్జుతనమున రోగముల్ వివిధగతుల

పసరములనెలవెఱింగి యేర్పఱచు నన్ను
తెరగుగను వేల్పులును సహదేవుఁడండ్రు. 75

వ. అనిన నరేంద్రుండు సంతుష్టాంతరంగుండై 76

క. మున్నుం దోఁటులగాచుచుఁ
జెన్నలరెడు గొల్లలకును శ్రేష్ఠుఁడ వగుచున్
మన్ననతో నాకడ నిలు
మన్నన్ వల్లెయని యాతఁడతనిం గొలిచెన్. 77

గీ. వెలయఁగ మదీయ శాత్రవవిరతిహేతు
విదియ యగునని దినములు నెఱుఁగుటకును
పాండునందనుఁ డామత్స్య పశుగణంబు
పాలనముసేయునో యను పగిదినుండె. 78

వ. ఇట్లయ్యేవురు వీరటుండు తనవారిగాఁ గలిపికొని
యున్నంత. 79

చ. పదములు మెట్టతామరలపైఁ దళుకొత్తెడు కాంతులీనఁ బ
య్యెదగడుసూతసూనులకు నెత్తినయాబలధూమకేతువై
పొదలఁగఁగొనుదూఁగఁ బలుపోకలచూపులుపిచ్చలింప ద్రౌ
పదిసనుదెంచెవీటఁగలభామలుగుంపులుగూడిచూడఁగన్.

గీ. పురమునందు నివాసంబు బూనుటకును
వాంఛనేతెంచు విపినదేవతయనంగఁ
గేళిపుష్పంబుకై వడి కేలదంత
పత్రిమొప్పఁగఁ దగరాజపథమువట్టె. 81

క. కూడుంగోకయు నిచ్చెడి
చేడియకడనుండుఁ బనులుజేయుదునను పూఁ

బోఁడి పలుకెఱఁగి విరటు ని
చేడియయాసతినిఁ బిలువఁ జెలినంపెఁ దగన్. 82

వ. అది సనుదెంచి రాజదేవులపాలికి రమ్మనుచు
తోడన సుధేష్ణయున్నెడ కేగెనంత. 83

క. సైరంధ్రియైన నీచవుఁ
గారణమున యాజ్ఞసేని కడుఁ దలవంపం
గారాజకాంత యాశ్చర్యం
గారవతింజూచి పరగె ఘనతరలజ్జన్. 84

క. నరపతి దేవికి నిట్లను
తరుణిని సైరంధ్రి జాతిదానను గృష్ణం
గరమొప్ప మున్నకొలిచియుఁ
బరగితి మాలిని యనంగఁ బడునా పేరున్. 85

చ. సరములుగ్రువ్వగందములుచక్కనలంనను బువ్వదండలున్
బరిబరిసంగతంబులుగ బంతులుగట్టను గొప్పదిద్దఁగా
మురువుగ మోములందిలకముల్ ఘటియింపనొయారమైననుం
దరగతిగా నలంక్రియలు దద్దయుఁజేయఁగనేర్తుఁగోమలీ. 86

గీ. అనవుడెక్కడిమాటలే యబలనీవి
పొసఁగియుండునె ? సైరంధ్రిబోటివనిన
నవజగన్మోహినివి నిన్ను నలువుమీర
చూచు మగవాఁడు పైకొనఁ జూడకున్నె ? 87

వ అని యాజ్ఞసేని సుధేష్ణ కిట్లనియె. 88

ఉ. అచ్చుపడంగ నీవెవతెవంచుఁదలంచితొ?యట్టివేల కా
నచ్చును మత్పతుల్ ఖచరవల్లభులేవురు దేవసంభవుల్

చచ్చెరనాశఁ గీచకారుఁడు జేసిన వానినిఁ జంపకుండు రే
యిచ్చుననందియంబిడకుమీాపనిమాత్రముచారులోచనా 89

గీ. నిప్పకను బుట్టితిని గట్టి నెలఁతనమ్మ
తప్పవని పుట్టదొక వింత దలఁపకమ్మ
యిన్ని దినములు ద్రుపదజ యింటనుంటి
వేరుసేయక బ్రోచె నేవేళ నన్ను. 90

గీ. అనుచు నొడఁబాటుచేసిన నలరినాడు
పాలనోపిన పనిజేసి భామనీవు
కుడువఁగట్టను దొడువను గోర్కులెట్లొ
యట్లు వసియింపు మనవుడు ననుమతించె. 91

చ. వసధరణిం వసంతనిరవద్య శుభోదయ శోభవోలె భూ
పునితరుణిందగం ద్రుపదపుత్త్రికమెచ్చఁగ నిచ్చక్రొత్తఁగా
ననుపమితాళిలాలసములై యలరం గడుజూడనొప్ప చం
దనతిలకాద్యలంక్రియలుదాఁగయిసేయుచునుండెవేడుకన్.

గీ. పరగ గంధర్వులాయింతి పతులనంగ
పిడుగుఁబోలిన యామాట పొడవు కతన
పురుషుఁడెవ్వఁడు సైరంధ్రి పొంతఁబోక
తేరిచూడక తముదామె యూరుచుండి. 93

వ. ఇవ్విధంబున నసగుపడి తమతమ కృత్యంబులచే సంతుష్టుండై సంపాదిత శిరఃకంపంబగు ముదుసలి తనంబూను నట్లుమాటిమాటికి దలయూచు విరటువలన సమ్మానులగుచు బృథ్వీస్థానులాత్మీయవివసన క్లేశంబు నితరులెఱుంగకుండ నుండి

నిజోద్యోగంబుల వచ్చు మెచ్చులు మచ్చికలర నొండొరుల
కిచ్చుచు నూరడిల్లి కొంతకాలంబు గడపిరంత. 94

సీ. ఒకనాఁడు క్రీచకుఁ డప్పుయింటికిఁ
జనుదెంచి యందుఁ బాంచాలిఁజూచి
మదన బాధితుఁడయ్యె నిది యెవ్వరనినను
సైరంధ్రిగతి సుధేష్ణయును జెప్ప
విని మాలినిఁ గన్ను నెనఁయగూర్పుము గాక
తప్పినఁ బ్రాణముల్ తలఁగిపోవు
ననియెడు తమ్మునకాయమ బహు భంగు
లను బుద్ధిగఱపిన వినకయున్న

గీ. నింతయేటికి విధిమూడె నీతనికిని
దరుణిఁజెందక యుండిన మరునిచేత
మరుఁడుదప్పిన గంధర్వవరులచేత
నిజము చచ్చునటంచును నిశ్చయించి. 95

ఉ. తమ్మునకిట్లు పల్కు విను తామరసాననచ్ఛిదం ద్వదింపె
యమ్మగు వానసీమకొక యాసవదంభము పెట్టియందు నీ
సమ్మతిఁజెందుమీాయనుడు జానుగవాఁడిదివోలునంచుఁదా
గ్రమ్మరవచ్చుచూలినికిగాఁ గడుఁబ్రాణమునిల్పెనానలన్.

గీ. అంతమరునాఁడు విరటుని కాంత కపట
కౌతుకముతోడ సైరంధ్రిఁ గాంచి పలికె
చెలువ ! యేకతమేఁగి యాసింహబలుని
నడిగి చక్కని సురతెమ్మ తడయకచట. 97

వ. అని పలికిన నది యించుక సందియంబు ట్టుకొని యనర్థంబులగు పనులం బోవనని విన్నవించితిఁగాదె, అది యునుంగాక వాఁడు దురాత్ముం డటఁ బో వెఱతునని యొడ్డు కొనిన బహుప్రకారంబుల నిర్బంధంబున నెన్ని సెప్పిననుడు గక యున్న దేవికి మాఱాడనోడి యెట్టకేల కనుమతించి లలి త చషకంబుఁ గై కొని నగరు వెడలి యరసి రక్షింపు మనుచు నాదిత్యునకు మ్రొక్కిన నొక్క రక్కసుం డమ్మహాత్ము నను వున నదృశ్యంబుగా వచ్చె నిట్లు కష్టప్రకారంబుగాఁ బఱ తెంచి బెబ్బులిగవింజొచ్చు హరిణి కరణి సూతమందిరంబు సొచ్చె నప్పుడు. 98

సీ. కౌరవాధమ పరిగతఖేదమునుబోలెఁ
గడుమాయువుట్టంబు గలుగుదాని
నలనఖచంద్రసేవాసక్తములుబోలె
నమితదృక్శ్మ లోత్పలములదాని
కమలశంకనుదావు గనుహంసమునుబోలె
రజత పాత్రాంత్కరంబుదాని
భావినీచాలాపభంగి భారముపోలె
నలికించిన్నట్టి కంఠమ్ముదాని

గీ. నానవార్ధంబు ప్రేక్షితయుగుచుఁ దనదు
వాసవాయతనాయుతా వాసమునకు
వచ్చి నిలిచినదాని దుర్వారశౌక
నీచమతితోడ నొనరంపఁ గీచకుండు. 99

గీ. కాంచి పంచబాణ వంచిత నిజవివే
కప్రపంచుఁడగుచు గలితమంచ
తలముఁజెందివాఁడు తలవంచి పాంచాలి
యలికి సంచలింపఁ బలికెనిట్లు. 100

గీ. తావకాంఘ్రి సరోజమార్దవము నెఱుఁగ
నిపుడు హరిణాక్షి యిదిగదా యెసఁగశుభము
ధన్యధన్యుఁడనైతి నేఁద్వత్కటాక్ష
గోచరుఁడ నౌటకతన నోకోమలాంగి. 101

క. నతగాత్రి! నీదురాకడ
నతిపుణ్య ఫలాంకురశ్రీయంబగు హర్షో
న్నతగిరి చెంతంజెందిన
గతినలవై జననదినము నా కమరెన్. 102

గీ. మాలినీ! నీదునామమైక మహిమ నిడుద
పెన్నెఱులనెంత జాగ్రత్త నున్నదిపుడు
వ్యత్యయంబుగ నొడువ రమ్యముగ నలరు
నలువుగనుచును దద్భూషణంబయగుచు. 103

క. కరములకును గారణములు
మరుదత్త్వములందు రెండు మానితమగుచున్
బరగియు లావణ్యమునకు
నరయఁగ నందొకటిజెందె నంబుజనేత్రా. 104

క. లోకము విరళంబయ్యెఁ బ్రి
యోకములన రమ్యమొందుఁ దెలియఁగ జగతిన్

నీకున్ మధ్యములేకయు
నీకరణిమనోజ్ఞమూర్తి నెందుంజూడన్. 105

చ. చివురులు విద్రుమంబులనఁ జెల్లదుపల్లవపాణిచూడ నీ
నవకపుగావిమోవి యిదినైజము బింబము సుమ్మదెట్లనన్
బ్రవిమలచంద్రుఁడాననముభంగిఁబొసంగుటచేతనెంతయున్
భువిసహజంబకాదె?కడుఁబొల్పగుబింబమువానికుండఁగన్.

చ. కొలకులఁ దమ్మిబంతులను గోమలి ! నీవదనంబుదొల్లియా
నలువసృజంపఁగామరపునంబడి క్రమ్మరనాత్మయందుఁదాఁ
దలఁచి తదగ్రసీమలనుదార్చఁగఁ బోలునుహంసపాదముల్
దెలియఁగఁదావకాంకములతిప్రకటస్థితినుండునట్లుగన్. 107

గీ. నూతిగట్టుననుండిన యాతనికిఁ బ్రి
మాదమటలేకయుండునే మగువయట్లు
గాన నీనాభికూపంబు గట్టుమీఁది
కానునదియేమొకాని దాఁగానరాదు. 108

చ. చెలువకువక్త్రచంద్రపరిషేవణలాభ ముదంబునన్ నిశా
లలననిజత్రియామగతులంబెనఁగొంచును గౌఁగలించునా
చెలువునముప్పిరించె నగఁజేసినపెంజడహీనమధ్యముం
దెలుపఁగఁబూనితోయనుచుఁదెల్లముగామదినిశ్చయించెదన్

గీ. అబల ! బహుధూళిధూసరితాంగివయ్యు
నీ వపహరించితివి నాదునెమ్మనంబు
మహితహారకోపదందహ్యమానమదన
రమ్యతమ్యధామ మలినయారత్నిఁబోలి. 110

గీ. జనరహితమైన యచట నిశ్శంకతోడ
నెనఁగబింబోష్ఠి వెన్న నిన్నేనుగావ
నించువిలుబారిఁ బడిన నన్నీవుగావఁ
గంజముఖియిదిగా మంచి కాలమరయ. 111

వ. అని యివ్విధంబునఁ బలుకు నతని తాదృగ్వచన
మాకర్ణించి మానసచంపకమంజరీ చంచరీక సమానపంచ
శరప్రపంచయగు పాంచాలి స్మరరాగతిమిరపరిహరణపాటవ
చంద్రికం బోని వచనవైఖరి నిట్లనియె. 112

చ. అలరుచుసత్కళత్రములయందుఁబ్రవర్తిలుచున్నయట్టి నీ
వలఁతినిఁగీచకా!యకట యర్హముమాలినమాలినిన్మదిన్
దలఁచితివెట్లు చారుసముదారసురద్రుమ సూనవిభ్రమా
కలనమునొందుషట్పదముగాంచునె?కాంచనగుచ్ఛమెయ్యెడన్

క. హేయపుటొడలును మైలను,
బాయనిపుట్టంబు సుడుముబరగెడు కురులున్
రోయక రుచిబడఁదగునే?
యోయన్న తలంకుమిట్టి యుడిగపుసతిపై. 114

వ. అదియునుంగాక. 115

క. మగనాలియందు మనుజులు
తగునేనిచపలతను జేయదలఁతురదియుఁ దాఁ
దెగఁజేయు వారినెంతయు
నొగితద్వాంఛాప్తినొందకుండ మునుపుఁగాన్. 116

గీ. కంతుఁడెవ్వరి బాధింపగాఁదలంచు
నెపుడుఁ దచ్ఛస్త్రిసంఖ్యాఖ్య నెసఁగునాడు
పతులు గంధర్వ పతులు నేర్పడఁగ వారి
నారసంబీరనంబుగా నడపఁగలరు. 117

క. కరములు గాళ్ళుందలయును
పరులకు నవయవములెఱుఁగఁ బడకుండంగా
పొరజేతురు నినునీలో
పరగణ నావిషయమవధిఁబడ నేమిటికిన్. 118

క. కావున నాకై యిపుడీ
తోత్రివం జరియింపమదినిఁ దోఁచున యేనిన్
వేవేగ యమపురమునకుఁ
బోవం జేయుదురు రిత్తఁబుత్తురె? నిన్నున్. 119

గీ. ఇవ్విధంబుననాడు నయ్యింతిమనము
నవుడు తనచిత్తమట్లు శూన్యత్వమగుట
దెలిసికీచకుఁడొయ్యనఁ దెఱవఁజూచి
పల్లటిల్లెడుమోమునఁ బలికెనిట్లు. 120

ఉ. చంచలనేత్రి! యేటికిట సారెకునన్నొకలాతివానిఁగా
నించుకవేరుసేయఁదగవే? పతిపంచకమంచునేల? త
ప్పించెదు పంచబాణముల పీడనునొచ్చి భవత్పదంబు ది
క్కంచుఁదలంచినన్ వెతలనక్కట రెట్టినొసంగఁ బాడియే. 121

గీ. దీనిఁగడచుఁనాడు దీర్ఘాయువగును గం
ధర్వులనఁగ నెంతఁదలఁప నాకు

తొలిశరీరరక్షితో ధర్మయనుమాట
వినమె ? చిగురుఁబోఁడి వేయునేల ? 122

మ. ఘనబాహాబలరూఢిమూర్తిఁ గనఁగ నాగంధర్వులేకారు దే
వనికాయంబులకైనఁగాని గెలువన్ వామాక్షి శక్యంబె? నీ
వనుమానింపకు మొక్కపంచశర శాతాస్త్రంబులంబోనిత్వ
త్కనదక్షిప్రవిలోకనంబులకునిక్కంబోడితిన్ నేఁడిటన్. 123

గీ. మదనుచేఁబడి యిప్పుడు మడియుకంటె
నెల్లి గంధర్వపతులచేఁ జెల్లుటొప్పు
నయిననప్పటికొక వెరవగును నవల
నుండి దునుముచు రండనుటొనరుఁగాదె. 124

క. ముల్లోకంబులనైనన్
బల్లిదుఁడగుచున్న సింహబలుఁ గెలువఁగలేఁ
డుల్లమున శంకఁదక్కుము
తెల్లంబాత్మీయబలము దివిజులకైనన్. 125

మ. అనిమందాటలమాటలాడుచునునెయ్యంబొప్పనయ్యింతిగ్రే
కొనఁజూడం గడునోసరిల్లి చిగురాకుంబోడికేల్దప్పఁ ద్రో
చినవాఁడుద్ధతిఁబల్మిఁబట్ట మదిలోఁజింతించు నయ్యంకువం
గని సైరంధ్రి తదాలయంబువెడలెంగంపంబుసంధిల్లఁగన్.

గీ. సైంహికేయముక్త చంద్రబింబమువోలె
నతిరయమునఁ బాంచసుతకళత్ర
మద్దురాత్ముపట్టి తద్దయుఁదప్పఁగాఁ
బఱచుచున్న సింహబలుఁడుకలఁగి. 127

క. ఏరీతి దుౘ్రపద పుత్త్రిక
భారంబునఁబఱచుఁ ద్రోటుపాటునఁబడుఁ దా
నారీతి వానికన్నులఁ
దోరంబుగ నలుగఁగావి దోఁచెంజెలువర్. 128

క. కుటిలభ్రూకుటిదగ న
క్కుటిలుం డుద్ధతిని వెన్నుఁగూడఁగ రానం
తట విరటుకొల్వు డెస కా
కుటిలాలక పఱచెదఱుచుఁ గుయ్యిడుచువడిన్. 129

గీ. అప్పుడంతక నిభుఁడైన యతఁడు కృష్ణ
కొప్పువట్టియీడిచిలాగఁగూలెనంత
తరణి చోదితదైత్యుఁడుద్ధతిని వానిఁ
దన్నె మీటినగతిఁ(దెక్కి) ధరణిఁబడఁగ. 130

వ. అప్పుడు భీమసేనుండు కీచకు దెసకుఁ దమకించు
నుంకువ గని ధర్మజుండు గూఢోక్తిచే నివారించె నంత 131

చ. చటులమదుద్ధతింబడు కుజంబుగతిం గుజమందురాక్షసో
త్కటపదఘట్టనం బుడమికంపమునొందఁగఁగూలి లేచిచెం
గటనొరుఁగానబోక మెయిగ్రమ్మినధూళి నిడుల్చికొంచుసం
కటపడుకోపముంబొదవు కారియసిగ్గున నింటికేఁజనెన్. 132

చ. తనుకనుగొంచు కట్టెదుటఁదద్దయుఁగీచకుఁ డిట్టులప్పురాం
గనకొనరించుఁగీడుగని గాసిలిమాత్స్యుఁడు వానినొను గా
దనివివరించిచూచి తఱినప్పుడుతప్పనుమోఘుఁ జేసి దం
డన మొనరింపఁజయ్యెఁ బ్రకటంబగు నాత్మబలంబులేమిచేన్

గీ. అంతఁదాఁడన భయమునన నపగిది
విగతసంజ్ఞనుజెంది యావిమలగాత్రి
వాఁడుదూరముఁబోవఁగా సుధయూఁది
తిన్నగాలేచి యొక్కింత కన్నువిచ్చె. 134

సీ. నెరిగుంపుసడలిమైనిండిన కతమునఁ
జక్రవాతాహత చమరి కరణి
ధరణిపైఁదువ్వలఁ దనరుచులరుటచే
వేగయౌషధితీవె వెలయుకరణి
తడఁబాటు వడదప్పటఁదగు లూఁదుటనుగే
సరి వాయితప్పినహరిణికరణి
బడిపడికన్నీరు వెడలుటచే సూత
కులమునకగుబాము దెలుపుకరణి

గీ. నసురుసురటంచునా దుర్విదాత్మజాత
విధినిఁదూఱుచుఁ దనుదాన వెగడుఁబడుచు
ధృతిని నిండేవ్రురునుగల్గి దిక్కుమాలి
వచ్చిచొచ్చె విరాటునిరచ్చపట్టు. 135

చ. వెడవెడవేఁడియూర్పు వడవ్రేఁగునఁజెక్కులుగంది మోవికిం
బొడమునకాకబీట విడఁబుట్టుచు బల్వలవంత పెంపు నం
బడిబడికాలికన్గవనుగ్రమ్మనీ రెద జాలువార వ
ప్పుడునృపుఁజూచి డగ్గుతికబూనినయెల్గునఁగృష్ణయిట్లనున్.

చ. నరవర! నీదుసమ్ముఖమునన్ ఖలుఁడీగతిఁ ద్రొవ్వనేఁత నుం
గరముదనర్పఁజూచియును గాదనిపల్కఁడు మాటమాత్రమే

బరువగునయ్య ఏలికకుఁ బాడియెమిన్నక యున్కి యక్కటా
నిరుపమపుణ్యమూర్తి! యవినీతులదండము బూనుటొప్పదే

చ. ఎఱుకవహించివర్ణముల నెక్కువతక్కువ లేర్పరించి యే
తఱిగనుధర్మవర్తనముఁ దప్పకదుష్టుల నిగ్రహించియున్
వఱలెడునీతిపారగుఁడు వాఁడుధరిత్రికి రాజుగాని నీ
తెఱగున నెవ్వరిట్లయిన దిక్కరిపోయినరాజధర్మమే ? 138

క. కొంకక నిండినసభలోఁ
బంకజముఖియివ్విధమునఁ బరుసములాడన్
సంకోచంబనియెడు నొక
యంకిలివాయెత్తనీయదయ్యెన్ విరటున్. 139

ఉ. ఏనుఁగనంకెకీచకునినేమియుఁ జేయఁగరాదు చేసినం
గానియెఱుంగవచ్చునది గాదనియుండిననాఁడు గుయ్యపై
కాననిరీతిపోఁదగవుగా దెదురంజెవి నానిజూచితిన్
నేననిమాత్స్యుఁడేమియననేరకయంతిపురంబుఁ జేరినన్. 140

క. కడుఁగష్టుఁడక్కటాయని
బుడిబుడియాలోచనములు బుట్టియుదమలోఁ
బెడమొగములతో నయ్యెడ
వెడమాటయునైనఁ బల్క వెఱచిరి సభికుల్. 141

గీ. ఈరసంబెక్కుడై ఘర్మమేపుదనర
తుడిచికొని నిర్వికారుఁడై ద్రుపదసుతను
గాంచిధర్మజుఁడెప్పటి గరణినెలుఁగు
నల్లనల్లసగుత్తుక నమరఁబలికె. 142

ఉ. చాలునురాజుమెచ్చెనిను సాధ్వులవర్తన మెల్లనీయెడం
బోలెనురచ్చకెక్కుటయుఁ బ్రోడతనంబునమాటలాడుటల్.
జాలదె? నీపతుల్ రిపునిఁజంప నశక్తులె వారికి త్తెఱం
గాలముగానిచో ప్పమదిగానఁగనయ్యెడునంబుజాననా. 143

క. అని కినిసి పలికినను విని
యునునొండెద్దియునుబల్క నూహించిన యా
వనజాక్షిఁజూచి కంకుం
డనుఁ గ్రమ్మరఁదనదు వాఙ్మయప్రౌఢిగన్. 144

గీ. ముదిత! మముఁబోటులెల్ల నీ మొఱయెఱింగి
యూనుగాదని యదిదీర్పఁ నేర్పఁగలమె ?
తెలియకేటికిఁ జేతులు దిప్పెదిచట
పొమ్ముమందరి పనిఁజూచుకొమ్ము నగర. 145

క. నావుడుమరుమాటాడక
యావెతఁదుకయచటువాసి యంతఃపురికిన్
బోవన్ మునునెఱిఁగియు విభు
దేవియుదానెఱుఁగనట్టి తెఱఁగుననడుగన్ 146

చ. పలుమరుగ్రుచ్చిగ్రుచ్చినృపభామినిదన్నడుగంగఁ గోపము
జ్వలముగఁబర్వఁగాననియె వారిజలోచన ! యేటికింత నీ
వలనకె పుట్టినట్టిపని వారక చెప్పుమనంగనైన నే
దెలిపెదనంచునంతయునుఁదెల్లముగానెఱిఁగించియిట్లనున్. 147

గీ. అక్కటా ! సింహబలుఁడంత యపరబుద్ధిఁ
జూచె దైవము మొగమైన జూడడయ్యె

వాని కావర మెంతకువచ్చెనమ్మ
యింత యన్యాయమెందుల నెఱుఁగమమ్మ. 148

క. నావంటి యక్కజెల్లెలి
తో వాఁడునుబుట్టలేదె ? తొయ్యలి : వినతున్
నీవుఁ విన్నావిదితగు
నే? వివరింపుముజగాన నెందునన్నైనన్ 149

గీ. దైవమెక్కడనున్నాఁడు దైవమున్న
నిప్పుడేవానికొక్క చేటేలతప్పు
నైనయేటికిఁదప్పు నాయంతసాధ్వి
పైనిఁ గీడొనరించిన బ్రతుకునెట్లు 150

క. కుడువఁగఁ గట్టఁగఁ గలిగిన
గుడుతురు గట్టుదురు తమకుఁ గూర్చినచెలులన్
నడుతురుగా కీర్తిని
చెడుబుద్ధిఁ బరాంగనలకుఁ జేతురె ? చెపుమా. 151

వ. అనియిట్టులంబగు శోకంబున విషాదంబునంబొందు పాండవేయమహిషిం బెక్కుభంగుల ననునయించియుఁ గౌఁగిలించియు నెవ్విధంబున సుధేష్ణయు దాని యలుక దీర్పనేరక తమ్మునికి దీనివలన గంధర్వులచే నొక్క కీడుపాటు బెరయ గలదని చింతింపుచుండెనంత. 152

గీ. ఇవ్విధంబెల్లఁ గ్రిమమున నెఱిఁగినట్టి
రాజదేవులయింటను రమణఁ దిరుగు
జనము కన్నీరునించె నాసతినిఁజూచి
సింహబలు వెక్కసంబాడ జెల్లదయ్యె. 153

శా. సాయంకాలముదాటి రేయినరయన్ జామైననూరెల్ల ని
దాఁ్రియ త్తత్వముబూని యున్నతఱినయ్యబ్జాక్షి కాల్సద్దుగా
వ్రేయంజూడక మెల్లనేకతమ చేరెన్ వంటయింటం బోగన్
మాయుంబుట్టుముచే ఘనాప్తగిరినానల్వోవ్వనా భీమునిన్.

గీ. కన్నుగూర్కిన యాతనికడ వసించి
నిడుదనిట్టూర్పుపుచ్చి చన్మోగడలొరసి
తడఁబడెడు బాష్పములును దత్తనువుసోఁకి
మెలఁకువనొసఁగ బల్వొన్కి మేలుకొలిపె. 155

గీ. ఇట్లు మేల్కని యిది యెవ్వరేయనంగ
నే నటన్నను భీముఁ డామెలుఁగెఱింగి
కృష్ణయని నిశ్చయింపుచు నిటులఁబలికె
మెల్లమెల్లన గుజగుజ మెలఁతతోడ. 156

గీ. పడఁతివడసియు చీఁకటిఁ బట్టవచ్చు
నిట్టి నడురేయి నొంటిగా నేఁగుదేరఁ
గారణంబేమి నావుడా కాంత చింత
గడలుకొనఁబల్కె గద్గదకంఠయగుచు. 157

ఉ. ఎక్కడిదుఃఖమిప్పుడిక నెక్కడిసిగ్గిఁక రిత్తరిత్త నీ
కెక్కడివీరపత్నినన నీయభిమానము మాటలన్నియుం
దక్కెను నీచకీచకుఁడు తన్ని రయంబునఁగొప్పవట్టి మై
చెక్కలువోవ నీడ్చెనను జెల్లెనుజెల్లెనువాయునందనా! 158

క. కట్టా! దుఃఖముచే నే ...
బిట్టుమునంగన్ విరాటు పృథ్వీశునెడం

బట్టి యుపేక్షించుట జము
పట్టితగంజూచెఁ మానుభంగికితగన్. 159

క. తనకేమి కొదువబడు పై
కినిఖడ్గము వచ్చెనట్లు కెరలిపలుకఁ చ
ల్లని మాట మాత్రమైనం
జనవరుపేరోలగమునఁ జనదేయాడన్. 160

గీ. అక్కటా ! యాడుమొరవిన్న నరయరెందుఁ
దనకు నన్యుల బలెనైనఁ దానకదయ్యొ
నెన్నడు నెఱుంగనిట్టి మీ యన్ననడక
నేమి సెప్పుదునోఁ జెల్ల భీమసేన. 161

క. కూటికి జీవించెదనా
పాటెందులకెక్కు కంక భావుండగు నా
మేటికిఁ గల్యాణంబే
నాటికిఁ గావలయుఁగాక నరవరుపాలన్. 162

క. అనుదినమాయన యాజ్ఞం
దనరెడు నీచేతనలమఁదగు నాకచముల్
విను నిశ్శంకంబరుచేఁ
దనుబ్రోదువంగఁలిగె నేమి దప్పుదునింకన్. 163

ఉ. ఎన్నితలంచి నేవగతునెన్నఁటికిం గడగండ్లతో వలె
మిన్నక యున్కి లేదుపుడమిన్ మిముల్లోకులు భూరిశౌర్యసం
పన్నులటందురే నెఱుఁగ బాములకై వడి గట్టికొంటి మీ
యన్న యొనర్చుజూదపుదెబ్బోది యుగాఁదువిదాకమారుతీ.

గీ. కటికనాడు స్నసేనుని( గంటెకడి(డి
యపకృతుండను సూతజుండపవేని
మొదలమ(డివడియున్న నాముంగురులకు
నాకు నొకయాయువై నేడు పోకగనెను. 165

ఉ. వీ(డుబలాఢ్యు(డంచు మది(ద్రే(గు(దలంచితివేని భీతిచే(
బో(డిమిచెడ్డనన్ను నొకపొందున(జేరిచి పుణ్యమొందుమీ
నే(డదియెటులన్న( దరుణీమణులేగతి సంకటంబులుం
గూడినశీలమున్ విడువ(గూడదుగావున సూరుతాత్మజా! 166

వ. అని నయ్యనలజాతపల్కులకని నిలజాతుండు 167

క. జననుతు(డజాత శత్రు(డు
వనితా! కలనైన దూఱువడియెడువా(డే?
యనయము బొగడ్తకర్హు(డు
గిసిసెదువెతనొంది యత(డు గేవలనృపు(డే. 168

గీ. అమ్మహాత్మకు నానతిక్రగ్గలింప
కునికిమేలయ్యె( గీచకుపనికినేను
బయలుపడనప్పు డజ్ఞాత భంగమైన
నిందమనతలమోచు( జుమ్మిందువదన! 169

వ. అనిన(బార్థ దశ్వనకు( బార్థ తియిట్లనియె. 170

క. కడునిజమిది యిదుములనే
గుడిచినకతమునను దూఱికొనియెదమును నీ
యెడనా కేమౌ గలదని
వెడవెడజనులాడికొన(గ విందుంజెవులన్. 171

ఉ. భూవరునోలగంబునను బోతును బెబ్బులి మల్లులన్ మొదల్
నీవ్రతదాఁక్ష బోరునెడ నెమ్మిగ నంతిపురంబు కాంతల
చోచ్చవిధమెల్ల జాలములఁ జూచుచు నేనును జూచుచున్న యా
యావివిధంపుఁ జెన్నెలకు సందరు సందియ మొందుచుం ద్రోగిన్

క. కావున నిప్పుడు గీచకు
చావునకొక మఱుగుతోడ సల్పుమనుడు దు
ష్టావిలుని విషయమప్పుడు
పావనిసన్నంపుటలుక పయిరున్ ననిచెన్. 173

క. నిద్దురకందోయికిమును
దద్దయు గెంజాయ నౌనఁగ ద్రౌపదిగతనక
బెద్దయు సూతజు దెసఁగో
పొద్దీపము వెట్టియెసఁగెనొగి శోణరుచిన్. 474

గీ. అధరసమధిక వేపథు వంతరంగ
కుండనిశ్వసితోల్లస త్రూత్కారవర్ణ
నిరుపమేంగాలఘుటికై క నిహతిఁ బుట్టి
కగణిబురణింపమారుతి తరుణికనియె. 175

క. గురుకొనునట్టినాదు గద కొమ్మయటుండగ నిమ్ము పోర న
క్కరటియ కాదు మల్లతను గర్వమునన్ ననుఁ గెల్వనేత్తురే
వెఱవక మేఘవాహుడును విశ్రుతుఁడై నమరాళవాహుఁడున్
వరలెడు తార్క్ష్యవాహుఁడును వాహినిఁ గల్గుమహాహవాక్షు
(వాహాయుక్త. 176

అలహిడింబబకబృహదరిఘ తనయాది
హరణదక్షమిట్టి హస్తమునను
సింగ్గకడలిముసుఁగఁ జేసెదుకీచక
సూదనోద్యమంబుఁ జూపియిపుడు. 177

క. దీనమురిత్తయుదియుదా
సీనము బాపించునాకు సిద్ధంబైనన్
గానిపని ఘనులసతికిం
బూనినయల్పుని వధింపఁ బోలదెమనకున్. 178

చ అలరఁగవానిరక్తమున యావకితాంఘ్రియుగంబుగాఁగ నె
మ్మలపొడిమైకిఁగప్పరపుఁబూఁతయుగా నపకీర్తి కంటఁ గ
జ్జలమమీగానలంకరణ సంపదనింపుడు సొంపుగామదు
జ్జ్వలతరవీరలక్ష్మికినిఁ జామణి? యేమిటికింత సెప్పఁగన్. 179

గీ వెలఁది బల్కినయట్టి యావీరలక్ష్మి
శిల్పమెల్లను నిజముగాఁ జెందినీకు
ననుసరణకాంక్షపై రంధ్రితనముఁబూను
వానిఁగాననుదలపోయు మానసమున. 180

ఉ. క్రిమ్మరవానియింటికిని గౌరవమొప్పఁగ వేఁగి నీవు పైఁ
గ్రమ్మఁ గటాక్షముల్ నెఱపి కాఁగలయాపనికాత్మలోపలన్
నమ్మికఁ బుట్టఁజేసి యటనట్టువయిల్లెలవెట్టి నవ్వుటా
లమ్మలమాటలాడియురులందవిలించుమువిూఁదఁజూచెదన్.

వ. ఇట్లప్పటికిఁ దగు కార్యంబు దెలిపి యూరడించి
పంచిన పాంచాలి పంచానన సమంచిత బలుండగు పతి యను

మతివడసి మగుడి నేపథ్యాలయంబుఁ బ్రవేశించి కొంత శాంతిఁజెందిన చిత్తంబున నుత్తలంబు మాని మేను సెజ్జ నుజ్జగించి కన్మోగపునంత. 182

గీ. తన కులవధూటి ద్రుపద జయినునివలన
మన్ననకుమాలె దిక్కొండు గన్న తెఱఁగు
గాంచి రమ్మని చందురుఁడంచు వేగు
లాగునకేతోఁచెఁ దూర్పున వేగుఁజుక్క. 183

చ. మలయమహేంద్రముఖ్యడిగితమంబున నిద్దురమబ్బుచేపదం
బులుతడఁబాటుగానదులపొందున మార్గముదప్పికాల్నడల్
తెలియకనీతలన్ వెడలి దేహములంగమలస్థగంధముల్
వెలయఁగఁబోలునావెలసెవేకువజామునపయ్యెరల్ దగన్. 184

గీ. మలయచందన నిష్కుహాజ్వలభుజంగ
ఫూత్కృతమువాయు దంభంబుఁబూనివచ్చెఁ
గానిచో రాజమానినుల్ హీనవృత్తిఁ
దగనరేంద్రులకపుడిచ్చుఁ దలఁపనేల ? 185

చ. జలజమువంతబాసెఁ బొగసయ్యనరేకులుమాసెఁ దేటిగుం
పులుగదుమ్రోసె గీములను బుల్గులు పెన్రొదసేసె నన్నిది
క్కులు తెలిగాసెశోకములుకూటమికొయ్యనడాసెఁదారకం
బులుదివిమాసెఁదూర్పుదెసప్రొద్దనుసీరునుమోసెనయ్యెడన్.

కం. ఆరూఢుఁడయ్యె రవి పెం
పారం బ్రాక్శిఖరిశిఖలయందుల్లఁదగు కా

శ్మీరముజల్లిన తెఱఁగున
నీరెండలుగాసె ధారుణీస్థలినెల్లన్. 187

వ. అట్టి సమయంబున సకల జనంబు తమ తమ
పనుల వర్తిల్లునంత. 188

ఉ. నాటినిశీథమేయుగమ నందనపాలికిఁ బచ్చవిల్తు పూ
వ్రేటులఁ వేగివేగికను వ్రేయనెఱుంగక నెక్కుడైన యా
రాటముఁజెంది కీచకుఁడు రాతిరిదుష్కటలీలఁబుచ్చి స
య్యాటలనేఁగితామగుడనాసతిపై నడియాసచేననున్. 189

గీ. హార్దకలహంబుగల కేళియందుఁదుల్య
పరిభరంబులు బెరయ నాపైనిఁ గరుణ
నెరయఁదలవట్టి పదహతుల్ దఱచుఁజూపి
వైరశుద్ధినొసంగుమో వన్నెలాడి. 190

క. ఏపురుమగలను దప్పయ
మీ వేటికిఁదలఁచెద భయమేకలుగంగా
దాపుగహరిగల యావన
మేవిధనమునఁజెందు నితరమ్మగములు దిరుగన్. 191

గీ. నుదుటనంజలి కంజంబు నాలుకొలిపి
వేఁడనింజెలిగాన న్నువిమువఁదగునె ?
మంపుపదసేవయిటె ప్రసాదింపు నెనరు
మొనయవేరేల చేసెదో ముద్దుగుమ్మ ! 192

వ. అని యనేకపువగల బామగుడుచుచుఁ బలుకు
సింహబలుం జూడరోసి వ్రీడాభరంబు నెపంబున మొగముఁ

ద్రిప్పికొని యావధూటి యాసపాటునఁ జిత్తంబు మెత్తనైన
తెఱంగు దోఁపనప్పుడు. 193

క. ముసిముసినగవునఁ గీచకు
దెసఁగని యిట్లనియె నెంతఁ దెలిపినఁ గడిఁదిన్
వెసఁజేటుపాటు నెఱుఁగక
కసుగందక మసలదేమి గాఁగలవొ తుదిన్. 194

గీ. ఇజ్జగం బీశ్వరాయత్త మేమిఁదనకుఁ
బొడమునది యీశ్వరాధీన బుద్ధినుమ్మి
పూనిమరురీతి నాతఁడు మానగలఁడె ?
ఓమహాత్మక ! యిదిగదాయుచితఫలము. 195

ఉ. స్త్రీపురుషత్వరూపమునఁజెంది నటించుచునుండిరొట్టిచో
నాపరమేశుఁడైనఁ దనయాకృతికిం దెరచీరలజ్జగాఁ
జూపఁడె? నొక్కటన్ విడువఁజూడఁడుగావున నేరికైనఁదా
రోపినరీతిచే నలుకునుండుట బోలును దారవృత్తిచేన్. 196

క. భువినాడికోళ్ళు నార
ళ్ళవినేబడఁ జాలలోకులనికొనఁగాని
న్నేవరేమియనిన మగవాఁ
డవు మోసముగలదె యేమిటనుజూడంగన్. 197

మ. పలుమారేటికి నింతచాటిపుడుజెప్పన్ నీకు నిక్కంబుగాఁ
దలఁపన్ విఘ్నముఁజెందు నీపనికి గంధర్వైకదండంబొగిన్
గలదేనన్ వినుఁనేటిమాపుకడుఁ జీఁకట్లొప్పి భీమస్థితిం
జెల్లువొత్తాండవమంటపాంతరభువింజేకొమ్మసంకేతమై.

క. జనమూరు మాటుమణఁగిన
వెనుకం బరులెఱుఁగకుండ విచ్చేసిన నీ
కనవగు ననంగవై భవ
మెనయంగా నొప్పనూవె ! యేవిధినైనన్. 199

గీ. ఇటులనే తెంచినట్టిద యింటినడుతుఁ
దల్పమునఁజెందు నీకు నంతఃపురాంగ
నాముఖాబ్జంబులై నను బ్రేమఁబుట్టి
మగుడిచూడఁగఁ గోరవు తెగువజేసి. 200

వ. మఱియుఁ దత్ప్రదేశంబు నిర్జనంబై హృద్యంబగుఁ గావున నచ్చటికిరమ్ము పొమ్మని పలుకు నలికులవేణి వాణి యాకర్ణనంబున నాకర్ణ పరిమోదార్ణవ పూర్ణతనొంది తూర్ణంబున నిజనివేశంబుఁబ్రవేశించి హేళిననమికి విరాళి హాళింబడి యున్నాఁడు. 201

ఉ. పెన్నెఱిగుంపు సొంపు నిఱు పేదతనంబునఁ గొనుమూపు న
భ్యున్నతి చన్గవందరుల యొప్పను తమ్ములగేరిణిసేయ సా
గన్నులబాగు బింబమును గాదనఁగాఁదగు మోవిదీవియుం
చున్నలఁతందలంచిమొకచొబ్బనదోఁచెదినంబుబోవగఁన్.

వ. అనంతరంబ నిజతనూజావరజదార మనోరథసిద్ధి సంపాదింప ననుమాడ్కి భగవంతుండగు వివస్వతుండు సముదరిపాంతంబున గ్రుంక నిరుద్ధ్యమానమరుదధ్వాంతంబగు ధ్వాంతంబు వొడమునెడ జలములాడి కుడిచి కట్టి తొడిగి

ముడిచి పూసియేచి సజ్జీకరణుండై సంభృత సంబంధ సంవిధా నుండగుచు

గాఁపుబాముల నెఱుంగ రామిఁగాదమంబు సాంద్రితమంబై యొ ప్పనప్పుడు నిలయంబు వెలువడి కీచకుండు. 203

మ. నలువౌ నాఁడె లరాచవారుదమయంతన్ వచ్చిమేల్మెచ్చుశ్రీ
వులతో నోగిరమారగించి చనితావుల్ చేరగా నూరిలో
గలవారల్ నిదురింపమారుతియునాకంజాక్షితో వచ్చి బూ
చులు వేఁటాడెడునాట్యమందిరములోఁజొచ్చెన్ ముదంబొప్పఁగన్

గీ. అట్లునే తెంచి దుప్రదజనచటిచక్కి
నునిచితన్మధ్యమునఁ జేయిఁబనివియొక్క
శయ్యగనియుండు వసియింపు సమయమునను
సింహబలుఁడును నటఁ బ్రవేశించి యుండ. 205

క. బలువగుచీఁకటిచేఁ జెయిఁ
బలుపురు బయలెల్లఁదడివి పట్టుచుపాదం
బులుమెల్లన జరుపుచు నా
వలనికిఁజని మందముగను వాఁడిట్లనియెన్. 206

గీ. మాలినీ ! యిప్పుడీవు పాంచాలిభంగి
బరగనెచ్చట స్తంభము పార్శ్వమొంది
తనుచుభీముని తల్పాంతమునకుమెల్ల
మెల్లనేచేరుననంత నర్మిలిపొసంగ. 207

వ. వలలుండును స్త్రీస్వరసముచితంబగు నెలుంగు నప్పుడు మెళంబుగా వానికిట్లనియె. 208

గీ. కూర్చుచెలులనువిడనాడి కోరిపారు
తెంచినాఁడవు నాయందుఁదీపిబుట్టి
కానసూహించితిని మదిలోననిపుడు
పరుఁగనిన్నువినిర్గత పాశుఁడుగను. 209

వ. ఇట్లు బలికిన వృకోదరునకు మెల్లనఁ గీచకుండి
ట్లనియె. 210

మ. కమలాక్షీ! భవదీయవల్లభుల నాగంధర్వులంబూరితో
సములౌనట్లుగనెంచినన్నురతులన్ సౌఖ్యంబులందించుచో
నమరత్వంబులకంటెనొప్పనుమదీయంబైనమర్త్యత్వమున్
విమలంబై ధరణీతలంబునల సద్విస్ఫూర్తిచేసీయెడన్. 211

క. నీకునుమరియును వేల్పుల
లోకమునకుమీఁదనుంప లోగలుగసుధన్
దీకొని మోవియొసఁగికడుఁ
జేకొనుకుచమేరుశైల శిఖరముచెందున్. 212

శా. ఈరీతిందగు సాంత్వవాక్యములచే నేతెంచితల్పంబుపై
గారాబంబున మేనుజేర్చుమ యనంగంబూనుచో భీముఁడా
వైరిన్ భీకరమైన ముష్టి బొడిచెన్ వాణీవిభుండిచ్చు వి
స్ఫారాయుర్లిపిబోవఁజేయుమనఁగన్ ఫాలస్థితింబెట్టుగన్.

గీ. సింహబలుఁడును గంభీరచిత్తుఁడగుచు
నతులగంధర్వుఁడను బుద్ధినతనిమోఁదఁ
దనకుఁగాఁగలపీనుగు దశనుదెల్పు
నట్టెపిడికిలిఁగొనివేగ నడిచెనపుడు. 214

చ. జవములుబూనికోపములజావిజయంబులు గోరిశోణితం
బవిరళమైపయింబడ భయంకరవృత్తుల హుంకరింపుచున్
బవనసుతుండుసూతజుఁడుపట్టుచుఁబట్టుచుఁబెట్టువైచుచున్
వివిధగతిన్ నియుద్ధమనువేలముగానిశిఁజేసిరొండొరుల్ 215

క. ఆశలఁగాసె బిగింపుచుఁ
గేశములుంజుట్టి పట్టికిరుపుచు గెలువం
గాశోభిలుచు సత్త్వము
నాశము సెందకయు భూరినాగంబుగతిన్. 216

చ. పొడమనిసింహనాదములుబుట్టనిశ్లాఘనచాటుగుంభముల్
నుడువని వీరవాదనములుంగడు నూర్పునిహూత్కృతంబులే
యెడలఁజిటుక్కురంచువిన నీకపొనంగిమహోద్యతంబుగాఁ
గడిఁదినభూతపూర్వమగుకయ్యముసయ్యననయ్యెవారికిన్.

మ. ప్రకటోద్వృద్ధబలుండైనసింహబలుఁడొప్పందావిచారించెస
న్నకసన్నన్నిశిఁ బెన్గులాటనొకవెంటన్ సద్దుగాకుండ దీ
నికినై యెవ్వరనొక్కనొక్కని నిటన్ వేచంపికైకొందు నే
నిఁకనంచున్వలలుండునాసమయమున్వీక్షించిబెట్టూర్వగన్

క. తడవిట్లనేక గతులం
బెడిదంబుగఁ బోరిపోరి భీముఁడువైరిన్
బెడచేత నడచె నెత్తురు
బడిబడి గ్రక్కుకొని యావిఁబాయఁగనంతన్. 219

చ. అనుపమకామపాశమున నంటెశిలీముఖపంక్తిచే వినూ
తనతబొసంగనంగమునఁదద్దయురంధ్రములూనియున్ మరు

త్తనయువిధూనతం బరగితానొకయించుకమాత్రమైనఁ బ
ల్కనుదగదయ్యెఁగీచకముఖంబుమహానిశినైనవత్తఱిన్. 220

గీ. భీమముష్టినిఁ బడివాఁడు పెలుచమరణ
మగునెడంగేలు గాలుదేహంబుతోడఁ
జలనమొందించె ఫల్గునువలను నుత్త
రాదికన్యలు నేర్చు లాస్యంబుకరణి. 221

వ. అంత నా గృహాంతరంబున శాత్రవు కళేబరంబు కరచరణశిరంబు లెఱుఁగరాకుండఁ బిండీకృతంబుగా నొనర్చి పార్షతికిహర్షంబిడేర్చి దానిచే శ్లాఘాపూర్వకంబుగా నాఘూర్ణితభుజుండగుచుఁ గురువ్యాఘ్రుండు నాట్యమందిరంబు నిర్గమించి యవికృతమానసుండై మహానసావాసంబును బ్రవేశించి రక్తపంకంబుఁ గడిగికొని సుఖంబున శయినించె నంత నిటద్రౌపదియు మారుతి యింతకువంటయిల్లు సేరునని నిశ్చయించి యప్పుడు, 222

ఉ. మాలినియాటకూటమును మానుగవెల్వడిగీచకుండు దాఁ
గూలెమదీయవల్లభుల కోపవశంబుననంచు భీతిచేఁ
మాలినరీతిరట్టుబివతోడ నయప్పురివారులేచి తా
ల్త్రాఘుఁడటంచునించుఁదముదామయదేమనుచుఁ దయంబునన్

క. దివియలు చేఁగొనిభయములఁ
దవులుచు బెదురుచునువచ్చు తత్కులకలముల్
జెవిఁబడఁ గీచకసోదరు
లవిరళగతిఁ బారుతెంచి రచ్చటికపుడున్. 224

చ. కడిఁదినిమిత్తియేనికకుగానొగిఁగట్టినయట్టి బియ్యపున్
ముడియముబోలియున్నశవముంగనివానియనుంగుదమ్ముల
య్యెడనిలఁవ్రాలి పెద్దవగ నేడ్వఁగ నగ్రముజాను డఘ్నుడై
యడరుటచేతవారుదమయన్న తెరంగునఁబోలిరొయ్యనన్.

మ. ప్రజలల్లంతలనింతలన్ నిలిపి హా! పాపంబటంచుం దగుం
గుజనుండంచును బ్రహ్మవ్రాఁతయగు నొక్కొ! యంచు
మీఁదెవ్వరే!
నిజమింకంగడనున్న వారలనుచున్ నిర్మాణమిట్లంచు న
క్కజమప్పంటి విరాగమునగిలి జోకంగోష్ఠిగావింపుచున్

క. అని గంధర్వులు కోపము
గొని సూతజుమాత్రమిట్లు గుదియించిరి నా
విని కొందరనిరికా దా
ఘనులెవ్వరిఁ దుఱింతురిట్లగాఁదగుననుచున్. 227

క. తగునాంధ్రుగల్గి యకటా!
మగనాండ్రకు నాసఁజేసి మడసితివిఁక నీ
వగ నెట్లు గడుతుననుచుం
జాగలుచు నుపకీచకులును బొరలిరిపుడమిన్. 228

వ. ఇవ్విధంబున ననేకభంగుల శోకించి యనంతరంబ తమ్ము తామ యాశ్వాసించుకొని వెచ్చనూర్పుచు వానిం దహింపఁదలంఁచి చెంగట సింహాబలు మరణ కఱిఁకుంబు దన్న డుగు చేడియలతోడఁ జెప్పుచున్న సైరంధ్రిఁ జూచి సోదరవిపత్తికి నిమిత్తం బిదియ యని రోషరూషితచేతస్కులై విరటు

ననుమతిఁగొని పఱతెంచియాపుణ్యసాధ్విం బట్టి నివేశితశవపిండ భారంబును మూర్తంబులై భీమ ముష్టిఘాతంబులు దగిన తెఱంగునఁబొల్చు నారికేళఫల పరంపరలచే నిరుత్సమానంబు లునునగుఁ బ్రేతోచితయానంబునఁ దిమిర ముదిర సౌదామ నింబోలు కౌంతేయసీమంతిని నంటఁగట్టి కరదీపికా సహస్రం బులు వెలుంగ నిజవివేకసంపత్తినాఁదగు చితిం గీచక శవంబు తోడఁ దీనిఁ దహింతుమని తలంచి విహితగతిఁపితృవణమా ర్గంబుపట్టి నడచునప్పుడు. 229

ఉ. ఆననబోఁడిజయా! జయాహ్వయ! యోవిజయుండ! యోజయ
త్సేన! జయోద్బలుండ! పెడచేతులునన్నిదె కట్టి కీన్గుతో
బూనిచిసూతులిట్లు గొనిపోయిరికాల్పఁగఁగ్రొవ్వియక్కటా
భానుసమానులార! యిదిబాపరె కావరె! యంచుఁగుయ్యిడన్. 

వ. మఱియును. 231

గీ. భయముఁజెందుచు హా! జగత్ప్రాణభూత;
నాపవత్కాలబాంధవనాథ; నన్ను
నాథపోలిక నుపకీచకాధములును
శవముతోఁగట్టికొని పోవసైతునెట్టు. 232

క. కొంపోవుచునున్నారిఁకఁ
దెంపునఁ బఱతెంచివీరిఁ దీర్పవె నను వీ
క్షింపమిబాడియె యనుచు ను
తింపుచు నూరెల్లగ్రిక్కిఱిలబిట్టేడ్చెన్. 233

సీ. అప్పుడుతత్సతియాక్రిందన ధ్వనివిని
సూతులెంతకు దొనికిరనుచు
నలులుండుచటులజవంబునఁ దూగు పెందొడ
లఁబుట్టినగాడ్పు తోడఁగేల
నలరెడుకొరవియంతంత వెలుంగుల
నీనగారుడభిత్తిఁ బోనియురుల
గమినివప్రములంఘనముఁజేసి దోర్దర్ప
మనియెడు సిద్ధాంజనాప్తిదనకు
గీ. దివ్యదృష్టినొసంగ విద్విషులమూక
నరసితజ్జ్యోత్స్నతెలుపునఁ దరుగఁజేయు
తలఁపుఁగొనియూపరేత భూస్థలికివచ్చి
యెదురుగామెల్లమెల్లన నేఁగుదేర. 234
చ. ఘనమగుకొండభంగిఁ దమకట్టెదురంజనుదెంచుమారుతిం
గనిఖచరుండువచ్చెనిదెకానముగాబ్రతుకంచుఁ వాదముల్
బొనుగుపడంపడంబడచు భోరునసూతులు యావరుద్ధరి
త్రినిఁ దిగనాడియెండొరులదీటుచు వారిరిభూరిభీతులై.
క. ఈరీతిఁ నడసేయక
వారకచనువారిమటికి పావనియొక వి
స్తారద్రుమమున నందఱ
నారసితామోదిమోది యమపురికనిచెఁ. 236
చ. తనజనకుండరణ్యముల తాళమహీజములోలిఁ గూల్చుచా
డ్పునవలలుండుడాఁగొఁతలి పూనియొకానొకఁడేని తప్పినన్

గనికొనితుత్రించెబంధుతకుఁ గాఁజనుదెంచిన వారుభీతిచే
మునుమును బారిరెల్లెడలమోముపచ్చెనటంచుఁజూచుచుక్

చ. అనలమువుట్టినట్లొరసినప్పుడు మారుతజాతధూతమై
యనయమసారకీచకదురంతరవంశము నేలఁగూలచే
యనలముబుట్టినట్లొరసినప్పుడు మారుతజాతధూతమై
యనయమసారకీచకదురంతరవంశము నేలఁగూలఁదే. 238

గీ. అటులనందఱు సనినయనంతరంబ
ద్రుపదసుతబంధముఁలు విడఁద్రొచిదాని
చేతనుతిఁగొని తాఁబ్రశంసించిమగుడి
గూఢగతిగేహమునసొచ్చి కుదురునంత. 239

వ. తత్క్షణంబ సంధ్యారుణిమకరంభితాంబర బింబ పరిచుంబ్యమానజంభరిపు హరిదంకణంబురు ధీరవీచి సము చిత రణాంగణ విడంబంబుఁ దెలుప విరటుని నిలయద్వారం బున నిబిడంబుగా బాష్పధారావర్షంబులు గురియింపుచుఁ దలలవీడ నడచికొనుచు మండలాకారంబుల నొండొరులం బట్టికొని మాలినిం దిట్టుచు నానావిధ దీనాలాపంబులు దిశలునిండఁ గీచకుల మిత్రబంధు కళత్రంబులు సందిడక బలవంతంబగు వలవంతంబడి యేడ్చుచుండ రప్పుడు కేకయ రాజపుత్రిపాలికేతెంచు సైరంధ్రింగాంచి పౌరులు భయంబు నఁగలంగి. 240

సీ. వారిఁబోయిచును మావారినీ చలిగాలఁ
దన్నవమ్మా! యని తలఁచువారు

దారుననెదిరిన తటినోసరిలి పెడ
మొగమిడి కన్గవమొగపువారు
మారియల్లఁటె వచ్చె నూఁబలోపలికను
వారల నదలించి వగచువారు
నదరిపాటునఁజూచి చెదరి లోపలికేఁగి
తలుపుల గొండ్లముల్ నిలుపువారు
గీ. మగని బిడ్డల రక్షించి మనిచితేని
కొడ్డినింటను నీపేరు దొలుతపెట్టి
మొపుమఁగొలిచెదమని చేతులెత్తిసారె
మొ్రిక్కువారునుగోడల నిక్కువారు. 241
సీ. మించెనో ! లేదో యటంచును వేమారు
తోరణగండ్లలోఁ జూచువారు
నటకేఁడఁబోయెదవది వచ్చెనని గొంది
తూరగా బాలురదో్రిచువారు
తలపోయ విభుదేవివలన నీయనలంబు
పుట్టెనంచునదూరి తిట్టువారు
వాకిలితెరవక వమ్మునఁదమరింట
లేని తెటంగునఁ బూనువారు
గీ. నిట్లు పురిక్షల జనము లనేక గతుల
వెతలఁబడుచుండఁజూచి యూ వెలఁది నగవు
మోముపై జంగలిడఁ జీర ముసుకుదిగిచి
వచ్చె నమవీధిఁబట్టియవార్యగతిని. 242

ఉ. ఈగతినేఁగుదెంచి ధరణీశ్వరు దేవినిఁగాంచ నామహా
భాగిని దానిఁజూచిబహుభంగుల దుఃఖములన్మునింగితా
వేగిరపాటుమాని యొకవిన్నఁదనంబున మున్నుభర్త యే
లాగుననేని దీని వదలందగునన్నది యెంచియిట్లనున్. 243

గీ. చాలుఁ బదివేలువచ్చె నీ సఖ్యమునకు
వేగ వేంచేయు నాపతి వృద్ధుఁడేను
పేదముత్తైదువనునాదు బిడ్డలెల్ల
కన్ను తెరవని కూనలు గావుమమ్మ 244

చ. అనిన సుధేష్ణఁజూచి ద్రుపదాత్మజ మెత్తనఁబల్కెనమ్మరో
పెనిచితివీవు గర్భమునఁబెట్టి యనేకదినంబులింకనే
చనియెదనొక్క పక్షమిట సైపుము నావిని నీదుగర్భసీ
మనుగడుఁబెట్టితేనువినుమా! కడఁగానక తోడఁబుట్టులన్.

క. కానిమ్మ పక్షమాత్రము
మానిని మాయింటనుండి మరిపొమ్మనియెం
గాని యపుడొత్తి పొమ్మన
భూనాయకు దేవిమానెఁ బొడమినభీతిన్. 246

వ. ఇట్లు సుధేష్ణ నొడంబఱిచి పాంచాలియుండెనంత.

ఉ. ఆతతిహర్షవైభవ సమాహితబాష్పఝరంబు వాతజా
తాతతధూతకీచకకులాకుల కోటిసమంచితంబు సం
కేతనగంబుమీఁదఁ గృతకృత్యులునైన యుధిష్ఠిరాది సం
తీతనయుల్ విలాసముల తేజములొప్పఁగనుండిరొయ్యనన్.

క. ఆవార్తనాఁడు నాఁటికి
వేవిధముల నగ్గునైన విన్కలిచేతన్
భూవలయంబునఁ గ్రమమునఁ
బోవంగాఁ జొచ్చె వింత పుట్టఁగనంతన్. 249
ఉ. చారులచేతఁ బాండవుల జాడయెఱుంగక ధార్తరాష్ట్రుఁడే
పాఁగసూతజుల్ శతముశ్యామకునై మరణంబుఁ జెందుటల్
వారలు సెప్పినన్ రిపులవశ్యముమాత్మన్యనిప్రోలనుండఁగా
సారెకునెంచినిశ్చయముఁ జాలనినెమ్మదిచేతనెంతయున్. 250
ఉ. ఆషరునాఁడుగర్ణసుబలాత్మజులున్ దనుగొల్వఁ గౌరవ
గ్రామణికొల్వుకూటమున గౌరవమొప్పఁగ దానునప్పుడు
ద్ధాములు భీష్మముఖ్యులగు తక్కటిబంధులనెల్లఁ జూచి తా
మోమునహాసమొప్పఁగరమున్ ఘనశబ్దముఁజో డసిట్లనున్.
శా. ఓహోహో! యిదివింటిరాయిపుడుమత్పోర్వీశువీటన్ వరా
రోహాంగీచకుఁడో ర్తుఁగోఁగఁడు ధీరుల్ మానుషాదృశ్య స
న్నాహుల్ దానిహ్మాదీశు లేవురగు గంధర్వుల్ నిశిన్ ముట్టినం
దేహంబప్పుడవీడినాడటకదా దీపించు పిండాకృతిన్. 252
క. మఱియును దానికి ద్రోహము
నెఱపినతదవరజులట్లనేయైరటయీ
తెఱఁగుజనశ్రుతి నెంతయు
నెఱిఁగెంగర్ణుండునేను నెఱిఁగితి నిపుడున్. 53
చ. వినుఁడిది నిక్కమేని యిఁకవేరె విచారములేదుచూడఁగాఁ
దొనగెడు వేడ్కతోనది చతుష్పథమంటపసాలభంజికం

జనుజనలోకహ స్తపరిచర్యకు భాజనమైన కృష్ణ వా
రనయము బొందునందనులు నొదురు సంశయమేలని మ్మొయిన్.

క. ఆమానినికై కీచక
నామములడఁగించువాఁడు నై జముబలియుం
డామహితాత్ముల లోపల
భీముఁడుగాఁగలఁడు గోపభీకరుఁడగుటన్. 255

వ. ఓహోహో! యెల్లవెంట విశ్రృంఖలంబు వీరల
దౌర్జన్యం బది యెట్లంటేని 256

ఉ. మారుతిక్రొవ్విరాజ్యమున మాగధముఖ్యులగూల్చెఁగానఁగి
మ్మీరహిడింబముఖ్యులను మృత్యువుపాలుగఁజేసెఁగూఢసం
చారములోనఁగీచకులఁజంపె నొకానొకనాఁడు నెమ్యోడన్
బోరడీగావసించెనొకో పుట్టినపుట్టుక యిట్టిదేకదా. 257

చ. ఇదితగు లెస్సవాలకము లేవురు గించనవృత్తిఁబూని యా
ముదిమడితప్పికన్నుఁగవమూయుచునుండును మూత్స్యుఁడె
యెడన్
ముదుసలివానిఁబోలఁ గడమోసములేదని యుండిరంచుమై
గదలఁగఁ గర్ణుఁజేఁజఱచి కౌరవుఁడార్చిన గెల సమున్నతిన్.

చ. మనము విరాటు గోగణము మానకపట్టిన నందువార లుం
డిన చనుదెంతురాజికిదిసిక్కము వారలఁ గాంచినంత మీా
కునుసమయాబ్ధభంగమిదిగొబ్బునఁగ్రమ్మరఁగాన కేఁగుఁడం
చునుజెవిచాటిచెప్పనగునేసూ! పవరంబులమాటలేటికిన్.

గీ. అని సుషేణునిఁ బయనమై చననొనర్చి
కార్యగతిసెప్పి మేమునీకడన నడుతు
మనుడునతఁడట్ల గోవుల నపహరింతు
ననుచు బలయుక్తుఁడై రాత్రియందు వెడలె. 260

వ. అంత. 261

సీ. దిగుబసనూళ్ళుల దెసవోయికుండలు
కసవుకట్టియకూర గాయకలువు
లకుఁబ్రజ పీడసేయక నడవులదిగి
చిఱుతబియ్యంబాని చేతవండి
కుడుచుచుఁదమునెందు నడచెదరనతప్పు
తెరువుచెప్పుచునేమి దెలియకనీక
విడియుచోనెత్తుచో వీళ్ళుపొందుననేని
తూర్యముల్ చిటుకున దొరలకుండ

గీ. నలువు పొలువును నాకలి దలపమాని
పగలురాత్రియు నొకవిధంబుగఁ ద్రిగర్త
బలముబఱతెంచి వేగులవలన మాత్స్య
పురికి దక్షిణమైనట్టి పొలముసొచ్చె. 262

వ. అంత దీర్ఘదరుణకిరణ పుంజమంజులాయమానంబగుట నొక్కట నిమగ్న జమదగ్ని కుమారోష్ణ నిశ్వాసవిఱత ద్విచిత్రదీచీ పరిపంచంబగు శరత్సమయంబునుంబోలి నీలోపల జాలపలాయమానంబగుట్ల నొక్కట మదకండుయ వేదండ శుండావిధూత విటపిమూలంబగు తమాలవనంబునుబోలి పరి

స్ఫురద్ధవళాయమానంబగుట నొక్కట మందరగిరి మథనపరి క్షుభిత మండ డిండీరమండలంబగు క్షీరపారావార మధ్యంబు నుంబోలి వివిధవర్ణ పూర్ణవిరాజమానంబగుట నొక్కట సంత త వసంతసమయ సౌభాగ్య సంభృత సంఫుల్లకుసుమ విసరం బగు నందనోద్యానాంతంబునుంబోలి యుత్తమిత హుంకారం బును, ఉన్నమితలాంగూలంబును, ఉద్దామ ఘంటారవంబును, ఉల్లలితధూళికంబును, నగు గోధనంబాక్రమించి త్రిగర్తేశ్వరుం డు చనుచున్న సమయంబున నచ్చటిగోపాలురు వెఱపునంబఱ తెంచి తద్విధంబు విరటునకెఱింగించిననదరిపడియతండును 263

సీ. తతచమూకుంభిబృంహితములు సౌధాగ్ర
మణిసింహముఖములు మానముడుగ
సైంధవఖురరజస్సంగతులనదీ నదములాత్మ
నీచరూపములువదల
రథచక్రచక్ర చంక్రమణములనిబద్ధ
భూశిలల్కఠినతఁబోవిడంగ
వీరభటైకదుర్వారాట్టహాస
దీప్తులనీలవజ్రముల్ మలినమొడప

గీ. నరులఁదునుమను యమునిలమ్మనిన గతుల
వలనదనుకూల మారుతోచ్చలపటాత్త
కేతుదండాగ్రకాననభూతగగన
వేటుఁడువిరాటుఁడాహవపాటిఁజూపె 264

గీ. గురురథారోహణంబుల కోర్కిఁగలుగు
సూతులకుగుగ్రముల గోష్ఠిచేతనెసఁగు
నట్టి గంధర్వశబ్దంబులాత్మకరయఁ
గడిఁదిగరళీయమానముల్ గాఁదనర్చె. 265

గీ. సూతులకుఁజిక్కియును దమచురుకునడక
నలువుమీఱ సమగ్రకండకమహోగ్ర
కీచకకఠోర దండపీడాచయముల
దవులవయ్యెను గంధర్వతతిదళమున. 266

వ. అప్పుడు 267

క. కంసుఁడునృపుఁగనిహయగో
కింకరులును వలలుఁడాజికిందలఁపనిరా
తంకులు ధర్మజుకడ మీ
రింకన్ రప్పింపుఁడనుడు నేతెండంచున్. 268

చ. సురుచిరులైనసభ్యులును సూదతురంగకగోపకుల్ మహా
త్తరబలమొప్పనింద్రకరిదంత చతుష్టయలీలతోడరా
విరటుఁడువేగనేగిరిపువీర నిరోధముఁజేసెఁదాపరి
స్ఫురితజవప్రవాహమును భూరినగంబరికట్టుచాడ్పునన్.

గీ. కడఁకఁదృణకల్పుఁడైన త్రిగర్తవిభునిఁ
చెంగటను జంగలిడుప సిజేయువీచి
పెలుచసహదేవుఁడెల్గెత్తి పిలుచునంత
వచ్చిమాత్స్యని మూకల వలనుజేరె. 270

వ. ఇట్లు కదుపులఁబెట్టించి తెరువుబట్టించి వేడుకరెట్టిం
పఁ గదనంబునకుఁ బట్టించునంత. 271

చ. వినమితచాపదోర్జనిత విక్రముల పటుబద్ధపంక్తులై
ఘనవికటత్రికర్త నృపకాంతులసేనలు రెండునుం ద్విష
జ్జనభయదైక భూరితర శంఖరవప్రణవ ప్రధానమై
యనువగుసంగరాధ్యయన మద్భుతమొప్పనుపక్రమించినన్

గీ. సామజము సామజము సాదిసాదిరథము
రథియుభటుఁడు భటుండెదుర్చుచుయెమ్మి
పోరఁ దెరలోనిబొమ్మలుపోలె ఖచర
తతుల కనిమిషనామ సార్థకతఁబొందె. 273

చ. బలిమిగనొక్కఁడేపురను బల్వురనొక్కనినొక్కఁడొక్కనిం
దలపడిపోరుచుందు నిమిదర్పముఁజూపుచు నేర్పుమీరగా
గలహముపై రుగోయుగతి గాఁదగెనంకులుమీఁద బీరముల్
బలుమరుబల్క దీరకనుపారక ఘోరముగాగ నత్తఱిన్ 274

క. అసిధేనులోలిఁ గుమ్మర
నెసగెన్ సమరముననప్పు డిరువాగునకున్
వెసనిజనామపదార్థము
పసచే నిఖిలంబుగొనను భావింపంగన్. 275

క. పాండుకుమారకులునుదో
ర్దండంబుల కొలఁది తమకుఁ దగుతెరఁగుల నా
భండనమున రిపువీరుల
ఖండించిరి విరటుహృదయ కౌతుకమొప్పన్. 276

గీ. ఓలిన్నృపుబానసపుటింట నొండిపెట్టి
నిచ్చనిచ్చలుగనిచ్చ వచ్చుదిండి
నందువలలునిపేడ బొబ్బవలనఁగరుల
దుండియలదోడ దెసలును బెండువడియె. 277

చ. పడియెడుమొండెముల్ తలలు బాహులుకంకటముల్ సిడంబులుళ్
వెడలెడు నెత్తుటేరులకు వేగనిరోధములైన పీనుగుల్
పుడమినిసూదిమోప నెడముంగడులేక నొఱంగిరిందునా
దడములమేటిమానసుల తండమఖండముగాగఖండమై 278

వ. ఇట్లు వివిధవిధంబుల దన విపనక బవరంబు మహాభైరవంబుగాఁజేయు సమయంబున. 279

చ. సమరధరిత్రికిన్ సరభసంబున నంబరవీధివచ్చిన
య్యమునిమహోగ్రకాసరభయమ్మను నమ్మునఁబుట్టికాంది
శీకములయిదూరముంజనిన కైవడిబశ్చిమశైలశృంగముం
శ్రమమునజెందెసూర్యతురగంబులుదభ్రమున్ వహింపుచున్.

చ. అలరవిగల్గిసంధ్యవడునప్పుడు పాటలచారువర్ణ సం
కలితముగాగఁదద్దిశకుగట్టి మొగుల్ కనుపట్టె నెట్టనన్
గొలిచియునాయహర్నిశలకుంబొలిమేరలమధ్యమంబునన్
నిలిపినకెంపెచట్టుకరణిన్ ధరణింబురణింపవేడుకల్. 281

చ. సమరములోనివీరభటసంఘము గొంకకనింకనాదుబిం
బముబగులించునంచు భయభావమునంగడగట్టుఁజేరి తాఁ
గ్రమముననగ్నిదేయమగు కాంతినిమింటనెడించిగుంకెనో
కమలహితుండనాఁగఁగడుగానగనయ్యెనుసంధ్యయయ్యెనన్.

గీ. చదలుమున్నీటిపవడంబు జవ్వులనంగ
నలరునాసంజకృశిమానమయ్యె వరుణ
నీరసంబెత్తి కుపితతబోదురెండు
దళములోగిపంచికొని కంటఁదాల్చినట్లు. 283

గీ. అంధకారంబులప్పుడు బంధురీతు
లమరసైన్యరజోరిధ కారములనలమి
కౌఁగిటనుజేర్చవచ్చిన కరణిసమర
జగతికొయ్యనడిగ్గెను సాంద్రగతుల. 284

గీ. పత్రిఫలముపక్ష పంక్తిసంకోచము
జేసిపొందుపట్లజేరెనొండు
పత్రికులముపక్షిపంక్తి వ్యాకోచంబు
జేసిపొందు పట్లుబాసితరిగె. 285

ఉ. వారకభూరిఘోరశరవర్షభయంబున సర్వకంకసం
చారముకిల్లదూరముగ చన్నతరింగడునొక్క కంక సం
చారమునిర్భయంబుగను సంగరరంగమునందుభీమ వి
స్ఫారితపక్షపాతములు భాసిలఁగ్రుమ్మరెనద్భుతంబుగన్.

చ. క్రమములరంబరస్ఫురవిఘటిత పట్టిసజాతవిస్ఫులిం
గములోగిరాలెనాఁడి మిరకర్దమితాహవమేధినింబ్రతా
వములనువృక్షబీజముల భావిమహోజ్వల సంగరార్థమై
యమితముతొటకుంబటు భటావళివిత్తెమమాత్రసత్యేడన్

ఉ. తమ్ములరేమఁగ్రుంకుటను దత్పృథుబింబపదంబులేకపై
గ్రుమ్మరువీరనవ్యసురకోటుల వేలుపుగన్నియల్ కరా

జ్జమ్ములువట్టినిగ్గి తమసంగతికోలిసపత్నులైన కో
పమ్మునఁ కేలుసంగరము బాటిలనుండశపింతురెంతయున్.

చ. చెలువుగనుల్లలత్తతజసిక్త పటప్రవధిమానహైమికో
జ్జనురథకేతురాజదగె సంగరరంగమహాద్భుతక్రమం
బులు వీనికొంతదవ్వునఁనిపోవక క్రమ్మరవచ్చినిల్చినో
కలహాధరిత్రికింబయినిగా నలసంధ్యయనంగనత్తరిన్. 289

క. అనిశిన్నైనను బవరము
గానకమత్స్యత్రికర్త మనుజేంద్రుల యా
సేనలటఁబోరె నోటమిఁ
జూనకచెదరకయు పిగిపోవకపెలుచన్. 290

వ. వెండియు నొండొరులుద్దండత భండనంబుసేయు
సమయంబున శత్రుశర పరంపరల నికృతమత్తగజ సుప్తికం
బులు సముత్తీర్ణ నరరక్తసిక్తంబగు రణచత్వరంబున రోషకషా
యితలోచనుండగుచు సంవర్త సమవర్తి మూర్తిందసరిత్రికర్త
పతికై వర్తపతిగతి యామత్స్యచక్రవర్తి ముహూర్త మాత్రం
బున నాక్రమింపం బ్రవర్తించి బెట్టుంపకట్టియు నిట్టలంబుగా
తథరథ్యకేతు సారథుల మట్టాడి యతనింబట్టుకొని. 291

గీ. అతులసేనాపయోధి మధ్యమునఁబెలుచ
వీరవరుఁడుసుశర్మ యావిరటుఁబట్టి
యవ్వుకుబెన కేలుగట్టి సాహసముమీర
నరదమునఁబెట్టికొన లజ్జనతఁడుమునిఁగె. 292

క. రాజిటులయుద్ధధరణిం బ
రాజితుఁడై పట్టువడినరహిం ధర్మజుచే
నోజంబవమానసుతుఁడ
య్యాజింబతికోలుకు నన్ననాజ్ఞాపితుఁడై 293

చ. అరదముదోలికొంచుఁ దనకగ్గముగాఁ బఱతెంచు వీరులన్
శరములనొంపుచున్ సమదసామజవాజిశతాంగసంహితుల్
కరమొగిఁ జూర్ణమైవిరియఁగాఁగడు గట్టినుశర్మతోడ సం
గరమొనరించివాని తురగంబులఁ జావఁగమోదెఁజెచ్చెరన్.

క. మదమున నతఁడును బావని
యెదఁ బ్రయ్యఁగ నిశితశరము వేసినవానిఁ
జిదిమిరిపువిల్లువిరుగం
బదిభల్లములేసి యార్చి పవనసుతుండున్. 295

గీ. వానియరదంబుపై నెక్కి వాలువిఱిచి
విరటుబంధముఛేదించి వేగనతనిఁ
గట్టితన తేరుపై నిడఁ గనిరయమునఁ
బఱచెఁదత్సేన ధారుణీ భాగమదురి వ. 296

చ. బెగడినమాత్స్యమూకలకుఁ బ్రీతియొసంగగనానుశర్మనిం
బగగొని కేలుగట్టఁగను బాటవయుద్ధమహీతలంబునం
దొగిఁబటుచాప దండమునఁ నొప్పెడు తద్గుణమేవహించెబో
తగనటుకర్తృకారణ విధంబులు రెండును విస్మయంబుగన్.

గీ. ఆతమంబునుబోలె జన్యమునుదృష్టి
వికచసంకోచనంబులు వెలయనప్డు

డాసుశర్మ విరాటుల కనువుపడ స
మానరూపఫలంబును బూనియొసఁగె. 298

వ. ఇవ్విధంబున విరటువిడిపించి సుశర్మంబట్టుకొని సిం
హానాదంబుసెలంగ వృకోదరుండన్నకడ కేతెంచిన మత్స్య వి
భుండు కంకుంజూచి భవదీయశాసనంబున వలలువలనఁ బగ
ఱకుఁబోవక నేనుగ్రిమ్మరఁగంటిఁ గావున నీయభిమతంబును
మిచ్చెదనని వెండియుకయి దామగ్రంథి తంత్రిపాలుర కలను
శేర్కొనిరెట్టించినఁ బ్రియంబున రోమాంచసమంచితుండగుచు
నాకుంగల సకలధనంబును మీయదియగు నింకేల యేనును
మీపొమ్మగుదు నిట్టిపరిభవంబుదలఁగబెట్టితిరని మహార్మహా
రాలిఁగనంబుసేయ నృపునకుఁ గంకుండిట్లనియె. 299

ఉ. అక్కటవీరుగెల్చుట మహేశ్వర! నీదయపేర్మిగాక నేఁ
డెక్కడనుండివచ్చితిఫు డిట్లనుతింపఁగ లాతురేనినుం
జక్కఁగఁ గొల్చువారికొక సంపదచాలదె వింతమాటలీ
విక్కడఁ బల్కఁగాఁదగునె? యీగతినెమ్మదినుండబోలునె

క. వినుమేమియువలవదు నీ
పెనుపది పదివేలుహూవె పృథివీశ్వర! నే
నినువర మొక్కటివేడెద
ననుమానముమాని కరుణ నదికూర్పవనా. 301

చ. పరహితముఁ యశంబు నరపాలకశాత్రవుఁడంచు నెంచుకన్
గరముసుశర్మనిఁ విడువఁగాఁదగునాకొనఁగంగనర్వ మీ

వరమికనొండుమూటయనువాఁడవె కోరికలిత్తునంటి నా
విరటుఁడువిస్మయంబునను వేమరుసన్నుతిఁజేసెధర్మజున్.

మ. కరుణాశీలుఁడుధర్మనందనుఁడు వేగంబావిరాటావనీ
వరునెయ్యంబుననియ్యకొల్పి పటుదుర్వారై కబంధంబులన్
బరగంబుచ్చినయాత్రికర్త ధరణీపాలుండుసంక్షీణ సో
దరసేనాయుతుఁడై పరాభిముఖుఁడై దవ్వోగినిల్చెంగడున్.

చ. విలులితమస్తకాక్షిసరవిభ్రమమున్ విశదాస్థిదంతమున్
సలలితరక్తసింధుపదశాటియు సక్థ్యండనకేతుదండమును
దళిదరిపుప్రపంచమునుదత్కల హంబుశమాస్పదంబుగా
నిలఁదగుకంకునట్లుగనియె జరమాశ్రమసంప్రదాయముల్.

వ. అప్పుడు కేవలవలలావలోకనలోల కుతూహలంబు నం బొలుచు పోలిక బలశాసన దిగ్వలసితుండైన కలువలరేని వలన వెలువడు చలివెలుఁగులు మదకరటి ఘటావిషాణాంకణ ప్రతిఫలన సతగుణిత ధవళవీచీచయంబుల నీనుచుండఁ బరిని పతితగజవాజిభటకబంధరథసంధుల నొయ్యననిరకటంబువెడలి విరటుసేనలుమరలి మున్ను పసిచన్నతిన్నని యిసుకనెనఁగు త్రోవఁబట్టి యర్ధక్రోశమాత్రం బేతెంచి పోటుల నాటుల నొచ్చుట కతన నవశిష్టరాత్రం బచ్చుట వెడలింపు తలంపున విడిసి కూరుకులవీఁగు కనురెప్పలఁ గూడుకొను కలనిదువ్వలు నిద్రాముద్రకు సహాయంబుగా నుచితక్రమంబున సుప్త్యాసక్తులై వాహనాదికంబుల తగునట్లు పొందుపఱచి శయనించిరంత.

ఉ. ఆదినమట్లుపోయినయనంతరమా మరునాఁడువేగ సూ
ర్యోదయవేళభీష్మముఖయోధులతోఁ బలయుక్తుఁడై యసు
ర్యాదనుధార్తరాష్ట్రుఁడువిరాటుపసిన్ మరియుంగ్రహింపసం
పాదితకౌతుకంబలర మాత్స్యపురోత్తరసీమకుం జనెన్.

గీ. ధార్తరాష్ట్రునిప్రజలెల్ల దవ్వునడచి
దైవమున మేనులాయాసపడి విరాటు
గొల్లపల్లియ చెంగట మెల్లవిడిసె
తద్భృతామోదమరికట్ల దవిలినట్లు. 307

క. ప్రల్లదుఁడగు నృపువెనుకొని
క్రొల్లకుజనుదెంచినట్టి కూటువమూకల్
వల్లవగృహములఁబడి తమ
యుల్లములారంగఁబాడి యూటిరికోర్కెన్. 308

గీ. దండముల యోధులుంబశు తతులరొప్ప
బిదుకమిగిలి పాలచేబొదుగువట్టి
గోవులంభారవంబుల ఘోషభూమి
ఘోషమొనరింపఁ బెగడిరి గోపకులును 309

చ. భ్రమగొనిసందుగొందులనుబల్మరుగ్రుమ్మరువల్లవాంగనా
సుమహితమైన చారుకుచశోభఁగనుంగొని మాటిమాటికిం
భ్రమసి నిషాదలోకము శుభప్రథిమాన మదేభకుంభదే
శముల కరాంకుశంబులొగి జారఁగవైచిరి పూనిరొయ్యనన్

చ. దలముగనప్పురంబునకు దక్షిణపార్శ్వమునందుఁబుట్టియా
వలలునిపేరి వెజ్జుకరవైఖరిచే శమమొంది క్రమ్మరం

గలిగె సదుత్తరంబు ననుగౌరవబాధ జవంబుతోఁడుతన్
బలువగు పక్షపాతమను భంగిని నాళ్ళులు సంచరింపఁగన్
ఉ. క్రేవులుగూడ మాపసుల కృత్రిములై కొని మీఁదిమిక్కిలిన్
బాపమునూఁడుడాక దుపుబాయక రొప్పెడటంచు వీరల
య్యోపసిగాపుగొల్లలను యోధన ? యిట్లుకశాభిఘాతముల్
జూపుచుఁద్రొబ్బఁజూచిరనుచున్ రొదజేసిరి పెల్లువల్లవుల్
గీ. అపుడుపసిగాక యున్న యాయలఁతిమూఁక
లడ్డపడ సడ్డసేయక నదిమి మోది
కౌరవులు మత్స్య నరపతికదుపు నెల్ల
నాక్రమించి ప్రియంబున నరుగుచుండ 313
చ. తడయక నిట్లుబుట్టిన విధంబె[illegible]పఁగ నొక్కగొల్లఁడ
య్యెదఁ బఱతెంచి వేగధరణీశ్వ[illegible]నందనుఁడు త్తరుండునుం
డెడునగ రొప్పసొచ్చి యతనిఁగని చెప్పనెలుంగురామిచే
నుడవరిమెట్టకేలకుబో మంగు[illegible]ల్కెను ద్రొబ్రుపాటునన్
సీ. దేవరకౌరవుల్ గోవుల మనవా[illegible]
వుడాదరించి తారేఁగుచుండ
మీరశక్తులవోలె మిన్నకయుండుట మే
రయే పగదుల మీఁదనురికి
భవదీయభుజము బలిమి సూపఁగ ని
దితరియయ్యెఁ బరులకుఁ దాల్పరాని
యశము జెందుము సమరాంగణంబుల వే
గఁగట్టాయితము గమ్ముకదనమునకు

గీ. కంకటంబుఁదాల్చి కై దువుల్ చేకొను
మరదమెత్కు లేక యాత్మజాత
నీఁకను వీరమాతలకు శిరోరత్న త్తము
గానొనర్పుమయ్య గౌరవమున. 315

క. నినుఁగై కకాన్పులోపల
ననుపమబలుఁడనుచు విరటుడనుటకు నదినే
దనవుగనిక్కముగా నీ
పనియెనఁగందిర్పవయ్య బాహుబలమునన్. 316

గీ. ఇపుడునీయీయాడుదొరబిడ్డవేమిఁజెప్ప
వచ్చినారదె సురభుల హెచ్చిపట్ట
నకట నీవింటవినుచుండ నగడుగాదె
లెమ్ము శెమ్మిటజాగున సొమ్ము లేదు. 317

వ. అని మరియు ననేకవిధంబులఁ గైవాగంబు సేసిన

ఆ. వె. ఆడువారిలోన నంకించితన్నిట్లు
పొగడ రెండునాల్గు భుజములగుచు
నోడలునుబ్బి మోము వెడవెడవిచ్చుచు
చిత్తమలరియుప్పు డుత్తరుండు. 319

చ. తెరవలసన్నిధానమున ధీరతయొప్పఁగగోటమెల్ల నే
మురిమురిమీసముల్ గిరిపి మోదముచేనుపధానపాళిపై
నొరిగివిలాసవై ఖరులయొప్పిదముల్ తలమున్కగాఁగమై
మరచియుఁబల్కెనంతిపురిమాత్రము ధీరుఁడతండుసయ్యెఁరన్.

చ. కలిగెనునాకు నేఁడొకొకకయ్యము భాగ్యవశంబుచేఁ బురిం
దెలియుదునన్నుఁబోలనగుధీరుఁడు సారథిగల్గునేని గో
వులపనియంతచిచ్చు బరిపుట్టఁగఁ గౌరవసేనకెల్ల చే
కొలఁదులెఱుంగఁజూపి యిదిగోకురమయ నిమేషమాత్రలోన్.

క. రథికునకుఁ జొక్కమగు సా
రథిదొరకినఁ గలసజయముراదే మదిలోఁ
బ్రథనముగని బెగడెడు సా
రథిగొనిచనుఁరథికునకును రణజయమగునే ? 322

గీ. సూతకృత్యముఁజేయుచు సొరిదిరణముఁ
నలుపఁజాలుదుశత్రులనరకుగొనక ములనుచు
నొక్కఁపుయిలోట మదియందునున్న కతన
వలయునంచు విచారింప వలనెనాకు. 323

ఉ. కావునసస్మదీయభుజగర్వము సూపఁగఁగోరియున్న నా
కేవిధినైన నిప్పుడొకఁడిమ్మగుసూతుఁడుగల్గ ధార్తరా
ష్ట్రావలిసూచిభీతిమెయి నారవపాండవుఁడంచు దిక్కులన్
వావిరిఁబారఁజేయుదునవశ్యముగా సమరాంగణంబునన్.

వ. ఇట్లు బల్కు నతని వచనంబాకర్ణించిపాంచాలియిం
చుక నగవునరయంబున నరిగి తద్వృత్తాంతంబు బృహన్నలకె
ఱింగించిన నతండునువేగంజని నృపనందనుంకుతన్ను సూతకృ
త్యంబునకుఁ గైకొనునట్లుచేయుమనిపించిననట్లకాకనియయాడి
సనుదెంచి యుత్తరుంను వినునట్లుగా నచ్చటి కాంతా జనంబు
తో నిట్లనియె. 325

గీ. అకయరే ! యీబృహన్నల యర్జునుఁడు
ఖాండవంబేర్చుతిరి నిట్టికార్యమునకు
బూని గెలిపించెనీపనిఁ బూనునేని
యుత్తరునకు నొసంగఁడే యోజజయము 326

క. ఆమాటవిని నృపాత్మజుఁ
డేమో! సైరంధ్రి షండుఁడీ పని దీర్పం
గా మరిజాలునె యాతని
మోమేగనఁజాల జయముపొసఁగుఁటయెట్లో. 327

వ. అనిపలికి. 328

చ. ఇఁక నిటువంటిసంకటము లెన్నఁగ గర్జముబోలదూదిరో
నొకఁడరయంగలేఁడుకురుయోధుఁడవ్వసవంగఁచిమ్మలంపె
వికలము సర్వయత్నమును వేగమెతోడ్కొనిదెమ్మటంచుఁగొ
తుకమున నుత్తరంజ నవుతోడుతనంపె నొకండు లేమిచేకె

గీ. ఇట్లు బంచిన నాచెల్వయేగినరునిఁ
గాంచి తద్విధ మెల్లను శ్రమముతోడఁ
దెలిపి యన్నకుఁ దగసారథిత్వమున
తగిన మానిసి లేఁడని తరుణిఁబలికె. 330

సీ. వినుమేనునీకుఁ గూర్చినదానవని
నన్నుఁబంచెనీకడకొరుఁబంచ కిపుడు
కూరిమినామాటగురువర్యపాయక
కృత్యంబుఁగై కొనుకృపదలిర్ప

సై రంధ్రిసెప్పెనీజాడయిమ్మెయినొంటు
తెరఁగునఁదప్పింపఁ దీరబోవ
దనుచునిర్బంధింపనతఁడెన్ని భంగుల
నొడఁబడమియుఁజూపియుచితమెఱిఁగి

గీ. సమ్మతించి యుత్సాహంబునెమ్మనమున
నిగుడిబవరంబువేడుక నిండియుండఁ
దనదుసమయాబ్ధ గతివోలెదాఁచివచ్చి
నిలుచుఫల్గునుగనిపల్కె నృపసుతుఁడు. 331

క. రారమ్ము రథముబన్నుము
సారముసై రంధ్రిసెప్పె సకలమునింకన్
వారకనర్జునుఁబోలిన
ీరమకాయేమునీకు వంచనయేలా. 332

వ. అని పలికి రథరథ్యకేతుతను త్రాణ బాణబాణాస నంబులు లోనగు వలయు సాధనంబులు దెప్పించి ముందటం బెట్టించి. 333

చ. అనువగునాటపాటపనులా! ననుఁబూనుమనంగ మీకుమా
రనఁదగదేమిసెప్పిననటంచును మెత్తనసమ్మతించెఁగా
దనికడఁదప్పఁ దొ్రిచికొనఁడయ్యెను కవ్వడి కాదు కూడదం
చును వచియింపవేఁకనిఁజూచునొయీపనికంచుశంకచేఁ

చ. తొలుతసురేంద్రినందనుఁడుతోయజలోచనలజ్ఞనగింపఁగా
దలఁచిబృహన్నలంగనఁగదాయను నుత్తరుఁడామెతంగరం

బలమికొనంగనబ్బురము నై వెలిలోవెలిగాఁగ జోడుమైఁ
దలనొరగం గిరీటమునుదాల్చెను నేరనిభంగిన త్తరిక్. 335

క. కంకటముబొమిడికంబును
వంకరలొనట్లుమీను వాసవికవుడుం
బొంకమున నృపకుమారుఁడు
సంకోచముమాని మేన సవరణఁజేసెక్. 336

చ. పదపడికిరీటి తేరొనరఁబన్నిమృగాదన కేతనంబొగిం
గుదిరిచికై దువుల్ నిలిపి గుఱ్ఱములక్ నెలవొప్పఁబూన్చితాఁ
బదిలముమీరఁగా నొగలపై నొరపై నడలించిప్రగ్గముల్
ముదమునఁబుట్టనంతనృపముఖ్యుడుతద్రథమెక్కెఁజెచ్చరక్

క. పేడితనంబున సారధి
పోడిమియుంగాంచి తేజమునగవ్వడితా
వేడుకలియ్యెడ గుంపులు
గూడితనుంజూచుశత్రు కోటికినెల్లక్. 338

గీ. శూలితామరచూలినిఁ బోలెరాజ
తనయుఁడాతనిసూతుఁగాఁ, గొనియుమదిని
దలఁచెఁబగతుర నవ్వింతుఁ వొలుతఁబిదప
ఖేదములఁజెందిపోవఁగా గెలుతునను చు. 339

క. మాలినితాదృశుఁడగుపతి
యాలముతమకంబుఁగాంచి యాత్మదలంచెక్
వాలాయమంతయూకచ
జాలమునిర్మూలమగునసంశయమనుచుక్. 340

ఉ. ధర్మముమీఱజాలక పృథాసుతులేవురు మీరకున్ననా
ధార్మికులైనకౌరవులు తత్ప్రతివస్త్రమునూడ్చిరట్ల నీ
ధర్మముమీఱఁజాలక పృథాయనితెల్పినవారిచీరలీ
వర్మిలిబొమ్మపాత్తియలకన్న దయంగొనితెమ్ము నాకొగిన్.

క. అని యుత్తరపలికిన నగి
ధనంజయుండిటులఁబలుకు ధరణీశసుతుం
డనినల పగతురఁ గెలిచిన
వనితా నేనైనఁదెత్తు వలసినచీరల్. 342

వ. అంత. 343

సీ. అమృతానయన వినిర్యత్ఖగేశ్వరునకు
మహితమహావినతసుమంగళంబు
దైతేయహరణ తత్పరపురందరునకు
మాన్యమానదితిసు మంగళంబు
వనవాసయత్న ధూర్వహరఘూద్వహునకు
మలయుకౌసల్య సుమంగళంబు
ఖాండవదాహక క్రమపాండుసుతునకు
మరియు బృహన్నలమంగళంబు

గీ. నెట్టిదట్టిదయగు నీకుఁబట్టియనుచు
సేసబొట్టిడివేల్పుల జేర్చిమొక్కి
వెలయరక్షింపుమని బృహన్నలనుబలికి
వేగఁగై కేయి వారలవీడుకొలిపె. 344

వ. తత్క్షణంబ యతాయాత నరభ నరాజలేఖ

వాహముఖ్రశుతవృకోదర భుజావలేప వృత్తాంత మోదమాన నూదకులంబును, వీరపత్నియు వీరమాతయు నన నీకు నొక్క టఁబ్రసిద్ధంబుగాఁదగుసూతిమానవానరంబదినమకూడెననిసుదే ష్ణంబేర్కొని పొగడు ముదుసలిమైదువుల కలకలంబును, మస్తకన్యస్త హస్తలగుచు సమస్తవల్లవ పల్లవాధరులు వేఁడున భయ యాచనావచనంబులకుఁ బ్రతిశబ్ద దానదక్షంబులగు గవాక్షంబులయందు నుపలక్షించి కుమార ప్రయాణమాత్ర పరిహార్యమాణ శతాంతఃపుర వధూజనంబులవలన నముద్భిన్న సన్నవ విలాపంబునుం గలిగి యప్పురంబొప్పె నంత. 345

ఉ. మంగళలాజలక్షతలుఁమానినులోలి సమంచితప్రఖో
త్తుంగరథస్థుఁడై జయరతుండుగు నుత్తరుమీఁదఁజల్లి యు
ప్పొంగుచుమాల్యమారివులపుట్టములంగొననిచ్చినట్లు నం
తంగడుదీవనల్ బహువిధంబులనిచ్చిరి మోదమొప్పగన్.

గీ. కరితురంగరథ నికాయయోధాదిక
వివిధగతులచేతవెలయు చిత్ర
కుడ్యమహిమఁజూచికొనుచు పోటానమే
తంబుగాఁ బురంబతండువెడలె. 347

సీ. అత్తరిపక్షిణా శాంకణోదయమాన
పవమానములు శుభాస్పదములగుచు
బృందారకవిముక్తమందార సుమవర్ష
మందాయమైక ధూమ్రపగంధ

మగుభీమకచబంధ మాగ్రహణమొనరించి
మారాత్రియతని జయంబుఁదెలుపు
పోల్కెఁ ధనంజయ భూమింజయుల సమీ
పంబున మెల్లనఁ బరిఢవిల్లి

గీ. నీరణంబున స్వపితుతావైరి నృపుల
కతమున స్వజాతి వర్గంబు గలుగునంచు
సంతసంబున నాట్యంబు సలుపుకరణి
నాడెనెంతయు వారిశతాంగశాటి. 348

గీ. వెదురు మలపోలెఁ గుంతముల్ వెలయనినుప
నెడలడచురీతి దడములు నడచురిపులఁ
బరగ దవ్వులఁగని మోముపల్లటిల్లె
నుల్లమునుదల్లడిల్లె నయ్యుత్తరునకు. 349

గీ. వాహినుల పొంగుఁగని మత్స్యవల్లభుండు
చటులగతిమెను జళిపించు సరణిఁగాంచు
వాహినుల పొంగుఁగని మత్స్యవల్లభుండు
చటులగతిమెను జళిపించు సరణిఁగాంచు 350

చ. తెఱవలకొల్వుకూటములఁయూర్చినబొమ్మలపోరుఁజూచియు
తెఱఁగునవచ్చి యచ్చటనుదీర్ణచమూస్థితిఁగాంచదాని క
త్తఱిభయమంత రంగమునఁ దద్దయునశ్రుకణాళికన్నులన్
మఱపుమతిన్ వడంకు నలమందగ దేహమునందునెంతయున్

చ. కురువవిభూతి కంఠమునకుందగవాతెఱ యెండగన్నులం
బరగను బాష్పవృష్టి చెవిఁబాయకయొప్పెనుధార్తరాష్ట్రిబం

ఘురతరనాదముల్ మనముదూగధసంజయ సేవకంగముల్
కరమువడంకనుత్తరునిఁగాంచెనొగిన్ బుతుషట్కమీగతిన్

గీ. చకితుఁడై యిటులా ధనంజయునిఁ జూచి
నుడివెనాతఁడు పెదవులు దడిపికొనుచు
మలుపుమలుపుము నీవిఁక మనరథంబు
నిలుపునిలుపుము మనప్రాణముల నటంచు. 353

క. కడిఁది యని మదినిఁదోఁచిన
నడతునె యీపనికి వెట్టినాకనుఁ గొనుమా
కడుగంపసిడియె గాలము
సిడినూకౌరవదళంబు చింతింపంగన్ 354

ఉ. ఒక్కఁడు వింటికిన్ గురుఁడునొక్కఁడుచావొగిలేనివాఁడువే
ఱొక్కఁడు భార్గవుంగెలువ నోపినవాఁడొకరుండునాజిలోఁ
జిక్కఁడు జామదగ్న్యునకు శిష్యుఁడొకండుదలంపసేనలోఁ
దక్కినవారులోకముల దర్పముచేగెలువన్ సమర్థులున్.

క. పడుచుపనిగాదెనే నె
క్కడ వారెక్కడతలంపఁగా నీకైనన్
బొడమదె యాలోచనమిది
దుడుకుపనుల్ తగవు రథము దోలుముపురికిన్. 356

క. అనవుడు వినువిసములుగాఁ
గొనికవ్వడినగవునిగుడుకొనుమొగమున వే
ఱొనరఁగ సేనలదెసకై
చనవిచ్చినను త్తరుండఁ సహ్యముతోడన్. 357

చ. చిలుకకుఁజెప్పినట్లు తగఁజెప్పిన వీనులబెట్టవక్కటా
పలుకక తేరుదోలెదను బాశియె నేపసిపాపనేమి లోఁ
దలఁచితో? కౌరవావళికిఁదర్దయునివ్వఁడు గోరువెట్టఁగా
నెలకొనె నీమనంబుతుదినిందలకోర్చెదవో బృహన్నలా!

వ. అనికినిసి భయసంభ్రమంబులు బెనంగ నరదంబువలన డిగ్గనురికిపఱచు నయ్యుత్తరుంగని కటకటంబడి కవ్వడి పగ్గంబులు నొగలముడిచి యతనితోఁ దనపశ్చాద్గమనంబున శతపదపరిమాణ ధరణితలంబున భూమింజయుంబట్టుకొని తెచ్చి స్యందనంబునంబెట్టిన నయ్యెడ పురాతనఛిద్రింబునుంబోలె వివర్ణుండై జీవచ్ఛవంబునుంబోలెఁ బ్రాణమాత్రావశిష్టుండై కొంతవడువునకు దీనవదనుండగుచు హీనస్వరంబునఁ బాండవమధ్యమునకు వెండియునిట్లనియె. 359

ఉ. ఏమిమనంబునందలఁచితీవుబృహన్నల! యక్కటా! కురు
గ్రామణిసేనకన్నులకగణ్యముతేరుమరల్పునాకసం
గ్రామమువిూఁదికోరికలికంగడుఁజాలెడునిల్లుజేర్పు మెం
తోముదమందుచుంబ్రదుకుదుంగడవందగునాయువొందగన్

గీ. చెనఁటినై నిన్ను సూతుగాఁగొనిన నాదు
తప్పుసైరింపు కలసైనఁ దలఁపసిట్లు
ప్రజలలోఁగూర్పునాకు నాబ్రహ్మయొసఁగు
నాయువాకాదు నీవిచ్చు నాయువగును. 361

ఉ. గోవులువోయినఁ జారిపులు గొల్లలుమోదిన గొల్లపల్లియల్
లావరికాలినన్ మదిఁదలంపఁగదానినువేడెదన్ నను౦

బోవఁగనిమ్ము ధాత్రిఁదలపోయఁగఁ బ్రాణముకంటెఁదీపిలే
దేవరణీయమూర్తిగదేయను ధానమొసంగనీమెడఁజా. 362

ఉ. ఇమ్మెయినెద్దెసంగనిన నేమనిచెప్పుదునాదుకోర్కి మా
యమ్మమొగంబ మాటికిటనట్లదె! కన్నులఁగట్టినట్లు దా
నిమ్మగునామెచెంతఁకిపుడీవుననుంగొని చిన్నతల్లి స
త్యమ్ముగబోక్కసానఁగలయర్థి నీకభిషేచనంబిడున్ 363

గీ. చిత్రయుద్ధముఁగని చలచిత్తమొంది
మోసపోయితినెఱుఁగక మొనయువలదు
శంఖకాహాళభేరికా చటులసింహ
నాదములు వాజిగజసమున్నాదమిట్లు. 364

క. ధారుణివిడిచిరథంబే
తీరున నేనధివసించితిని నుత్ప్రాణం
బారీతిహృదయదేశము
గౌరవమొగివదలి కంఠగతమయ్యెఁజుమీ. 365

వ. అని యిట్లు పలుఁదెఱంగుల దీనాలాపంబులఁ బల
వింపుచు పాదంబులంబడిన మేదినీ నాయక కుమారుని వెన్ను
కరంబున జఱచి వెఱపుదీర్చుచు హాసమంజుల వదనకంజుఁడై
యిట్లనియె. 366

గీ. ఓమహాధైర్య! విరటునకాదయమయ్యు
నిట్టి పిఱికితనంబు నీకెట్లుగలిగె
పగఱమార్కొనివేడుక మిగులఁబోర
నీడిదిమొగాక ముదిసిన గూడదయ్యు. 367

క. సారథినే గతభయుఁడను
గారథికుఁడ వీవుపగరఁగని బెగడెదు హా
స్తారూఢమత్స్యకేకయ
ధారుణులభరంబులెల్లు దాల్చెదొ యింకన్. 368

ఉ. మున్నుటపోటుబంటతనముల్ ప్రకటించితి వింటనింతలో
నున్నతిఁ దక్కఁ గయ్యమున కోపఁగఁ జాలక పారఁజూచినన్
మిన్నకనీదుకంపమును మీఁ యగు నొజ్జలు గ్రేణి సేయునీ
క్రొన్ననబొండ్లచన్గవలగూడిన వలనరీతికియ్యెడన్. 369

మ. త్తము మీరు శాత్రావచమూసముదాయము గెల్చి తెచ్చెఁదా
చిత్తము మెచ్చబొమ్మలకుఁ జీరలనుత్తరుఁడంచుబోంట్లతో
నుత్తరమిచ్చెను త్తరగుణోత్తర యిత్తటి దానికిచ్చిన
య్యుత్తరమెత్తెఱంగనుచు నుత్తరతత్తరమేది చెప్పుమా 370

చ. కనఁగను నీదుతండ్రి బహుకాలము మానిసిపెద్దవాఁడు దు
ర్మనమునఁ జచ్చిరొక్క మొగిమామలు నూర్వురుతోడబుట్టువుల్
గనఁగనిరర్థులింకిట నొకండవు నీవు ప్రయోజకుండవ
య్యు మరణభీతిచే నొదుగనుర్విపశంబున నుండనేర్చునే 371

గీ. కావునను శంకఁదక్కుము కార్ముకంబు
కరమున నుబూను బూనుము కౌరవాళి
తృణముగా నీదుమత్స్య పతిత్వమెల్ల
వాహినీముఖములఁ జూపువల్గనముల. 372

వ. అనియిట్లతఁడు బల్కుచు పితృవననికట శమీసమీ
మీపంబున రథంబునిలిపి కిరీటి కిరీటశంఖచాపతూణీరాది సాధ

నంబులు గైకొని విజయ లక్ష్మీపరిణయయోగ్యత్వంబు సంపా
దింప ఖండితషండ వేషుండగుచుఁ దలంచి వైరాటికిట్లనియె. 373

ఉ. పాండవులిమ్మహీనగముపైఁ దమకైదువు కట్టయుంచి భూ
మండలి గూఢ చర్యకుఁ గ్రమంబున నేగిన వారలిప్పుడీ
భండన కేళికిందగుసుపర్వులనైన జయింపఁజాలుకో
దండశరాదిశస్త్రములు దద్దయుఁగైకొని తెమ్ము లెమ్మిటన్

క. అనుమ త్తరుఁడట్లనయా
ఘనవృక్షారోహణంబు గావించియుఁ ద
ద్ఘనతరకుణపావృతమై
తనరెడు సస్త్రతతిగని వితాకుండగుచున్ 375

చ. వెఱచుచుఁగన్నుమూయుచు నువిచ్చుచు నబ్బలభేదిసూతిక
త్తఱిననునోమహామహా! మదంబున నిట్టిది సెప్పఁబాడియే
చిఱుతఁడ రాచబిడ్డఁడను, జెల్లునె పీనుగునంటనక్కటా
యెఱిఁగియు దీనిఁజేయుమని యెట్టులనాడితివీవు నావుడున్

ఉ. రాజకుమార! నిన్నుఁజొరరాని ప్రయోజనమైనఁబంపనిం
దేజనులైనడాయమికి నిట్టియుపాయము సేఁతగాని వి
భ్రాజిత తేజ! దాపరము బన్నఁగనేటికి నింకు నీకు నే
నే జయమెట్టిజన్యధరణిం గొను తద్విజయాభిధానుఁడున్.

క. ఆయెడఁ దానర్జునుఁడను
నూ! యనుతద్వచనమధిపసుతునకువరుసన్
సోయగమునఁదగుకర్ణర
సాయనమైనందియంబు సవరించెమదిన్. 378

వ. అప్పు డుత్తరుండు కవ్వడింగని నీవర్జునుండవగు దేని యమ్మహాత్మునకుఁ బది నామంబులుగల వవి దెలుపు మనిన నగుచు నతండట్లకాకయని యర్జున, ఫల్గున, పార్థ, కిరీటి, శ్వేతవాహ, బీభత్స, విజయ, జిష్ణు, సవ్యసాచి, ధనంజయులను పేళ్ళను గ్రమంబునఁ దన్నామనిమిత్తంబులను ధర్మరాజాదులయునికియు భీమసేనుండు గంధర్వవ్యాజంబున సూతజులఁజంపుటయును తేటపఱచిన సంతసిల్లి కైదువులకట్ట సడలించిన నందు మహోరగంబుక్రియనున్న యాయుధంబులఁ గని వెఱచిపొదిగిపట్టి వైరాటి కిరీటికిట్లనియె. 379

క. పెనుబాములు కైదువులని
ననువంచిం చెదవదేలనావుడు నరుఁడో
యనఘా! యితరుల కట్లుం
గనుపించునుగాని పన్నగములవియగునే? 380

వ. అని వెఱపుదీర్చి యయ్యస్త్రశస్త్రంబులు క్రమంబునం దెలిపి గాండీవాది సాధనంబులు గొని యక్కట్టుతోంటి తెరంగుననలవరించి రమ్మను డతండట్లుచేసి వృత్తావతరణం బొనర్చి క్రీడికిఁ బ్రణతుండై నిన్నెఱుంగమి నాసేయుతప్పు సైపుమని వేడుకొనిన సుస్మితవదనుండగుచు బాలుని గాఢాలింగనంబునఁ గారవించెనంతఁ గిరీటి దేవదత్త కపిధ్వజంబులు నభంబువలన నాసన్నంబులైనఁ బరిగ్రహించి సన్నద్ధుండై యాఖండలనందనుండు భూమింజయుని సారథికృత్యంబునకు నియమించి కౌరవచమూసమ్ముఖంబుగాఁ దోలించునాలోన.

సీ. సిడములు పుడమిపైఁ బడియెను మిన్నుక
ఖండంబులను నిప్పుకలుదొలఁగె
కడునుత్తమాశ్వముల్ కన్నీరునించెఁజ
మూముఖంబునఁ గరుల్ ముగ్గదొడఁగె
దముతామతూర్య సంతతి యుపధ్వనులిచ్చె
సూర్యునిఁ గ్రమ్మెర జోవ్రజమ్ము
పిడుగులువడె నక్కలడలె యోధాదుల
యుష్ణీషములు నేల నొరిగెనిట్లు
గీ. దుర్నిమిత్తంబు లీక్షించి ద్రోణుఁడపుడు
సేనలకునెల్ల ధైర్యంబు జేసికొనుచు
నర్జునుఁడు వచ్చుటకు సమయాబ్దభంగ
భయముగ దురగ భీష్మునిఁ బలికెఁజేరి 382

ఉ. వీఁడతిసాహసుండొకఁడు వీరిఁడిమోవివరింపఁడేమియు
క్కాడునువచ్చెమీఁదెదురుగానడుగ్రేఁగుదలంపడేమియున్
వాఁడిమిసూపఁగా నెదిరివారినిఁ దన్నునెఱుంగఁబోలఁడీ
వేఁడిమినేమిగాఁగలఁడొ? వెక్కసమానడకందలంపఁగన్ 383

వ. అనిన గాంగేయుండు తద్గాఢ వచనంబు దెలిసి గురుండు ఫల్గునకు సమయ లంఘనంబగునని సంశయించెనని విచారించి యజ్ఞాతవత్సరంబతిక్రమించుట తెలిసినవాఁడు గావున నాచార్యుసందియంబువాయమరుగువడ సుయోధనుండు విననిట్లనియె.

క. నడచితిమిగాదె మనమె
క్కుడుదవ్వగ నింకవింతకును బనిలేదె
వ్వఁడు వచ్చునేమి మాగ్గొని
పోఁడుచుటయుం గోగణంబు పోదవుటమొప్పన్ 385

క. అనితెలియనాడసంతస
మున వదనము వింతకాంతి మునుకుఁ గొనఁగన
య్యనఘుండెల్ల జనంబులు
వినఁబేరెలుఁగెత్తిపలికె విదితముగాఁగన్. 386

మ. సురరాట్ఖాండవ దాహకుండఖిల రక్షోవ్రాతజీమూతదు
ర్ధరఝంఝానిలుఁడభ్ర మత్స్య దళనాత్తద్రౌపదీకుండుశం
కరశీర్షాప్రతికల్పితక్షతుఁడు సంగ్రామార్థ చేష్టఁడెసు
స్థిరుఁడై పాండుకుమారమధ్యముఁడువచ్చెన్ ఘోరసింహాకృతిన్.

క. నరుఁడరదంబునవై శ్యా
నరుడాయుధములను గేతనంబునఁబటువా
నరుఁడును భీషణవృత్తిం
గరమటుచ్చిచ్చువచ్చు క్రమమునఁ గదిసెన్, 388

వ. పెద్దకాలంబు రణంబు లేమింజేసి నిజయశంబు లెసవోయి దైవవశంబున నేఁడుగల్గెనెట్టిది పుట్టునోయని గురుం డునరునగ్గించిన సహింపక కర్ణుండిట్లనియె. 389

క. బలభేదిసుతుఁడటంచును
బలుమారుం గ్రుచ్చిగ్రుచ్చి పలికెదవిపుడ

బ్బలియుండును నీవును మము
గలుగానఁగలాఁడఁగలరు గాంభోలుఁజుమీ. 390

గీ. పాండవేయపక్షపాత మింతియుకాక
పోటుమాచికాదె పొగడనెందు
నర్జునుఁడగునేమి ? పర్జన్యుఁడగునేమి
మచ్ఛరాహతులను మదమడంతు. 391

చ. అనినసుయోధనుండతనికయ్యెడనిట్లనుగర్ణ! యింతకుం
బనిగలదే ? కిరీటియగుపట్టుననాతని రూపెఱింగిమీ
కును సమయాబ్ధభంగమదిగో వనికింకనహాదరుండవై
చనుమనిచూపిచెప్పటకు సంగరమేటికి గోవులేటికిన్. 392

గీ. అనినఁ గృపగురునందనులాదియైన
పాండవేయహితుల్ రాజుపలుకుమేలు
మేలటంచును హాసంబుమీరననిరి
గురుఁడుగ్రమ్మరఁగురు భూమివరునకనియె. 393

చ. గొదకొనియాలకుం గవియుఁ గోర్వులిచాడ్పునఁ ద్రోక
ద్రొక్కుచో
నదరినపాపజేనివలె నాకలినేనుగుపిండుకడ్డమై
పొదవెడుసింగమట్లగడుఁ బూనికవచ్చెను వీఁడుమూకలన్
జెదరఁగనీక వీకమొననేయువిచారముజూడముందరన్. 394

క. రిత్తవివాదముచేఁ బని
హత్తునె ? బీరములుగల్గినట్టి రథికులన్.

మొత్తముగ మోహరింపఁగ
నిత్తఱినొనరింపు కార్యమిదియని మఱియున్. 395

వ. కృపాశ్వత్థామాదియోధుల నవలోకించి దుర్నిమి
త్తంబులగుచున్నవి గెలుపనుమానంబుగాఁ దోఁచుచున్నయ
ది గావున శత్రుభీంచుముట్టిన సమయంబున మొగమొగంబులు
జూచికొన బనిగలదె ముందరరాజుంబుచ్చి యతనివిఱుంద గో
వుల రొప్పనియమించి వెనకగట్టి మొనతెఱపియిడక నడవ వల
యు నిట్లైన సందడింబడక పసులంగడపికొని చననేర్తుము. మీ
కిదిబోలునేని విచారింపుండని సుయోధనుండిట్లనియె. 396

సీ. మునుసెప్పితిమిగాదె యనుమానమేటికి?
నర్జునుండగునేని యడవికేఁగఁ
గలవాఁడుగాఁడేని బలియుఁడెవ్వండేని
ప్రాణంబులిచట నప్పనముసేయు
విరటుపాలనుబొండ వేయులుండుటనిశ్చ
యించివచ్చుటకింత యెన్ననేల
ఘనమోహముననొలేక నుపమలోభంబు
వలననొయిప్పుడు వచ్చుటకును.
గీ. దీననెక్కువతక్కువల్ దీర్చభీష్ము
లగుదురర్జునుఁగాండీవి యయ్యెనేని
కార్యమీఁడేరెనిందు కాచార్యుఁడింత
పూని వందితెఱంగునఁ బొగడవలెనె? 397

క. ఆచార్యులెపుడు కార్యా
లోచనమది దూరముగవిలోకింతురుగా
లేచినబవరపుఁ దెరఁగులు
సూచింపుడనంగమనది సూతప్పరయన్. 398

చ. అనయముబుద్ధిమంతులగృహంబులనిష్టములైనయన్నముల్
గొనుసమయంబులన్నృపులకొల్వులనీతులచెప్పసంగతిన్
మనమలరంబ్రసంగమగు మాటలుపొందికఁజెప్పవారుగా
కనుకదనంబువార్తలమగన్ వివరింపుటలెట్లువారికిన్. 399

గీ. కడిఁదిపోట్లాడఁ గలవారుగారువారు
గలయకపిరుంద నిలిపినగౌరవమున
ధృతిగెలువుడనియాశీర్వదింపలెస్స
అనినఁగురునందనుఁడు సుయోధనునకనియె. 400

ఉ. గొల్లలఁబారదోలిపసిఁగొంటినటంచు మదిందలంచికా
యుల్లసమాడెదిట్లు బలియుండవె యెక్కటినిట్లువచ్చునీ
బల్లిదునోర్చికాక యొకపట్టుననింటికిఁబోవుచూడ నేఁ
డెల్లవిధంబులం గురుకులేశ్వర మిన్నకపోవువాఁడవే. 401

క. జూదవుసిరినిక్కంబని
కాదేనీతలఁపదేల ? కానేర్చుమనీ
జోదుచెయితప్పిచనఁగా
మీఁదనుతలతవిడికొనుము మేదినినాథా. 402

ఉ. అర్జునుఁడా సురేశ్వరునకైనఁనజేయుఁడువీడుపోరికి
ట్లార్జవలీలనొప్పినన్నృపా ! యిటుజొత్తుమొరిత్తమాటలన్

గర్జనుఁ డేదు గోసమితిఁ గె కొనమాత్స్యుఁడు వచ్చె నేనిహా
స్ఫూర్జితవిక్రమంబలర నాహవకేళికిఁ జొత్తు మిమ్మొయిన్. 403

గీ. పాండవులనాజిఁ గెలిచిన బాహుబలము
కతనఁ గద నీవు ద్రుపదభూకాంతసుతను
సభకుఁ దెచ్చుట సౌబలువిభవ మట్ల
నాతఁ డీవచ్చువీరుని నాపుఁగాక. 404

వ. అట్టి పరిభవంబును బొంది ధార్తరాష్ట్రచయం
బునకు కృష్ణమేఘుం బే తెంచె నేరికి సమర్థింప దరంబుగాదు.
నీతివిక్రమంబుల నప్రతిముండగు నతండు ముజ్జగముల యం
దును బొగడ్తకర్హుండు నదియునుంగాక పుత్రుకంటె నతిశయం
బుగాఁ దలంపుచుండు గురుండు ప్రియశిష్యునకు నగ్గించుటకు
దగవు గానితెఱంగిది వింతయొప్పు నింక లజ్జలేమిచే ద్రోణుండు
నీకుఁ దోడుసూపిఁ సూపుగాకేమి? మాకు నింతియుచాలునని
నఁగర్ణుండు గనలి యిట్లనియె. 405

ఉ. సంగరకేళికిం బోడవజాలుదురంచుమ నచ్చితెచ్చె నే
వెంగలి రాజులోకమున విప్రులపోరొగిఁ జన్నె? యెల్లవెం
టంగడు చీలికంటు జగడంబులనైనను తప్పఁ జూడ కీ
భంగిమహోగ్రవిగ్రహము బొల్పడ మీకుని దేల చెప్పడీ.

క. ఘోరాహవమును చోధృతి
చేరారిటపసికిఁ గొల్వుసింగారముగా

కోరిక దనచుట్టుఁ జుట్టుకొనియుపొంగెన్. 407

గీ. జన్నముల భక్ష్యభోజ్యాది చవులెఱుంగఁ
దగును మీయట్టి పూజ్యులెంతయుఁ దలంప
జన్యముల వాఁడియమ్ముల చవులెఱుంగ
బోలుదురె రాజునకు వెట్టిబుట్టెఁగాక. 408

ఉ. అన్నలుదమ్ములిష్ట జనులాంధ్రమను బిడ్డలు దారుచుట్టముల్
మన్ననవెల్లకాలమును మానవనాధుని సొమ్మురిత్తగాఁ
బన్నములేక పండుగలు పర్వములంచు భుజించునాఁడుగా
కెన్నఁగ నిట్టికార్యముల కేటికిఁజొత్తురువారలొక్కెడన్.

క. ఒక్కవిలుకాని కిందఱు
పెక్కుతెఱంగులను మీరుబెగడెద రిదియున్
నిక్కమొ ? నరుపైఁ గలమీ
మక్కువయో వెరపు మాకుమదిగరపఁగనో? 410

చ. అధిపురణంబుఁదీర్ప నరునందులనాయెడఁదారతమ్యముల్
ప్రధనములోనసంశయము బాయఁగభార్గవరాముఁడిచ్చుమ
త్ప్రధుశర విద్యపెంపుభువిఁజేటపడం గురురాజు తోడనా
ప్రధితముగాజయింతుననివల్కుట చెల్లఁగనీల్గునొక్కటన్

క. ఒనగూడె నేఁడు పలువురు
పనిలేదొకవీరునకును బాల్పడినేనే
తునిమెదనిందఱు నిచ్చటఁ
గనుఁడావెరపైన నింటికడకుంజనుఁడా 412

వ. అనినఁ గృపాచార్యుండిట్లనియె. 413

క. ఆర్చినమూరెడు పెరిగెడు
వేర్చిః ఫల్గునునకిప్పు డెవు రెవ్వఁడు బో
నేర్చును విభుఁడుబ్బఁగనీ
నేర్చినపలుకింతఁగాక నిజముగఁగర్ణా ! 414

క. పాండుకుమారకులలఁతులె
ఖండనమున నొక్కఁడొకఁడు పలువుర నోర్వం
జండపరాక్రములందు న
రుండతిశయ బలుఁడు గలఁడు రూపింపంగన్. 415

ఉ. కాండవమేర్చుచోసతికిగాయము సేనలనోర్చుచో సము
ద్దండత ద్రాపదింగొనిఁడార్కొను మీకునెదుర్చుచో ధరా
మండలిఁ గెల్చికబ్బములు మాటికినన్నకుఁజేర్చుచోను నా
ఖండలుపంపునంగదలిగ్గునురారులనెల్లఁ దీర్చుచోన్. 416

ఉ. వెండియునిట్టికృత్యములువేయును గల్గునువీనికెల్ల నొ
క్కండనితోఁడుసూపితివొకా వినునిన్నె కాదెచిత్రసే
నుండున్నపాలయుక్తముగనూర్వఁగనైకొనఁ గ్రమ్మరించెనం
దుండఁగలేవొ ? నీవెచటనుంటివిగొందినికర్ణ ! చెప్పుమా !

వ. అదియునుం గాక సునాసీరహర ప్రముఖులమెప్పించి
సమగ్ర దివ్యాస్త్రసంపన్నుండై తొంటికంటెగలండు. 418

క. నిలువుదుగా దేక్రీడిం
బులివలెమార్కొని కడంగిపోరంబతిసీ
తలయందకార్యఖడ్గం
బులుబెట్టెను రిత్తయేల బోయెదమిచటన్. 419

వ. అని యివ్విధంబున నందఱు నన్ని తెఱంగుల పరు
సనిపల్కుల గలహింప గాంగేయుండాకర్ణించి సుయోధను ను
ద్దేశించి ద్రోణుండు నీతిపథంబుఁజెప్పిన రాధేయుండిట్లుబల్క
లగ్గగునే? నీమందెమేలంబుమూలంబగు వీనియహంకారంబున
కున్నైన నాచార్య లర్హవచనంబున కర్హులుగాక గర్హింపంబడు
వారేయని కృపాశ్వత్థామలదెసకుఁ జేతులుసాచి యోపినంతప
నిగల దర్జునుండే తెంచెఁ బరస్పరవిరోధంబునకుఁ గర్జంబుగాదు.
మనమందరముంగలసి ఖేదమోదంబు లొక్కటిసేయుమని ప
లుకుదురదియునుంగాక పౌరవకులంబున నెద్దిపుట్టిన నదిమీాతల
న నిలుచుఁగావున సైరింపవలయు బ్రహ్మ క్షత్రంబులు రెండు
నొక్కరూపునం బ్రవర్తింపఁదగు మీాయట్టి మహాత్ములు లేరే
యనివేఁడికొని రాజుకార్యంబు నిర్వహింపుడనుడు సైరింపనెం
తవారము రాజుకార్యంబుఁదీర్ప నెట్టికొలఁది మాయెడంగలదు
గురుని చిత్తశాంతియ మాకలుకదీరుట, యింతయేల మమ్ము
నగ్గించెదవనిరిట్లు కృపాశ్వత్థామల మనస్తాపంబుదీర్చె. సుయో
ధనుండును గర్ణగాంగేయులగూర్చికొనివారియలుకఁబాపె, మ
రియును భీష్ముండు ద్రోణుంబ్రార్థించుకొని పాండవులకు నధిక
మాసంబులతోడ నిన్నఁటికిఁపదుమూఁడు సంవత్సరంబులయ్యె
నని సుయోధనుని సందియంబుఁబాపి సైన్యంబు బంచియిచ్చి
ముందరఁబోవనియోగించి దక్కినచతురంగబలంబును నియతిఁ
జేసికొని గురుకృపాశ్వత్థామ కర్ణవికర్ణ దుశ్శాసన శకుని సైంధ
వ సోమదత్త బాహ్లిక భూరిశ్రవః ప్రముఖయోధులమొగ్గరంబు

న వలయునెడల నెడనెడఁదా నియమించి తాలధ్వజంబెత్తించి
తానును వెనకయై నడపించుచుండె నయ్యవసరంబున. 420

చ. ఒకవిలుకాఁడుబల్విర మహోద్ధతి మార్గణంబునునిట్టి
వీఁకకుఁగడువేడ్కఁజూడదివిఁగ్రమ్మినిలింపుల పంక్తివజ్రియుం
బ్రకటితపుణ్యమూర్తియగు పాండుమహీశునితోడఁగూడిపు
త్రకునిదెసంభయంబలరఁదద్రథముంగననుండెనచ్చటన్.

మ. తగుస్నేహద్వయమొప్పనార్ద్రమగునాత్మక్షేమఖండంబునన్
నగజాతైకచికిత్సితవ్రణుఁడుమానాథుండుప్రీతాత్ముఁడై
యొగినేవిల్లునుతించెనట్టివిలుఁదానొప్పారఁగాంచెనరుం
డగమంబె తనరారుకౌరవసమూహంబున్ విలోకించుచున్

వ. అప్పుడు. 423

సీ. దేవేంద్రసూతియె త్తెనుదేవదత్తంబు
దద్ఘోషమునవియత్తలము పగిలె
మ్రొగ్గెను గజములుమార్చ్ఛిల్లె నశ్వముల్
రథికసంచయములు మాఱ్ఱుపడియె
భటకోటివివశమై పరగను త్తరుఁడును
నొగలపై వ్రాలెను జగతివడకె
జలధులురొంపులై కలిగెమేఘౌఘంబు
దూలంబుగతిఁజాలఁ దూలఁదొడఁగె

గీ॥ గిరులునోరగిల్లె సురలునుభీతచే
తస్కులగుచుమింటఁ దలఁకిమెట్టి

దగునొతమకటంచు దిగులునుఁ జెందిరి
కురుచమూచయములు గొనబుఁగొనియె. 424

క. పగ్గములు సడలినొగలకు
మొగ్గికడిఁది మూర్ఛఁగన్ను మూసినసూతున్
దగ్గరిఫల్గునుఁ డొయ్యన
తగ్గతెరంగులను భయముదలగించియుసన్ 425

ఉ. అక్కట రాచపట్టివిరణావనినీకిఁయఁ దూర్యశబ్దముల్
పెక్కుతెరంగులన్ మొరయభీతివినన్ నగరే రిపుల్ మదం
బెక్కుచుగాఁగఁజక్కనిలువీ!యనిలగ్గుచుమాటలాడుచున్
మక్కువఁజూపనారథికసూళికిఁ గ్రిమ్మరను త్తరుఁడనున్.

గీ. సంకుసద్దులు వినమెకి నిశ్శంకమేము
కక్కసపుటులివు లిట్టుల గలుగదెందు
పాణములునన కేమూర్ఛఁ బరగిమగుడ
బ్రతుకుటకుధీరుఁడనినన్ను బలుకవేల. 427

కం. అనవుడు నగిక్రమ్మర నిదె
ఘనతరయగుదేవదత్తగర్జకుఁబదిలం
బుననిలుమనియొత్తెను సిడ
మునవనచరపతియుభూతములుబెట్టార్వన్, 428

వ. ఇట్లు క్రమంబున నతని వెఱపుఁదీర్చి గుఱ్ఱంబుల కలకఁదేర్చి దుర్జయుండగు నయ్యర్జునుండు త్తరుంగాంచి కురు బలంబు మూఁడు మొనలై నడచుచున్నయది మనలం గ్రుచ్చి కొనియనాయత పదంబు విడుచుజను నిది గట్టి మొనతక్కనవి

యలంతిమూఁకలు మన మిచ్చట చేసూపిన జిమ్మిరేఁగికయ్యం బునకుఁ దొడంగి నిలిపెడు నీచుండగు సుయోధనుండును జే త ప్పిచను గోవులను మరల్ప నేరముగావున నిమ్మొగ్గరంబు డగ్గర కవెగ్గలంబునఁ బసులం బెట్టించి పిదప రాజుబోవు నెలవు దెలసి పోదవవలయువాఁడు చిక్కిన మూఁడు మొనలు నొక్కటిగాఁ గలనికి రాఁగలవు గాడేసి పలాయనంబైనఁగాఁగలవతనితోడనే కార్యసాఫల్యంబగునా వారి బడిన నెందుననవచ్చు బవరంబు న కిప్పుడకర్జంబుగాదు మున్నుగ వచ్చిన పనిదీర్పవలయు నీమో హారంబుపజ్జన మెరుంగు తెరంగున నరదంబు దోలుమనుఁడు త్త రుం డట్లుచేసిన 429

గీ. కవ్వడియుఁ గన్నువిచ్చి యగ్గలికనిగుడఁ
గురుబలంబెల్లఁ గని యందు గురుకృపాప
గాసుతుల పాదముల చెంతగాఁగ రెండు
వీనులొరసి చనన్ రెండు విశిఖములను 430

వ. ఇత్తెరంగున నాలుగేసి యమ్ములేసినఁగని ద్రోణుం డు తనచెంగటి వారలతోడ సంతసంబున నిట్లను పాండవేయుం డింతయొప్పనే? నాకుఁబ్రణామంబుగా రెండును గుశలప్రశ్నం బుఁజెప్ప రెండునుగా నాల్గుకోలలు నియోగించెనని చెప్పెఁగృపా చార్య శాంతనవులు నంతరంగంబుల నంతియనిశ్చయించి సం తసిల్లిరంత బలాంతకసూనుండు నంతనంతనడచు రాజలోకం బు సడ్డగొనక సంగరంబు తలంపులేనివాఁడుం బోలెఁ జనుచు

న్న భీష్ముండు వాని పోవుటకు యోధవీరులఁ గలయం జూచి
రాజరక్షణ పరుండై యిట్లనియె. 431

క. మనలం గ్రేగంటనఁగనుఁ
గొనుచుం బిన్నకయ కలను గోరక రథమున్
జననిచ్చెను కేడించియు
ఘనుఁడారారాజుకోరకుఁ గావలయుఁ జుమీ. 432

చ. పెలుచనెక్రోడె త్రాచుబుసపెట్టు తెరంగునమార్చుచుం రయం
బలరఁగరాజుదిక్కునకునర్జునుఁడేగెను వీడురెండుమూఁ
కలనమునం జొరంబిదపఁగార్యముదప్పు సుయోధనుండు నీ
బలియునిచేతఁజిక్కునడఁబట్టిన గోవులవేలచెప్పుడా 433

గీ అనుచుఁబురికొల్పికొనుచు రయంబుతోడఁ
గ్రోశయుగ్మమునడిపించెఁ గురుబలముల
క్రీడియునువేగఁ బసుల వెన్నాడి పోదవి
యుత్తలముమానిపలికె నయ్యుత్తరునకు. 434

మ. ఇదె గోబృందముజేరవచ్చితిమి భూమీశుండునావాఁడె పెం
పొదవన్ వచ్చినపూన్కిఁదీర్చియటపైనుర్వీశుమార్కొందమ
మ్మదనారాతియునైననడ్డమగునేమచ్చొర్యసంపత్తి కిం
గడుపుండాటఁగఁదోలుతేరువెలిగాఁగౌశల్యమేపారఁగఁ.

వ. అనిధనంజయుండు నియోగించినయట్ల భూమింజ
యుండు తేరుగడప బరపి గోగణంబునకు సమ్ముఖంబుఁజేసె
నంత. 436

క. నరుఁడదలింపుచుఁ జీరెను
గరమరుదుగ బెదరుసేయఁ గనియును గేతు
స్థిరవనచరభూతార్భటి
నగునవినిపసులతొంటి జాడంబఱచెన్. 437

ఉ. వాలములెత్తిబిత్తరపు పాటునఁగన్నులు విచ్చియప్డులా
భీలగతిన్ నిగుడ్చి బుసవెట్టి వెసంజిక్కొట్టి రూడయుం
జీలక నొక్కపోవుఁగని చెచ్చెరధాత్రిచడంక మత్స్యభూ
పాలునిపొలికె పసులుబారెను గౌరవసేనబెగ్గలన్. 438

క. పసులన్ మరలించినమదిఁ
బసచెడికౌరవులుమగుడి పార్థునితోడన్
వెసఁగలనికిఁగదియంబడి
కసిమసఁగన్ వేసిరలఘుకాండశ్రేణిన్. 439

వ. ఇట్లు కదనంబునకుఁ గౌరవులు గదిసిమరియును.

సీ. మొనసియావివ్వచ్చు ముంజేతిదోయిని:
గ్రమమునగౌరవులు గాంచుగుణము
గలుగుగాండీవంబు గంధర్వయుద్ధము
మొదలుగాఁగ్రైకొన్న మూగతనము
మానిపాణిద్వయ మంటపంబుననప్డు
నట్టువసల్ప దన్నాదఫణితి
నెల్లరుమనముల నితఁడుపాండవుఁడంచు
వుయిలోటదక్కి నిశ్చయముఁజేసి

గీ. గడువదు స్తరంపు ఘనచమూవనరాశి
తరమె? పీనికవుడుదాటననెడు
తలఁపుఁబూనియుద్ధతత్పరులై యథ్వ
వ్యతనొసంగు నీర్ష్యనావహించి. 440

క. సిద్ధాంతము జైకొని బహు
పద్ధతులంగడగు పూర్వ పక్షములగతిన్
యుద్ధమునకు వక్కవ్వడి
నుద్ధతినివిపక్షచయములోలిఁ మూగెన్. 441

చ. దళమునఁ బాండుసందను రథంబునవై రిన్నృపాలకాండముల్
బలిమి సహస్రసంఖ్యలు సభంగురభంగిఁదొరంగఁజొచ్చెన
య్యలఘుజగద్భయంకరమహోహితతుల్ జనమేజయావనీ
తలపతియాగవేది కనుదారముగాఁబడుమాడ్కి నెంతయున్.

వ. అంత. 443

గీ. జంభరిపుసూనుఁడును మహాజన్యమునకు
జృంభణంబుననేఁగ నారంభయయ్యె
విమతర క్తనదీస్నపనమునవిశిఖ
పితృవనవాసదోషంబుఁ బెంపనసఁగ. 444

మ. వలదుత్తుంగమతంగజార్వరథ దుర్వారోద్ధతై కాపనీ
తలధూళిఁ వరణప్రగుద్భవమరందస్ఫూర్తిచేఁబాప న
క్కలహాంబుందమకెట్లు సుస్థితిఁగనంగానబ్బెనట్లప్పరో
లలనన్గై కొనగాంచిరభ్రమున మేలంబొప్పఁగావీరులన్.

మ. ధృతిఁ గ్రీడిశ్రవణద్వయాంతమనుజ్యోతిష్కోక్తలగ్నంబునన్
కృతసమ్యక్పటుజైత్రయాత్రములు భీకృచ్ఛ్రాంతశల్యంబులున్
దతభల్లంబులుదుర్ధరారిజనబృందప్రౌఢియేకా దుదం
చితరీతిన్ గడురాజునాశయమునుముంచెన్ రాజరాజాశయున్.

క. కడుశత్రుమిత్రభావము
లడరిన యారాజరాజులాసలరెంటన్
నడచెనొకరూపుననొక
వ్వడిసునిశితనిబిడవిశిఖవారము బెలుచన్. 447

మ. పొదలంబాయుటనార్వసంధిగొనుటన్ బోవన్ విడంగంటనీ
పదిలంబై తగు మూఁడుసంపదలనావేశన్ శరావ్యాప్తియం
బదిసాయుజ్యముఁ జెందెనో జనుసముద్యద్వృత్తిఁ బొర్ధుండును
న్మదచక్రీకృతచారుచాపధరుఁడై నంజన్యధాత్రీస్థలిన్. 448

గీ. కలనభుజగర్వ కణములు వెలికిజిమ్మ
శరులకటకస్రుతాంబువుల్ గలుగుశైల
తతినిఁదనదానగతి నుద్ధతినినరుఁడు
కడఁగిలక్ష్యములొనరించెఁ గాండములకు. 449

ఉ. చండభుజుండుపాండునృపచంద్రుసుతుండగుఫల్గునుండు సు
ద్దండశరంబులంగరుల తండముతొండము తుండెమైపడన్
భండనసీమయందుఁబడఁ బల్మరువ్రేయును దీర్ఘనిద్రచే
నుండు రిపుక్షితీంద్రులకునొప్పపధానములిచ్చుచాడ్పునన్.

గీ. విజయశరదత్తమగు మహావివరమొక్క
గజము దేహాంతరంబునఁ గాంచిగుహని

శక్తిచే క్షతకలకాప్తి జగతిఁబరగు
క్రౌంచగుబ్బలివై ఖరి మించెనపుడు. 451

ఉ. పెక్కుతెఱంగులం బడిన పీనుఁగులందిగఁద్రొక్కి వెన్కవా
రుక్కునఁబోటుసూప సమరోజ్జ్వలుఁడప్పుడునంపవానపై
గ్రిక్కిఱియన్ నిగుడ్చి మడగించిననించుక చంచలింపకన్
దక్కడడంబునుంగదిసితాడితమైకడుచాపకట్టునన్. 452

క. జలనిధినీరము బడబా
నలముఁగొనెడుకరణినిశితనారాచమహా
నలమునదశ్రమున బలమును
జలముననాసవ్యసాచి సమయించునెడన్. 453

వ. ఆచార్యనందనుండుమందస్మిత వదనారవిందుండై
యంగరాజునకిట్లనియె. 454

చ. పలుకుదుగా దెరజ్జువులు పార్థునినేనజయింతునంచు భూ
తలపతిమ్రోలరచ్చలను దద్దయునిచ్చకమార నిప్పుడీ
కళవళమంద సేనలను గబ్బిమెకంబువసించెకల్ను చో
ప్పలరెడువీఁడుమూఁకలకు నడ్డపడంజనదే? మహోగ్రతన్.

చ. వినుజనములు కలిగినచో
నినునీవయఁపొగడుకొనఁగ నేర్తువుగాకీ
తనిమార్కొన నేర్తువె యా
మన మెఱిఁగినపనికినిన్ను మరియననేలా? 456

క. నావినికర్ణుఁడుగన్నులఁ
గావిగొనంబలికెవిప్ర? కౌంతేయునకున్

నీవైనఁ ద్రోణుసనినిలు
చేవచెడఁగ మచ్ఛరాగ్ని శిఖలంగాగ్రితున్. 457

క. ఓడకపలుమరు పరుసము
లాడెదవొకయలఁతి వానిననుగతినీవుం
బోఁడిమిచెరచెద నరు నది
చూడకమునుమున్న యుడుకు చూరెదెవేలా? 458

వ. అనిరోషంబున నతండు గడంగిన ద్రోణాశ్వత్థామ శారద్వతులును శాంతనవ సుయోధనులును, దుశ్శాసన ద్రుష్ప్రిహ, దుర్విషహ, శకుని, సైంధవ, బాహ్లిక, సోమదత్త ప్రభృతికురుకుమార బంధుమిత్ర సామంత నికరంబును, దక్కటి యోధులును మాతంగ తురంగ శతాంగ సంఘంబున నొక్కపెట్టంద్రొక్కి నడచి వివిధాయుధంబులు వరపిన. 459

సీ. విజయుండు శాత్రివ వివిధాస్త్రిచయముల
నరకి ద్రోణుని మూఁడు నారసముల
నాచార్యసూను నైదారు గృపాచార్యు
గాంగేయు నిరువది కాండములను
రాధేయునొకట రారాజును మూఁటను
బాహ్లికుఁ బదియూరు బాణములను
మరియుఁదక్కిన యోధమండలి నమి తాస్త్ర
చయముల బరగించి జవమడంచి
ఆ. వె. కరులహరుల రథనికాయంబులను బదా
తులను నుగ్గనూచములుగఁ జేసి

న్నుతనునొకరుత్తమాల్యమిము బోనదిబల్కక యున్న భీతిచే
గదులకుఁబారెఁబీనుఁగనుగా మదిరోయుచు గన్నమూయుచున్.

సీ. దూరంబులనుగొన్ని తూగిచెండాడును
చేరువనుగొన్ని బారిచెమరుఁ
గడుమధ్యములఁగొన్ని పొడవడంగఁగఁజేయుఁ
బల్లంబులనుగొన్ని బడలుపఱచు
మిట్టమిఱ్ఱులకొన్ని జెట్టనమ్మట్టాడు
నాశాంతములఁగొన్ని యాగిపొదువు
ధాత్రీస్థలులఁగొన్ని తడయకబగులించు
నింగికినొకకొన్ని చెంగలించు

గీ. పరిపరివిధంబులఁ గిరీటిబాణపటలి
చటులపర్యటనముల ద్విట్ఛటల నిటుల
నురగిచనసందుగానీక చుట్టిచుట్టి
నురిచెఁగరికరిమెరయ నుక్కరి రణమున. 469

ఉ. ఉన్నతసామజంబులును నుత్తమజులు వీరయోధులున్
గ్రన్ననఁగ్రీడిచేనిహతిఁగాంచి రణావని వేగ్రవాలు నం
దున్నిబిడంపు నిద్రఁ గనుదోయి మొగిడ్చిన రాజిరాజిచే
మున్నుగ నిష్టమైనతలమున్గొనఁగాఁ దలపోయుచాడ్పునన్

శా. గంగంబాండురవర్ణగారవిసుతంగాలప్రభంగాఁబిశం
గింగాజారుసరస్వతిన్ మొదలఁబంకేజోద్భవుండొప్పదా
నంగావించియుశోనకాంతి నదినెందుంజేయకక్షమానెనం
చుంగల్పించెనరుండు నాతగిన దేస్రోతస్వినీవ్రాతముల్. 471

చ. శకునిదివాకరాత్మజుని జూడ యెఱుంగక చీరితానువే
రొకగతిఁబారదిగ్భ్రమలనొందుచునుండవరేశుఛత్రమున్
వికలముగాఁగ ద్రోణసుతు విల్లుదెగం గురుకేతనంబరం
చకితపు భీష్మమూర్ఛఁగని జన్యమునం గురుసేన బెగ్గిలెన్.

గీ. కౌరవవ్యూహకింశుక కాననంబు
దోహదముఁజేసె ఫల్గున దోర్యుగమున
వెడలు మార్గణపంక్తులు వేయుగతుల
భూత బేతాళమధుకర జాతియలర. 473

క. గుఱ్ఱంబుల సారథినటు
జిఱ్ఱునఁ జీదంగనీక సిడముఁ రథమున్
గఱ్ఱఁ జొరనీక విజయుం
డెఱ్ఱని జీరయును మేననెఱుఁగక నొడిచెన్. 474

గీ. నారదుఁడు నరు బవరమింపార నిబిడ
భావమునఁగాంచి యానంద భరములగుచు
గరములనుఁబసు బాష్పోదకంబులననొ
నర్చినాహ్నికకృత్య మెంతయుదివమున. 475

క. అచ్చెరువుకడలి శశి వి
వ్వచ్చుని భుజవిక్రమంబు వడికనికనియా
యచ్చరలూర్వశి యాదిగఁ
జెచ్చెరఁ దలయూఁచి రభసీమం బ్రేమన్. 476

గీ. విశిఖముల నంగములు చన్న వీరవరుల
వరణమాలికలకు దివ్యవారయువతి

తతికిఁ గుసుమము లిచ్చియు దళములిచ్చి
శాఖలవశేషముగ నిల్చె సారశాఖి 477

ఉ. ఉత్తరనాత్మలోఁ దలఁచి యుత్తరుచిత్తముగాంచిబాణసం
పత్తిని శత్రుకోటికొక భంగమొనర్చ చనంగఁ బోలునే
నితతినంచు నర్జునుఁడహీనజవంబగు మోహనాస్త్రము
ద్వృత్తినివైచె భూతములుదేవతలున్ వడకంగనయ్యెడన్

ఉ. వేలుపుగుంపుచేఁ గుసుమవృష్టి కరంబులఁ బెల్చుకత్తియా
వేళనుస్వాపనాస్త్ర మఱివీరులపై నిగుడింపనిద్దురం
బోలె సమస్తసేనధరఁబొందెఁడిదాశ్వగ వైభవంబుచే
నాలములోనమున్నదమకైనగతిందొలగించుచొప్పునన్ 479

సీ. అంతనావివ్వచ్చుఁడాత్మ వధూవస్త్ర
ములుమునుసభఁ గొన్న ఫలముమగుడ
నొసఁగుకోరికవోలె నుత్తరుచే నిఖి
లారాతి వసనంబు లపహరించి
యాచార్యుఁడాదిగాఁ నగువారలకుదివా
స్వాపంబు వలదనుశాంతచిత్త
మునఁగృపమన్నించి మొనయుతదస్త్రము
క్షణమున మరలను గ్రమ్మరింప

గీ. మూయుటను గావిగొన్న కందోయి వరుస
బలుమరుఁగ రాంచలంబుల నులిమికొనుచు
నాస్యబిలమొప్పఁగావిచ్చియావులించి
నీలుగుచు నెల్లఁగురు సేనమేలుగాంచె. 480

ఉ. ఆహవకేళి శాత్రవులయందుఁ గిరీటి సమస్తబాణ సం
దోహము దీర్ఘనిద్రఁ గనెఁ దోర్బలుఁ గాంచు విముక్తమోద స
న్నాహము బొందునట్లు గడునన్నపదంపడి పైచెనంచు స
మ్మోహనశస్త్రవీర్యమదిఁ బూనుగతిన్ మిగిడెన్ రయంబునన్

గీ. చీరలటపోయి సిగ్గున గూరునృపుల
గాంచి మోములు మరలింపఁగా విమర్ద
మగుట దేవసమూహంబు మొగపులేని
తెర కనుంగవనెల్ల నిందించి కొనియె. 482

గీ. మేనుగప్పుడస్ని ప్రాణంబుమీఁదవచ్చి
యాలమున మాత్స్యుచే చీరగోలుపోయి
మున్ను గంధర్వుచేఁ గట్టుగన్నయట్టి
ఘోషయాత్రకు మెచ్చునా కురువిభుండు 483

ఉ. అత్తఱినిట్లు సిగ్గు చెడినట్టి సిరింగడుగూర్చు భాగ్య సం
పత్తులు పుట్టముల్ పగరపాలయి నిచ్చలమైన నెత్తుటన్
జొత్తిలి పెక్కుముల్ నరునిచూడ్కికి నగ్గము సేయ జంకి పై
కెత్తగఁ బారఁ జూచెఁ బురికేగు మతిం గురుసేన భీతిచేన్ 484

వ. ఆసమయంబున. 485

క. నరపతిఁ గని భీష్ముండను
గురునాయక చండకిరణుఁ గొమరుండు గడు నీ
వరయక కౌరియ పాటున
నరునకు నిటు వెఱచి పర్వ నాయంబగునే? 486

క. నాకఱపిన పలుకొకటియుఁ
చీఁకునకుఁ నీకుమదిరుచింపదు పుడమిం
గైకొని యొదమనుతలఁపునఁ
బైకొనియొరయంగ నగునె ? పాండవులనన్ 487

చ. అనివినిమారుమాట యొకటాడనెఱుంగక విన్నవాటునన్
జనునెడవారిఁజూచి బలశాసనసూతిరథంబు తోడనే
వెనుకొనఁదోలియోలిఁ గురువీరులగ్రమ్మరుఁడంచు నార్చుచుం
దుసియలుగాన వెల్లబిరుదుల్ దిగవ్రేయుచుఁ గేరడింపుచున్

గీ. జూదమాకాదు కురురాజచూడుమరలి
వాదమాకాదుకర్ణ యిప్పాటనిలుము
బోధములుగావు సౌబల! పోకువెఱచి
మగుడుదుశ్శాసనా! రచ్చమగువగాదు. 489

చ. నెఱిదగుకుంతిబిడ్డలకునే గడు చిన్ననునన్నుమార్కొనం
వెఱచిపురంబుఁజేరఁగనివేయువిధంబుల నాడువారలే
మఱినగరే? రణంబనిన మానఁగవచ్చునె రాచవారికిన్
బఱవకగ్రమ్మరుండుమదిపౌరుషముల్ దలపోయుఁడిమ్మెయిన్.

వ. అని పలుదెఱంగులం దెగడి పలుకుచుఁ గొంతదవ్వు తఱిమి మగుడి పురాభిముఖుండై వచ్చునెడ గాలు తక్కువం బఱవనేరక తనకెదురఁజేతు లెత్తి మొక్కు కాలుబలంబులం గరుణసేసి చంపక హారిదంతవిశృంఖల విశ్రమిత విజయశంఖ రవంబులనిజాయుధనిక్షేపరక్షిత భూతకుటుంబంబునునవసమర రుధిరపానంబు సేయ రమ్మనువదువున మొరయు చుండ పను

లంబెట్టించి పగరథట్టించి పఱితిననెఱపితి నీయట్టిబంధుండు గలండేయని బహువిధంబుల నుత్తరుచే నుపలాలితుండగుచుఁ బితృవనమధ్య సమీపంబుఁజేరి గాండివంబులోనగు వానినెల్ల మునుపటియట్ల పొందుపఱచి నమస్కరించి తాను నంగీకృత సూతకృత్యుండై సింహధ్వజంబెత్తించి తేరు దోలుచుండ నిర్జరసంఘంబు నర్జును నుతింపుచు నిజనివాసంబున కరిగె నప్పుడు ధనంజయుండు భూమింజయున కిట్లనియె. 491

ఉ. రాజకుమార! పెన్నెఱులు రాజిలఁ జక్కఁగఁగట్టు మానసాం
భోజమునందుఘర్మజలపూరముదూరముగానొనర్పుమీ
యోజనుఁజూపకుండొనలునూనుము కేతురథంబుమీఁద వి
భ్రాజితమైనశస్త్రములరాశిపయింగడునుండునెమ్మదిన్.

గీ. ధీరుఁడవుగమ్ముమెమ్ము మీవారిసభను
పగఱగెలిచితినేననిపలికికొనుము
జననికినిఁదండ్రికినిమంత్రిజనులకైన
నాదుపొలకువసూచింపఁగాదువత్స. 493

క. అనియాతని నొడఁబాటుగఁ
గొనితమకెదురేఁగుదెంచుగోపతతుల నొ
క్కనిఁగని నీవీయుత్తరు
ఘనజయమెఱిఁగింపు రాజుకడనని పనిచెన్. 494

గీ. అంతకయ మున్ను విరటేంద్రుఁడరులగెలిచి
నగరుసొత్తెంచి యుత్తరుపగిదియడిగి

వానివృత్తాంతమచ్చటి వారివలన
విని విషాదాత్ముఁడగుచు నిట్లనియె నతఁడు. 495

గీ. కొండెకాఁడు కలని గొడవలెఱుంగఁడు
పెక్కుసమరములను బేరుపెంపు
గలరుదండిమగలు కౌరవవీరులు
పములఁగొంటకేల నిసువుననియె. 496

ఉ. ఉగ్రక్కునమంత్రులార ! వడిఁగల్లుగజాశ్వశతాంగసంహతిన్
మిక్కిలి శూరులంగొనుచుమీరటఁదోఁడుజనుండునావుడున్
మక్కువఁగంకుఁడిట్లనియె మానవనాయకయేలయింత దా
నుక్కునశత్రులంగెలిచి యుత్తరుఁడేచనుదెంచువీటికిన్ 497

క. నీదుజయంబిది మున్నుగ
గాఁడాయుత్తరునకట్లగాఁదగు మదిలో
ఖేదముమాను బృహన్నల
యేదిక్కుననిలుచునచటనే విజయుఁడగున్. 498

క. అనిబహుళభంగుల నూరడ
జనపతితోఁబలుకుచున్న సమయంబున వే
చనుదెంచెను త్తరుఁడు బం
చినవల్లవుఁ డవని విభుని చిత్తంబలరన్. 499

చ. ఒగిచనుదెంచిమ్రొక్కినృప!యుత్తరుఁడెల్లపసిన్ వరల్చియా
పగతురనోర్చినన్నుఁగడుఁబంచెను దద్విజయంబుమీకు సె
ప్పఁగననుడుంబరిమోదమునఁబట్టుపటంబులుభూషణంబులున్
దగునవివానికిచ్చిపురిఁదద్దయుఁరాఁగయిసేయఁబంచియున్

సీ. ధర్మజుఁగాంచి యుత్తరిగోకయుద్ధవృ
త్తంబాడుదమునాకతండునీవు
గోమునగలదనిగురుసేననోడుచుట
వెరుతునావుడునగివేగపలకఁ
దెప్పించియాడుచు నప్పుడప్పుడుత్త
రునిగెల్పుఁబ్రకటింప విని నగవుగ
గాదుబృహన్నలగావలయునటన్న
తనచేతిసారెచేఁగినిసివేయ

గీ. నదియొకించుకనొప్పించియప్రముఖల
ద్రుపదకన్యకయానల్లదుడువదానిఁ
జూచివిరటుండుమదిలోనఁ జొప్పడుంది
మాలినీయిట్లుదుడిచెదవేల? యనియె. 501

క. నావిని మానిని వినుమో
భూవర! యీతారకంణము బుడమింబడినన్
భూవలయమున విపద్దశ
లావటిలుఁ బీరు పెద్దలగుటం దుడుతుఁ 502

గీ. అనుచుఁ బలికెఁగంకుఁడాక్షతంబర్జునుఁ
డెరుగునేని నృపునికెట్టి దగునొ
యనుచు సంశయించి యాచ్ఛాదనంబున
మాటుఁ జేసియుండెమరియు నంత. 50

వ. తత్క్షణంబ శోణిత పంకారుణిత నేమి రేఖలంబొల్చి
రిపుజనోత్పాత కాలాతచక్రకంబులపగిది పరిభ్రమించురథాంగం

బులతోడ నొప్పు శతాంగంబున నుదయ శిఖరి శిఖర మండిత
చండమార్తాండ మండలంబు కరణిం బరిణించుచు నగ్రసరణిం
జను గోఖుర పుటత్రుటిత కుట్టిమ ధరణి తలోచ్చలిత రజోభారా
క్రమణంబు వలన ఱ్ఱాలు రెప్పల నప్పళించియును కనువిచ్చియు
చ్చెరువున బృహన్నల నాదరింపక కౌరవజైత్రుండీ బాలుండని
మాటిమాటికిం దనుజూచు పౌరజనంబులం గ్రేగంటఁగాంచుచు
నయ్యుత్తరుండు నలకూబరుం డలకాపురంబును బోలెనిజపురం
బు ప్రవేశించి యన్యోన్యోపమర్దంబున రెట్టింపంబడు వందివా
దిత్రనాద మేదురంబగు మహారాజ మార్గంబున జనకుండగు
విరటుకొలువు కూటంబుం జేరె నయ్యవసరంబున. 504

ఉ. చిప్పను మున్నుగా జయముఁ జేకొనుతండ్రికి వీరు మేలు క
త్తెవ్వియొ ధూపముల్ విరులు నెవ్వియొ? ముంగిటనొప్పు ముగ్గుచా
ల్లెవ్వియొ రత్నతోరణము లెవ్వియొ? కేతువు లెవ్వియో కరం
బవ్వియు నయ్యెఁ దత్సుతున కై మరలం గయిసేయ నేటికిన్

గీ. ఆజి నశ్రద్వయంబున నార్ద్రమైన
బత్తళంబొప్ప నతుఁడైన పట్టినవని
భర్త పాహ స్తఘేదభాగ్యాబహుయుగళి
జేతఁ గౌఁగిటఁ జేర్చెను బ్రీతియొనఁగ 506

చ. నరుఁడును దద్రథాంతరమునం బటుపట్టదుకూలజాలమా
దరమలరారఁగాఁ దిగిచితండ్రిసమీపమునందు నున్న యు
త్తరకు నొసంగెనయ్యెడ ముదంబునగాఁగలయాత్మసూనుస
త్వరిణయ శాలదత్తమధుపర్కముపోలిక యొప్పనొప్పగన్

మ. పురినాఖేటముగాఁగనెల్లప్రజకుంబొల్పొందఁగాఁగేకయే
శ్వరజాతాదియునైనయంతిపురి రాజస్త్రీలకుంబంచి యు
త్తరుఁడాచీరలొసంగెమేనమయిలందాఁ బూనుసైరంధ్రికం
బరమియ్యంగనుమానెవస్త్రఖనితన్మధ్యంబటంచుఙ్మదిఙ్
గీ. ఫల్గునునిఁదక్కఁ గొల్వునఁ బాండవులను
జోద్యమందుచుఁ బలుమారు జూచుచున్న
తనయు చికురనుమూర్కొని ధరణిపతి ని
జాసనార్ధంబొసంగి యిట్లనియె నృపుడు. 509
క. అడవికిఁ బాండుకుమారుల
నడచి సపత్నిత్వరహితమగు కురుతతికిఙ్
మెడకణిఁతివి నీవయ యొ
క్కఁడవై తివి పట్టి యెల్లకాలంబింకఙ్. 510
ఆ.వె. ఉత్తరకుఁగొత్త యొజ్జలునోజసూతుఁ
జేసికొనియట్టికలన రక్షించితెట్లు
కన్నియలకెల్ల వలువలగమియొసంగఁ
గౌరవులనెట్టి బల్మిడగ్గఱితికూన. 511

వ. ఇట్లు ప్రమోదచంచలంబగు కరాంచలంబునఁ దన వెన్ను పునుకుచు బుజ్జగించి యడుగు తండ్రికి నుత్తరుండును చిత్రవాక్య ప్రవాహంబున కభిముఖంబుగా నిలువ నశక్తుండుం బోలె వివర్తిత వదనుండై యిట్లని విన్నవించె. 512

గీ. కౌరవులమోప్రలదివిభువిఁ గ్రక్కటిల్ల
నురకబెట్టిలువ్రగఁబూని యఱచితేను

వినుము నా తహతహ యెంతవేగనయ్యె
నంతలోపలనేకాంచ నయ్యెనందు. 513

క. అపరులచే నోడఁబడదో
నృపవర! రధిసారధిత్వ రీతియొకటనే
నుపమంగ్రై కొంటినిఁ ద
ద్విపులతరాయోధనమున విదితముగాఁగన్. 514

వ. దేవా! యింకఁబొంకుచెప్పనేల? 515

క. భూదయిత! రిపులకలనన్
గాదాయనునాకపార్ధకర్మమునటపై
సాదరమున విజయస్థితి
మోదమునన్ మోప్రిలనమరపురిసారగంటిన్ 516

వ. అని యిట్లుబల్కు నతని వచనరచనా చమత్కారంబు విని ద్యూతప్రహారక్షత జనితాయాసంబున నిరసించి కంకుండు దలయూచి మెచ్చె. వాసరవిరామంబుచెప్ప యామ శంఖరవంబాకర్ణించి యధోచితముగా సభాసదులం బోవం బంచి యుత్తరునిఁగారవించి యామేదినీవల్లభుండుఁ దత్కాలోచిత కృత్యంబులు నిర్వర్తించి పరమహర్షంబుతోడ సుధేష్ణ యుండు మేడకుంజనియె నంత. 517

గీ. తోడఁబుట్టువులఁగుటతోనయుశ్రు
కణములన్నియుసన్నటి కన్నుఁగవను
బొడమె నతివృష్టి సంపదఫుత్తుృఁజూచి
దేవికి ఖభాండసుతుఁగన్న దేశమట్ల. 518

క. ఆరాతిరియాకంకు న
గారము సంకేతతలముగాఁ గొనిపురియుం
దారెకుల హెచ్చరిక ప్రజ
గూరుకునుంగాంచివేళఁ గుంతీతనయుల్. 519

క. తా రేవురు ద్రౌపదియును
భోరుననటఁజేరి యుబుసుపుచ్చుచు వరుసం
గౌరవులనోర్చివచ్చుట
గూరిమినొండొరులు జెప్పికొను సమయమునన్. 520

వ ధనంజయుండు వడఘుడి నుద్దేశించి యిదియేమి యన్న నన్నుఁగనక మార్గంబుఁజేసె విరటుకొల్వున ననిన ధర్మజుండు నగి యతనికిట్లనియె. 521

చ. అలిగినవాఁడగానువినుమర్జున ! నేవలదన్న మత్స్య భూ
తలపతినెత్తమాడుటను దద్దయుఁదాఁబురికొల్పియాడుచోఁ
బలుమరును త్తరుంమకురుపంక్తులఁ గెల్చెనటన్ననే బృహ
న్నలగఁడు గెల్చెనంటివినినాయెడఁ గోపముజేసివేసినన్. 522

క. చేసారె చేతఫాలము
గాసిలనొకగంటువడినఁ గడుదాచుటకై
చేసితి మార్గమచ్చట
నీసేటికినిన్నుఁజూడ కేమరలంగన్. 523

సీ. అనితలచీరగొబ్బునఁద్రోలగింపఁద
త్క్షణముపీక్షించిన తమ్ములెల్లఁ

గోపించివిరటునిఁ గూల్చెదమనవుడు
ధర్మతనూజుండు దమ్ములకును
నతఁడునన్నీక్షింప్ప చేనడచుట గాదది
పౌరుషగుణంబునఁ బుట్టెఁగాని
సమయమో జనపతిచాటునఁ బుచ్చియి
ప్పాటనీతనినొక్క చేటుఁదలఁప

గీ. గూడునేకుడిచిన యింద్లుగ్రుద్దలింపఁ
దగునె? చూడఁగనసి చాలఁదగవునెఱపి
బుద్ధిఁగఱపుచు నాగ్రహబుద్ధి యుడిపి
శాంతులనుగా నొనర్చె నేకాంతమునను. 524

ఉ. అంతఁబరిభ్రాంతమైనతఱినన్నయుఁదమ్ములుగృష్ణయుంగడున్
సంతసమొప్పఁగాఁదగినసౌమముల్ దొడవుల్ ప్రసూనముల్
వింతలొసంగ మేనులనువేయువిధంబులఁ దాల్చిమత్స్యభూ
కాంతసభాగ్రమందతని కన్నుమున్నుగఁ గొల్వుదీర్చినన్

వ. విరటుండు నహార్ముఖ కృత్యంబులు దీర్చి కుమార మంత్రిసామంత ప్రభృతి నిఖిల బంధుమిత్ర సమేతుండై రచ్చకు వచ్చియచటఁ బాండవులఁచూచి యచ్చెరువునరిచ్చవడి యుత్తరుచేతఁ దత్వృత్తాంతంబంతయునాద్యంతంబుగానెఱింగి క్రమ్మఱవృకోదరువలన విదితుండై భయసంభ్రమంబుల నొంది నామాంతరంబుల నొక్కవత్సరంబు సన్నిధానులయ్యు నసన్నిధానులట్లు గొలిచి తదవసరాంగీకృత స్వవేషంబులఁ దగు సోదరులచే సేవింపంబడి కొలువున్న యుధిష్ఠరు చరణారవిందంబుల

యందు పలిత కేశపాశ ప్రకాశంబు నగు శిరంబు మరాళంబు
కరణి శరాళంబుగాఁ జేర్చిమ్రొక్కినంత. 526

గీ. నగవునిగుడెను తరి ధర్మ నందనునకు
నెసఁగు నక్షతంబు గ్రిహేతువయ్యె
నరునికన్నులశోణిమాన స్థితికిని
మఱియుమాత్స్యుని మదినీలిమానతకును. 527

క. వారలవిరటుఁడు గనినా
నేరముసైరింపుఁడెఱుఁగ నేరమిచే మి
మ్మాకరయవరవుడు పణులం
గౌరవమెడలించి పాపకర్ముఁడనైతిన్. 528

గీ. తప్పుబాయంగనిత్తు నుత్తరను నరున
కనవుడభిమన్యునకు నీదుతనయ నిమ్మ
టంచుధర్మజు ననుమతిగాంచిక్రీడి
పలికెనందఱునానంద భరితులైరి. 529

వ. అంత నిఖిలబంధుమిత్ర భృత్యజనంబులను, పాం
చాల చేదియదువులు, లోనగువారిని సుభద్రాభిమన్యులను
రావించి పురంబలంకరింప నియోగించిన నెల్లరులు పరమ
హర్షంబున నుండు నవసరంబున. 530

మ. క్రమమొప్పన్ విరటుండునోక్క శుభలగ్నంబున్ విచారించిమో
దమునంబంధులతో శిరీషసుమసౌందర్యాంగియానాత్మజన్
సముదారుండగు పార్థసూనునకు నోజంబెండ్లిఁజేసెందద్
యమహోద్యత్ప్రిథమాశ్రమావనికిసీమాశ్మక్రియంబొల్పఁగన్

క. కల సముద్ఘనుఁ వియ్యం
బులు జుట్టలు నితరులైన భూమీశులుభృ
త్యులు మొదలగు వారలచే
మెలఁకువను విరాటుఁడోలి మెచ్చులువడసెన్. 532

గీ. వెండియును మత్స్య నరపతిపాండవులను
గంసవైరినిఁ దగునట్లు గారవించి
వారిచేతను దాను వేరవేర
గౌరవముఁగాంచె నెనరులు గలిగివరుస. 533

వ. ఇట్లు పరిణయంబు నాల్గుదినంబులు జరిగినపిమ్మట విరటు కొల్వుకూటంబునఁ బాండవరామకృష్ణ పాంచాలవిరాట ప్రభృతి రాజులు సుఖాసీనులై యుండు సమయంబున హరి పాండవ హితార్థంబుగా వారలఁ గలయంగనుంగొని యుధిష్ఠి రున కిట్లనియె. 534

క. కడపితిరిడుముల నొకగతి
నడచితి రిన్నాళ్ళుపాండునందన ! మీపా
లడుగుట కొక్కనిఁ గురుపతి
కడకుంబుచ్చంగవలదె? గౌరవ మెసఁగన్. 535

గీ. బలములేకున్న మీరెంతబలియులైన
మర్వఁబొలిడఁబోడు సుయోధనుండు
నిన్నగోగ్రహణంబునఁ గన్నపాటు
మఱువకుండునె ? వాడతిమదము కతన. 536

ఉ. కావునమీరుఁమున్నుఁగనుగల్గిప్రియంబునఁగూర్చు నట్టియు
ర్వీవరులుండు నూళ్ళకునువేగమ బుచ్చుఁడుతద్గవారిసం
భావన మీఱఁగార్యగతి పద్ధతి యిట్టిదనాకుఁ జూడగా
నావుడుమాత్స్యుఁడాదినరనాథులుసంతసమంది రెంతయున్.

వ. అని హరియానతిచ్చి ద్రుపదుపురోహితుని కరినగ
రంబున కరుగ నొడంబఱచి ననంతరంబ పెండ్లికేతెంచినరాజు
లెల్ల వివాహంబుజూడవచ్చితిమి తీరమిగలదిండ్లకుఁబోయివచ్చె
దమనుడు ధర్మజుండు వారలకుఁ గట్టనిచ్చి తగునట్లు సంభావిం
చిపంచె. పాంచాలవిరాటులు పాండవులకుఁ దోడునూవుసన్నా
హంబున నాయతంబైరి. కృష్ణుండు రామసహితుండయి ద్వార
కకేఁగ గమనోన్ముఖుండై య్యె నంత. 538

గీ. పాండవులకతిమోదంబు బరఁగఁజేసి
మాత్స్యపురిఁబాసి చనియె నమ్మాధవుండు
పారిజాతాదులకు నూనపటలమొసఁగి
నందనునిఁ బాయు మాధవుచందమునను. 541

క. విశ్వనిదానవరద పర
మేశ్వరవినిహతకుజన సమేధిత సుజనా
విశ్వస్వరూప నిర్మల
శాశ్వత సర్వైకసాక్షి స్వైరవిహారా. 542

భుజంగప్రయాతము.

ఉదాసీనభావస్థిరోద్ధారకీర్తీ
పదాబ్జాహతౌఘాఘుభవ్యప్రవర్తీ

సదోపాసికస్వాంతసంగాదిమూర్తీ
యదభ్రక్రియాఖండితాదానవార్తీ. ౫౫౩

గద్యము.

ఇది
శ్రీమద్రాజగోపాల కరుణాకటాక్ష వీక్షణానులబ్ధ
కవితా విశేష మతుకుమల్లి వెంగళయామాత్య పుత్త్రి
వినయవిధేయ మాదయనామధేయ
ప్రణీతంబైన యభినవ
భారతంబునం విరాటపర్వంబు సర్వంబును
చతుర్థాశ్వాసము
సంపూర్ణము.

మంగళంమహాత్.

# అభినవభారతము.

-:0:—

## పంచమాశ్వాసము.

## ఉద్యోగపర్వము.

క. శ్రీనిత్య విశద సత్య
స్థానక కనదేకపంచ చతురానన వి
జ్ఞానమయ ! విహితనారద
గానా ! హరిహర హిరణ్యగర్భైకాత్మా ! 1

గీ. అవధరింపుమట్టులంబు జాతాక్షుండు
తమకు హితముగాఁగఁదగు విధముల
తెరగు మీరనపుడు తెలియఁజెప్పియు నిజ
పురముఁజేరవేడ్క నరిగెనంత 2

క. హరియానతిచ్చు పగిదిని
నరనాథులతోడితేరఁ దగుమానసులన్
గరము రయంబునఁ బంచెను
చిరయశుఁడాధర్మసూతి సిరిఁబెంపారన్ 3

గీ. కౌరవేశ్వరుఁడును వేగకతనఁ బాండు
నందనులరీతి యెఱిఁగి యందందఁదనకుఁ
గూర్చురాజులఁ బిలిపించుకొనియె రయము
నిగుడఁజారులచేఁ బెంపు నెగడ నపుడు 4

శా. జ్యానారింగలనం ప్రకోష్ఠభువిఁదానాడింపఁగోరంబృథా
సూనుజ్యేష్ఠునన్నుజ్ఞవచ్చు నృపతిస్తోమంబిభశ్రేణితో

నానాటక విరళేంద్రపీఠఁ దగువిన్యాసంబువర్షర్తువేం
తే నీలాంబుదరాజిచే నగతటిందీపించు చందంబునన్ 5

గీ. దళములను నెన్నియక్షౌహిణులను గలని
కాయితము జేసె ధర్మజుఁడంతకంటె.
నాలుగక్షౌహిణులఁ గురునాయకుండు
గూర్చె నెక్కుడుగా నొప్ప గురుతరముగ 6

వ. అక్షౌహిణీ సంఖ్యవివరించెద నదియెట్టిదనిన 7

సీ. గజమొక్కఁడును దురగత్రయంబు నరథ
మొక్కఁడేవురు కాల్వురక్కజముగ
బంతినాఁదగుదీనిఁ బరఁగ మూఁటను బెంప
సేనాముఖంబంద్రు దానిమగుడఁ
ద్రిగుణింపగుల్మంబు దీనిముమ్మడి సేయ
గణమాగణంబు ద్రిగుణితమైన
వాహినియగుదీని వడిమూఁటఁ బెంచినఁ
బృతనతత్పృతన సమ్మతినిమూఁట

గీ. బెంపఁజేదల వగు మరియదిసొంపుమీర
ముమ్మడింపననీకిని క్రమ్మరనది
తగునుదశగుణితము సేయఁదక్షౌణంబ
పరఁగ నక్షౌహిణియు ననఁబడెఁడసంఖ్య. 8

వ. ఇట్టి యక్షౌహిణికి నిరువది యొక్క వేయి నెనమ
న్నూటడెబ్బది యేనుంగులును నఱువదేను వేలు నార్నూటపది
గుఱ్ఱంబులును గజంబులన్నియ యరదంబులును లక్షయుం దొ

మ్మిదివేల మున్నూట యేఁబదియు వీరభటులును గలిగియొప్పా కతన కౌరవ పాండవులకుం గూడిన పదునెనిమిది యక్షౌహిణీ చతురంగ బలంబులును ముప్పది తొమ్మిది లక్షల ముప్పది యారు వేలున్నార్నూరునం దనరుచుండ నప్పుడు.

క. బలభేది తనయుఁడంతం
గలహమునకుఁ దోడుసూపఁ గమల దళాక్షున్
దలఁచి యుధిష్ఠిరు వాక్యము
వలన సముత్కంఠితుండై న ద్వారక కేగెన్. 10

క. కుంజరకుమార విక్రమ
మంజుఁడతఁడు తడవునకును మరివచ్చుటనాఁ
గంజవిలోచన లెల్లను
బుంజములై రోలిఁ జూడఁ బురవరవీధిన్. 11

గీ. తగసుభద్రాపహరణమున నగుయతిత్వ
శుద్ధిహేతువువుది సేయుచును గవాక్ష
ముల వలనఁజూచు జవరాండ్ర మోములనెడు
చందురుఁడుగాసెఁ జిఱునవ్వు చంద్రికలను. 12

వ. అంత. 13

మ. సారిదిన్ ద్వార్స్థులునోరసిల్లిచనుఁడంచున్ మార్గముంజూపఁగా
నరుఁడంతఃపురిఁజేరియందునిదురన్ నారాయణుండుండఁద
చ్చరణప్రాంతమునందుసింధువున నోజంబాయుకూర్మార్భక
స్థిరశోభంబగుపాదపీఠముననాసీనుండునయ్యెందగన్. 14

ఉ. అంతకమున్న వారణపురాధివిభుండొక పాటివానిఁగం
సాంతకుపాలికింబనుప నర్థ్మముగాదనితాన ద్వారకా
భ్యంతరమొందియాహరిసుఖాప్తిని సుప్తినియుండనుండె న
త్యంత ముదంబుతోడఁ దలయంపిదెసంగనకాసనోన్నతిన్.

గీ. ఆహవసహాయమడుగ మున్నటకువచ్చి
హరికిఁదలయంపిగూర్చున్న కురువిభుండు
తనరెనాతనియలికముతనదు మనము
లందు వక్రిమఁగనువేడ్కఁ జెందుకరణి. 16

సీ. వినిమీలనమునఁదారొక్కనుకన్నుగనవాఁడు
మేనుబల్మరుజారఁబూనువాఁడు
ధ్యానసుఖైకగ్రితతిపోల్కఁదగువాఁడు
నిడుదనొక్కొకయూర్పునెఱపువాఁడు
దేవీకుచావృత్తిబోవుగంధమువాఁడు
నవ్యక్తుఁడునుబోలెనమరువాఁడు
నపరంజివలిపెపైనలవరించినవాఁడు
కలువపూసెజ్జనొత్తిలినవాఁడు

గీ. మత్స్యకేతనశత్రు దుర్మదవిమథన
శాలి విజయునిపనిసేయు సామియనుచుఁ
గర్ణమునఁజెప్పచుండినగతిఁగపోల
ఫలకమునఁజెందు మకరకుండలమువాఁడు. 17

క. జలనిధిచెంగటికినిడిగి
సలిలముచేఁగడుపునించి జాతిసమూహం

బులఁబొసియున్న మేఘము
చెలువునఁదగువాఁడునైన శ్రీహరియంతన్. 18

వ. తనయంతన మేల్కాని కన్నువిచ్చి యయ్యిరువురం గని తదాగమనం బెఱింగియు నెఱుంగని వాఁడుంబోలె వారలచేఁ దెలుపంబడి మురంబున గృహీతహేతిపాణులగు నారాయణ గోపాలురు నొక్కఁడొక్కండ చాలుమానసులు బలంబున నాయట్టివారు నవకోటి సంఖ్యఁదగు దళంబొక్క యుద్దియు నిరాయుధుండనై కేవలసన్నిధానంబున హితం బుపదేశించుచుండెద నేనొక్కండ నొక్క యుద్దియు, నీరెం డుద్దులయందు మీకిద్దఱ కెద్ది యభిమతంబు గోరుండైనను నరుండు నాకు మొదలం గానంబడియె నిదియునుంగాక పిన్న వాఁడు గావున నతండు మొదట నేర్చికొనవలయు ననవుడు ఫల్గునుండు సమ్మదంబునఁ గృష్ణుం గోరుకొనియె. అందులకు సుయోధనుం డతిప్రీతుండై నారాయణ గోపాలురఁ గోరు కొని పదంపడి బలదేవు పాలికరిగి సహాయుంబడుగ నతం డుచితాలాపంబులఁ దనసాహాయ్యంబు పొసఁగదనిననంగీకరించి కృతవర్మం గనిపించికొని యట్లన పల్కరించిన నేకాక్షౌహిణీ బలంబులతోడఁ గలియవచ్చెదనని యూరడిలంబల్కి పుచ్చిన రామకృష్ణుల వీడ్కొని ప్రమదంబునకుఁ జేరె. ధనంజయుం డును సాత్యకిం బయనంబుసెప్పి కృష్ణుండోడ్కొని పురంబు వీడ్కొని మాత్స్యనగరంబు దరియ నేతెంచె నంత.

ఉ. అంతకమున్న వారణపురాధివిభుండొకపాటివానిఁగం
సాంతకుపాలికింబనుప నర్హ్మముగాదనితాన ద్వారకా
భ్యంతరమొందియాహారిసుఖాప్తిని సుప్తినియుండనుండె న
త్యంత ముదంబుతోడఁ దలయంపిదెసంగనకాసనోన్నతిన్.

గీ. ఆహావసహాయమడుగ మున్నటకువచ్చి
హారికిఁదలయంపిగూర్చున్న కురువిభుండు
తనరెనాతనియలికముతనదు మనము
లందు వక్రిమఁగనువేడ్కఁ జెందుకరణి. 16

సీ. వినిమీలనమునఁదార్కొనుకన్నుగనవాఁడు
మేనుబల్మరుజారఁబూనువాఁడు
ధ్యానసుఖైకర్షితతిపోల్కఁదగువాఁడు
నిడుదనొక్కొకయూర్పునెఱపువాఁడు

నవ్యక్తుఁడునుబోలెనమరువాఁడు
నపరంజివలిపెపైనలవరించినవాఁడు
కలువపూసెజ్జనొత్తిలినవాఁడు

గీ. మత్స్యకేతనశత్రు దుర్మదవిమథన
శాలి విజయునిపనిసేయు సామియనుచుఁ
గర్ణమునఁజెప్పచుండినగతిఁగపోల
ఫలకమునఁజెందు మకరకుండలమువాఁడు. 17

క. జలనిధిచెంగటికినిడిగి
సలిలముచేఁగడుపునించి జాతిసమూహాం

బులఁబొసియున్న మేఘము
చెలువునఁదగువాఁడునైన శ్రీహరియంతన్. 18

వ. తనయంతన మేల్కాని కన్నువిచ్చి యయ్యిరువురం గని తదాగమనం బెఱింగియు నెఱుంగని వాఁడుంబోలె వారలచేఁ దెలుపంబడి దురంబున గృహీతహేతిపాణులగు నారాయణ గోపాలురు నొక్కఁడొక్కండ చాలుమానసులు బలంబున నాయట్టివారు నవకోటి సంఖ్యఁదగు దళంబొక్క యుద్దియు నిరాయుధుండనై కేవలసన్నిధానంబున హితం బుపదేశించుచుండెద నేనొక్కండ నొక్క యుద్దియు, నీరెం డుద్దులయందు మీకిద్దఱ కెద్దియభిమతంబు గోరుండైనను నరుండు నాకు మొదలం గానంబడియె నిదియునుంగాక పిన్న వాఁడు గావున నతండు మొదట నేర్చికొనవలయు ననవుడు ఫల్గునుండు సమ్మోదంబునఁ గృష్ణుం గోరుకొనియె. అందులకు సుయోధనుం డతిప్రీతుండై నారాయణ గోపాలురఁ గోరు కొని పదంపడి బలదేవు పాలికరిగి సహాయంబడుగ నతం డుచితాలాపంబులఁ దనసాహాయ్యంబు పొసఁగదనినఁనంగీకరించి కృతవర్మం గనిపించికొని యట్లన పల్కరించిన నేకాక్షౌహిణీ బలంబులతోడఁ గలియవచ్చెదనని యూరడిలంబల్కి పుచ్చిన రామకృష్ణుల వీడ్కొని ప్రమదంబునకుఁ జేరె. ధనంజయుం డును సాత్యకిం బయనంబుసెప్పి కృష్ణుందోడ్కొని పురంబు వీడ్కొని మాత్స్యనగరంబు దరియ నేతెంచె నంత.

శా. సేనాసామజదానసౌరభిలవీచీవేగనిర్ధూతదు
ర్మానాభేదశవాత్తగో గ్రహణజన్యక్షోణ్యసద్గంధ సం
తానంబవ్విరశేంద్రుపీటి బహిరుద్యానప్రదేశంబునన్
దానారాయణుఁడున్నరుండుయమజున్సానందులై కాంచినన్.

క. కుంతీతనయుండును గడు
సంతసమున గారవించి శౌరియనుజ్ఞన్
దంతిరథాశ్వాదులతో
నంత నుపప్లావ్య పురమునందు వసించెన్. 21

గీ. శమనతనయుండుబంచిన చారుఁడో జ
మద్రపతిఁ గాంచి తావచ్చుమాటఁదెలుప
నతఁడునల్లునకు సహాయుఁడుగు తలపున
సైన్యములతోడవచ్చెఁ దద్సమయమునను. 22

సీ. దిగుపట్లపెండ్లిండ్ల తెఱఁగునఁగయిసేత
తుములమాంగళ్యతూర్యములమ్రోత
నెత్తిమీఁఱవలయుపానీయశాలాతతి
ప్రతిపదంబునసత్రపటలనియతి
కలితవర్ణోపరికాయ మానప్రౌఢి
దళితనిమ్నోన్నతస్థలనిరూఢి
గజవాజివృషభాదిక గ్రాసవిస్ఫూర్తి
వాంఛితాఖిలసముద్వస్తుపూర్తి

గీ. నెయ్యినూనియకట్టియల్ నీటిపాలితి
కూరగాయలు కలుపు లవ్వారిఁగాని

వెల్లతెరువున నొడగూర్చి యెఱుకపడక
నడచె శల్యునితోఁ గురునాయకుండు. 23

ఉ. అత్తఱి మద్రభూపతి సమగ్రతరంబగు మార్గవస్తుసం
పత్తికి మెచ్చి యెవ్వఁడొకో? వద్ధతినిట్లొనఁగూర్చెవానికే
నిత్తు నభీప్సితంబనుడహిధ్వజుఁడొయ్యనఁగానిపించెఁదత్
చిత్తమునందునంతసముజింతయువింతయుముప్పిరింగొనన్.

గీ. అట్లుపొడసూపశల్యుఁడయ్యధిపుఁ గౌఁగి
లించికోరుము నీకోర్కెనంచుఁ బలుక
నందులకుఁబొంగి హస్తిపురాధినాథు
డడిగెనాయోధనమున సాహాయ్యకంబు. 25

ఉ. నావినిశల్యుఁడిట్లనియె నాగపురీశ్వర! నాకు బాండవుల్
నీవును నొక్క రూప యగునేకద మున్నుగ వారుబిల్వసం
భావనబొంధుదల్లురని పక్షముగాదిపుడీవు వచ్చినన్
గేవలమిట్టువేడుట నకృత్యమునె నను రాదలంచితిన్. 26

క. కావునధర్మజుఁ బొడఁగని
వేవేగనుపత్తుననుచు వీట్కొల్పి ప్రియం
బావహిలఁబొందునృప తన
యావలికడకేఁగె వారలనుమోదింపన్. 27

వ. ఇట్లుపప్లావ్యంబుఁ బ్రవేశించి ధర్మజు నివాసంబు దరియవచ్చునెడ నజాతవైరి యనుజ తనుజ సుహృజ్జన సహితుండై యెదురవచ్చి మ్రొక్కిన దీవించి యతి స్నేహంబునఁ గౌఁగిలించుకొనియె నంత సముచిత ప్రకారంబుగాఁ దోడితెచ్చి

కొల్వుకూటంబున సుఖాసీనుం జేసి తారును నతని పనుపున నుచితాసనంబుల నలంకరించిన సమయంబున మద్రపతి కౌంతేయాగ్రజున కిట్లనియె. 28

చ. పడితిరి పెక్కుబన్నములు పాండుకుమారక! యింక మీఁదఁ బెం
పడరఁగ నప్పురందరుని యట్లు సురేంద్రుని గారవంబునం
దడబడకుండ సంపదలు తమ్ములు పుత్త్రులు దుష్టచిత్తుఁడై
చెడఁగల డాసుయోధనుఁడు శిష్టున కిట్లపకారి గావునన్. 29

వ. మున్ను హరివంపున బలభేది వృత్రుని నిర్జించి తద్బ్రహ్మహత్యాపాతక నిర్ముక్తుండగుటకు నిషధనగంబునఁ దపంబు సేయునెడ సురలు తమకు రక్షకుండు లేమిం జేసి నహుషుండను రాజర్షికి నిజతేజోబలవిశేషంబులొసంగి యింద్రపదవి కభిషిక్తుం జేసిన వాఁడొక్కనాఁడు దైవయోగంబునఁ బులోమజం జూచి యామె ద్దియను దగులు సేయునది యని మునులఁ బంచిన వారు బృహస్పతి కడకేఁగి పులోమజ విన నవ్విధం బెఱింగించిన వాచస్పతి యనుమతి నయ్యువతి కపటమతియై నహుషు పాలికేఁగి వానితమకంబుఁ గని కతిపయ వాసరంబులు నెడగలుగు సమయంబు జేసి యొడఁబఱచి క్రమ్మర నిజనివాసంబునకుఁ బోయి నిశాసమయంబున నుపశ్రుతి నారాధించినయద్దేవి దాని పాతివ్రత్యంబునకు మెచ్చి పొడసూపెం మహేంద్రుండు నెలవునకుఁ గొని చని యంతర్ధానం బయ్యె ననంతరంబ తన కాంత వలన నహుషు వృత్తాంతం బెఱింగి వాసవుండు నిజపాతకంబున విముక్తుండయ్యును బలంబున వానిం గెలువలేమి విచా

వించి పులోమజకిట్లనియె. 30

సీ. నాతిక్రమ్మరనీవు నహుషు పాలికిఁబొమ్ము
గామాంధుఁడై వాఁడు గవయఁదలఁప
మునివాహనుండనై చనుదెంచునాఁడునీ
యభిమతంబీడేర్తుననుము దానిఁ
గావింపఁదలఁచిన కష్టాత్ము తేజంబు
దలఁగిపోయెడు నంతబలముమెఱసి
పొరిగొందు పుయిలోట బొందకచనుమను
డట్లన పఱతెంచియతనిఁగాంచి

గీ. పలికెనీవును మునివరవాహనంబు
గాంచుటనుగాని నీతోడ గలసియునికి
యగునె?యదియునుగాక ననన్యలోక
విభవమదిగాదు గావున వేగఁజెందు. 31

క. అనవుడు నహుషుండిట్లను
మునులెల్లరు వాహనంబు మోయఁగఁ జనుదెం
తును వీని కింతమదిలో
వనజాయతనేత్ర తలపవలెనే? యనుచున్.

వ. మునులరప్పించి తద్వాహనుండై చనునవసరంబున వారు బ్రహ్మణ్యంబులగు మంత్రంబులు నీకుఁ బ్రమాణంబు లగునే యని యడిగిన వాఁడు తన్మంత్రంబుల నిషేధించి పలికె నందులకు గొండొక తడవు వివాదంబు నడచిన గోపించి యగస్త్యమస్తకంబుఁ దన్నిన నమ్మహాముని యలిగి వాని నహి

రూపంబున నిహాలోకంబునం బుట్టుమనిశపించె. మగుడఁ గరుణించి కొండొక కాలంబునకు భవదీయ వంశజాతుండైన యజాతశత్రువు వలన శాపవిముక్తుండవగుదువని యానతిచ్చె నతుఁడంబ వాఁడు సురగరూప ధరుండై యింద్ర పదంబునకుఁ బాసి పుడమిం బుట్టి సుర ముని గంధర్వాది సంఘంబు లింద్రు నారాధించిమగుడ నమరావతిం బట్టంబుగట్టిరి. కావున నీచుండగు సుయోధనుండు నహుషు తెఱంగునఁ జెడగలండు సత్య సంధుండవగు నీవు మహేంద్రుకరణి నెల్లధరణిం బాలింపఁగల వని వెండియుఁ బాండువాగ్రజున కిట్లనియె. 33

క. హరి నీదెస గలుగను దు
స్తరమెయ్యది గలదు నీకుఁ దలపోయఁగ నో
కురువంశదీప మదిలో
గరము విచారంబుమాను కౌరవులమెడన్. 34

గీ. అనుచుఁ బలికియుఁ దావచ్చినట్టి తఱినిఁ
గౌరవేశ్వరుఁడును ద్రోవగానఁబనుట
నతనికిచ్చిన తన వరం బవుడు సెప్ప
విని ప్రమోదంబుతోఁ బాండవేయుఁడనియె. 35

క. మంచిది యొనరించితిరిది
కొంచెపు చూపతనినిఁ గనుఁగొనమియ తగు నా
కిం-ంచుక నే వేఁడెద మ
న్నించి మముం గరుణ జేసి నిలువుము మదిలోన్ 36

క. హరి నరునకు సారథియగు
దురమునఁ గర్ణునకు నట్ల తోడగు నెడ నీ
వెరవగు తెఱఁగుననాతనిఁ
బరిభవ మొనరించి పార్థుఁ బ్రతికింపనగున్. 37

వ. అని పలికి భోజన శయనాసనాది కృత్యంబుల శల్యు
నకు సాకల్యంబుగా వైకల్యంబు నేసి యతండు పయనంబై
కదలి వచ్చునప్పుడు దమ్ములుం దానును గొంతదవ్వనిపి వెండి
యు మద్రేశ్వరునకుఁ బాండవాగ్రజుండిట్లనియె. 38

ఉ. చెప్పఁగనేల? నింకఁగృపచేఁ గురురాజునకున్ వరంబుమీ
రొప్పఁగఁద్రోవనిచ్చితిరియుద్ధమహీన్ మముమీమనంబునన్
దప్పక నిల్పి మావరము దప్పక కర్ణునకుం గలంకగా
నొప్పనిమాటలాడి యతఁడోడుటగాఁదలపోయుమాతులా!

గీ. అనిన ల్లునరపై నెన రతిశయిల్ల
సత్య సంగర కానిమ్ము సంగరమున
నీదుమేలునకై గత నిదురఁగాఁగఁ
దలపుమీ నన్నటంచును బలికి యంతం. 40

క. పాండుకుమారుల వీడ్కొని
చండాంశ నిభుండు మద్రజనపతి జని వే
దండ పురాధీశ్వరు కడ
నుండెం గడు నతనిమనము నుత్సాహింపన్. 41

ఉ. మాళవ కొంకణ ద్రవిళ మత్స్య కరూశ మరాటలాట నే
పాళ విదేహ పార్వతిక బర్బర కోసల ఘూర్జ రాంగ పాం

చాల పుళింద సింధు కురు జాంగల వంగ కళింగచైద్యభూ
పాలకులేగుదెంచిరొగిఁ బాండవ కౌరవ పక్షపాతులై 42

వ. మరియు సకల దేశంబుల వలన ననేక రాజలోకం
బులుచతురంగబలసమన్వితంబులై చనుదెంచి తమకుఁగూర్చు
దెసలఁ గలసి విడిసె నయ్యవసరంబున బ్రతిదినోప చీయమాన
నానావిధ భూనాథ వరూథినీ కలకలాడంబర సంభవ సమాగత
కంకకాక సాలవృక (జంబుక) నికురుంబ నాద కటూకృత నిక
ట స్థలంబులం దగికురూపప్లావ్య నగరంబు లొప్పెనప్పుడు 43

గీ. సోమకేంద్రుఁడు పంచిన భూమిదేవుఁ
డిభపురంబున కేఁగి విహిత గతులను
గురుని భీష్ముని ధృతరాష్ట్రధరణిపతిని
విదురునిం గృపుఁడాదిగా వెలయు దొరల 44

వ. సమయంబు లెఱింగి నగళ్లలోఁ బ్రవేశించి యొంటి
పాటునఁ దగుతెఱంగున బొడఁగని విహితాలాపంబు లాడుచు
నీక్రమంబున వచ్చుచుం బోవుచుఁ గొన్నిదినంబుల నందఱి
వలన మన్ననలు వడసి యొక్కనాఁడు మంత్రిసామంత బంధు
మిత్ర కుమార గురుప్రభృతి నిఖిల జనంబుగొలువఁ బేరోలగం
బున్న ధృతరాష్ట్రుకొలువుకూటంబునకరిగిసమ్మానితుండగుచు
నాసీనుండై యందఱు విన రాజునకిట్లనియె. 45

సీ. గంగలోఁ ద్రోచియు గరళాన్నమిడియును
పెను బాములను గఱపించి లక్క

గీముల నిశియందుఁ గృత్రిమ గతిఁ జిచ్చుఁ
దరికొల్పియునుమాయ దగు దురోద
రంబాడి సభను వస్త్రములూడ్చి యడవుల
కనుచుటయును నివి యాదిపెక్కు
కడగండ్ల పెట్టితిరెడపక నక్కటా !
పాండవేయులనింతపాపమెందు

గీ. గనమువినముగదా మీరుగన్నకొడ్కు
గాదెమీతమ్ముఁ డరయంగఁ గన్నకొడ్కు
దండ్రిదప్పినకూనల దయనుమాలి
కాఱియనుబెట్టఁ జెల్లునా ? కౌరవేంద్ర. 46

క. వారలుమీయెడ నొకకీ
డారయఁజింతింపఁ జూడ రనిశముమీరే
యూరకలోభము చేఁదెగ
బారుమరెన్నింటికైనఁ గౌరవముఖ్యా ! 47

క. అది యటులుండెను ద్రిజగ
ద్వితితుండగు పాండువసుమతీ విభునగ బా
లిదె కొమ్మని రమ్మని నె
మ్మదిచే నీఁకనైననిచ్చి మనుపగరాదే ? 48

క. పాండవులు కౌరవులు నీ
రెండుదెఱంగులను నొక్కరీతియ మదిలో
నొండువిచారము బూనుట
నుండీ కలహామునకిట్టి చొప్పె యొప్పేణ. 49

వ. వార లలంతురనితలంతు రేని. 50

మ. హరునాలంబుననోర్చిపాశుపతనామాస్త్రంబుఁగైకొఁడెనం
గరభూమింగడుచిత్రసేనముఖు తా గంధర్వులంగెల్చి యీ
కురుకోటిక్ విడిపించె నిన్నసకదా గోబృందముంద్రిప్పె నొ
క్కరుఁడేకాడెనరుండు?మీకునోడువంగావచ్చునేపోరునన్.

క. నరుఁడననేటికిఁ దత్తో
దరులఁ దలంపంగ నొకఁడు తక్కువగలఁడే?
వరశౌర్యశాలులయ్యే
వురునిదియును గాక మాధవుఁడు గలఁడచటన్. 52

మ. సకలలోపాయపరుండునై సచివుఁడై సర్వజ్ఞుఁడామాధవుం
డొకఁడచ్చోటను వారిమేలునకుదా నుద్యోగియైయుండమీ
కేక సందేహముబొందదే గొలుతు మేమేయుంచుదుర్భ్రాంతిబో
వక పాండుక్షితిపాలపుత్త్రులకు పాల్పంచిచ్చుటొప్పుంధరన్.

గీ. ఇన్నిబాములబడియు నొక్కింత మనసు
గందకయమిమ్ము నొక పెద్దగాఁ దలంచి
తండ్రిపాలిచ్చియుంచిరి తగవుమెరసి
కానఁబరువున మురిపంబు గనఁగ వలదే? 54

క. అని బహువిధముల నాతఁడు
చనుతెలుఁగున వెరపుమిగుల సభనందఱు నొ
య్యన వినఁబల్కిన గంగా
తనయుఁడు ధృతరాష్ట్రుతోడఁ దగనిట్లనియెన్. 55

ఉ. అక్కట! పాండవేయులదియాతమభాగ్యమువీటఁబుచ్చితా
రొక్కటనిట్టియాపదలనొందఁగఁ బొల్పమువారెనీమదిం
గక్కసమయ్యెదైవము మొగంబయినంగలబోలదే సుతుల్
వెక్కసమైనరీతిఁదగునే? యని మాన్పఁగఁజాలవెన్నఁడున్.

క. పాడియని వెన్కముందుం
జూడక లోభమునకెపుడు జొచ్చెదుకాదుం
గూడదని వగవుమై తెగ
నాడవు పక్షమున నీ యనర్థమె పొసఁగెన్. 57

క. వగదెంచి వారిఁ బిత్ర్య ధన
మగు రాజ్యము బంచియిచ్చి యనవ్రగబోరుం
దెగటార్చిన మనములలో
నొగ వదలఁగ వారు వీరునున్నృప ! మనరే. 58

క. ఈవిప్రుఁడు సెప్పినగతి
భూవర ! పాండవులఁ బిలిచి పొందొనరింపం
గావలయునట్ల యేనిన్
వావిరిఁబొల్చిరు గలయువలెనై యుంపున్. 59

ఉ. నావినికర్ణుఁడిట్లనువినందగు లోకములోన జూదముల్
భూవరులాడరే? యటులపో తగనాడిరి సౌబలుండు దా
నీవిధుఁగొల్వఁజేసెఁదమరిప్పుడు దత్సమయంబుభంగమై
పోవఁగనిచ్చి పాలడుగఁబోలునె? నేరమిగాదె వారికిన్.

క. కూటవమూఁకలఁగొని తమ
పాటియొకింతయును మాని బల్మినడుగ ని

చోఁటనె? వరపతులయ్యెడ
కేటికి ధరఁబాలొసంగు నీకురు విభుఁడుఁ. 63

చ. అనవుడు భీష్ముఁడిట్లనియె నక్కటనాఁడెఱుఁగంగఁజెప్పనే?
జనపతితోడనిన్నఁటికి సంకటముల్ కడముట్టెఁబాండునం
దనులకటంచు నిప్పుడది తప్పని రేచెడు నీచ! నీకుసి
గ్గనయఁగలేదు బంటువలెనే వెడమాటలుప్రేలెదిచ్చటన్.

వ. అనవుడు. 64

గీ. అంబికేయుండు నివియెల్ల నాలకించి
కర్ణుఁగోపించి భీష్ముని గారవించి
సుతుని దెస నేరమెంచి భూసురునిమంచి
మాటనగ్గించి యిట్లనిమందలించె. 65

క. ద్విజవర ! నీచెప్పినగతి
సుజనోత్తములైన పాండుసూనుల నిటకున్
నిజముగ రప్పించిమదిన్
గజబిజిలేకుండఁ బ్రియముఁ గావింతుఁజుమీ ! 66

వ. కావుననీవుమున్నరుగమని వస్త్రమాల్యాభరణంబు
లొసంగి వీడ్కొల్పిన నాబ్రాహ్మణుండు సంతసంబున నుపప్లా
వ్యంబునకు వచ్చి యచ్చటి తెఱంగుఁ గౌంతేయులకుం జెప్పె
నంత నిచ్చట ధృతరాష్ట్రుండు కొల్వువారల కిట్లనియె. 67

క. నాకొడుకు దుడుకులన్నియు
లోకము నాతలను జుట్టిలోభియనుచు నీ

కాకునకు వగతుమదిని వి
వేకము గానఁడు సుతుండు వెంగలి యగుచున్ 68

చ. అనలము చీరచే ముడిచినట్లన కాదగు వాంఛ్రతంద్రిపా
లనయము మేరదప్పి మనమచ్చి కొనందలపోయనబ్బునే?
ఘనభుజులొక్కఁడొక్కఁడుజగంబులనొక్కటిసేయమృత్యువుం
దునుమఁగనైనఁ జాలు రణదుర్జయులూర్జితవిక్రమంబునన్.

క. మునుదెసలఁగుడుచు కతమున
మనముల మనములకు నమ్మహానుడురైనన్
నెవరుగలఁడయ్యుధిష్ఠిరుఁ
డనుజన్ముల కలకఁబాప నగు సంధికినై. 70

వ. అని సంజయురావించి యతని కిట్లనియె. 71

ఉ. భవ్యచరిత్ర పాండునరపాల కుమారకులిప్పుడయ్యుప
ప్లావ్యముఁజేరిరా విభుల పాలికిఁ గ్రన్ననఁనేఁగి వారి చి
త్తవ్యథఁబాయునట్లు లుచితస్థితిఁ జల్లనిమాటలాడికౌ
రవ్యులతోడిపొత్తునకురాజులఁజేయుముపొమ్ము నెమ్మదిన్.

క. అని కుశలము సెప్పియుఁ బం
చిన నతఁడు ప్రసాదమనుచుఁ జే మొగిచి రయం
బున రథమెక్కి యుపప్లా
వ్య నగరమున కేఁగుదెంచి యధిక ప్రీతిన్. 73

వ. వలనగు నొక్క గృహమేధి మందిరంబున విడిత
లగా విడిసి నగనారాయణు లభ్యంతర నిశాంతంబున నొక్క
సెజ్జనుండుట ప్రతీహారుల వలనఁ దెలిసి తనరాక చెప్పివుచ్చి

తదనుమతిఁబడసి సమీపంబున కరిగి భయ సంభ్రమంబులు బెనఁగొన నంతనంతఁ జేరి వినతుండై యథోచితాలాపంబులఁ గొంతప్రొద్దు గడపి మరునాఁడు సమయంబెఱింగి ధర్మజు సందర్శించి ప్రణామంబాచరించి యతని యాదరంబున సంతసిల్లి యాసీనుండగుచుఁ గేల్మోడ్చి యిట్లనియె. 74

క. కడుఁగష్టమ్ముల నెడపక
కడపి పునర్జన్మమట్లు గావచ్చిన మి
మ్మడరఁగఁ బొడఁగనఁ గంటిని
గడుముట్టెను నాతపంబు గౌరవ మెసఁగన్. 75

గీ. వినుము మీతండ్రి ధృతరాష్ట్రవిభుఁడు నన్నుఁ
బంచె మిమ్ములఁ దమ్ములఁ బరమభాగ్య
వతియుఁ బార్షతిలోనగు వారినెల్లఁ
గుశలమడిగెను నెయ్యముకూర్చు కతన. 76

వ. అనిన సూతనందనునకు ధర్మనందనుం డిట్లనియె. 77

క. ఆవిభుని కరుణ నిప్పటి
కీవిధమున నున్నవార మిటవారల కం
దావిదురునకును భీష్మము
ఖావళికిన్ సేమమేకదా! సూతసుతా! 78

సీ. పుడమివేల్పులువృత్తి నడుపుదురే? తమ
శ్రితులభృత్యులఁబ్రీతిఁ జేయుచుండ్రె
గాంగేయుఁడాదిగాఁ గలకురువృద్ధుల
మాటఁ జెల్లింతురే? మనవిగలదె?

కడుఘోషయాత్ర గోగ్రహణంబులోఁ గొ్క-క్క
తఱినైన నెమ్మది నెఱుఁగఁగలరె?
కార్యఖడ్గంబులఁ గలఁడనికర్ణుని
మన్నింతురే? బహుమానములను

గీ. పగర దురమున గెలువనిపట్టునేని
మన వృకోదర నరులున్నఁ గినిసి వీర
లనుజయింతురటంచుఁ గూర్మినిఁదలఁతురె!
యన్నదమ్ములు నొద్దిక నున్నవారె? 79

వ. అనిన సంజయుండిట్లనియె. 80

క. దేవర! మీచెప్పినగతి
నీవరకొక్కింతయిట్లు నెసఁగెడు నిటపై
నే విధమగునో! యైనను
నే విధమేమిటికి మీర లిఁక నరయంగన్. 81

గీ. వినుఁడుధృతరాష్ట్రవిభుఁ డతివృద్ధుఁడగుటఁ
బడుచుకాపురమయ్యె నప్పార్థివునకు
సంతులంతకుఁగలరు దుర్మతులుగాన
నొకనిపలుకొక్కనికిఁ గాకయుండునయ్య. 82

క. ముదిమదితప్పినమాటని
గదురుదు రాసుతులు వారిఁ గాదనలేఁడా
పెద తొర మోహంబున నా
పదలకుఁ దుదినగ్గమగుటభావింపఁడెదన్ 83

వ. కావున నతండేమిసేయు గురు భీష్మాదుల కెట్లుదీర్ప వచ్చుఁగొడుకుంగినిసి చెప్పినవినండేనియని సంజయుండు వెండి యునిట్లనియె నమ్మహారాజు మీాతోడ విన్నవింపుమను నుడువులు గొన్నిగలవు చిత్తగింపనగునని భీమాదులగు తమ్ములు ను వాసుదేవాదిబంధులును, తక్కటి వీరయోధ నికాయంబు ను విన నిట్లని విన్నవించె. 84

సీ. వత్సలుండవు నయ స్వాంతుండవును సమ
దర్శనుండవు నింగితజ్ఞమతివి
పరుసతనంబు నీ పజ్జలనున్న వా
నికినేని లేదిది నిక్కవంబు
విపరీతమగుత్రోవ విహితపథంబని
మీాయట్టిసజ్జనుల్ మెలఁగఁదగునె?
గుణవృద్ధుఁడవుపొద్దు గుణమునఁబుట్టిన
పనులుచిత్తంబున నునుపవలదు
ఆ.వె. గానవేయుఁజెప్పఁగానేల? సంజయుం
డెద్ది గఱవునట్టు లెసకమెసఁగ
నడువ నడుపదగిన యెడయుండ విందుల
వేరుగలదె? నీదు విధము గడవ. 85

వ. అనిచెప్పెననిచెప్పి మరియు సంజయుండిట్లనియె.

క. ధృతరాష్ట్రుఁడుశాంతత దన
మతి నలవడఁజేసెనింక మముబోటులకున్

హితమయ్యె సకలజన స
మ్మతమయ్యెను మీరలిది సమర్థింపనగున్. 87

గీ. సకల భూతచయంబున సమతఁజేయు
నట్టిశాంతులు మీయట్టి యనఘమతులు
కడిఁది కర్జము నెమ్మది నుడువఁదగునె?
పొందునకుమాలి యపకీర్తిఁ జెందనేల? 88

క. బాలుర బంధుల వృద్ధుల
నాలములోఁ జంపికాంచు నైశ్వర్యము మీ
కేలా? యిప్పట్టునఁగడు
మేలా? వనవాసమైన మేదినినాథా! 89

ఉ. పెద్దవుగావె? కూర్చినడిపింపఁగ బాధ్యము లేదె? నేరమిం
దిద్దగఁజెల్లవే పరులుదీర్తురె వారల దూరు మీయెడం
గద్దుగదా జగంబులను గౌరవులిట్లని కానవిప్పుడీ
సుద్దులునాలకింపు తెగఁ జూడకుమీ ఋజుబుద్ధిపార్థివా. 90

క. ఒకకష్టాత్మునకై తన
సకలజనంబులనుదుంపఁ జన దెలుకకునై
యకట! యిలుజిచ్చువెట్టుట
పొకటగుణా! సైరణంబు భావింపుమదిన్. 91

క. నీవెంతదలఁతువదియెటు
గావింపఁగఁజాలుదెట్టి కడిఁదియునైనం
గావున శిశిరాత్ముఁడవై
భూవర! నీతమ్ములట్లఁ బ్రోవుమువారిన్. 92

గీ. ఒచ్చె మొకని కతంబున వచ్చునేని
యడచి సడిఁబుచ్చి సైరింప నగునుగాక
వెన్ను వెలిఁజేయుకార్యము వెలితిగాదె
యమలచారిత్రులైన మీయట్టి ఘనులు. 93

సీ. మిత్రినై ననులావు మెఱసిభంజింపఁగఁ
జాలును వడముడి శౌర్యశాలి
దేవాసురులనాజిఁ దెగడినవాఁడు వి
వ్వచ్చుఁడు బాహుదుర్వారబలుఁడు
సంగరంబున సడిసన్న వీరులు కవల్
రిపులఁ దా రెపుడుఁ జీరికినిఁగొనరు
తక్కినయీయున్న ధరణీశులొకరొక్క
రావరించెదరు ముల్లోకములను

గీ. వీర నఘటితఘటనాత్ముఁడైకచతురుఁ
డీముకుందుండు మీయందు నెపుడుగలఁడు
పరగ నిటువంటివారిఁ జేపట్టుమీకుఁ
గలన జయమననేపెద్ద గలఁదుచెపుమ. 94

సీ. ఇంతవారనిచెప్ప నేటికిఁగురుల శ
రాసనాచార్యు లత్యంతబలులు
చిరకాలజీవి సంగరకోవిదుఁడు ద్రోణు
పట్టిబల్విడుగైనఁ బట్టఁగలఁడు
పరశురామాదుల భంజించి సడిసన్న
వాఁడుశాంతనవుఁ డెవ్వరికినలవి

సహజ కుండలకవచ స్ఫూర్తిఁదగుకర్ణు
నోర్వంగఁజాలునే యుగ్రుఁడైన
గీ. శకునిసైంధవ బాహ్లిక శల్య సోమ
దత్తభూరిశ్రవులు నాది ధరణిపతులు
దా రొకళ్ళకు దురమునఁ బోరు మేటి
మగలు కన్నెత్తిచూడఁగా నగునె తెలియ. 95

క. ఈ రెండు తెఱంగులగల
వీరులపోరితము లోక విపరీతముగా
నారూఢిజనక్షయమగు
వారక నిదిగాకయుండ వారింపవయా. 96

వ. అని పెక్కుతెఱంగుల వేఁడికొని మ్రొక్కి కొల్వు
నం గలవారలఁగలయం గనుంగొని వేర్వేరఁ గేల్మోగిడ్చి లగ్గగు
శాంతివచనంబుల నొడంబఱచు సంజయునకు ధర్మనందనుం
డిట్లనియె. 97

క. వింత వినంగను సంజయ
శాంతిమెయిన్ నెయ్యమునకె సమకూడెను నా
స్వాంతంబొండుఁదలంచునె
యంతలు గౌరవులుజేసి నప్పుడయేనిన్. 98

క. నాయందుఁబథ్యమెడలిన
నామెడనొక యాడికోళ్ళు నరయ రొకటికిన్
రోయరు భీమార్జును లవి
జేయరె? దుష్కర్మమైన సిద్ధముగాఁగన్. 99

వ. కలహంబు సంతాపకారియగు నై నను తొంతపించుబున గాని క్షత్త్రియున కెద్దిసమకూడనేర దధర్మంబున కోడుటగదా మాయందఱ కత్త వాటించి కొడుకుంబట్టి యింతలుజేసె నిది యునుంగాక. 100

గీ. వినుము సౌబలుండును సుయోధనుండుదుస్స
సేనుండును గర్ణుండును నెద్దిసెప్పిరట్ల
సేయు నారాజు మరియొండు జేయఁడెప్పుడు
నదియు గురుమంత్రమట్ల నెమ్మదిఁదలంచు. 101

వ. అట్లు దలంపం డేని. 102

క. కొడుకు వెడమాటలనుబ్రియ
మడరఁగ నూకొనక కుపింగ నాడినయంతన్
సడియుడిగి చక్కఁబడు న
వ్వడమువిభునకట్టి తలఁపుబుట్టునె? లోనన్. 103

క. కొలువున మమ్మల నాకిృయు
తులువతనంబట్లుసేయఁ దుదినై నను దా
వలదని పలికిన నెమ్మనిఁ
గలకంబడడేల? యింతకార్యము పొసఁగన్. 104

క. తనకొడుకుచేయుకృత్యము
లనువుగ నవియొట్టినైన నధిపతినమ్మన్
వినువిషముమిఁంగినన్ మరి
జనదనఁడుహరించికొనఁగ శక్యుండనుచున్. 105

ఉ. కావున రిత్తవచ్చితివిగాక ప్రయోజనమెట్లుపొందు నీ
వా విభుచిత్తముం దెలియవా? యది యుండఁగ నిమ్ము సంజయా!
యేవిధిపక్షపాతమున నెన్నతి మమ్ముల మున్నుగా సమి
తోర్విదులంచుఁ బిమ్మటను గొప్పఁగ వారల నెన్ని తెట్టులన్.

క. గురుకృప భీష్మాదులకును
కరణియె యాయూరుగెల్వ గనుచేయూహా
విరటుని పని కడఁ దెలియదె?
తరమే యర్జునుని చేతి తడియాఱినదే? 107

ఉ. వారలు పోటుబంటులన వల్వదటుండఁగ నిమ్ము మమ్ములం
దూరెద వేని దూరు మొకతోఁ వను ధర్మమధర్మమంచు నీ
నేరము మాతలం గలుగ నిల్పుము రిత్తనెపంబులెన్నఁగా
గోరకు నీకు నెక్కటియగున్ మొగనోటపు మాటలాడగన్

గీ. జూదమాడరె? నృపులు నెచ్చోటనైన
కృతకమున నిట్లు నిలిచిరే? గెలువనిమ్ము
తెఱవ నెవ్వఁడు రచ్చకుఁ దెచ్చెఁ దెచ్చెఁ
బుట్టమూడ్చనదుర్బుద్ధి భువినిఁ గలఁడె? 109

ఉ. అక్కట! యాలిచీర సభనాగతిఁ దాఁ లువంగ ధర్మవుం
జిక్కినవారమై యొకటిసేయఁదలంగితి మాఁడుకూయికిన్
దిక్కుముకుందుఁడయ్యెనట దేవనదీసుతుఁడున్ గురుండు నా
తక్కటివారు నేమియనఁదక్కిరి సంజయ! యేమిచెప్పుదున్.

గీ. అట్టిపరిభవమునకు నాయంతరంగ
మవయుచున్నది యిప్పటికైన నీదు

ప్రియముచే సంధికంగీకరింపవలసె
మాయునే? వారికృత్యముల్ మా మనముల. 111

చ. అనవుడుసంజయుండు దనయాస్యమువెల్లనఁబోవ నేమియుం
దోనఁకక నిట్టుబల్కెనృప! దుర్జనుఁడైన సుయోధనుండు నే
సీనపనులుగ్గడింప నిఁకఁజెల్లునె? మీరుదయాళులీసుఁ బా
పినఁ గడులెస్స యిన్నిదలపెట్టిన కార్యము హత్తనేర్చునే? 112

గీ. కురువిభుఁడు నెయ్యమున కియ్యకొనఁడయేని
పుడమిపాలునకై కదా పోరితంబు
కడిఁదినెత్తురుకూడిది కుడుచుకంటెఁ
బుడుకుగూడైనమేలు మా నడవడికిని. 113

చ. నలువుగరాజసూయ సవనంబొనరించి ప్రసిద్ధిఁగాంచి వి
ప్రులకు సమస్త వస్తువులు పొందగనిచ్చి నికృష్టులైన యా
తులువలతోడిజూదమున దుఃఖములంగడముట్టనోర్చి పెం
పలరి యనిత్యసౌఖ్యమున కందఱినిం దుదిఁజంపనేటికిన్.

క. గరళము కన్న క్రేఁగై
పరగెడుకోపంబుమ్రింగి పరమంబైను
స్థిరమగుతాలిమిఁబూనిన
చిరయశుఁడవు రిత్తనిందఁజెందగనేలా? 115

వ. అనిన ధర్మనందనుండిట్లను నీ చెప్పినంతవట్టు నైజం
బైనను విప్రులకు యజనాదికర్మంబులట్లు రాజులకు సంగ్రా
మంబు లవశ్యకర్తవ్యంబులని పెద్దలవలనవిందు మిదిగాదని నీ
వనిరూపింపుము. మనకుఁదర్కంబేల? ఉచితానుచితపరిదర్శకం

డగు సుదర్శనాయుధుండుండ నతండెద్దిచెప్ప నట్లగుంగాకయని
నఁ గృష్ణుండు సంజయునకిట్లనియె. 116

క. కౌంతేయుల మేలునకై
సంతతమేగోరుదిపుడు శాంతమతిన్ మా
కాంతుఁడు దెలివిని వీరల
చింతంబాపఁగనుబంచెఁ జిత్తమువచ్చెన్. 117

గీ. నీవు నుచితజ్ఞుఁడవు గడు నీతిపరుఁడ
వెల్లభంగులసంధికి నుల్లసిల్లఁ
బోనఁగఁబలికితి నెయ్యముఁబుట్టఁ బాండు
సుతుల నిందుకునాకు సమ్మతమునయ్యె 118

క. యమతనయు పల్కుబడి విన
నమరని తెఱఁగయ్యెఁబొత్తు నటకౌరవులం
గ్రమమున నెఱుఁగుచునే యుం
దుము పొసఁగుట సంశయంబు దోఁచెన్ మదికిన్. 119

చ. వినుమొకయింతదప్పిక్కొన వీరలకేటికి? తాల్మిఁబూని తా
రనయముఁబడ్డబన్నముల నాత్మఁదలంపక పొందునేసినన్
జనునిదిగాకతక్క మదిసై రణమూని మహోగ్రవృత్తిచే
నెనయఁగఁబాలికై పయికి నెత్తిన నెత్తిరిగాకదోషమే? 120

గీ. ఏలసంజయ ! వారలనెద్దినేయ
ద్రోహముగుబెట్లు సతిఁదెచ్చి రోయకిట్టి
పరిభవంబొనరించిన పాపకర్మ
లక్కటా! సంధిచేసిగా నాడెదీవు. 12

క. మేలే ధృతరాష్ట్రునకీ
కాలమునకు నెనరు బుట్టెఁ గౌంతేయులపై
నాలమువలదని తీయని
యాలాపములొనర మెచ్చు లాడెదవిచటన్. 122

గీ. విషము నిడునాఁడు గంగలో వేయునాఁడు
నిండ్లఁ జిచ్చిడునాఁడు నయ్యింతి వలువ
గొనెడునాఁడును గానకుఁ బనుపునాఁడు
లేకపోయెను విభునకీ జోక మదిని. 123

క. వినుము యుధిష్ఠిరుఁ డడిగెను
జనపతులకుఁ బొడిచికొనుట జను బ్రాహ్మణులన్
బనుపడి యడిగికొనందగు
ననయం బన్యాయమగునె? యాహవమెందున్. 124

ఆ.వె. అయిన వీరు వారు నన్యోన్యమును నెమ్మి
జేసిరేని మనకు వాసి గాదె?
మేలు జూడఁగోరఁజాలు వారలు గాక
చేటుగోరదట్టి చెనఁటిమైన. 125

సీ. విను మాన్య! నీవు చెప్పిన దారిఁ బోవక
తుది రిత్త యారడి తోవ యేల?
నేనచ్చటికి వచ్చి నీతియు భీతియు
నొనరఁ గౌరవులకు నొత్తి బుద్ధిఁ
గఱపి చెప్పెదునట్లు కాదేని యప్పటి
తెఱఁగుచింతింపక తీరదెట్లు

చేలతనంబున బిరుదు లుపచరించి
యింతవారమనంగఁ బంత మేల?
గీ. నొడఁబడమి లేనిచో వారి పడెడుపాటు
లేరికిని లేవు పాండుకుమారు లొనర
సభను బల్కిన ప్రతినలు సలుప కేల
యూరకుందురు మిన్ను పై నొరఁగఁబడిన. 126
చ. పనివడనేర్పునంబొసఁగఁ బట్టెద నోపినయంతయుం దుదిఁ
వినక తలంగరేని యిఁక వేయన నేటికి భూరి భీమ ఫ
ల్గున పటుశౌర్యవహ్ని దరికొల్పకపోవునె? నీవు మున్నుగాఁ
జని నయమొప్పఁజెప్పుమట సారెకు నూరకబల్కఁజూడకఁ
వ. అనిన సంజయుండు ధర్మజుం గనుంగొని యిదివో
లునేకదా యింకఁ బనివినియెడ నావచ్చినకార్యంబు సఫలంబ
య్యె నని భీమార్జున నకుల సహదేవ సాత్యకి పాంచాల విరట
ప్రభృతులగు వారలంజూచి మీయందఱచేత నామంత్రితుం
డనకదా యను నప్పుడు యుధిష్ఠిరుం డిట్లనియె. 128
సీ. ఇడుములు సన సేమ మడరనున్నామని
గాంగేయునకు నమస్కార మనుము
గురు కృపాశ్వత్థామ కోవిదులకునెల్లఁ
బ్రణుతిఁ జేసితినని పల్కవయ్య
దుర్యోధనాదులతోడ నే నడిగితి
నని చెప్పు సామంతులైన దొరల

నితఁ భూపతుల నీ వేయేవిధంబులఁ
బల్కఁగాఁదగు నట్లు పల్కు ప్రీతి
గీ. నెల్లరకు నెయ్య మాత్మల నుల్లసిల్ల
వలయు వెరవున మాటాడవలయుఁ జుమ్ము
వినుము మాతండ్రి ధృతరాష్ట్రవిభునిఁ జేరి
ప్రణతి నా మారుగాఁ జేసి పలుకు మిట్లు. 129
ఉ. పిన్నట నాట నుండియును బెంచితి వెత్తితి విప్ప డీ గతిన్
మన్నన దప్పియుండుటకు మంచిదె పాడి ప్రభుత్వమిచ్చి య
భ్యున్నతిఁ జూడఁగావలదె?యూర్జితపుణ్యచరిత్ర మమ్మునీ
కన్నది కాన్పుగా దెయనఁగాఁదగుసూ!దయఁబుట్టనెమ్మదిన్.

వ. అని మరియు నిట్లనిమెఁ బెద్ద యియ్యనోపండేని కుశస్థలంబును వృకస్థలంబును వారణావతంబును నింద్రప్రస్థంబును నింక నొండెద్దేని గ్రామంబునుంగూడ నేనూర్కియఁ జాలుగాన నట్లు తన తోఁబుట్టువుల కొసంగి శాంతిపరుండగుట మేలని సుయోధను నొడంబఱచునది యిదియ మదీయేప్సితంబును సకల సమ్మతంబును నగుననిన సంజయుండు దేవా! దేవరచిత్తంబు వచ్చునట్లన వివరించెద మీయయ్యయు మీరును వాసుదేవునకును హితంబగు ప్రకారంబున నడపఁగలండనిపలికి కిరీటి ప్రముఖులతోడ వలయు తెఱంగున వార్తలాడి ధర్మజానుమతంబున నన్న పానాది కృత్యంబు లాచరించి యారాజొసంగ వస్త్ర మాల్యా భరణాది వస్తునిచయంబు గైకొని మొక్కిపనివినిమొదనని వీడ్కొని రయంబున హస్తిపుర మార్గంబువట్టె నంత. 131

క. కరి నగరి కరిగి యభ్యం
తరమునకుం దనదు రాకc దగుమానిసి చేc
గురుపతికిc జెప్పి పుచ్చియుc
గర మతని యనుజ్ఞ వడసి గానcగ నేcగెన్. 132

వ. ఇట్లు చనుదెంచి పదముల కెరగు సూతసుతునిc గ
డుcబ్రీతి నంబికాసుతుcడు తనదు పజ్జc గూర్చుండcజేసి య
ప్పాండవులకు సేమమే యనుc డతcడును సేమమనుచు. 133

చ. మఱియును బల్కె నిట్లు నృపమండన పాండవులెల్ల నీ దయన్
నెఱిదగు సేమమిచ్చుటను నీసుతులం బురి దక్కి వారి నం
దఱిc గడుc బేరు పేరనుముదంబున భద్రముగోరి రాస్థతో
నెఱయcగ ధర్మసూతివిను నీకు నమస్కృతిc జేసె నెంతయున్.

గీ. భోగ మొల్లcడు ధర్మువు బూనుపట్ల
నతc డహింసాపరుండు నీయట్టియగునె?
నీవు నీసుతు త్రోవను బోవుదెట్టి
కర్మమైనను దులువలు గఱపినట్లు. 135

క. బిడ్డలు గనరే లోకులు
చెడ్డ తెఱంగైన బుద్ధిc జెప్పరె? యాలుం
బిడ్డలు నెల్లరు దిమ్మరి
గొడ్డైనను నియ్యకొనునె? క్రొవ్విదములకున్. 136

గీ. శకుని కర్ణుండు ననుcగు దుశ్శాసనుండు
బొమ్మలను బోలె నాడింపc బుత్త్రుcడీవు

నాఁడుచుండెదరక్కట కీడుసేయఁ
బాండవులు జూడ రటు గాన బ్రతుకు గలిగె. 137

క. సైరణచేత యుధిష్ఠిరుఁ
డారసి తన తమ్ములకును నడ్డపడంగా
వీరలు బోయెదు తెరవులు
వేరయ్యె నతండు గినియఁ బెండెరువు సుమీ. 138

చ. తలఁపఁగ మేక వన్నె పులి ధర్మతనూజుఁడు సాదు రేగినన్
దలపొలిమేర నిల్చునది తథ్యమె యంతట నీకు నాకునున్
మలపఁగవచ్చునే? వెడఁగుమాటల నేఁటికిఁగౌరవేంద్ర యు
జ్జ్వలమతినెయ్యెఁగూడు దినువాఁడపరాధమొనర్పఁజూచునే.

వ. దప్పు జనువెంచిన యాయాసంబున దేహంబు నొ
చ్చుచున్నయది పొద్దునుంబోయె రేపకడ వచ్చి బంధు మిత్ర
సహితంబుగా నెల్లరు విన నచ్చటి వార్తలెఱింగించెద నని సం
జయుండు నిజ నివాసంబునకరిగిన యనంతరంబ ధృతరాష్ట్రుం
డు సత్వరంబుగా విదురుని రావించి సంజయుం డాడిన మాట
ల తెఱంగుఁ జెప్పి వెండియు నిట్లనియె. 140

క. ఏమని చెప్పెదు నన ఘా
యామాటలువినిన నాకు నంగములెల్లన్
వేమఱు వడఁకెడు నిప్పుల
పై మేనుం బడినగతినిఁ బరితాపమునన్. 141

వ. అనిన విని విదురుం డతని కిట్లనియె. 142

సీ. బలియుండు పై నెత్తు పట్టున నల్పుండు
సుడిక మొక్కనికిఁ గోల్పడిన పట్ల
మ్రిచ్చిలఁ దలపోయు మ్రుచ్చునకును గామి
యగువానికిని నిట్లు దగునుగాక
భవదీయసంతాప భరమున కీయెడ
నెట్టిది తలపోఁత యిభపురీశ!
నావుడు ధృతరాష్ట్రుఁ డావిదురున కిట్లు
బలికె ధర్మజుఁ డెద్ది దలఁచె దాని
ఆ.వె. దెలియుదేనిఁ జెప్పి దిగులు నివారింపు
నీవి లోన ముల్లు నెరసినట్లు
నతని మాట మదికి నగ్గమికామిచేఁ
బోగిలెదేను నిద్రఁ బూనకిపుడు. 143

క. అనినను విదురుం డిట్లను
ననఘాత్మక! యకట! పాండవాగ్రజుఁ డొక కీ
డెనయఁగఁ దల చునె మదిలోఁ
దనుఁజంపఁదలంచు నాకృతఘ్నున కైనన్. 144

ఉ. నీవిషయంబతండు నొక నెచ్చెలియై సుతుఁడై భటుండునై
సేవ యొనర్చుఁగాని వనిఁజేయఁదలంచునె? కర్ణ సౌబలుల్
చేవలు బుట్ట నెట్లు చెలిఁజెప్పెదు రట్లన పూని ధర్మువుం
బోవఁగఁ ద్రోచి కార్యగతి బుద్ధిఁ దలంపవు కౌరవేశ్వరా.

గీ. చిలుక నాఁకొని కబళించు చీలిగాని
రీతి ధరయెల్ల నీవాచరింప నగునె?

నగము వారికి విడు పుత్త్రి మొగమునందు
కార్యగతి నడిపింపక కౌరవేంద్ర. 146

క. అన విని ధృతరాష్ట్రిండును
విను సంజయు వలన నచటి వృత్తాంతంబుల్
మన మెఱిఁగి బోలు తెఱఁగున
నొనరింతము రేపకడ సమున్నతి ననఘా! 147

వ. అని మఱియు నిట్లను నీవు నీతిపరుండవు నీ మధుర సంభాషణంబుల వలన చిత్తంబు గొంత కలంక దేరుచున్నయది. ఇంకను భవద్వచనామృతవృష్టిఁ దడవుచు నాదువెతం బావుమనిన విదురుండిట్లనియె. 148

సీ. ఒకరి కల్మికి లోన నుడుగక పాపంబు
వచ్చు తోవను బుద్ధిఁ జొచ్చి చనక
జనులకు నెల్లను సమ్మత మగు రీతి
నడచుచు లోక నిందలకు లోఁగి
కోపంబు గర్వంబు కుటిల వర్తనముల
మాని బంధుల పట్ల మాన్యుఁడగుచు
కసరు ప్రల్లదము దుర్వ్యసనంబులును వీఁడి
తగునని తను దానఁ బొగడికొనఁక

గీ. నొచ్చియును గీడు సేయక నిచ్చ దుఃఖ
మైన నోపికఁ జేకొని యరికి నేని
వేడుచో నర్హ వస్తువు వెలయఁ బెట్టు
నిట్టివాఁడు బొగడ్తకు నెక్కు నధిప! 149

గీ. చెల్లుబడి గల్గి సైరణఁ జేయవలయు
దురితములు వచ్చు త్రోవకుఁ దొలఁగ వలయు
కొంచెమైనను దగఁ బంచి కుడువ వలయు
నీతి దప్పక భువియందు నెగడవలయు. 150

వ. ఇట్టి సజ్జన ప్రవర్తనంబు లెన్ని గలవన్నియుఁ గొం
తేయునకుఁ గలవని ప్రసంగవశంబునఁ బ్రశంసించి వెండియు
నిట్లనియె. 151

క. కడుఁ గూనలఁ బెనిచియు నొ
ప్పడ రెడు మానసులఁజేసి యకటా! వారిఁ
గడ నునుపఁ దగునె? పాలిడి
కొడుకులతో పాటు జూడు కురువంశనిధీ. 152

క. భూవర! తమ్ముని భాగము
నీవిటు మ్రింగంగ నరుగ నేర్చునె? మీనున్
వేవేగను మాంసేచ్ఛను
వావిరి గాలంబుమ్రింగు వలె నగుఁ జుమ్మీ! 153

వ. అనిన విని వెడవెడ నూకొనుటయు మాని నిరుత్త
రుండై మేనుమాన్పడి కొంతవడి నూరకుండె యాంబికేయుం
డు గ్రమ్మఱ నతని దిక్కు మొగంబైన యానయంబుల తెఱం
గెఱింగింపుమనుడు విదురుండిట్లనియె. 154

మ. అలిసూనంబున వ్రాలి పువ్వులనునొయ్యం జేయక య్యాసవం
బలరం గ్రోలిన రీతిఁ గార్యము నయంబారంగ నీడేర్పఁగా

వలయుఁ గాలోకులకిష్టముఁ గా నిజముఁ దేవంబథ్యముంగాఁగ బో
గ్గులకుం బోలెనునిట్టలంబుగ మొదల్ గూల్పంగగాదయ్యెడిన్

సీ. విను మొకళ్ళకుఁ గల్గు విద్యకు సిరికిని
ధనమునకును మనస్తాపమొంది
యసహిష్ణుఁడై బుద్ధి నెనఁగక నేనుఁగు
తోనైనఁ గను దోమతోడనైన
వైర మెత్తక చెల్మి వరులఁ బాటింపుచుఁ
దులువతనంబులు తొలఁగఁబెట్టి
యఖిల భూతంబుల యందును సమ దర్శ
నుండవై తగవుమై నుండవలయు

గీ. నయము మీరంగ నేకొఱంతయును లేక
నిట్టి సద్గుణపుంజంబు నెనయ నతని
కెట్టి కీడును బుద్ధి నూహించు పాల
సుని శవంబును దినవు శునకములును. 56

క. కట్టా! ధర్మజు నోరను
బుట్టదు పల్లదము నీదు పుత్త్రులు వారిం
జెట్టాడెద రవి నీచెవిఁ
బెట్టియు వారింప వెపుడుఁ బృథ్వీ రమణా! 157

చ. నటికిన భ్రమోఁడు నొక్కగతి నాటఁనునాటజిగిర్చిశాఖలం
వఱలునుమాటలం జిమడవచ్చిన కార్యము వన్నెకెక్కునే?
గుఱుకొని మేనికిం దగులు కోలలదీయఁగ వచ్చుఁగాక లో
నెఱిమఱి పల్కుములుకులను నేర్తురె? పావఁగఁగౌరవేశ్వరా

గీ. కాలు జారిన మరలింపఁ బోలుఁ గాక
నోరు జారిన మరలుపు వారుగలరె?
న్యాయ పథమునఁ గల్గు నిహంబు బరము
ప్రల్లదంబునఁ గల్గునే? ఫలము చెపుమ. 159

ఆ. వె. తగవు మెఱసి చేయఁ దగు కార్యమునకును
యశము గల్గు సౌఖ్య మమరుఁ బుణ్య
గతియుఁ గానఁ బాడి గలిగి పాండునృపాల
పుత్త్రికులకుఁ బంచి పుడమి యిమ్ము! 160

వ. మఱియు వారలు దమ తండ్రి భంగి నీకు సముచి
తంబులగు పరిచర్యలు సలుపుదు రిదియునుంగాక పాండురాజు
మాకుఁ బరమ భక్తుండు నతనినైనఁదలంచి వారలయెడ గుణం
బులేనియెడ నేన్నియుఁ దమ్ముని బిడ్డలని యాదరింపఁదగదే య
ని వెండియు నిట్లనియె. 161

క. నీ వీ తరువున నుండియు
నావిభు కొడుకులకు నిట్టి యులజడి బెట్టం
గావలెనే నీ పుత్త్రుల
తో వారిం జూడుమయ్య దురితము బాయఁగ. 162

క. కయ్యం మనఁ గాలుద్రవ్వుచు
జయ్యన వర్తించు కొడుకు జాడల నీవున్
నెయ్యమునఁ బోయెదవు వెను
దియ్యరు దుర్మంత్రములకుఁ దెగబడి ప్రమదుల్. 163

వ. పాండవులు బరాక్రమసంపన్నులయ్యును నీయం

దతి స్నేహంబునేని లోకనిందకతంబుననేని పాపభయంబుననేని కౌరవులతోడి భండనంబున కొడంబడక యాగి వేఁడుకొనిన చులకన చూచుచు నావరింపక కడత్రోవం దగడు దాయాదులతోడి పోరితంబునఁ గొఱంతయ కాని వాసి గలుగ నేరదు, శాంతి మార్గంబుని నీతిపథంబున లోభం బుడిగి వారలం గలసికొనుమట్లేని సిరికిం దానకంబై యిరుదెఱంగుల వారలొండొరులకుఁ బ్రాపు దాపులగుచుఁ గలిమి బలుములచే నుక్కుమిగిలి దేవాసురులకైనం దేరి చూడరాక మనియెదరు, నిక్కమ్మలైన కొడుకులం బట్టి యుత్కృష్టులగు వారి విడుచుట మార్జాలంబులం బట్టి సింగంబుల విడుచునట్లగు నయ విక్రమంబున సప్రతిములగు పాండవేయులొక్కెడ భూమండలంబు శాసింపను బ్రజామండలంబు బాలింపను భవదీయ వంశం బుజ్జ్వలంబు గావింపను జాలుసమర్థులు, నా వచనంబు నీకు రుచింపదేని యొక్కటి పుట్టినపిమ్మటఁ దల్లడిల్లెదవు. ఒక్కనికై కులంబు నిర్మూలంబు సేయగాదు. వారెత్తివచ్చినఁ గౌరవులకు బేరుపెంపు పుడమిం బొడవడలగు, వైరమెత్తక యూరకుండిన నీసుతులచే ధరిత్రి బాలింపంబడనేరదు. నా పలు కాలకించి పొందెనేయుటయ లెస్స యన్ని నానావిధంబుల బోధించుచు విదురునకు ధృతరాష్ట్రుండిట్లనియె. 164

క. శుష్క ప్రియములచేతనె

నిష్కర్ముండైన పాండునృపతితనూజున్

నిష్కారణముడికించితి
ముష్కరుఁడగు సుతునిమీఁది మోహము కతన్. 165

చ. విమలచరిత్ర! నీవిపుడు వీనులకుం గడుఁ జల్లఁగా ననుం
గ్రమమునఁబల్కు నీవచనగౌరవమొప్పెడునైనఁ బుత్త్రమో
హము దెగఁబాఱనీయదు దురాత్ముకుఁడై తగుమాటవాఁడు కా
ర్యముదెన యందనున్ వినఁ డహంకృతి నిందుకులోనఁ
గుందెదన్. 166

వ. అనిన విని విదురుం డిట్లనియె. 167

ఆ.వె. అధికులైన నల్పులైనను జ్ఞాతుల
విడువఁ జనదుసూ! వివేక బుద్ధి
దూర దృష్టిచే విచారింపు నీలోన
వారి వీరి భ్రిమల వరల కధిప! 168

క. పోట్లాడుట పువ్వులతో
వేర్లాడుకొ కీడు మేలు వెలయఁగ నటపై
నెట్లగునో నాకఱపిన
యట్లన కడు పొత్తుసేయుమయ్య నయమునన్. 169

క. మీకై హితంబు సెప్పెదఁ
గైకొని యెల్లరకుఁ బ్రియముగాఁ గులమెల్లన్
బోకుండ మదిఁ దలంపుము
కాకున్నం దొడ్డ చేటు గాఁగలదు సుమీ! 170

వ. అనిన విని వైచిత్రవీర్యుండు సంతసించి నీ పలుకు
ల కలంకఁదేఱె. నీచెప్పినట్ల నవశ్యంబు గావింతు ననియె. అం

త నొక్కింత తడవు చింతించి వెచ్చనూర్చి నిన్నేమనగలదు
దైవంబున నడఁగుంగాకయని 171

క. నమ్మికయును నమ్మమియును
సమ్మదమున సమ్మదమును సందడిని మదిం
గ్రిమ్మరఁ గ్రుమ్మర పిదురుం
డమ్మనుజేంద్రునకునిట్టు లనియె నయమునన్. 172

గీ. ఇంత కాలమునకు నేమి పుణ్యవశంబొ
నీమనంబు శాంతి నెరయఁదాల్చె
నింకనైనఁ బుత్త్రిఁ డేఁగుతో ప్రీవను శోక
కార్య మెఱుఁగుమయ్య! కౌరవేంద్ర! 173

వ. అనిన విని ధృతరాష్ట్రుండిట్లను ధర్మవిధంబును నీతి
ప్రకారంబును దెలిపి సంతసంబొనరించితింకఁ బరమార్థ దృష్టి
యొట్టివాక్యంబులం గలదద్ది తెలిపి కృతార్థుం జేయుమనిన విదు
రుండన్న కిట్లనియె. 174

సీ. నే నెఱింగినయంత నృప! నీకుఁ దెలిపితి
వేదాంతపద్ధతుల్ విస్తరింప
నొనరంగ నే శూద్రయోనిజాతుఁడఁగాన
తగ నుచ్చరింపను ధారుణీశ!
విన నిష్టమగునేని ఘనుఁడు సనత్సుజా
తునిచేత వినఁదగు ననుచు నపుడు
తద్దివ్య మునిని లోఁదలఁచినయంతనే
సన్నిధిఁజేసె నయ్యన్న తనకు

గీ. సర్వవిధిఁ బూజఁ జేసియు నాంబికేయు
నతనికిం జూపి యారాజు హితము సెప్పఁ
దలఁచితిని మిమ్ము ననుఁడు నత్తాపసుండు
నామహారాజు సందియం బాలకించి 175

వ. మఱియు ధృతరాష్ట్రుం డెద్దియడుగు తత్సూక్ష్మం బులగు సర్గంబులను గుహ్యంబులగు వానిని నానావిధంబు లగు రహస్యంబులనెల్ల దెలిపి యమ్ముని యంతర్హితుండయ్యె విదురుండు నన్నుచే నాజ్ఞాతుండై నిజనివాసంబునకు నేఁగె నంతఁ బ్రభాత సమయంబున ధృతరాష్ట్రుండు తత్కాలోచితా చారంబులు తీర్చి మొగసాలం బేరోలగంబున ద్రోణ కృపా శ్వత్థామ కృతవర్మ ప్రభృతులగు దొరలును భీష్మవిదుర సోమ దత్త బాహ్లిక భూరిశ్రవ ప్రముఖులగు బంధువులును దుర్యో ధన దుశ్శాసనులలోనగు కుమార వర్గంబును కర్ణ సౌబలులు మొదలగు తత్సహచరులును బరిజనంబులును బరివేష్టించి కొలువఁ గొలువుండునెడ సంజయుండును జనుదెంచి సముచితా సీనుండై తనమాటలు వినఁ జిట్టాడు కొల్వుఁ గలయం గనుం గొని యిట్లనియె. 176

సీ. ఈ దొరపంపఁగా నేను బాండునృపాల
పుత్త్రులపాలికిఁ బోయి యందు
ధర్మజుఁగంటి నా నిర్మలయశుఁడు కౌ
రవుల నేమము లెల్లఁ గ్రమముతోడ

నడిగె బాంధవమున నాదరంబున నెయ్య
మున భీష్మగురులను మొదలుగాఁగ
గలుగువారలఁ బ్రీతిఁగావించె నేనును
బంధుత్వమొయ్యనఁ బ్రాకటముగ
గీ. నెవ్వ రెవ్వరితోఁ దగ నెట్లు పల్కఁ
దగునొ? యాగతి నీవిభుం డొగినిఁ గఱవు
పగిదని గొఱంత లేకుండఁ దగిన మాట
లాడితిని సంధకై కవగూడునట్లు. 177
గీ. అయ్యుధిష్ఠిరుఁ డాడిన యట్టి పలుకు
లచటఁ దక్కిన వారునున్నట్టి మాట
లందులకుఁ దాను బొసఁగఁగా నాడుటయును
నన్నియును సెప్పి మఱియు నిట్లనియె నపుడు. 178
క. వినుఁడు మును నేను గృష్ణా
ర్జును లోకచో నొంటి నుండుచో నయమారఁ
గనుపించికొంటి వారను
చనునయభయములను జూపు సల్లాపములన్. 179
వ. అనినఁ గృష్ణుని చిత్తం బెట్లుండె నేమనియె నెద్ది సేయఁ దలఁచెనని యడిగిన ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె.
చ. కడు బహుమానమొప్ప ననుఁగన్గొని రేనునువీరలిర్వురున్
నడతు రజాతశత్రు వచనంబున నాతని కెట్టికార్యముం
గడు నగునంచు నెమ్మదిఁ దగం దలపోసితి నంత వారలుం
గుడిచెడి యన్న పానములు గోరిక నాకిడి రాదరంబునన్.

గీ. క్రమము నే నాఁడు పోయిన కార్యమెల్ల
విన్నవించిన యంత నవ్విజయుఁ డపుడు
బలుమొగంబున నేమియో పలుకఁ జూడ
హరియు నాతని వారించి యనియె నిట్లు. 182

ఉ. నీటను నిప్పు బుట్టు వలె నిక్కము ధర్మజుఁ డల్గెనేని న
ప్పాటను నార్పఁగాదనుచుఁ బౌరవసంచయముల్ వినంగ నా
మాటలు దెల్పుమింకనుగ్రమంబునవారటజేయు కృత్యముల్
సాటి సుఖంబులుం గొనుఁ డపారముగా నను నేటరేపటన్.

చ. చెలులను గారవించి దయచేఁ దగు వారల నాదరించియుం
దెలివిగ నప్పసప్పులను దీర్చి కరం బఱచేతఁ బ్రాణముల్
నిలిపికొనుండు సంగరము నిశ్చయ మెల్లి కిరీటి మార్గణో
జ్జ్వల దహనార్చులం బడక వారికి నెయ్యెడ కేఁగరాదిఁకన్.

ఆ. వె. పరమ సాధ్వియైన పాంచాలి నటువంటి
బాము పెట్ట నన్నుఁ బలువరించె
నదియు నాకు నెపుడు హృదయ శల్యమువోలెఁ
బగలు రేయు నిద్రబాపి బోరయు. 185

క. నాచేయు సారథిత్వము
నీ చతురు రథిత్వమున్ మహిం బొసఁగఁగ మే
మేచి కురు తతుల నుగ్గున్
నూచము సేయంగ నెందునుం దెసగలదే? 186

చ. గిఱికొను కోపవేగమునఁ గృష్ణుల యాతమకంబు నీసుతుం
డుఱక ధరిత్రిఁ దావిడువకుండెడు లోభముగాంచి నామన్

బలవలలై భయంబుగొని యంగములెల్ల వడంకెదయ్యమే
యెఱుఁగు నదేమి సెప్పుదు నిశేంద్రపురీశ్వర! నీకునిమ్మెయిన్.

వ. అనిన విని నరుండేమనియె నని యడిగిన ధృతరా
ష్ట్రునకు సంజయుం డిట్లనియె. 188

క. ఆవిజయుఁడు దనకన్నులఁ
గావింగొని యీరసంబు గ్రక్కెడు పోల్కిన్
గేవల మొప్పఁగ నాతో
భూవర! పలికిన తెఱంగుఁ బొలుపుగ వినుమా? 189

ఉ. పాండునరేంద్రుపాలికయి పట్టితి మిమ్మొ యి మేమువార లు
ద్దండతఁ బంచిపెట్టకయు తక్కఁగయేని సహింప నేర్తుమే?
భండనకేళి కేతెదము పాపమొ! పుణ్యమొ! యెట్టులైనఁగా
నిండికఁ నొందుగల్గదిది యెంతయుసత్యము సూతనందనా.

గీ. వినుము దుర్యోధనుఁడు భూమి విడువఁడేనిఁ
దాను మును మాకుఁ జేసిన వానికెల్ల
మేము నన్నియుబుట్టఁగా మెఱుగువెట్టు
వారలముగాక యొండు విచారమగునె? 191

మ. గురు భీష్మాదులు వారికై కడఁగిరా ఘోరాహవక్రీడలోఁ
బరఁగం దత్ప్రథులాస్త్ర శస్త్రములుమాపై రావదెట్లన్న ను
శ్వర ధర్మోజయమంచుఁజొచ్చెదము పోరంబాడినైమాకుఁనే
డరయన్ గీడగుటెట్టు లట్లయిన నన్యాయంబు మేతేమొకో.

క. దానలను బలుచివికినమ
స్తన శరములు వెలికిఁబాఱు గాండీవంబుర

గ్రొనయం బెక్కుడికొనియెడు
మునుకొని తనుదాన యడిదమును నోఱ వెడలుగ. 193

గీ. తెగువఁ బీనుఁగు ఱొమ్ముపైఁ దిండి రోసి
యేము జేయొగ్గి పాలుదన్నిమ్మనంగఁ
గురువింభుడీఁడు నెత్తురు కూటికింకఁ
గడఁగియొడిగట్టి బ్రిమసట గాదుమాకు. 194

సీ. గద సాచి భీముఁ డగ్గలిక నేనుఁగు పిండు
చెడఁ బిండిపిండిగాఁ బొడుచుచుండ
మామకీయాశుగ మండలి సాదులు
గూడ ఘోటకములఁ గూల్చుచుండఁ
గవలు దావానలు క్రమమునఁ బరిపంథి
తేరులు నిత్యంబుఁ దీర్చుచుండ
ద్రుపద విరాటులు దొడరి కాల్బలమెల్లఁ
గుదియించి పుడమిపైఁ జదుపుచుండ

గీ. శినివరుండును ద్రుపదుని తనయ సమితి
ద్రౌపదేయులు నభిమన్యుఁ దనయుఁడును గ
డంకఁ బగతుఁ దున్మి నిశ్శంకనొదవఁ
గాంచి పిమ్మటఁ బొలిచ్చుఁ గౌరవుండు. 195

గీ. కొడుకు లభిమన్యునకు దారువడముడికిని
ద్రోణి భీష్ములు నాపార్షతులకుఁ గర్ణు
నాకుఁ దగు వారికిని దగు మూఁకనెల్ల
పాలువెట్టిన పిమ్మటఁ బాలువెట్టు. 196

వ. మేము దైవంబు మొగంబు చూచి గురు భీష్మాదు లగు పెద్దలకు నమస్కరించి మాతండ్రి పాలికై న్యాయంబు తప్పక చొచ్చి నడచెదము. శకారిదులైన ధర్మంబున కడ్డంబు చొఱవెఱతురు చొచ్చిరేని నిహతులగుదురుగాక మొన మిగు లు వారుగారు. కౌరవు లెంత యటుండనిమ్మనియె ననిన విని గాంగేయుండు గాంధారేయున కిట్లనియె. 197

క. నర నారాయణులనఁగను
పరమ మునుల్ దేవహితము బాటిల సుజనో
త్కర రక్షయు జనశిక్షయు
గర మొనరింపఁగ జనించు ఘనులు నృపాలా! 198

గీ. మును నివాత కవచులను జంపి వజ్రికి
సంతసంబు సేసె సవ్యసాచి
కంసుఁ డాదియైన ఖలులఁ ద్రుంచుట మన
మెఱిఁగి యుంటకాదె కృష్ణు తెఱఁగు. 199

క. ఆ పురుషు లిర్వురొక మతి
నాపోరికిఁ బెరుగ గెలువ హరునకు వశమే?
నాపలుకుఁగొనవు వినియెదు
తీపులుగా వారు వీరు దెగిరనుమాటల్. 200

గీ. పట్టివలననే తెక తెక బుట్టినీకు
దుష్ట కష్ట నికృష్టులౌ తులువలైన
కర్ణ సౌబలు లొనరించు కానినడితి
కానఁ గై కొనఁబోవుగాఁ గ్రౌర్య మెసఁగ. 201

చ. అన విని కర్ణుఁడిట్లనియె నక్కట! నాయెడ నెగ్గు గల్గునే ?
కొనకొని భూపతిం గడుపు కూటికిఁ గొల్చిన వాఁడఁగొల్వునం
జనుఁ జనదంచుఁ జూడక యసహ్యము లాడెదు గానఁదోపలే
వనయము జెప్పినం బతి తనంతటి మానసి సేల సేసెడిక్

సీ. అనుటయుఁ విని నదీతనయుండు ధృతరాష్ట్రుఁ
గనుఁగొని క్రమ్మఱ ననియెనిట్లు
నాపాండవుల పదియారవ పాలక్గఁ
బోలఁడు గడు సిగ్గుమాలి వీఁడు
గెలుతు వారలనని కొలువున రజ్జులు
బచరించినది నచ్చి పార్థులకును
దుర్యోధనుఁడు పగఁ దొడరి కావించును
బెక్కుదురంబులఁ బేరు పెంపుఁ

గీ. గనిరి తానొక్కఁ డేమి సేసెను గడంగి
తులువ దుర్జాతి యవినీతి బలుకుచుండు
మెచ్చుగా నీవు వినియెదు మేలుగాక
ననుడు గురుఁడాంబికేయున కనియె నవుడు. 203

క. గాంగేయుఁడు చెప్పిన తెఱఁ
గంగీకారంబుసేయు నగుఁ గురు తతికిన్
మంగళము కోరుఁ దక్కిన
సంగరమున సవ్యసాచి సామాన్యుఁడొకో ! 204

గీ. వీఁక మన వారిలోఁగాదు లోకములను
కవ్వడికి సాటి యగు విలుకాఁడు లేఁడు

తెగువ సంజయుతోఁ బల్కు పగిది సల్పఁ
గలఁ డమానుష శౌర్యంబు గలుగువాఁడు. 205

వ. ఖాండవ దాహనాది కృత్యంబులెల్ల మనమెఱింగిన
వికావె కావున ధర్మజుతోఁ బొత్తువాటించుట లెస్సయని గురు
భీష్ము లొత్తి చెప్ప వారల నుడువులయెడ ననాదరంబుగాఁ బె
డ చెవులం బెట్టి విని వినమిగా నుండి వెండియు పాండవుల
వలని వార్తలడుగ సంజయుదిక్కు మొగంబైన కురుపక్షవీరుల
ప్రాణంబుల యందనాస్థాపరులై నంత ధృతరాష్ట్రుఁడు సంజ
యున కిట్లనియె. 206

గీ. సూతనందన! ధర్మజు రీతి యెట్టి
దిచటఁ గూడిన సేనల నెల్ల నెఱిఁగి
నెమ్మనంబునఁ దా నెద్ది నిశ్చయించె
నెవ్వరినిఁ గొని మనవీటికేగుదెంచు. 207

వ. అనిన విని సంజయుండు నిరుత్తరుండై యెద్దియుం
బలుకనేరక వెచ్చనూర్చి యమ్మనుజపతి యంత వెఱ్ఱియగునే?
యని కొంత తడ వూరకుండియు నైన నితని వచనంబులకుఁ
బ్రతివచనం బీయఁదగు నని యిట్లనియె. 208

క. వినుము నరేశ్వర! ధర్మజుఁ
డనయము పాలముగు వీరలట్లాడఁ బడమిం
జనుదెంచు దురమునకు దుమ
కన గాలమువేఁ్రయఁజూడఁ డాతఁడుతోల్తక. 209

వ. ఎవ్వనిం గొనివచ్చునంటి రం దెవ్వరు మీ రెఱుంగ
ని వింత వార లైన నాకర్ణింపుము. 210

సీ. చండ సత్త్వుఁడు జరాసంధమర్దనుఁడును
బాకారి నొడిచిన బల్లిదుండు
నరి వీర యములగు యములును బరిపంథి
చయ గోత్ర దంభోళి సాత్యకియును
ఘన శౌర్య నిధులు కేకయులు శాత్రవ నాగ
చక్ర కేసరులు పాంచాలపతులు
పర వాహినీ భయంకరులు మాత్స్యులు, ద్విష
దంబుదానిలుఁడు హిడంబ కొడుకు

గీ. కలనఁ జొత్తుము నొత్తుముగాక యొంఁప
గలదె ధర్మజునకు భూమిఁగట్టిపెట్టు
వారమని కీడు మేళ్ళలో వారలగుచు
వచ్చు సకలోపవిషయ భూవరులు మఱియు. 211

క. ఓలిఁ ఘటనాఘటనతఁ
జాలి పృథాసుతుల కెలమి సచివుండగుచుఁ
మేలొనఁగఁజాలియుద్ధపుఁ
గీలొనరఁగఁ ద్రిప్పు వాఁడు కృష్ణుం డధిపా! 212

వ. వీరలంగొనివచ్చుననిన ధృతరాష్ట్రుండతనికిట్లనియె.

క. వినువారిదెసను నీచె
ప్పిన రథికులు నొక్కయెత్తు భీముండొకయె

త్తనఁదగు శౌర్యోన్నతులగు
దనుజులఁ గీటడఁచె వాఁడు దర్పం బెసఁగన్. 214

గీ. వాని దలఁచిన నామేను వడఁకుచుండు
బక హిడంబ జరాసంధ పతుల నొక్క
చిటిక వ్రేసిన మాత్రి నిర్జించె నతని
కీడు ముల్లోకములనైన లేఁడు సుమ్ము. 215

క. గుదె యడిదము గద గొనినన్
మద గజమును బోలె రిపుల మర్దింపఁడె యె
య్యది తెరువు నాదుసుతులకుఁ
గదరెడు శోకాగ్ని మనసుఁ గాల్పఁగఁజొచ్చెన్. 216

క. పిన్నప్పుడు నాశిశుకుఁ
గన్నన బడఁ డట్టి వాని కయ్యమునకు వీ
రున్నడచి యతనిచేఁ జెడి
ఖిన్నతఁగనియుండ్రు పగకుఁ గేవల మిదిగా. 217

గీ. కడు ధనంజయునకుఁ దోడు వడముడియును
నలిని జనుదెంచు కరణి ధనంజయునకు
వడముడియుఁ దోడు నూప దుర్వార భంగి
మొనసి కౌరవులకుఁ జేటు మూడెఁగాదె. 218

క. నరునకు నొక లెక్కయగాఁ
బరగునె? కురుబలము దైత్య పతులను దేవో
త్కరపతిని గెల్చు వీరుఁడు
కర మతనికిఁ గలన నెదురు గలఁడే హరుఁడున్. 219

వ. ఇదియునుంగాక. 220

చ. అమరవరేణ్యు పుత్త్రిపయి నావటి గాలియు సోకకుండ ని
క్కము హరి యెట్టివేళలను గంటికి రెప్పయపోలె కాచు వ
జ్రిమునకుజోడునుందొడుగుచందమకాదొకొ వారలిర్వురుం
గ్రమముననొక్క తేరున దురంబున, రా నొరు లాగనేర్తురే?

గీ. మఱియు నందలి రాజకుమారులెల్ల
గండు మిగులంగఁ గల రంతకంటె నింక
సంజయా! యేమిసేయుదు చనుడు నెందు
నకట! నాబిడ్డలకు నెవ్వఁ డడ్డపడునొ? 222

వ. గురు భీష్ము లెఱుంగుకంటె భీమార్జునుల మగంటి మియుఁ బాండవుల సారంబు నెక్కుడే నెఱుంగుదు. వారలు మానవులచేతం బోవరు. సుయోధనుండు దురాశాపరుండై కార్యంబు దెస గననేరండు. నే నొత్తి చెప్పనుం జాల. భీష్మ ద్రోణులకుఁ బౌత్త్రులును శిష్యులును నగుట రెండుతెఱంగుల వారు నొక్క రూప యగు మనముండుటంజేసి యుపక్షి రిక్షి వెఱచి మొనవాయింబడి చచ్చు వారుగాని పోట్లాడి గెలిపింపఁ గలవారుగారు, కావున నిట్టి తఱిఁ బరువున మురిపెంబుగని స కల ధర్మపరుండగు పాండవాగ్రజు రావించి యుచిత గతిఁ బుడమి పాలొసంగుట మేలతండు నాసుతు నట్టివాఁడు కాఁ డమలహృదయుండగు నిట్టి సమయంబున ధర్మంబు వాటింపకుండిన విరుద్ధంబుగాఁ గురు కులంబు నిర్మూలంబు గాఁగలదనిన విని దుర్యోధనుండు తండ్రికిట్లనియె. 223

గీ. గదకు నాసముఁడగు వానిఁ గాన నెందు
బెదరెదవు రిత్తభీతిచే భీముఁడొక్క-
కొండఁగాఁ దలపోసి నా కొలఁది లావు
గేలి తెలిసిన వాఁడవు కురుకులేంద్ర! 224

క. అడవులఁ గాసిలి తేజము
బొడవడఁగిన వారు మమ్ముఁ బొడతురటే మా
కడిఁది గద వచటఁ గృష్ణుం
డడరఁగఁ గైలాటమునకు నందఱఁ గూర్చెన్. 225

క. కూటువ మూఁకలఁ గొన్నిఁటిఁ
గైటభ రిపుఁ డోజ గుంపుగాఁజేసి మముం
బోటని బెదరించి ధరం
బాటిని సగ మిమ్మనంగఁ బాలిత్తుమొకో. 226

గీ. కినిసి రాముని గెలిచె గాంగేయుఁ డాజి
నితని పైనెత్తి వత్తురే? నృపులు బోర
ద్రోణ కృపులును మరియు నీ ద్రోణ సుతుండు
కేవలులె? వారి ననిలోన గెలుచు టెట్లు? 227

క. కలనన్ ఫల్గుననకు హరి
గలఁడనియెద వతఁడు కర్ణ ఘన బాణాగ్నిం
దొలఁగింపఁగలఁడె? పైఁబడు
బలు పిడుగును మేలుముసుఁగుఁ బాపునె? చెపుమా! 228

క. నలుగురు నవ్వఁగ వగ చెడి
తలవంపులుగాఁగఁ బాండు తనయుల గొలువం

గలమే? పుట్టముజాలని
బలె పాలొగి నిచ్చి వారి బతి మాలుదుమే. 229

వ. వినుము దుశ్శాసన దుష్ప్రహ ప్రముఖులైన నీ కొడుకులెంతకుఁ జాలరు. మనకుఁ బదునొకండక్షౌహిణులును వారికి నేఁ డక్షౌహిణులును గూడె మన సేన గల దండిమగలు నిలింపులనైన నోడువఁగలరు. పాండవుల వీరలు కొక్కెత్తునకుఁ జాలుదురే? చింతింపవల దూఱకుండుమని తండ్రి నూఱటంబలికె యుధిష్ఠిరుం డెట్టి తెఱంగున నున్న వాఁడనిన సంజయుండిట్లనియె. 230

చ. జనవర ధర్మజుండు సహజన్ములు వేడుక లుల్లసిల్లఁగా
ననియెను మాటమాత్రమున నార్చెన మూరెడుబేర్తురెప్డు భీ
ముని గద పెంపు నర్జును సముజ్జ్వల దివ్య శరాళి నైభవం
బును మురవైరి ప్రాపుదము భూపకుమారుల లావు నుందగ౯

వ. అని మఱియు భీమార్జున నకుల సహదేవ సాత్యకి పాంచాల విరాటాది వీరుల పరాక్రమంబులును దత్తద్దివ్య సాధన సంపత్తులును, వేరు వేర విన్నవించిన విని ధృతరాష్ట్రుం డెందెవ్వ రెవ్వరిచేత సాధ్యు లసాధ్యులని యూహించిరని యడుగుటయు శాంతనవుండు శిఖండికి ద్రోణుండు ధృష్టద్యుమ్ననకును, కర్ణుండు త్రిగర్తులును సవ్యసాచికి, దుశ్శాసన ప్రభృతి కుమారులు వడముడికి, శకుని నకులునకు, శల్యుండు ధర్మజునకు, సాధ్యులగుదురు. మఱియు నెవ్వరెవ్వరి కష్టపడుదుర్తు వారువారికిం జాలువారై యుండుదురని నిరూపించిరని

విని సుయోధనుండు గనలి సంజయున కిట్లనియె. 233

చ. ఎఱుఁగమె పాండునందనుల నెచ్చటనుండిపుడేఁగుదెంచి రం
దఱు బలశాలలంచుఁ బటు దర్పముచేమముగెల్తురంచునుం
గుఱుకొనిచెప్పెదీవిపుడు గొన్నిదినంబులుగూడియిచ్చటన్
మెఱసిరి మమ్ములం గెలువ మిక్కిలిసత్త్వములెట్లు గల్గెడిన్.

క. సారెకు నూఱక సంజయ !
వారిన్ మరి వారివారి వలసిన గతిఁ గై
వారము సేయుము కడు మా
వారిం దలఁపకుము తెలిసి వచ్చెను మాకున్. 234

గీ. అనుడు ధృతరాష్ట్రుఁ డాసూత తనయు పలుకు
నున్మదాలాపముల ప్రేలుచున్నవాఁడు
నాసుతుం డింతియే సత్య నయపరాక్ర
మములఁ దగు పాండవుల సాటి మహినిగలరె ! 235

వ. అది యట్లుండె. మమ్ముఁ దలంచినఁ గారులాడుచు నెవ్వాఁడందు సహింపడనిన సంజయుం డిట్లనియె. దేవా! పాండవులయెడ నేయే ప్రస్తావంబులిచటివి బుట్టిన నాజ్యంబు చల్లిన మహానలంబు చందంబున మండు ధృష్టద్యుమ్నుఁడతండు కురుబల సముద్రంబును జెలియలికట్ట తెఱంగున నిలిపెదనని బీరంబు సాటుచు నన్నుఁ గని సంజయా! మీవారితోడఁ జెప్పుము. హరిహరాది దేవతలు సమకట్టిన నవశ్యంబుఁ గౌరవులజయింతుము గావున సకల భూత దయాళుండగు నజాతవైరి మరుప్పొచ్చిన మున్ను వారొనరించిన ఘోరగాములు దలఁపక మన్ని

చు బ్రతుకుపై నాశ గలదేని యిట్లు చితంబనియెనని చెప్పిన
వై చిత్రవీర్యుఁడు గాంధారేయున కిట్లనియె. 236

క. పెనకువకు నొక్కవీరుని
పెనుప్రాపున నలంతులైనఁ బెరుగుదు రనికిన్
మొనవడి భీమార్జునులను
గనికొని నడవడెఁ గడంకఁ గాల్బలమైనన్. 237

చ. అనుచిత వృత్తిగాన గరుడాది మహాత్ములు ధర్మసూతిపై
ననికిఁ గడంగఁజూడరుభయంకరశౌర్యులఁ బాండవేయులం
బెనకువఁ గెల్వఁగాఁ దరమె? బేలవుగాక ధరిత్రిలో నగం
బును నయమొప్ప వారికిడి పొత్తొనరించిన మేలు జెందెడిన్

చ. అనుడు సుయోధనుండనియె నక్కట! పెద్దలు శౌర్యవంతులీ
ఘను లనిసేత కోటమియగ్గె కొనువారట యట్లయేని నే
నినజుని దుస్ససేను నట నేడ్తెరఁ దోడుగఁబూని పాండునం
దనుల జయింతు నొంతు నిదిదక్క ధరిత్రినొసంగువాఁడనే?

క. నను గాసిపెట్టకుం డిఁక
నొనరఁగ నాముక్కునందు నూరుపు గల యా
దినముల పాలని పంపని
మును వారికొసంగ సూదిమోపిన యంతన్. 240

వ. అని పలికి యూరకుండిన కొడుకునకు ధృతరాష్ట్రుం
డిట్లనియె. 241

క. నీపోక కింత వగవను
నీపోయెడు తెరువుం బట్టి నృప సంఘములున్

రూపడఁగెద రటు గావునఁ
బాపము చలముడిగి కులము బ్రదికింపవనా. 242

వ. అని పలికి కొడుకు వలన మగుడఁ బలుకమి నెఱుఁ
గక సుతుండు గెలుచునో యను దురాశాపాశంబు మానసం
బున నొక్కింత దవిలి సంజయు దెసకు మగుడి రెండు తెఱంగు
ల వారి బలాబలంబు లడిగి తన యాలోచనంబులకుఁ బొండ
వు తెక్కుడుగా నిశ్చయించి క్రిమ్మఱ నెట్టు లెట్టులని యుగ్గడిం
చుచుఁ దడవు విచారించి కౌంతేయులకు దేవశక్తియు గాంధా
రేయుల కదేవశక్తియుగాఁ దెలిసిన వాఁడై పుత్త్రు నుద్దేశించి
యిట్లనియె. 243

క. యమ పవన వాసవాశ్విను
లమరఁగఁ బార్థులకుఁ గలన నగుదురు తోడై
క్రమమున నెన్నిన నర్జునుఁ
డమరనిభుఁడుగాడె వేఱె యమరుండేలా! 244

గీ. జాతవేదుని మెప్పించి సాధనములు
గాంచె వానికి నెదిరెడు ఘనుఁడు గలఁడె?
కదన ముడుగుము నామాట గౌరవమునఁ
దనయ! చెల్లించి ధర్మజుఁ గని బ్రదుకుము. 245

చ. అన విని తండ్రికిట్లనియె నాహవకేళి సురాళి పాండు నం
దనులకుఁ దోడుసూపుదురె? దైవతముల్ తమపాలఁగల్గినన్
మనుమన చేత బన్నములమొగ్గుదురే? ప్రియమారసంబులున్
ఘనమగు దేవకోటికివి ( గల్గదు కల్గిన వేల్పుతాదురే? 246

క. రాగ ద్వేషము లుండిన
నేగతి దేవత్వ మదియు నే డ్లైఅఁ దో డైఁ
రా గణుతింపము ద్రుంపమె
నాగపురీ రమణ! దేవనాథుల కైనన్. 247

వ. మఱియుఁబక్షపాతులై నిలింపులు గడంగి రేనియట్టి నిందిత దేవతలచే ఫల్గునుండు రక్షితుండు గానేర్చునే? వినుము కార్చిచ్చు గబళింపను శిలా వృష్టి విరళింపను గాలి నిలుపను నీరంబు ఘనీభవింపను సింహశార్దూలాది వివిధజంతు సంతానంబును భూత బేతాళాది నానా పిశాచ నిచయంబును నా పంపునఁ బ్రవర్తింపను శత్రు మిత్రోపాయంబులు లోనగునవి యెల్ల నెఱుంగుదు. నిఖిల మంత్రానుష్ఠానంబుల నొక్కఁడు నాకుం గొఱంతలేదు నీ చెప్పిన యగ్ని ప్రముఖదేవతలు నాకుం బ్రసన్నులు వేల్పులచే రక్షితుండుగాని వాని రక్షింప నేర్తు గర్వంబునఁ జెప్పికొనుటకా దెన్నఁడేని నన్ను నేనా పొగడికొనుట గలదే? పాంచాల విరాట కేకయాది ప్రతి పక్షవాహినులు నాకెదిర్చి సముద్రముఁ జొచ్చు నదులవడువునఁ బొడవడంగెడు కృష్ణ సహితంబుగాఁ బాండవుల నొక్కయెత్తునం గొన నాకొలందికిఁ జాలరప్పంటికి భవదీయ చిత్తంబున నవధరించెదవు గాక నింతవాఁడనన నేటికి నింక గురుభీష్మాది వీరుల శస్త్రాస్త్రంబు లటుండె నిట్టిదెఱుంగక బేల విధంబున బెగడెదవు నెల్లకార్యంబులు సమర్థింపఁ జాలుదుము, నీయెడరు వారింపనేశము, నిమిషంబున సకలంబును చక్కనగు నూఱకుండుమని

తండ్రి కలంక బాయ నూఱడం బల్కి సంజయుతోడ భండనంబు వలని వార్తలాడు గాంధారేయునకుఁ గానీనుం డబ్బన నిట్లనియె 248

చ. మునుగురుఁడీరసంబుగొని మోఘములై చన నస్త్రశస్త్రముల్
నను శపియించె నాద్రు కురునాయక క్రమ్మఱ నమ్మహాత్ముఁ బెం
పునఁ గనినాఁడ శాపమది బోవఁగఁ గావునఁ బార్థుఁ గిట్టి మ
త్సునిశిత దివ్యబాణముల సొంపుదలిర్పఁగ రూపుమాపుదున్

గీ. అనినఁ గర్ణున కాపగా తనయుఁ డనియె
నోరి దుర్జాతి మానవు నోరి కెంత
వచ్చు నంతయుఁ బ్రేలెద విచ్చ నిపుడు
నిన్ను మృత్యువు ప్రేరేచుచున్న దిట్లు. 250

శా. నీ చేఁ జావఁడె నిక్కువంబు హరుఁడేనిం బార్థు నిర్జించునే
నీచా! సర్ప శరంబు శక్తిగల యీసీ గర్వ మూరెండు చా
నే చందంబున మోఘమైచనఁగ నాకృష్ణుండు గావించునో
యే చేటుందుదిగాన కిచ్చకము నీవిట్లాడె దివ్వోచ్ఛేఁనగన్. 251

వ. అని పలికి ధృతరాష్ట్రుం గనుంగొని జ్ఞాతు లన్యోన్య మైత్రిం బ్రతికిన సకల సంపదలకు స్థానంబులగుదురు విరోధంబునం బొందిన విభూతి కెడసి చెడుదురు. కావున నిట్టి దుర్మతుల దుర్మంత్రంబు లంగీకరింపక పాండవులతోడి సంధి లగ్గగు ననిన బాహ్లికుండు నట్లన పలికినవిని యాంబికేయుండు గాంధారేయున కిట్లనియె. 252

క. శాంతనవుఁడు బాహ్లికుఁడును
నెంతయు నాయట్ల నీకు హితులు దలంపన్
వంతంబడమికిఁ జెప్పెద
రింత చలం బేల వినవు హితమైన సుతా. 253

వ. అని పలికి కొడుకు నోడఁ బాటెఱుంగక కినిసి
వెండియు. 254

ఉ. ఘోరదవాగ్నిచందమునఁ గ్రిమ్మరుకవ్వడి కోర్వఁజాలకే
వారకఁ బాఱుమూక నిలఁబాఱలు సాపఁగ నెట్లు రచ్చలో
బీరలు చాఁచినట్లగునె? పాల్పడి గోవులఁ గ్రిమ్మరింప నీ
వారును నీవు గర్ణుఁడట వచ్చుట లేదొకొ! ఘోరుగాదొకో!

గీ. అని మఱియుఁ గర్ణు దెస మొగ మగుచుఁ బల్కె
నప్పటికొలందిగా దిప్పు డర్జునుండు
హరి రథము దోలఁ గ్రేవల ననుజ తనుజ
గణముతో వచ్చు మాకొనఁ గలఁడె యొరుఁడు. 256

ఉ. అక్కట! చేటుపాటెఱుఁగఁ డట్టిసుతుం గొఱగాములూరకే
యెక్కలుబెట్ట వారలొక యీప్సితమారయఁగూర్చువారలే
కక్కస మొప్పఁ జావ నొడిగట్టితి రింతటి మేలు నోర్చి నా
రెక్కడ మీరు వీనికిపుడిష్టులు చూడఁగ సూత నందనా.

చ. అను డినసూతి హేతిగతి నప్పతిమాట చివుక్కనన్ మనం
బునుదునియంగ శంతనునిపుత్త్రుఁడుకొల్వునమున్నదన్నుఁబ
ల్కిన పలుకెంచి యిట్లను నకృత్యములాడెనుభీష్ముఁడింక నీ
తనికిని నాదుబాసటలు దప్పఁగఁగైదువు లూన మానితిన్

వ. అని యస్త్ర సన్న్యాసంబుఁ జేసి యచ్చోట నిలువక చనిన కానీనుం గని గాంగేయుండు నగుచు గాంధారేయున కిట్లనియె 259

గీ. అంత మానిసిగాఁడె పేఁడడవి నడుమ
బఱచె నాచిత్రసేనుండు బట్టువేళ
నట్టి బలియుండు గదయిప్పు డరిగె నింకఁ
బాండవేయుల కెట్లొకో! బ్రతుకుఁ దెఱవు. 260

చ. బవరముదక్క మాన వెటుబాహ్లికముఖ్యులుజూచుచుండఁబాం
డవ బల మేనుమున్నుగఁ గడంగి యనేకముగా వధించెదన్
రవి తనయుండు బిమ్మటనరాతులఁ జంపుట నీవకాంచెదో
యవనిప నావుడిట్లనియె నాతఁడు గర్ణుని పక్ష పాతియై.

క. రవి సూతి దుస్ససేనుఁడు
బవరము నకుఁ దోడుగల్గఁ బైకొని కడుఁ బాం
డవులను గెలిచెద నీక నా
కెవరేటి కిఁ బోటు సూవు టింతియు చాలున్. 262

ఉ. నావినియాంబికేయుఁడుమనంబునఁ గుందుచునిట్లుబల్కెఁదా
నా విదురుం దనూజుఁ డకటా! రవినందనుఁగూడి దుర్మతిన్
జావున కిట్లు పాండవుల సంధికిఁ బాసెను మీఱి తమ్ముఁడా
యేవిధిఁ జొత్తుఁ బెద్దలకు నెగ్గులు పల్కెడు బుద్ధి సెప్పినన్.

క. అని పలికి దైవ కృత మిది
చనునే? తల్లఁగింప నింక సంజయ! తుదినే

మని పల్కె మఘవు కొమరుఁడు
నిను వీడ్కొను నపుడు తనదు నిశ్చయ మెఱుఁగన్. 264

సీ. అనవుడు సంజయుం డాతనికిట్లను
వినవయ్య ఫలునుఁ డనిన తెఱఁగు
మాతండ్రి పాలు ధర్మజున కొసంగిన
చలమని మా యంత నిలువఁగలరు
దానికి నొడఁబాటు దక్కిన మద్దివ్య
ఘోరాస్త్రములచేతఁ గౌరవులను
దునుముదు నని పల్కిననుఁ గౌఁగిలించి వీ
డ్కొనిన నేనును బాండు తనయ కృష్ణు

గీ. లాది యగు వారి చేత నయంబుమీఱ
నంపకము గాంచి వచ్చితి అంత వట్టు
విన్నవించితి దేవర ! యున్నరూపు
పోలుగతిఁ జూడు మింక భూపాలవర్య. 265

వ. అని సంజయుండు చెప్పిన విని యేమియుం బలుకక బలు మొగంబులతోడ ధృతరాష్ట్రి ధార్తరాష్ట్రసంజయులు దక్క తక్కినకొలువునం గలవారు నిజనివాసంబుల కరిగిరంతకొడుకు గెలుచునో యను నడియాసచేఁ గ్రమ్మఱ సంజయు దెస మొగంబై రెండు సేనల బలాబలంబు లెట్లెట్లుండు ననుచు నడిగిన వాఁడు సాత్యవతేయుం డెఱింగించు నమ్మహాత్ము దలంపు మిదియునుంగాక గాంధారియు దెలియంగలదనిన ట్లి కాకయని గాంధారిని రావించి వ్యాసుం దలంచిన నమ్మ

హాత్మం డాగతుండగుటయు నర్ఘ్య పాద్యాది విధులఁ బూజించి సుఖాసీనుం జేసిన నతని తలంపెఱింగి వ్యాసుండు సంజయున కిట్లనియె. 266

క. ఈ నరనాథుం డడిగిన
దానినెఱింగింప నీకుఁ దగదెమహాత్మా
మానుగ ననవుడు సూతుని
సూనుఁడు ధృతరాష్ట్రవిభునిఁ జూచియిటులనెన్. 267

చ. వినుము నరేంద్ర! నీవిపుడు వీరల వారల తారతమ్యముల్
గనఁబలుమారు నన్నడుగఁగాఁ బనియేమి జనార్దనుండుదా
ననయము వారిసేనఁగలఁడట్టి మహాత్మునిఁ జూపుమిందునె
మ్మనమునఁనాతనిన్ మనుజ మాత్రుఁడటంచుఁదలంచిచూచెదో

క. శైశవము తఱినిఁ గ్రీడలఁ
గేశవుఁ డేమేమి సేసె క్షితి నాయక లో
కేశాదుల వంచింపఁడె
యీశుం డిఁక వేఱెకలఁడె యెఱుక గలిగినన్ 269

గీ. ఇట్టి జగదీశ్వరుండైన కృష్ణుఁ డెవుడు
పాండవేయుల కెక్కుడు బలము నూవె!
వాసి వారికి వీరికి వలవ దడుగ
బుద్ధిచే నూహసేయుమో! భూప వర్య! 270

క. అని మరియుఁ బెక్కు తెఱఁగుల
దనుజాంతకు మహిమ దెలియఁ దగఁ జెప్పిన న

జ్జనపతి తన సుతునకు ని
ట్లనియె నయంబార బుద్ధియగు వచనములన్. 271

క. మనసుఁ గడుఁ గూర్చి సంజయుఁ
డనఘా యితఁడొనరఁ జెప్పె నట్లన శౌరిన్
జను నాశ్రయింత మనవుడు
జనకునకు సుయోధనుండు సయ్యనఁ బలికెన్. 272

క. విను హరి నరునకుఁ జెలికాఁ
డనఁ జెవులారంగ వినుచు నకటా! యతనిం
జనదనుసరింప నసువులు
చని నం గడులెన్న శౌరి శరణము దగునే! 273

గీ. అనిన గాంధారి కిట్లను మనుజ విభుఁడు
వెలఁది! నీకొడుకింత దా వెఱ్ఱియయ్యె
మానఁ డెవ్వరు వలదన్న కాని తెలువు
చేరి నీవైన నొక బుద్ధిఁ జెప్ప రాదె! 274

వ. అనిపలికిన గాంధారియు ననేక భంగుల బోధించి
న నతండు పెడ చెవులం బెట్టి యూఱకుండుటయుఁ గృష్ణు వ
లనఁ గార్యంబు చక్కంబడునని హితం బుపదేశించు పారాశ
ర్యునకు ధృతరాష్ట్రుండిట్లనియె. 275

క. మునివర ! నీ చెప్పినగతి
వనజాక్షుని పదయుగంబు పదలక భక్తిన్
గని కొలిచి బ్రతుకు వాఁడను
వినయము మీఱంగ నింత వేడుక ననినన్. 276

వ. అనిన నంతసించి వ్యాసుండంతర్హితుండయ్యె. సంజయ సుయోధనులు నిజ నివాసంబున కరిగిరి. గాంధారీసహితుండై ధృతరాష్ట్రుఁ డంతిపురంబు జేరి మరియును 277

చ. అరయఁగఁ బాండవేయులమహోహవకౌతుకము ప్రవృత్తిగా
జెరకను సూతనందనుఁడు చెప్పుటకుం గురువంశ కేతువ
ట్లురకను రత్న సౌధ తటి నుండియు మారుత జాతరీతులం
గురుకొనియుండ్ వడం కేఁగొడుకుందలపోసియహర్నిశీథముల్

గీ. పాండుసుతునకు ధారుణిఁ బంచియిమ్ము
టంచు నేకాంతమున నయమూరఁ బలుకు
తండ్రి వచనము కర్ణము దప్పఁ గర్ణ
వచనము సుయోధనుఁడు మధు రచనఁ జేసె. 279

వ. అంత నెడలేదు కతిపయ దినంబులలోన నేపురగుమహావీరులు కౌరవ సామ్రాజ్యలక్ష్మిని నిక్షేపింప నయ్యెదరను జనవాదంబు లగ్గువలై చెలంగ ధర్మజుఁడు క్షీణధైర్యండై నిఖిల బంధుమిత్రులతోడఁ గేశవు సదనంబున కేఁగి యతనిచే సమ్మానితుండగుచు సకలపరిజనంబు నొక్కకెలనఁ బార్థతియును బరివేష్టించి కొలువ సుఖాసీనులై సహోదరసమక్షంబున దీనాక్షరంబుగా సరోరుహాక్షుని నీక్షించి యిట్లనియె.

క. అదనయ్యె హితుల కార్యము
పాదిపెట్టఁగ నీకు నేము పుత్రుల సరియా
గద తండ్రీ! చని తుదినా
పదలడఁప సుఖంబుఁగూర్ప బాధ్యుఁడవు హరీ! 281

వ. అని పెక్కు భంగుల నగ్గించి కురు నగర ప్రయా
ణంబున కొడంబఱచి వెండియు నిట్లనియె. 282

గీ. కృష్ణ! యందఱు బంధులఁ గీటడంచి
యిట్టి భువిచేత నేనేమి కట్టికొనెద
గాయగరుబులు వాగులఁ గలుగుఁ నీరు
గానలను లేవె మెసఁగఁగఁ బూనినపుడు. 283

గీ. నీరు సంతాప వేళను నెరయుఁ గ్రిందఁ
దగు బ్రసిద్ధంబుగద విరుద్ధంబుగాఁగ
జిహ్వ నెడఁబాసి జలమీది చిత్ర మిపుడు
నాదు దృష్టుల నారోహణంబు సేసె. 284

గీ, గాలి నీనెడు కరి కర్ణ తాళ చయము
చేత నట్టువ పచరించు సిడమువలనఁ
దాంత మగు నాదు మేను నితాంత కంప
మిప్పు డభ్యాస మొనరించు చొప్పు దనరె! 285

చ. అమరఁగ నెల్ల జంతువుల కాదట లెస్సయ కోరులోన నా
కుమయవిమానిబంధువులఁజంపినచోబహుదుఃఖపుంజమున్
గ్రమమలరంగఁదాఁచికొనఁగాఁగలయిట్టిబహిఃక్షమక్షమదిక్ష
మమతను గాంక్షఁజేసితిని మాధవ!నన్నిఁకనేమి సెప్పుదున్.

గీ. గరుడ కేతన నీవుదక్కంగ నొండు
గతియు మాకెయ్య దిప్పుడీ కష్ట ముడుప
నడవి వలగొన్న చిచ్చున నిడుమఁగుడుచు
హరిణమున కంబుదము కంటె శరణమెద్ది? 287

చ. వినుమిటు కృష్ణ! యింకఁబదివేలన నేఁటికిఁబల్కెదన్ మనం
బున వెలి నేకభావమునఁబొందిన వాఁడను నుమ్మ గావునన్
జనములు సంతసింపఁ గురుజాతి ధరిత్రిని నిల్చునట్లుగాఁ
జనుగతి మాకువారికిని సంధియొనర్పుము నేర్పెంపునన్.

గీ. తెలిసెఁగద నిన్న సంజయు వలన నచటి
తెఱఁగు మాతండ్రి రీతి వాఁడెఱుఁగు కొడుకు
చందము నెఱుంగు నెట్టిదో పొంచటంచు
నొకటిఁ బలికి చనియెఁ గడు నుచిత సరణి. 289

క. పదుమూఁడేండ్లనుఁ బెక్కా-
పదలం బడి తుదిని సిరికి బంధుల నెల్లం
గదనమునఁ జంప నకటా!
మదిఁ దలఁపం బాప మింక మఱిఁగలదె హరీ! 290

గీ. గ్రాస మొకమాత్రముగ మాకుఁ గడుచునట్లు
నేవురకు నైదుపల్లియ లిచ్చునేని
నంతియే చాలుఁ బుడమిఁ దా నావరించి
యేలుకో నిమ్ము కదనము జోలిమాని. 291

క. పగయున్నం దలపడకయ
నగముండిన యట్లు గాన నది నెవ్వరికిం
బగఁ దలఁచి నిడుద యాసునఁ
దగదు ప్రవర్తింపఁ గీడు తప్పదు దానన్. 292

క. ఎన్ని యుపాయము లైననుఁ
బన్నుము పోరితము గాని పద్ధతిని మమ్ముం

గ్రిన్ననఁ బాపము లంటని
తిన్నని నడకలకుఁ ద్రిప్పి దిద్దుము కృష్ణా! 296

చ. గరువతనంబుచే నెదురు గానక కౌరవ భర్త కారులుం
బరుసనఁ బల్కుమాకునయి పట్టి చలంబున మించనాడకే
సారిదిని నీతివర్తనము చొప్పనుఁ దప్పక పల్కునెంతయుఁ
వరుసను వారిమాటలవి వారికిఁజాలుట గాఁగఁజూడుమీ.

ఉ. వారక తండ్రియుంగొడుకువాఁడయి పక్షములాడఁజూచినన్
వారిజనాభ! నీవు తెగవారకతాలిమిఁ బూని నేర్పునన్
సారము లేనిదేనియునుఁ జక్కగ నూకొని యేరికిన్ నయం
బారఁగమారుదోఁచమిగనాడుములోకమునిన్ను మెచ్చఁగన్

వ. అని పలికి కొండొక విచారించి వెండియు నిట్లనియె

క. కురుపతి మన్నన మానెడు
నరయఁగ దుర్బుద్ధులగుదు రటు గావున ని
న్గరి పురికి నరుగు మనఁగా
భరము నగుం జోకయున్నఁ బనులెల్లఁ జెడున్. 297

చ. అనపుడు ధర్మనందనున కల్లన యోగి విచింత్య వైభవుం
డనఘుఁడు కృష్ణుఁ డిట్లను మహాత్మక! కౌరవులిట్టి వారలే
యనఁదగు నైననేమి వినుమప్పటఁ గోలెను నీవుపల్కు స
జ్జన చరితంబు యుక్తమగు సాధులరా మిముబోటివారికిన్

గీ. వెలయు సంధికి మన మొక విహితరీతి
నాడఁ దగుమాటలాడుట లంతె కాని

పదునెఱుంగుదు మాతఁడుఁ బట్టుపట్టి
కానిదేనియు గెలిపింపఁ బూనువాఁడు. 299

గీ. హితము గాంగేయుచేత శాసితుఁడు నగుచు
దురము త్రోవక దప్పఁడు కురు విభుండు
ఇది విచారించి నామది నిపుడు సంధి
సందియము దోఁచుచున్నది పొందుటకును. 300

క. మనమే నూళ్ళని నుడివిన
తన పౌరుష మెన్ని మిగులఁ దప్పింపఁడొకో!
విను చెఱుకుతీపియని వే
ళ్ళను గూడన్ నమలఁ జూచు లోలుఁడు సుమ్మా. 301

చ. అయినను బోయివచ్చెద మహాత్మక! సద్గుణశాలివైన నీ
ప్రియమగు కార్యసిద్ధికినిఁ బెంపున సత్క్రియఁ జేయఁబూనుచో
గయికొని తా ఫలించు నొక కాలమునన్ ఫలియింపకుండునె
ట్లయినన దేమిదోషమగునయ్య! యొనర్పఁదలంచువానికిన్.

వ. కావున కౌరవ సభకుం జని వలయు మాటలాడి భవదీయ సద్గుణ విశేషంబులు గొనియాడెద నందుల కసూయాపరుండై సుయోధనుండు తెఱఁగుమాలి పల్కెనేని జూదంబునాఁడు కోలె మీపడు నిడుములును యుష్మత్ప్రతాప వైభవంబును జూపి మోపి యందఱు విన నుగ్గడింతు నంత నచ్చటి సభికులు పుయిలోట దక్కి యతని నిందింతు రైనఁ బొందను మానంబు సంగరం బవశ్యంబు నగు నేమరియుండ ననుచితంబుగాన జతనంబునఁ జతురంగంబుల నాయితంబు సేయిం

వు మనుత్సాహివి గాక యుత్సాహంబు సేయుమనిన వాసుదే
వునకు వాయుసూనుం డిట్లనియె. 303

క. మరిమరి దురము దుఃఖంబని
వెరపించెద వేల మమ్ము విశ్వంభర! యి
త్తఱిఁ బోటరితనమునకై
యుఱుకుట కేమిప్పుడడి యటుండఁగ నిమ్మా! 304

చ. అనియగునేని రాచకొలమంతయు నంతము జేరు నొక్కఁడు
ర్జనుఁడగు నాసుయోధనుఁడు చచ్చుటగాదది కావునన్ జనా
ర్దన! వినుమా దెసల్ మరచి తాళిమిఁ బూని కురుప్రవీరులున్
మునుపొనరించు నేరములు మూలకు ద్రోచియుఁ బొత్తుఁగోరుటల్

గీ. ఏటి కన్నియుఁ దలపెట్ట నిపుడు వారు
మేము నొకపొందు గైకొని మెలఁగుటెల్ల
సకల సమ్మతమును జనక్షయముగామి
గాన యిది మేలు గావింపు కంసమథన! 306

వ. అనినవిని యితం డనుత్సాహియయ్యెనని యుత్సా
హంబు బుట్టించువాఁడై కృష్ణుండు వృకోదరున కిట్లనియె. 307

చ. గరళము నీరమట్ల[illegible]నఁ గాదనయోగ్యము జెందె నో వృకో
దర! యిపుడీవు పౌరుషము దక్కి భుజోన్నతిఁ బేదసేసి సం
గరమున వెన్కఁ ద్రొక్కి నిజగౌరవముల్ సడలంగఁ దాల్మి నీ
కరణినిఁ బల్కఁ జూచితివి కాలము ద్రానెటు వచ్చునో కదా!

గీ. అరులఁ జక్కాడి పరితినలఁ గరము నెఱసి
యన్నకీఁదగు పుడమి నీ యట్టివాఁడు

పిఱికితనమున నూఱక బెగడెదేని
యవల ననఁ బనియేమి కయ్యంబటంచు. 309

క. నరుఁడు ననుఁ గోరికొని తా
నరదము గడుపగను దెచ్చి నరి సేనా న-
గరమున గిరికిఁ ద్రిప్పఁగఁ
గర మేపునఁ జంపు నెల్ల కౌరవసేనన్. 310

క. నా విని మారుతి యిట్లను
నీవును బార్థుండు రిపుల నిర్జింతురటే !
చేవ చెడి మేము నూరక
పోవుదుమటె వింతమాట పుట్టెను గృష్ణా ! 311

గీ. కదన మగుపట్ల మద్గదా ఘనత హాతి గ
జేంద్ర కుంభ వినిర్గత రుంద్ర మౌక్తి
కౌఘములు ధారుణీ సతి కొనర గుచ్ఛ
మాలికలొనర్తు సూ వనమాలి! మౌలి. 312

వ. అని యిట్టి మగఁటిమి గలవాఁడవెఱుంగుదును గా
దె. అందులకు బలుమొగం బేల చేసెదవు అని పలుకు హరికి
నరుం, డిట్లనియె. 313

గీ. క్షితి విభుం డతిలోభ దూషితుఁడు మరియు
నతని కొడు కున్మదుఁడు నికృష్టాత్ముఁడెట్లు
సంధిగా నేర్చు విహితము జరపు కొటకుఁ
బోవఁ దగు రీతిఁ బోకుండఁ బోనఁగ దెట్లు. 314

క. తగుమెయిని నీవు ధారుణి
సగమొసఁగి నిప్పించి పరఁగ సఖ్యము జేయం
దగ నొనరింపుము తక్కిన
తెగువం బోరింపు నీమతిం గడచెదమే? 315

గీ. నీకు నిట్టట్టు లొనరింపుమీ కడంగి
యనుచుఁ గఱపెడు వారమే పనిచినట్లు
చేయువారము గాక నీ చేయుటకును
దక్క యొండెట్లుగా నేర్తు దనుజవైరి. 316

క. నా విని హరి యిట్లను గడు
చేవను మనుజుండు కృషికిఁ జేతుల పాటుం
గావింప దైవయత్నము
చే వసుధ ఫలించుఁ దప్పి చెడు విఫలంబై. 317

ఉ. కావున నోపినంతయును గార్యమొనర్పఁగఁబూనియున్న చో
దైవ కృతం బదెట్టులునుఁ దప్పదు కౌరవ రాజు దుర్మదుం
డే విధిపాటు దానెఱుఁగ జెన్ని తెఱంగులఁ జెప్పినం గణం
బీ వసుధాతలంబు విడఁ డింద్రతనూజ! రణంబుఁ దక్కఁగన్

వ. మున్ను గోగ్రహణంబునాఁడు గాంగేయుండు పాం
డవులఁ గలసి మనుట మేలనిన వారితో మనకుఁ బొందుపొస
గ నేరదని కొన్ని యుత్తరంబు లాడె నది పిదప మనమెల్ల నెఱి
గితి మట్టి కురుపతి నెయ్యంబున కియ్యకొన నేర్చునే ? యని
పలుకు హరికి నకులుం డిట్లనియె. 319

చ. మనునొకయర్జునుం డెకురుముఖ్యులగోగ్రహణంబునాఁడునో
ర్చునగద యిప్పుడిందఱను చేవమెయిన్ బహుసైన్యయుక్తిచే
ననికిఁ గడంగినం దమ జయంబనుమానముగాఁదలంపఁ డే
వినుమని భీష్ముఁడాది కురువృద్ధులు చెప్పరె నీవు పోయినన్

గీ. ఆచటి పెద్దల నీవు సాహాయ్యకంబు
గూర్చికొని సాము భువి యిమ్ము కురునరేశ!
యనిన మెత్తగిలంబడి యట్ల సేయు
మాకల బడనేరఁ డరుగుమీ మధువిదారి ! 321

చ. అనవుడు వాసుదేవునకు నా సహదేవుఁడు పల్కె నో జనా
ర్దన! వినుసంజయుండుఁ గడుదైన్యముసం దగ నర్థసిద్ధియౌ
నని యొడఁబాటు సేయుటకు నన్నమదిన్ నిజమంచునంతని
ట్లనయమువారుజేయుభ్రమనందుటసూ దెసవీరుచెందుటల్.

క. పలుమరు వలదని చెప్పన్
గలిగినచో బిగువు గొంద్రు గద కుమతులకుం
దల మరలపకునికియె య
గ్గల ముడుపుట తాకి మ్రొగ్గఁగాఁ దెలియుఁ దుదన్. 323

క. పొందని తలఁపడు కురుపతి
సందియ మేమిటికి దురము సమ్మదమగు నీ
వం దరుగవలదు లోకువ
జెందిన క్రియ నూవె పెద్ద సేయుఁడు నిన్నున్. 324

గీ. కావునను గెల్చి కొంటమె కార్యసిద్ధి
యపుడు సాత్యకి యిది లెస్సయనియె నచటి

దొరలు నిధివోలునని రంత ద్రుపదకన్య
యనియె గద్గద కంఠియై హరినిఁ జూచి. 325

సీ. తమ్మునిపైఁగల నెమ్మిచే నీరాజు
తొలుతన బన్నముల్ తుడిచివైవ
నేనూళ్ళ మాత్రను యిచ్చిన నంతియు
మేలని పలికె నిమ్మెయినిఁ దనదు
తక్కువ యెక్కువ దగ విచారింపక
యూరడిఁ బోవుట యగున కాదె
యన్నదమ్ములు గూడి యన్యోన్యమున నొక్కఁ
డై యున్నఁ జాలు నెయ్యంబుఁ గలిగి

గీ. నే నొకటిబల్కి నిందలఁ బూననేల
సిరికి సుజనత్వ మేటికిఁ జెడఁగ వలయు
దెసలగుడిచిన దాసనై తెరవసగుట
నూరకుండక యనియెద నోమురారి! 326

చ. పటు బలశాలులై తగిన పార్థుల నేవురఁ జెట్టఁ బట్టి యు
క్కటు! సభ నట్టియాపదలఁ గౌరవుచేఁబడి పేరుపెంపు నొ
క్కటఁ జెడిపోక వేదనలఁ గ్రాగుచు నే నొకబోటివోలె నీ
పటిమదలిర్పఁగుమ్మరుదుఁబంకజలోచన! యేమిసెప్పుదున్.

వ. అని పలికి నిబిడంబగు శోకంబు నిగుడ నెలుఁగు
చాల్వడ నేడ్చుచు దుశ్శాసనాంగుళి త్రుటిత కేశపాశంబు
హరి ముందటం బెట్టి కొలువున నన్నిట్లు వంతం బెట్టిన పాప
కర్మ కరంబు దండింపం జనదే? కౌరవులు సేయు తప్పిదం

బులు సైపని పాండవుల కేమి గతం బప్పాపు ధర్మం బడ్డపడియె సందు రెంతయేనిం బంచి యిచ్చినం జాలునని పలుక నిప్పుడే ధర్మంబు తమకడ్డంబయ్యెనని తదీయాపరాధంబు లుగ్గడింపుచు దుఃఖించు ద్రౌపది నూరార్చి కూర్చుండ నియోగించి మఱి మెల్లన నిట్లనియె. 328

క. ఎడలేదు లలన! శోకం
బుడుగుము కౌరవుల సతుల కోనరెదు పెక్కా
నిడుములఁ బడ వైభవమున
నడతువు వల్లభులతోడ నాతీ నీవుగా. 329

గీ. అట్టి యెడఁ గ్రీడి హరిఁ జూచి యనియె నిట్లు
పౌరవులు పాండవులు కృష్ణ బంధు రీతి
నొక్క గతి యగుఁ గాదె! నీ కుచిత వృత్తిఁ
బొందు సేయింపు కలఁతను జెంద కుండ 330

వ. నీవు బంధుప్రియుండవు చుట్టంబుల కొక కీడు రాకుండ విచారింపవలదే? యనిన హరి నరునఁ కిట్లనియె. 331

గీ. కౌరవులకు మీకు నారయ హితముగాఁ
జేయఁ బూని పొత్తు సేయుటకును
ధర్మసూతి పలుకుఁ దప్పక యచటికిఁ
జనుదు ననిన శమన తనయుఁ డపుడు. 332

వ. హర్షంబునం బొంగి దేవా! యట్టన కావింపుమని యె నంత నిట్లు కార్యంబు నిశ్చయించి దినశుద్ధి విచారించి వలయు తెఱంగున వార్తలాడి యుధిష్ఠిరాదులును దక్కిన

వారలును నిజనివాసంబుల కరిగిరి. మరునాఁడు ప్రభాత సమ
యంబునఁ గేశవుండు తత్కాలోచిత కృత్యంబులు దీర్చి
భూసురాశీర్వచనంబులు గైకొని సాత్యకిని రావించి మన వా
రిలోఁ గరి పురంబునకు రాఁదగు ప్రజలఁ బయనంబు సేయింపు
ము రథంబు బన్నించి చక్రగదాద్యాయుధంబులు నందులఁ
బొందుపఱుప నియోగింపుము. సుయోధనుండు దుర్లలితుం
డెట్లగునో యని పల్కిన నతండట్ల సేయించె. సైన్య సుగ్రీవ
మేఘపుష్ప వలాహకంబులం బూనిచి తేరుదెచ్చి దారకుండు
కేల్మోడ్చి పొడసూపిన.

గీ. దారుకానీత రత్నంపుఁ దేరు మ్రోల
మొనయఁ జిఱునవ్వు మోమున ముసుకు వడఁగ
నా రథంబెక్కి యాశ్రితాధారుఁడైన
శౌరి కురుపురి త్రోవను జరుగు నపుడు. 334

క. పాండవ పాంచాలాదిక
మండల పతు లోరసి నడవ మాధవు చేరం
బాండుకుమారాగ్రణి వే
దండము గతి నడిఁగి కోర్కి దగ నిట్లనియెన్. 335

గీ. హరియు వేంచేసె ననిన మాయమ్మ మిగుల
సంతసింపుచు నుండు నక్కాంత నీవు
నూఱడింపుము కృష్ణ నామూరుగాఁగ
శోకమునఁ జెందు మదియందు సుఖము దక్కి. 336

క. గురుఁడును లోనగు నచ్చటి
కురు వృద్ధుల నెవ్విధమునఁ గొనియాడఁ దగుం
గర మొనరింపఁగఁ దగునో
పురుషోత్తమ! నీవు నన్నుఁ బోలెఁ బ్రియమునన్. 337

క. దుర్యోధను చందము మా
మర్యాదయు నడుచు రీతి మరి నెఱుఁగుదువే?
కార్యముల తెఱఁగు నెఱుఁగుదు
వార్యస్తుత! యెంతవాఁడ నరు గిఁకఁ జెప్పన్. 338

వ. అని పల్కినంత భీమార్జునాదులగు తక్కిన వారలు వెరవునం బలికి కార్యంబు సఫలంబుఁ జేసికొని రమ్ము పొమ్మని రప్పుడు హరి వారల వీడ్కొని సాత్యకిం దన రథంబెక్కించుకొని పరిమిత సేనాసమేతుండై కదలి తన తోన నడచు ప్రజల తోడ సరస సల్లాపంబు లాడుచు సూర్యాస్తమయంబునకు కుశస్థలంబు ప్రవేశించి మరునాఁడు నటఁ గదలి వారణపురంబునకు వచ్చుచున్న సమయంబున జారులచేఁ గేశవుండు దన వీటి కేతెంచుచున్న వాఁడని ధృతరాష్ట్రుండు విని గాంగేయ గురు విదుర కుమార ప్రభృతి జనంబునెల్ల రావించియిట్లనియె.

సీ. కృష్ణుండు మన వీటి కేతెంచుచున్నాఁడ
టంచుఁ జారులచేత నటిది వింటి
నమ్మహాత్మున కిప్డు డభిగమ్యముగఁ బోవు
కంటెను బుణ్యంబు గలదె యెందుఁ

బోరిలు శృంగారింపఁ బుచ్చుచు గ్రక్కున
నింపు మేల్కట్లఁ గట్టింపుఁ డోలి
వలయు ప్రయోజనంబులఁ బంపుఁడొనర దు
శ్శాసనాది కుమార సంచయమును
గీ. దానసంబున కెయ్యవి వానిఁ గూర్పఁ
డాముకుందుండు నన్నుఁ దానడుగునెద్ది
దాని నిచ్చెద వేఁడుక దడయ కనుడు
తండ్రి కయ్యెడ నగి సుయోధనుఁడు పలికె. 340
గీ. పూజనీయుఁ డగును బుండరీకాక్షుండు
నైన నేమి యతని కధికభక్తిఁ
గోర్కు లొసఁగ వెఱచి కొని యిచ్చిరని మన
కొక్క లోకనింద యొసరుఁగాదె. 341
క. అనవుడు విదురుం డన్నకు
ననియెన్ నీతలఁపు దెలిసె హరికిని మెచ్చుల్
చన నిచ్చి భేదకార్యము
బని బూనితి వేల నరునిఁ బాయు నతండున్. 342
గీ. అతఁడు పూని వచ్చు నక్కార్య మీడేర్ప
నదియు నీకుఁ దలఁప నధిక శుభము
నతని కదియు నమ్ము హితమును గావున
నట్లు సేయుమయ్య! యవనినాథ! 343
శా. గాంధారేయుఁడు దండ్రికిట్లనియె నిక్కంసాంతకుంబట్టి ని
ర్బంధంబొప్పఁజెఱన్ వసింపనిడినం బార్థుల్ దెసంగూర్చి తా

రంధీభూతులునై గరుద్రహిత పక్ష్యౌపమ్యులై చిక్కి మా
సంధిం జేరిన యట్లు వాటిలెదరోజం జేయుదే నాక్రియన్.

గీ. అనుడు ధృతరాష్ట్రుఁ డప్పుడు తనయుఁ గినిసి
యోరి దుర్మార్గ! హరి యపకార మెద్ది
చేసె నీకిట్టి దుర్బుద్ధి సెడఁగఁ బొడమె
ననుడు భీష్ముండు నట్లన గసలి పలికె. 345

వ. అంత మురాంతకుండు కరిపురప్రాంతంబున కేతెం
చునెడ ధృతరాష్ట్రు పనుపున గురు భీష్మ బాహ్లిక ప్రభృతి
కురువృద్ధులును దుర్యోధనుండు దక్కఁ దక్కిన కుమార వర్గం
బును సకల రాజలోకంబును గజతురగ రథారోహణంబులు
సేసి యెదుర్కొని కానుక లొసంగుచు నుచితక్రమంబునఁ
బొడఁ గనుచు నిష్టాలాపంబులాడుచు రాజమార్గంబునం
దోడి తేరఁ బౌర జనంబులు హర్మ్య ప్రదేశంబులందుండి శైశ
వం బాదిగాఁ గేశవు క్రీడలుగ్గడించి చెప్పకొనుచుఁ గన్నులు
పండువుసేయు నాసమయంబున హరి కొల్వుకూటంబున
కేతెంచి ధృతరాష్ట్రునకు నమస్కరించి యతనిచేఁ బూజలు
వడసి సుఖాసీనుండై యథోచితాలాపంబులఁ గొంత ప్రొద్దు
చెవులకు విందులొనర్చి విదురాదులగు వలయు వారల యిం
డ్లకుఁబో వలయు నని యమ్మహారాజు ననుమతి విదురు సద
నంబున కేతేర నతండు హర్షంబున నెదుర్కొని పూజించి
పాండవుల కుశలంబడిగిన నంతయుం జెప్పి కుంతీసదనంబున
కేఁగువాఁడైన విదురుండన్నప్రయత్నంబు సేయింతు నన

వ్రుం డట సేయింప నియోగించి మరియును. 346

సీ. దామోదరుండు పృథా మందిరముఁ జేర
నరిగిన నాయమ యతని గాంచి
తన బిడ్డలట్లు బడినవిపత్తుల నెల్ల
నాత్మలోఁ దలఁపోసి యడలు బొడమ
శోకించుచున్న నచ్యుతుఁడు నొయ్యన శాంతి
నలవడఁ దగిన మాటలను దేర్చి
పలికిన నప్పుడు పత్ని దుఃఖము మాని
యొక కొంతవడి యూరకుండి నిదుర

గీ. దోఁప నూర్చుచుఁ గన్నీరు దుడిచికొనుచు
నుచిత పూజలొసంగి సమున్నతాస
నంబుఁ బెట్టించి తా సమీపంబునందు
నొసర గద్దియ నుండి యిట్లనియె నపుడు. 347

గీ. తండ్రి చనిన పిదపఁ దల్లియు లేనట్ల
కొడుకు లెంత యిడుమఁ బడిరి కృష్ణ
యమ్మర నీవు శిక్ష నలరిన వీరులు
పరమ ధార్మికులును బాండు సుతులు. 348

క. వారలు సుఖులే? ద్రౌపది
కారయ భద్రంబె? పుత్త్రులందఱు కంటెఁ
గూరిమిఁ గోడలిపైఁ గల
దారీతిని నాకు గోడలట్లన నడచుఁ. 349

గీ. అట్టి సాధ్విని సభ నాఁడు నకట! యట్టి
వంతఁ బెట్టిరి కౌరవు లంతకంటెఁ
గలదె యంచు నవియునెల్లఁ దలఁచి త్రివ్వి
కొంచు నడలున మఱియు నక్కుంతి పలికె. 350

క. కొడుకులుఁ గోడలుఁ బడియెడుఁ
నిడుమలు నొకయెత్తు నాకు నీపదమూఁడేం
డ్లెడఁబని యధమపు కూడుం
గుడుచుట యొకయెత్తు బావ కొడుకులచేతన్. 351

వ. అని మఱియుఁ దన దురవస్థలం బేర్కొని చెప్పు
కుంతికి హరి యిట్లనియె.

క. దేవీ! నిఖిల నృపులు సం
భావనఁ గొలువంగ సిరికిఁ బట్టయి నీ పు
త్త్రావళి విభవముఁ జెందఁగఁ
గేవల మికఁ జూచె దింకఁ గృత కృత్యమతిన్. 352

ఉ. నా విని కుంతి యాదవజనాథునకిట్లను మోముచిచ్చుచున్
దేవ! భవత్కటాక్షమునఁ దీరదె వారికి సంకటంబు నీ
బావను నీమఱందులనుబల్కుము నావచనంబు క్షత్త్రియుల్
చేవఁదొలంగినం బనులు నేకురనేర్చునె? దైన్యవృత్తులన్.

గీ. రాచ బిడ్డ కడుఁ బరాక్రమం బెడలిన
నింగలంబు వేడి నెడసి నట్లు
గాన భుజబలంబు గలిగివ ర్తింపుచుఁ
బొదలఁ జేయు నాదు పుత్త్రికులను. 355

వ. అని వలయు నుత్తరంబులు సెప్పిన సంతసించి యు నంతుం డనంతరంబ సుయోధను నిశాంతంబున కేఁగిన నందు శకుని సైంధవ ప్రభృతి బంధుజనంబును దుశ్శాసన దుష్ప్రహ ప్రముఖ సోదర నికరంబును మఱియు ననేక నానాదేశ రాజలో కంబును గొలువ నాగకేతనుండు హరికిఁ బ్రత్యుద్గతుండై విహి తగతిం బూజించె సాత్యకియుం బూజితుండయ్యె నయ్యెడ ను ఖాసీనులై యెల్లవారు వేడ్కలం దన్నుఁ జూచుచుండ మధురా లాపంబుల సభాసదుల వీనులకు విందునేయు గోవిందు వదనా రవిం దబుఁ జూచి సుయోధనుం డిట్లనియె. 356

క. సూద జనము నాయింటను
స్వాదుస్థితిఁ బాకములను సమకూర్చెను లె
మ్మాదరమునఁ గుడువ నోదా
మోదర! ప్రొద్దయ్యె జాగు నొందఁగ నేలా? 357

ఉ. నా విని కేశవుండు గురునాథున కిట్లను నో నృపాల! సం
భావన వచ్చినట్టి పనిపాటిలకే మును నారగింపఁగాఁ
గేవల ధర్మమెట్లు కృతకృత్యుఁడనై పిదపన్ భుజింతునా
నావనజాయతాక్షునకు హస్తిపురాధిపుఁడిట్లనుందగన్. 358

క. చను దెంచిన కార్యంబది
విఁమా మరికాకపోవు వేగిర పడఁగాఁ
జనునే? యదిగాక భుజిం
పను నేనన నుచితమెట్లు పంకజనాభా. 359

చ. వడిఁ బయనంబుచే నడచివచ్చినవాఁడవుమాగృహంబునం
గుడిచినపిమ్మటం బ్రియముగూర్చుప్రయోజనమెల్లఁదీర్పఁగాఁ
గడుఁదగుఁ గాకముందుమకుగానిటు గుజ్జముమీఁదనీవు గా
లిడికొని మాటలాడఁ బనులెట్లొనఁ గూడును గంసమర్దనా!

ఉ. చుట్టఱికంబునం దలఁచి చూచినఁబొంకు కుమారు లేమునీ
కెట్టును నొక్కరూపయగునిప్పుడుకవ్వడి కారయంగఁ దోఁ
బుట్టువునిచ్చుటెంత యది పూర్వముబంధుత నెంచఁబోలదే
చెట్టనె విందు యత్నములు చేసితి వల్వదసంగ నేటికిఁ.

గీ. అనుచు వాసుదేవుఁ డద్ధరణీపతి
చేయివట్టి తెలియఁ జెప్పవలెనె
యనుచు బయలుమెఱసి యందఱు వినుచుండఁ
బలికెఁ గన్నువొడుచు భంగినపుడు. 362

సీ. ప్రియముచే భుజియింపఁ బెట్టని పెట్టిది
పెట్టుగా దరయంగ రట్టుగాని
యిదిగాక శాత్రవు నింట నన్నముగొన
నగునె? నేరపుఁడనా, యంటివేని
మత్ప్రాణములకు సమస్థితిఁ దగుపాండు
రాజసూనులకకారణముగీఁడు
శైశవంబాదిగా సల్పెదు నీవు శ
త్రునికంటెఁ గొఱతగాఁ దోఁచునెట్లు

గీ. కాన మీయన్నములు గొనఁగాదు దుష్ట
ములు దలంపఁగ భోక్తవ్యమెలమి విదురు

నిలయమున నంచుఁ దెలియంగఁ బలికియతని
యనుమతంబున నచటికి నరుగునంత. 363

వ ద్రోణ భీష్మాదులగు తగు వారలు తన తోడలేచి
చనుదెంచి దేవా! మదీయ గృహంబుల కేతేరవలయుఁ గానుక
లాయితంబు జేసితి మనుచు మీయందఱు నివాసంబులకు వచ్చి
తినికదా యింక నిలువుండని వీడ్కొల్పి పుండరీకాక్షుండు వి
దురు సదనంబునకుం జనియె నయ్యవసరంబున. 364

గీ. ఇరుల వంగడముల గుంపులెల్ల నెదుర
సమము గొనఁజాలు మేడాలు గమిచి పెరుగ
విదురు నిల్లు ప్రవేశించె వెన్నుఁ డపర
శైల కందర మరవింద సఖుఁడు వోలె. 365

క. హరి యంత గృహము జొఱునెడ
నరుదగు మద నృత్త గీత మతిశయమయ్యెన్
పురహరుని సాంధ్య తాండవ
గరిమ మరిం గుఱుచఁ జేయు కరణిన్ వరుసన్. 366

ఉ. అంతటఁ జిత్రమైతగిన యన్నము నవ్విదురుండు నెమ్మిఁ గం
సాంతకుఁ బూజ నేసియిడనాప్తులు దమ్ముఁడుదాభుజించి య
భ్యంతర మందిరంబునఁ బ్రియంబగు పాన్పున నత్తమిల్ల నే
కాంతమునందునా తఁడుమురారినిఁబల్కె నయంబుమీరగన్

గీ. సతతమును ధార్తరాష్ట్రులు జడవిచారు
లతులమలినస్వభావులు నగుదు రట్టి

వారి కడకేఁగు దేర మీవంటివారి
కర్హమగు నెట్లు గోవింద! యర్థిఁ గోరి. 368

క. మాధవ! వచ్చిన బలమును
రాధాసుతు చలము నచ్చి రారాజును దు
ర్మేధం బాండవులకు నా
యోధనముం దక్క నుర్వియొసఁగఁడు సుమ్మీ. 369

గీ. పాండు సుతులకు ధరఁబాలుఁ బంచుననుచుఁ
బూని యొసఁగము గెల్తుము పోర వారి
నిట్లు కృత నిశ్చయంబుగా నెసఁగి గండు
మిగిలి యున్నారు కౌరవుల్ మృదువు గలదె? 370

చ. అనవుఁడుగృష్ణుఁడిట్లనుమహాత్మక!యింతయునైజమేయగున్
వినుమటులైనఁ జుట్టలోకవీరిఁడిచెయ్యిలఁ బోవుచున్నచోఁ
గనఁదగునెట్లు బుద్ధినవ్వుగాదని యోపినయంతఁదీర్పఁగాఁ
జనునని మిమ్ముఁబోటి గుణశాలులు పల్కుదురేకదాభువిన్

గీ. మఱియు నిదియుఁ గాక మాధవుం డిది చక్కఁ
జేయఁ దలఁపఁ గార్య సిద్ధిగాదె?
యనెడు లోకనింద నడఁపఁగ వచ్చితిఁ
గాని పొత్తుగాని దేనెఱుఁగనె? 372

క. అని యుచితరీతి నాతని
మనమలరం బలికి పుచ్చి మధుసూదనుఁడుఁ
జను తెఱఁగున సుఖ నిద్రం
దనరం గైకొనియెఁ దానుఁ దమ్ముఁడు నెమ్మిన్. 373

వ. అంత బ్రభాతం బగుడు సురనాఁడు తత్సమయ సముచిత కృత్యంబులు నిర్వర్తించి దరదరుణ కిరణ పరిస్ఫురణంబు వలన వలనగు వలాహకునట్లు ఘుసృణ మసృణితపాటీర పంకాంకిత తనుండును నంచల లిఖిత సముంచిత రాజ మరాళంబుల పిండుమెండు కొను పుండరీకంబులును సందియంబు డెందంబునం బొందిఁ బ్రపదపల్లవంబుల నల్లనల్లన నందికొన వట్టుసాచి యుబుకు సొబగున జగజంపుఁగొను తెఱంగున బంగరు దువ్వలువ జెరంగు జంగదరి రంగులీనుచుం దూఁగనేఁగు రమణీయయానుండును నిజోదరానంతరానవకాశత్వంబున బహిర్గతంబులైన జగదండ శిశువుల పింఛుల కరణింబురణించు నమూల్యముక్తామణి గణప్రణీత మేఖలా ముఖ భాగుండును వర్షాహేమంత సమయంబుల నెఱి మించక యించుక కొంచెపుఁ దనంబునం బొరయు చంచలా కరాంచల లీలాంచిత కాంచన కమలంబు నుజ్జగింపఁ బజ్జకేతెంచు మార్తాండ మండలంబునం బోలు కౌస్తుభరత్న భాసిత భుజాంతరుండును దనుజ రాజ పరిషదౌత్పాతిక పరివేష యుగళ విశేషంబు చాడ్పునఁ బద్మరాగ కేయూర పరిమండిత బాహుదండుండును నగుచు వలయభూషావిశేషంబులనలంకృతాంగుఁడై విదురమందిరద్వారంబు నిర్గమించి వినమితపూర్వకాయుండై విదురుండు గైదండయొసంగ గురు కృప ప్రముఖ బ్రహ్మ సంఘ ప్రతివాద్యమాన జయాశీర్వచన ప్రయుక్తా నందంబు లాదరింపుచుఁ గుశలప్రశ్న లొసంగుచు దేవవ్రతుండు నిజ సదనాభి గమనంబునకై వేడు

చుండ సుయోధన సంచార దుర్వాసితంబగు నగర భూమి
ర్శన పరిహారంబు సేయుటకుంబలె సవినయంబుగా దారుక
సంయోజిత మణి పాదుకా విరాజమాన పాద పద్ముండగుచు
సమయంబు గాన కెదుళ్ళు చూచుచు నెట్టకేల కవసరంబు గని
నిఖిలాక్షౌహిణీ పతులిచ్చు మ్రొక్కుల మక్కువ సంభావించు
చు వంది బృందామందపరిపఠ్యమాన కంసాది దుర్జన హననా
ర్జితార్జవ బిరుదావళి ప్రబంధబంధుర శబ్దంబులతోడ మంగ
ళార్థప్రోక్షిప్త ప్రసవ సంపదంధీభూత పుష్పంధయ ఝుంకార
సహచరవాదిత్ర రవంబులు చెలంగ మేఘగర్జావర్జితంబై విల
సిల్లు తటిల్లతల తెఱుగున మెఱుంగు లీను బంగరు బెత్తంబు
లచే వ్యాకీర్ణంబగు మహారాజ పథంబు పట్టి జనంబులకుఁ
గన్నుల పండువు లొసంగుచు నల్పదూరంబు పాదసంచారుండై
నడిచి తదనంతరంబ దారుకుండు గరుడధ్వజంబు గ్రాలు తేరు
సమ్ముఖంబుజేసిన సహస్కరుం డుదయశిఖరి శిఖరంబునుంబోలె
నయ్యరదంబు నెక్కె కృతవర్మ సాత్యకు లొక్క రథంబునను
దుర్యోధనాది దుష్టచతుష్టయం బొక్క యరదంబుననుఁ దగు
వారుఁ దమతమ వాహనంబుల నధివసించి యెడయీక నడవ
నభ్యంతరులగు మానుసులు తనుం బొదివికొని యేతేర శంఖ
మృదంగాది తూర్య రవంబుల మిన్నుభేదిలు నానావైభవం
బులచే గోపాలదేవుండు రాజమందిర ద్వారంబు సొచ్చి పూర్వ
సభామంటపంబు మెల్లమెల్లనఁ బ్రవేశించె నంత. 374

గీ. అందు రయమున రత్న సింహాసనంబు
వెట్ట నాసీనుఁడై నట్టి వెన్నుఁడొనరఁ
దత్పురోహిత నీతాగ్రితల సపర్య
లెసఁగఁ గైకొని యనుమోద మినుమడింప. 375

క. కొలువునఁ దలముగఁ గాంతులు
చిలికెడు హరిఁజూచి చూచి చీఁకునకునుఁ దా
నలవడదు మోదమత్తుల
కలవడదే నగరజనుల కందఱ కెలమిన్. 376

ఉ. గద్దియ డిగ్గ వాగ్రిలు పదకంజము నవ్విదురుండు పుక్కఁగా
నద్దులు దక్కి కొల్వు దనచారు వచస్థ్సితి గోరి కర్ణముల్
తద్దయునొగ్గగాఁ బరమ ధార్మికుఁ డాయురవిందనాభుఁడున్
నిద్దము మీరు గర్జ కరణిన్ ధృతరాష్ట్రునిఁ బల్కెనిట్టులన్.

గీ. వినుము కురునాథ కుల గుణ వృద్ధుడవగు
నీ వెఱుంగని పాడి గణింప వసుధఁ
గలదె యైనను నెటువంటి ఘనులనైన
తెఱఁగు మాలిన తఱిఁ బిన్న దీర్పఁ బొప్పు. 378

వ. అదియెట్లంటేనిసావధానచిత్తుండవై యాకర్ణింపుము.

ఉ. కొంచెపువాసరంబులను ఘోరరణంబున నైందవాన్వయం
బించుక యేని లేక చెడునేత్తెరనంచుఁ దలంచి నీప్రజా
సంచయ మాపృథా సుతుల సంధికొడంబడు నట్లునేయఁగా
నెంచి భవత్సమీపమున కిప్పుడు వచ్చితిఁ గౌరవేశ్వరా.

గీ. నీ సుతశతంబుతోడఁ బృథాసుతులునుఁ
బొందుఁ గూర్చిన మేలు కళిందజాత
రంగతతితోడ గంగాతరంగములనుఁ
బోలెఁ గుశలంబుఁ గలిగెడు పుణ్యకీర్తి. 381

గీ. పాండుతనయులు నీపద పంకజముల
కెలమి శతశతంబులు శిరంబులును మ్రొక్కి-
వినయపూర్వకముగ నిట్లు విన్నవించి
రవధరింపుము సర్వంసహాధినాథ ! 382

చ. అడవిని బుట్టి యేము భవదంకతలంబున వృద్ధిఁగాంచి పెం
పెడపక యాజ్ఞనోఁదల వహించి రణాబ్ధుల నెల్ల మాటికిఁ
గడపిన వార మీరిపుడు గౌరవనాథ! యథాంశమిచ్చియిం
దిడుము మహావనిం బొసఁగ దేని మహావని కేనిదోవవే ?

(క. వనిఁబుట్టిన నా తమ్ముని
తనయులకుం బిన్ననాఁడు, ధాత్రి, మనుపఁగా
నొన గూడమికి మనంబున
వనరుదువు, తదర్ధమొసఁగ వాంఛింప వొకో. 384

గీ. ఇవ్విధంబున వచియించు కృష్ణుతోడ
నిడుద నిట్టూర్పు విడిచి, మన్నీఁడు, పలికె
బిడ్డ, దుర్యోధనా, నీవు చెడ్డతోవ
విడిచి మనుమని శాసించి, యుడిగినాఁడ. 385

గీ. పుత్త్రవత్సల, నాతల్లి మున్ను వ్యాస
మునిఁ గనుంగొని, కన్నులుమోడ్చె, దానఁ

బుట్టు గుడ్డినై, మూర్ఖుఁడో పట్టి మొగముఁ
గాన కతిమోదమొందు చున్నాను, గృష్ణ. 386

క. ఈనా కొమరుఁడు, తనకుం
దానై తెలియండు, బుధవతంసుల మాటల్
వీనులఁ జొనుపఁడు సుగుణ ని
ధానా! కురుకులశుభర్ధిఁ దగసల్పఁగదే. 387

వ. ఇటుల బద్ధాంజలియై ధృతరాష్ట్రుండు, సిద్ధాంతిం
పఁగా నిజాసనార్ధభాగంబున హస్తతలంబునిచి, ఇంచుక వా
మ బాహుశిఖరంబెత్తి, గండ మండలంబున మకర కుండలం
బులు మునుంగ నగుచుఁ గటిచలన కందళిత కనక పట ము
ఖ్య రారవవ్యాజంబున నట్టుఁ దిప్పి యప్పుడు. 388

చ. కరముఁ గరంబునం జఱచి కర్ణునితో నగి దుస్ససేనుతో
సరిపడ నేర దేల నిఁక సంధి తెఱంగని యేవగించి వి
స్ఫురదధరప్రకంపమునుబూనుచుమామమొగంబుగాంచు నా
కురుతనయాగ్రజుంగనిముకుందుఁడుకొల్వునఁబల్కెనీగతిన్.

గీ. పార్థులకు వారి ధారుణి పాలొసంగు
తలఁపుచే జెప్పుచున్నమీ తండ్రి పలుకు
వినమి నీ కెట్లు దగుఁ జందురుని కొలమున
నిట్టి పుట్టువు వెలితిగా నెసఁగ నధిప! 3!0

చ. చెలువగు నీకులంబు పృథుశీలము నట్టిది యాలకింపు ము
జ్జ్వల తరుణుండుపూరుఁడు వెసంగొనఁడే తమతండ్రి జీర్ణతం

జెలఁగిపితృప్రమోదమొగిఁజేయఁగ రెండవయాశ్రమంబునన్
దలఁగినవాఁడుపీఁడె పటుధైర్య ఘనుండగుభీష్మఁడిచ్చటన్.

చ. నెఱిగిఁ తన్కీర్తిచే ననుచు నీచెవులార మనోరథంబు న
త్తఱి సఫలత్వమొందెనుఁగదా! మునుభర్గునిమస్తకంబు వేఁ
జఱచిన విల్లుఁ దా మగుడ శక్ర తనూజునిచే రణావనిం
గుఱుకొని కుండలాకృతినిఁ గూర్చిన కుండలిరాజకేతనా!

చ. వలనగు నీ కురూద్వహకులవంశమునంగుటిలాత్ములైన దు
ర్గలితులు శత్రులిర్వురు కళంకముఁ జూపహరింపఁబొల్చి నా
రలనడ నొక్క క్రేవఁగు ముదాప్తుఁడు రెండవ క్రేవ నీవు గాఁ
దలఁచితి నందు నిందులనుఁ దక్కిన వారల నెన్న నేఁటికిన్.

గీ. ఏను నిను జక్క సేయ నేఁడెంత దవ్వ
వలవ దది రాజు డెందంబు వమ్ము సోఁకు
గోరుజిమ్ముచుఁ బెనువ్రేలు గోసినట్లు
పరగు నని సామమే కోరి పలుక వలసె. 394

క. తత శౌర్య ఘనులు కుంతీ
సుతులు నినుం గోరి పొత్తు సారిది దలంపన్
హిత మెఱుఁగ వేమియును దు
ర్మతము మదిం దలఁప వలదు మానవనాథా! 395

వ. వినుము బలంబు నచ్చి చలంబు డింప నేరవు. విశ్వచ్ఛుతోడ నుద్దియగు వీరుండు నీమొనఁగాఁడు ముల్లోకం బులనేనిఁ గలండె? అతని మగఁటిమి దెలిసియుఁ దెల్వి నూల్కొ నం జాలవు. వీరటు పసి నొక్కరుండుకదా మగిడించె నప్పుడీ

బిరుదు రెండు సనిరి. ప్రత్యక్షంబునకుఁ బ్రమాణంబుఁ గోరుట బేలతనంబగుఁ గావున సంధి కియ్యకొని పొందు సేయుమని యొత్తి చెప్పునెడ గాంగేయుండు గాంధారేయున కిట్లనియె. 396

చ. జనవర! నీదు తండ్రియును శౌరియుఁజెప్పినమాటసేయు మి
యనఘుఁడుకౌరవాన్వయహితార్థముగాఁజనుదెంచినాఁడుగా
దవ వల దిప్పు డీ విహ పరాది సుఖంబులు రెండు కృష్ణ ఫ
ల్గునులకు శత్రుభావముగఁ గోరుట కీడుసుమీతలంపగన్.

గీ. నీదు తలిదండ్రులు ముసళ్ళు నృపవరేణ్య!
వారి ప్రాణము గలిగిన వాసరముల
నుల్లములు చల్ల సేయుచు నెల్ల వెంటఁ
బలుకుఁ జెల్లించి కీడున బాయుమయ్య! 398

క. అనవుడు ద్రోణుఁడు దుర్యో
ధనుఁ బల్కెను హరియు నీపితామహ ముఖ్యుల్
చను దెలుఁగునఁ జెప్పెద రది
యనఘా! రుచియింపఁ దాఁ బ్రియంబునఁజేయుమా. 396

గీ పాండవులు మీరు నెవ్వుడుఁ బరగు సిరులఁ
గలసి తామర తంపరగాఁ జెలంగ
నేము చుట్టలు దలిదండ్రు లిష్టజనులు
బ్రిజలుఁ గాంతుము కన్నుల పండువులుగ. 400

చ. కొలువుననున్న యీనృపతికోటికి సంధియ ప్రీతియయ్యె నిన్
బలిమిగ నొత్తిచెప్పఁ జొరఁబార రదెట్టుల నంటివేని యు

జ్జ్వల రణసీమకై పిరికి చందము గాంచె నటంచు నాడికో
ళ్ళలకును నీమనస్థితికిలోఁగిన్పథాగతిఁ జావఁజూచుటల్.

వ. అను నప్పుడు వైచిత్ర వీర్యుండు సుయోధనున
కిట్లనియె. 402

క. వీరందఱు నొక తలఁపున
గారవమున మేలు సెప్పఁగైకొన వకటా!
కూరిరుల పలుకులు తుది నిం
పార విడఁజాల వింత యువమతి గలఁడే? 403

క. చెడు తెరువుఁ జూపు జనులను
విడువుము మది నించుకయు వివేకము చేతం
గొడుకా! హరిచెప్పిన గతి
నడువుము మన కిహముఁ బరము నలునై యొసఁగుః.404

క. మీాయన్న యైన ధర్మజుఁ
బాయక సేవింపు కులము బ్రతికింపుము ని
న్నాయన గౌరవమున సు
స్థేయంబుఁగ యావ రాజ్య సీమ నమర్చుః 405

వ. అని యిట్లనేక విధంబుల సందఱిం గూర్చుకొని
బుద్ధి గరపు హరికి మహాక్రోధనుండగు సుయోధనుం డిట్లనియె.

సీ. ఆచార్యుఁడును భీష్ముఁ డాంబికేయుఁడు నన్ను 406
దినమును దూరెదు తెఱఁగువోలె
నీవును దెలియక నిందింపఁ జూచెదు
కలిగెనే? యొకట నావలనఁ దప్పు

గడు జూదరితనంబు గలవాఁడు గావునఁ
బాండవాగ్రజుఁడు దర్పమున గెలిచి
మా సిరిఁ గొనుటకై మది నుత్సహించుచోఁ
దానొండు దలఁచిన దైవమొండు
గీ. దలఁచె నప్పాట నోడియు ధర్మరీతిఁ
గాన కేఁగుట లింతియు కాక మరియు
గరమునను వారికినిఁ గీడుగాఁ దలంచి
నారమే ? తారు నిప్పుడా యారసమున. 407
గీ. మాత్స్య సోమక ముఖ రాజ మండలంబుఁ
గూర్చికొని యెత్తి వచ్చి సంకోచ ముడిగి
పాలికై రాయబారము బంపుటెట్లు
కుత్తుక విషంబు నంగిట గుడముఁ దనర. 408
వ. ఇది యుంగాక. 409
చ. చిఱుతనుగాన యున్న ననుఁజేకొనకే జనకుండు భీష్ముఁడున్
నెఱి భువి పాలొసంగి రథినేఁడిటు నొచ్చెము వచ్చె నాచవిన్
మఱఁగిన వారలై యిపుడు మానక వచ్చిరి గాక యింక నె
త్తెఱఁగున రాజ్యమే విడువ ధీరగుణా! రణ సీమ దక్కఁగన్.
క. దురమున నెవ్వరు గెలిచిన
ధర వారికి ననుచు నిశ్చితముఁ జేసితి నే
గురు భీష్ము లిచటఁ గలరిఁక
పరిపోరుదు నోడుతు గెలుతుఁ జంపుదు నరులన్ 411

గీ. అనిన నొక వింత కెంజాయ నతిశయిల్లు
కన్నుఁగవ యొప్ప హరి చిన్ని కటికినవ్వు
నగుచు వేగిర పాటుపై నిగుడనీక
పన్నగ ధ్వజుఁ గని యిట్లు పలికె నపుడు. 412

ఉ. తప్పొక యింతయేని గలదా వివరింపఁగ నీకు లక్క యి
ల్లిప్పరగల్చుటల్ సభను నీతిఁదలంగియు నన్న యాలినా
చొప్పున భంగముంబఱుపఁజొచ్చుటగానకుఁదోడబుట్టులన్
రొప్పట రాజ్యముంగొనుటరోయనినేఁతల కెవ్వరోసుమీ. 413

వ. అది యట్లుండ నిమ్ము. 114

గీ. అన్న దమ్ములు మీర లన్యోన్యముగనుఁ
గలసి మనుఁడని బుద్ధిగాఁ గఱవు నన్నుఁ
గన్నుగానక నొక పోటు కాని రీతిఁ
జేరిలెదూరక బిరుదులు బెటిలిపడఁగ. 415

క. ఎడలేదు రణము మొన తల
బడిమెదులే యప్పుడేను బలికిన పలుకుల్
తడవెదవు గాక బుద్ధికి
నొడఁబడుదువె? నేఁడు రిత్త నోకురునాథా! 406

చ. అనవుఁడు దుస్ససేనుఁడు దురాగ్రహమొప్పఁగ నన్నకిట్లనుం
జనవర! ద్రోణుడున్నృపుఁడు శాంతనవుండునునిన్ను శౌరికిన్
ఘనముగఁ బట్టియిచ్చుగతిఁ గన్పడె నేమరిబేలరీతి నీ
యునికి పొసంగునే వలవదుంపుటనమ్మకులెమ్ములెమ్మిటన్.

వ. అనిపలుకు తమ్ముని వచనంబాకర్ణించి మహోగ్రుం డగుచు దురాగ్రహంబునలేచి గోవిందునిఁగాంచి యో నంద నందనా! విరటు కొడుకు నశ్రమంబగు గెలుపుచేతఁ దాము కృతకృత్యులుగా నూహించికొను కుంతీ తనయులకును నానా క్షోహిణీపతులచేతఁ బ్రతిక్షణంబు నావేద్యమానాంజలి ధోర ణిం గాంచుటకై లబ్ధావసరులమగు మాకు నెట్టి సంధానంబు నీ దూతకృత్యం బెట్టి దిట్టిదియకదా వట్టి యాయాసంబు దల పెట్టుకొనక పొమ్మని పలుకుచు ధృతరాష్ట్రుండది యాలకించి దీనవదనుండై భయభ్రాంత చిత్తుండగుచుఁ గర సంపుటంబుల చే వీనులు మూసికొన నలంఘ్యుండగు నారాయణుం దృణం బునుంబలె గణించి కొలువు వెడలి రభసంబున నక్కురువిభుం డరుగు నతని వెనుకఁ గర్ణుండును ననుజ తనుజ సమాజంబును వారికిం గూర్చు దొరలును దిగ్గన లేచి తోడన చని ముంగిట నొక్క పోగ్రు గట్టి నిలిచిరంత. 418

ఉ. శాంతనవుండుశౌరిఁగనిచయ్యనఁబల్కు వృథాభిమాని భూ
కాంతుఁడనంచు నీతఁడతి గర్వితుఁడై చన తోడి చూపులం
జెంతలనున్న యీనృపతి సింహులు పోటరులట్లపోలెఁ గం
సాంతక! పోయిరక్కట! ప్రియంబునకిందులకేమిసెప్పుదుక్.

గీ. అపుడు హరి రోషహాస లేశావలేపి
తా ధరుండయి యాతని యట్టి గర్వ
భాషణంబున భీతులై తోషముడుగు
నఖిల సభికులఁజూచి యిట్లనియె మగిడి. 419

చ. నరవరుచేత నేమియగు నాకధునీ సుతుచేత నేమి యా
పరవడి దూతకృత్యమునఁ బాటిలి యిచ్చుటనున్నవాఁడు చే
పరగఁగ నేమియౌనలఁపఁ బార్థులకుం ధర పాలొసంగఁగాఁ
బోరిఁబోరిఁ బోరగంధవహపుత్త్రికునాఁగదయొందుదక్కఁగన్.

గీ. వినుఁడు కంసుఁడు నీరీతి వెలసె మున్ను
వాని నేనశ్రమంబునఁ బ్రాణముడుపఁ
దత్కులంబెల్ల వర్ధిల్లె తనరెనట్లు
వీని మానుష వంశంబు వెలయుఁగాదె! 42,

క. మీ రెందు కియ్యకొనినన్
గౌరవ కులమెప్పు నంతఁగల యాపదలుం
వీరికి వారికిఁ దీరును
గౌరవ మగునట్లు చేయఁగాఁ జనదొక్కో! 422

గీ. అట్లు బల్కెడు శౌరి వాక్యములు వినియు
సాధ్వసాక్రాంత చిత్తులై సభికు లెల్ల
నొనరు నిజదేహ కంపము లుత్తరముగ
నొక్క మొగి నిచ్చి రందఱు నుక్కిఁ దక్కి. 423

సీ. హరి మాటకదరి యయ్యాంబికేయుఁడు వేగ
విదురునిచేఁ దనవెలఁది నటకు
రావించి కొమరుని రప్పించి యాయమ
చేతనాతనికి సంప్రీతి మెఱయఁ
గడుబుద్ధి బహుభంగిఁ గఱపినఁ బుత్త్రుఁడు
వినివినములుగ దుర్వృత్తి నచటఁ

గ్రమ్మఱఁ బాసి క్రోధమ్మునఁ జనుదెంచి
దుష్టవర్తనమున నిష్టమగుచు
గీ. సంగణంబున సధిక బలావలిప్త
మైన మంత్రి త్రయంబుతో నపుడు కలసి
మున్ను గంధర్వుచేఁ దానుఁ గన్న దశను
ధార్తరాష్ట్రుఁడు చక్రికిఁ దార్పఁ దలఁచె. 424

క. ఉక్కున హరిఁ జెఱఁ బెట్టిన
నెక్కులు విఱుగుపులుఁగుల నెరినిఁ బార్థు లటం
దక్కుదు రాపైఁ గార్యము
చక్కంబడు మనకు మేలు సమకట్టుఁ జుడీ. 425

వ. అని యిట్లాలోచన తత్పరులై యక్కౌరవ్యులు 426

సీ. వడివడి లోనికి వచ్చుచుఁ బోవుచు
వచ్చివచ్చియు రాక రిచ్చపడుచు
నొండొరుల్ కనుసన్న నుండుచుఁ దీటుచు
గుసగుస వీనులు గొఱికికొనుచుఁ
బెరవారి పొడఁ జూచి పెరఁ జోలిఁ గొనుచుఁ దా
రంత నంతను గుములయి తలఁగుచుఁ
జూడఁగా గూఢోక్తులాడుచు దిగ్గన
లేచుచుఁ దోపని లీలఁ గనుచు
గీ. మనము లురియాడఁ దమకంబు మట్టుమీరఁ
గొంకు వెనుకకు ద్రొబ్బ సంకోచమడఁపఁ

బ్రీతిమెయిఁ జూపఁ గాళ్లల భీతి బొదువ
కౌరవులు హరిఁ బట్టని కలఁకఁ దగిలి. 427

గీ. చిడిముడినిఁ జెందు కురుతతి చేష్టలెల్ల
సాత్యకి యెఱింగి హరిఁబట్టు సన్నయంచు
దెలిపి కృతవర్మనికి బహిస్థలిని బలము
తోడ నిలు మేను లోపల దురమునకును. 428

క. చాలుదునని వేగమ చని
యోలగమున హరికిఁ దెలిపి యొగిఁదదనుమతిన్
గీలియ పోలుచు నందఱ
నాలోకింపుచునుఁ బలికె నధిక రయమునన్. 429

శా. ఎదురునుఁదమ్మొఱుంగ రిపుఁడీకురువీరులుమర్త్యమాత్రుఁడా
మదిఁ దలపోసిదుర్మదము మానకయచ్యుతుఁబట్టనూహచేఁ
బొదలెద రగ్నిఁజేరగొను పోలిక గాలమునేర మేలు మీ
రిదియదియేమినావలవదన్నియుఁజయ్యనఁజక్కనయ్యెడున్.

వ అనిన విని కొలువు సంచలించె ధృతరాష్ట్రుండులికి సుయోధను నచ్చటికి రావించి కటకటంబడి కాలపక్వంబయ్యెం గాక నీకిట్టి దుర్బుద్ధిపొడమునేయని కోపించి పల్కె. బాలకేలిం గోపాలదేవుం డెట్టి పరాక్రమంబులు సూపె నవి నీవెఱుంగవే? ఇంత బేలతనంబేల కలిగెనని విదురుండుఁ గెరలె. భీష్మబాహ్లికాది వృద్ధులునుఁ దగువారును లగ్గగుతెఱంగున నేవగించి రంతఁ దన కట్టెదురం గూర్చున్న పన్నగ కేతనుఁగనుంగొని

వెన్నుండవు నన్నొక్కరునిగాఁ దలంచితే యని యమర్షహాసం
బొనర్చిన 431

శా. ఆరీతింగలుషించితానునొకరుండయ్యెఁ సమస్తాత్ముఁడై
నీరేజాత్ముఁడు శైలసాగర వనోన్నిద్ర గ్రహ తారకా
సారంబై తఱి బొజ్జఁదాల్చు నవ భూషామంజరిం బోలు ను
ర్వీ రాజ జ్జగ దండ మండలిని ద్రిప్పెఁ సభ్య దృక్పద్ధతిఁ.

సీ. అంగుష్ఠ మాత్రమా నండంబు నను బలె
నతని యందు జగంబు లన్నిఁ గాంచి
విస్మితులై సిద్ధ విబుధ గంధర్వాది
సంఘంబు పుష్ప వర్గమును సాంద్ర
మోహాంధకారము మునులును భీష్ముఁడు
సంతోష బాష్పాంబు సంతతులను
విదురుఁడు కనుఁగవ నొదవు కంపంబును
ద్వీప పట్టణ ప్రజ నృపుని ప్రీతి
నడలిరా హరి యట్టహాస ప్రఘోష
మష్ట దిశలను నభమున నష్టలేక
క్రాలి దిక్పాల సౌధాళి జాలకముల
వ్యాపకత్వము నొందె నవ్యాహతముగ.

గీ. పెలుచ ధృతరాష్ట్రుఁ డంత నక్కలకలంబు
వినియు హరి దివ్య మంగళ విగ్రహ ప్ర
పంచమిది యంచు భావించి పద్మనయనుఁ
గరముఁ బ్రార్థించెఁ గన్నులఁ గనఁ దలంచి. 433

మ. నతలోక స్తవనీయ సచ్చరితుఁడుం దైత్రిలోక్య సాధారణీ
కృత కారుణ్య కటాక్ష వీక్షణుఁడునౌ కృష్ణప్రసాదంబుచే
ధృతరాష్ట్రుండును దక్షిణంబునను దా దృక్సంస్థితింజెంది వి
స్తృతదివ్యాంగునివిశ్వరూపమొగిఁ గాంచెంజాతరోమాంచుఁడై

గీ. అట్లు గనుఁగొని యారాజు హరి గురించి
నిరతిశయహృష్టి నినుగన్న నేత్రములను
బరులఁ గనఁ జాల దృష్టులు బాపుమంచు
వేఁడికొన నట్లొనర్చె నవ్విభుఁడు పేర్మి 435

మ. హరి!నీయీ వెలుఁగింకమానుమఁగ దేయంచున్ మహాదీనతం
గురు భీష్మ ప్రభృతుల్ నుతింపుచుఁ గడున్ ఘోషింపు
చుండన్ భయం
కర తేజంబు నిమేషమాత్రమునఁ గ్రుగంజేసి వెన్నుండు దా
వర గోపీ కుతుకైక హేతుకరరూప స్ఫూర్తిఁజెందెన్ దయన్.

వ. తదనంతరంబ నిరుపమానుండగు పుండరీకాక్షుని
తో దృశ్యమహిమ ననుభవించి చరితార్థులై ముని సార్థంబుగా
శాంతుండగు నయ్యనంతుఁ గొంత కొంత యనుసరింపుచు
నుతులు సలుపుచు నోమహాత్మా! మహనీయయోగిజనా
విదిత ప్రభావుండవును భగవంతుండవును నగు నిట్టి నీకొఱకు
నమస్కరించెద మనియు మఱియును. 437

చ. కలశపయోధిరాజసుత కన్గవతోడ నమాకృతిం దదు
జ్జ్వలమహిమోన్నతిం బెరయుచందమునంబృథుమత్స్యభావముం

దలముగఁ బూని రాక్షస హ్యాత్తశ్రుతిసంతతి నెవ్వఁడే మహా
జలనిధి మధ్యసీమను వెసన్ భువిమున్వెడలించె నెంతయున్
ఉ. మవ్వములౌ తరంగకణమండలి గుండలి కండబాయఁగాఁ
జివ్వనఁ జందు్రిమార్గమటు జేరి నిరోధముగాఁగ మున్ను న
క్కవ్వపుఁగొండ నా చరమ కాయముచేధరియించి కూర్మమై
యెవ్వఁడు జీవనౌషధమునిచ్చె నిలింపులకుం బయోనిధిన్
చ. పనుపడ దొడ్డ యేకలము భావముచే వెలుఁగొందునట్టి యే
యనఘుని కొమ్మునంగువలయాకర కోమలకాంతినీనుచుం
దనరు ధరాతలంబు సముదగ్ర సదంబుద బింబనై ఖరిం
గనియె నభఃపదంబున సుఖస్థితి నా ప్రళయాంత వేళలన్.
చ. విదితహిరణ్యనామమున వేృఁగఁ గ్రుచున్న పురందరారియున్
మదకరి మాంసగుచ్ఛ రసమాధురి భేదమెఱుంగఁబోలె నిం
పొదవఁగ సింహభావమున నొప్పుచు స్తంభములోన నెవ్వఁడే
యుదయముగాంచి వానియెద యున్ స్వనఖంబులఁజించెనుగ్రతన్
ఉ. ఎంచఁగ వామనత్వమున నెవ్వఁడు జన్మముఁ జేరియాబలిన్
వంచన యాచనావశత వారక బద్ధునిఁజేసి సజ్జనో
దంచిత సౌఖ్యముం దనపదక్రమముం బలెఁ బెంచి దేహమున్
గురుతరమైయెసంగు తనగుజ్జతనంబునుబోలెఁగుంచెఁదాన్
చ. హరిమును జాగ్రదగ్రసముదగ్రత రెండవ మూర్తిఁ జెందెనో
స్థిరమతినన్న సందియ మశేష జనంబునకిచ్చెనే మహా
పురుషుని సత్కుఠారమును బూని సమిద్ధరణీ తలాంగణో
త్కరకరతాండవంబొనరఁగై కొనియాన్నృపకోటిఁద్రుంపుచున్

ఉ. ఆ త్తతనంబుఁ జెందె ముని కాదట నెవ్వని పాదధూళి యు
ద్వృత్తి శరవ్య మెవ్వనికి నీశ ధనుర్గుణకృష్టమయ్యెఁ బే
ర్చెత్తిన భీతివారినిధి యెవ్వనిచేతఁ జలాచలత్వ సం
భృత్తగు లంక నేలెను విభీషణుఁ డెవ్వని బాణసంపదన్.

ఉ. నేన వధించితిన్ రిపుల నేన వధించితిఁ జివ్వనంచు నె
వ్వానియ యోఽగ్రసీరములు వాద మొనర్పఁగఁ బూనుచుండు నె
వ్వాని దుకూల మాత్మ రుచి నైఖరికిం బ్రతిమల్లవర్ణ మె
వ్వాని మనోఽనురక్తి మధుపాన విశేషముగాఁ దలంచెదన్.

మ. చనుఁజోకే తటిఁ బూతనాసువులఁ దేజం బెవ్వఁ డాకర్షణం
బొసరించెం బరమోపదంశముగఁ దానుద్యన్మహేంద్రుంగరం
బును మోసంబున నొందఁజేసెఁ దరుణీమోదంబుఁ గూర్పంగ న
వ్వన భూ ధూళులఁ బాదచిహ్నముల నెవ్వండర్థిఁ దార్చెం దగన్

క. తతపాతివ్రత్య సము
న్నత గుణ దైత్యాధినాథ నారీజనతా
వ్రతవిచ్ఛేదన పటు బు
ద్ధతనుం డెవ్వండు గాంచు ధాత్రిముకుందా? 447

మ. వరయోగీంద్ర మనః ఖలీనములచే వార్యంబునై చిక్కి వే
షురులోకాంత్రిమయైక ఘాసములఁ బేర్మిమన్ మేయుమాయాలన
త్తురగం బెవ్వఁడో యాత్మశృంగమునఁ దుం దుల్యస్థితిం జెందుని
ర్జరవిద్వేషి తురుష్కనీచులను వేఁజంపన్ జనించున్ రుషన్.

గీ. అట్టి భగవంతుఁడవు నీవ యంబుజాక్ష!
నిన్ను వినుతింప నజుఁడును నేరఁ డనఘ!

మమ్ముఁ గ్రేగంటఁ గని దయ మనుపుమయ్య
కనకమయ వాస! ముని మనః కమల వాస ! 449

వ. అని పొగడునంత. 450

గీ. సత్య మగు నిట్టి నుతిచేత సంతసిల్లి
యలఁతినగు సంపదలు మధురాధరోష్ఠ
మామతింపఁగ హరిలేచె నాసనమునఁ
గనక గిరి తటమునఁ బాయు ఘనము కరణి. 451

వ. ఇవ్విధంబున నప్పుండరీకాక్షుండు కొలువు వెడలి ధా ర్తరాష్ట్రుల దౌష్ట్యంబున కసంతుష్ట హృదయంబున నొండుఁబ లుకక మొగంబులు దిగిచి పట్టి కొనిపోవుచుండఁ దనతోడ న ధృతరాష్ట్రుండు లోనుగాఁగలవారు చనుదేర దవ్వేతెంచితిరింక నిలువుండనుచు నెడనెడ నిలిచి పలుక వారు నట్లకాకయని క్రి మ్మర వెంటనంటినడువఁ గుంతి గృహంబునకుఁ బోయి యద్దేవి చరణంబుల కెరగి కురుసభంబుట్టిన వృత్తాంతంబంతయు విన్న వించి తదుత్తరంబులకు సంతసిల్లి పోయివచ్చెదనని వీడ్కొని.

మ. అతఁడా గేహమునిర్గమించి యటభీష్మాచార్యులంగాఁగిటం
గుతుకంబొప్పఁగజేర్చి రాజుమదిసంకోచంబుఁ జెందఁగ వె
న్నతిహాసంబునదువ్వి యవ్విదురమూర్ధాఘ్రాణముంజేసి యు
న్నతిఁ గౌరవ్యులకెల్లఁ జెప్పిచనుసన్నాహంబుచేవీడ్కొనెన్.

వ. రాధేయు కరంబు పట్టి నన్ననిచి వత్తువు గాక రమ్మని తన యరదంబునకుఁ దిగిచికొని యుపప్లావ్య పురంబు మార్గంబునం జనుచు నతని కిట్లనియె. 454

క. సూతజుఁడని నీకుఁ వి
ఖ్యాతిఁ బుడమి గలిగె మిథ్యగాఁ దలఁపుము కం
జాతహితు దయను గుంతీ
సుతుండ విది బయలు మెఱయఁ జనకిట్లయ్యెన్. 455

ఉ. కావున నీవు ధర్మజునికంటెను బెద్దవు విశ్వధాత్రి సం
భావన మీరఁదమ్ములెడఁబాయకకొల్వఁగఁజేయుమంచునా
నావిధ బుద్ధిసెప్ప యదునాథ శిరోమణిఁ గాంచి పల్కెనో
పావనమూర్తి! నాకిటులు బాడియె? ధర్మవునీవెఱుంగవే.

గీ. మన్నన యొనర్చు దమ్ముల కన్న నన్ను
నట్టి కురుపతి నెడఁబాయ నర్హమగునె?
నేన తమప్రాణముల రీతిఁబూని కాంచు
తల్లి దండ్రుల నెడఁబాయ ధర్మమెట్లు? 457

క. కవ్వడికి సుద్ది యాతఁడు
చివ్వం గలఁడనెడు పలుకు చెల్లక రాజుల్
నవ్వఁ నాచనుదెంచుట
లెవ్విధి నొడఁగూడు నుచిత మెన్నఁగఁ గృష్ణా! 458

వ. ఇదియునుంగాక. 459

గీ. సత్య ధర్మ మూర్తి శమనజుం డిల యెల్ల
యేలవలదె? నాకు నిష్ట మిదియ
యీరహస్య మెఱుఁగునేని సామ్రాజ్యము
బూనఁ డీవు బయలు పుచ్చవలదు. 460

వ. అని పలికి కర కమలంబులు ముకుళించి పనివినిమె

దనని మగిడె హరి యును సాత్యకిం దన రథం బెక్కించుకొని
యిష్టాలాపంబు లాడుచుఁ బాండవుల పాలికిం జనియె నంత ని
చ్చటఁ బుండరీకాక్షుని వలని వార్త లాడుచు గురు భీష్మాది స
కల జనంబును నిజ నివాసంబునకుం బోయె నయ్యెడ విదురుం
డుఁ గుంతి యింటి కేఁగి కౌరవులు సంధి కియ్యకొనమియుఁ ద
ద్దుష్టవర్తనంబును నద్దేవియుం దానునుఁ గొంతప్రొద్దుగ్గడింపుచు
పగచుచుఁ దన నెలవున కరిగెఁ దదనంతరంబ 461

క. ఇనజుఁడు పుట్టువు దెలిసిన
ననుజులపైఁ బ్రియము పుట్టి యని మానెడు నం
తన కార్య సిద్ధి యగునని
తన మదిఁ దలపోసి కుంతి దగ నటు చేసెన్. 462

ఉ. అంతటనొక్కనాఁడు సమయంబగుడుం గడుఁగృత్యవేది నీ
కాంతల కగ్రగణ్యయనఁగాఁ దగు పాండువధూటిజాహ్నవీ
ప్రాంతవనిన్ సునిష్ఠమెయిఁ బాఁటిలు కర్ణునిఁజేరి యూరకం
జెంత వసించె నజ్జపము చెల్లుతఱిం దన రాక తెల్పినన్.

గీ. కలిత యశుఁడగు పట్టి సత్కవచ మెడలి
జర్జరాంగుఁడు నైన నా సాధ్వి నళిన
దళము కంటెను మృదుళమౌ తనదు నయన
మతనిపైఁ దడ వెనయంగ నలువరించె, 464

వ. అంత. 465

చ. చెలఁగు మరుత్సరిత్తదభిషేకమునం బరిశుద్ధుఁడైన యా
నళినహితాత్మజుండు నిజ నైష్ఠికముం గడ ముట్టువేళఁదా

సొలవకనుంచి సయ్యనను శ్రోత్రమునన్ స్ఫటి కాక్షమాలికం
దెలియఁగఁగాంచెఁజెంతన్నృపదేవిని నేత్రములారనొయ్యనన్.

మ. కనిపాదంబులయందు వ్రాలివినతుల్ గావించునప్పుత్త్రునిన్
వనజాతేక్షణ కౌఁగిలించి దయ దైవారంగ దీవించియున్
సనయుంబొప్పఁగఁబల్కెనయ్యుభయ పంచత్వంబునాధర్మనం
దనముఖ్యస్వతనూజసంచయము వంతంబాపుచిత్తంబుగన్.

గీ. ఓకుమారక ! నాయందు నుష్ణ
కరుణ నర్థుల భాగ్యమై కలిగినావు
రహిని దనురక్షకై కకారణులు గాని
ప్రీతిఁ దలిదండ్రిగారు రాధాతిరథులు. 468

గీ. విదువు రాధాత్మజత్వావివేకబుద్ధి
తోడఁగూడ సుయోధనుతోడి చెలిమి
పట్టి నాధర్మవాక్య సంపదలతోడఁ
గూడు ధర్మజముఖుల సైదోడు లనుచు. 469

సీ. ఎవ్వాని కైన నేమీవు వేఁడిన యట్టి
తటి సమర్పింపఁగఁ దగని సహజ
కవచ మిచ్చితివి తత్త్వము మిటుండఁగ నిష్ప
డర్థి సాక్షాత్కార మరుగుదెంచి
యున్న తల్లిని నాదు సన్నిధానంబున
మంద భావము బూన మానుమయ్య
గురు జన వచనముఁ గూరిమి సేయక
యెవ్వని చిత్తంబు నివ్వటిల్లు

గీ. నతఁడు నింద్రుఁడుగాఁ దగు ననుదినంబు
తల్లిదండ్రుల పలుకు లెంతయు నొనర్చు
వానికి సుఖంబుచేత సర్వమును జగము
నందుఁ జేకూరు సత్కీర్తి నందు పుత్త్రి ! 470

వ. అనియిట్లనేకప్రకారంబుల దశనకిరణవ్యాజంబువలన
నంతశ్చిరరక్షితంబగుతదంతస్సన్యంబుప్రకాశింపఁజేయుచాడ్పు
నఁ బలుకు నత్తొయ్యలి పలుకు లొయ్యన సన్నిధానుండగు
కర్ణుండు కర్ణదేశ మార్గంబునఁ ద్రావి యంజలి వెట్టి సముచి
తంబుగా నిట్లనియె. 471

చ. గరిమను భోజ వంశము జగద్విదితంబుగ నొప్పుచుండు న
క్కురుకుల మెన్న నట్టిదయగుంగద యమ్మరొపీటరెంట నీ
వరయఁగఁ బుట్టువుం బరిణయంబును గంటివి నీమనంబునం
గరముచితజ్ఞ భావ మొగిఁగల్గెడు జాగ్రతమీరనెయ్యెడన్

శా. నాయంగద్వయ మింక నెయ్యెడను గర్ణాపాలనీయంబుగాఁ
జేయంగాఁ బడు నిర్జితారివగు నీచే నంచు నన్నెప్పుడుం
బాయంగా దలపోయఁ డట్టి నృపుతోఁబాటిల్లు సఖ్యంబునే
బాయంగాఁ దగునెట్లు నీవచెపుమా?భావించి చిత్తంబునన్

క. మల మూత్రము లెత్తినను
వెలయంగాఁ బెంచి పుత్త్రి విధమున వేడ్కన్
గలవారికి నిపుడు విడి నా
తలిదండ్రులటంచు నొండు దలఁపం దగునే? 474

గీ. కరము విఘ్నంబు బరలోక గతికి నిప్పు
డతి కృతఘ్నత యని బుధులందు రట్లు
గాక యుండఁగ నీవు నా కడిఁది మాన్పి
యమ్మ! మన్నింపు నన్నుఁ గృపార్ద్ర మతిని. 475

క. నరుచేఁ జచ్చిన కీర్తియు
కర మతనిం జంపు నట్లగాఁ దగునేఁడీ
పరకింప నీకు సుతు లా
ర్వురు గారే కూడ నైదువురు గల రెపుడున్. 476

గీ. ఇట్లు బలికెడు రవి సుతు హృదయమా సు
యోధనునిఁ బాయ నేరక యుండునంత
పర భుజండగు నిజపుత్త్రి వలన నొక్క
కోర్కి నిట్లని కోరె నా కుంతి యపుడు. 477

గీ. దైవ కృత మెవ్వరికిఁ దీర్పఁ దరమెయైనఁ
దనయ! నినువేఁడెదను నరుఁదక్క తక్క
తమ్ములను సంగర స్థలి దయను మనుపు
మనుడు నాతఁడు నందుల కనుమతించె. 478

వ. ఇవ్విధంబునఁ బాండు మహిషి గోరు వరంబొసంగి కర్ణుతల భారతంబను నుడువు జగ ద్విదితంబు సేయం దలంచు వాఁడునుం బోలెఁ దన పాండవుల కలయుమి కంగీకరింపక నమస్కరించి తదనుమతి నిజ నివాసంబునఁగరిగె బదంపడిపృథయునుఁ గొడుకురామికి వసటంబొందుచు నింటికిం బోయె నంత నక్కడ నచ్యుతుండు సముచిత ప్రయాణంబుల నుపప్లావ్యం

బుఁ జేరి ధర్మరాజాదులచేఁ బూజితుండై యారాత్రి పయనం
పు టాయాసంబుఁ బుచ్చికొని మరునాఁడు నిత్య కృత్యంబు
నివర్తించి సభకు వచ్చి పేరోలగంబున నుండి కౌరవ సభం
బుట్టిన క్రమంబు విన గోరు సభ్యు లందఱు వినఁ దాఁ బోయి
వచ్చుట సవిస్తరంబుగాఁ బాండవాగ్రజున కిట్లనియె. 479

చ. వినుము నరేంద్ర! కౌరవుల వీటికి నేఁజనియుందుముందుగా
సనయుత నంబికాసుతుని సన్నిధి కేఁగితి నమ్మహాత్ముఁడున్
ననుఁగడు గారవించెఁ దగనాటిదినంబుక్రమంబుతోడుతం
జనఁదగు వారియిండ్లకును సమ్మతితోఁజనిపూజలందియున్

గీ. విదురు నింటఁ గుడిచి ముదమున నారాత్రి
వేగునంత భూరి విభవ మెసఁగ
కౌరవేంద్ర నోలగంబునకుం బోయి
యుచిత వృత్తి మెఱయ నుండి యపుడు. 481

క. కౌరవ నాథునితోఁ గడుఁ
గౌరవ మెసఁగంగ సంధి కార్యమునకు నిం
పారఁగ నెయ్యంబున నా
నేరుచు గతిఁ బలుకు లెల్ల నెఱపితిఁ దెలియన్. 482

గీ. పలు తెఱంగులఁ బల్కినా పల్కులెల్ల
నీరసంబునఁ గేరడం బార నతఁడు
నేర కన్నుగ ననుజౌక చేసి మదము
బెరయఁ బొలివుచ్చి పెడచెవిఁ బెట్టె ననఘ! 483

మ. గురుభీష్మాదులునాంబికేయుఁడుననేకుల్ నేర్పుచందంబునం
గరమొప్పం దగు బుద్ధిసెప్పిన వినంగా నేరకున్నంత వే
మరునారోపిన యంతపెక్కగతులన్ మందాత్ముఁడానాతనిన్
సరసంబున్ విరసంబు జూపి వరుసన్ సంక్షోభముంజేసితిన్

వ. ఇట్లువివిధంబున నతండెవరు చెప్పినఁ దనపూన్కి తక్క త
క్కనది కైకొనండయ్యె నని మరియుఁ దద్దుష్ట ప్రవర్తనంబును
గుంతీ విదురులాడిన మాటలతెఱంగును సవిశేషంబుగా నెఱిం
గించి కలహం బవశ్య కర్తవ్యంబుగా నిశ్చయించి పాండవుల
యెడఁ బాపంబు లేమిగా నిరూపించి యింక నూకుఁజేయందగు
నది విచారింపుడనుడు ధర్మజుండు నిరుత్తరుండై తమ్ముల మొ
గంబు జూచిన నర్జునుం డిట్లనియె. 485

క. హరి మనకు నేడుగడయును
బరమ హితుం డధిక ధర్మపరుఁ డీయనచే
సరిపడని సఖ్యమునకుం
గర మిట మన కెద్ది సేయఁగాఁ దగునింకన్. 486

గీ. పృథయు విదురుండుఁ బలికిన విధము దెలిసెఁ
దలఁప సంగర మింకఁ గర్తవ్య మనుడు
ధర్మనందనుఁ డట్లన తమ్ములకును
దనయులకుఁ దెంపు సెప్పిన తత్క్షణమున. 487

చ. నళినదళాక్షుచేతఁ గురునాథుని మార్గ్యమ్యము నట్లెఱింగి యు
జ్జ్వలసమరోద్యమంబునకుజాగ్రతనూనిపృథా కుమారకుల్

నలువుగ మున్ను దత్పితృవనంబునఁ దాఁ బ్రవిన ధూమకాంతి వె
గ్గలముగఁ గ్రక్కు రీతి రుచిగల్గెడు కైదువలోలిఁ గాంచఁగన్.

వ. ఆసమయంబున ధర్మనందనుండు ముకుందునిఁ జూచి.

చ. గురుతరశౌర్యశాలి రణకోవిదు నొక్క మహీభుజుం జమూ
చిరతర రక్షణంబునకుఁ జేయఁగ నొప్పును గాన వాని నీ
వరసి యొనర్పు మియ్యెడఁ జరాచరవేదివి నీదు పంపునన్
బరగుట లెస్స యంచుఁ దగబల్కిన నవ్వనజాక్షుఁ డిట్లనున్.

చ. నరవర నీదుయోధులఁ గనంగల డే యొకఁ డల్పుఁ డెన్నఁగా
వరబలుఁడైన భీష్ముఁడు వహ్నిముఖంబునఁ బుట్టె సాయకో
త్కరము లెఱుంగు వ్యూహములఁ గట్టఁగ నేర్చు నుశౌర్యశాలి యా
గురునకు శత్రుఁ డాద్రుపదు కూరిమిపుత్త్రుఁడు జాలు నిందుకున్.

వ. అని యిట్లు ధృష్టద్యుమ్నునకు సేనాధిపత్యంబు నొసంగు మనుడు నట్ల కాక యనిన నతని నభిషిక్తుం జేసి హరిశాసనంబున విరాట ప్రభృతి క్షోణీనాయకుల నక్షౌహిణీ నాయకులుగా నియోగించి వారలను సేనాపతికి నతని నర్జునునకు ను నరుని హరికిని నప్పగించి యొండొరులు నొండొరులకుఁ గంటికి ఱెప్ప చందంబున గావం దగు నని పలికి యొక్క శుభ ముహూర్తంబున పయనంబై చతురంగబల సమన్వితంబుగా ననుజ తనుజ బంధు సమాజంబులు పొదివికొని నేల యీనిన తెఱంగున నడువ శుభసూచకంబులు గైకొనుచు మాంగళిక వస్తువు లంగీకరించుచు సితచ్ఛత్త్రము లుల్లసిల్ల ధర్మనందనుండు

సమరోన్ముఖుండై కురుక్షేత్రంబునకుఁ బోవప్రస్థానభేరి మ్రో
యింప నియోగింపు నవ్విభుఁడు 492

సీ. తతమహార్భటి పటు ప్రతిరటద్బ్రహ్మాండ
భాండ కోటర ముఖ్య బంధురంబు
సాధ్వ సౌద్ధత్య విస్ఫార హతాత్మత
ద్వివిధజంతు వితాన విభ్రమంబు
లలిత కందుక సమోల్లలద గిందాఘాత
పాటిత దిక్చటాపాటవంబు
సద్యోవిగతజలస్థలదంబునిధివేష్టి
తావని చక్ర భ్రమాంచితంబు

గీ. ఝుడితి నికట వ తన్మహాశని సమగ్ర
ఘోషశంకిత పరవీర శోషణంబు
ప్రళయ భైరవ సంగరభయద గమన
భేరికాఢాంకకృతధ్వని బోరుకలగె. 493

చ. హరియు యుధిష్ఠిర ప్రముఖులైన పృథాసుతులెల్ల వాహినీ
వరులు దరంబులొత్తిరి ఘూర్ణంబుగగాహళడిండిమాది తూ
ర్యరవములుల్లసిల్లెనపుడా ధ్వని రోదసి నిండి దిక్కులు
ద్ధురగతి చేబగిల్చెశ్రుతిదుర్గ్రహతంజడమయ్యెలోకముల్

వ. ఇట్లు సమరసన్నాహంబుచే నానావైభవంబుల నరు
గుదెంచి హిరణ్వతియను పుణ్యనదీ ప్రాంతంబున విడిదలగా
విడిసి యుచిత క్రమంబున బట కుటీరంబు లమర్చికొని యొ
పుర్కక్యలంబుస్థన రాజమందిరము పన్నిధుప్రష్టద్యుమ్నుండును

నెల్లవారలకుఁ జాగ్రత్తఁ బుడికొల్ప శిబిరంబు చుట్టునుఁ దిరిగి
తగు వారి నందంద గావఁ నియోగించి వచ్చె రాజునుఁ
దమ్ములు దొరలునుఁ బరివారంబులును వలయు విధంబులనుండి
రి. సమస్త వస్తుసంభార మహాదరంబగుచుఁ బాండవసైన్యం
బు రమణీయంబై యొప్పె నంత నక్కడ. 495

గీ. కౌరవాధిపతియుఁ జారులచేఁ బాండు
సుతుల చందమెల్ల సొరిది నెఱిఁగి
యోలగంబునందు నుండి కర్ణాదుల
కిట్లు పల్కె గర్వ మినుమడింప. 496

చ. వనజదళాక్షుఁడోజఁ దనవచ్చినకార్యము నాదరంబునన్
మనకొనరింపఁగా నట సమర్థుఁడై చని లేని పోని వ
ర్తనములు గిన్కపుట్టను బృథాసుతపంక్తికిఁ జెప్పి సేనతోఁ
గొని చనుదెంచి సంగరముఁ గోరి వసించె హిరణ్వతీతటిన్.

క. అని నగి పలికి సుయోధనుఁ
డనుజన్మునిఁ జూచి నీవు నాయత్తముగా
నొనరింపు మన దళంబును
ఘనమగు కలహమున కేఁగఁగాఁ దగు నిపుడున్. 498

వ. అని నియోగించిన దుస్ససేనుండు కర్ణ శకుని సహి
తుండై దండు చాటించి తగునది యెల్ల సమకట్టె నంత. 499

సీ. ద్రోణుండు కర్ణుండు ద్రోణతనూజుండు
బాహ్లీక శల్యులు బ్రకటబలులు

లోనుగాఁ గలమేటి మానవేశ్వరుల న
క్షౌహిణీ పతులఁగా నూహఁ దలఁచి
రయమున వారల రాపించి తగునట్ల
ప్రియములుచెప్పి సంప్రీతి వెలయఁ
బరఁగ నక్షౌహిణీ పతులను గావించి
గంగాతనూజుని కడకుఁ గొంచు
గీ. నరిగి యుచితప్రణామంబు లాచరించి
యీనృపాలుర నక్షౌహిణీశ్వరులుగఁ
జేసితినటంచు నతనికిఁజెప్పి పిదప
హస్తములు మోడ్చి కురుపతి యనియె నిట్లు.
క. పడవాలుతనమునకు మీ
రడరంగాఁ దగును జంద్రుఁ డత్తారలకుం
గడు నొడయుండగుఁ గతి ని
య్యెడ నింకొక్కరుఁడు గలుగునే యిదిపూనఁగ 501
ఉ. నా విని కౌరవేంద్రునకు నాకథునీ సుతుడిట్లు పల్కు నో
భూవర! మీరు పాండునృపపుత్త్రులు నాకొక రూప, సం
భావన మీఱ మీయెడను బాయక యుండిన కారణంబునన్
నీవు నొనర్పుమన్న పని నేనొనరింపఁగఁ బోలుఁ గావునన్.
క. నేనొండె రవితనూజుఁడు
తానొండెను మున్నుఁ బగరఁ దరమిడి పాండవం
బూనము మేమిరువుర మొక
పూనిక ననిసేయ నిజము భూప వరేణ్యా! 502

ఆ. వె అనినఁ గర్ణుఁ డిట్టు లనియె నిప్పుడు వేరె
చెప్పనేల? మున్న చెప్పినాఁడ
భీష్ము పాటుఁ గాంచి పృథ్వీశ యని సేయ
నిలుతు నిదియ నాకు నిశ్చయంబు. 504

వ. అనినట్లకాకయని సమ్మతించె. దుర్యోధనుండును బితామహుని సర్వసేనాధిపత్యంబున కభిషిక్తుం జేసి యక్షౌహిణీ పతుల నతని కప్పగించి గాంధారీ ధృతరాష్ట్రుల కడకేగి వారలకు నమస్కరించి యాతాయాతంబుగాఁ బోయెద నని పల్కి యట దుసల నొల్లక వార లడరున డిల్లపడ వీడ్కొని వెడలి సకల బల సమన్వితుండై భేరీ శంఖ కాహళాది తూర్యం రవంబులు చెలంగ దుర్నిమిత్తంబు వీక్షించి సడ్డసేయక వివిధ వైభవంబులఁ గురుక్షేత్రంబునకరిగి యందు వినిర్మిత విశాల వీధీ సహస్ర విరాజమానంబును విశంకట విపణి విస్తారిత వివిధ వస్తు సమృద్ధంబును, విట కులానుసార్యమాణ విలాసినీ జన నిబద్ధ వేశ్యవాటంబును, బాణ కృపాణ కుంత శక్తి ప్రముఖ నానావిధాయుధ సంస్కార పరవశ యోధ యూధ సంబాధంబునునై, కురు నగర మిత్రంబును బోలె వీడు విడిసి తానును గర్ణుండును వీథి చుట్టునుం దిరిగి దండనాథునకు జతనంబుఁ జెప్పి రిభపురంబున నెవ్వ రెవ్వరి నివాసంబు లెట్లెట్ల నొప్పు తత్క్రమంబున విడుదులు గైకొని రిట్లు కౌరవేశ్వర స్కంధావారంబు మహనీయంబై యొప్పెనంత. 505

గీ. రాజసింహుల పట మందిరములు శిఖర
కోటిచే మార్గపురంబు దీటుఁగాంచె

నాత్మదూష్యత్వ మడగించి యతి పవిత్ర
తను వహింప వియన్నది మునుఁగు కరణి. 506

చ. హలియిదియెల్లఁదానెఱిఁగియాత్మసుహృత్తతిచేటుకెంతయున్
దలఁకుచువారివీళ్ళకునుదారొ్కనిసత్కృతుఁడయ్యునచ్చటన్
నిలువకతీర్థయాత్రకుఁ జనెంగడుఁ బౌరవ పాండవేయు కృ
ష్ణులు నతి గౌరవంబుననుఁజూచి ప్రియంబున నంప నత్తఱిన్

సీ. రుక్మిణి సైదోఁడు రుక్మి యక్షౌహిణీ
బలయుతుండై వచ్చి పాండు సుతులఁ
గాంచి నేసాహాయ్యకంబుగా వచ్చితిఁ
గై కొనుఁడనుడు నాకవ్వడియును
దనరు గంధర్వ యుద్ధమును గోగ్రహణంబు
నాఁడు దప్పెను నీదు తోడుపాటు
హరితోడుగలఁడు నీవరుగు మంచును నవ్వ
వాఁడు గోపంబున వాఁడిమెఱసి

గీ. కౌరవాధినాథుఁ గానంగఁ బోయిన
నతఁడు నట్ల పల్క నాత్మ రోసి
తనకు రణము లేమి తలపోసి వగచుచు
బలముతోడ నేగె నిలయమునకు 508

వ. అంత. 509

చ. కురుపతి కర్ణసౌబలులఁగూడి విచారముచేసి గర్వముం
బరగ నులూకుఁగాంచియటుఁ బార్థులపాలికి నీవుపోయి యా

మురరిపుసన్నిధిం ద్రుపదముఖ్యనృపుల్ వినఁ బల్కు మంచుఁ దాఁ
బరుసని మాటలం గలిపి పంచినవాఁడనుదత్క్రమంబునన్

గీ. పోయి సభను ధర్మ పుత్త్రునిఁ గని సుయో
ధనుఁడు గొన్ని సెప్పి యనిచె నన్నుఁ
గినుక మాని వినిన వినిపింతు నావుడు
ధర్మనందనుం డతనికి ననియె. 511

క. నీపయి నలుగం దీరునె
యీపగిదిం బలుకుమన్న నాథునుమాటల్
రూపింపు మన్నియును నీ
వేపారఁగ నను డులూకుఁ డిట్లని పలికెన్. 512

చ కలహముబూచిపట్టి బహుకాలమునం గనువచ్చినాఁడ వే
తొలుతను మీరుసంజయునితో నలుకింతయు లేక నెక్కువల్
బలుకుట కొన్ని యుంగలవు భాగముగొంటకు నాలినాగతిం
గలఁచుటకుం గడంగి నిలగా దగు చివ్వకుమంచిబంటవై. 

క. గురు భీష్ముల శర సంపద
లరయంగా రండు నిఖిల మనుష్యతుచేతన్
బరిసక్క చేసికొనుఁడీ
పురుషులచేఁ బడిన క్రీడి పోవంగలఁడే? 514

చ. అని పవమాన పుత్త్రు దెస నల్లన చూచి యితండు నాఁడు నీ
మనఁ గడు దుస్ససేనుతగు శోణితముం గొని త్రావు వాఁడ నే
ననియెను శక్యమే ని తడయుం బనిలేదటు సేయఁ బోల దే
కనకువ నాదు చేత నొకపెట్టు నవిం గొనిగాని మానునే.

గీ. అనుచుఁ బలికి క్రీడిఁ గని గాండివంబను
పెద్ద వింట నొక్క పేరు మోసి
శౌరితోడటంచు జళిపింప వచ్చిన
వెఱచి పాలువెట్టు వెట్టి గలఁడె?

చ. గరువతనంబునన్ దుపదుకన్నియకొప్పూడియుంగనాసభాం
దరమగు భీమపార్థుల గదా ఘన గాండివముల్ దలంగి యే
కరణినిఁ బోయె నిప్పుడవి క్రిమ్మఱెనో యిటువంటి మాయలా
హరి పచరింపఁ బాలొసఁగ మచ్యుతులున్ నరు లేగుదెంచినన్

వ. అనిన విని భీమార్జున నకుల సహదేవులు గోపంబు
నిగుడ నొండొరుల మొగంబులు జూచికొనినం గని నగుచుఁ
బురుషోత్తముం డులూకున కిట్లనియె.

ఉ. ఈవు సుయోధనుం బలుకు మెల్ల నృపుల్ విన నెల్లి సంగరం
బే విధిఁ బోవవచ్చు నిఁక నీ కురు వీరుల కర్జునాస్త్రముల్
వావిరిఁ గూల్చు రిత్తయనువాఁడటె పావని దుస్ససేనునిన్
నీవును జూడ నిక్కముగ నెత్తురు ద్రావును వేగ మేటికిన్.

చ. అనవిని సవ్యసాచి యపుడాతని కిట్లను రేపె యుద్ధముల్
సునిశిత వృత్తి నా నుదుకు జుత్తెడు వారును వీరు మామెడం
జెనకువ కుండిరంచుఁ గనుపించెడి శిష్టుని వృద్ధు భీష్మునిం
దనమొనగాని జేసె నివి తప్పగదా మును మున్ను గూలఁగన్.

గీ. నదితనయు నండ గొని మమ్ము నఱకి పుడమి
నేలు తలఁపూనెఁ దన పూని కెట్లు పొసఁగు
నతని తోలు ముద్దగాఁ గొని యనుజ తనుజ
గణము చెల్లింపఁ గని యంత గడ నడంగు. 521

వ. అది యట్లుండె నీవు రభసంబున గాంధారేయు కడ కరిగి రేపకడ జగడంబునకు దడంబు నడిపింపు మెవ్వరి జయం బును దెల్లం బయ్యెడు ననవుడు యుధిష్ఠిరుం డులూకునకుఁ దాంబూల జాంబూనదాభరణంబు లొసంగి వీడ్కొల్పె ధృష్ట ద్యుమ్నాది రథిక నికరంబు సంగరంబెల్లి యయ్యెడు నని వెడ వెడ మొగంబు వికసింప సమర సన్నాహంబు సమకట్టు తలంపు నొప్పి కొలువు విరిసి చనియె. అంత నులూకుండును గురుపతిఁ గాన నేఁగి పురిలోట దక్కి తద్విధం బెఱింగించిన నతండు రేపకడ దురంబని సమస్త సైన్యంబునకుఁ జెప్పిపుచ్చె నిట్లుభ య బలంబు లుల్లసిల్లె నయ్యెడ మందాకినీనందనుండు గాం ధారీనందనున కిట్లనియె. 522

క. మొన నడిపింపం బగతుర
ననిఁ బొడిపింపఁగను నేన యగుదును నీకుం
బని లేదు కొంచె తనమును
నెనయఁగ ననుడతనికమ్మహీంపతి పలికెన్. 523

గీ. కలన నీదు చెంతఁ బులి ప్రక్క నున్నట్లు
వెలయు నాకు నొక్క వెరపు గలదె
యిది యటుండె వారి యెడ మన యెడలను
గలుగు రథిక వరుల బలము చెపుమ? 524

వ. అనిన గాంగేయుండు రాజున కిట్లనియె. 525

సీ. భూవర నీవును భూరిశ్రవుండును
గృతవర్మ గురు కృపు లతిరథులరు

సమరథుల్ భగదత్త శకుని హాలాయుధ
లక్ష్మణుల్ సీతమ్ము లనుదలంపఁ
గరము త్రిగర్త లేవురు సింధుపతియుమ
హారథుల్ వివరింప నర్థరథులు
నల దండధరుఁడు విందానువిందులు నీలుఁ
డునును ద్వౌ దురమున విను నృపాల
గీ. గురుతనూజుని సములు నిర్జరులుగారు
శౌర్య విస్ఫూర్తి నరుతోటి సాటి మేటి
నన్ను నేజెప్పికొననేల ? నాకొలంది
యెల్ల వారలు పుడమిలో నెఱిగి నదియె. 526

వ. వెండియు శల్యుండును బాహ్లికుండును సోమదత్తుం
డును నతిరథులు నచల బృహద్బల సుదక్షిణ వృషులు సమర
థులు సహజ కవచ కుండలంబు లెడలిన కతన రిత్త పేరిలరియు
గు కర్ణుం డర్ధరథుం డనినఁ గుంభ సంభవుం డిట్లనియె. 527
క. సూత సుతుఁ డర్ధరథుఁడని
యాతఁడెఁ జెప్పంగనేల యిది మనమెల్లన్
ఖ్యాతిగ నెఱిఁగిన పని గం
గాతనుజా! యన్న రూపు గానం బడదే 528
ఉ. నావిని క్రోధ మానసమునన్ రవిపుత్త్రుఁడు జాహ్నవీ సుతుం
గేవల మిట్లు పల్కె నతికిల్బిషబుద్ధిని బాండురాజ పు
త్త్రావళి పక్షమొప్ప నను నర్థరథుండన నే గొఱంత గాఁ
బోవును నీదు వెక్కసము బోవని యందుకచింతఁ జేసెదన్.

వ. అని సుయోధనుం గని. 530

ఉ. ఈరస మెన్నఁడున్ విడువఁడీతఁడు కారులుబల్కుచుండు నో
ప్పారఁగ నెంత సైప సభ నక్కట కౌరవ నాథ నీదయన్
గౌరవమొప్పి యీముదుకకాని తెఱంగుల కిచ్చగింతురే
పోరికి నేరడిట్టి పొగపొచ్చెము లీగతిఁ బల్కనెయ్యెడన్.

క. ముది మది దప్పిన ముదుసలి
వదనెఱుఁగని పల్కులాడఁ బార్థివ కర్ణం
బది యెట్లు చతురవాక్కుల
విదితుండగు వాని పల్కు వినఁ దగు నెందున్. 532

వ. అనినఁ బితామహుండిట్లనియె. 533

గీ. తనర! నీకు నాకుఁ దారతమ్యంబులు
రహిని గ్రీడి యెఱుఁగు రాముఁ డెఱుఁగు
నీదు పిన్నఁటయును నాదైన ముసలి త
నంబు చూడుమీ రణంబు నందు. 534

క. ఇది యొక్క నెపము గైకొని
కదలంబారెద వదెట్లుగా నేర్చును బెం
పొదవెడు నరుశరముల నీ
మద మడపక నేల మాను మార్తాండసుతా. 535

వ. అని పల్కి సుయోధను నుపలక్షించి. 536

సీ. విను ముత్తమౌజుండు విరటుండు ద్రుపదుండు
నీలుండు మరి శిఖండియును జిత్ర

సేనుంపు జయుఁడును జితారియుథుండును
శంఖుండు భోజుండు సత్యజిత్తుఁ
డాదిగాఁ గలరు మహారథు లతిరథుల్
సాత్యకి పాండ్యుండు చంద్రదత్తుఁ
డును ఘటోత్కచుఁడును ఘనుఁడు సేనాబిందుఁ
డమలుఁడో కాశ్యుడు సమరథుండు
గీ. నంచు మిగుల ననేకుల నెంచి నేనె
యుంగు గతి రెండుసైన్యములంగలిగిన
నృపకుమారులఁ జెప్పితి నృపవరేణ్య!
యనుచుఁ జెప్పియు విభున కిట్లనియె నతఁడు. 537

వ. పాండవుల యెడం గలుగు మహీశు లెంత శౌర్యసంపన్నులైననేమి నాబారింబడిన నుక్కడంగెద రొక్కశిఖండిఁ జంప బూన ననవుడు శిఖండి నీచే నవధ్యుండగుటకు గతం బెయ్యది వినవలతు ననినఁ గురుపతికిఁ బితామహుండిట్లనియె.

సీ. కాశీశ్వరుని పుత్త్రికలు మువ్వు రంబయు
నంబికాంబాలిక లనఁగఁ గలరు
వారలకై స్వయంవరమహోత్సవమున
కర్థి రాజుల నెల్ల నటకుఁజేరఁ
బిలిపించుటయు నేను విని వేడ్క తోడ వి
చిత్రవీర్యునిఁ బెండ్లి సేయఁ దలఁచి
రథ మెక్కి చని యందు రాజులఁ జీరికిఁ
గొనక యాకన్యలఁ గొని విచిత్ర

గీ. వీర్యునకుఁ బెండ్లి సేయ సద్వృత్తిఁ దలఁపు
బూన నంబ యనందగు బోటిపలికె
సాల్వ నృపుమీఁదఁ దనకు నాసాల్వునకును
దనదుపైనిఁ దలఁపు గలదనిన నపుడు. 539

గీ. దానిఁ బోవఁ బంచి తక్కిన యిరువుర
నొనర నీ పితామహునకుఁ బెండ్లి
సేయ నంత నంబ చెచ్చెర సాల్వునిఁ
గని వరింపుమనిన విని యతండు. 540

చ. చెఱఁగొనిపోయెభీష్ముఁడిఁకఁ జేకొనఁబాడియెనిన్నటంచు న
త్తఱివెడలంగఁద్రొబ్బుటయుఁ దాలిమిఁదూలఁగనా ర్తచిత్తయై
మఱి యొరుపాలికింజనఁగమానిచలంబు మనంబు లోపలం
బెఱుఁగఁగనిట్టియాపదకుభీష్ముఁడు మూలమటంచు నెంతయుక్

వ. తపంబునం గాని గాంగేయు నెవ్వరికి గెలువ
గాదని విచారించి వనంబున కేఁగి యచ్చటి మునులకుఁ దన
వృత్తాంతంబుఁ జెప్పిన వారలు నిది రాజు సేసిన పని మము
బోంట్లచేతఁ జక్కఁ బడనేరదు. కావున నీతండ్రి పాలిక్కి
నరుగు నది పరమ ధర్మంబనపుడు నిట్టి పరిభవంబునం బొంది
యింక నెవ్వని మొగంబుఁ జూడనేర్తుఁ బరు లెఱుంగకుండ
నిందుఁ దపంబు సేయుదు నను సమయంబున నటకు హోత్ర
వాహనుండను రాజర్షి చనుదెంచి దాని తెఱంగు విని యది
తనకూఁతు కూఁతురగుట యెఱింగి విషాదంబునుఁ బొంది
యంబ కిట్లనియె. 542

సీ. భార్గవు పాలికిఁ బడఁతి హోమ్మాత్రఁ డా
శ్రిత రక్షణుండు నాహితుఁడుగాన
నీవుమ దీయ దౌహిత్రివి గాఁ దాను
దెలిసిన రక్షించుఁ దెఱవనిక్క-
మను నంత నటకు రాముని శిష్యుఁ డేతెంచి
రాముఁడు రేపిటఁ రాఁగలండు
నావిని ప్రీతులై యావని నుండిన
మరునాఁడు భార్గవుం డుఱక వచ్చెఁ
గీ. యంబ చందంబు హోత్రవాహనుని చేత
నెఱిఁగి యాయింతి నూరార్చి యేను నీకు
హోత్రవాహను నట్టుల నఃవిద ! నీదు
పరిభవముఁ బాపుదు నటంచుఁ బలికి మరియు. 543

ఆ.వె. ఈ పరాభవంబు నిరు దెఱంగుల నొప్పె
సాల్వుఁ గూర్చుటొండు సమర ధరణి
భీష్ము నోర్చుటొండు ప్రీతి యెట్లగు నీదు
మానసమునఁ గల్గు మాట చెవుము. 544

వ. అనిన నది యిట్లనియె నింక సాల్వుండుగైకొన కేరం
డు. భీష్మున్ జయింపఁ దపంబు సేయ నిటకు వచ్చి నా భా
గ్యంబున నిన్నుఁగంటి నినవు డట్లన గాంగేయుండు నాపంపు సే
యండేని దురంబునఁ బొరిగొందు నింక నీతపంబు వలదని పలి
కి పరశురాముండు ముని జనంబులతోఁ గురుక్షేత్రంబునకుఁ జ
నుదెంచి సరస్వతీ తీరంబున నిలిచి నన్నురావించిన నేనును జని

నమస్కరించి పూజించిన యనంతరం బాతండువిచిత్ర వీర్యు నకు నంబఁ బరిణయంబు సేయుమని యనేకవిధంబులఁ జెప్పిన మెత్తబాటులేమికిఁ గినుకపొడమి సమరసన్నంద్ధుండవు గమ్మని న నట్లకాక యని సన్నద్ధుండనై ఘోరంబగు సంగ్రామంబు సేయుచున్న సమయంబున. 345

క. నారదుఁడు సురల పంపున
వారించినఁ బోరు మాని వాసములకు మే
మారయఁ జను నెడ నంబయు
నారసి కోపమున నార్తయై కారడవిన్. 546

ఉ. ఘోరతపంబు సేసి యది కొంత నదీక్రియఁజెంది తక్కునా
కారముచేఁ దపంబు నధికంబుగ సల్పిన మెచ్చి శంభుఁ డిం
పార వరంబు గోరుమను డంబయు భీష్ముని జంప వేఁడుటన్
గౌరవ మొప్పనట్లయగుఁ గాఁగల జన్మమునందునాపురుషా

గీ. లలన యగుఁ గాక యని చితిఁ బెలుచఁ బేర్చి
యలుకచే వేగ సొద సొచ్చె నంత ద్రుపద
విభుఁ డసంతతియై వారు వేఁడి దపము
సేయ హరుఁడు ప్రసన్నుఁడై చెప్పె నిట్లు. 548

వ. వినుము నీకపత్యంబు నిజ భార్యయందుఁ గలిగెడు. జనించునాఁడు కుమారియై పదంపడి యొక్క కారణంబునఁ బు స్త్వంబుగలుగు శిఖండియనఁ బ్రసిద్ధండై భీష్ముఁ దీర్పంజాలున ని యానతిచ్చి యాదేవుం డంతర్హితుండయ్యె నంతఁ బాంచా ల రాజ మహిషి గర్భిణియై నెల్లలునిండు నాఁడు నయ్యంబను

బుత్రిగాఁ గాంచిన శంకరు వచనప్రకారంబున శిఖండియనునా
మంబుచేసి యతి గూఢంబుగాఁ బెంచుచు జవ్వనంబు రాకము
న్న దశార్ణాధీశ్వరుండగు హేమవర్మ కూఁతు నుచితక్రమంబు
నను శిఖండికి వివాహంబు సేయునంతఁ గొలంబున. 549

సీ. తగ శిఖండికి మగతనములేదని హేమ
వర్మయుఁ దనకూఁతు వలన నెఱిఁగి
యిట్టి తప్పొనరించినట్టి పాంచాలునిఁ
జంపుదునని బలసహితుఁడగుచుఁ
జనుదెంచి సోమకేంద్రుని పురిచుట్టును
విడిసిన నవియెల్ల విని ద్రుపదుఁడు
చింతించి సమరంబు సిద్ధంబుగా నెంచి
సన్నద్ధమొనరించె సైన్యములను

గీ. నిట్లు రెండు పాళ్ళు నెల్లి మాఱ్కొనవేడ్క
గలిగి యొప్పఁ గ్రుంకె నలినహితుఁడు
నంత నాశిఖండి యతివిషాదంబునఁ
గడిదిఁ చావునిజముగాఁ దలంచి. 550

వ. అవ్వీటి క్రేవ నిర్జనంబైన స్థూణ కర్ణుండను నొక్క
యక్షుని నివాసంబు నిశను బ్రవేశించి యందుఁ బ్రాణ త్యాగం
బుసేయు తెఱంగు విచారింపనయ్యక్షుండు నదియెఱింగియిట్టేల
చచ్చెదని యడిగిన వానికిఁ దనవృత్తాంతంబుఁ జెప్పిన నతండు
గరుణించి యిట్లనియె. 551

గీ. రిత్త సావనేల నిత్తు నా పుంస్త్వముఁ
గొమ్ము నీదు మామ నమ్మతింప

నరుగు నీవు వచ్చు నందాక నీయాముఁ
దనముఁ బూని యిందుఁ దరలకుండు. 552

క. అని పంచిన నాక్షణమున
చనుదెంచి శిఖండి తనదు చందము జననీ
జనకులకుఁ జెప్ప నలరిరి
వనజాప్తుఁడు పూర్వ గిరికి వచ్చెం బ్రీతిన్. 553

చ. సొరిది నహర్ముఖంబునను సోమకుఁ డోజ దశార్ణనాథునిం
గరమొక భంగిఁ గాంచియు శిఖండికిఁ దత్పురుషత్వ మేర్పడం
బరగుట తేటసేయఁ దన పల్కుటకున్ మదినొచ్చి వీటికిం
బరఁగఁ జనెన్ దశార్ణపతి బంధుతఁ బార్షతునందుఁ జూపియున్

వ. అంత నక్కడ నాలోఁ గుబేరుండు క్రీడార్థంబున స్థూణకర్ణు నాశంబునకు వచ్చి వాఁడు తన్నుఁ బొడగన రామికి నిది యేమి కతంబని చెంగటి గుహ్యకులం బంచిన వారరిగి స్థూణకర్ణు విధంబు దెలిసి వచ్చి యాతెఱంగు సెప్పి దేవా! సిగ్గు పెంపున రానేరండనవుడు నతం డట్టులైన నేమియని వాని రావించి నీకిట్టిద యొప్పు నిట్ల యుండుమని పలికి వెండియుఁ గరుణించి శిఖండియాయువు గల యంత వట్టు నిట్లుండి పిదపఁ బురుషత్వంబుఁ జెందుమని పలికి కుబేరుండు చనియె నంత.

క. జానుగ శిఖండి యక్షునిఁ
గానం జని మగతనంబుఁ గైకొను మనుమన్
వానికిఁ దనవిధమంతయుఁ
బూనికఁ దెలిపిన శిఖండి పొంగిన వేడ్కన్. 556

గీ. తల్లి దండ్రిల కత్తెఱంగెల్లఁ జెప్ప
నెఱిఁగి సంతసమునఁ జెందిరిట్లు కాశి
రాజు కూఁతు విధంబన రాజు మదిని
వగచి మెచ్చెను వాని నిర్వహణ శక్తి 557

క. మరియును భీష్ముండట నే
డ్తెర వ్రతమేమాని వానిఁ దీర్పను నృప యి
త్తరిఁ బెర వీరుల నెల్లన్
నరుకుదుఁజెఱుకుల తెఱంగునన్ రణసీమన్. 558

క. నావిని విభుఁ డిట్లను విను
దేవనదీసుత శిఖండి ధృతి నీకన్నన్
పై వచ్చువాఁడె యీరథి
కావలిచేఁ దప్పి కడఁక సాహవ కేళిన్.

గీ. అనుచుఁ బల్కె నప్పు డఖిల జనంబును
సంతసించె నుభయ సైన్య మట్లు
సోరు వేడ్కలోనఁ బొలుపొంద నా రాత్రి
నధిక సుఖముచేత నలరె నెలమి. 560

నా గ బం ధ ము.

చ. అనఘ మహోవిభిన్ననిగమాగమ నిత్యనిరంజనా చిరం
తన ! భవకాన నానల సదాసముదగ్రవిభై కమానితా !
జనన జరాంతహీన తతచాతకసద్ఘన సోమసుందరా !
నన ! శుకమౌని మానస ధనాధవ చిత్తత భావభాసకా.

క. సరసిజగర్భాదిసురో
త్కరసేవిత నిర్విషయ వికల్పవిరహితా
శరణాగత పరిరక్షణ
పరమోజ్జ్వలధామ నిఖిలవాహన నాథా. 562

భుజంగప్రయాతము.

సముద్యద్రజోభావ సర్గాధిరూఢా
సమీచీన సత్త్వత్వ సర్వావనోఢా
తమోభావ విశ్వప్రతాపైకబాధా
ప్రమోద స్వరూప త్రివస్థావలీఢా. 563

గద్యము.

శ్రీమదాదిజగోపాల కరుణాకటాక్ష వీక్షణానులబ్ధ
కవితా విశేష మతుకుమల్లి వెంగళయామాత్య పుత్త్రి
వినయవిధేయ మాదయనామధేయ
ప్రణీతంబైన యభినవ
భారతంబునన్ ఉద్యోగపర్వంబు సర్వంబును
పంచమాశ్వాసము.

సంపూర్ణము.

మంగళంమహత్.

# అభినవభారతము

-:0:-

## షష్ఠాశ్వాసము.

## భీష్మపర్వము.

క. శ్రీమానిత మకరోరగ
హైమ స్ఫుట చారు కుండ లాంచిత కర్ణా
హేమాజిన కౌశేయ
క్షౌమా హరి హర హిరణ్య గర్భైకాత్మా! 1

గీ. అవధరింపు మట్టు లాదశంబులు రెండు
గయ్యమునకుఁ బెలుచఁ గాలుద్రవ్వ
చుండె సంజయుని నియోగించె వ్యాసుండు
దురము తెఱఁగు చేఁకు దొరకఁ దెలుప. 2

వ. అంతఁ బ్రభాత సమయంబున సుయోధనుండు మహాత్ముండగు పితామహుం డిందున్నవాఁడని తన్మందిరంబున కరిగి యతని నవలోకించి మీరు వివాహవిముఖులు నయ్యును మదర్థంబుగా వీర భుజ వినోద కాలంబునందు బ్రత్యర్థి పార్థివ హరణంబునకై సేనాధిపత్య లక్ష్మినిఁ గైకొంటి రింక సమరంబునకు మన మొన నడిపించుట దగునని విన్నవించి యతనిపాదంబుల కెఱఁగిన. 3

గీ. పౌరవేశ్వరుఁ డీరీతిఁ బ్రణుతిఁ జేయఁ
బురుష సింహుఁడు సురనదీ పుత్త్రుఁ డనియె

నృప చమూపతినై యున్న నేన వైరి
భటుల సురపురి కనిచెద బాహు శక్తి. 4

సీ. రహి మున్ను సభ మహారథ పరిగణనచేఁ
దన్నర్థ రథుఁడని యెన్ని నట్టి
కతన రోషాత్ముఁడై కర్ణుండు కలన నా
దురము నన్నాళ్ళను దోడుపాటు
సేయనంచుఁ బ్రతిజ్ఞ చేయుటచే మదిఁ
జింతింప వలవదా చిఱుతకుఱ్ఱ
కడు మహాభుజులైనఁ గానిమ్ము రిపుమహా
భుజుల సంఘంబులఁ బోరిలోన

గీ. ఘనతరవిశిఖముఖమునఁ గడఁగి మ్రింగె
దను గలంకకు మనము నంచును మహీశు
నెమ్మనం బలరఁగఁ బల్కి నెమ్మిఁదనదు
సేన నడిపించె సురనదీసూనుఁడపుడు. 5

చ. కరము హిరణ్వతీ తట వికాస లస త్సుమనస్సుగంధమున్
సరవిని విందుగాఁ గొని వెసం బ్రతిఁగా బహు గంధబంధుర
స్ఫురణనొసంగుదాన జలభూరినదుల్ ప్రవహింపఁజేయుచుం
గరిఘట లుల్లసిల్లెఁ జెలికత్తెల నన్నదికిచ్చుఁ జాడ్పునన్. 6

ఉ. మామకజన్మభూముల విమానిత సింధువు లింతేగాక యీ
భూమిని గల్గు సింధువులు బోలునె సాటికి నంచు సైంధవ
స్తోమ మసూయచేఁబలెః బృథుత్సురికా భఖురాళిచేభువిః
వేమరుసింధువుల్ స్ఖలనవృత్తినిఁ జెందఁగ రేఁచెధూళులన్

గీ. ఆ కురూద్వహ కలహాదయంబు కంటెఁ
దొలుతఁ గరి బృంహితములు తేరుల యులివులు
వరలె దిశలెల్లఁ దమకును వశముఁ జెందు
కొఱకు నన్యోన్య కలహంబు గొనినయట్లు. 8

చ. మమతసహించినాము నవమగ్రహనామమునస్మదాఖ్యకున్
సమముగ నింక నున్నతిని సైపము మేమనిఁ బోరి కాగ్రహ
క్రమమునఁబోలె దండములు గైకొని తేరులనుండి విన్నొగిం
గమిచి గ్రహస్థలాతిగముగాఁ గనుపట్టెను గేతుజాతముల్. 9

చ. కని తురగావళుల్ గలుగఁగా రథముల్ పరిఘల్ శరాస నో
త్కరశరముల్ కృపాణము లుదారముతాగొడుగుల్ సిడంబులుం
బరిపరి సాధనంబులొగిఁ బండ్లనుఁబూన్చి మహోముదంబుచే
నిరుదెసవారు సంగరమహీస్థలికింగొని తెత్తురొయ్యనన్. 10

వ. అప్పుడు 11

సీ. వేదికా కేతువు విలసిల్ల ద్రోణుండు
కృపుఁడు గోవృషరత్న కేతు వలరి
సింహలాంగూలంపు సిడమొప్ప ద్రౌణియు
మణికదళిసిలంగ మద్ర విభుఁడు
కాంచన మణి మయ కలిత పతాకలు
విలసిల్ల నెల్లెడ వివిధ నృపులు
మహనీయమగు తాళమండిత ధ్వజ మొప్ప
సైన్య మధ్యంబున శాంతనవుఁడు

గీ. బరఁగి ఖచరాళి కన్నుల పండువులుగ
బహుళ తూర్య నినాదముల్ పరిఢవిల్లఁ
బెండ్లి కేగెడు చందానఁ బ్రీతి నెసఁగి
కొమరు దైవారఁ బొలిచెను గురుబలంబు. 12

సీ. గంధ బంధుర మహా గజ బృందముల తోడ
భగదత్త కాళింగ పార్థివులును
గొడుకులు తమ్ములు గొల్వ గుజ్జుఁవుఁ బిండు
సంరంభమునఁ గ్రాల సౌబలుండు
బహు చక్ర చంక్రమార్భటి మిన్ను బగిలించు
స్యందన వితతితో సైంధవుండు
దర్ప మొప్పఁగ సముద్ధతి యాదవానీక
పరివృతుండై కృతవర్ముఁడలర

గీ. దమితో బాహ్లికుఁడు సోమదత్తుఁ డుగ్ర
వైరి మథనుండు భూరిశ్రవసుఁడు గోస
లాధిపతి యాబృహద్బలుఁ డధిక శౌర్య
శాలి యగు నాసుదక్షిణ జనవిభుండు. 13

వ. మఱియుఁ దిగర్తేశ్వరుండగు సుశర్మయు రథ్యో
పేరులగు నలంబున హలాయుధులును సాల్వ సౌవీర శూరసేన
యవన సాతి భూపతులు లోనగు నానా దేశంబుల రాజులు
తమ తమ చతురంగబలంబులతోడ నవరణంబుల రణంబునకు
మెరసిరి. దుశ్శాసన దుర్మర్షణ వివింశతి ప్రభృతి సహోదర
పరివృతుండై మణి మయ భుజగ కేతనంబు గ్రాల రారాజు

నుం బొలిచె నిట్లు గూడి కొనిన పదనొకం డక్షౌహిణీబలంబుఁ గలయం గనుంగొని దొరల నుద్దేశించి గంగా నందనుండు. 14

గీ. తెగులు దగిలి యింటఁ దెగటారి దుర్గతిఁ
బడుటకంటె మనకుఁ బరమలోక
కారణంబు రణము గావున నొండెదఁ
దలఁప వలదు కీర్తి ధరణిఁ గలదు. 15

గీ. అనుచువారలెల్ల నాపగేయునిఁ జూచి
యింతకంటె సుకృత మెందుఁ గలదు?
గెలిచి పుడమి, చచ్చి కీర్తియుఁ బుణ్యంబుఁ
గాంతు మింక నొండు గలదె యనఘ. 16

వ. అని పలికి యేక నిశ్చయంబునం బలికి రట్లు సకల శమూ సమేతంబుగాఁ బితామహుండు సమర సన్నద్ధుండై నిలిచి మానుష వ్యూహంబుఁ బన్ని దానికి వలపటఁ గృపాశ్వత్థామలునుఁ దాపట శల్య కృతవర్మలును వెనుక బాహ్లీక భూరిశ్రవసులును నడుమ కురుకుమార సమేతంబుగా సుయోధనుండును నతని యగ్రభాగంబున సంశప్తకపతి యగు సుశర్ముండును వలయు చోట్ల బలవంతులగు దొరలును ముందర కనకమయ తాళ వేదికాధ్వజంబులుఁ గ్రాల నోహరి సాహరిగాఁ దానును ద్రోణుండును బడమటి మొగంబుగాఁ బొలిచి యుండి రట్టి మొగ్గరంబు గాంచి వేల్పు లచ్చెరువడి రంతకు మున్నక్కడ, 17

సీ. గంధవారణ మద గంభీర నదులచే
గడలియుఁ జెలియలి కట్టఁ గడువఁ
గంఖాణ ఖురపుట ఘట్టనోద్ధత ధూళి
స్వర్ణది నిర్జల స్థలి నొనర్పఁ
బటు రథ చక్ర విభ్రమ పాటితాతవనీ
చక్రంబు శేషునిఁ జదియనొత్త
విలయ కాలాంతక తులిత భటార్భటి
మాటి మాటికి మిన్నుఁ బీటఁబఱప

గీ. నలరు రత్నపు టపరంజి యరదమునను
లలితధవళాతపత్రంబు పొలుపుమీఱ
చారువైభవ మొప్ప నజాతవైరి
వెడలె జన్యంపు వేడుక ముడిఁ గొనంగ. 18

క. కాంచన మణిమయ మగు గద
చంచద్భుజ దండమునకుఁ జవు లిడ శౌర్యో
దంచితుఁడు వెడలె భీముఁడు
కాంచన గిరి వోని మేలు కనక రథమునన్. 19

సీ. గాండీవమహనీయ కాంతి పుంజంబులు
కనదింద్ర చాపంబు ననుకరింప
మెఱుగారు కృష్ణుని మేని నల్లని జిగి
ఘన ఘనాఘన లక్ష్మిఁ గడకు నొత్త
భూరి వానర కేతు భూత జాతార్భటి
పలుమారు గర్జలఁ బరిహసింప

దివ్య కిరీట దేదీప్య ప్రభాచ్ఛటల్
తొలుకరి మెఱుపులఁ దోడరిఁ గెలువ
గీ. నుర్విఁ జెందిన పర్జన్యుఁడో యనంగ
కవ దొనలు మీఱ వెలిమావు గమినిఁ దనరు
రథము మీఁదను దేవతారాజతనయుఁ
డనికి నడచెను వేఁడుక లావహిల్ల. 20
గీ. పురహరుఁడు మున్నుఁ గమలజుఁ బోలె నినుఁడు
వైనతేయాగ్రజునిఁ బోలె వరలి యపుడు
బ్రోల ధృతి తోత్రుఁడైన గోపాల డొప్పఁ
బ్రథన రంగమునకు వచ్చె ఫల్గునుండు. 21
క. వివిధ విభూషణ జాలము
లవిరళ రుచినీనఁ జంద్రుఁడన సూర్యుఁడునాఁ
గవ లేతెంచిరి చూపఱు
లవు నవు నని యిచ్చ మెచ్చ ననికి రథములన్. 22

వ. వెండియుఁ బ్రతివింధ్యుండును శ్రుతసోముండును శ్రుతకీర్తియు శతానీకుండును శ్రుతసేనుండును సౌభద్రుండును లోనగు కుమార వర్గంబును ద్రుపదుండును శిఖండియు విరటుండును సినివరుండును, మున్నగు బంధుగణంబును చేకితానుండును మాగధ సహదేవుండును, దృష్టకేతుండును, మలయధ్వజుండును, కేకయపంచకంబును, శైబ్యుండును, కాశ కరూశ నృపతులును మొదలగు నానా దేశ రాజులునుఁ దమతమ

చతురంగ బలంబులతోఁ గూడికొని నవరణంబుల రణంబునకు నడచి రప్పాను. 23

ఉ. కాటుక కొండలట్టి నిజ కాయములందగు కాంతి దిక్కులం
గాటముగాఁగఁజీకటులుగ్రమ్మఁగఁజేయు మదానవోత్తముల్
కోటుల సంఖ్యలంబలసి కొల్వఁగ దంష్ట్రిలు కాంతులీనఁగా
బోటరి యాఘటోత్కచుఁడుభోరునఁ బోరికివచ్చెనయ్యెడన్.

ఉ. చండ విరోధి కాననము సారెకుఁ గాల్పఁగ జన్మ వేళ దో
ర్దండమునం బ్రసక్తమగు దావము దాను బ్రతాపదంభమై
యుండఁగడంకమందుశుచినుజ్జ్వలుఁడై ద్రుపదేంద్రపుత్త్రుఁడా
పాండవ సైన్యనాయకుఁడు. భండన కేళికివచ్చె సేనతోన్.

సీ. ధరణీ పరాగంబు కరి దాన ధారల
చేత నొగ్గిలియునై చిదుకురనఁగ
నన్యోన్య దష్టంబు లగుచుఁ గోటీరంబు
లొరసి నావడి తోవ్రివ కొప్పఁజేయఁ
గొమరారు ఛత్రంపు గొడుగుల చీఁకట్లు
విరియ వర్మ ద్యుతుల్ వెలసి వెలుఁగ
ఘోటక స్యందన కుంజర ఘంటికా
శబ్దంబు. లోలి హెచ్చరికఁ దెలుపఁ

గీ. బాండవాగ్రజు బలము లప్పాట నిట్లు
బాఱు తెంచెను గన్నుల పండువగుచు
వేల్పు గుములకు నవ్వేళ విస్మయంబు
బొదలఁ గడుఁ జారు భీషణ స్ఫురణఁ దనరె. 26

వ. ఇవ్విధంబున శుభ నిమిత్తంబులు గైకొనుచుం జని కురుక్షేత్రంబునకు నుత్తర ప్రదేశంబున శమంతక పంచక సమీప స్థలంబున సమర సన్నద్ధంబై నిలిచె నయ్యుభయబలంబులును గరి తురగ రథ పదాతి రమణీయంబులై శైల తరంగ ద్వీప జలచర విరాజితంబులగు పూర్వాపర సముద్రంబులను బోలె నానావర్ణ కేతు పతాక ఛత్ర చామర వర్మ చర్మ శస్త్రాస్త్ర భాసురంబులై వసంత సమయ పుష్పితారామంబులగు నందన చైత్ర రథంబులం బోలె శంఖ భేరీ ప్రముఖ తూర్య రవాడంబరంబులై వర్షావసర గర్జా విజృంభిత మేఘ మండలంబులం బోలె గండుమిగిలి యుండు నప్పుడు ధర్మజుండు దొరల రావించి యిట్లనియె. 27

సీ. గెలుపు నోటమియునుఁ గలవు రెండునుఁజూడ

నొక్కని యెడ నవి యుండఁబోవు

దైవ వశంబునఁ దాన జయించును

దప్పిన నోడును దథ్య మిదియుఁ

గావునఁ గీడెన్నఁ గాఁదగుఁ బిమ్మట

మేలెన్నఁ దగు నెందు మీర లిపుడు

కలనిలోఁ బోవక నిలిచెడు ధైర్యంబు

గలిగిన మాతోడ నిలువుఁ డనినిఁ

ఆ.వె. బోవఁ దలఁతు రేని పొండు గొఱంత లే

దింత నిజము చెప్పెడీక నొకండు

గెలిచి సిరులు గొనుఁడు పొలిసిన పట్టున
మొనసి కీర్తి పుణ్యములనుఁ గొనుఁడు. 28

క. అన విని వారందఱు ని
ట్లనిరా ధర్మజునిఁ జూచి యనఘా! వేయేం
డ్లనువుగఁ బ్రదుకుదుమే? యీ
యనికిం జొఱకుండి బిడ్డ లాండ్రుఁగ మేముక. 29

వ. అదియునుం గాక రాజులకు రణంబుకంటె నుత్తమ లోకంబు వడయ నుపాయంబు గలుగ నేరదది యట్లుండె
నొండు గలదే యెట్లైన లెస్స యని రవ్వాడు ధర్మజు ననుమతిని
ధృష్టద్యుమ్నుం డచల వ్యూహంబు సంఘటించి దానికి నగ్రం
బున నభిమన్యు ప్రభృతి కుమారులును నకుల సహదేవ భీమ
సేన సహితంబుగా మేటి మగలతోఁ దానును చేకితాన సాత్యకి
మాత్స్య పాంచాలురును వారి వారి బలంబులతోడ దక్షిణో
త్తర భాగంబులను నడుమ కరిఘటలతోడ రాజును ముందర
నర్జును పెను బ్రాపున దేవవ్రతున కభిముఖుండై శిఖండియు
వెనుక మాగధ సహదేవ ధృష్టకేతులును మఱియు నెడనెడ
యోధవరుల నిలువ నియోగించె నట్లు రెండు మొనలు గండు
కొని యహమహమికల నొప్పె శంఖ ప్రముఖ తూర్య రవం
బులుఁ జెలంగె. శుభాశుభ నిమిత్తంబులు పాండవ కౌరవ
వాహినులఁ గానం బడియె నంత. 30

ఉ. మైత్రికి మాలి యిట్లు కురు మానవనాథుల రెండుసేనలున్
మిత్రుఁడుపూర్వ పర్వతము మీఁద నెసంగెడు వేళ నా కురు

క్షేత్రము నందు నిల్చె ననినేయఁ దురంగ శతాంగ సత్సమి
త్ర్యాత్ర మతంగజ ప్రథితపంక్తులు చెంతల నావరింపగన్

చ. అమర నదీ సుతుండు ద్రుపదాధిప నందనుఁ డగ్రసీమలం
గ్రమమున బాహుదండధృత కార్ముకులై కవుప్రాపులై తగన్
సమర ధరిత్రి నయ్యుభయ సైన్యములం గల వీరవర్యులుం
దమతమపేరుపెంపు బిరుదంబులు పల్కుచు నిల్చిరుద్ధతిన్.

వ. అట్టి యెడఁ గైదువులేనివాని నుబుసువుచ్చువానిని, దప్పినార్చువానిని, వాహనరహితుని, విడిదలవానిని, వెఱచినవానిని, పఱచినవానిని, నేమఱినవానిని, లోనగువారినిఁగడిఁదిశత్రుండైనఁ జంపమియు, విలుకానికి విలుకాఁడును, హాస్తికునకు హాస్తికుండును, అశ్వికున కాశ్వికుండును, రథికునకు రథికుండును, భటునకు భటుండును, నెట్టివాని నట్టివాఁడు దలపడుటకు సమయంబు సేసి రంతఁ గౌంతేయాగ్రజుండు కవచం బూడ్చి యాయుధంబులు గూడ రథంబునం బెట్టి తేరు డిగి పాదచారియై మోడ్పుఁగేలు ఫాలంబునఁగీలించి నిభృతావయవుండగుచు దండు వెల్వడి భీష్మున కభిముఖంబుగాఁ బోవు నతని చిత్తవృత్తిఁదెలియక వెఱగుపడుచు భీమసేనాది సోదరులును, వాసుదేవుండును దక్కటి బంధు మిత్రజనంబులును వెనుకొని మిన్నక చనుచుండ నప్పుడు. 33

చ. జనవర! పాదచారివయి శత్రులపాలికి నిట్లు బోయినన్
గనుఁగొనియీవిభుండు రణకంపముచేఁజనుదెంచెనోయటం

చును నగరే భవద్బలముఁ జూడక నీవు నశీక్తు వోల్కఁగా
నని మొనకోహటించుఁబలె నాయుధహీనతఁబోవబాడియే.

క. అని బహు భంగులఁ దనతో
ననుజన్ములు బలుక మాటలాడక చను న
జ్జన విభుని నెమ్మనముఁ గని
వనజాక్షుఁడు నగుచు నిట్లు వారికి ననియెన్ 35

గీ. ఏల గ్రుచ్చిగ్రుచ్చి యిట్లాడ నీతని
చిత్తవృత్తి దెలిసెఁ జెప్పుదేను
పెద్దలైన ద్రోణ భీష్మముఖ్యులచేత
నని కనుజ్ఞ వడయ నరుగు నిపుడు 36

వ. అని తెలిపిన భీమార్జునాది సోదరులును కృష్ణ సా
త్యకులునుఁ దక్క నతనితోడ మున్ను పాదచారులై వచ్చుచు
న్న దొరలు క్రమ్మరి తమతమ వాహనంబుల నలంకరించి ర
ప్పుడు, కౌరవులు ధర్మజురాక కచ్చెరువుపడి. 37

సీ. ఏమి కతంబొక్కొ! యితఁ డని మొనను వ
చ్చుట కని యత్తెత్తి చూచువారు,
భీమార్జునులు తక్క పృథ్వీశు లుండంగఁ
దమకేమి భరమని దలఁచువారు,
నొచ్చిన పిమ్మట వచ్చినఁ దగుఁ గాక
తొలుత నిక్లీమని పలుకువారు
పిఱికిగాఁ డాహవ భీషణం డిదియేమొ
యత్యద్భుతం బంచు నాడువారు

గీ. సంగరం బగు పట్టున సకల బంధు
నాశనంబను మెరమెర నాటి, పుడమి
నఖిలమేలుఁడు తపసినై యడవి కేను
జనెద నని చెప్ప వచ్చెనో యనెడువారు. 38

వ. ఇవ్విధంబున నానా ప్రకారంబుల నూహింపు చుండ ధర్మనందనుండు గాంగేయు పాలి కరిగి వలగొని ప్రణామం బాచరించిన నతఁ డాదరభరిత చిత్తుండై దీవన లిచ్చి వత్సా! నీవిచ్చటికి రానియెడ శాపంబిత్తు వచ్చి మేలు జేసితివి సంతసంబయ్యె. నీకై పెనంగుట దక్కనెద్దియేనివరంబుఁ గోరు మిచ్చెద ననుటయు దేవా! నిన్ను గెలుచు నుపాయంబు ప్రసాదింపు మనవుడు నన్నుఁ గయ్యంబున నింద్రాదులు నొడవ నేర రెవ్వరైనఁ జుట్టఱికంబునఁ బగదీర దిప్పనికిఁ గ్రమ్మర విచ్చేయుదువుగాక యని పలికినఁ బ్రసాదంబని ద్రోణాచార్యు కడ కరిగి నమస్కరించి తదీయాశీర్వచనంబును గైకొని గెలువుమని దీవింపు మనిన నవ్వి గురుండు. 39

క. భూమీశ ! గెలుపు లిచ్చుట
కేమెంతటి వార మరయ నృపులమె? పటు సం
గ్రామము మా కులధర్మమె
భూమిసురోత్తముల మెన్నఁ బూజార్హులమున్. 40

వ. అని పల్కి. 41

ఆ. వె. ధర్మ మెచటఁ గలదు దైవ మద్దెస నుండు
గానఁ గృష్ణుఁ డచటఁ గలుగ నింక

సందియంబు లేదు జన్య జయంబు నీ
యందుఁ గలదు తేలనాడ నేల? 42

క. అన విని భవదీయ వధకు
ననువెట్టులొ తెలియ నిష్ప డానతి యీయం
జను ననుఁ డాచార్యుండా
జనవల్లభుతోడఁ బలికె సమ్మదమూరన్. 43

వ. విను మేను శస్త్రాస్త్రంబులు బట్టిన సురాసురులుం గెలువనేరరు గావున నైదువులువిడిచి ప్రాయోపవేశంబుననుండుతఱి సమయింపనగు నట్టిపనికి దొడ్డకొడుమాటనమ్మికపుట్ట నాచెవిం బెట్టినపట్టుననాయుధంబులు విడతునని తగువాఁడు వధింపనగున నిపల్కిన నట్లకాకయని కృపాచార్యుఁ జేరంజనియట్లన విన్నవించుటయు నతం డేనవధ్యుండ ననియును గెలిచెద ననియును జెప్పిన శల్యు నొద్దకుఁ బోయి మహాత్మా! కర్ణ సారథ్యంబు బూరంగీకరించునది సమర సమయంబున నతని తేజో విశేషంబులు గ్రుంగ నాఁడు నది యనవుడు మద్రపతి యీ వరంబు మున్నదోగ వేళన యొసంగితి గాదె యట్ల చేసెద పొమ్మని వీడ్కొల్పిన నట్లుండఱ చేత ననుజ్ఞాతుండై మగుడు నంతకు సంగర వినోదంబుఁజూడ నేతెంచియున్నకర్ణునకు వెన్నుం డిట్లనియె.

గీ. భీష్ము మీఁది యలుకఁ బెట్టి సంగర మీవు
మానినావు పాండు సూనులందు
గలసి నదిసుతుండు పోలసిన యెందాఁక
కలను సేయఁ దగవు గాదె నీకు. 45

క. అన విని కర్ణుం డిట్లను
వనజాయతనేత్ర! కౌరవ ప్రభునకు నే
మును బ్రాణము లమ్మితి నిఁకఁ
జనునే? మీలోనఁ గలసి జన్యము సేయన్. 46

వ. అని పలికిన నిది లెస్స యని హరి ధర్మజ భీమార్జునుల గలయ నరిగె నంత నజాతశత్రు డుభయ సేనా మధ్యంబున నిలిచి కౌరవుల దెసకు మగిడి పెద్ద యెలుంగు సేసి యెవ్వరేని నన్నుఁ గలసికొను తలంపు గలిగిన వచ్చునది వారిని నా తమ్ములట్ల నడిపింతు ననుటయు ధృతరాష్ట్రుని సవతాలి కొమరుండు యుయుత్సుండనువాఁడు నిజబలంబులతోడఁ దూర్య రవంబులు సెలంగఁ గలసిన బహుమానించె నట్లు గలపికొని సైన్యంబుఁ బ్రవేశించి రథంబెక్కి జోడు దొడగి విల్లందిన నెల్లవారును సన్నద్ధులై తమతమ నిలుచు తావులం బొలిచి శంఖంబులు బూరించి రిట్లుభయ సైన్యంబులు భేరీ నిస్సాణ ప్రముఖ తూర్యఘోషంబు లుప్పరంబుఁ గప్ప నప్పు డర్జునుండు గాండీవంబుఁ బుచ్చికొని గుణంబు సారించి కృష్ణు నుద్దేశించి తొలుత మనకుఁ దలఁపడఁదగువానిఁ జూచికొన వలయు నరదంబు రెండు మొనల నడిమికిఁ దోలు మన నతం డట్లచేసిన తేరు మీఁద నిలిచి యందఱఁ గలయం గనుంగొని. 47

సీ. గురువులు బంధులు గొడుకులు నల్లుండ్రు
మామలు తాతలు మఱఁదులిట్టు

లార్యులు బావలు నన్నలుఁ దమ్ములుఁ
దండ్రులు సుతులుఁ దగు జనములు
వీరల నిందఱి వెస గిట్టి చంపెడి
కంటెను బాపంబు గలదె చూడ
నెవ్వఁ డేనియు నూట యేఁబది యేండ్లు జీ
వించునే ధ్రువమె యీ విభవ మెందు
గీ. శాశ్వతంబుగ నిలయేలఁ జాలె నెవ్వఁ
డఖిల నృపులకు మున్న రాజ్యాభి కాంక్ష
లేదె వారలు పోక యేలిరె ధరిత్రి
రిత్త సుఖమున కిట్టి దుర్వృత్తి తగదు. 48
వ. అని తలంచి. 49
చ. బవరమునందు భీష్మముఖబంధుజనంబుల హానినెంచి లోఁ
దవిలిన సంజ్వరంబునఁ బృథాసుతుఁ డక్షియుగంబునందున
శ్రుపులనుమోముసందుఁదఱుచుంగొనునిశ్వసితంబులన్ స్వబా
హువులనన్ ధనుర్లతికనోజ మనంబున ధైర్యమున్ విడెన్
వ. ఇట్లు శోక దందహ్యమాన మానసుండై కన్నీరు
రాల నరదంబు మీఁదఁ జదికిలం బడి గాండీవంబు ధైర్యంబు
తోడన విడిచి విషణ్ణుండై హరి నుద్దేశించి యిట్లనియె. 51
గీ. వనజనేత్ర యెల్ల వారిని వధియించి
కులము నీరు సేయు క్రూర కర్మ
మునకుఁ జొరఁగఁ జాల మజ్జగం బేలుట
గలుగునేని రణము కాంక్ష లేదు. 52

క. నెత్తుటఁ దడసిన యీాసం
పత్తియు వలదింక నడవి ఫల మూాలంబుల్
జిత్తం బలరఁగఁ గొని ముని
వృత్తిం జరియింతు రాజ్య విభవం బొల్లన్. 53

గీ. వనములోపలఁ బండ్రెండు వత్సరంబు
లుంటి మెచ్చుట నగునొ పొద్దుదయు మగుట
తెలియ కట్టిది సుఖముగాదే తలఁచినఁ
జుట్టములఁ జంపి తుదనేమి గట్టికొందు. 54

క. పరలోకము శాశ్వత మ
స్థిర మిహా లోకంబు దీనిఁ జింతింపక సం
గరమున నిందఱఁ జంపిన
దురితంబును దూఱు రెండు దొరకొనుఁ దండ్రీ! 55

వ. అని యనేక ప్రకారంబులఁ బలవరించుచుఁ బ
ల్కుచు దీనవదనుండై యున్న యన్నరునకు లోకేశ్వరుఁడగు
కేశవుండు నగుచు నిట్లనియె. 56

క. దెప్పరమై మొనఁ దలఁపఁడు
నిప్పుడు దయనేని భీతినేనిఁ దొలఁగినఁ
జప్పటులు జఱచి లోకులు
నిప్పగతురు నిన్ను నవ్వరే? గాండీవీ. 57

గీ. విప్రులకు నధ్యయనమట్లు విహితకర్మ
మవని పతులకు సంగ్రామ మంతు బుధులు

కలహమునకును జొఱకున్నఁ గలదె కీర్తి
పుడమి యందున నృపులకు భూరిశౌర్య. 58

వ. ఇదియునుం గాక దేహాభిమానంబునఁ బుణ్యంబు దొరకొన నేరదు సమయంబు దెలిసి మెలంగంబోలు నది యట్లుండె క్షేత్రజ్ఞుం డవధ్యుండగునే యని చెప్పి మఱియుఁ జంపెడివాఁడును జంపంబడువాఁడును లేఁడనియు నాత్మకు నాశంబును దేహంబునకు స్థిరతయు లేదనియుఁ బనులయందు నరుఁడు కారణమాత్రుండుగాని స్వతంత్రుండుగాఁడనియును నానా ప్రకారంబుల నుపనిషదర్థంబులం గల పరమరహస్యంబులు బోధించి వెండియు సచరాచరంబులగు భూతంబులు మదీయ రూపంబులు మద్వ్యతిరిక్తం బణుమాత్రంబు లేదు చూడమని దివ్యదృష్టిఁ బ్రసాదించి నిజ విశ్వరూపంబుఁ జూపిన నప్పరనుస నెందును అనేక బాహు పాద శీర్షంబులును అనేక నేత్రంబులునుఁ గలిగి గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాది దేవయోనులును గురు పాండవాది సకల జన నిచయంబును గిరి సరి దరణ్య సముద్రంబులునుఁ బృథివ్యాది భూతంబులును నిఖిల లోకంబులును లోకస్థ వస్తు జాతంబులును తదీయ దివ్య మంగళ విగ్రహంబై కానంబడిన వెఱగు పడి కరకమలంబులు ముకుళించి ఫల్గునుం డిట్లని స్తుతియించె. 59

దండకము.

శ్రీమన్ముకుందా! జగజ్జాల తుందా! త్రియీమూల కందా! నమస్యోని బృందా! మురారీ! హరీ! వాసుదేవాభిధా

నంబునం బొల్చు నిన్నెన్నఁగా శక్యమే? యాదిమధ్యాంత శూన్యుండ వాధార భూతుండ వత్యంత భిన్నుండ వై యుండియున్ సర్వ భూతాత్మకత్వంబుచే సంసృతిం బొంది నట్లుండుచుం బూర్ణ కుంభంబునం దోఁచు చంద్రుండు తద్వారి వాతాహతిం జంచలంబై నఁదానట్లనే కంప్రముం జెందు పోల్కిన్ సదా సాక్షివిన్ భర్తవున్ లోక సంహర్తవున్ సచ్చి దానంద రూపుండ వాద్యుండ వార్తా మర వాశ్రిత రక్షామణీ! దంభ గోపాలబాలుండవై చేయు నీలీల లగ్గింపఁగా వెగ్గలంబుల్ గదా ఘాతుక ప్రీతిచే వేత్రతయై వచ్చు నా పూతనం జంపవా! తుంపవా! బండి నా దండి సర్జంబులం గూల్చవా! కాళియుం బొల్పుఁదూలించియున్ నిల్పవా? శైలముం దాల్పవా! ఛత్రమై మిత్రమై మించ గాలించవా! బ్రహ్మనున్ వంచవా! ఆలఁ బాలించవా! భోజునిం ద్రుంచవా! తండ్రిఁ బోషించవా? భీష్మ కన్యన్ వరించన్ నృపాళిన్ వెసం గిట్టి నిర్జింపవా? చూడఁగా మానుషంబే భవల్లీల మూఢుండ సంసార మగ్నుండ దీనుండ నన్నాదరంబొప్పఁగాఁ దెప్పఁగాఁగొబ్బునం బారముం జేర్పవే? కోర్కు లీడేర్పవే! యాపదన్ దీర్పవే, దేవదేవా నమస్తే నమస్తే నమస్తే నమస్తే. 60

క. వనజాక్ష! నీదు రూపముఁ
గనుఁగొంటిం గనటు వాసెఁ గారుణ్యముచే
నను గావు తొంటి క్రమమున
జను నీమూర్తిన్ వహింపు శౌరి మురారీ!

గీ. చుట్టమనుచు నిన్నుఁ జూచితిఁ గాని నే
నెఱుఁగ మూఢబుద్ధి నెఱుకమాలి
కరుణ సేయునన్నుఁ గన్న వారినిఁబలె
కంసమథన చారు కంజనయన. 62

గీ. నాకు నెద్ది గతియొ నళినాక్ష ! యానతి
యిమ్ము నడుతు నట్ల యేను నీకు
శిష్యుఁడను గృతార్థుఁ జేసితి పరమ గు
హ్యంబులైన యట్టి యర్థములను. 63

క. అన విని హరి నిజరూపము
గొని పార్థునిఁ జూచి పలికెఁ గురుకుంజర న
న్ననిశముఁ గొలువుము భక్తిని
మనమలరఁగ నిఖిల భూత మయుఁడని వత్సా ! 64

వ. అని. 65

గీ. ఇంద్ర నందను నిట్టు లుపేంద్రుఁ డర్హ
భాషణంబుల నూరడఁ బల్క నతఁడు
తడవునకు నూఱడిల్లి కోదండ మొనర
గైకొనియెఁ గ్రమ్మరను రణ కౌతుకమున. 66

వ. ఇట్లు ఫల్గునుండు శర శరాసనంబులు గైకొని రణం
బునకుఁ దొంటికంటె గడు మిగిలె నయ్యుభయ బలంబులు
సమర కౌతూహలంబుల నుల్లసిల్లె నంత. 67

చ. కరి మతి దీర్ఘ భావమునఁ గన్పడు దేవనదీకుమార దు
స్తర జయ కేతనాంకఘన తాళకుజాసిత కాంతియొప్పె నం

గర ధరణీ స్థలిం జెలిమి క్షత్రియ బిడ్డని బాహువీర్య మా
దరమునఁ గన్గొనన్ సురపథంబుననిల్చెకళిందకన్యనాన్.

మ. సమరారంభ భటార్భటీ పిశునతా సంవర్ధ మానంబులై
శమితాన్య ధ్వనులైన జైత్ర ఘన నిస్సాణాది వాద్యైకశ
బ్దములోలిన్ బహుదీర్ఘమార్గముల చేతంబొందునాయాసమున్
శమియింపంబలెఁజక్రవాళనగ భాస్వత్కందరాళింబడెన్. 69

చ. ఘన రణ భేరికారవము కర్ణములం బడ నెల్ల వేలుపుల్
మునుగృహముల్ కవాటములమూసిమహారభసంబుతోడసం
దన వనపుష్ప సంచయముఁదద్దయుఁ గైకొనిమింటనిల్చిరా
జిని బహు వీర కోటి నభిషేచన మొప్ప నొనర్ప నత్తఱిన్.

చ. మఱియుఁ బరస్పరంబగు విమర్దముచేఁ గడుఘర్మబిందువుల్
తఱుచు జనింప నంగములఁ దజ్జల మెల్ల నడంపఁగా దివిన్
నెఱిఁ బురుహూతముఖ్యులగునిర్జరులందఱు తాళవృంతముల్
తఱిఁగనివూనవాయువులు బూనెను దామును దక్రమంబునన్.

గీ. గర్జితంబులు ధనువులు గ్రాల నుభయ
బలము లంతంత చివ్వకై కలయఁ బారె
సారిది బ్రాక్పశ్చిమాఖిల చోదనమున
ఘనము లొండొంటి మింటను గదియు కరణి. 72

ధావత్స్యందన కేతనాంశుక మరుద్వ్యాధూతకృతౌఘోజ్జ్వల
ద్దేవదీపవతీ పయః కణములుం దీప్యచ్ఛరత్తూణాల తా
రా వారాభరణ ద్విపేంద్ర కరసాంద్రక్షిప్త దానాంబువుల్
దైవారం గన నొప్పె భేద మలినం తానానురోధ స్థితిన్.

క. పాండవ కౌరవ సేనలు
భండనమున కప్పు మద్ది బడి కమవడి ను
ద్దండతఁ బోరఁగఁ జొచ్చెను
జండతర ప్రభల నస్త్ర శస్త్రము లొప్పన్. 74

వ. అంత. 75

సీ. ప్రథనమేదిని నెదుర్పడి మూర్కొనఁ గడంగు
పృథు గజేంద్రము నొక్క ప్రథిత బలుఁడు
కని వేగ రథ పథంబున మీఁది కెక్కి త
దా రోహకునిఁ జంద్రహాసమునను
నఱికి క్రిందికిఁ ద్రోచి నెఱి నట్టహాసంబు
నెఱయ స్కంధంబున నిలిచి కుంభ
యుగ సమాస్ఫాలన మొగిఁ బలుమారును
జేయు నప్పర వీర సింహుఁ గాంచి

గీ. మింట నొప్పెడు నిర్జర మీన నయన
కఠినతర చారు వక్షోజ కలశ యుగళ
పాళి యందులఁ గండూతి భారమగుచు
దళము కొనియెను కడు నద్భుతంబు మీర. 76

క. కరి యొకఁడర్యసిచేఁ దన
కరము మొదల్ ముట్టఁ దెగినఁ గడు క్రుంగిరి-తే
గిరము నిషాదిక రచ్యుత
వర సృణి రదనమున మొగుడి వానికి నిచ్చెన్. 77

గీ. భసిత లేప సితోన్మదే భములు రెండు
తత పరస్పర దత్త దంతములఁ బోర
హరి సమారూఢ వాహనుం డయ్యెఁ జూచి
సరభసంబున నటనిల్పె సకలదృష్టి. 78

గీ. ప్రతి గజాఘాత భగ్నైక రదన ముసల
చారు కుంభాగ్రగత సృణి చంద్రరేఖ
యగుచు నొక్కింత శివు సమమై గజేంద్ర
మొప్పె గణపతి సారూప్య మొందినట్లు. 79

సీ. మరి యొక్క సామజం బుఱికి వే పఱతెంచి
పరిపంథి నృపవర బలము నందుఁ
దన యేలికను బుడమినిఁ బడవైచి య
చ్చట నిజ స్కంధ విశాల తలము
నధివసించిన యట్టి యరి మహీపతిఁ దెచ్చి
యాత్మ సైన్యమునందు నట్లువైచి
దురమున నిబ్బంగి దుస్సాధరోధమై
దవ్వుగా నంకుశ ద్వయము విఱిచి

గీ. పారవైచి మీఁద భయ విభ్రమంబులు
గల నిషాది వరుల కాళ్ళు సెదరఁ
దిగిచి సకల జనుల నగవున కెంతయుఁ
జాలఁబాత్రమగుచు సంచరించె. 80

గీ. లగుడ తాడన పీడితు లగుచుఁ గరుల
తలల తలకిందుగాఁ బడు తన్నిషాదు

లొప్పి రావ్యథఁ బాప మదోజ్జ్వలస్ర
గంధము లవంగి మూర్కొను క్రమము దోఁప. 81

వ. వెండియుఁ బ్రచండ వేదండ మండలంబు నుద్దండ భండనంబులనొండొంటు నండ విడక శుండా దండంబులు శుండా దండంబులఁజుట్టి, దంతంబులు దంతంబులం బెనిచికర్ణంబులు కర్ణంబుః సమకట్టి, పదంబులు పదంబులందొక్కి వాలంబుల వాలంబులఁ గీలుకొల్పి రెండేనుఁగులుకలఁపడి శిక్షితంబునుంబో లె నంగ యుద్ధంబు సమృద్ధిగాఁ జేయునెడ నిశిత రిపువిశిఖము ఖాపహృత మస్తకులగు హస్తిపుల కళేబరోత్క్రాంత ప్రాణ వాతంబులు కరటి ఘటా మదజల సౌరభ సంవర్ధమానంబు లై కపోలస్థల కుచ కలశ స్వైరవారి ప్రవాహం బప్పటప్పటికిఁ గోలుచు నభంబున సమ్మర్దంబుగా నెసంగు దివిజ గజ రాజ యానల తాలవృంత కృత్యంబు లొనరించె నంత. 82

గీ. హరులు రెండాజి నాభి ముఖ్యముగ నిలిచి
యగ్ర పదయుగ్మ మెత్తి యన్యోన్య హేతి
పతనములు సాదులకుఁ బాపు భంగి నూర్ధ్వ
కాయములు నిక్కఁ జరమాంఘ్రి కవను నిలిచె. 83

చ. ఉరురిపుఖడ్గధార తగనొక్కటియయ్యు రణంబునందుఁ దా
సరగున నైదుధారలఁ బొసంగు హరిం దలఁదెంచె నన్యదు
స్తర తరమైన ప్రాణముల వాలెనుగాని తదీయరక్తముల్
గరమొకలేశమాత్రమును గైకొని కోలఁగ మానెన త్తటిన్

చ. మరకత నూత్న రత్న రుచిమండిత సాది విభూషణావళీ
స్ఫురదురుకాంతిమధ్యమునశోభిలెనొక్కమహాహయంబుభా
స్కరునిరథంబుఁ బాసి భటసంఘ సముద్ధత చంచలక్రియన్
ధరణితలంబునంబడిన తన్మహనీయ తురంగమో యనన్.

మ. వరసంగ్రామ ధరాంగణోల్లుఠిత దుర్వారాసృగంబూల్లస
త్సరిదావర్త గభీర గర్త పతి కాశ్వస్థూల కాయావళుల్
కరమారం దిరుగంగఁజొచ్చె మును శిక్షాప్రౌఢిచేఁగాంచుదు
స్తరమామండలచంక్రమభ్రమమునోజంజూపుచందంబునన్

మ. ధృతివిల్కానినిఁజాపవంతుఁడనుగుంతింగుంతిఁజక్రాయుధుం
ధృతచక్రాయుధుఁడున్ గదింగదిఁగృపాణింఖడ్గియన్యోన్యము
ద్యతశస్త్రాస్త్రదృఢప్రయోగములచేతన్ హంతృవధ్యత్వమున్
జతనంబై తగబోధపంక్తియుఁబ్రతిష్ఠంబోరెద్వంద్వస్థితిన్.

వ. అట్టిసమయంబున.

ఉ. భీముఁడురౌద్రమూర్తియయిపేర్చి మహోర్భటిఁజేయ విద్విష
త్సామజ ఘోటకంబులకు సారెకు గుండెలుఁమోది కౌరవ
గ్రామణియల్లి తమ్ములను గాన్పుకుమారునిఁజంపఁబంపుచున్
స్తోమముగా గడంగిరని చూవరు లెల్లను సన్నుతింపగన్. 89

వ. ఇట్లు దుశ్శాసన దుర్ముఖ దుర్మర్షణ దుష్ప్రహ
వివింశతి వృషసేన, చిత్రసేన పురుమిత్రులెదిర్చినసా వృకోద
రునిఁ దలఁగడచి నకుల సహదేవ ధృష్టద్యుమ్న సౌభద్రుల
క్కురుకుమారులం బొదవి శరంబులు బఱపిన నయ్యలుఁగుల
పంక్తి పఙ్క్తరంబుఁ జూడ నుప్పరం బెక్కిన కాళిందీ ప్రవాహం

బునుం బోలె బదఁపడి సుయోధనుండు తత్తిమినఁ గరి తురగ
రథంబుః లొక్కఁ పెట్టునఁ బెంపరంబుగా నడిచిన గని ధర్మజు
పనుపునఁ బాండవ బలంబు నురవడించె నంత. 90

సీ. అత్తొలి తాఁకున నడరిన పెంధూళి
మేలుకట్టై యొప్పె మిన్నుఁ గలయఁ
కరి శీకరంబులం దురగలాలాతతి
నస్రధారల చేత నదియడంగె
విరిగెడుచాపముల్ ప్రీలెడి సత్త్వముల్
తూలెడు మొండెముల్ దొరలు తలలు
నొకఁడు పదుంద్రు నూర్గొలి సుద్దులుగాఁగఁ
దొడరిన పోరాట తుములమయ్యె

గీ. దళిత కుంభ స్థలాశ్వ మస్తక కపాల
చటచట ధ్వానములు సింహ శంఖ నాద
ములును శస్త్రాస్త్ర ఘట్టనోద్భూత రవము
లాకసముఁ దూటుగట్టె నయ్యాజిఁ బెలుచ. 91

వ. మరియుఁ గృతవర్మ సాత్యకులును, బృహద్బలాభి
మన్యులును, దుశ్శాసన నకులులును, దుర్ముఖ సహదేవులును,
శల్య యుధిష్ఠిరులును, ద్రోణ ధృష్టద్యుమ్నులును, భూరి శ్రవో
మాగధ సహదేవులును, బాహ్లిక ధృష్టకేతులును, అలంబసఘ
టోత్కచులును, అశ్వత్థామశిఖండులును, కృప బృహత్క్షత్రులు
ను, వికర్ణ యుధామన్యులును, సుశర్మచేకితానులును, సుదక్షిణ
శ్రుతసోములును శ్రుతాయుఁ డిలావంతులును బిందానువింద కుం

తిభోజులును గలసి యివ్విధంబున రెండుసేనల గల దండిమగ లొండొరులును గరి తురగ రథ పదాతులును దలపడి రవ్వడు రథరథ్య సారథులతోడఁ దొండంబునఁ జుట్టిపట్టి కాలం బెట్టిఁనేల జమరుచు మట్టి మల్లాడు మాతంగంబులును తెక్కలు గల పెనుబాముల కైవడి దాఁటుచు రేచిత వల్గిత ప్లుతంబును లో నగు ధారావిశేషంబులను మండల భ్రమణంబులను ఖురపుటం బులచే రిపుల తలలూడఁ జిమ్ముచు గ్రమ్మరు తురంగంబులును యిరకటంబులఁ జాపకట్టువడు ప్రజల నుఱముగా నక్రభ్రమణ వేగంబునఁ దిరుగు తేరులును సాదన మేరువడి దిరిగి పరశస్త్ర ప్రహరణంబు లఁ దప్ప నుడ్డికొని పోవుచు వీర్యభటులును దల గయు మున్ను కన్నిడిన ప్రతిభటునిఁ బొడుచు వారును కాలు దుసిసియుఁ ద్రెళ్లక శత్రుని లంఘించు వారును భుజదండం బులు ఖండితంబులయ్యును బద ఘట్టినంబులు చూపు వారును దెగిపడియు నవ్వుడు కఱచు తలలును బొమముడిగొను తలలును నావులించు తలలును మెడదెగియు సాదినివైవక గతి విశేషం బుల మెరయు హయంబులును దునియు విండ్లును దుమురగు శస్త్రంబులును తుండెంబులగు సిడంబులును సీరగు తేరులును ద్రెగ్గుసామజంబునును ప్రగ్గుభటులును పరియలగు గొడుగు లును శకలంబులగు మైమఱుపులునునై నెత్తుట జొత్తిల్లివండ్లం దరిగిన మాంస ఖండంబు చందంబున ననేక బలంబుమడిసె నయ్యవసరంబున.

క. పలపలని మూఁకబోవక
తలపడి పోరాడ శోణితపు వెల్లువ మూ
కల ముంచి తేరులను నా
వల క్రియఁ దేలింపఁ ఘోరు వరదం బోయెన్. 95

ఉ. పట్టిన నైత్రుణంబు గనుపట్టఁగ సాదులు బోరుచుండ న
ప్పట్టున శాత్రవుండు తలబాయఁగ వైచిన నేల గూల క
ప్పట్టినవై ఖరుల్ నెఱప వాజిని వాని దళంబులోపలం
బెట్టిన నాత్మసైన్యముల పించ మడంచెను దేవతల్ నగన్.

వ. అప్పుడు.

ఆ వె. సింహ కేతనంబు చెలువార భీముండు
భీష్ముతోడ ననికిఁ బేర్చుటయును
వారి ఘోర విశిఖ వైఖరు లమరులు
చూచి రాత్మలందుఁ జోద్యమంది. 96

క. కృపుఁడు బృహత్క్షత్రుండును
విపు లాస్త్రము లొండొరులకు విఱుగ విరథులై
చపలాభ ఖడ్గములు గొని
విపులకు వడిదాఁటి పోరు వెస సల్పిరొగిన్. 97

గీ. భీష్ము గడఁకఁ దాఁకి బీభత్సు సుతుఁడభి
మన్యుఁ డతని సిడము ద్రుంచెను ముదుని మొ
కౌరవేంద్రు భూరి గర్వంబు ద్రుంగిన
భంగిఁగూలెఁ దాడి పడగ భువిని. 98

క. సుర సరిదాత్మజుఁ డుద్ధుర
శర సంహతిచేత నవుడు సౌభద్రుని దు
స్తర కేతువు నఱికె యతని
యురమనయంగ గ్రుచ్చెఁ బెలుచ నుగ్రాస్త్రములన్. 99

క. తనయుని కడఁ దిగుచుచుఁ బా
వని గంగాసుతుని విశిఖ వర్షంబున వే
జోనిపెను శల్యుఁడు విరటుని
తనయుని నుత్తరునిఁ దాకె దారుణ భంగిన్. 100

గీ. వార లిర్వురు నన్యోన్య వర్మ చర్మ
కార్ముకంబులు దునియ సంగరమొనర్చి
మద్ర నాయకుఁ డురుశక్తి మాత్స్య సుతుని
పైవ నాతఁడు గూల్చెను వైరు లార్చ. 101

వ. ఇట్లుత్తరుండు బడిన తదీయ సోదరుండు శంకుం డ
నేక రథ ప్రతతితోడ నురవడించుటయు శల్యుండు కృతవర్మ న
రదం బెక్కి భీష్ముం డతని కడ్డపడినఁ గిరీటిం గాంచి యాపితా
మహు నెదిర్చిన నతండు బాణాసారంబులు బరగించె నంత మ
ద్రపతి గదా దండ మండిత భుజుండై శంకునిఁ బరిమార్చినఁగ
నలి ధృష్టద్యుమ్నుండు మార్బలంబులం బొదివి కార్చిచ్చువని
నేర్చు చాడ్పున నప్పు డబ్బలంబు పాయవడి భీష్ము మఱువు
సొచ్చిన. 102

గీ. దుృపద నందన బాణ పంక్తులను నొచ్చి
మోలి నార్తినిఁ బడు తన మూఁకఁ గాంచి

ఘోర ఘోషంబు గావింటి గుణము మ్రోయ
నలుక భీష్ముఁడు పార్థ సైన్యముల కెదిరె. 103

గీ. పృథులతర సింహనాదుఁడై భీష్ముఁ డపుడు
వింటి తెగ నిండ బాణముల్ విడిచి తొలుత
పరుల నిర్జించె నప్పరః పంక్తి పిదప
వరులు నార్జించె నెమ్మది వచ్చునట్లు. 104

గీ. పాండుపుత్త్రుల సేన లోపలనుఁ గడఁక
వేరు వేరుగ నాతని విశిఖ వితతి
గజములొక వేయు ఘన తురంగములు వేయు
భటుల నొకవేయు ధాత్రిపైఁ బడఁగ విడిచె. 105

చ. అనిమొనమున్ను భార్గవుని ప్రాణముమూర్కొనిచూచిరో యిసీ!
యనుచును గ్రమ్మరన్ విడుచునట్టి నదీసుతుబాణజాలముల్
మునుమును వైరి మస్తక సమూహములంబడవైచి పోవగా
గొనియెను దచ్ఛిరంబులను గొబ్బున భూతములాహవస్థలిన్

క. ధృష్టద్యుమ్నుని సమరా
వష్టంభత గుఁచి మించి వరభుజ శక్తిన్
దృష్టిం బడురిపు నృపులను
నష్టము గావించెఁ బెలుచ నదికొడుకు వడిన్. 107

గీ. ఇట్లు సోమాన్వయుం డనిసేచె ననెడి
తలఁపుచేఁ బోవు మాడ్కిని ధరణి వేగ
గ్రుంగెఁ బాండవ సైన్యంబు పంకజంబు
భంగితో వభంగి పౌరవ బలముఁ దనరె. 108

వ. అంతఁ దమం బగుటయు జయవంతుండగు శాంత నవు తోడం గలసి కురుపతి హర్షాయత్త చిత్తంబున నిజబలంబుల మరల్చికొని శిబిర ప్రవేశంబుచేసి యథావిధిం బ్రవర్తించె పాండవులును విన్ననగుమూఁకల తోడ విడిది కరిగిరప్పుడు 109

క. ఆరాత్రి ధర్మ తనయుఁడు
భారంబగు చింతతోడఁ బద్మదళాక్షా
గారంబున కరిగి నయం
బారఁగ దైన్యమున నిట్టు లనియె నతనితోన్ 110

సీ. కార్చిచ్చు కాననంబేర్చు చాడ్పున భీష్ముఁ
డేపున మన సేననెల్ల నడచె
నలవి యెఱుంగక నతని సామాన్యునిఁ
గాఁజూచి కడఁకతోఁ గలహమునకుఁ
గ్రీడియామేటిని గెలుచునంచును నమ్మి
కనియుంటి నితఁడేమొ గాక పోయె
నొక భీముఁ డొడలు దాపక పోరెఁ బోరిన
వాఁడేమి సేయు దుర్వార బలుని

గీ. రాచ కొమరుల నెల్ల నరాతికిట్లు
కోరువెట్టఁగ జాలనో వారిజాక్ష
యడవి కేఁగెదఁ గ్రమ్మర నచట మెలఁగి
కాయ గురుబుల ప్రొద్దులు గడపువాఁడ. 111

ఉ. నా విని కృష్ణుఁ డిట్లనియె నాకథు నీసుతుఁ డెంత వంతలం
బోవకు సాత్యకి ప్రభృతి భూమితల్ భవదీయ సోదరుల్

కేవలులే? శిఖండియును గేకయులుం ద్రుపదాత్మజుం డనిం
బోవరు మిమ్ముపైఁబడిన భూవర సంపదఁగూర్పకుండగన్

క. అన విని ధృష్టద్యుమ్నుం
డనియెను ధర్మజుని తోడ ననఘా! విమమిా
యని మొన నా మొగమునఁ బడి
చనఁ గలఁడే రుద్రుఁడైన సమయక పెలుచన్. 113

క. అని యంద ఱన్ని తెఱఁగులఁ
జను దెఱఁగులఁ బలుక ధర్మజాతుఁడు కృష్ణుం
గనుఁగొని నీచెప్పిన తెరు
వనయము శుభమగును దాన నలరుదునేనున్. 114

వ. అని పలికె నట్టి సంగర సముత్సాహ వాక్యంబులఁ గలంకఁదీరి సంతసిల్లి ధర్మజుండు దామోదరు వీడ్కొని వారల నిజావాసంబులకుఁ బోవం బనిచి యభ్యంతర మందిరమున సుఖనిద్రఁజేసి మరునాఁడు ప్రభాతంబున మేల్కని కాలోచిత కృత్యంబు లాచరించి బల సమన్వితుండై పోరికలనం బొలిచె. ధృష్టద్యుమ్నుండు నృపుననుమతిచేఁ గ్రౌంచ వ్యూహంబునమ కట్టి తోరిటిఁ గిరీటియు, నేత్రంబులు గుంతిభోజ శైబ్యులును, చూడా కలాపంబు దుప్రదుండును, కంఠంబుదశార్ణ కిరాతాధిపతులును, పక్షద్వయంబు ధృష్టద్యుమ్న భీమసేనులును, సౌభద్ర సాత్యకిఁ ద్రౌపదేయ పుండ్రగౌళ పాండ్యులును, నకుల సహదేవ శంబరమాత్స్యులును, వారి కిరుపెలకుఁ బ్రాపైఁ బొలిచిరి. పాదంబులు కేకయ విరాటులును, హూణపతి ప్రముఖుల

తోడ యుధిష్ఠిరుండు వెన్నుగానున్న నరయోద్ధాణంబుఁ గని కౌరవులును మూఁడు మొనలుగా నొడ్డి దుశ్శాసన వికర్ణ నందోపనంద సూరసేన యవన త్రిగర్తులు దాఁపటను, ద్రోణాచార్య కుంతల దశార్ణ విదేహ గాంధార సింధుపతులు వలపటను, గాంగేయుండు చతురంగ బలసమేతుండై నడుమను కృతవర్మ శల్యా శ్మంతకులును, గొందఱు తమ్ములును, గూడి రారాజు వెనుకను నిలిచి రయ్యుభయ సైన్యంబులు తూర్యంబులు మొరయ మంధరమంథానమథిత మహాసముద్ర ఘోషంబుగా నొండొండు గదియ నడచి తలఁపడిన సంగ్రామంబు భీమంబై చెల్లె నాసమయంబున. 115

క. ఎఱకలు కంఠము ముక్కును
బఱియలునై యొక్క పాయఁ బడ భీష్ముఁ డొగిం
గొఱియల పిండున బెబ్బులి
యుఱికి తెరల్చిన విధంబు నొనరించె వెసన్. 116

క. బలితంపుఁ బోరి నెట్టన
వలలోపలఁ జొచ్చి చించువలె భీష్ముండా
బలములఁ గలచినఁ గవ్వడి
యలిగి రథం బతని దెసకు నడరించెఁ దగన్. 117

గీ. ఇట్లు మార్కొను నర్జును నేచి ద్రోణ
శల్య కృప ముఖ్యు లస్త్ర వర్షముల ముంప
నీఱుపైఁ గప్పియున్నట్టి నిప్పు వోలి
మథిత రిపుఁ డయ్యెఁ బొగలేని మంట వోలె. 118

క. మాద్యద్గతి సాత్యకి ధృ
ష్టద్యుమ్నులు మత్స్య పతియు సౌభద్రుండుం
బ్రద్యోతన మూర్తులగతి
నద్యాత్మజ ముఖ్య శత్రు నాథులఁ బొదివెన్. 119

క. సురసరి దాత్మజుఁ డర్జును
నిరువది దన్నడరు నృపుల నేసిన రుధిరో
త్కరము దొరుగంగఁ గుసుమిత
వర కింశుక తరువు లట్ల వరలిరి వారల్. 120

గీ. నరుఁడు బెట్టల్కచే దొడ్డ నారసముల
నొంచి క్రిమ్మఱ శాత్రవ యోధవరుల
నిడుద వాలంబులను గేతు నిచయములను
పైఁ బ్రదేరులు మోఁడులై వారి కమరె. 121

క. అక్కవ్వడి గాంగేయుఁడు
నెక్కువ తక్కువలు లేక యేవునఁ బోరం
గ్రిక్కున మారుతి నదిసుతు
నక్కజముగఁ దాఁకెఁ గ్రీడి యాతనిమానెన్. 122

గీ. ఫల్గునుఁడు శత్రు బలములపైఁ గడంగి
యంప గమిచేతఁ గరచరణాదిగాత్ర
ములను ఖండింప గోవులు పులినిఁ గాంచి
బెదరుగతిఁ గౌరవావళుల్ చెదరి పఱచె. 123

గీ. అట్లు బారి యోడ యంబుధిఁ బగిలిన
దీవి చేరు ప్రజల తెఱఁగు దోఁప

ఁ డండఁ జెంది బెగడక యుద్ధతిఁ
గాలు దన్ని నిలిచెఁ గయ్యమునకు. 124

క. పెలుచ నదీసుతు సూతుని
తల మారుతి నిడుద కోలఁ దఱిగిన రథమా
కులత హరులీడ్చికొని పాలి
కలనికి దూరముగఁ బఱచె గర్వము దూలన్.

క. కలభతతిం గాళింగుఁడు
గొలువుచుఁ బఱతేర నిడుద కోలల నతనిం
బొలుపఱ నేయుడు మఱి న
బ్బలియుఁడు పావని రథంబు భగ్నము సేసెన్. 126

మ. విరథుండై గదకేలఁబూని పెలుచన్ వేదండ తండంబులన్
గరముల్ కాళ్ళునుస్కంధముల్ జదియదోర్గర్వంబునన్ మోదిభీ
కరుఁడై గిట్టి కళింగనాయకుఁడు శోకంబందఁదత్పుత్రి సో
దరులంద్రుంచెనుభానుమత్ప్రముఖులందర్పంబుదై వారఁగన్

గీ. పులుఁగు వీఁగిన కై వడి నిలను బడియుఁ
బొలిసియును బారియును జెడిపోయి కరులు
చెల్లె, దళములు నప్పుడు డిల్లపడియు
బల్లటిలి తల్లడిల్లియుఁ బఱచె నఱచె 128

వ. ఇట్లు భీమ విహారంబున భీమసేనుండు మార్బలం
బులదోర్బలంబులఁ గుంచి నొంచిన నొచ్చియు విచ్చియుఁ
జచ్చియు నుబ్బుసెడిన ధృష్టద్యుమ్నుం డతని నగ్గింపుచుఁ దన
యరదంబున నెక్కించు కొను నంత నొండు తేరాయితంబు

చేసికొని సూతుండు దెచ్చుటయు నధిరోహించె నప్పుడు. 129

క. గురుసుతుఁడు కృపుఁడు మద్రే
శ్వరుఁడును మిఱుమిట్లు గొనెడి శాతశరములన్
సరగునఁ బాండవ బలములఁ
బరిమార్పఁగ నలిగి పృషత పౌత్త్రుం డలుకన్. 130

ఆ. వె. పెలుచ వెన్ను దన్ని భీముఁడు పఱతేరఁ
దేరు బరపి వారి తీవ్ర బాణ
సమితి రా వడిగను జక్కడగింపుచు
ద్రౌణి రథ్యములను దలలు నఱికె. 131

క. సరభసమున మద్రేశ్వరు
నరదము గురుతనయుఁ డెక్కి యలుఁగుల సోనల్
సరగువను గురిసె నమ్మ
ర్వ్వర ధృష్టద్యుమ్నుఁ డట్లు పురికొని పోరెన్ 132

గీ. అనిని లక్ష్మణుండు నభిమన్యుచేఁ జిక్కి
బడిన కురువిభుండు వాని మీఁద
గురు కృపాది యోధ వరులతోఁ దాఁకిన
నతఁడు పోరె శౌర్యమలర నపుడు. 133

క. తనయునిఁ బలువురు పొదివినఁ
గనుగొని ఫల్గునుఁడు తేరు గగనంబువ వ
చ్చిన క్రియఁ బఱపుచు వారల
నని మార్కొని పెనఁగఁ జొచ్చె నలఘు స్ఫూర్తిన్. 134

వ. అట్లు గడంగి. 135

క. కరములు శిరములు కంఠము
లురములు కరితురగ చయము లుజ్జ్వల నానా
శర చాప శస్త్ర కేతన
పరికర ఖండముల భూమి భాగముఁ గప్పెన్. 136

వ. అంతఁ బ్రొద్దు గ్రుంకుటయు భీష్ముం డతని విక్రమంబు మెచ్చుచు నృపసహితుండై బలంబులఁ దివిచికొని శిబిరంబునకుఁ బోయె. పాండవులును సముత్సాహ సమేతంబుగా విడిది కరిగిరి. మరునాఁడు గాంగేయుండు గరుడ వ్యూహంబుఁ బన్ని దానికి గురు కృత వర్మలు కన్నులును, కృపాశ్వత్థామలు శిరంబును, త్రిగర్త భూరిశ్రవులును, శల్యభగదత్త జయద్రథులును కంఠంబును, అనుజ సహితుండై రాజు వెన్నును, విందానువింద కాంభోజ శూరసేనులు పుచ్ఛంబును, మాగధ కళింగాదులును, కర్ణాట కోసలాదులును, రెండు ఱెక్కలును, దాను జంచూపుటంబును, దక్కు వారు గలయ నంతటనుగా నొడ్డి నిలిచిరి. పాండవులు నర్ధ చంద్ర వ్యూహంబు సమకట్టి భీమసేన పాండ్య మాగధులు దక్షిణ శృంగంబును, ద్రుపద విరాట నీల కాశ కరూశ ధృష్టద్యుమ్ను లుత్తర శృంగంబులును, నచ్చటన కిరీటియు ఘటోత్కచ ప్రముఖులును, వేదండ తండంబులును యుధిష్ఠిరుండు నడుమను వలయునెడఁ దగువారునుగాఁ బన్నిరి. శంఖ భేరీ ప్రముఖ తూర్య రవంబులు మిన్ను దీటుకొన నారెండు సేన లొండొంటిఁ దాకు నప్పుడు. 137

గీ. ధూళి వెల్లు రేఁగి హెళిఁ గప్పిన నప్డు
చూపు లడర కుండఁ దూపు లడరెఁ
బేరు బిరుదు వెలసి పెఱ వీరు లంచును
బలము పోరుచుండెఁ జలము మెఱసి. 138

క. అయ్యెడ నెత్తురు చేతం
జయ్యన నాదువ్వ యడఁగ సైన్యంబులకుం
గయ్యము సేఁతకుఁ జొక్కం
బయ్యెను ఖచరులకుఁ జూడ నయ్యెం బేర్మిన్. 139

గీ. బలిమి నరవాయిఁగొనక యుప్పాండవేయు
లొండొరుల కంటెఁ దల మీఱి యుగ్ర భంగిఁ
గురు బలంబుల నొక సడ్డ గొనక నాడు
లడపఁ జొచ్చిరి గుండియ లవసి పఱవ. 140

క. నెత్తురు టొగ్గిలి పుత్తల
బొత్తల పడి డొంకి పోవ భూతము లార్వన్
జిత్తములు దలఁకిఁ గౌరవు
లత్తఱిఁ గడుగుడుసు వడిరి హాహా యంచున్. 141

చ. ప్రతి దమ కెందులేక వడిఁ బాండుసుతాగ్రణి సేనలిట్టు ను
ద్ధతిఁగడుదొంగిలించి బెడిదంబునఁజంపఁగఁ బీన్గుడొక్కలన్
వెతలను గుంది పెల్లొదిగి పేఁగుచుఁ బారెడు సేనఁజూచి తా
నతి రభసంబునం గురు నరాధిపుఁ డా నదిపుత్త్రినిట్లనున్.

గీ. కర్ణు విడిచితీవు కలన జయించి యీ
పృథివి యెల్లఁ గట్టి పెట్టు దనుచు

నేను గార్య భరము నీతలఁ బెట్టితి
నమ్మి యుంటి రిత్త నుమ్ము చూడ. 143

క. మన బలము మిడుకమిడుకఁగ
జనవల్లభ ! మూర్తు రిట్లు సంపఁగ నీము
ఱ్ఱున నూపిరి గలిగియుఁ బై
కొని పోదువక యుంట మేలె ? కురుకుల వర్యా ! 144

వ. అనిన విని పితామహుం డిట్లనియె. 145

క. భూనాయక ! నను నూరక
పోనాడకు మోపినటు పోరాడుచు న
న్నానిప్పు డెసకమెసఁగం
గా నానా శస్త్రములను గౌంతేయులతోన్. 146

చ. వగవకు చూడు నాబల మవారణతం పర వీర కోటులం
దెగిపడ నేతునంచును నదీతనయుండుమహోగ్రమూర్తియై
పగరపయిం గడంగి శరపంక్తులు గుప్పుచు వాజివారణా
దిగణము గుప్పగూల్చెను విదిల్చెనువీరభటప్రతానముల్.

క. గిఱికొన్న కాలు బలములు
పఱియలు బడు తేరుగములు పరిపరి గతిచే
నఱిముఱిఁ ద్రెళ్ళు గజంబులు
గుఱుకొని తెగి కూలు భూరి ఘోటక తతులున్. 148

గీ. అతని కోపాటంచి యడరున విఱిగిన
బలము కాలి మట్లఁ బడిన ప్రజయుఁ

జదిసి సమసెఁ బెక్కు సామజ ఘోటక
ప్రతతి తోడఁ గూడ భండనమున. 149

వ. అయ్యవసరంబునఁ దునిసిన వింట్లును దునియలగు సిడంబులును గొడుగుల శకలంబులును జర్మంబుల పఱియలును వర్మంబుల తునుకలును అఱదంబుల ఖండంబులును, ఆయుధంబుల నుగ్గులును మేదోమాంసంబుల రొంపులును తోడవుల రత్నంపు టిసుక తిన్నెలును శిరోరుహంబుల నాచును ఏనుఁగుపీనుంగుల గండశైలంబులును తురగ కబంధంబుల మకరంబులును జనభుజంబుల మీనంబులును భేరీ డిండిమాదులు మండూకంబులును నిస్సాణ ఝల్లీ రవంబులును పుండరీకంబుల డిండీరంబులును కపాలంబులు కమఠంబులునురుధిరంబు నీరంబునుంగా నపూర్వ శోణిత సింధువుం బోలిన నందు భూతంబు లార్పులు సెలంగఁ జుట్టంబుల విందులకుం బిలిచి నంజుళ్ళు నమల నిచ్చుచు మెచ్చులు వడయుచుఁ దద్రుధిర ప్రవాహంబుల నోలలాడుచుఁ గురుపాండవులమని రెండు తెఅంగుల నిలిచి నెత్తుటం జల్లు పోరాడుచు నెప్పటికిట్టి కలను వలయు నని కోరుచుఁ గోలాహలంబులుసేయు నమ్మహాభైరవ సంగ్రామంబునఁ బఱచు పాండ్య మాత్స్య కేకయాది నానా భూనాయకులఁ గని సాత్యకి యదలించి మున్నిచ్చిన బాసలు వీటం బుచ్చి పాఱెద రిట్లులగ్గగునే ? ఏను గలుగనేల వెరచెదరు మరలుండని చేవీచి పురికొలుపుచుఁ దన యరదంబు విప్వచ్చు రథంబునకుఁ దలమీఁరి భీష్ము దెసకుఁ దోలించిన త

మ్మునిఁ గనుంగొని దామోదరుం డిట్లనియె. 150

గీ. వెఱచి పాఱిపోనఁ బిఱికిమానిసుల నీ
వేల ? పొడువుఁడనుచు జాలివెట్ట
బోవ నిమ్ము మఱియు నీవును వారును
పోవ నేమి వలదు పొడువుమనఁగ 151

గీ. పూటఁబడితి ధర్మపుత్త్రుని సిరులకు
నిపుడ శత్త్రుకోటి నేపడంతు
ధార్తరాష్ట్రుఁ డెట్లు ధారుణిఁ బాలించు
వాఁడొ దీనిఁ జూడవలయుఁ గాక. 152

వ. అని పల్కి సంరంభించి 153

సీ. పుండరీకంబును బోని కనుంగవ
కెందమ్మి రేకులఁ గ్రేణిసేయఁ
బలుచని చెమటలఁ బొలుచునాసిక నును
మంచొందు తిలకుసుమమును నవ్వ
జాబిల్లితో నెకసక్కె మాడెడు మోము
గండుగాఁ గోపాగ్నిఁ గడకు నొత్త
బిగియించి చుట్టిన పీతాంబరము చెంగు
తోఁకరి మెఱుపుల త్రుళ్ళడంప

గీ. బొమలు ముడివడఁ దను యష్టిఁ దెమలఁ జేతి
కశయు మునికోల సడలి పగ్గములు నొగలఁ
గట్టి తలఁచిన యంత నగ్గలిక వచ్చి
నిలుచు చక్రము నంకించి యిలకు దాఁటి 154

మ. జిత శత్రుండగుభీష్ముచేఁ దెగుమహీంతక్రిద్రాజినీశ్రేణిచి పార్థ
గ్రత సారథ్యముమాత్రమాత్మకృతసంగ్రాముండునయ్యున్ మహో
ద్ధతభీతిందగ శౌరిస్యందనసముద్యన్మూల భాగైకసం
స్థితినే కాదు రథంబుమధ్యసరణింద్రిప్పెన్ రథాంగంబాగిన్.

క. దుర్జనుఁడైన సుయోధను
కర్జంబునకై కడంగు గాంగేయుని నే
నార్జవ మొప్పఁగఁ జంపియు
నర్జున! ధర్మజున కఖిలయగు నిలయిత్తున్. 156

వ. అని కడంగి భీష్మ భీష్మ చక్కన గుము మదీయ చక్ర ధారిధారా విదళిత మస్తకుండ వై తివింక నెందుఁ బో వచ్చు నను నెడ గురుకృపాశ్వత్థామ ప్రభృతులును నిఖిలరాజలోకంబునునుయోధనుండునుఁదదీయులును బ్రతివిధానంబును నిజశరీరంబులును మఱచి దృష్టి మాత్రా వశిష్టులై చేష్టలుడిగి పురాతన చిత్రంబులు బోలె వివర్ణులై మిన్నకున్నఁ దదనంతరంబ గిరి శృంగంబు సింగంబు దాఁటు తెఱంగునఁ బ్లవంగ కేతనుండు రథంబున నుండి యిల కుఱికి పాఱి చరమ భాగంబు దననిమద కరంబులఁగౌఁగిలించిపట్టి మహావాత వేగంబునఁ బోవు భూరుహంబు చాడ్పునఁ జనుచు దశపద పరిమాణ ధరణితలంబున నెట్టకేలకు నిలుచు నట్లు గ్రుంగిలంబడి యనునయించుచు నిట్లనియె. 157

ఆ.వె. మీరు ప్రాజ్ఞులిట్లు మేర దప్పిన పట్లఁ
నోర్వఁగలఁడె? కోప ముపశమింపు
నీదు పలుకు నిలుపు నాడెనఁ గరుణించి
కలని కీర్తి నాకుఁ గట్టిపెట్టు. 158

క. దామోదర! మీ యలుకకు
నేమియు నడ్డంబు గలదె? యీ కౌరవులన్
నే మదమడఁచెద నిప్పుడ
నేమముచే నీవు ప్రాపుఁ జేసిన కతనన్. 159

వ. అని యనేక భంగులఁ బ్రసన్నుం జేయు నప్పుడు
శ్రీకృష్ణుండు. 160

క. తీవరమును దిగులుడిగియుఁ
బావనుఁడగు శౌరి కిట్లు పలికెను భక్తిం
గేవల మిపుడు కృతార్థుఁడ
నై వెలసితి నీదు కోప మడరుట కతనన్. 161

వ. అని పల్కి ఫల్గునుండు మరియు నుద్దేశించి భవదీ
య సాహాయ్యంబునఁ గౌరవుల రూపు మాపెద, మదీయ ప
రాక్రమంబు పొల్లుసేయకు మింక నిటఁ గదలిపోయి తేని సా
త్యకిం జంపిన యట్టులని యొట్టువెట్టిన హరియును మఱందిసమ
య నిష్ఠకు సంతసించి రోషంబు డించి యతని తోడన నరదం
బెక్కి శంఖంబు పూరించె నప్పుడు. 162

గీ. పరఁగ భీష్మ ధనంజయ ప్రార్థనముల
తద్విధము దక్కి హరియు శాంతత వహించె

నంత దేవవ్రితుండుఁ బురాంతకుండుఁ
బోలెఁ బాండవ సేనలఁ బొదివెఁ జెలుచ. 163

క. కడిమిఁ దలఁపడిన భీష్ముని
బెడిదంబున కలిగి నరుఁడు పృథు శరములచే
నడవినిఁ జిచ్చేర్చు క్రియన్
సుడుములు సుడుములుగ మడపఁ జొచ్చెం బరఁగన్. 164

క. ఇంద్రాస్త్రము ముష్టిం గొని
యింద్రజుఁ డడరింప నది యనేక శరములై
సాంద్ర కరి తురగ రథ భట
తంద్రములుగఁ గురు నృపాల దళములఁ ద్రుంచెన్. 165

వ. మరియు నప్పరమ సాధనంబు. 166

సీ. కచ కలాపము నాచుగా మాంసమేదంబు
పంకంబుగాఁగఁ గబంధ తతులు
జలచరంబులుగాఁగ ఛత్రముల్ సారస
ములునుగాఁ జామరావళియు నంచ
పింఛుగా శంఖముల్ డిండీరములుగాఁగ
నురురథంబులు దొడ్డ యోడలుగను
గడు భూత బేతాళ గణములు ప్రజలుగా
నెఱిబారు రక్తముల్ నీరుగాఁగ

ఆ. వె. నద్భుతంబు మీఱ నమ్మహాస్త్రముఁరణ
భూమి శోణ నదినిఁ బొలుపెసంగఁ

జేసె వేల్పు గములు జిత్తంబులనుసవ్య
సాచి విక్రమంబు సన్నుతింప. 167

క. తరణియు నంతటఁ గ్రుంకిన
నిరువాగును రణము మాని యేలంబులకుం
గర దీపికల వెలుంగున
నరిగెన్ హత శేష సేన లరుదేరంగన్. 168

క. ఆ రాత్రి నక్కడక్కడ
కౌరవ విభుఁ డఖిల రాజ గణముల్ రచ్చన్
సారెఁ దమ యోటమియు గాం
ధారేయుని దుర్నయములు దలఁచిరి వంతన్. 169

వ. తదనంతరంబ వేగిన నుభయ సైన్యంబులును
సన్నద్ధంబులై సాగర తరంగంబులం బోలెఁ జతురంగంబులు
ననికి వెడలి తలఁపడియె నప్పుడు. 170

క. అదరులు చదరఁగఁ గై దువు
లద నెఱిఁగి పరస్పరమ్ము నాకంపింపన్
గదనమున రాహుతులు రిపు
మదమడఁగఁగ వ్రేయుదురు సమగ్ర ప్రౌఢిన్. 171

గీ. పోరు నొకచోటఁ బిరిఁదికిఁ బోవు నొకట
బొడుచు నొకచోటఁ బురికొని పొదువు నొకటఁ
దెరలు నొకచోట వెండియుఁ దిరుగు నొకటఁ
బలు తెఱంగుల బెనఁగె నాబలము లిట్లు. 172

క. ద్రోణ ప్రముఖులు సమరధు
రీణులు వడి నేస్వ రని కిరీటి సుతునిఁ బ
ల్బాణంబులఁ గప్పిన వి
న్నాణంబునఁ బెనఁగె నతఁడు నానా గతులన్. 173

క. తమ వారికి బాసటయై
సమరమునకు సామ దత్తి శల్య సుతాదుల్
గమిచిన నభిమన్యుఁడు నగ
వమరఁగ నయ్యోధవరుల నందఱ నోర్చెన్. 174

ఉ. ఒక్కకుమారునిట్లు బహుయోధులు ముట్టినఁ జూచి క్రీడిపే
రుక్కుననంటనార్చుచు మహోగ్రతవారలమార్గ్గనంగఁ బెం
పెక్కిన ఫల్గునుంగడచి యేచిరయంబునఁబార్థతుండు దా
గ్రక్కున శల్యముఖ్య రథిక ప్రతతిన్ విశిఖాళిఁ గప్పినన్.

క. మద్రపతి తనయుఁ డపుడు స
ముద్రేకము మీఱ నతని యురము దెగల్చన్
రౌద్రాకృతి యొప్పారఁగ
నాద్రుపదాత్మజుఁడు శల్యు నాత్మజుఁ గడమిన్. 176

గీ. విల్లు దునియ సిడము విరుగ సూతుని తల
దుల్ల హరులు చావ భల్ల చయము
బఱుప నలిగి వాలు చిలుకయుఁ గొని శల్య
జాతుఁ డడరె హృదయ శల్యమట్ల. 170

వ. ఇట్లు కృపాణ ఖేటంబులు గొని మద్రపతి తన
యుండు ధృష్టద్యుమ్నుపైకి నుఱికి చొత్తెంచిన. 178

గీ. కాల సర్పము బోని యవ్వాలు మేఘ
మండలము బోని పలుక యుద్దండ గదను
మోది రెండవ వ్రేటున మేద మురుల
శిరముఁ బగులింప నాతఁడు ధరణిఁ గూలె. 179

క. తనయుని పాటున శల్యుఁడు
గనలుచుఁ బాంచాలుఁ దాఁకి గాసిలఁ జేయం
గనుఁగొని సౌభద్రుండా
యనఁదలఁపడి ద్రుపదజుని సహాయతఁ జేసెన్. 180

వ. అయ్యవసరంబున సుయోధనుండు పొంగు సము
ద్రంబును చెలియలికట్ట వోలెఁ బర వీర వాహినీ నికరంబును
వెలువరించి తనవారిం బురికొల్పుటయు దుర్ముఖ దుర్మర్షణప్ర
ముఖులు భీముం దలపడిన నతని విహారంబు నిజ నామంబు
నుం బోలి చెల్లుచుండ ధృష్టద్యుమ్నాది రథికులును గౌరవ
యోధుల మార్కొని పెనంగి రంత. 181

సీ. మగధుండు శుండాల మండలంబులు గాలి
చూలిపై నురువడిఁ జూపుటయును
నావృకోదరుఁడు మహాద్రులఁ బైకొను
కులిశ హస్తుండనఁ గొమరు మిగిలి
తనభుజాదండ గదాదండ రోచులు
దిక్కులు గ్రమ్మఁగాఁ ద్రిప్పి కొనుచు
నరదంబు డిగి యుబ్బి యార్చుచు నేనుఁగు
పిండున కేఁచి యఖండ బలము

గీ. మెఱయఁ గొమ్ములు నెమ్ములు మేను లవయ
నడచి యేనుఁగు పీనుఁగులైన మగధుఁ
జంపి నెత్తుటఁ దోఁగి ప్రజ్వలిత మూర్తి
యగుటఁ గౌరవ్యు లోదిగిరి దిగులు నెరయ. 182

మ. మగధాధీశునిఁజంపి సామజములన్ మర్దించి రౌద్రాకృతిన్
దెగువన్ సంగర ధారుణీస్థలిని కుంతీసూనుఁ డొప్పారఁగా
భగదత్తప్రముఖుల్ గడంగి రతనిన్ బాహాబలం బార్పఁగా
జగతీవల్లభు నాజ్ఞచేఁగరిఘటా సంరంభ దుర్వారులై. 183

క. భీమునిపై భగదత్తుఁడు
సామజముం గొలుప నపుడు సమకట్టిన సం
గ్రామమ్మునకు ఘటోత్కచుఁ
డామెయి నెడసొచ్చెఁ దా మహా గజ యుతుఁడై. 184

గీ. తగ ఘటోత్కచు నేనుఁగు దారసిలిన
విరిగి పఱచెను భగదత్తవిభుని గజము
నంత నచ్చట బయలైన నసురవరుఁడు
ధార్తరాష్ట్రునిఁ బొదువంగఁ దలఁపుఁ జేసె. 185

వ. ఇట్లు మేఘ మాలికాకారంబులగు నేనుంగు గము
లతోడన భగదత్తుండు సమీరకుమార కుమారకు రయంబునం
బఱచిన నంశుమాలియుఁ జరమ గిరి మాటుఁ గొనుటయుఁ
జిన్నవోయిన మొగంబులతోడఁ గౌరవ్యులు గాంగేయ సహి
తంబుగా శిబిరంబుఁ బ్రవేశించిరి. పాండవు లుత్సాహంబున
విడిదికిం బోయిరంత. 186

సీ. ఆరాత్రి సహికేతుఁ డాపగేయుని తోడ
నిట్లను ద్రోణుఁడు నీవు కృపుఁడు
లోనుగా ఘనమొనలో దండి మానును
లొండొరుచేఁ బోవ రోఁడఁగార
ణంబెద్ది? నావిని నదిసుతుఁ డిట్లనుఁ
బరమ ధర్మాత్ములు పాండుసుతులు
గావున గెలుపటఁ గల్గును నీవుదు
శ్శీలుండవగుటనుఁ జెందు నోఁడు
గీ. మున్ను కమలయోని సన్నుతిచే భువి
భరముఁ బాపఁబుట్టు పరమమునులు
నరుఁడు ననఁగ గ్రీడి నారాయణుఁడు హరి
వారిభక్తిఁ గొలువ వరలు శుభము. 187

గీ. కావున నీవిఁక నైనను
నావిభులను సంశ్రయింపు మందెదు శుభముల్
నావిని వినివినములుగా
భూవల్లభుఁడుండి లేక పోయెం బిదపన్. 188

వ. యథావిధి నారాత్రి గడపి ప్రభాత సమయంబున రెండు బలంబులు కట్టాయితంబై కలనం బొలిచి మకరవ్యూహంబుగాఁ గౌరవులును శ్యేనవ్యూహంబుగాఁ బాండవులును. తలపడి యొండొరులం గెలుచు తలఁపునఁ దుములంబుగా ఘోరంబగు పోరుసలుపు సవసరంబున సంవర్తసమయ రుద్రుం బుర్ణించు నశ్వత్థామ రోషారుణిత లోచనుండై. 189

క. నర నారాయణులను బహు
శర వితతుల గుఱివ్వ సవ్యసాచి యలుక నా
గురు సుతు మైమఱువఁ ని
ష్ఠుర శరములు మేనఁ జొనిపి స్రుక్కించె వెసన్. 190

క. భూరి శ్రవసుఁడు వృష్టి కు
మారులపైఁ దొడరి పెలుచ మార్గణ పంక్తుల్
సారెకుఁ బఱపుచు విండ్లను
సారథులను వారి నుఱక సమయం జేసెన్. 191

క. కొడుకులు బడుటకుఁ గోపం
బడరఁగ శైనేయుఁ డప్పు డక్కౌరవుపైఁ
బెడిదంపు టలుఁగు లేసిన
బొడి పొడి గావించె నతఁడు పోవక పెలుచన్. 192

లయగ్రాహి.

ఒండొరులు కోపములు మెండుకొన గుఱ్ఱములు
మొండెములు గాఁగ రథ మండలము లంతన్
బిండియయి సారథులు గండడఁగఁ గేతువులు
ఖండితము లయ్యె వెసఁ జండగతి విండ్లుం
దుండెములు గాఁగఁ గురు పాండవుల చిత్తములు
బెండు పడి భూరి భుజ దండముల కాంతిన్
మండిపడు ఖడ్గముల గండెసఁగ నందికొని
ఖండనము జేయఁ గడు దండితగి తాకన్. 193

గీ. కసిని శినివర భూరిశ్రవసులు గదిసి
కాల జిహ్వలఁ దగు కరవాల రోచు
లొలయ మార్కొన భీమ సుయోధనులును
బాయగా నిర్వైరనుగొని పోయిరనిని. 194

క. ఆదినమున సరిఁబోరిన
మోదంబునఁ జెలఁగె రెండు మూఁకలు మరి య
య్యాదిత్యుఁ డస్తమించిన
జే దివియలు వెలుఁగఁ జనిరి శిబిరంబులకున్. 195

వ. ఇట్లరిగి యిష్టవినోదంబుల నారాత్రిఁ గడపి యాఱ
వనాటి యుదయంబున నుభయ సైన్యంబులు వెడలియు
చితవ్యూహంబులు సమకట్టి తలపడియె నంత. 196

గీ. వెన్ను దన్ని పాండు విభు పెద్ద కొడుకురా
రాజు నూలుకొల్పఁ బ్రబల మొంది
భీమ భీష్మ ముఖముగా మొనల్ రెండును
బొదివి పెనఁగఁ జొచ్చెఁ బొల్లపోక 197

గీ. శంతనుని సుతుండు సాహాయ్య మొనరింపఁ
జాప గురుఁడు ధర్మజాతు సేన
బడలు పఱుప నపుడు వడముడియును గురు
సేనఁ గనుపు గొట్టఁ బూనెఁ జెలుచ. 198

వ. తత్సమయంబున దుశ్శాసన దుర్విషహ దుష్ప్రహ
జయత్సేన వికర్ణ సుదర్శన సువర్ణులు లోనగు ధార్తరాష్ట్రు

లోఁ గ్క మొగి వృకోదరుపైఁ జతురంగ బల పరివృతంబుగా నురవడించిన నతండు. 199

క. తనసూతు విశోకునిఁ గని
యనఘా! తేరిచట నిలుపు మరుగకు నెటు నే
చని యీపొదివిన శత్రుల
పని చక్కం జేసి వత్తు బాహుబలమునన్. 200

వ. అని చెప్పి గొదగొనిన తెఱంగునఁగదఁగొని రథం బు డిగ్గ నుఱికి. 201

సీ. కుంజర చయముల కొమ్ములు నెమ్ములు
నుగ్గునూచమ్ముగా గ్రుగ్గఁజఱచి
కంఖాణ సంహతి కాళ్ళు నొడళ్ళును
దరతరం బవయంగఁ దాచి తాచి
తేరుల బారు లేడ్తెఱ సూత కేతన
స్తోమంబు గూడఁ దుత్తుమురుఁజేసి
భట కోటి నుద్ధతిఁ బ్రక్కలు చెక్కలు
నజ్జు నజ్జై చావ నలఁగ మోది

గీ. హస్తికుల రాహుతులను సమగ్రరథిక
వరుల నెల్లను బిండిగా బారి సమరి
ఆత్మ నామంబు నన్వర్థమై చెలంగఁ
జేడ్పడియుఁ గీడ్పడియుఁ గురుసేన బెదరె. 202

క. కడుఁ గుంభజుఁ బార్షతుఁ డ
ప్పుడు బోరుచునుండి భీముఁ బొడఁ గానక తా

నడరున నతని విడిచి యా
వడముడి సిడమరసి యటకు వైళమ వచ్చెన్. 203

గీ. రిత్త రథము సూచి యుత్తలపడుచు వి
శోకు నడిగెఁ బవనసుతుఁడు జీవ
ములను గలఁడె యెచట మొలఁగెడినా విని
వాఁడు నతని పోవ్రువలనుఁజెప్పె. 204

క. ఏనుఁగు డెక్కలు గుఱ్ఱపు
పీనుఁగులుం దేరుగముల విశలాంగములన్
బూని శవవితతి మేదిని
గానంబడుచున్న జాడగాఁ బార్థతుఁడున్. 205

క. అదె భీముని మునుమని స
మ్మదమున నత్తెఱుఁవుబట్టి మారుతిఁ గలయం
బదిలంబుగఁ జని యాతనిఁ
గదిసి నయంబారఁ బ్రాగడె గారవమెసఁగన్. 206

గీ. అంతఁ జేరువ మడువున నంబుపాన
మాచరించియు దప్పియు నార ద్రుపద
సుతుని బాసట వడిముడి ప్రీతి బలములు
మారి మసఁగిన చందానఁ బారిసమరె. 207

శా. ఆలోద్రోణుఁడుసోమకేంద్రునిసముద్యత్రోషిపారించిము-
న్నాలంబున్ విడిచన్న దత్సుతునిపై నత్యుగ్ర విస్ఫూర్తిచేఁ
వోలిం గౌరవసేనలన్ నడిపి యుద్యోగించెఁ బోరాటకా
ళీలాస్త్రప్రతతుల్ చెలంగరిపులంబింఛంబుఁద్వాలించుచున్.

వ. ఇట్లు గురుని పాఁపునఁ గౌరవయోధులు గడంగు
టయు ధర్మజుండు ద్రుపదేయాభిమన్యు ధృష్టకేతులు లోనగు
యోధులఁ బంపుచేసిన సేనలఁ బురికొలిపిన నయ్యిరు వాగు
ల సంగ్రామంబు భీమంబయ్యె నాసమయంబున 209

గీ. అపుడు పాంచాలు పార్థున ననిల సుతుఁడు
తేరు తగ నెక్కి కౌరవ కుమారవరుఁడు
దాఁకుటయు భూరి నారాచ తతుల నతని
మూర్ఛ ముంచినఁ గలఁగె నమ్మోనలు బెలుచ. 210

క. కృపుఁడు రయంబునఁ జనియా
నృపునిం దన తేరు మీఁద నిడికొని తొలఁగెన్
విపులార్తిఁ గంపింపఁగ
నపుడార్చెను బెద్ద పొంగి యనిల సుతుండున్. 211

వ. అంతఁ గొంత వడికిఁ దెలిసి కురుపతి బలుమొగం
బున యోధవరులఁ బురికొల్పిన జయద్రథుండును చిత్రుండును
చిత్రాంశుండును చిత్రదర్శనుండును జారుచిత్రుండును లోనగు
ధార్తరాష్ట్రులు సౌభద్రుం బొదివిన నక్కుమారునకు బాస
టయై భీమసేనుండు నానా విహారంబుల నక్కౌరవ్యుల బడలు
పరచియు నొంచియుఁ ద్రుంచియుఁ దెరలియుఁ బోరిపుచ్చె
నంత. 212

క. మించి శతానీకుండును
బాంచాలుర ప్రోవుఁ గాంచి పటుభల్లములం

ద్రుంచెం గౌరవ బలములఁ
జంచ ద్గతి విల్లుమెరయ శౌర్య ఘనుండై. 213

గీ. అంత ప్రొద్దు పశ్చిమాంబుధిఁ జేరిన
నెల్లవారు పోర నుల్ల ముడిగి
నిజ నివాసములకు గజ వాజి రథ భట
సమితి దొలువఁ జనిరి చని తెఱఁగున 214

గీ. నాటి రాత్రి శాంతనవుఁ జేరి కౌరవ
భర్త యిట్లు పలికెఁ బ్రథితులైన
మన యనీకినీశు లని బోదు రరిసేన
గదిసి యబ్ధిఁ జొచ్చు నదులఁ బోలి. 215

వ. అదియునుంగాక. 216

సీ. మన మొనలో జొచ్చి ఘనుల రాకొమరులఁ
బెక్కండ్రఁ దెగటార్చె భీముఁడలుక
నంతటఁ బోక నీవరయుచునుండ న
న్నా భంగి భంగించె నలఘు శక్తి
దేవతలకు నైనఁ దేరిజూడఁగ రాఁడు
నిన్నును గలశయోనినిఁ దలంప
నట్టి మీ రిట్లు పొల్లగుటకు నామది
ననుతాపమయ్యెడి ననుడు నవ్వి

గీ. సురనదీ సూనుఁ డిట్లను ధరణి నాథ
యొడలు డాఁపక పోరెద నొడిగి చనక

నీవు దూరుచు నింతన నేలననుచు
నూరడిలఁ బల్కుటయును సుయోధనుండు. 217

వ. సమ్మదంబున నారాత్రి జరపి యంత మరునాఁ డుభయు బలంబులును బవరంబునకుఁ దీర్చి మండలవ్యూహంబును వజ్రవ్యూహంబును నమర్చికొని తాఁకిన పోరు ఘోరంబయ్యె నాసమయంబున. 218

క. గొనయము సారింపుచు ఫ
ల్గునుఁడట శాంతనవు మేనఁ గ్రూర శరములం
జొనిపినఁ ద్రిగర్తపతి శాం
తనవునిఁ దలకడచి నరునిఁ దాకె రయమునన్ 219

గీ. ఇంద్రసూనుఁ డప్పు డైంద్రాస్త్ర మడరింప
నమ్మహాస్త్ర మరుల నంగములనుఁ
దలలు నులుపుటయును దళములు భీష్ముని
మరుగు సొచ్చి నిలిచె వితిగి చనక. 220

క. వెఱచఱచిన మొనఁగైకొని
తరిమిన నదిసుతుని మత్స్య ధరణిపసుతుఁ డే
డ్తెర మార్కొన నాతని తల
పరియలుగా వైచె భూరి భల్లమున వడిన్ 221

వ. మరియుం జేకితానుండు కృపాచార్యుని విల్లుదునిమి సిడంబు ఖండించి సారథిం దెగటార్చి హయంబులఁ జంపి మైమఱువరవళ్ళు జేసి విరథునిఁ గావించిన నతండును నతని నట్లసే

సిన నయ్యిరువురు కరవాలంబులు గని డెక్కలు గల నాగం
బుల వడువునఁ బుడమికి లంఘించి కృపాణ లాఘవంబులు మె
రసి పరస్పర మహా నిపాతంబుల మూర్ఛిల్లి పడిన శకునియుఁ
గర్ణుండును దమరథంబులమీఁద వారినిడికొని తొలఁగఁ ది
విచికొని పోయిరంత. 222

క. సాత్యకి ధృష్టద్యుమ్నులు
నత్యూర్జిత విక్రమముల నలఘు శరాళిం
బ్రత్యర్థి సేన కుతికి దు
రత్యయులై బాగి సమరి రాహవకేళిన్. 223

క. గురుఁడును బాండవ బలములఁ
బరిపరి గతిఁ దలలు తాళఫలముల కరణిన్
ధరణిన్ డొల్లఁగ నానా
శరములు నిగుడించెఁ దనదు సైన్యములార్వన్. 224

వ. భీమార్జునప్రముఖ యోధులును జయద్రథాది కౌర
వయోధులఁ బెక్కండ్రఁ జక్కడచిరంత పొద్దుగ్రుంకుటయు
రెండుతెరంగుల వారును దీసి చని శిబిరంబుల సుఖ నిద్రలం
జెంది తెలతెల వేఁగిన సన్నద్ధులై కలనికి నడచి కమఠ శృం
గార వ్యూహంబులు పన్నుకొని శంఖ భేరీ రవంబులు దెసలు
దీటికొన దాఁకి రప్పుడు. 225

ఉ. దేవనదీకుమారుఁ డతి తీవ్ర గతిం దన సేన దాఁటి పెం
పై విలసిల్లుగర్వమున వారిపుసేనలఁ జొచ్చునంత న

ప్పావని యార్చిదర్పమునఁ బై కొనియాతని సూతుఁజంపినన్
వావిరిఁదేరుగొంచు హయవర్గము గౌరవ సేనఁజొచ్చినన్.

క. సుడివడిపోయిన భీష్మం
దడయక కని పవనసుతునిఁ దాఁకి సునాభుం
డడఁగెను వడి నారసమున
వడముడిఁచేఁ గురుబలంబు వడవడ వడకన్. 227

వ. ఇట్లు సునాభుండు వడినఁ దదీయసోదరు లాదిత్య కేతుండును, నపరాజితుండును, బహ్వాశియుఁ బిండీతకుండును లోనగు ధార్తరాష్ట్రు లార్వురు మారుతిని మార్కొని ముక్కాకరెట్టింప దట్టించిన నమ్మేటి మగం డందఱ నన్ని తూపుల రూపు మాపినం గని కురుపతి భీమసేనుం బొడువ ననేక యోధ వీరులఁ బంపువెట్టి గాంగేయు పాలికరిగి శోక విహ్వలుండగుచు నతని కిట్లనియె. 228

సీ. నీవు జూడఁ బాండు నృప నందనుండు నా
తమ్ములను వధింప దానలేమి
దలపఁ వెల్లఁ గౌరవులు కోరుబెట్టఁగా
గట్టినావొ వీరఁ కంకణంబు. 229

క నావిని నాతం డడలుచు
భూవల్లభ ! గురుఁడు నేను పూర్వమె జూదం
బావహిలు నాఁడ తెలిపిన
నీవు వినమి నింతఁ బుట్టె నేడడలేలా? 230

గీ. అయిన భీము ప్రతిన యట్టిద కా ౦గు
బవరమునను వాని పాలఁ బడినఁ
గురు కుమారులకును గో ల్తలఁ జేయఁగా
వశమె చూడ నెట్టి వారికైన. 231

క. అని పలికి యతఁడు పార్థుల
మొన గురు వసమునను తోడ ముట్టిన నపుడా
వనజాక్షుని తమ్ముఁడు మా
ర్కొని నిలిపెను ప్రదరతతులు గుప్పుచుఁ బెలుచన్. 232

వ. తత్సమయంబునఁ గిరీటి తనయుం డిలావంతుండు వాహం బెక్కి పురుగు పసుపు డగరు డేగ చందంబున గురు విభుల మొగ్గరంబు ముట్టిన శకుని తమ్ము లార్వురు తురగారూఢులై కడంగిన. 233

క. ధారాప్లుత గతులడరఁగ
వారువముం ద్రిప్పి దాట్లు వైచుచు వడిగా
వారి కుమారుల శస్త్రము
లారూఢిని నరుగుచున్న నలుకను వారున్. 234

క. మేటి శరతతుల నాతని
ఘోటకముం గూల్ప వాఁడు గుంభినికి వెసన్
దాటి కరవాల నిపుణతఁ
బాటిగ దచ్ఛస్త్రనిహతి వడిబొరిగొనుచోన్. 235

ఆ. వె. వార లపుడు దుర్విచారంబు తోడుతఁ
బావ చారి పీనిపైఁ గడంగి